# అజ్ఞాత వీరుడు

## (Rook – Herald of Spring)



రచన:

మిస్తిస్లావస్కి

నవోదయ పబ్లిషర్సు
విజయవాడ-2.

# అజ్ఞాత వీరుడు

అనువాదం :

శ్రీనివాస చక్రవర్తి

పాటలు :

రాంబట్ల కృష్ణమూర్తి



# ఆ రాత్రి

ఆ రాత్రి సరిహద్దు ప్రాంతంలో మంచుతుపాను చెలరేగింది. కత్తుల్లాంటి మంచుపెళ్లలు చెళ్ళుచెళ్ళున వారి మొహాలకు దారుణంగా కొట్టుకున్నాయి. కాని గత్యంతరంలేదు. తలదాచుకోడానికి చోటులేదు. శీతలం ఎముకలు కొరికేటంత బాధాకరంగా ఉంది.

చెట్లతోపులోని ఇరుకుబాట బహుచక్కగా ఉంది. నల్లటి చీకటిలో మంచు ఊదాగా కనిపించింది. అతి జాగ్రతగా కాలి జాడలను బట్టి నడుస్తూంటే వారి పాదాలకింద మంచు గరగరలాడింది. దుప్పికొమ్ముల వంటి కొమ్మలమీద మెత్తని మంచుపెళ్ళలు కదలకుండా పడిఉన్నాయి. ఎక్కడోదూరాన చిటారుకొమ్మలనుంచి హోరుగాలి వీచింది.

కాని హోరు బయటికి రాగానే తుపాను భూమినీ ఆకాశాన్నీ ముంచెత్తివేస్తూ వారిమీద తన ప్రతాపం చూపెట్టింది.

మార్గదర్శి ఆగి మొహం, గడ్డం కనిపించేటట్టు వెనకకు తిరిగాడు. వెడల్పాటి పటకాతో కట్టిన రెండు సూటుకేసులు— ఒకటి వీపుమీదా, ఒకటి ఎదురు రొమ్ముమీదా పడేటట్టు — బుజాన వేసుకున్నాడు. ఆ రెండు సూటుకేసులు రెండు బ్రహ్మాండమయిన మూపురాలలాగా ఉన్నాయి. ముతక గొర్రెతోలు కోటు, మంచుకప్పిన ఎత్తుటోపీ ధరించిన ఆ మార్గదర్శి కట్టుకథలలోని బ్రహ్మరాక్షసిలాగా ఉన్నాడు.

పిలిచాడు కాని అతని మాటలు వినిపించలేదు. గాలి హోరు మని వీచింది. గొంతు చించుకొని, ప్రతిమాటా విడమర్చి స్పష్టంగా అనవలసి వచ్చింది. అందుచేతనే అతని మాటలు తునియలు తుని యలుగా వినిపించాయి.

"సరిహద్దులోకి వచ్చాం. సిపాయిలు-జర్మన్ - రష్యన్ - మీరు-నేనేం చేస్తే-యిలా-నేను వంగితే" ఆ మార్గదర్శి బుజాలు వంచి వీపుమీధ, సూటుకేసులమీద పేరుకున్న మంచును దులిపి వేసుకున్నాడు.

"మీరూ వంగండి - నేను పరిగెత్తితే-మీరూ పరిగెత్తండి-నేను పడుకుంటే - మీరూ పడుకోండి. తెలిసిందా ? యేమయినా సరే నను కనిపెట్టి చూడండి."

ఇలా బిగ్గరగా అరుస్తూ ఆ మార్గదర్శి వళ్లు విదిలించుకు న్నాడు. ఇక అతనిని అనుసరిస్తున్న మనిషి మడతహాటు పెట్టుకు న్నాడు. రష్యాలోని విపరీతపు చలికి పనికిరాని సన్నని ఓవరుకోటు వేసుకున్నాడు. మార్గదర్శి మాటలు వినిపించినట్టు తల వూపాడు గాని, అన్ని మాటలు వినిపించలేదు. అయినా మించుకుపోయిం దేంలేదు. మార్గదర్శి చెప్పినట్లు చేయాలి, లేకపోతే చావాలి.

చేయి మొహానికి అడ్డం పెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు. తలవంచి విన్నాడు. ఇద్దరూ కదలకుండా నిలబడ్డారు. మార్గదర్శి అతని చెవిలో ఏదో అరిచాడు. ఒక్కక్షణం కాస్త విశ్రాంతి తీసు కోవచ్చు.

కాని మార్గదర్శి గొంతు హఠాత్తుగా ఆగిపోయింది. అతను కళ్లు తెరిచి చూసాడు. కనుచూపు మేరలో ఎక్కడా మార్గదర్శి కనిపించలేదు.

ఒక అడుగు ముందుకు వేసాడు. తక్షణం మొలబంటి లోతు మంచులో కూరుకుపోయాడు. కాళ్ళకింద రోడ్డు కుంగిపోతున్నట్టు అనిపించింది. దోవ తప్పాడా ?

అవును. దోవతప్పాడు. అంతకుముందు గాలివచ్చి అతని మొహానికి తాకేది. ఇపుడు ఎడమచెవిలో హోరుమంటోంది. దీని అర్థం ఏమిటి? దోవతప్పడమే. లేకపోతే గాలివాటం మారిందా?

ఇక ఒక నిమిషంకూడా అక్కడ నిలబడడానికి వీలులేదు. క్షణక్షణానికీ మార్గదర్శి దూరమయిపోతున్నాడు. యాదృచ్ఛికంగా కుడివైపుకు మళ్ళాడు. ఆ వైపున మంచు బాగా దట్టంగా పట్టింది. మళ్లీ వెనక్కి తిరిగాడు. గట్టినేల తగులుతుందేమోనని కాలితో తడిమిచూసాడు. దిక్కులు తెలియడం లేదు.

'ఒహో' అని పెద్దగా కేకపెట్టాడు. ఆ కేక పెట్టడంలో పడ్డ శ్రమకి కళ్ళల్లోనుంచి నెత్తురుబొట్లు రాలతాయా అనిపించింది. నిజంగా పెద్దకేక పెట్టాననే అతను విశ్వసించాడు. కాని అతని మాటలు అతనికే వినిపించలేదు.

అమూల్యమయిన ఘడియలు గడిచిపోయాయి. మొహం మొద్దుబారిపోయింది. మంచు గుచ్చుకుంటున్నా తెలియడం లేదు. గట్టిగా ముందుకు తోసుకుపోతూ గాలితో పెనుగులాడాడు. ఎలాగయితేనేం గాలి వాలుకు చేరుకుని అతి ప్రయాసతో నడిచాడు. గాలి పూర్వంలాగానే అతని మొహానికి వచ్చి తాకింది. మంచు తుపాను వారిని దూరానికి తరిమికొట్టింది. ఇక అతను తన అడుగు జాడలనే అనుసరిస్తూ అక్కడే ప్రదక్షిణం చేయకుండా జాగ్రతపడడం చాలా అవసరం.

తనను తనవశంలో పెట్టుకుని, ఏది ఆలోచించాలో సరిగ్గా అదే ఆలోచించేందుకు సహాయకారిగా ఒకొక్క అడుగే లెక్క పెట్టుకుంటూ నడిచాడు. 'ఈ మంచుతుపానులో పడి ఈఘటాన్ని సరిహద్దు దాటించాలి. సరిహద్దు ఈ దరిదాపుల్లో వుండితీరుతుంది. ఏ క్షణంలోనయినా చారలచారల స్తంభం, దానికి అడ్డంగాకట్టిన నల్లటి మొద్దుముక్కు రాబందు పతాకమో, రెండుతలల రష్యన్ పతాకమో కంటపడవచ్చు.' ఇవీ అతని ఆలోచనలు.

పదేసి అడుగులకొకమాటు ఆగి, ఊపిరి పీల్చుకునివిన్నాడు. నిశ్శబ్దంగా, త్వరత్వరగా మంచు ఒకవైపునుంచి చుట్టిముట్టి బుజాలదాకా ముంచివేస్తోంది. ఇక ఆలసించితే సజీవసమాధే!

హఠాత్తుగా అతిసమీపంలో నిలకడగా పచ్చటిదీపం కని పించింది. ఒక్కనిమిషం కూడా వృథాపోనీయకుండా మోకాళ్లతో మంచును తోసివేసుకుంటూ ఆ దీపంకేసి చొచ్చుకుపోయాడు.

దీపం మినుకుమినుకు మంటూ రెండు – నాలుగు – ఆరు – పది అడుగులు వెనక్కిపోయింది. నిలకడగా ఉన్నట్టు భ్రమ గొలి పిందేగాని నిజానికి అది వెనక్కి వెనక్కి వెళుతూనే ఉంది. అపుడు అతనికి అర్థమయింది. ఇంకా ఆత్మవిశ్వాసంతో వడివడిగా ముందుకు తోసుకుపోయాడు. ఒక గుంటలో కాలు వేసాడేమో, మళ్లీ ఇంకో మారు నడుంలోతు మంచులో దిగబడిపోయాడు. గుంటలోనుంచి కాళ్ళు ఊడపెరుక్కుని తడిమి చూడగా చదునయిన రోడ్డు తగి లింది. దోవపక్కనే చర్చి ఆకారం స్పష్టంగా పొడగట్టింది. చర్చి కిటికీఅద్దంవెనక కుందెలో దీపం మసకమసక లాడుతోంది.

ఆ చుట్టుపక్కల నిర్మానుష్యంగా ఉంది. మంచు తుపాను చెలరేగడం మానలేదు. అక్కడ ఆ నిర్జన ప్రదేశంలో చర్చి! ఇదంతా కలా?

అతను మందహాసం చేసి చర్చి దగ్గిరసా వెళ్లాడు. దీపంగాలి మరుగులో ఉంది. కిటికీదాకా మంచు పేరుకుంది. కిటికీలోనుంచి దేవతా విగ్రహం కనిపించింది. హోరు బయటకంటె రాతిగోడ కింద ప్రశాంతంగా ఉంది.

అతను కిటికీకి గట్టిగా ఆనుకుని గాలివాతనుంచి తప్పించు కున్నాడు. నెత్తిమీద వెడల్పాటి చూరు, ఇరుపక్కలా బొమ్మలు చెక్కిన స్తంభాలు – తల దాచుకోడానికి మహాపీలుగా ఉంది. మంచుతుపాను మందగించేదాకా అక్కడ ఆగిపోవచ్చు. సరిహద్దు ఎక్కడుందో సరిగా తెలియనపుడు అక్కడ ఆగినా ఏమీ మించుకు పోదు. మంచుతుపాను తగ్గిపోతున్న సూచనలు కనిపించాయి.

కాని అతను అట్టేసేపు నిరీక్షించనక్కరలేక పోయింది. ముందూ, వెనకా రెండు మూపురాలతో పెద్దవిగ్రహం పొడ గట్టింది. అతడే మార్గదర్శి కారల్.

ఇద్దరిలో ఒకరూ ఆశ్చర్యపోలేదు. బయట చీలిపోయే టప్పుడు మళ్లీ చర్చిదగ్గిర కలుసుకుందామని ముందరగా కూడ బలుక్కుని మరీ కలుసుకున్నారా అన్నంత సహజంగా ఒకరిని చూసి ఒకరు తల పంకించారు.

"కొంపకి తొందర్లోనే చేరుకుంటాంలే." అని కారల్ అతని చెవి దగ్గిరిగా నోరుపెట్టి చెప్పాడు.

అతను ఆశ్చర్యంతో కనుబొమలు ఎగరవేశాడు. "సరిహద్దు మాటేమిటి ?"

కారల్ చేయి వెనక్కి ఊపి చిరునవ్వు నవ్వుతూంటే మీసాలనుంచి జారిపడుతున్న మంచుకడ్డీల కిందనుంచి ఆవిరి బయలు దేరింది,

"దాటివచ్చాను. తెలియకుండానే సరిహద్దు దాటి వచ్చే శాను." అని కారల్ అనుచరుడు తనలోతాను తలపోశాడు.

కారల్ మలుపు తిరిగి చర్చి దగ్గిరికి వెళ్ళబోతూ రోడ్డు పక్కన లోతైన గొయ్యిలో అడుగు వేసాడు. గొయ్యినిండా మంచే. గాలి ఎడమ చెవిలోకి కొట్టింది. కాని ఈ తడవ మడత టోపీ పెట్టుకున్న ఆ మనిషికి ఆశ్చర్యం వేయలేదు. మంచు చిత్రంగా మడతటోపీనుంచి జారిపోయింది. రెండడుగుల ముందు మంచుతుపానులో కాళ్ళీడ్చుకుంటూ పోతున్న మార్గదర్శి వీపు కని పించింది. సరే, ఇంకేం పరవాలేదు. సరిహద్దు దాటారు,

... ... ... ...

... ... ... ...

"యిదిగో చూడు, వెదురుకోరడి."

కోరడిమీదుగా ఎక్కి అవతలతట్టుకి దిగారు. అవతలతట్టున కూరగాయలతోట, తోటలోనిఇరుకుబాటకు రెండువైపులా నాగలి

చాళ్ళు కనిపించాయి. బాటచివర కొయ్య ఇల్లు చీకటిలో అస్ప ష్టంగా గోచరించింది. గాలి హోరుతగ్గింది. మబ్బులు మాయ మయాయి. చంద్రోదయమయింది.

కారల్ ఆగి, "వెనకపడకు. యిక్కడి కుక్క మహాచెడ్డది." అని అతనిచెవిలో ఊదాడు.

ఇలా అన్నాడో లేదో దగ్గిరలోనే 'బౌ' మని కుక్క మొరిగింది.

"అదిగో, దానిపేరు మార్కో. నా వెన్నంటిరా."

అనుచరుడు నవ్వి, "సరే, మంచిది. ఒక నిమిషంలోనే మనం జోస్తులమయిపోతాం" అంటూ చప్పట్లుకొట్టాడు.

# 2

# రహస్యస్థలం

దొడ్డిలోనుంచి వారు ఆఇంట్లో ప్రవేశించారు. వారు వస్తా రని ముందుగా తెలిసినట్టు తలుపు కొట్టీకొట్టగానే తెరచుకుంది. గది శుభ్రంగా సొంపుగాఉంది. ఆఇంటి యజమానులు బాగా ఉన్నవాళ్ళని స్పష్టమవుతోంది. కిటికీలకు దళసరి ఉన్ని తెర లున్నాయి. పూలగోటు వేసిన గాజు మేడుకింది కొవ్వొత్తి దీపం నుంచి వెలుగు కిరణం ఒకటీ బయటికి పోవడంలేదు. పొయ్యి వెలుగుతోంది. సోపువిత్తుల వాసన కమ్మగా కొట్టింది. ఆ ఇంటి యజమానురాలు ముసలిది. జుట్టు నెరిసి ఊడిపోతోంది. ఆమె నల్లటి రుమాలు తలకు కట్టుకుంది. పొయ్యిదగ్గిర కూర్చుని తన పనిలో మునిగిపోయింది. గది వెచ్చగా హాయిగా ఉంది.

మొద్దుబారి పాలిపోయిన చెంపలు రుద్దుకొని మళ్ళీ రక్తం పారేటట్టుచేయడం ఇపుడు చాలా అవసరం.

కారల్ బయటికి వెళ్ళిపోయాడు. అతని అనుచరుడు మంచుతో నిండిన డేకిసా మీదికి వంగి రెండుచేతులతో చెంపలు రుద్దుకోసాగాడు. గృహస్తుని బుజంమీద తువాలు వేసుకుని అతని పక్కనే నిలబడ్డాడు. అతనుకూడా ముసలివాడే, పొడుగాటి మనిషి. తువాలామీద ఎర్రదారంతో కుట్టిన పెద్దపెద్దతోకల కోడిపుంజు బుట్టలు మెరుస్తున్నాయి.

"యీగాలికి బిగుసుకుపోయి చావడానికి అట్టేసేపు పట్టదు." అన్నాడు ఆ గృహస్తు దయాపూర్వకంగా తల ఆడిస్తూ. అతని గొంతు చివాట్లుపెడుతున్నట్టుంది. "యిలాంటి తుపాను నాజన్మలో చూడలేదు. క్షమించండి, యిక్కడి వాతావరణానికి తగినట్టుగా మీదుస్తులు లేవే! మీరు వేడిప్రదేశాలనించి వస్తున్నారా యేం?"

ఆ గృహస్తు రష్యను. నాగరీకుడిలా మాట్లాడాడు. అతిథి అతని ప్రశ్నకు జవాబు చెప్పకుండా, "యిక్కడ స్థిరపడిపోకముందు మీరు పట్నంలో నివసించారా ?" అని అడిగాడు.

"ఆఁ-పట్నంలో కూడా నివసించా. యిదిగో, తువాలా తీసుకోండి. చూసుకోండి, నిజంగా మీ మొహానికి మళ్లీ కాంతి వచ్చింది. స్వర్గంలో మీకుఅనుకూలదైవం వుండివుంటాడు. మీరుషి యెవరు? అడగవచ్చా ? మీ అసలు పేరేమిటి ?

"అసలు పేరా ?" డేకిసామీదికి వంగినవాడల్లా పైకి తలెత్తి చూసి మొహంనిండా మందహాసం చేసాడు. "పాంటలీమన్."

"వారు చాలా పవిత్రమయినవారు. మహర్షి! ధన్వంతరి! అందుకే మీకింతగా సహాయపడ్డారు. యిటువంటప్పుడు ముందుగా మంచుతో రుద్దుకోవడం మంచిదే. యిక యింత చమురుపట్టించి రుద్దారంటే తెల్లవారేసరికి మంచుతుపాను సంగతే మరిచేపోతారు"

"యీా రాత్రికి మాజోలికి యెవరూ రారుకదూ?"

"మీజోలికి? మరేం భయంలేదు. అన్ని యేర్పాట్లూ చేసాను. యెంత వెదికినా మిమ్మల్ని కనుక్కోలేరు."

"అలానా! అయినప్పటికీ అసలు వెదికే అవకాశం వుందంటారా?"

"ఉహుం- యెవరూ వెదికిచావరు." అని ఆవృద్ధు నవ్వుతూ కనుగీటాడు.

"యీా గ్రామంలో కొంతమంది కుళ్లుబోతు వెధవలున్నారులెండి. అలా వుండడంకూడా సహజమే. యిదివరకు నామీద అనేకసార్లు సాడీలు చెప్పారు. నేను పారిపోయి వచ్చినవాళ్ళని దాస్తున్నానంటారు. సరిహద్దు కాపలా పోలీసులు అపుడపుడువచ్చి తొంగిచూసి పోతూంటారు. కాని అన్ని యేర్పాట్లూ చేసే వుంచాను లెండి. మీారేం గొడవ పడక్కర్లేదు. పాంటెలీమన్ ... మీయింటి పేరేమిటి?"

"కాజ్మిచ్!" అతిథి తువాలా ఆ వృద్ధునికి అందిస్తూ, "మాకింత భోజనం పెట్టగలరా?" అని అడిగాడు.

"ఓ తప్పకుండా" అని ఆ గృహస్తు వెంటనే జవాబిచ్చాడు. వుడకపెట్టిన కోడిపిల్ల కావాలా, కోడిగుడ్డు అట్టుకావాలా? వేయించిన కప్పలా? మా ఆవిడ వక క్షణంలో తయారు చేసేస్తుంది. అయిదు కోడిగ్రుడ్లు సరేనా? వకట్రొకటీ యాభై కోపెక్కులు."

అతిథి మెల్లగా ఈలవేసాడు. అది మొదటి తరగతి భోజనశాలలో ధరగాని మారుమూల గ్రామంలో ధరగాదు. కాని ఈ ఇంట్లో, ఈ గృహస్తులో ఏదో ప్రత్యేకత ఉంది. సాహసిస్తే డబ్బు వదలకేంజేస్తుంది! ఇలాంటి కొత్తమనిషి రహదారి చీటిలేకుండా చట్టవిరుద్ధంగా సరిహద్దుదాటి అతని ఇంటిలోగనక ప్రవేశించి పట్టుపడితే చిక్కులలోనుంచి తప్పించుకోవడానికి అతనికి డబ్బు వదులుతుంది. తీసుకుని వెళ్ళి జైలులో పడవేస్తే లంచం ఇచ్చే

అవకాశంకూడా ఉండదు. అవును. సాహసిస్తే డబ్బు వదులుతుంది.

"సరే. అయిదు కోడిగుడ్లు, రొట్టె, పాలు - ఊహుఁ - పాలువద్దు. వేడివేడి టీ అయితే బావుంటుంది." అంటూ తల ఊపాడు అతిథి.

ఆ వృద్ధురాలు మొహంలో ప్రేమ ద్యోతకంచేస్తూ పొయ్యి వెనకకి తిరిగింది. గృహస్థు పళ్లు బైట పడేటట్లు నవ్వాడు. భగవంతుడి దయవల్ల మాంచి ఉదారుడయిన అతిథి తటస్థపడ్డాడు: మర్మం లేని ఇలాంటి మనిషి భాగ్యవంతునితో సమానమే!

"దయచేసి కూర్చోండి. నాభార్య అన్నీ సిద్ధం చేస్తుంది. కాని క్షమించండి, యిక్కడ డబ్బుముందే చెల్లించడం నియామకం. బసకు పది రూబుళ్ళు. అట్టుకు రెండువందల యాభై, రొట్టెకు..."

మాట పూర్తికాలేదు. ఎవరో కోపంతో తలుపులు తట్టేస్తున్నారు.

"కొత్తవాళ్లు!"

తలుపు బార్లా తీసుకొని మొహం చిట్లించుకుంటూ కారల్ చక్కావచ్చాడు. గుమ్మంలోనే ఉండి ఆ వృద్ధునితో మాట్లాడి బయటికి వెళ్ళి తలుపులు గట్టిగా మూసివేశాడు.

"సరిహద్దు కాపలా పోలీసులు!" అని ఆవృద్ధు మెల్లిగా అన్నాడు. కాని ఆ వృద్ధునిలో ఎక్కడా ఆందోళన కనిపించలేదు. ప్రశాంతంగా ఉండేటప్పటికి పట్టిస్తాడా అని అతిథికి సందేహం కలిగింది.

ఆ వృద్ధురాలు పొయ్యిదగ్గరికి బెంచి ఒకటి లాగింది.

"నా వెనకాలే యెక్కిరండి, పాంటెలీమన్ కుజ్మిచ్!" అన్నాడు గృహస్థు అతని మోచేయి పట్టుకుని.

ఆ గృహస్తు తన భారీ శరీరాన్ని పొయ్యిదగ్గరి అరుగు మీదకు చేర్చాడు. పాంటలీమన్ అతనిని అనుసరించాడు. ఆవృద్ధు పొయ్యివెనక గోడవారే వేళ్ళు బహు వడుపుగా పోనిచ్చాడు. చేతి ఒత్తిడికి గోడ పక్కకి జరిగింది. నేలమాళిగానికి దారితీసే నల్లటి సొరంగం బయటపడింది.

"లోపలికి వెళ్లండి. మరేం పరవాలేదు. కిందకి దిగండి."

సొరంగం లోపలికి వెళుతూ, "సూటుకేసులు యెక్కడ పెట్టారు? జాగ్రతగా దాయండి." అని హెచ్చరించాడు అతిథి.

"అవిగో, కిందవున్నాయి. అరె! తుపాకీల గలగల శబ్దం వినవస్తూంది. కారల్ అపుడే సరిహద్దు కాపలా పోలీసుల్ని లోపలకు తీసుకువచ్చేస్తున్నాడు. భగవంతుడా! నీదయ యెలావుందో! నీ ఆచూకీ వాళ్ళకెలాగో తెలిసివుంటుంది."

పాంటెలీమన్‌ని లోపలికి తోసి చప్పిడి గాకుండా గోడను యథాస్థానానికి లాగాడు ఆ గృహస్తు. కిందికి దూకేసరికి తలుపు తట్టిన చప్పుడయింది. సోదా చేయడానికి కాపలా పోలీసులు వచ్చేసారు.

చాలాసేపు నిశ్శబ్దంగా, బాధాకరంగా గడిచింది. పాంటెలీమన్ నెత్తిమీద ఏదో గరగర శబ్దం వినిపించింది. సన్నగా ఎవరో పిలిచారు. ఒకనిమిషం తరవాత తెల్లటి ఉన్నిబూట్లతో జాగ్రతగా లోవ తడుముకుంటూ ఆవృద్ధు మాళిగలోనికి దిగాడు.

"టీ యివ్వకుండా మిమ్మల్ని యిక్కడ వుంచేయవలసి వచ్చింది, క్షమించండి. యేంచెయ్యను? సిపాయిలు వూరువూరంతా గాలించారు. యీరాత్రి యెవరో రాజకీయ అల్లర్లు లేవదీయడంలో బాగా పేరుపొందిన ఘనుడు వకాయన సరిహద్దు దాటాడని వాళ్లకి తెలిసింది. వెదికి పట్టుకోవలసిందని ఆజ్ఞలు జారీఅయాయి. పట్టుకున్నవాడికి పెద్ద బహుమానంకూడా యిస్తారట!"

పొడుగాటి ఆ రష్యన్ కేసి ఆవృద్ధు చూసాడు. అతని బూడిద రంగు కళ్లు పాంటెలీమన్‌ని వెక్కిరిస్తున్నట్టున్నాయి. ద్రోహం తల పెడతాడేమోననే సందేహం. పాంటెలీమన్ మనసులో మళ్ళీ తళుక్కుమంది.

ఆవృద్ధు ఒకమూల ఆనించిఉన్న నిచ్చెనతీసి సొరంగానికి సూటిగా వేసాడు.

"ఇక భోంచెయ్యొచ్చు. కాని యీ రాత్రంతా మీరు మాళిగలోనే గడపాల్సి వుంటుంది. గాలిఆడదన్న మాటేగాని సురక్షితంగా వుంటుంది."

## 3

## రోడ్డు మీద

ఆ వృద్ధుని ఇంటినుంచి చీకటితోనే వారు బయలుదేరారు. ఈ తడవ దోవచూపడానికి డోరెన్ అనే అతను కూడావచ్చాడు. డోరెన్ కారల్ స్నేహితుడు. వచ్చినదోవే- కాయగూరల తోట, తరవాత పొలాలు, ఆ తరవాత అడివి. తాపీగా ప్రయాణం చేస్తున్నారు. కారల్ సూటుకేసులు తీసుకుని టాంగాలో ముందుగానే బయలుదేరి వెళ్ళాడు. రైలుస్టేషనులో టిక్కెట్లు కొనాలి. పోలీసు ఏజంట్లు సరిహద్దు రైలుస్టేషన్లలో, వాటి చుట్టుపక్కలా కాపలా కాస్తున్నారు. టిక్కెట్లు ఇచ్చే కిటికీ దగ్గిరికి కొత్తవాళ్లు వెళ్ళడం ప్రమాదమే. బహుజాగ్రతగా ప్రవర్తించాలి.

ఆ రష్యను ఆ గృహస్తుని గురించి ప్రశ్నించాడు. అతని వైఖరి, కళ్ళు, మాటల తీరూచూస్తే పోలీసులతో లాలూచీ అయినట్టు స్పష్టమవుతోందని చెప్పాడు.

డోరెన్ అతని అభిప్రాయంతో ఏకీభవిస్తూ, "అవును. నిజం. అందుకే కారల్ మిమ్మల్ని అక్కడికి తీసుకువెళ్ళాడు. కాకపోతే డబ్బు బాగా గుంజుతాడన్న మాటేగాని మరేం ప్రమాదం వుండదు. ఆ ముసిలాడు పోలీసులకి యింత ముట్టజెప్తుంటాడు. అందుకనే వాళ్ళు దొంగవర్తకుల జోలికిపోరు." అన్నాడు.

"మరి నేను దొంగవర్తకుడిని కానుగా? నేనెవరినో అతను వూహించాడు. సరిహద్దు కాపలా పోలీసులు నాకోసం గాలిస్తున్నారని స్పష్టంగా సూచించాడు. దొంగవర్తకుల్ని పట్టివ్వకపోవడం అర్థం చేసుకోవచ్చు. కాని రాజకీయ నేరస్తులని...?"

"పట్టివ్వడమే?" డోరెన్ నవ్వి తన చెవులను తాను నమ్మడం లేదా అన్నట్టు రష్యనుకి దగ్గరగా వంగాడు. "ఆ పనే గనక చేస్తే మా బారినించి తప్పించుకోగలడంటారా? యీ యేడు లోకాల్లో యెక్కడ దాక్కున్నా మా చేతుల్లో చావు తప్పదని వాడికి బాగా తెలుసు. అసలు ద్రోహం చెయ్యాల్సిన అవసరమేముంది? వాడికి కావలసిందల్లా డబ్బు!"

వారిద్దరూ అడవిబాట వెంటే వెళుతున్నారు. ఆ ప్రదేశమంతా నిర్జనంగా ఉంది. డోరెన్ కుడిచేతితో ఎండిన చెట్టుకొమ్మ ఒకదానిని పట్టుకున్నాడు. కొమ్మ విరిగి ఊడుకుంది.

"చాలా చాలా విషయాలు మిమ్మల్ని అడగాలని వుంది, కామ్రేడ్ వాసిలీ! మీకు యెక్కువగా చెప్పడానికి వీలులేకపోవచ్చు. అయినా వక్క ప్రశ్న! "యింకెంతకాలం యీ పాడు జీవితం గడపాలి?"

ఆ రష్యను కనుబొమలు ముడుచుకుని, "మనబలాలనన్నిటినీ కూడగట్టుకునేటంతవరకు. అంతేకాదు, మనం భూస్వాముల అధికారాన్ని, పెట్టుబడిదారుల అధికారాన్ని కూలతోసెయ్యాలి. లేకపోతే మన సంకెళ్ళు యింకా బిగుసుకుపోతాయి. యితర దేశాలలోకూడా అలాగే జరిగింది. యిక్కడ మనకికూడా అలా జరగ

కుండా జాగ్రత్త పడాలి. అందుచేత దెబ్బతీసేముందు మన బలా లన్నిటినీ కూడతీసుకోవాలి.”

డోరెన్ బిగ్గరగా నిట్టూర్చి గాలికి కిందబడ్డ చెట్లకేసి, పొడుగ్గా, కదలకుండా ఉన్న దేవదారు చెట్లకేసి చూసాడు.”

“యిక్కడ భూమిబుట్ట చివరకి ఆకాశంకూడా జమీందారు లదే. జర్మన్ జమీందారులు యెలాంటివాళ్ళో మీకు తెలుసుగా! వాళ్ళు ప్రజల్ని పశువుల్ని చూసినట్టు, పందులను చూసినట్టు, పెంటని చూసినట్టు చూస్తున్నారు. దాసుడు కాకపోయినా, వ్యవ సాయకూలీ కాకపోయినా రైతు జమీందారునో భూస్వామినో చూడడానికి వెళితే ఆయనగారి చెయ్యి ముట్టుకోవాల్సిందే, ఘోరం!” అని డోరెన్ చేతిలోని కొమ్మను మోకాళ్ళమీద ఆనించి రెండుగా విరిచి దూరంగా మంచులోనికి విసిరి పారవేశాడు. “ఊహుఁ యిక అట్టే కాలం భరించలేం. తిరగబడతాం! ఒక్క వ్యవసాయ కూలీలే వున్నారు రెండు లక్షలమంది ? మన దేశంలోని జమీందారుల్ని మంటగలపడానికి వీళ్ళు చాలు. మేం తిరగ బడతాం! ఆయుధాలు లేకపోతే కర్రలతో చావబాదేస్తాం.”

రష్యను సంతోషంతో నవ్వి, “మీబోటివాళ్ళ చేతుల్లో కర్రలు ఆయుధాలంతపనీ చేస్తాయి, నిజమే. కాని డోరెన్! కాస్త వోపిక పట్టాలి. యెందుకంటే వొంటరిగా రంగంలోనికి దిగితే మనల్ని నలిపిపారేస్తారు. ప్రజలబాధలు యింకా యెక్కువవు తాయి.”

“రష్యాలో యెక్కడో, చదివానో విన్నానో తిన్నగా జ్ఞాపకంలేదు; నూట అరవయి జాతులవాళ్ళున్నారు” అని గొణి గాడు డోరెన్ దగ్గరలో ఉన్న చెట్టుకొమ్మ ఇంకొకటి విరుస్తూ, “వీళ్ళంతా సిద్ధమయేదాకా వోపికపడితే...”

“అంతా అని నేననడంలేదే! దెబ్బతీయడానికి కావలసి నంతమంది సిద్ధమవాలన్నాను. అంతే. ప్రజల్ని సమీకరిస్తున్నాం. అదే యిపుడు మా కార్యక్రమం.”

"అవును నాకు తెలుసు." అన్నాడు డోరెన్ తొందర గానూ, బిగ్గరగానూ." మీ పార్టీ వారు అచ్చువేసిన కరపత్రాలు చదివాను. "అగ్నికణం జ్వాలను రగుల్చుతుంది." * అవును, నిజం. కాని వోపికపట్టడం చాలాకష్టం. పిడికిళ్లు బిగించి అందరూ సిద్ధంగా వున్నారు. అట్టేకాలం వోపిక పట్టక్కర్లేదని అవసర మయిన వాళ్ళతో చెప్పండి. ఆఖరిగడియ యుగంలాగా వుంటుంది."

# 4

# మాయమనిషి

డోరెన్ ఆ రష్యనును రైలుస్టేషను పక్కకి తీసుకువెళ్ళాడు. ఆ ప్రదేశమంతా నిర్జనంగా, అసహ్యంగా ఉంది. ఈ స్టేషను ప్రధాన రైలుమార్గంమీద లేదు; ఇక్కడ మెల్లగా ఈడ్చు కుంటూ పోయే రైళ్ళుమాత్రమే ఆగుతాయి. డోరెన్ విలిని యస్‌కు, కారల్ మాస్కోకు టిక్కెట్లు కొనేటట్టు ఏర్పాటు చేసు కున్నారు. పోలీసులకు రైలులో కామ్రేడ్ వాసిలీ ప్రయాణం చేస్తు న్నాడనే ఆచూకీ అందితే ఈ ఏర్పాటువల్ల ఎక్కడో అక్కడ రైలుమారే అవకాశం చిక్కుతుంది. మాస్కోకు టిక్కెట్టు దగ్గిర ఉంటే టిక్కెట్టు కొనడానికి స్టేషనులోకి వెళ్ళవలసిన అగత్యం ఉండదు. వాసిలీ రైలుకోసం స్టేషను పక్కన నిరీక్షిస్తూ నిలబడ్డాడు. రెండుసార్లు గంట మోగింది. గుప్పుగుప్పు మంటూ రైలు పది నిమిషాలు ముందేవచ్చి ఆగింది. మంచు బరువుకు అల్లల్లాడుతున్న కొయ్యప్లాటుఫారం మీదికి వాసిలీ ఎక్కాడు.

---

* 1900 వి. ఐ. లెనిన్ స్థాపించిన ప్రప్రథమ అఖిల రష్యా చట్టవిరుద్ధ మార్క్సిస్టు వార్తాపత్రిక 'ఇస్క్రా' ప్రధానాశయం.

కారల్ సూటుకేసులను దగ్గరలోఉన్న బోగీలో పెట్టాడు. వాసిలీ గబగబా బోగీ లోపలికి వెళ్ళాడు. ప్లాటుఫారంమీద పోలీసు ఒకడూ లేడు. రైల్వేపనివాళ్లు మాత్రం ఉన్నారు. డోరెన్ దృష్టి ఒక లావుపాటి పొట్టిమనిషిమీద పడింది. అతను ముతక కోటు వేసుకున్నాడు. విద్యామంత్రిత్వ శాఖాధికారులు పెట్టుకునే టోపీ లాంటి టోపీ పెట్టుకున్నాడు. అతని పాదాలు, నోరు బహు పెద్దవి. వాలుమీసం, ఉబ్బెత్తు ముక్కు. కాని వైఖరి అసాధారణంగా లేదు. అతనికళ్ళు ఎలుక కళ్ళలాగా బోగీబోగీనీ ఎలా పరీక్షగా చూస్తున్నాయో డోరెన్ కనిపెట్టాడు. కారల్ బోగీ మెట్లమీద నుంచి కిందికిదూకి, పెట్టెల బరువుకు నెప్పి పుట్టాయేమో బుజాలు తోముకుంటూ డోరెన్ దగ్గరికి వెళ్ళాడు.

"కుక్క పసిగట్టింది." అన్నాడు డోరెన్ ఆ అధికారివంక తల ఊపుతూ. కారల్ కూడా తల ఊపాడు.

ఆ అధికారి పోలీసు గూఢచారి. ఏమీ సందేహం లేదు. కామ్రేడ్ వాసిలీ బోగీదిగి వస్తాడేమోనని కనిపెట్టి చూసాడు. రాలేదు. మెల్లిగా బోగీ మెట్లదగ్గరికి చేరుకుని కడ్డీ పట్టుకున్నాడు.

"కామ్రేడ్ వాసిలీని హెచ్చరించాలి." అన్నాడు డోరెన్ రహస్యంగా. "దిగివచ్చేస్తేనే మంచిది. యీ వెధవ యిక్కడేమీ చెయ్యలేడుగాని రైల్లో..."

గంటకొట్టారు, గార్డు ఈలవేసాడు. కప్లింగు చప్పిడీ, బఫర్ల చప్పిడీ అయింది. ఆ పోలీసు ఏజంటు కడ్డీపుచ్చుకుని వేలాడుతున్నాడు. రైలు కదిలింది. బోగీలోకి వెళ్ళాలని అతనికి ఆదుర్దాగా ఉన్నట్టు లేదు. రైలు మెల్లిగా కదులుతూంటే ఎవరన్నా కిందకి దూకుతారేమోనని కనిపెట్టి చూసాడు. కాని ఎవరూ దూకలేదు. రైలు ఒక్కసారిగా ముందుకు కుదుపిచ్చి వడివడిగా సాగిపోయింది. బోగీల పొడవునా చల్లటి గాలి దూసుకుపోతోంది. పోలీసు గూఢచారి బుజాలతో బోగీతలుపు తోసి లోపలికి వెళ్ళాడు.

రైలు కదలి వెళ్ళిపోతూంటే కారల్, డోరెన్ చూస్తూ నిలబడ్డారు. ఆదేశాలను సరిగా నిర్వర్తించలేక పోయామేనని విచార పడ్డారు. వాసిలీని సురక్షితంగా రైలు ఎక్కించి రమ్మని ఆదేశం వచ్చింది. ఆయన చాలా ముఖ్యమయిన మనిషి. కూడా ఉన్న సూటుకేసులనిండా సాహిత్యం ఉంది. మోయలేని బరువు!

టిక్కెట్లు రెండూ కొనడం, రైలు ఎక్కించడం అంతా సవ్యంగానే జరిగిపోయింది. ఈ గూఢచారి ఎక్కడనించి దాపరిం చాడు! ఏమయినా వాసిలీని హెచ్చరించి ఉండవలసింది.

కాని కామ్రేడ్ వాసిలీ వాళ్ళ హెచ్చరికతో నిమిత్తం లేకుండానే గూఢచారిని ఎపుడో పసిగట్టేసాడు. రైలు ఎక్కక ముందే గూఢచారి స్టేషనులోనుంచి చల్లగా రావడం చూసాడు. వాసిలీ నడవలో నిరీక్షిస్తూ నిలుచుని గూఢచారి రైలు ఎక్కిన తరవాత కారల్ సూటుకేసులు పెట్టిన పెట్టెలోకి వెళ్ళాడు. బోగీ అంతటిలాగానే ఈ పెట్టెనిండా బడిపిల్లలు ఉన్నారు. వాసిలీ ఒక నిమిషం ఆలోచించాడు. ఎందుకు? అవును. నిన్న జనవరి ఆరవ తేదీ. ఉగాది శెలవుల ఆఖరిరోజు. అందుకనే ఇవాళ పిల్లలంతా పట్నం బయలుదేరారు.

రైలుస్టేషను దాటగానే మంచు గప్పిన జనపథం కనిపిం చింది. విద్యార్థులు కిటికీదగ్గర గుంపుగా చేరి చూస్తున్నారు. వాసిలీ ద్వారంలో అడుగు పెట్టగానే అందరూ అతనికేసి తిరిగి ఏక కంఠంతో, "ఖాళీలేదు" అని అరిచారు.

అయినా వాసిలీ లోపలికి చొచ్చుకుపోయాడు. ఆ తరవాత నడవలోనుంచి చాలామంది విద్యార్థులు వచ్చి పడ్డారు.

"ఖాళీలేదని చెప్పలా?" అంటూ ఒక విద్యార్థి వాసిలీ కోటుచెయ్యి పట్టుకుని లాగాలని ఉద్దేశించినట్టు చేయిచాచి అరి చాడు. ఆ విద్యార్థి మాంచి చురుకయినవాడు. రాగిజుట్టు;

"పరవాలేదు" అంటూ మంచిగా వాసిలీ తల పంకించాడు. కాలి బొటనవేళ్ళమీద నిలబడి సామాను అరలోని తన సూటు కేసులు లోపలకు నెట్టాడు. "సీటు ఆక్రమించుకోను."

ఈ మాటలకు విద్యార్థులలో ఆసక్తి రేకెత్తింది. "యెలా?" అన్నారు.

"యెలానా ? యిలా ?" అన్నాడు వాసిలీ నవ్వుతూ. "అది నా రహస్యం. కూర్చుంటూ..."

మురికిగా, గట్టిగా, నల్లగాడున్న సీటులో వాసిలీ కూర్చుని కాళ్ళు పారజాపాడు.

హటాత్తుగా – నేను ఒకమాట అంటాను. చప్పట్లు కొడతాను..." అని చప్పట్లు కొట్టాడు.

"...హఠాత్తుగా నేను మాయమయిపోతాను."

"నాకు తెలుసు, తెలుసు. నువ్వు గారడీవాడివి," అన్నాడు రాగిజుట్టు పిల్లవాడు సంతోషంతో. "యింకా నీకు మాయమంత్రాలు చాలా తెలిసివుంటాయి."

"అవును, తెలుసు. ఉదాహరణకి మీమీ మనసుల్లో యేంవుందో యిట్టే చెప్పయ్యగలను."

ఇలాఅని వాసిలీ, రాగిజుట్టు కుర్రవాడి వైపుకు వీపుపెట్టి నిలుచున్న ఒక బక్కపలచని పిల్లవాడిమీద దృష్టి నిగిడించాడు. ఆ కుర్రవాడిది మెత్తని జుట్టు.

"ఇపుడు నువు ఆలోచిస్తున్న విషయానికి సిగ్గుపడడం లేదా ? నిజం చెప్పాలంటే..."

ఆ కుర్రవాడి మొహం కందగడ్డ అయిపోయింది. నడవలో నుంచి ఇంకా కొంతమంది విద్యార్థులు పెట్టెలోకి చక్కావచ్చారు.

"యేమిటి ?" అని రాగిజుట్టు కుర్రవాడు ఆదుర్దాగా అడిగాడు.

"చెప్పద్దు బాబూ, చెప్పద్దు" అని మెత్తటిజుట్టు కుర్రవాడు బతిమాలుకున్నాడు. బతిమాలుకుంటున్నట్లు చేయి గుండెలమీద వేసుకున్నాడు. ఆ కుర్రవాడి పని కన్నీళ్ళపర్యంత మయింది. వాసిలీ చెప్పనులే అన్నట్లు తల ఊపాడు.

"నీకు చెప్పించుకోవాలని లేకపోతే చెప్పనే చెప్పను. యింకొకరి సంగతి చూద్దాం."

వాసిలీ చుట్టూ చూసాడు. కాని పిల్లవాళ్ళందరూ మొహాలు చాటేసుకుంటూ దూరంగా వెళ్ళారు. ఒక్క రాగిజుట్టు కుర్రవాడుమాత్రం కదలలేదు.

"ఓ–నువ్వు అద్భుతమయిన వాడివి" అన్నాడు మహోత్సాహంతో.

వాసిలీకి స్టేషనులో కనిపించిన ఆ లావుపాటి మనిషి, తేలికగా అడుగులు వేసుకుంటూ తెరుచుకుని ఉన్న తలుపు పక్కగా వెళ్ళాడు. రాగిజుట్టు కుర్రవాడు అతనిని కళ్ళతో అనుసరిస్తూ, "యెవరో వూహించగలవా ?" అన్నాడు.

"ఓ–అదేమంత కష్టం !" అని వాసిలీ బుజాలు ఎగరవేసాడు నిర్లక్ష్యంగా. గుమ్మంలో నుంచుని చూసాడు. ఆ లావుపాటి మనిషి పాయిఖానా గుమ్మంలో ఆగాడు.

"స్కూలు యినస్పెక్టరు !"

ఈ ముక్కలు వాసిలీ బిగ్గరగా అన్నాడు. ఆ కొత్తమనిషి బుజాలు కుదించుకోవడం కుర్రవాళ్ళ కంటపడింది.

"యినస్పెక్టరు" అని రాగిజుట్టు కుర్రవాడు రహస్యంగా చెప్పాడు పెట్టెవెనకకు వస్తూ. అతని కనుపాపలు పెద్దవి అయాయి. నల్లబడ్డాయి. దగ్గరలో వున్న పిల్లవాళ్ళకేసి చూసాడు. వారందరి మొహాలలోనూ అదేభయం, అదేకోపం వాసిలీకి గోచరించింది.

# 5
# ఇంకో విద్యార్థి

**వా**సిలీ తిరిగి తనసీటులో వచ్చి కూర్చున్నాడు. ఈ తడవ ఎవరూ 'ఖాళీలేదు' అని గొడవచేయలేదు.

"చూచారా?" అని రాగిజుట్టు కుర్రవాడు తనస్నేహితుల కేసి చూస్తూ అడిగాడు. "చూచారా, అతను నిజంగా వణికి పొయ్యాడు. అంటే వప్పుకున్నట్టే!"

"అవునవును" అని తక్కిన విద్యార్థులు అతని మాటలను రూఢిపరిచారు.

వాసిలీ తనలో తాను నవ్వుకున్నాడు. తానేమి చేస్తున్నదీ అతనికి తెలుసు. కాని అందులో తప్పేమిటో తెలియనివాడిలాగా కావాలని అమాయకపు చూపు పెట్టేడు.

"యేమిటా హడావిడంతా? ఆయన యినస్పెక్టరయితేనేం? 'వప్పుకున్నట్టే' అన్నావేమిటి? యినస్పెక్టరు కావడంకూడా ఒక నేరమా యేం?"

"అవునవును" అని రాగిజుట్టువిద్యార్థి అరిచాడు కోపంతో, చుట్టూవున్న విద్యార్థులుకూడా అతనిని బలపరిచారు.

"అవును, నేరమే. మీారెపుడూ స్కూల్లో చదివినట్టులేదు: లేకపోతే యిలా అడిగేవారు కాదు."

"యినస్పెక్టరు మాస్టరుకంటె కూడా కనాకష్టం!"

"హెడ్డుమాస్టరు కంటెకూడా కనాకష్టం. యెపుడోగాని హెడ్డుమాస్టరు గదివిడిచి బయటికిరాడు, యిక యినస్పెక్టరో ప్రతి విషయంలోనూ తల దూరుస్తుంటాడు."

"యెలాంటి హెడ్డుమాస్టరు అనేదానిమీద అంతా ఆధార పడి వుంది."అని గుండ్రటిమొహం, గులాబీరంగు చెక్కిళ్ళవిద్యార్థి ఒకడు అన్నాడు. "కాని హెడ్డుమాస్టరు శాశ్వతంగా..."

"యేయ్ కుర్రాళ్లు!" అంటూ రాగిజుట్టుకుర్రవాడు అంద రినీ నిశ్శబ్దంగా ఉండమని కోరాడు.

"మనం యేదోవకటి ఆలోచించాలి. యినస్పెక్టరు మన చేతుల్లో యెలాగో చిక్కాడా, యేదో వొకఆట ఆడించాలి. తప్పదు."

"ఒకటేమిటి రెండు" అన్నాడు వాసిలీ ముభావంగా. "ముందు మీరు, ఆతరువాత నేను. నేనపుడే ఒకఆట ఆలోచించి వుంచా."

"అయితే కానీండి" అని రాగిజుట్టు కుర్రవాడు అర్థించాడు. "మీఆట బలే పసందుగా వుంటుంది. అయితే అదిమీరే యెందుకు ఆడించాలి? ఆయన యినస్పెక్టరయితే మీదేంపోయింది. మీరె న్నడూ స్కూలుకు వెళ్ళిన పాపాన పోలేదుగా!"

"అదేమిటి? స్కూలుకు వెళ్ళక పోవడమేమిటి? వెళ్ళాను" "అంటూ వాసిలీ ఈలవేశాడు." బట్టీ పడుతుండగా మీరు చూడాల్సింది. బైబిలు, గ్రీకు, లాటిను, యింకా..."

"ద్వితీయా విభక్తి సూత్రాలు..." అనియెవరో వెనకనుంచి అందుకున్నారు.

"వాసిలీ వెంటనే,

ఆంటా, అపాడ్, యాడ్, యాడ్వర్సమ్,

సర్కం, సర్కా, సిట్రా, సిస్,

ఎర్గ, కాంట్రా, ఇంటర్, ఎక్స్ట్రా,

ఇన్‌ఫ్రా, ఇన్‌ట్రా, జక్‌స్టా, ఆబ్..."

అని చదివి నిట్టూర్చాడు. ఆ బడిపిల్లలు నోరుమెదపకుండా మెచ్చు కుంటూ వినసాగారు.

"పెనెస్, ఫోన్, పోస్ట్, పేటర్,

ప్రాప్, ప్రాప్టర్, పర్, సెకండమ్"

బోగీ రణగొణ ధ్వనిలో. ఆ పైమాటలు వినిపించలేదు. ఈ మనిషి వాళ్ల స్నేహితుడే. సందేహం లేదు! 'ఖాడొాచే' వ్యాకరణమంతా ఇతని గోటి చివరలో ఉంది!...

సరిగ్గా ఆ సమయానికి బోగీ చివరిగుమ్మం టపీమని చప్పుడయింది. అధికార స్వరంతో ఒకతను "టికెట్టు, టికెట్టు" అని అడిగాడు.

"టికెట్టు యినస్పెక్టరు!"

పిల్లలు జేబులలో చేతులు పెట్టారు. సామాన్యంగా ఎలాగో రైలుటికెట్లు పోతూనే ఉంటాయి. జేబుకి గనక చినుగు ఉంటే, ఇక చెప్పేదేమిటి, పోయితీరుతుంది. టికెట్టు ఇనస్పెక్టరు అధికారస్వరం పక్కపెట్టెలోనుంచి వినిపించింది.

"టికెట్ ప్లీజ్!"

వాసిలీ రాగిజుట్టు కుర్రవాడిని రహస్యంగా వేలుతో దగ్గిరికి రమ్మని సంజ్ఞ చేసాడు. ఆ కుర్రవాడు వాసిలీకి దగ్గరిగా వంగాడు. వాసిలీ అతని చెవిలో, "వినుడేగా! మన గుహకి యెడం పక్కన వున్న దోవంటే వెళితే, పాండుమొహం కుక్క వుండే గుహ చేరుకుంటావు. దానికంట పడకుండా దాని దగ్గరికి వెళ్లిరాగలవా?"

కొమాంచీ గనక యుద్ధమే ప్రకటిస్తే" అన్నాడు కుర్రవాడు త్వరత్వరగా, సగర్వంగా, "గండ్రగొడ్డలితో మాడు రెండు వక్కలవుతూంటే అపుడు ఆ వెధవకి కనిపిస్తాడు."

"అయితే వెళ్ళు" అని వాసిలీ తల ఊపాడు. "టికెట్టు యినస్పెక్టరు వాడిదగ్గరికి వెళ్ళినపుడు టికెట్టు యెక్కడికి కొన్నాడో కనిపెట్టి చూడు."

ఆ కుర్రవాడు మొహం పక్కకు తిప్పుకుని పెట్టెలోనుంచి వెళ్ళిపోయాడు. ఆ టికెట్టు ఇనస్పెక్టరు రైలుటోపీ పెట్టుకుని,

సన్నటి మురికి కోటు తొడుగుకుని ద్వారంలో నిలబడి టికెట్లు కత్తిరిస్తున్నాడు.

"విల్నియస్ ... విల్నియస్ ... విల్నియస్ "

... ... ... ...

... ... ... ...

టికెట్టు ఇనస్పెక్టరు బోగీలోనుంచి వెళ్ళిపోగానే, రాగిజుట్టు కుర్రవాడు తిరిగివచ్చాడు. మొహం పాలిపోయి ఉంది. గాబరా పడుతున్నాడు, చుట్టూఉన్న పిల్లలను దూరంగా వెళ్ళమని సైగ చేసి మెల్లిగా వాసిలీ చెవిలో, "వాడొకచోటుకంటూ వెళ్ళడం లేదు." అని చెప్పాడు.

"యేమిటి అంటున్నావ్ ?" అని వాసిలీ ఆశ్చర్యపోతూ అడిగాడు.

"రైలు"

"రైలయితే వెళుతుందిగాని వాడుమాత్రం యెక్కడికీవెళ్ళ డంలేదు. అంటే అది వెళ్ళడాంకినిది లెక్కకాదు." అన్నాడాకుర్ర వాడు బిగ్గరగా, తనమాటను వాసిలీ వెంటనే అర్థంచేసుకోలేదనే కోపంతో.

"టికెట్టు లేకుండానే బైలాయించాడు. టికెట్టు యినస్పెక్ట రికి పుస్తకం..."

వాసిలీ ఆ కుర్రవాడిని చేతితో వారించాడు.

"చిన్న పుస్తకం, యెర్రబైండూ అదీ – అందులో ఫొటో, ముద్ర..."

ఆ కుర్రవాడి నేత్రాలల్లో అపరిమితమయిన గౌరవభావం ద్యోతకమయింది.

"కళ్ళతో చూడకుండానే మీరు సరిగా వూహించారు."

వాసిలీ నవ్వి ఆ కుర్రవాడి భుజంమీద చేయి వేసాడు.

"యెక్కడికీ టికెట్టు కొనలేదన్నమాట! అవును. టికెట్టు లేకపోతే వెళుతున్నట్టు లెఖ్ఖకాదు. నీభావం వెంటనే అందుకోలేక పోయినందుకు విచార పడుతున్నాను. మనతో విల్నియస్ వస్తు న్నాడు. వాడి రహస్యంకూడా మీకు చెప్పబోతున్నా."

"మీరు... మీరుకూడా విల్నియస్ వెళుతున్నారా?"

"ఆఁ"

"సర్కసుకేనా?" అని ఒక పిల్లవాడు ముందుకు దారిచేసుకుని తోసుకువస్తూ కీచుగొంతుతో అడిగాడు. ఇందాక ద్వితీయా విభక్తి సూత్రాలన్న కుర్రవాడితడే.

"నోరుముయ్, తెలివితక్కువ దద్దమ్మా!" అని రాగిజుట్టు కుర్రవాడు కోపంతో మొహాం ముడుచుకున్నాడు.

వాసిలీవంక ఓరచూపు చూసాడు. ఎందుకో ఒకందుకు వాసిలీకి కోపం రాకమానదని అతని ఊహ. కాని వాసిలీకి కోపం వచ్చినట్టులేదు. ఆ కుర్రవాడి బుజంమీద చేతితో తట్టాడు.

"మీ యుద్ధసమితిని సమావేశ పర్చు. విల్నియస్ చేరుకోవడానికి ఆట్టేసేపు పట్టదు. అక్కడికి చేరుకునేలోగా యేదో ఒకటి ఆలోచించి వుంచాలి. యీ లోపున మీరు యినస్పెక్టర్లమీద యెలా యుద్ధం చెయ్యతలపెడతారో వింటూంటాను."

# 6

# యథార్థసాహసకృత్యం

''అలాఅయితే వినండి'' అంటూ ప్రారంభించాడు రాగి జుట్టు కుర్రవాడు ఆలోచనా పూర్వకంగా. ''మేము యినస్పెక్టరు మీద, హెడ్డుమాస్టరుమీద, మాస్టర్లమీద, ప్రతిరోజూ, ప్రతి క్షణమూ యుద్ధం చేస్తూనే వున్నాం. మీరు స్కూలుకు వెళ్లే వుంటే యిదంతా మీకు స్వయంగా తెలిసే వుండవలసింది, యే స్కూలులో నయినా యింతే.''

''యేమిటి ప్రయోజనం?'' అన్నాడు సొగసు జుత్తు గల ఇంకో కుర్రవాడు. ''యేం జేసినా యేమీ మార్పంటూ జరగదు.''

''మీరేం చేసారేం?'' అని వాసిలీ అడిగాడు.

''ఒకటేమిటి, అనేకం!'' అన్నారు పిల్లలు.

''మిమ్మల్ని గురించి, మీరుచదువుకునే రోజుల్లోని ముచ్చట్లు గురించి వినాలని వుంది.''

''నన్ను గురించా?'' అన్నాడు వాసిలీ ఒకనిమిషం ఆలోచనా పూర్వకంగా చూస్తూ. ''నాదేంవుంది?''

''ఎందుచేత?'' అని జవాబుకోసం నిరీక్షిస్తూ పిల్లలు అతనికేసి చూశారు.

''ఎందుచేత నంటే నేను మా మాస్టర్లతో వేరేవిధంగా పోరాడాను. సహజంగా మీరు యెదుర్కుంటున్న చిక్కులనే నేనూ యెదుర్కొన్నాను. కొన్ని మినహాయింపులు: కాని అట్టే

వుండవు.'' అంటూ వాసిలీ మందహాసం చేసాడు. "సరే, నేను దీర్ఘంగా ఆలోచించేవాడిని పరిస్థితులు యిలాయెందుకువున్నాయా అని.''

ఆ పిల్లలంతా వాసిలీ చుట్టూ చేరి దగ్గిర దగ్గిరగా నుంచు న్నారు.

"యెందుకు వున్నాయి?'' అని ఒకకుర్రవాడు వినిపించీ వినిపించని స్వరంలో అడిగాడు.

''యెందుచేతనంటే, మన జీవితాలే అలా తయారయాయి. రైతులు యెలా జీవిస్తున్నారో, భూస్వాములు, వర్తకులు వాళ్ళని యెలా బానిసల్ని చేసేస్తున్నారో యెపుడయినా చదివారా లేకపోతే విననన్నా విన్నారా? కార్మికులు మిల్లు యజమానులకోసం యెలా బండచాకిరీ చేస్తున్నారో మీకు తెలుసా? నేను నివసించిన వీధిలో తోళ్ళు శుభ్రంచేసే ఫ్యాక్టరీ వుండేది. నాచిన్నప్పుడు అనేకమంది కార్మికులు అకలితో మలమలమాడడం నేను యెరుగున్నా. వాళ్లకి యెపుడూ రోగాలే, చేతులనిండా పుండ్లే! యెందుకో తెలుసా? తేమలో, సున్నంలో రోజుకు పదహారుగంటలు పనిచేసేవారు. అటువంటి పనిచేసేవాళ్లు చేతులకి రబ్బరుతొడుగులు వేసుకోవాలి. కాని ఆఫ్యాక్టరీయజమాని వాళ్ళకి యెన్నడూ తొడుగులు కొని యిచ్చిన పాపానపోలేదు. వాటిఖరీదు యెక్కువ-జతమూడురూబుల్లు. ఆ యజమాని దృష్టిలో మనిషిప్రాణానికి ఆమాత్రం విలువకూడా లేదు.వాడిదేం పోయింది? యిక కార్మికులు-వాళ్ల సంపాదన రోజుకి ముప్ఫయి నలభయి కోపెక్కులకు మించదు. అందుచేత స్వయంగా చేతి తొడుగులు కొనుక్కోలేరు. పైగా ప్రతివాడికీ పెళ్ళాం పిల్లలూ వుంటారుగా!''

వాసిలీ ఒక నిమిషం ఆగాడు. పెట్టెఅంతా నిశ్శబ్దంగా ఉంది. చక్రాలుమాత్రం రణగొణ ధ్వని చేస్తున్నాయి.

"యీ పరిస్థితులు ఒకతోళ్ళ కార్మికులకే కాదు. అందరు కార్మికులకూనూ, నేను కొంతమంది కార్మికుల్ని చూసా. యిరవయి

యేళ్ళు వచ్చేసరికి వక్క పన్నూ లేకుండా వూడిపోయాయి. చర్మాన్నీ యెముకల్నీ తినేసి ఆవిరిలో పనిచేస్తే మరేమవుతుంది ? సీసపుపొడి మూలంగా వూపిరితిత్తులు విషమయం అయిపోయిన ప్రెస్సు కార్మికులని చూసా. దగ్గితే రక్తం పడేది. క్లుప్తంలో చెప్పాలంటే నేను చూసినవాటి ముందు మీకు స్కూళ్ళల్లో జరుగుతున్నది ఒక లెఖ్ఖా జమా ? కాని స్కూళ్ళల్లో, ఫ్యాక్టరీలలో, గ్రామాలలో జరుగుతున్న దానికంతకీ మూలకారణం ఒకేఒక దుర్మార్గం !''

''యేమిటా దుర్మార్గం ?'' అని అడిగాడు రాగిజుట్టు కుర్రవాడు బెల్టులోకి లోతుగా చేతులు పోనిచ్చుకుంటూ.

''అన్యాయం, అసమానత్వం. భాగ్యవంతులు ప్రపంచాన్ని పాలిస్తూ తక్కినవాళ్ళ చేత వూడిగం చేయించుకుంటున్నారు. భాగ్యవంతులకి అనుకూలించే విధంగా జీవితం తీర్చి దిద్దబడుతోంది. భాగ్యవంతుడు కాని ప్రతివాడి నెత్తిమీదా భాగ్యవంతుడికోసం పనిచేసే వాడెవడో ఒకడు వుంటూనే వుంటాడు ఫ్యాక్టరీలలో, గ్రామాలలో యెక్కడబడితే అక్కడ యిదే తంతు !''

''నిజం, నిజం'' అంటూ రాగిజుట్టు కుర్రవాడు బెల్టులో నుంచి చేతులు బయటికి తీసుకుని ఉద్రేకంతో ఊపసాగాడు. ''మా క్లాసులో ఒక కుర్రవాడు వుండేవాడు. వాడిపేరు మలఫయేవ్. వాళ్ళ నాన్నకి ఒక ఫ్యాక్టరీ వుండేది. యింకేం అందరికంటె యెక్కువ మార్కులు వాడివే ! యిపుడు సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో తండ్రిదగ్గిరే వుంటున్నాడు.''

''క్లాసులో పిల్లలందర్నీ శిక్షించినా వాడినిమాత్రం శిక్షించే వారుకాదు. 'మలఫయేవ్ యిటువంటి ఛండాలపు పని చెయ్యగలడనుకోను' అని మాస్టరు యెపుడూ అంటూండేవారు.''

''ఆగు !'' అని రాగిజుట్టు కుర్రవాడు అడ్డంవచ్చి ''మిమ్మల్ని ఒక విషయం అడగ దలిచాను. యిదంతా మీరు స్వయంగా చూసారా, లేకపోతే యెవరన్నా మీకు విప్పి చెప్పారా ?'' అని వాసిలీ ప్రశ్నించాడు.

"లేదు." వాసిలీ సున్నితంగా నవ్వి, "నేను స్వయంగా అయితే చూడలేదుగాని ఒక పుస్తకంలో చదివాను. చెర్నిషెవస్కీ * రచించిన 'ఏం చేయాలి?' అనేది. నిజాయితీగా బతకడం యెలాగో అందులో వ్రాసివుంది." అన్నాడు.

"యేంచేయాలి?" రాగిజుట్టు కుర్రవాడు అందుకున్నాడు. అక్కడ గుమిగూడిన పిల్లలంతా ఒకరితో ఒకరు మెల్లిగా అన్నారు:

## ఏం చేయాలి?

"సరే ఆ పుస్తకం నేనూ, నా ప్రాణస్నేహితు డొకడూ కలిసి చదివాం. ఆ తరవాత యింకా చాలా పుస్తకాలు చదివాం గాని అన్నిటిలోకీ చెర్నిషెవస్కీదే వుత్తమం అనిపించింది. ఆపుస్తకంలో యెలా నిజాయితీగా జీవించాలని వ్రాసివుందో అలానే జీవితం గడపాలని మేమిద్దరం నిశ్చయించుకున్నాం. అపుడు మేం చదువుతున్నది యేడోఘారం..."

"మీరేంజేసారు?" అని రాగిజుట్టు కుర్రవాడు అరిచాడు. ఉద్రేకం పెరిగిపోతోంది.

వాసిలీ వెంటనే జవాబు చెప్పలేదు. "మేం... స్కూలుకు వెళ్ళడం మానుకున్నాం."

పిల్లలు వణికిపోయారు.

"మానెయ్యాలనే మానేసారా?"

రాగిజుట్టు కుర్రవాడి పెదవులు వణకడం మొదలుపెట్టాయి. "చదువుకోకపోతే యెట్లా?" అని నెమ్మదిగా అడిగాడు.

---

* నికోలాయ్ చెర్నిషెవస్కీ; గొప్ప రష్యన్ రివల్యూషనరీ డెమాక్రాట్, భౌతిక తత్త్వవేత్త, విమర్శకుడు, రచయిత.

"అవును, చదువుకోకపోతే యెట్లా ? కాని అప్పటినుంచీ నేను స్వయంగానే చదువుకున్నాను. స్కూల్లో చెప్పేదంతా వట్టి చెత్త ! మీకు తెలుసుగా !"

"స్కూలుచదువు పూర్తి కాకపోతే యూనివర్సిటీలో చేర్చుకోరుగా !" పిల్లలందరూ తలలు ఊపారు:

"కాని స్కూలుకు వెళ్ళడం మానేయమని మీకు నేనేం సలహా యివ్వడంలేదు." అంటూ వాసిలీ మందహాసం చేసాడు. "నా విషయం మాత్రమే చెబుతున్నాను. నేనూ నా స్నేహితుడూ ప్రజాసేవ చెయ్యాలని నిశ్చయించుకున్నాం."

"చదువు మానేయడం మంచిదికాదు." అని గోణిగాడు సొగసుజుట్టు కుర్రవాడు. "సరే, స్కూలు మానేసారు. బాగానే వుంది. మరి యిపుడేంచేస్తున్నట్లు ? గారడియా ?"

"అవును. గారడీచేస్తున్నా" అని అంగీకరించాడు వాసిలీ. కాని ఒకరూ మందహాసం చేయలేదు.

"విల్నియస్" అని కేక బిగ్గరగా వినిపించింది. బడిపిల్లలంతా బెదిరిపోయిన పిచ్చుకల్లాగా చెల్లాచెదరయినారు. సామాను సర్దుకోవాలిగా.

"బోలెడంత వ్యవధివుంది" అని రాగిజుట్టు కుర్రవాడు అరిచాడు." కాకపోయినా సిగ్నలుకోసం ఆగిపోవలసి వస్తుంది."

మామూలుగా ప్రయాణం ఆఖరుకాబోయే ముందుండే గడబిడతో బోగీఅంతా కళకళలాడుతోంది. విద్యార్థులు కోట్లు తొడుక్కున్నారు. చేతితొడుగులు వేసుకున్నారు. పరుపులు, తలగడాలు చుట్టచుట్టి బిచాణాకట్టారు. పక్కపెట్టెలో ఆదుర్దాగా పదోతడవ సామాను లెక్కబెడుతూ ఉక్కిరిబిక్కిరవుతున్న ఒక ముసలమ్మ గొంతు వినిపించింది.

"...తొమ్మిది...పది...పదకొండు...పన్నెండోది యేదీ ? యేదీ? వకటి కనిపించడంలేదు. ఆరిదేవుడా, యేమయిపోయిందో?"

"తప్పకుండా పొరబడివుంటావు. యింతమంది చూస్తూం డగా యెలా మాయ మవుతుంది? యింకా యెవరూ దిగిపోలేదు." అని ఒక మగగొంతు జవాబుగా పలికింది.

ఆమె నిట్టూర్చి తిరిగి లెక్కపెట్టడం ప్రారంభించింది. "...తొమ్మిది...పది"

వాసిలీ సూటుకేసులు కిందకిదించాడు. పిల్లలు అతనిని కని పెట్టి చూస్తున్నారు. ఆ కొత్త సూటుకేసులు కంటపడేసరికి వాసిలీ ఒక ఆట ఆడిస్తాననడం సొగసు జుట్టు కుర్రవాడికి జ్ఞాపకం వచ్చి ఉంటుంది.

సూటుకేసులలో ఒకదానిని వేలితో తోసాడు. కదలలేదు. ఇంకా గట్టిగా తోసాడు. ఊహుఁ- ఈతడవా కదలలేదు. అయితే ఆ పొడుగాటి మనిషి వాటిని తేలిగ్గా దించేసాడు! అంతబలం వున్నవాడిలా కన్పించడంలేదే! పట్టుకోవడంలో యేదో వడుపు అతనికి తెలుసునేమో? అలాఅయితే...

"మీరు ఒక ఆట ఆడిస్తామన్నారు..." అన్నాడు ఆ కుర్ర వాడు. పూర్తికాని ఆలోచనలు మాట్లాడే ధైర్యాన్ని కలి గించాయి.

"ఒక నిమిషం ఆగండిమరి" అంటూ తల పంకించి వాసిలీ సూటుకేసులు పైకెత్తాడు.

"ఓహో! ఆట ఆడించబోతున్నారు చూడండి." అని సొగసుజుట్టు కుర్రవాడు కేకపెట్టాడు.

పిల్లలు గుంపుగా బోగీలోనుంచి దిగి వాసిలీ వెంట బడ్డారు. ఇనస్పెక్టరు తలమీది టోపీ సవరించుకుని భారంగా అడు గులు వేసుకుంటూ వారికి రెండడుగులు ముందు నడుస్తున్నాడు. ప్లాటుఫారంమీద నాలుగడుగులువేసి ఆగి వాసిలీని, విద్యార్థులను ముందుకు సాగిపోనిచ్చి వారివెనకనే నడవ సాగాడు.

"స్టేషనుబయటికి వెళ్ళేదారి యెడంచేతివేపున వుంది." అన్నాడు రాగిజుట్టు కుర్రవాడు.

కాని వాసిలీ రైలు వెంబడే నడవసాగాడు. పిల్లలు గుంపులు గుంపులుగా అతని వెంటబడ్డారు. ఇనస్పెక్టరుకూడా తాపీగా వారి వెనకాలే నడిచివెళ్ళాడు.

వాసిలీ నలువైపులాచూసాడు.

"యినస్పెక్టర్ని ఒక ఆట ఆడించాలని చూస్తున్నారా ?" అని రాగిజుట్టుకుర్రవాడు మెల్లిగా అడిగాడు.

"అవును" అని సంతోషంతో జవాబిచ్చాడు వాసిలీ. "మనమంతా కలిసి వాడిని ఆశ్చర్యంలో ముంచెత్తబోతున్నాం. మీరంతా అతనికేసి తేరిపారజూడండి."

కుర్రవాళ్ళు వెనకకుతిరిగారు. ధైర్యంగా పదిహేనుజతల కళ్ళు మీద వాలేటప్పటికి కంగారుపడి, ఇనస్పెక్టరు దృష్టి వారి నుంచి మరల్చి నిలబడిపోయాడు.

నిలబడిపోయాడు ! అంతకుమించి మరేం జరగలేదు. నిమిషం క్రితం పరిస్థితి ఎలాఉందో ఇపుడూ అలానేఉంది. కూలీలు సామాను ఎత్తుకొని అటూఇటూ తొందర తొందరగా పరుగెత్తుతున్నారు. రైలు దిగిన వారిని, వారికోసం వచ్చినవారు ముద్దిడుకుంటున్నారు. ఒక జేబుదొంగను చెవులు పట్టుకొని పోలీసులు స్టేషనుకు ఈడ్చుకు పోతున్నారు. ఎర్రఅంచు ఓవరుకోటు వేసుకున్న ఒక కుంటి సేనానికి సైనికులు సైనిక వందనం సమర్పిస్తున్నారు.

మరేమీ జరగలేదు ! అంతా యథాప్రకారంగానే ఉంది. ఇనస్పెక్టరుకు గాని తదితరులకుగాని మరేమీ జరగలేదు !

రాగిజుట్టు కుర్రవాడు కోపంతో వెనకకు తిరిగిచూసి ఆశ్చర్యంతో నేలకు అంటుకుపోయాడు. సూటుకేసులతోటి ఆ పొడుగాటి ప్రయాణికుడు మాయమయి చక్కాబోయాడు.

"యెక్కడికి ?"

ఆ కుర్రవాళ్ళంతా గబగబా వెదికారు. జాడ ఏమాత్రం తెలియలేదు. మనిషి ఎక్కడా కనిపించలేదు. ప్లాటుఫారం చాలా పొడుగు. దానివెంట నడుస్తున్నా పరుగెత్తుతున్నా తేలికగా గుర్తు పట్టవచ్చు. ఆ సూటుకేసులు పట్టుకొని రైలుకింద దాక్కోవడం దొంగలకు మాత్రమే చేత నవుతుంది. తిరిగీ రైలుఎక్కి ఉండడు. ఇంతకీ వ్యవధి ఏదీ? ఒకటి రెండు సెకండులు అయిందేమో. మహా అయితే ఒక నిమిషం అయిఉంటుంది. కనిపించకుండాపోయి బోగీ మెట్లమీద ప్రయాణీకులు గుంపులుగా చేరారు. దిగేవారు దిగుతున్నారు, ఎక్కేవారు ఎక్కుతున్నారు. అంతేకాదు, అతని దగ్గిర టికెట్టు లేదు. టికెట్టు టికెట్టు కలెక్టరికి ఇస్తూండగా అంతా చూసారు. ఆ టికెట్టు విల్సియస్ వరకే. అంతా చూసారు. మరి టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేయడం ఎట్లా?

"వెదుకుదాంపదండి." అని రాగిజుట్టు కుర్రవాడు బిగ్గరగా అరిచాడు.

పిల్లలు ప్లాటుఫారం అంతటా వెదికారు. కొంతమంది జట్టుగా టికెట్టుఆఫీసు దగ్గరికివెళ్ళారు. కొందరు హోటల్లో చూడ డానికి వెళ్ళారు. మరికొందరు రైలువెంటే పరుగెత్తుతూ బోగీల కింద చూసారు.

కొన్ని నిమిషాల తరువాత తిరిగి వచ్చి రాగిజుట్టు కుర్రవాడి చుట్టు మూగారు.

"యెక్కడా కనిపించలేదు."

"మహా చురుకయినమనిషి! ఒకసెకండు అట్టు తిరిగామో లేదో మాయమయి చక్కాబోయాడు."

"చూడండి-అడిగో యినస్పెక్టరు!"

ఇనస్పెక్టరు రొప్పుతూ పిల్లల దగ్గరికి చేరుకున్నాడు. పూర్వపు గాంభీర్యం మటుమాయమయింది. టోపీ చెవిమీదికి ఒరిగింది. స్కూలు ఇనస్పెక్టరు వాలకం ఎక్కడా కనిపించడంలేదు. సరాసరి వచ్చి రాగిజుట్టు కుర్రవాడిముందు ఆగాడు.

"మీతోకూడావున్న ఆ సూటుకేసులమనిషి యేడీ ?" అని బొంగురుగొంతుతో ప్రశ్నించాడు. స్వరం కంపించింది, స్కూలు ఇనస్పెక్టరు మాట్లాడుతున్నట్లు లేదు.

సొగసుజుట్టు కుర్రవాడు జవాబు చెప్పబోయాడు గాని రాగి జుట్టు కుర్రవాడు అతనిని వారించాడు. మొహం చిట్లించుకుని, ఒక అడుగు ముందుకువేసి, టోపీ నొసటిమీదికి లాగుకుని బూడిదరంగు ఓవరుకోటు జేబులలో చేతులు పెట్టుకున్నాడు.

"హోటల్లో టీ తాగుతూ వున్నాడు." అన్నాడు అకస్మాత్తుగా స్నేహితులకు కనుసైగ జేస్తూ.

"అంటే యింకా తాగడం పూర్తి కాలేదు, మేలిముసుగు వేసుకుని మడతహేటు పెట్టుకున్న ఒకావిడ అతనిని కలుసుకుంది.

"యేమిటేమిటీ ? ముసుగు వేసుకున్న ఆడది ! నువ్వు చూసావా ?" అని ఇనస్పెక్టరు అడిగాడు ఆదుర్దాగా, సంతోషంతో కళ్ళు వెలిగిపోయాయి.

"అతడిని యెక్కడ కలుసుకుంది ? ఆమె నాకు కనుపించ లేదే ?"

"అక్కడ నిలబడివుంది." అంటూ రాగిజుట్టు కుర్రవాడు మొదటి తరగతి హోటలు గుమ్మం చూపించాడు.

"అప్పటికపుడే ఆమెని గుర్తించాను. ముసుగు ముఖవేష్టనం లాగావుంది. అతను ఆమెదగ్గరికి వెళ్ళగానే ముసుగుపైకెత్తి చూసింది. యిద్దరూ కలిసి లోపలికి చక్కాబోయారు."

ఇనస్పెక్టరు ఇక వినదలుచుకోలేదు. గబగబా హోటలు దగ్గరికివెళ్ళాడు. పిల్లలు నిశ్శబ్దంగా అతనిని కనిపెట్టసాగారు. రాగి జుట్టు కుర్రవాడు అసహ్యభావంతో సొగసుజుట్టు కుర్రవాడిని భుజంతో తోసాడు.

---

* పుష్కిన్ నవలలో కథానాయకుడు

"నువ్వు బలేవాడివి. అసలు రంగేమిటో బయటపడే యించావు. వాడు గూఢచారి. స్పష్టంగా తెలుస్తూనేవుంది. అతనిని పట్టుకోవాలని చూస్తున్నాడు."

"అతను......డుబ్రోవస్కీ * లాంటివాడో, జారును చంపిన వాళ్ళ లాంటివాడో అంటావా ?" అని గుండ్రటిమొహం కుర్రవాడు అడిగాడు కిందికిచూస్తూ.

"యిష్, నోరుముయ్ !" అని అరిచాడు రాగిజుట్టు కుర్రవాడు. "అటువంటి మాటలంటే యేం జరుగుతుందో తెలుసా ?"

"యిక్కడనించి వెళ్ళిపోదాం పదండి" అంటూ సొగసు జుట్టు కుర్రవాడు స్నేహితులను తొందరపెట్టాడు." హోటల్లో కనిపించక పోయేసరికి వాస్యా అబద్ధం చెప్పాడని గ్రహించేస్తాడు. యింకేముంది, మనందర్నీ తీసికెళ్ళి జైల్లో కుక్కేస్తారు."

"నువ్వు వట్టి పిరికి వెధవ్వి ! తెలివితక్కువ మొద్దువి !" అన్నాడు వాస్యా విసుగుతో పెదవులు ముడుచుకుంటూ. "అక్కడ వున్నాడో లేదో వాడికెలా తెలుస్తుంది. అయినా... నేను చెప్పానని రుజువేమిటి ? 'అతన్ని మేం చూడనేలేదు. అబద్ధాలు చెబుతున్నాడు' అని అందరం అందాం. యిక్కడ పదిహేనుమందిమి వున్నాం. మనని కాదనేవాడెవడు ?"

"అవును. వాస్యా సరిగానే చెప్పాడు. రుజువేమిటి ?"

"మనం వెళ్ళిపోగూడదు. ఆయన రైలులో వున్నాడనే నా నమ్మకం. యింకెక్కడికి వెళతాడు ? ఆ టోపీమనిషి మళ్ళీ ఆయన వెంటబడతాడు: అలా జరక్కుండా మనం చూడాలి." అని తిరిగీ ప్రారంభించాడు వాస్యా.

సొగసుజుట్టు కుర్రవాడు తల ఆడించి భయంతో స్టేషనుకేసి చూసాడు.

---

* 36 వ పేజి చివర చూడాలి.

"మాటలకేం కోటలు దాటతాయి. వాడితో తగాదా పెట్టుకుంటావనుకోను."

"పెట్టుకోవలసి వస్తే పెట్టుకు తీరతాను" అన్నాడు వాస్యా కాలితో నేల తన్నుతూ.

"నేనూ ఒకఆట ఆడిస్తాను, వినండి."

పిల్లలంతా అతనిచుట్టూ గుమిగూడారు. స్నేహితులకి తప్పితే ఇంకెవరికీ వినిపించదని రూఢి చేసుకుని, వాడు "బోగీలలోకి తలదూర్చి చూడడం ప్రారంభిస్తే నేను 'దొంగ, దొంగ!' అని అరుస్తాను. మీరంతా పరుగెత్తుకుని వచ్చి వాడిచుట్టూ మూగి గొడవ గొడవ చేసెయ్యండి. వొలోడ్యా! నాసంచి తీసుకో. అవసరమయితే నాడబ్బు కాజేసాడంటాను."

"నీమాట యెవరు నమ్ముతారు? పోలీసువాళ్ళ తాలూకని తెలిపే కాగితం చూపితే చూపచ్చు."

"యీ లోపుగా రైలు కాస్తా చక్కాబోతుంది. అపుడే రెండోగంట కొట్టారు. అదిగో మూడోగంట! వాడికోసరం కాచుకుని వుండండి."

కాని ఇనస్పెక్టరు జాడ ఎక్కడా కనిపించలేదు. పిల్లలు వాసిలీ పడుచుమొహం, నవ్వుమొహం, నిర్మలమయిన కళ్లు, గడ్డం కనిపిస్తాయేమోనని మహాకాంక్షతో కదిలిపోతున్న బోగీల కిటికీలకేసి చూసారు.

కాని వాసిలీ ఎవరికీ కనిపించలేదు. సామాను అరలలో మూడోదాంట్లో గోడకు ఆనుకుని పడుకున్నాడు. పై బల్లమీది వాళ్ళుమాత్రమే చూడగలుగుతారు. ఇక సూటుకేసులు, మాసిపోయిన చీట్లు అంటించి కిటికీకి ఆనించాడు. అంతకుముందు చీట్లు లేవు. అమాంతంగా వచ్చి అతుక్కున్నాయి! విల్నియస్ స్టేషను ప్లాటుఫారంమీద రహస్యంగా ఫొటో తీసింది వీటినేనని ఎంత సూక్ష్మదృష్టిగల ఇనస్పెక్టరయినా కనిపెట్టలేదు.

ఇప్పుడు వాసిలీకి రెండో టికెట్టు ఉపయోగపడింది. ఆ టికెట్టే గనక లేకపోతే రైలుఎక్కడం సాధ్య మయ్యేదికాదు. టికెట్ల తనిఖీ కఠినంగా అమలు జరుగుతోంది. ఇక 'తెల్లరాతి నగరం' అని అక్కడివారు సగర్వంగా చెప్పుకునే మాస్కోనగరం చేరుకునే వరకూ హాయిగా నిద్రపోవచ్చు.

# 7

# గాగరాలో ఎలుగుబంటు

మాస్కో నగర ప్రాంతీయ రైళ్ళలోని ప్రయాణీకుల సంభాషణలో ఎప్పుడూ ఏదో ఒక ప్రత్యేకత ఉంటూనే ఉంటుంది. దేనిని గురించి మాట్లాడుకుంటున్నా, వాదించుకుంటున్నా మాటిమాటికీ గర్వంతో "మాస్కోలో మేము..." అని ఎవరో ఒకరు అనడం మామూలు.

ఎంతతీవ్రంగా వాదించుకుంటున్నా అందరూ తలలు ఊపి, చిరునవ్వులు నవ్వుకుంటూ ఇట్టే స్నేహితులయిపోతారు. అంతా మనవాళ్ళే, మన మాస్కోవాళ్ళే!

కాని అందరూ మాస్కోవాళ్ళేనా?

అందరూ వాదనకి దిగరు. కొందరుమాట్లాడకుండా కూర్చుంటారు, ఉదాహరణకి ఆ పొడుగాటి మనిషిని చూడండి. తేటకళ్ళు చిన్నగడ్డం, పరీక్షగాచూస్తే ముక్కుమీద మచ్చ కనిపిస్తుంది. బోగీసీట్లలో దొరికిన కరపత్రాలనుగురించి వాదన తీవ్రంగా జరుగుతున్నా అతనుమాత్రం కలగజేసుకోలేదు.

అవి అచ్చుకరపత్రాలు. వాటిమీద పోలీసు అనుమతి ముద్రలేదు. అందుచేత అవి రహస్యకరపత్రాలనీ, రాజద్రోహకరమయినవనీ స్పష్టమయింది. అంతేకాదు, వాటిలో సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోని ఒబుఖోవ్ మిల్లులో గత వసంత కాలంలో కార్మికులు ఎలా సమ్మెచేసారో, రాళ్ళురువ్వి పోలీసులను ఎలా తరిమివేసారో, సైన్యాలను ఎలా ప్రతిఘటించారో వర్ణింపబడింది. చివరకు సైనికులదే పైచేయిఅయి, ప్రదర్శకులను అరెస్టుచేసినా బహిరంగంగా

తలపడి జారు సైన్యాలను ఓడించవచ్చని ఒబుఖోవ్ సమ్మె రుజువు చేసింది. ఒబుఖోవ్ కార్మికుల లాగా తమ తమ హక్కులకోసం పోరాడ వలసిందిగా కార్మికపక్షం ఆకరపత్రంలో పిలుపు ఇచ్చింది.

ఆ కరపత్రం నెత్తిమీద ఇటాలిక్ అక్షరాలలో 'ప్రపంచ కార్మికులారా! ఏకంకండి' అని ముద్రించబడి ఉంది. కింద ఈ కింది మాటలు పొందుపరచబడ్డాయి. ఇట్లు, మాస్కో కమిటీ, రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరుపార్టీ.

వాదనఅంతా ఈ చివరి మాటలమీదనే జరిగింది. వాదించే వారిలో శ్రామికవర్గం అంటే ఏమిటో, సోషల్ డెమాక్రాట్ అంటే ఏమిటో ఒకరూ విశదంగా చెప్పలేకపోయారు. కాని ఆ కర పత్రం రాజద్రోహకరమయిందని మాత్రం అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. అందుచేత చివరిమాటలలో వారికి అనుమానం రేకెత్తింది. సెయింట్‌పీటర్స్‌బర్గ్‌లో కార్మికులు తిరగబడ్డారంటే పెద్ద ఆశ్చర్యమేమీలేదు. అది సాధ్యమే. కాని ఇక్కడ మాస్కోలో ఊహుం- వీలులేదు. 160 చర్చిలు ఉండగా సమ్మెజరగడమే ! మాస్కో నగరంలోగాని, పరిసర జవుళిమిల్లుల జిల్లాలోగాని రాజ ద్రోహపు వాసనేలేదు. మాస్కో జవుళి మిల్లులో సమ్మె జరిగిన మాట వాస్తవమేగాని అది ఎపుడో 1885 నాటిమాట. ఇది 1902 జనవరి !

"యీ కరపత్రాలు చేనేత కార్మికులకోసం అయివుంటాయి అవును. "అన్నాడొకడు." యివాళ ఆదివారం. సరుకులు కొను క్కునేరోజు. ప్రజలు ఒరెఖోవో-జూవో బజారు వెళుతున్నారు. అందుకే యీ కరపత్రాలను రైలుపెట్టెలలో వెదజల్లారు."

"యెవరు ? యెవరు వెదజల్లారు ?" ఈ ప్రశ్నకు ఎవరూ జవాబుచెప్పలేదు. శ్రామికవర్గం, సోషల్‌డెమాక్రాట్ అనే పదా లకు అర్థం ఎవరికి తెలుసు ?

రైలులో వాదించుకుంటున్న జనానికి ఈ మాటలకు అర్థం తెలియకపోవడంలో ఆశ్చర్యంలేదు. వారిలో చాలామంది దుకాణ

దారులు. సరుకులు కొనడానికి వెళుతున్నారు. కాని వారి సమీపంలోనే కూర్చుని మెదలకుండా వింటున్న కొంతమంది కార్మికులకు, విద్యావంతుడి లాగా కనిపించే ఆ తేటకళ్ళ వ్యక్తికి ఈ మాటలు సుపరిచితమయినవి కాకపోవడం ఆశ్చర్యకరమయిన విషయమే ! ఈ మాటలకు అర్థం ఏమిటని ఆ వ్యక్తిని అడిగాను. కాని అతను తలపంకించి ఊరుకున్నాడు. అతనికి చివరంటా వినాలని కుతూహలం లేనట్లుంది. ఒక చిన్న స్టేషను దగ్గర నల్లటి విదేశీ సూటుకేసు తీసుకుని రైలుదిగి చక్కాపోయాడు.

ఈ స్టేషనుకూడా చూడడానికి అసహ్యంగా ఉంది. కొయ్య ప్లాటుఫారం విరిగి పడిపోతుందా అనిపిస్తోంది. కాని గాలిమాత్రం అతి చల్లగా, హాయిగొలుపుతూ, చెవులు చిల్లులుపడేటట్లు మోగే గంట మోతకు ప్రతిధ్వనిస్తోంది. ఆవేళ ఆదివారం. ఇంతా అంతా సరుకులు కొనుక్కునేది ఈరోజునే.

తప్పతాగిన బట్టతల నౌకరు చేతులలో చర్చి కంచుగంట ఉదయంనుంచీ ఖంగుమని హుషారుగా మోగుతోంది. చర్చిలో వసూలయే మామూళ్ళలో తనకూ భాగం ముడుతుందనే ఆశతో గంట తెగవాయించేస్తున్నాడు. ప్రార్థనలు పూర్తి అయాయి. పళ్లెం డబ్బులతో నిండిపోయింది. ఆచర్చి బీదస్థితిలో ఉంది. పట్టణం అని పేరుకేగాని అక్కడ ఉన్నవన్నీ పూరిగుడిసెలు, వెదురు తడకలు. ఒక్కవీధికి మాత్రం కంకరరోడ్డు ఉంది. వసంత కాలంలోనూ ఆకురాలు కాలంలోనూ కూడా తక్కినవీధులలోఎత్తు బూట్లుగానీరబ్బరుబూట్లుగాని వేసుకున్నప్పటికీ నడిచివెళ్ళడంకష్టం. అయితేనేం ఆదివారాలలో, శెలవు దినాలలో చర్చి నిండిపోతుంది. చర్చిపెద్ద పట్టుకుని తిరిగే పళ్లెంలో తలోకాస్త సమర్పించుకోవాలనే పట్టుదల చేనేత కార్మికులకు, స్త్రీ పురుషులకు ఎక్కువ. పళ్లెం పుచ్చుకుని తిరిగే చర్చిపెద్ద, పెద్దవర్తకుడు. మెడలో బంగారుపతకం వేలాడుతోంది. అది మామూలు రోజుకాదు. అందుకే ప్రజలకి అంత పట్టుదల. ప్రార్థనలు ముగిసిన తరవాత అందరూ మిల్లు ఆవ

రణలోకి రావాలని మిల్లు యజమాని ఆజ్ఞాపించాడు. కార్మికులతో స్వయంగా మాట్లాడడానికి ఆయన స్వయంగా దయచేస్తున్నారు. చిన్న విషయమయితే ఆయన పట్టించుకునేవాడు కాదు. ఇదేదో ముఖ్యమయిన విషయమే! రోజువారీ వ్యవహారాలు మానేజరు చూసుకుంటాడు.

ఫ్యాక్టరీ పట్టణానికి రెండు వెర్స్టుల * దూరంలో ఉంది. దాసులు నేరస్తులు కష్టించి కట్టిన రాతిగోడ, గోడ అవతల రాడోనెజ్ సెర్జీ విగ్రహం, విగ్రహం తలచుట్టూ ధగధగ మెరిసే ప్రకాశ మండలం, దానివెనక మంచుతో నిండిన బూడిదరంగు ఆకాశం! మిల్లు ఇనపగేటు తెరిచారు. స్త్రీ పురుషులు గుంపులు గుంపులుగా లోనికి వెళుతున్నారు. ఆ ఋషి విగ్రహం చూపులకు కర్కశంగా ఉంది. గడ్డం నేలకి తాకుతోంది. ఆ ఋషి చేయి పైకెత్తి వేలితో చేస్తున్న సంజ్ఞకు అర్థం ఆశీర్వాదమో, బెదిరింపో తెలియడం లేదు.

విగ్రహం కిందుగా రాత్రింబగళ్ళూ ఒక గిన్నెలో దీపం మసక మసక లాడుతూంటుంది. ఆ గిన్నె కడిగి శుభ్రంచేసి ఎన్ని వారాలయిందో! ఈ దీపానికి ఒక గొలుసుతో దానధర్మాలకని ఒక కప్పు కట్టారు. గొలుసు తుప్పుపట్టి పోయింది.

గేటుపైన ఇనపరేకు బోర్డుమీద స్లావోనిక్ అక్షరాలతో ఇలా వ్రాసి ఉంది.

జవుళిమిల్లు
సెర్జీ ప్రోర్ఫిరేవిచ్ ప్రోషిన్
అనువంశిక గౌరవపౌరుడు

ఇంకా బోర్డు అంచుమీద ఫ్యాక్టరీ వ్యాపారముద్ర – 'గాగ రాలో ఎలుగుబంటు' అని ఉంది.

---

* వెర్స్టు = 2/3 మైలు

ఈ వ్యాపారముద్ర రష్యన్ సామ్రాజ్యం లోనేగాక, విదేశాలలో, ఉదాహరణకి పారిస్‌లో కూడా, పేరు సంపాదించుకుంది.

ఇక్కడ ఇద్దరు సెర్జీలు – ఒకరు మిల్లు యజమాని, రెండో వారు ఋషి. పోర్షిరీ ప్రోషిన్ వర్తకుడు. ట్రొయిట్స్ సెర్జీ మఠం కట్టించిన రెడో నెజ్ ఋషి పేరు తన కొడుకుకు పెట్టుకున్నాడు. గోడకు దగ్గరగా ఆ ఋషి విగ్రహం మహా వీలుగా వుంది. గేటుదగ్గర ఆ 'ఎలుగుబంటి' కింద కార్మికులు ఎలాగూ టోపీలు తీసివేసి ఒక మాటు శిలువ గుర్తు వేయాలి.

ఈ రోజునకూడా మామూలుగా కార్మికులు గేటుదగ్గరకు వచ్చి టోపీలు తీసి శిలువ గుర్తువేసి అంతంలేని ప్రవాహంలా లోపల ప్రవేశించారు. ప్రోషిన్ మిల్లులో సుమారు 15 వందల మంది పని చేస్తున్నారు. ఆవరణ అంతా కార్మికులతో నిండి పోయింది. ఇంకా వచ్చిపడుతున్నారు.

ఒక పొట్టిపాటి మనిషి ఊదారంగు ఫైళ్ళకట్టా, పెద్ద జంత్రీ చంకలో పెట్టుకొని ఆవరణగుండా గేటువేపుకి నడచి వెళు తున్నాడు. మంచి విలువయిన వోవరుకోటు వేసుకున్నాడు. తోసుకు వస్తున్న గుంపులను తప్పించుకుంటూ, ఎరుగున్నవారందరికీ నమ్రతతో నమస్కరించాడు. మనిషి కుంగిపోయినట్టు కనిపించాడు.

"మాస్టర్ బుక్ కీపర్ !" అంటూ వెనక నుంచి ఎవరో పిలిచారు. "గస్టిల్యోవ్! యివాన్ యెఫిమోవిచ్ !"

ఇవాన్ యెఫిమోవిచ్ ఆ పిలుపు వినిపించనట్లు నటిస్తూ ముందుకు సాగిపోయాడు. మిల్లుబయటికి వెళ్ళిన తరువాత ఇనప తీగల కోరడి పక్కగా ఎడమ వైపుకి మళ్లాడు. అక్కడికి వెళ్ళే సరికి ఒక బాలిక తొందరగా వచ్చి అతనిని కలుసుకుంది. ఆమె పొట్టిపాటి ఉన్నికోటు, వెచ్చటి ఉన్ని రుమాలు ధరించింది.

"యేమిటి యివాన్ యెఫిమోవిచ్ ! కార్మికులంతా సమావేశమయారెందుకు ?"

ఆ బుక్ కీపరు ఆమె అందమయిన మొహంకేసి సంతోషంతో చూసాడు. శీతలం, ఆదుర్దా మూలంగా మొహం మెరిసిపోతోంది.

"యెందుకో సరిగ్గా తెలీదు" అన్నాడతను బుజాలు ఎగురవేస్తూ. "జీతాలలో కోతలను గురించి అనుకుంటా. క్నోషిన్, మొరోజోల్ మిల్లులలో జీతాల కోతపెట్టారు. ప్రోషిన్ కూడా కోత పెడతాడని నా నమ్మకం."

"జీతాలకోత!" అంది ఆ బాలిక కోపంతో. "యింకా యేంతగ్గిస్తారు? యీ జీతాలతో చేతికీ నోటికీ సరిగా సరిపోవడం లేదాయె. సగం మాడుతున్నారు."

ఇవాన్ యెఫిమోవిచ్ మళ్ళీ బుజాలు ఎగరవేసాడు.

"అవును. కష్టమే. అందుకే బహుశా అయనే స్వయంగా వస్తున్నాడు. తండ్రిలాగా యెంతో దయతో మాట్లాడి నచ్చచెప్పగలుగుతానని అనుకుంటున్నాడు."

"అలాఅయితే మనమేం జేయాలి?" అంటూ అడ్డువచ్చింది ఆ బాలిక.

"మనమా?" ఇవాన్ యెఫిమొవిచ్ కోపంతో అన్నాడు. "మన మిలా బహిరంగంగా మాట్లాడుకోవడం మంచిది కాదు. ప్రమాదం. కుట్ర లక్షణం కాదు."

"ఊం— యేమిటా పిచ్చిమాటలు?" అంది విసుగుతో చేతులు ఊపుకుంటూ.

"యీ మారుమూల గ్రామంలో ఫ్యాక్టరీ బుక్ కీపరు, పంతులమ్మ ఒకరి నొకరు యెరక్కుండా యెలావుంటారు! బహిరంగంగా మనం మాట్లాడుకోవడం ఆశ్చర్యం గొలుపుతుందేం?" అంది వేళాకోళంగా. మనం ప్రేమించుకుంటున్నామేమో? యెవరికేం పట్టింది? పైగా కుట్రా."

బుక్ కీపరు మొహం ఎర్రపడింది. కోపం వచ్చినట్టుంది. ఏదో చెప్పాలనుకున్నాడు గాని ఆ బాలిక అవకాశం ఇయ్యలేదు.

"ప్రోఫిన్ జీతాలకోత పెట్టాలని యెత్తు వేస్తున్నాడని తెలిసికూడా మమ్మందర్నీ యెందుకు పిలవలేదు? ప్రతిఘటనకు సన్నాహం చెయ్యాలిగదా! తప్పదు."

బుక్ కీపరు భయంతో చుట్టూ చూసాడు. మాటలు వినిపించేటంత దగ్గరలో ఎవరూ లేరు. వెక్కిరింతగా పెదవులు విరచుకుని, "ప్రతిఘటనా! యిలాంటి వాళ్ళను పెట్టుకునేనా? వీళ్ళ సంగతి నీకింకా తెలీదు. వీళ్లు ఒబుఖోవ్ కార్మికుల వంటి కార్మికులు కారు. కార్మికులమని చెప్పుకుంటారు: అంతే. మూడు తరాల నుంచీ మిల్లులలో పనిచేస్తున్నా నూటికి తొంభయి మందికి రైతులలో కంటె రైతు లక్షణాలు యెక్కువగా వున్నాయి. వీళ్ళు రంగంలోకి దిగుతారా. పెడతారా?"

"ఆకలితో మాడిపోతున్నారు. నిన్నగాక మొన్న ఫ్యాక్టరీ బరకాసులకి వెళ్ళి చూసాను. పిల్లల్ని చూస్తుంటే కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. ఆ చిట్టిమొహాలు తెల్లగాపాలిపోయి వున్నాయి. సగంమందికి తొడుగుకోడానికి చెప్పులు లేవు. లోపల వూపిరాడదు. అట్లాగే పడివుండాలి. జీతంలో ఒక కోపెక్కు కోతపెడితే చాలు యేం మూడుతుందో నేనూహించ లేకుండా వున్నాను."

"యెలాగో ఒకలాగు సర్దుకుపోతారులే." అని గస్టిల్యోవ్ తీవ్రంగా చెప్పి ఓవరుకోటు కాలరు పైకిఎత్తాడు.

"మానవుడు యెంత పట్టుదలతో జీవితానికి అంటిపెట్టుకుని పడివుంటాడో నీకు తెలీదు. అలాకాకపోతే మానవజాతి యెన్నడో నశించిపోయేది."

శెలవు తీసుకుని వెళ్ళిపోబోయాడు గాని ఆ బాలిక అటకాయించింది.

"ఉహుం- వీల్లేదు. ఒక నిమిషం ఆగు. యింత ముభావం పనికిరాదు. యీ విషయంలో మీరేమీ చెయ్యదలుచుకోలేదా? మీరు పార్టీ సన్నాహకర్తలుగా! యేమిటి? కళ్ళట్లా తిప్పుతారేం? ఆపండి. మనమాటలు యెవరూ వినడంలేదు. కాకపోయినా మన జోలి యెవరికి కావాలి? యేదో ఒకటి చెయ్యడం మీ కర్తవ్యం"

"యేమిటి చెయ్యాలి?" గస్టిల్యోవ్ విసుగులో బుజాలు, చంకలోని ఫైళ్ళు, జంత్రి సర్దుకున్నాడు. "యెవరి సహాయంతో? మీ స్వయంబోధనా సమితి సహాయంతోనా? యింకా స్పష్టంగా చెప్పాలంటే మీ అల్పసమితిలోని అల్పులతోనా? లేకపోతే వాసిలీ మిలెస్కిన్‌లాంటి అరాచకవాదుల సహాయంతోనా? యింకా కాకపోతే మీ ప్రఖ్యాత స్థానిక కార్మిక నాయకుడు కొజుబా సహాయంతోనా?"

"యిలా యెలా మాట్లాడగలుగుతున్నారు?" ఆ బాలిక నేత్రాలలో కోపాగ్ని తళుక్కుమంది. "కార్మికు లందరిలోకీ కొజుబా ముందుండే మనిషి. అతనికి వున్నంత గౌరవం మీకే గనక వుంటే ఒక్కమాటలో కార్మికులందరినీ బయటికి తీసుకు రాగలిగేవారు. కాని మీరు అతనిని మన పక్షానికి తీసుకు రాలేక పోయారు. అతను మనపక్షం వహించకపోగా......" ఆమె పెదవి కొరుక్కుంది.

గస్టిల్యోవ్ వికటంగా నవ్వి,

"మన సంస్థలో కామ్రేడ్ ఇరీనా అంటూ ఒక అమ్మాయి లేకుండా వుండి, అతను నాతోనే సరాసరి వ్యవహరించి వుంటే సోషల్ డెమాక్రసీకి శత్రువుగా మారేవాడనేగా నీ తాత్పర్యం. నేను చెయ్యగలిగిందేమీ లేదు. ఆ గౌరవం నువే దక్కించుకో. అదిగో అనుచరులను వెంటేసుకుని యిలాగా వస్తున్నాడు."

ఇలా అని మిల్లు గేటును సమీపిస్తున్న కార్మికుల గుంపు కేసి తల ఊపాడు. ముందు నడుస్తున్న వ్యక్తితో ఆ గుంపులో వాళ్ళు తీవ్రంగా వాదిస్తున్నారు. ఆ వ్యక్తి మంచి బలిష్టి. మధ్య వయస్కుడు. తల నెరిసి మెరుస్తోంది. గస్టిల్యోవ్ పెదవులు నొక్కు కుని తీగల కోరడివెంబడే పట్నం వైపు త్వరత్వరగా చక్కాబోయాడు.

ఆ వ్యక్తి ఇరీనాను చూసి స్నేహపూర్వకంగా చేయి ఆడించి, "నమస్తే. మిల్లుదగ్గర యేం జరిగిందో విన్నారా?"

"హల్లో నోజుబా!"

వారిద్దరూ గట్టిగా కరచాలనం చేసుకున్నారు. ఇరీనాను చూసి నోజుబా సంతోషించాడు. కాని బొద్దు కనుబొమలు ముడిచి నిశ్చలంగా చూస్తూ, "మిల్లు ఆవరణలోకి వచ్చివుండమని అందరినీ యజమాని ఆజ్ఞాపించారు. యేదో మోసం తలపెట్టేవుంటాడు. యే మాత్రం వత్తిడి తెచ్చినా సెయింట్ పీటర్సు బర్గులోలాగ గదిలో పెట్టి తాళం వెయ్యవలసిందని వాసిలి చెప్పారు. ఒబుఖోవ్ కార్మికులను గురించిన కరపత్రం చదివారా? బాగావుంది. గస్టిల్యోవ్ ధోరణిలో లేదు. నిజం."

అక్కడివారంతా పక్కున నవ్వారు.

"ఆయన్ని యేకొట్టులోనో యెందుకు బంధించేయ కూడదు?" అన్నాడు వాసిలీ. వాసిలీకి కాళ్ళు పొడవు. మనిషి అందవికారంగా వుంటాడు. "ఒబోఖోవ్ కార్మికులు చేసిందాంట్లో గొప్పేముంది? నేను చదివాను..."

"అడుగో ఫోర్మన్" అంటూ అడ్డువచ్చాడు మరొక కార్మికుడు. "పదండి, దుష్టుడికి దూరంగా వుండడం మంచిది."

వారందరూ దూరంగా వెళ్ళిపోయారు. మంచి విలువయిన వున్నికోటు తొడుక్కొని ఎత్తుపాటి గొర్రెతోలు టోపీ పెట్టుకుని ఫోర్మన్ గేటులోనుంచి వచ్చాడు. చినిగిపోయిన చెప్పులతో మంచును తోసుకుంటూ ఫోర్మన్ పక్కగా వెళుతున్న ఒక కార్మికుడు అతనికి వంగి వంగి సలాములుచేసి,

"పియోటర్ యివానిచ్! యజమానితో నా విషయం వక ముక్క చెపుదురూ. మీరు వేలితో యిట్టా సైగ చేస్తే చాలు ప్రమోషను వచ్చి పడుతుంది. నిజం!" అన్నాడు ఆ కార్మికుని నుదురు సన్నం, చేతులు అడవి మనిషికి లాగా అతిపొడుగు.

బాగా బలిసి నున్నగావున్న చెక్కిళ్ళను ఫోర్మన్ కొద్దిగా సడలించి మందహాసం చేసాడు, దానితో ఉత్సాహం ఇనుమడించి ఆ కార్మికుడు ఇంకా వంగి వంగి సలాములు చేసాడు.

పియోటర్ యివానిచ్ ! జన్మజన్మలకి నీకు కృతజ్ఞతతో పడి వుంటాను. నాకు ఫ్యాక్టరీ పోలీసు వుద్యోగం యిప్పించు. వళ్ళు వంచి పని చేస్తానని ప్రమాణంచేసి చెపుతున్నా...మిఖల్ చక్ ని గనక పోలీసుని చేస్తే ఫ్యాక్టరీలో భద్రత చేకూరుతుందని అయ్యగారితో చెప్పు. యిన్ని శక్తి సామర్థ్యలున్నవాడిని ఆ బెంచి దగ్గిర పడి చావ వలసిందేనా? చెయ్యాలిస్తే ఆడముండయినా ఆపని చెయ్యగలదు. నీగడ్డం పుచ్చుకు బతిమాలుకుంటా. నను దయతో చూడు, పియోటర్ యివనిచ్ !"

ఫోర్మను తాపీగా ముభావంగా తలఊపాడు. "సరే మంచిది వకమాట అని చూస్తా. మనలో మనమాట, పోలీసు యినస్పెక్టరుకి నీసంగతి యెలా తెలిసింది ?"

మిఖల్ చక్ సంతోషంతో ఇకిలించాడు.

"హ హ హ ! నన్నుగురించి యినస్పెక్టరు చెప్పాడా ? అవును ఆయనగారు నన్నెరుగు. యేదోపనిమీద ఆయనగారిని వెళ్ళి చూడవలసి వచ్చింది. నేను ప్రభుత్వ క్షేమాన్ని సంరక్షిస్తున్నాను. నేను......"

ఫోర్మన్ ఆవరణ వంక ఓరచూపుచూసి, "జాగ్రత్తగా సంచరించు. ఈవిషయం తెలిస్తే వీళ్లు నీమక్కెలు విరగగొడతారు సరే, నిన్ను మాచేతికింద వేసుకుంటాంలే."

"మరేం భయంలేదు" అన్నాడు మిఖల్ చక్ బిగ్గరగా. ఎందుకోగాని అడవి మనిషి చేతుల్లాంటి రెండు చేతులూ పైకి ఎత్తాడు." వాళ్ళతో యెలా వ్యవహరించాలో నాకు తెలియదనుకున్నావా ? నా గొంతు నేనే కోసుకుంటానా ?"

ఫోర్మను చేయి జాపి గేటుదగ్గర తచ్చాడుతున్న ఒక కుర్రవాడి చెవి పట్టుకున్నాడు.

"యేయ్, కుర్రాడా ! రోడ్డుకూడలి దగ్గరకు వెళ్ళి మొగలో నిలబడు. యజమానిగారి గుర్రాలు కంట బడగానే పరుగెత్తుకు వచ్చి చెప్పు. యేమరపాటులేకుండా చూస్తూవుండు. నువు ముందుగా

చూసి, వచ్చి చెప్పకపోతే యజమానిగారికి గొప్పగా స్వాగతం యివ్వలేం.”

మిఖల్‌చక్ అవరణలో ఎక్కడో వెనక చిన్నపోయివున్న నల్లరాతి ఇళ్ళకేసి వినయంతో చూసాడు.

“యజమానిగారు ఆ రోడ్డువెంట రావడం మామూలు.”

“చాలా సేపటినించి అక్కడా మనుషుల్ని అట్టేపెట్టాం. ఒకవేళ యీరోడ్డంట వస్తాడేమోనని యీ పిల్లవాడ్ని పంపుతున్నా.” అన్నాడు ఫోర్మన్.

“బాబాయ్! పియోటర్ యివానిచ్, మహానుభావా!

బుజంమీద తాంబురా వేలాడవేసుకొని, చినిగిపోయిన ఉన్ని బూట్లు తొడుగుకొని ఒక యువకుడు గేటుదగ్గరకి మెల్లిగా నడిచి వచ్చాడు. ఫోర్మన్ ఆయువకుని చూసీచూడగానే వెనకకు తిరిగి గబగబా చక్కాపోయాడు.

“ఆగు, ఆగు! నువే, నువే నాకొంప తీసేసావు, పేడపురుగా! ఫ్యాక్టరీలోంచి తరిమేసావు, నాకు రావలసినవి వెధవ నలభయికోపెక్కులు, ఆ కాసినీ గాజేశావు!”

కాని ఫోర్మన్ అపుడే చాలదూరం వెళ్ళి పోయాడు. మిఖల్‌చక్ అనుసరించి రాగా ఆ ఆవరణలోని డాబా మీదకు వెళ్ళాడు. డాబామీద తివాసీలు పరిచి, తివాసీల మీద కుర్చీలు వేసారు. కార్మికులు దానిని ‘కసాయిశాల’ అని పిలుస్తూంటారు. ఆ మిల్లు యజమాని ఇక్కడనుంచే ఆజ్ఞలన్నీ జారీ చేస్తుంటాడు.

తాంబురా తగిలించుకున్న యువకుడు ఫోర్మన్ సాగిపోతుంటే వెనకనుంచి వేళాకోళంగా కేకలుపెట్టి అల్లరిచేసాడు. చినిగిపోయి చమురు కారుతున్న టోపీ తీసివేసి కొజుబా చుట్టూ ఉన్న గుంపులో చేరాడు.

ఇరీనా మందలిస్తున్నట్లుగా తల పంకించి “మళ్ళా తాగి వచ్చావా, మాట్వే!” అంది.

"ఒహో! అదా?" అని టపీమని జవాబిచ్చాడు. యిలా బతుకూ అని నిర్ణయంచేసి, పనీ పాటా చూపెట్టకపోతే తాగక చేసే దేవుంది చెప్పు!" గుంపుకేసి కనుగీటి, "యేవిటి దంతా? యజమానితో లడాయి వేసుకో బోతున్నారా యేం?" అన్నాడు.

"లడాయి!" అంది ఇరీనా మెల్లిగా చూపులతో కార్మికు లను గుచ్చుతూ. "ఓ-లడాయి వేసుకుంటేనా, యెంత బాగుండును!"

"యెందుకు వేసుకోగూడదేం? అడ్డంవచ్చేదెవడు?"

మాత్వే ఒక పాదం ముందుకు పెట్టి, గుండెల మీదికి తాంబురా తీసుకుని మంగళప్రదమయిన ప్రార్థనాగీతం వాయించ సాగాడు.

"రక్తం వుడికించే పాట వాయించనా? ఆ పాట విని లడాయికి దిగకుండా యెవడు వుండగలుగుతాడు?"

"మొరజోల్ గీతం వాయించు" అని వాసిలీ అరిచాడు. "మొరజోవ్ సమ్మెను వర్ణించే గీతం, ఆ గీతం వాయించుదూ." టోపీ చెవి మీదికి లాగుకుని పాడడానికి సిద్ధమయాడు.

చిరిగిపోయిన బూటుతో తాళం వేస్తూ మాత్వే రష్యన్ జాతీయగీతం ఒకటి వాయించాడు. గొంతు బొంగురు గొంతు అయినా చాలాదూరం వినిపిస్తోంది.

ఇంతటి అమాయకుడు
ఏమిటీ పలికాడు?
చెమటోడ్చి తనకొరకు
సిరులు కూరుస్తాడు!
పీనాసి మొరజోవు.
మిల్లులకు ఖామందు
ఖామందు పెట్టు కడ
గండ్లు కానము. ఎంచు

పనివారి బాధలకు
పారమంటూ లేదు
పల్లెత్తి దొరతోను
పలుకుట వలనుకాదు.

అతని కంఠస్వరం, తాంబురాస్వనం, జనవరి చలికి మంద గించిన మంద్రస్థాయిలో రాగవరప కార్మికులను ఆకర్షించాయి. వారందరూ వచ్చి గేటు దగ్గిర గుమిగూడారు. మాక్సీం ఇంకా హుషారుగా పాడసాగాడు.

మనము ఓడ్చే చెమట
మన గుండె నెత్తురులు
కోటీశు లందరికి
కూర్చుచున్నవి సిరులు.
సిరులు కూర్చే మనకు
జీవితమె కాటకము
కాటకాలకు దొరల
బూటకమె కారణము

వాసిలీ పల్లవి అందుకున్నాడు. అతని పక్క నిలబడిన ఒక పొడుగాటివ్యక్తి అతనితో కంఠం కలిపాడు. ఆ వ్యక్తి కుచ్చులేని సిపాయి టోపీ పెట్టుకొని వున్నాడు. యింకా ఇద్దరు ముగ్గురుకూడా గొంతు కలిపారు.

పైస గలవారిదే
ప్రాభవము పలుకుబడి
పేరెవ్వరికి లేదు
వారంత చెల్లుబడి
ధనికుల పదహాతికి
కనలు సోదరులార ?
కొల్ల వోయిన యట్టి
మిల్లు కార్మికులార !

మోరజోవ్ రాకాసి
కోరలను పెరుకుటకు
పదుగురూ చేరి ఒక
మార్గాన్ని వెతకండి !

ఇంకా చాలామంది స్త్రీ పురుషులు గేటుచుట్టూ చేరి ఒకరిబుజాలు ఒకరు రాసుకుంటూ నిలబడ్డారే గాని నోరు మెదప లేదు. కొద్దిమంది యువకులు మాత్రం కొట్టవచ్చినట్టు పల్లవి అందుకున్నారు. మాత్వే పాట ఎంత ఉధృతంగా ప్రారంభించాడో అంత ఉధృతంగాను టక్కీమని ఆపివేశాడు. వీళ్ళవల్ల అయేదేముంది చచ్చేదేముంది ! చచ్చు పీనుగలు !" అంటూ కాండ్రించి ఉమ్మి వేసాడు. గిర్రుమని తిరిగి వెనకకు చూడనయినా చూడకుండా చక్కాబోయాడు. ఇలీనా కళ్ళు కోపంతో మండిపోయాయి. "గస్టిల్యోవ్ దగ్గరికి వెళ్లు, యిద్దరికి తగిపోతుంది. ఒక గూటి పక్షులు మీరు." అంది.

"అదుగో వచ్చేస్తున్నారు" అని ఆ పిల్లవాడు పిచ్చిగా అరిచాడు. ఆ కేక గుంపులో ప్రతిధ్వనించింది. "అదుగో స్వయంగా దయచేస్తున్నారు !"

మిఖల్ చక్ ముంగిటిలోకి వచ్చాడు. ఫోర్మన్ ఉన్నికోటు అంచులు పైకెత్తి హడావుడిగా డాబా దిగి వచ్చాడు. జనం గుంపులు గుంపులుగా చేరి గేటువేపుకు తోసుకు వెళ్ళారు, సిపాయి టోపీ పెట్టుకున్న కార్మికుడు ఉద్రేకంతో అందరికంటే ముందు పరిగెత్తి చేయి ఊపుతూ,

"వరసలో నిలబడండి. సైనిక వందనం సమర్పిద్దాం" అన్నాడు.

"మరి తుపాకీల బదులు యేం వుపయోగిద్దాం ?" అని ఇంకొక కార్మికుడు ఎగతాళిగా అన్నాడు.

ఆ ఉదయమే ఆవరణ అంతా శుభ్రంగా ఊడ్చి గోడకు ఆనించిన పారలకేసి, చీపురుకట్టలకేసీ ఆ 'సిపాయి' చూపించాడు.

"ఊం– యింకేం ఆయుధాలు తీసుకోండి !"

మిఖల్‌చక్ ఆపుదామని ప్రయత్నించాడు. గాని లాభం లేకపోయింది. జనం అతడిని తోసుకుని పారలు, చీపుళ్ళు తీసుకోడానికి ముందుకు ఉరికారు.

"ట్రాస్, ట్రాస్" అని మిఖల్‌చక్ పిచ్చిగా అరిచాడు. గుడ్లు పొదుగుతున్న కోడిపెట్ట రెక్కలు రెపరెప లాడించినట్లు చేతులు ఆడించాడు.

"యేవిటా పని ? దూరంగా పెట్టేయండి, పెట్టేయండి. రొడియోనోవ్ ! అవతలపెట్టేయ్."

కాని అప్పటికే పారలు, చీపుళ్ళు ఒకరికొకరు అందించుకోవడం పూర్తిఅయింది. బారులుగా తీరి యువకులు గేటు వేపుకి బయలు దేరారు. మొగలో నిలబడ్డ పిల్లవాడు ఉద్రేకంతో గంతులువేస్తూ పిచ్చిగా చేతి తొడుగుతో సైగచేస్తున్నాడు.

"బలేబావుంది !" 'సిపాయి' తన పాత్ర నిర్వహణలో ఆనందం పొందుతున్నాడు. "హుషారుగా కనిపించాలి. సైనిక వందనం యీ విధంగా సమర్పించాలి. చూడండి" అని బహు నేర్పుతో పార పైకెత్తాడు. "మీరంతా యిలాగా చెయ్యండి. బలే ! యేదీ యింకోమాటు ! ఒకటి, రెండు బలే ! సుళువుగా నుంచోండి. ఆయన రాగానే హుషారుగా వున్నట్లు కనిపించాలి." అని రొమ్ము మీద బాదుకున్నాడు. "మార్చ్ వుంటే బావుండి పొయ్యేది. యేదో వొకటి వాయించే వాడు."

మొగలోని పిల్లవాడు తిరిగీ చేతిని ఊపి, నాలిక బయటికి చాపి మిల్లునుంచి గబగబా పరుగెత్తుకుని వెళ్ళిపోయాడు. మొగలోని ఒక గుడిసె పక్కగా గుర్రం తల పొడగట్టింది.

"అటెన్‌షన్ ! సైనికవందనం సమర్పించండి !" అధికారిలాగా ఆ 'సిపాయి' ఆజ్ఞాపించాడు.

పారలు, చీపుళ్ళు పైకి లేచాయి. ఆ మరుక్షణమే టపటపా కిందికి దిగాయి. బాగా బలిసి అనేక బహుమతులు కొట్టిన

మచ్చ మచ్చల గుర్రం లావుపాటి బండి మనిషి బదులు ఒక దరి ద్రగొట్టు గుర్రపు బండి మొగలో ప్రత్యక్ష మయింది. బండిమనిషి చినిగిపోయిన కోటు వేసుకుని బండి పెట్టె మీద అడ్డం తిరిగి కూర్చున్నాడు. వాడి వెనక టోపీ పెట్టుకుని ఒక యువకుడు కూర్చున్నాడు. తలవని తలంపుగా ఇటువంటి స్వాగతం ఎదురయి నందుకు కలిగిన ఆశ్చర్యం అతని కళ్ళల్లో ద్యోతక మయింది.

బండి జనాన్ని దాటి, ఇంకో మలుపు తిరిగి పట్టణం వైపుకి వెళ్ళిపోయింది.

ఆ 'సిపాయి' విచారంతో నాలుగు తిట్టి, మొగ కాచిన కుర్రవాడు పారిపోయిన దిక్కే పిడికిలి ఆడించాడు.

"దొంగవెధవ! వాడి దుంపతెగ! కాసుకుని వుంటానని యేడిచాడు వెధవ! నా చేతికి చిక్కితే వాడి తాళం పడతాను."

"వాడిమీద ధుమ ధుమ లాడితే ప్రయోజనమేమిటి?" అంటూ అడ్డం వచ్చాడు వాసిలీ. "వాడేం చెయ్యగలడు చెప్పు? నువ్వు వాడిని అక్కడ వుండమన లేదు. ఫోర్మన్ వుండమన్నాడు. అందుచేత ఆ తిట్టేదేమిటో ఫోర్మన్‌ని తిట్టు. వాడి కింకా గుండె బెదురు తగ్గినట్లు లేదు."

హఠాత్తుగా డాబా దగ్గిర గంట మోగింది. అందరూ అటు వైపు తిరిగి ఏక కంఠంతో "యజమాని గారు" అని నిట్టూర్చారు.

# 8

# మహామహుండు

ఏమీ పొరపాటులేదు, యజమానే! డాబామీద పరిచిన పర్షియా తివాసీమీద, ఉన్ని కోటుమీదికి వేలాడుతున్న గడ్డం సవరించుకొంటూ నిలబడ్డాడు. కార్మికులు దబదబా నెత్తి మీది టోపీలు తీసివేసి నమస్కరించారు. ఆ నమస్కారాలు అందుకుంటూ గంభీరంగా, దయా దాక్షిణ్యాలతో తల పంకించాడు. ఆయన పక్కన శరీర భారం ఒక పాదం మీదనుంచి ఇంకో పాదం మీదికి మార్చి మోపుకుంటూ ఒకజనరలు నిలబడ్డాడు. నీలి మొహం గుండెలమీద ఎర్రటి ముడతలు, బుజాలుమీద బంగారు చిహ్నాలుగల పెద్ద కోటు తొడుక్కున్నాడు. వారివెనక సాధ్యమ యినంతవరకు ఎవరిదృష్టినీ ఆకర్షించకుండా ఉండాలని యత్నిస్తూ మానేజరు, ఫోర్మన్, పోలీసు యినస్పెక్టరు, కత్తులు, రివాల్వరు పక్కన తగిలించుకుని తదితర అధికారులు నిలబడ్డారు.

వాసిలి మెల్లిగా ఈల వేసాడు.

"అటు చూడండి! మనకి మహోపకారం చేస్తున్న వీరు గవర్నర్ని కూడా యీడ్చుకు వచ్చారు. యింకేం బాణసంచా మోగిపోతుంది. యిక మహత్యం చూపెట్టే దేవతా విగ్రహాలను పండగనాడో, యుద్ధం ప్రకటించిననాడో, పూచకోత కోసేనాడో గాని బయటికి తియ్యరు!"

ఒక పిల్లవాడు రొప్పుకుంటూ రోడ్డుదగ్గరనుంచి పరుగెత్తు కుంటూ వచ్చాడు. తప్పుడు హెచ్చరిక చేసింది ఈ కుర్రవాడే!

"కొసక్కులు వస్తున్నారు" అని దగ్గరగా వున్న వ్యక్తి చెవులో చెప్పి వెళ్ళిపోతుండగా 'సిపాయి' పట్టుకుని, "మళ్ళీ అబద్ధాలు చెపుతున్నావా ? నీ గొంతుక నులుమేస్తాను" అన్నాడు.

"అబద్ధం కాదు, చచ్చినంత ఒట్టు ! ఆగేటులోంచిచూస్తే మీకే తెలుస్తుంది."

కాని అంత అవసరం పట్టలేదు. 'సిపాయి' శ్రమ పడనక్కరలేకుండానే, రోడ్డు పక్కగా పలచని మంచుమీదనుంచి తాపీగా వస్తున్న గుర్రాల డెక్కల చప్పుడు, కోసక్కు నాయకుని అధికారదండం గణ గణ ధ్వని, కంచుతాళాలసవ్వడి, ఆవేశ పూరితమయిన కోసక్ పాట వినవచ్చాయి.

"వెధవ తొత్తుకొడుకులు ! కోసక్ లు !"

పటాలం గేటుదగ్గర ఆగింది. ముందుభాగంలో ఇద్దరు అధికారులు బాకావాడు, పాటకులు ఉన్నారు. ఇంకో అధికారి పటాలం పక్కన స్వారీ చేస్తున్నాడు. అందరూ ఎత్తుపాటి బొచ్చు టోపీలు పెట్టుకున్నారు. ఆటోపీల కిందనుంచి జుట్టు వేలాడుతోంది. ఆ కోసక్కులు కార్మికుల వంక ఓరచూపు చూశారు. వారి వీపుల మీద తుపాకులు ఊగుతున్నాయి. రికాబులకు తగిలి విచ్చుకత్తులు ఖణీలు మంటున్నాయి. తోలు చుట్టిన కొరడాలమీద వారివేళ్ళు ఆడుతున్నాయి. మాంచి బలిష్ఠమయిన గుర్రాలను కదను తొక్కిస్తూ బారులు బారులుగా కోసక్కులు మలుపు తిరిగారు. మిల్లు వైపుకే వెడుతున్నారనడంలో సందేహం లేదు.

కొజుబా కనులు కుంచించుకుని కోసక్కులను జాగ్రత్తగా చూసాడు.

"యెప్పుడూ యింతే!" అని మెల్లిగా గొణిగాడు. "గవర్నరు యెక్కడుంటే అక్కడ వీళ్ళు తయారవుతారు. కోసక్కులు యెక్కడవుంటె అక్కడ కొరడాలు ఆడతాయి. మనం శీతాకాలం దుస్తులు – గొర్రె తోలుకోట్లు అవీ యివీ వేసుకోవడం మంచిదే అయింది. కొరడాతో నాలుగు వుతికినా అంతగా బాధించదు."

ఒక సేవకుడు గబగబా గట్టిగా ఫ్యాక్టరీ గంట తాడు లాగాడు. మళ్ళీ గంట గణగణ మోగింది. ప్రోషిన్ తలమీది ఉన్ని టోపీ తీసి శిలువగుర్తు వేసాడు. ఇలా ప్రోషిన్ దైవభక్తిని ప్రకటించగానే గవర్నరు టోపీ తీసివేయకుండానే పొట్టపైన శిలువ గుర్తు వేసుకున్నాడు. వారి వెనక నిలబడి ఉన్న అధికారులుకూడా వారిని అనుకరించారు. ఆవరణలోని కార్మికులు టోపీలు తీసి వేసారు. ఇక స్త్రీలు వంగి వంగి భక్తి తాత్పర్యాలతో నమస్కరించారు.

'సిపాయి' కూడా పెద్ద శిలువగుర్తు వేసి వాసిలీకేసి కను గిలిపాడు.

"శిలువ గుర్తు వేసాను. అయితే పస్తు పడుకోకుండా అందేం నన్ను రక్షించదు. నువ్వు ప్రార్థన చెయ్యడంలేదేం? వొక దేవతా విగ్రహం నిను రక్షించ లేకపోతే యీ విగ్రహ రాశి యావత్తూ కలిసి నిను రక్షించ వచ్చు. శిలువ గుర్తు వేయడం యెలానోకూడా మరిచేబోయావా యేం?"

వాసిలీ మాటకి మాట అప్పగించాడు.

"మత దీక్ష పుచ్చుకోవడం యెరగను! నే నెలా పుట్టానో కూడా పూర్తిగా మరిచేపోయా!"

మాటకి మాట! కాని వాసిలీ కళ్ళు తీక్షణతతోను, ఆదుర్దాతోను కూడుకుని ఉన్నాయి. ప్రోషిన్ మీదే వాటిని నిగిడించాడు.

"సోదర క్రైస్తవులారా!" అంటూ ప్రారంభించాడు ప్రోషిన్ తనస్వంత భోజనశాలలో మాట్లాడు తున్నట్లు. కార్మికులు నోరు మెదపకుండా రాతి బొమ్మలలా నిలబడ్డారు. ప్రోషిన్ కంఠ స్వరం ఆ ఆవరణ మారు మూలలకి కూడా వినిపిస్తోంది." అశుభ వార్త తీసుకురావలసి వచ్చింది. మాటల్లో యెలా పెట్టాలో తెలీడం లేదు. దానిని వర్ణించ డానికి మనకు దైవం ప్రసాదించిన భాషలో మాటలే దొరకడంలేదు. చెడువార్త మనకి, రష్యావారికి

కొత్తది. అందుచేత విదేశీమాట వుపయోగిస్తాను. భగవంతుడి సంకల్పం అలావుంది. యిపుడు 'క్లిష్టపరిస్థితి' వచ్చిపడింది. "వేలితో బెదిరిస్తూ," వ్యాపారం స్తంభించిపోయింది. గిడ్డంగులనిండా సరుకే! కాని కొనేవాళ్ళు కరువయినారు. జవుళి పరిశ్రమకు బ్యాంకులో అప్పులు మంజూరు చెయ్యడంలేదు. బ్యాంకువారిని నిందించ డానికి వీల్లేదు. నిందించి ప్రయోజనమూ లేదు. దాచకుండా చెప్పాలంటే యీమిల్లు నాకు నష్టం తీసుకురావడమేకాదు దివాళాతీసే స్థితికి దారి తీస్తోంది. బాగా ఆలోచించాను. మిల్లుకట్టి వెయ్యడం వొకటే పరిష్కారమార్గంగా కనిపించింది."

జనంలో కదలిక వచ్చింది. ఒకవైపుకి ఊగి మళ్లీ యథాప్రకారం బొమ్మలలా నిలబడ్డారు. ప్రోషిన్ తల వంచుకుని నిట్టూర్చి చేతులు జాపాడు.

"యీ చిక్కులోనుంచి బయట పడడానికి యీమార్గం వొకటే కనిపిస్తోంది. కాని మిమ్మల్ని తలుచుకుంటే కడుపు తరుక్కుపోతోంది. విదేశీ మిల్లులలాగా కాకుండా నామిల్లు చాలాకాలం నుంచీ పనిచేస్తోంది. అంతేకాదు నామిల్లు ప్రభుత్వం అదుపులో లేదు. మీ తాతలు యిక్కడ పనిచేసారు. మీ తండ్రులు, తల్లులు యిక్కడ పనిచేసారు. మీరూ యెంతోకాలంగా యిక్కడ పని చేస్తున్నారు. మనం స్నేహితులలాగా మెసలుకున్నాం. మిమ్మల్ని పనిలోనుంచి తొలగించి వీధిలో పారేయాలనే ఆలోచనే భరించలేకపోతున్నాను. పాపం! మీరు మీ పిల్లల్ని వేసుకుని యెక్కడకి పోగలుగుతారు" అన్నాడు.

కార్మికులలో ఒకరూ గొణగలేదు. మాట్లాడితే పోట్లాట వేసుకునే స్త్రీలుకూడా రాతిబొమ్మలలా నిలబడిపోయారు. ప్రోషిన్ ఎంత ఘోరమయినా చేయగలడని వాళ్ళకి తెలుసు. కాని మిల్లు మూసివేస్తాడని కలలోకూడా అనుకోలేదు. కొజూచా సహితం ఆశ్చర్యపడిపోయాడు.

"యేంతలపెట్టాడో? యీా రాక్షస వెధవపని పట్టించే ద్దామా? యేవంటావ్?" అని వాసిలీ అన్నమాటలకు జవాబివ్వ లేదు.

ప్రోషిన్ జనాన్ని అటునుంచి ఇటు గద్దలాగా ఒకసా చూసాడు. ఎవరూ నోరు మెదపకపోయేసరికి మందహాసం చేసాడు.

"నాకు దైవభీతి యెక్కువ" అంటూ మళ్ళా కొనసాగిం చాడు, హఠాత్తుగా స్వరంస్థాయి హెచ్చింది. ఫాదరీ లాగా మాట్లాడ సాగాడు. "అందుచేత నేను యెంతనష్టం వచ్చినా భరిద్దా మని నిశ్చయించుకున్నాను. ఇంతత్యాగం చేస్తున్నందుకు భగ వంతుడు నామీాద దయదలచి సర్వనాశనం కాకుండా రక్షిస్తాడని నమ్ముతున్నాను. పూర్వంలాగానే మీాకు పని చూపుతాను. ప్రస్తు తానికి సైనిక దుస్తులకు కావలసిన గుడ్డ మొదలయినవి వుత్పత్తి చెయ్యాలి. నష్టంవస్తే, రానీ దేశంకోసం భరిస్తాను. అందుచేత మీా జీతాలు తగ్గించాలసి వుంటుంది." అన్నాడు ఠీవిగా.

"యీా ముక్క చెప్పడానికా యింతసేపూ వుపన్యాసం దంచింది! జలగవెధవ!" అన్నాడు వాసిలీ బరువు తొలగిపోయి నట్లు, "వీడి యెత్తేవిటో యిప్పటికి తెలిసిపోయింది."

ప్రోషిన్ కంఠస్వరం కర్కశంగా, దురహంకార పూరి తంగా తయారయింది.

"పాత జీతాలకే అంటిపెట్టుకుని వుంటే, మిల్లు నడపడం సాధ్యం కాదు. నాకు అక్షయపాత్ర చేతికి వస్తుంది. మీాకు పని పోతుంది. కనీసం రోజుకు అయిదు కోపెక్కులయినా తగ్గించేయాల్సి వుంటుంది."

జనం జనంఅంతా కంపించిపోయారు. ఆందోళన అంతరించి దాని స్థానంలో విపరీతమయిన కోపం ప్రవేశించింది. మిల్లు అప్పుడి కపుడు మూతపడి పోవచ్చుననే ఆలోచన వల్ల కలిగిన ప్రమాన్పాటు మటుమాయ మయింది. కుటుంబాలను తీసుకుని యెక్కడికి వెళ్ళ గలరు? అది జనవరి. చేతిలో ఉన్న నాలుగు కోపెక్కులు ఉగా

దికి ఖర్చయిపోయాయి. ప్రోషీ మిల్లు మూసివేయవలసి వస్తుందనేసరికి కాళ్ళకింది భూమి బద్దలయినట్లు, తాము భూగర్భంలో పడిపోయినట్లు వారికి అనిపించింది. మంచి గుండె నిబ్బరంగల వారుకూడా హడిలిపోయారు. కాని జీతాలను గురించిన సమస్యేగా, తగాదా పెట్టవచ్చు.

"జీతాలలో యింకా కోతపెడితే యెలా ?" అని వాసిలీ, ప్రోషీ ముగించక ముందే, బిగ్గరగా ఎలుగెత్తి అరిచాడు.

"ఆకలితో మాడి చస్తున్నాం ! రోజుకు పదహారుగంటలు చాకిరీ చేస్తుంటే, మీ రిచ్చేది యింతాచేస్తే నెలకి యెనిమిది రూబుళ్ళు ! అది చాలకే నానాఅవస్థలూ పడుతున్నాం !"

"అవునవును !" అని 'సిపాయి' డాబావైపుకి దోవ చేసుకుంటూ గర్జించాడు. "నువ్వు యేం చేస్తున్నావో తెలుసా ? మా నెత్తురు పీల్చేస్తున్నావ్. పింజారివెధవ !"

జనం కాళ్ళతో నేలను తన్నుతూ ముందుకు తోసుకు వెళ్ళారు. వందలాది కేకలు గాలిలో మోగిపోయాయి.

"అవును. మా వంట్లో సత్తువ క్షీణించిపోయింది !"

"సరిగా యెనిమిది రూబుళ్ళుకూడా ముట్టడంలేదు !"

"ఆడవాళ్ళకి రోజు కూలీలకి రోజుకి పదిహేను కోపెక్కులే యిస్తున్నారు !"

"ఆ కాస్తయినా చేతికి వస్తుందా అంటే, రాదు. ఫ్యాక్టరీ షాపులే మింగేస్తున్నాయి."

"రెట్టింపు ధరలు గుంజుతున్నారు !"

"అయిదు కోపెక్కులు కోతపెడితే, యిక మాకు మిగిలి చచ్చేదేవుంది ?"

వెనక ఉన్న కార్మికులు ముందువారిని తోసారు. హఠాత్తుగా గుంపు గుంపంతా ముందుకు చొచ్చుకు పోయింది. పేల్చిన

తుపాకీనుంచి వెలువడే పొగలాగా అరుస్తున్న వారి నోళ్ళలోనుంచి చిన్న చిన్న ఆవిరిమేఘాలు పైకి లేచి విహరించసాగాయి. గవర్నరు ఒక అడుగు వెనకకు వేసాడు. అతని మొఖం ఇంకా నీలిమ తాల్చింది. పోలీసు ఇనస్పెక్టరు కత్తిమీద చేయి వేసుకుని ముందుకు వచ్చాడు.

తారాస్ మెట్లకింద సిద్ధంగా ఉన్నాడు.

"యీ ఛండాలపు నేత మూలంగా నెత్తురు కక్కుకుంటు న్నాం." అని అరిచాడు. అతను క్షవరం చేయించుకుని చాలా రోజులయిందేమో గడ్డం మాసిపోయింది. "యిదిగో, చూడు !"

చిక్కగా, ఎర్రగా కళ్ళె వెళ్ళి ప్రోషిన్ పాదాల దగ్గిర పడింది.

జనరల్‌కు అసహ్యంవేసి తల కుంచించుకుని అతనికేసి ఓర చూపు చూసాడు. బాగా బలిసిన పిల్లి ఎలుకను కనిపెట్టి చూడ డానికి నడుం వంచినట్లు పోలీసు ఇనస్పెక్టరు కండబట్టిన నడుం వంచాడు. పొడుగుపాటి నల్లకోట్లు తొడుగుకున్న పోలీసులు డాబా మీదనుంచి కింది మంచుకుప్పల మీదికి దూకారు.

కాని ప్రోషిన్ మాత్రం ఉదారభావం కోల్పోయినట్లు కని పించ లేదు. బాగా పుష్టిగా ఉన్న చేయి పైకెత్తాడు. పోలీసు ఇనస్పెక్టరు టంచనుగా నిలబడి పై అధికారుల వంక చూసాడు.

"దీనినిబట్టి మేమేం అర్థం చేసుకోవాలి ?" అని అడిగాడు టారాస్ మీదుగా చూస్తూ, "మీకు అంగీకారం కాదను కుంటాను."

"కొత్త జీతాలకు" టారాస్ జనంకేసి నలువేపులా చూసాడు. కోపంతో ముకుళించుకు పోయిన వాసిలీ మొహం కని పించింది. "జీతం భత్యం లేకుండా నీ బొజ్జ పెంచడానికి, ఊహుం– అంగీకరించను."

"సరే. మంచిది. బలవంత మేమీలేదు." అని ప్రోషిన్ సౌమ్యంగా నిట్టూర్చి గవర్నరు కేసి చూసాడు.

"యే పరిస్థితిలోనూ బలవంతపెట్టేది లేదు. అంగీకారం కాకపోతే, నీకు రావలసిందేదో తీసుకుని చక్కాపో. యివాన్ జకరోవిచ్ ..."

మానేజరు అప్పటికే ప్రోషిన్ మోచేతి దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. పిలవగానే యజమాని దగ్గరికి జరిగాడు. ప్రోషిన్ మందహాసం చేస్తూ ఆ 'సిపాయి' వంక వేలుపెట్టి చూపించాడు.

"ఆఫీసుకు వెళ్ళి యీ 'సిపాయి'కి రావలసినదేమన్నా వుంటే యిచ్చి పంపించేసేయి."

మానేజరు మెట్లు దిగాడు. పోలీసు ఇనస్పెక్టరు కూడా అతని వెనకనే బయలుదేరాడు. నడుం పటకాలు, కోట్లు సర్దుకుంటూ పోలీసులు మెట్లకింద సిద్ధంగా నిరీక్షిస్తున్నారు.

ఆ 'సిపాయి' పాలిపోయిన పెదవులు విసుగుతో నొక్కుకుంటూ ఆఫీసువైపుకి బయలుదేరాడు. రెండడుగులు వేయగానే వాసిలీ అతనిచేయి పట్టుకొని, "ఉహుం-ఆగు. నీ వొకడితో యీ విషయం పరిష్కారం కాదు. నీ వొకడి తరఫునే కాదు మా అందరి తరఫునా మాట్లాడుతున్నావు. నువొకడివే జవాబియ్యడానికి వీల్లేదు."

"నువ్వానా?" అని మానేజరు జనంకేసి చూసాడు భయపడుతూ. "వూరుకో, లేకపోతే నిన్నూ సాగనంపేయాల్సివస్తుంది."

కాని వాసిలీ వెక్కిరింపుగా తల పంకించాడు.

"సరే, అదీ చూద్దాంగా! యెవరు యెవరిని సాగనంపుతారో! నీ సంగతికూడా తేల్చేస్తాం, కబడ్దార్ ..."

పక్కన ఉన్నవారికేసి చూసి మళ్ళీ తల పంకించాడు. కార్మికులంతా ఒక్కసారిగా మాట్లాడడం ప్రారంభించారు. ఇక డాబామీద తొందర తొందరగా గుసగుసలు సాగాయి. పందెపు కోడివంటి ఒక పొడుగాటి అధికారి భూమి చీల్చుకుని పైకి వచ్చినట్టు జనరల్ పక్కన ప్రత్యక్షమయాడు. జనరల్ అరచేయి నోటికి

అడ్డం పెట్టుకుని ఏవో ఆజ్ఞలు జారీచేసాడు. ఆ అధికారి సాల్యూట్ చేసి నల్లగోడ పక్కగుమ్మంగుండా త్వరత్వరగా నిష్క్రమించాడు.

"కోసక్కులను తీసుకురావడానికి వెళుతున్నాడు. కోసక్కులు !" అని ఆ నోటినుంచి ఆనోటికి పాకింది.

రణగొణధ్వని అణిగిపోయింది. కార్మికులు ఒకరొకరికి దగ్గిరసా చేరుకున్నారు. ఆవరణలోకి ఏ క్షణంలో నయినా బొబ్బలు పెడుతూ కోసక్కులు గుర్రాలమీద వచ్చిపడతారని భావనతో కొంతమంది గేటుకేసి చూడసాగారు. చేతులు ఎక్కువగా తిప్పడానికి వీలుగా రికాబులలో నిలబడి, రొమ్ములు విరుచుకుని కోసక్కులు కళ్లాలు వదిలేస్తారు. ఇక చూడండి, గుర్రాలు మనుషుల మీద విరుచుకు పడతాయి !

ప్రోషిన్ డాబా అంచుకు వచ్చి నిలబడ్డాడు. మొహంలో చిరునవ్వు లేదు. ఫాలభాగం ముడతలు పడింది. మాట్లాడుతూంటే ఇంతివరకు బయటపడని పొడుగాటి పచ్చటి పన్ను బయటపడి కట్టుకధలలోని భయంకర మాంత్రికుని తలపింప జేస్తోంది.

"యేమిటీ పిచ్చివాగుడు ?" అన్నాడు. "నా వుద్దేశం చాలా ప్రశాస్తమయింది. కాని గవర్నరుగారిముందు జరిగిందేమిటి? అల్లరి ! యిందులో పెద్ద తగాదా పడడానికేముంది ? వున్న పరిస్థితి యేమిటో తెలియజేయడం నావంతు. నా షరతులు అంగీకారం అవుతాయో కాదో తేల్చుకోవడం మీవంతు. నాకోసం పని చెయ్యమని యెవరినీ నేను బలవంతం పెట్టడంలేదు, మీకు సరిపడదూ, దయచెయ్యండి ! మీ పనివాళ్ళు యెంత యెక్కువమంది వెళ్ళిపోతే నా పరిస్థితి అంత మెరుగవుతుంది. వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నారా, సరే. నా ఫ్యాక్టరీ బారకాసులలోంచి మీ బొచ్చెలతోసహా సమస్తమూ తీసుకుని లేచిపొండి. పని చేయడానికి బుద్ధిపూర్వకంగా నిరాకరించేవారు బారకాసులలో వుండడానికి చట్టం వొప్పుకోదు, కావలసివస్తే గవర్నరుగారిని అడిగిచూడండి! వారూ యీమాటే అంటారు. ఊఁ-పొండి, వెళ్లిపొండి."

"చలిలో కట్టుబట్టన్నా లేకుండానే? మా పిల్లల్ని మొల మీద బట్టపోగన్నా లేకుండా మంచులోకి తీసుకుపోవాలనా మీ కోరిక! యిదేనా మీ వుద్దేశం?"

ఈ మాటలు జనంమధ్యనుంచి వెలువడి స్త్రీల పెడబొబ్బ లతో అణగారి పోయాయి.

"వచ్చేస్తున్నారు!" అని ఎవరో గేటుదగ్గిర నుంచి కేక వేసారు. గేటుకు దగ్గిరగా ఉన్నవారు నైదోలగారు.

మిఖల్‌చక్ హఠాత్తుగా జనం ముందుకు వచ్చి పొడుగాటి చేతులు ఆడించుకుంటూ "నిశ్శబ్దంగా వుండండి. యజమాని గారు మాట్లాడాలని అనుకుంటున్నారు." అనిచెప్పి తిరిగీ డాబా మీదికి చక్కాబోయాడు.

జనం మౌనం వహించారు. ఒకరినొకరు ఒత్తుకుంటూ నిల బడ్డారు.

"యేమిటిది – మా మెడకి వురా?"

"వురేమిటి? యెవరా అన్నది?" వేయికి పైగా ఉన్న జనంలో ఈ మాటలు అన్న మనిషిని కనిపెట్టడానికా అన్నట్టు ప్రోపిన్ మెడ ముందుకు చాసాడు, డాబామీది అధికారులంతా మెడలుచాచి చూసారు. "వురెందుకు? మీరు స్వేచ్ఛా జీవులు, మీ యిష్టంవచ్చినట్టు మీరు నడుచుకోవచ్చు. జారుగారి దయవల్ల మీకు దాసత్వం పోయింది. మీకుమీరే యజమానులు. బుద్ధి పూర్వకంగా మీరు సమ్మెదారులతో చేతులు కలుపుతున్నారు."

"మేము సమ్మె చేయడంలేదు, లేదు" అని భయపడిపోయిన ఒకతను అరిచాడు. అలా అరిచింది స్త్రీయో, ముసలివాడో చెప్పడం కష్టం.

ఈ తడవ గవర్నరు మాట్లాడడానికి ఉపక్రమించాడు. కదల కుండా మెదలకుండా నిలబడి కంగారు పడ్డాడు. ఎలాగయితేనేం తమాయించుకుని హెచ్చుస్థాయిలో అన్నాడు.

"వీళ్ళతో మాట్లాడుతూ కాలం వృథా చేసుకోకు, సెర్జీ పోర్ఫిర్యేవిచ్ ! యిటువంటివాళ్ళతో వ్యవహారించడంలో వొకటే మార్గం వుంది."

"అవును. మీరుచెప్పింది సరిగ్గావుంది." అంటూ తల పంకించాడు ప్రోషిన్. "వాళ్ళ మొహంకూడా చూడకూడదుకాని, పాపం! మంచివాళ్ళు, కాకపోతే వట్టి అజ్ఞానులు. మనం దయ చూపకపోతే భగవంతుడు మాత్రం యేంజేస్తాడు! సరే మీరు చెప్పినట్లు యింతటితో ముగించేద్దాం."

జనాన్ని పరికించిచూసి మొదట వరసలో ఉన్న ఒక బక్క పల్చటి నేత కార్మికునికేసి చూపించాడు. తక్షణమే అతనిచుట్టు వున్న జనం కుష్టువాడిని చూసి తప్పుకున్నట్లు తప్పుకున్నారు.

"నీ పేరేమిటి?"

"మైకేల్ బెర్జెనాయ్" అని అతను గొణిగాడు. "కొద్దిజీతం మీద పని చేయటానికి వొప్పుకుంటావా?" బెర్జినాయ్ పక్కనున్న వారికేసి చూసాడుగాని ఒకరూ అతనికేసి చూడలేదు, అందరూ తలలు వంచుకుని నేలకేసి చూస్తున్నారు. అతని పక్కనున్న ఒక స్త్రీ మోకరిల్లి మెల్లగా నిట్టూరుస్తూ.

"మిషా-మిష్-పిల్లల్ని కాపాడు-పిల్లలమీద దయచూపు-మైకేల్-పసిగుడ్డులు..."

మైకేల్ తిరిగీ చుట్టూ చూసాడు.

"యేంచేద్దాం, భాయి!"

'నీకు నువే నిర్ణయం చేసుకో. నీ అంతరాత్మ చెప్పినట్లు చెయ్యి." అని నేలకేసి చూస్తూ ఎవరో అన్నారు.

"నా అంతరాత్మా!" అంటూ ఆ నేత కార్మికుడు అరిచి, గుండెలమీది చినిగిన చొక్కా ఇంకా చింపివేసాడు. "ఆ విధంగానే నిర్ణయించుకోవలసి వుంటే, సరే - యిదిగో,. నా నెత్తురు తాగు, రాక్షసుడా! నేను అంగీకరించను"

''మై-ఖే-ల్ !''

తక్కిన స్త్రీలు కూడా పెద్దపెట్టున ఏడవసాగారు. వారి హాహాకారాలలో ప్రోషిన్ మాటలు వినిపించకుండా పోయాయి. ఇంకో నేత కార్మికుడు అనాలోచితంగా తల పైకెత్తేసరికి ప్రోషిన్ అతనిని వేలితో చూపించాడు. వాసిలీ ఏదో కేకపెట్టాడు.

ప్రోషిన్ చూపించిన కార్మికుడు తూలుకుంటూ డాబా మీదికి వెళ్ళాడు. కాని ఇంకో కార్మికుడు, ఎవరూ అతనిని ఎరగరు, ముందుకు తోసుకువెళ్ళాడు. వెనకనుంచి ఒక పోలీసు నేర్పుగా మోచేయి దగ్గర అతనిని పట్టేసి మళ్ళా వదిలేసాడు.

''నన్ను చంపొద్దు బాబో'' అని నేత కార్మికుడు రొప్పుతూ అన్నాడు. ''నువు బలంగలవాడివి. మా గుండెలు చీల్చడం మానేసెయ్. మేము అంగీకరిస్తాం.''

డాబాదగ్గిరనుంచి గేటు దాకా, మొదటి మనిషినుంచి ఆఖరివాడిదాకా అంతా వణికిపోయారు. ''మేము అంగీకరిస్తాం'' అన్న రెండు మాటలు ఆ నోటినుంచి ఆ నోటికి పాకిపోయాయి. కార్మికులంతా అంగీకరించారో లేదో చెప్పడం కష్టం.

టూరాస్ తల పైకెత్తాడు.

''కామ్రేడ్స్ !''

కార్మికులలో సంచలనం కలిగింది. కేకలు వేసుకుంటూ, బారలు చాపుకుంటూ ముందుకు చొచ్చుకు పోవాలని ఒకరు యత్నించారు. కాని స్త్రీల హాహాకారాలు హృదయ విదారకంగా ఉన్నాయి.

''అందరం అంగీకరిస్తాం.''

ఫ్యాక్టరీ గేట్లకి ఎదురుగా నిలబడ్డ కోసక్ గుర్రాలు కలత చెందాయి. పోలీసు ఇనస్పెక్టరు టూరాస్‌ని బుజంమీద పొడిచి

''సరే-రా ! మీ ఆట కట్టింది. యిక మా ఆట చూడు'' అన్నాడు.

వాసిలీ టారాస్ కేసి తేరిపార జూచాడు. కాని టారాస్ కళ్ళల్లో "యేమీ చెయ్యొద్దు. యేదో యిలా జరిగిపోనీ" అనే హెచ్చరిక స్పష్టంగా గోచరించింది.

ప్రోషిక ఈసారి హాటు తీసివేయకుండా శిలువ ఆకారం వేసాడు. "అలా అయితే సరే. ముందే యీ యేడుపు యేడిస్తే బావుండేదిగా! ఊఁ- నిర్ణయించుకున్నట్లైనా సరే, మీ మీ యిళ్ళకి పొండి. గవర్నరు గారిని చాలాసేపటి నుంచి యిక్కడ అట్టే వుంచాం. అదృష్టవశాత్తు వాతావరణం చక్కగా వుంది."

"లోపలకి దయచేయండి" అన్నాడు మర్యాదగా వంగి నమస్కరిస్తూ. "ఫలహారం చేదాం."

... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ...

"చివరి కింతేనా ?"

ఒక్కొక్కరూ వెళ్ళిపోతూంటే కళ్ళప్పగించి చూస్తూ ఇరీనా పెద్దగా నిట్టూర్చింది. వెక్కిరింతగా వెనక కాళ్ళమీద నుంచున్న 'గాగరాలో ఎలుగుబంటు' కింద, తెరచుకుని ఉన్న గేటు దగ్గరగా కోసక్కులు ఇంకా కళ్ళాలు బిగపట్టి సిద్ధంగా ఉన్నారు.

కొజుబా కోసరం ఇరీనా నలువైపులా చూసింది. పోలీసు టారాస్‌ను తీసుకుని పోతుంటే వాసిలీ ముందుకు తోసుకువచ్చాడు. వెనువెంటనే కొజుబా కనుబొమలు ముడుచుకు పోవడం ఇరీనా గమనించింది. అతను ముందుండి సమ్మెకు పిలుపు ఇస్తాడని ఆశిం చింది. అతని సంగతి అందరికీ తెలుసు. అందరికీ అతనంటే మంచి గౌరవం ఉంది. కాని అతడు ముందు నిలబడలేదు, సమ్మెకు పిలుపు ఇవ్వలేదు.

ఆమెకళ్లు మూసుకుంది. కొజుబా ఆమెని పిలవడం వినిపిం చింది. అతని కంఠస్వరం యథాపూర్వంగా ప్రశాంతంగా ఉంది.

ఆమెదగ్గరికి నిబ్బరంగా వచ్చి "యిక్కడున్నావేం? యిక్కడికి రావలసిన పనిలేదే? నిను కనిపెట్టి చూస్తారు. బడిపంతులమ్మవని దయతలుస్తా రనుకోకు. యేం చెయ్యమంటావ్? తగు సమయం రాకముందే చర్యకు పూనుకోవాలనా?"

ఇరీనా కొజుబా కేసి చూసి ఉండబట్టలేక కోపంతో, "చర్య! యేమిటా చర్య? నువే చూసావుగా – గొర్రెలమందలాగా..." అని మొహం చేతితో కప్పుకుంది.

"గొర్రెలమంద లాగానా? యెలా?" అని కొజుబా అడిగాడు. అతని కంఠస్వరం కర్కశంగా, ఉదాసీనంగా ఉండేసరికి ఇరీనా హృదయం కుంగిపోయింది.

తాను ఏదో పొరపాటుమాట, ఏదో దారుణమయిన మాట అన్నానని గుర్తించింది. మొహం ఎర్రబారింది. కొజుబా చొక్కా చేయి పట్టుకుని "క్షమించు. నా–నాగుండె మండిపోయి యేదో అన్నాను. నా వుద్దేశం అదికాదని నీకూ తెలుసుగా. నిజంగా వీళ్లు యెటువంటివాళ్లో నాకు తెలుసు. లొంగిపోతారనుకోలేదు."

"కోసక్కులువాళ్ళని కొరడాలతో చావగొట్టి అంగీకరింపజేయలేదే!" అన్నాడు కొజుబా కర్కశంగా, కనులు కుంచించుకుంటూ. "ఉహుం – ఆ విధంగా జరగలేదు."

"వాసిలీ, టారాస్ విడుదలయేట్టు చూడాలి." తొందర తొందరగా అంది ఇరీనా, ప్రశాంతంగా మామూలు వ్యవహార ధోరణిలో మాట్లాడాలని యత్నిస్తూ.

"యీ సందర్భంలో వెళ్ళి గస్టిల్యోవ్‌తో మాట్లాడదాం. బాగా ఆలోచించి ఒక నిర్ధారణకి రావాలి."

పక్కనుంచి వెళుతున్న ఒక యువకుని రమ్మని సైగచేసి కొజుబా, "చూడు, స్యోమా! మామూలుచోటే, డ్రయింగ్ షెడ్డులో అరగంటలో అందరూ కలుసుకోవాలని చెప్పు. మేమూ వస్తున్నాం."

స్యోమా వెళ్ళిపోగానే ఇరీనా కేసి తిరిగి "గస్టిల్యోవ్ దగ్గిరికి వెళ్ళాలనా ?" అన్నాడు కొజుబా. తిరస్కార సూచకంగా ఎడమకన్ను కుంచించి, ఒక కనుబొమ్మ పైకెత్తాడు. "సరే, వెళ్ళినందువల్ల మరేం నష్టంలేదు. యింకా అరగంట వ్యవధి వుంది. ప్రోషిన్ చెప్పినట్లు వాతావరణం చక్కగా వుంది."

## 9

## ఒకనాటి మిత్రులు

ప్రోషిన్ జీతాలకోత ప్రకటించగానే ఇరీనావచ్చి స్థబ్దుగా కూర్చున్నందుకు దుయ్యబట్టుతుందని తెలిసికూడా గస్టిల్యోవ్ ఆమెకోసం నిరీక్షించాడు. అది 'స్థబ్దత' కాదు, సరిఅయిన సోషల్ డెమాక్రాటిక్ పంథాఅని ఆమెకు నచ్చచెప్పడం తనతరం కాదని కూడా అతనికి తెలుసు. ప్రోషిన్‌తో రాయబారాలు ప్రారంభం కాగానే బుద్ధిపూర్వకంగా లేచి చక్కావచ్చాడు. అదంతా విస్పష్టంగా కనిపిస్తూనే ఉంది. కాని విశదీకరించి ఆమెకు చెప్పాలని చూస్తేమాత్రం—!

జీతాలకోత విషయంలో ఆమెతో సంభాషణ అతనికి రుచించలేదు. వారిద్దరికీ ఈమధ్య కలహం సర్వసాధారణ మయిపోయింది. ఆమె అతని గుప్పిటలోనుంచి తప్పించుకుంది. మొట్టమొదటగా సంస్థలో చేరినపుడు ఎంత అణకువగా ఉండేది, ఎంత నమ్మకంగా ఉండేది, కిమ్మనకుండా చెప్పినదానికల్లా తల సంతోషంతో ఊపేది. ఇదంతా తలుచుకుంటే అతనికి ఆశ్చర్యం వేసింది. ఇక ఇపుడో - మాటకుమాటా అప్పగిస్తోంది.

గస్టిలోవ్ చిరచిరలాడుతూ గదిలో పచార్లు చేయసాగాడు. ఆగది అంటే అతనికి ఎంతో ఇష్టం. హాయిగా ఉంటుంది. అందుకే ఆగది చూసుకుని మురిసిపోయేవాడు. ఆ గదిలో అంతా ఒక క్రమపద్ధతిలో, శుభ్రంగా ఉంటుంది. అందులోని సామానుఎర్రటి కిటికీ తెరలదగ్గరనుంచి రగ్గుదాకా - చాలా విలువయినవి. చేతితో చేసిన ఆక్రోటుబీరువాలో వెన్నుమీద గిల్టు అక్షరాలు ముద్రించిన పుస్తకాలు వాటివాటి ఎత్తులను పట్టి నీటుగా అమర్చారు. ఆ పుస్తకాల ప్రసక్తి వచ్చినపుడల్లా, "యెక్కువగా లేవు గాని, వున్నకొద్దీ వుత్తమమయినవి" అనిచెప్పడం అతనికి ఇష్టం. ఇరీనాతో కయ్యం తప్పదు, చివాట్లు తప్పవు అని అనుకుంటూ నిరీక్షిస్తున్నాడేమో ఆగది అతనికి సంతోషదాయకంగా కనిపించలేదు.

సింహద్వారం మూసిన చప్పుడయింది. నడవలోనుంచి అడుగులచప్పుడు వినిపించింది. అడుగులు భారంగా ఉన్నాయి. ఇరీనావి అయిఉండవు. ఆమె గబగబా తేలికగా అడుగులు వేస్తుంది. లేకపోతే బూట్లు తొడిగిందా? అక్కడ సమావేశం తొందరలోనే ముగిసిందా యేం?

ఎవరో తలుపు కొట్టారు.

"రావచ్చు" అన్నాడు గస్టిలోవ్.

ఒక యువకుడు ప్రవేశించాడు. సన్నటి కోటు వేసుకుని, మడత హాటు పెట్టుకున్నాడు. చేతిలో ఒక సూటుకేసు ఉంది.

"హల్లో! వ్యాట్కాలో ప్రవాసం సంగతి మర్చిపోయావా యేం?"

ఆ యువకుని కళ్ళు తేటగా, దర్మాపూరితంగా ఉన్నాయి. విశాలమయిన నున్నటి నుదురు, చిన్న గడ్డం, ముక్కుమీద మచ్చ.

"బామన్!"

'బామన్' అని పెద్దగా ఉచ్చరించేసరికి ఆ ఆగంతకుడు గస్టిల్యోవ్ కేసి మందలింపు చూపు పరపి గిర్రున తల ద్వారం కేసి తిప్పాడు. తొందర తొందరగా గస్టిల్యోవ్ తనను తాను సమర్థించుకుంటూ,

"మరేం పరవాలేదు. యిక్కడ కొత్తవాళ్ళెవరూ లేరు. నేనుగాక యింకొకడే వున్నాడు. మహా చిత్రమయిన మనిషి. అతనికి మనసులో మనమంటే సానుభూతి. పైగా యిపుడు యింట్లో కూడా లేడు. సరే, యేమిటి యిలా వచ్చావు? యింతకాలం యెక్కడ వున్నావు? ప్రవాస శిక్షాకాలం ఆఖరయిందనుకుంటా? యిక నా విషయం, వ్యాట్కాలో ఆ సంవత్సరం గడిపిన తరవాత మళ్ళీ యథాప్రకారంగానే పనిచేస్తున్నా. కనిపిస్తూనే వుందిగా!"

"ఓ-అట్లానా?" అని బామన్ మందహాసం చేసాడు. అతని దృష్టి కిటికీ తెరలమీద, రగ్గుమీద, పుస్తకాల అలమారా మీద, వ్రాత బల్లమీద పడింది. వ్రాత బల్లమీద జంత్రికింద శుభ్రమయిన ఫైళ్ళబొత్తి ఉంది. "కాని చిలక యేదీ?" అని ప్రశ్నించాడు.

"వెనకటి గుణం మారలేదన్నమాట. వేళాకోళం పట్టించడానికి యెప్పుడూ నీకేదో వకటి దొరుకుతూనే వుంటుంది." అన్నాడు గస్టిల్యోవ్ వికటంగా మందహాసం చేస్తూ. "కోటు తీసెయ్యి-హాయిగా కూర్చో. యెక్కడినుంచి రావడం?"

"యెక్కడనుంచా?" అని బామన్ కోటు, హాటు చిలక కొయ్యకు తగిలించాడు.

"జినీవా అనే పట్టణంనుంచి"

"వలసనుంచే?" గస్టిల్యోవ్ చెక్కిళ్ళు ముడిచి వెనువెంటనే యథాస్థితికి వచ్చాడు. "నీవు-రావడం-చట్ట విరుద్ధంగా-"

"ఆc- అవును" అని బామన్ హుషారుగా తల ఆడించాడు. "యెందుకిలా అడిగావు? నేను ప్రవాసం నుంచి తప్పించు

కున్నపుడు నువు అక్కడే వున్నావుగా! చేతులు, మొహం కడుక్కో వచ్చా ?''

జవాబుకోసం నిరీక్షించకుండా నీళ్ళకుండీ దగ్గరికి వెళ్ళాడు. గస్టిల్యోవ్ కింది పెదవి కొరుక్కున్నాడు.

''నే నిక్కడ వున్నానని నీ కెలా తెలిసింది ?''

''మాస్కోలో కామ్రేడ్స్‌ని జవుళి మిల్లులలో యెవరితో నయినా పరిచయం చేయమని అడిగాను. వారు నీ పేరు చెప్పారు.''

''నా పేరూ విలాసం యిచ్చారన్నమాట'' అంటూ గస్టిల్యోవ్ కోపంతో భుజాలు పైకెత్తాడు. ''ఊం... యిదే కుట్ర అంటే! మనం స్కూలులో కలుసుకోవాలి మరి...''

''ఇరీనా జొవాస్థాయా యింట్లో, నాకూ తెలుసు.''అంటూ బామన్ గస్టిల్యోవ్ కేసి సబ్బు నురుగుకప్పిన మొహం తిప్పాడు. ''కమిటీ సభ్యులమీద అనవసరంగా అభాండం వేస్తున్నావు. నిజం చెప్పాలంటే నన్ను పంపింది మార్క్ పెట్రోవిచ్ వాసిల్యేవ్.

మార్క్ పెట్రోవిచ్ వాసిల్యేవ్ అనే మూడు మాటలను విడి విడిగా, ఆఖరిమాటమీద ఒత్తుతూ ఉచ్చరించాడు. గస్టిల్యోవ్ బొద్దు కనుబొమలు ఆశ్చర్యంతో పైకి లేచాయి.

''ఓహో! మార్క్ దగ్గిరనుంచికాదు. మార్క్ పెట్రోవిచ్ దగ్గిరనుంచీకాదు, మార్క్ పెట్రోవిచ్ వాసిల్యేవ్ దగ్గిరనుంచి వచ్చావన్నమాట! యింకేం, మూడురెట్లు నమ్మకం! అంటే కేంద్రంనుంచి వచ్చావన్నమాట.''

''ఇస్క్రానుంచి'' అంటూ తల పంకించాడు బామన్ మొహం కడుక్కుంటూనే.

గస్టిల్యోవ్ పరాకుగా గడ్డం సవరించుకుని,

''ఓ-అలానా జ్ఞాపకం వచ్చింది. నేను ఆఖరిసారి మాస్కోలో వుండగా లెనిన్ మనుషులు రష్యా రాబోతున్నారని విదేశాల నుంచి వార్త వచ్చింది. విన్నాను.'' అన్నాడు

"లెనిన్ మనుష్యులు! అంటే పార్టీ మనుష్యులనే నీ భావం అనుకుంటా." బామన్ నీటికుండీ మీదికి వంగినవాడల్లా నిటారుగా నిలబడి మొహం తుడుచుకోసాగాడు. "సరే, వచ్చేసారు. చిన్న చిన్న ముఠాలు రద్దుచేయవలసిన సమయం వచ్చింది. మందే పైచేయిగా వుంది. సమ్మెలమీద సమ్మెలు జరుగుతున్నాయి. వాటిని మనం నడపాలి. అందుచేత ఐక్య కేంద్రం, ప్రధాన కార్యాలయం యెంతయినా అవసరం" అని నవ్వాడు. "విప్లవం వచ్చేసేటట్లుంది! మాస్కోలో నేను చూసిన దానినిబట్టి గొంతుక మీదికి వచ్చినట్టే. 'ది రాబోచెయెడెలో'ను * బలపర్చే వారి దంతా మరీ మందకొడి వ్యవహారం. నిశ్చింతగా కూర్చున్నారు. బేరులు వేసుకుంటూ మెల్లిగా స్వర్గానికి చేరుకోగలమని వాళ్ళ ఆశ. రాజకీయాలకి దూరంగా వుండాలని భావిస్తున్నారు."

గస్టిల్యోవ్ కంగారు పడ్డాడు. అతనికేసి చూడకుండా బామన్ తువాలా ఆరవేసి తిన్నగా పుస్తకాల అలమారా దగ్గరికి వెళ్ళాడు.

"నీ స్నేహితు లెవరోచెప్పు. నీ గుణగణాలు చెప్పేస్తాను. అని సామెతవుంది."

పుస్తకాల వెన్నులవెంట వేలు పోనిచ్చాడు. "మొలొకొవెట్స్ 'నూత్నవధువుకు బహూకరణ" యిది పాకశాస్త్రంమీద గ్రంథమా? పెళ్ళి చేసుకుందామని అనుకుంటున్నావా యేం?"

"అబ్బే!" అన్నాడు గస్టిల్యోవ్ తటపటాయిస్తూ, "నేనూ, యిక్కడవుండే అతను యేదోరుచి భేదంకోసం మధ్యమధ్య వంట చేసుకుంటూంటాం."

---

* రాబోచెయెడెలో (కార్మిక ప్రయోజనాలు) ఆర్థిక వైషయిక పత్రిక. విదేశాలలోని రష్యన్ సోషల్ డెమాక్రాటిక్ లీగ్ పక్షాన వెలువడిన పత్రిక. 1899 నుండి 1902 వరకు జినీవా నుంచి వెలువడింది.

"స్కూ-్రివే!" అన్నాడు బామన్ ఒకసన్నటి పుస్తకం బయటికి దీస్తూ, "బెగీర్నిస్కీన్, ప్రొకోపోవిచ్, టాగన్-బరనోవస్కీ! ఒహోహో! అన్నీ ముష్టిమార్క్సిస్ట్ వ్యతిరేక గ్రంథాలే!"

చివరికి గస్టిల్యోవ్ వేపు తిరిగాడు. గస్టిల్యోవ్ నిర్ఘాంత పోయేసరికి బామన్‌కి అంతా అవగాహన అయింది.

"సరే, సరే, సరే! గొగోల్ 'ఇనస్పెక్టరు జనరల్' అన్నట్లు 'ఆశ్చర్యం' గానేవుంది. ఆర్థిక తత్త్వజాడ్యం నీకు పట్టుకున్నట్టుందే?"

"దాన్ని జాడ్యం అనకు" అన్నాడు గస్టిల్యోవ్. చూపు తిప్పేసుకున్నాడు గాని కంఠస్వరం మాత్రం నిలకడగానే ఉంది. "రష్యన్ మార్క్సిస్టులకు సరయిన మార్గం ఒకటే ఒకటి వుందని నా దృఢాభిప్రాయం. మొత్తం దేశంలోని మిత ప్రతిఘటనతో చేతులు కలిపి శ్రామికవర్గ ఆర్థిక పోరాటంలో పాల్గొనడం, యింకా సరిగా చెప్పాలంటే, సహాయం చెయ్యడం ఒకటే ఆ మార్గం. అవును నవును: మేము సగం సగం చెప్పి వూరుకోము. మిత ప్రతిఘటన! అదే నిజమయిన డెమాక్రాటిక్ మార్క్సిస్టు విధానం. లెనిన్ చెప్పే మార్క్సిజం, ఇస్క్రా-ద్వారా రుద్దదలచిందీ, మనలని పూర్తిగా అనవసరమయిన అజ్ఞాతవాసానికి తోలుతోంది. 'కార్మిక వర్గ రాజకీయసంస్థ', 'స్వతంత్ర కార్మికపక్షం!' మతిచెడింది! రష్యాలోని వాస్తవిక పరిస్థితులు యేమాత్రం తెలుసుకోకుండా యెక్కడో జినీవాలో కూర్చున్న వాళ్ళకే యిలాంటి పెడబుద్ధులు పుడుతూంటాయి..."

బామన్ కిటికీ కమ్మీకి ఆనుకుని మృదువుగా నవ్వాడు.

"యెందుకీసొద చెప్పు? యిదంతా ఒకసారికాదు, లక్ష సార్లు విన్నాను. మాస్కోలోని మీ నాయకుడు నన్ను తప్పుదోవ పట్టించాడు. అతను నిన్ను గురించి చెప్పిన దానినిబట్టి నువ్వు ఇస్క్రాని బలపర్చే వాడివని తలచాను. యెపుడో బయలుదేరే

రైలును స్టేషనుమాస్టరు పక్క పట్టాలమీదికి పోనిచ్చినట్లు నన్నూ పక్కదారికి నెట్టాడు. లేకపోతే నేను నీకు ఇస్క్రా కార్యక్రమం వెల్లడిస్తాననీ, అపుడు నువ్వు..."

"అబ్బే! అదేంకాదు. రహస్య కార్యకలాపాల నియమాలను నిజమయిన పార్టీ కార్యకర్తలాగా పాటిస్తున్నాడు. అంతే" అన్నాడు గస్టిల్యోవ్ బుజాలు ఎగురవేస్తూ. "నువ్వు లెనినిస్టు వని తెలియక నా చిరునామా నీకు యిచ్చివుంటారు."

"కావచ్చు" అని బౌమన్ తనివితీరా నవ్వి బల్లదగ్గరికి వెళ్ళాడు. "అచ్చంగా మిలిటరీ వాడిలాగా మాట్లాడావు. 'యుద్ధం ప్రకటిస్తే!' రైలులో తారసిల్లిన రాగిజుట్టు కుర్రవాడు జ్ఞాపకం వచ్చాడు. "సరేగాని, టీ యేదీ! నిజం చెప్పాలంటే ప్రయాణపు బడలిక యింకా తీరలేదు. సరే యిక కార్యక్రమం యేంచేద్దాం!"

గస్టిల్యోవ్ కోపంతో శ్వాస ఎగబీల్చి "కార్యక్రమమా? ప్రపంచానికంతటికీ తెలిసేటట్లు లెనిన్ బహిరంగంగానే ప్రకటించాడుగా. తాను పంపుతున్న ఏజంట్లను గురించి, వారిని యెందుకు పంపుతున్నది వెల్లడించాడు. ఇస్క్రా నాలుగో సంచికలోని 'ఎక్కడ ప్రారంభించాలి' అనే అతని వ్యాసంలో యిదంతా వ్రాసే వుంది."

"అవునవును" అని ప్రశాంతంగా అంగీకరించాడు బౌమన్. "నిజాన్ని దాచడమెందుకు? యెలుగెత్తి చాటవచ్చు."

తిరిగి సింహద్వారం మూసిన చప్పుడయింది. ఒక క్షణం తరవాత ఆ గది తలుపు గబగబా తేలికగా ఎవరో కొట్టారు.

"యెవరది?" అని గస్టిల్యోవ్ ప్రశ్నించాడు బుద్ధిపూర్వకంగా కంఠస్వరం పెంచుస్తూ.

"ఇరీనా!" అని ఒక స్త్రీ మృదుమధుర స్వరంతో జవాబిచ్చింది.

"ఓ- జొవస్కాయా !" బామన్ తలుపు దగ్గిరఉన్న తన సూటుకేసును కాలితో దూరంగా నెట్టి గస్టిల్యోవ్ నోరు ఎత్తక ముందే గడియ ఎత్తి "రావచ్చు" అన్నాడు.

[గుమ్మంలో ఉండే ఇరీనా బామన్ కేసి ఆశ్చర్యంతో చూసింది. ఆమె వెనకనే ఉన్న కొజుబా కొత్తమనిషి సూటు అందం చూసి మొహం ముడుచుకున్నాడు.]

యవ్వనవతికి వస్త్రాలు అమ్మజూపే వర్తకునిలాగా అతి మర్యాద నటిస్తూ బామన్ వంగి వారికి నమస్కరించాడు.

"నాపేరు డ్రొబకోవ్. బెర్లిన్‌లోని కర్సనర్ కంపెనీకి చెందిన సంచాలకుణ్ణి. యిక్కడి మిల్లులో తయారయే వస్త్రాలు చూడడానికి వచ్చాను."

కొజుబా అతని నమస్కారం అందుకోలేదు.

"మిమ్మల్ని కలుసుకోవడానికివచ్చాం. బుక్‌కీపరుగారూ" అన్నాడు కొజుబా బొద్దుకనుబొమలు ముడుచుకుంటూ, ముక్కుతో మాట్లాడుతూ.

"జీతాలపుస్తకాలు కావాలి. లెక్కలలో యెక్కడో తప్పు దొర్లింది. కాని యెవరో మిమ్మల్ని చూడడానికి వచ్చినట్లున్నారు. మేము మళ్ళీ ..."

"అబ్బెబ్బే, మళ్ళీ రావడమెందుకు ?" అన్నాడు బామన్ గబగబా. "నామూలంగా మీరు మళ్ళీ కష్టపడి రావడమెందుకు ? పైగా యివాళ ఆదివారం. శెలవురోజున కూడా మీరు పని చేస్తున్నారన్నమాట ! మీ పుస్తకాలేవీ చూడనీయండి. ఒక్క నిమిషంలో లెక్కలు తేల్చేస్తాను."

బామన్ చేయి జాపాడు. గంభీరంగా మాట్లాడినా కళ్ళల్లో మాత్రం ఆటకాయతనం తొణికిసలాడింది. కొజుబా ఇంకా ఎక్కువగా మొహం ముడుచుకున్నాడు. పుస్తకాల కథ అప్పటికపుడు కల్పించాడు. కూడా తీసుకుని రాలేదు. ఒకవేళ తీసుకుని వచ్చినా

బుక్ కీపరు తన పుస్తకాలు దగ్గరలేనిదే సరిచూడలేడు. ఈ కొత్త మనిషి కూడా వాళ్ళు అందుకోసం రాలేదని పసికట్టేసి వెక్కిరిస్తు న్నాడు. ఈ చిక్కులోనుంచి బయటపడడం ఎలాగో కొజుబాకు అర్థంకాలేదు.

ఇకగస్టిల్యోవ్ మట్టి బొమ్మలా నుంచున్నాడు. కాని కొజుబా ఆ చిక్కునుంచి బయట పడడానికి యత్నించలేదు. ఏమీ మాట్లాడకుండా వెనుతిరిగి గుమ్మంవైపు బయలుదేరాడు. ఇరీనా అతనిని అనుసరించింది.

"జొవస్కాయా !" అని మృదువుగా బామర్ పిల్చాడు.

ఆమె తల తిప్పింది.

"మర్క్ అభివందనాలు చెప్పమన్నాడు." అన్నాడు బామర్ గంభీరంగా.

ఇరీనా గిర్రున వెనకకు తిరిగి గస్టిల్యోవ్ వంక ప్రశ్నార్థ కంగా చూసింది. గస్టిల్యోవ్ తల పంకించాడు, ఇష్టం లేకపోయినా. ఇరీనా బామర్‌కి చేయి అందించింది.

"అలాగా, అతనివే నన్నమాట. నిజంగా వర్తకుడివే నను కున్నాను సుమా! కొజుబా మనుషుల్ని యిట్టే పసికట్టేస్తాడు. అతను కూడా..."

ఇరీనా వెనకాలనే కొజుబా వచ్చాడు. అతనివంక తేరిపార జూచి బామర్

"మనలో వాడేనా ?" అని అడిగాడు.

"మీవాడేనా?" అన్నాడు కొజుబా ఎడమకన్ను కుంచించి. "ఊహుఁ- నేను ఒకళ్ళ వాణ్ణికాను. స్వతంత్రుణ్ణి."

"సరయిన సమయానికే వచ్చావు" అంటూ అడ్డు వచ్చింది ఇరీనా. "నువ్వూ, కామ్రేడ్ గస్టిల్యోవ్ కలిసి ఆలోచించి మిల్లు విషయంలో యేం జేయాలో చెప్పండి. జీతాలలో కోత పెట్టారు."

"మన ఒక్క మిల్లులోనేనా యేమిటి ?" అని గస్టిల్యోవ్ చటుక్కున అన్నాడు. "జిల్లా అంతటా యింతే. మొరొజోవ్ మిల్లులో జీతాలు తగ్గించిం తరవాత ప్రోషిన్ మానతాడను కోవడం పొరపాటు, మన మిల్లు చిన్నది. 'గాగరాలో ఎలుగు బంటు' పైగా అంతా అంగీకరించారుగా యింకేం?"

"అంతా అంగీకరించలా" అంది ఇరీనా ఆవేశంతో. "వాసిలీ, టారాస్ యిద్దరూ నిరసన తెలిపారు."

"సరే. నిరసన తెలిపితే యేం జరిగింది ?"

ఇరీనా చూపు కిందికి వాల్చింది.

"వాళ్ళని అరెస్టు చేసారు."

"కార్మికుల యెదటనే ?" అని బామన్ ప్రశ్నించాడు. నుదురు ముడతలు పడింది. మొహంలో కోపం గోచరించింది.

తలయెత్తి చూడకుండా ఇరీనా తల పంకించింది.

"అదే, అదె !" అన్నాడు గస్టిల్యోవ్ విజయగర్వంతో తల ఆడిస్తూ. "యీ ఉదయమే యీామెతో చెప్పాను..."

"అలాగయితే ప్రోషిన్ చేసిన పని సరయిందనే అనుకుంటున్నా వన్నమాట !" అని కొజుబా అతని మాటకు అడ్డం వచ్చాడు.

గస్టిల్యోవ్ బుజాలు ఎగరవేసి,

"కార్మికులు అంగీకరించారు. నువే చెప్పావుగా. వారి యిష్టమే యిష్టం !"

"వారి యిష్టం !" అంది ఆశ్చర్యంతో, ఒక జడ బుజం మీాదకు ఎగరవేసుకుంటూ.

ఆమె రెండు జడలు వేసుకుందని అప్పుడుగాని బామన్ గమనించలేదు.

"వాళ్ళకి మాడి చావాలని ముచ్చటా యేం? గొంతుక మీాదికి కత్తి వచ్చిపడింది. ఎలా కాచుకోవాలో తెలియదు. కాచు

కునే శక్తి లేదు. యిక మనం యేం జేశాం? వాళ్ళకి ఒక దారి చూపించడానికి బదులు మూగనోము పట్టాం. మనం సోషల్ డెమాక్రాట్లం! హుఁ– సిగ్గుచేటు! మన కామ్రేడ్స్ ముందు చెబుతున్నా. తప్పంతా నీది కార్మికులు హఠాత్తుగా యీ సమస్యను యెదుర్కోవలసి వచ్చేటట్లు చేసావు."

"నేనా?" గస్టిల్యోవ్‌కి ఒళ్లు తెలియని కోపం వచ్చి బల్ల దగ్గరికి వెళ్ళాడు. "నేనేమి చేసి వుండాల్సిందని మీ వుద్దేశం? మిల్లులో..." జంత్రిని దగ్గరికి తీసుకున్నాడు. జంత్రి తిరగవేస్తుంటే బాగా అరితేరిన వేళ్ళకింద టక టక మంది. "ఒక వెయ్యీ మూడు వందల యెనభయి ఒక్కమంది వున్నారు. వాళ్ళల్లో..." టక్ ...టక్ ...టక్ ... "తొమ్మిది ... యెనిమిది... యేడు – తొమ్మిది వందల యెనభై యేడు మంది స్త్రీలు. సహజంగా వీళ్ళంతా వెనకబడిన బాపతు..."

కొజుబా స్నేహపూర్వకంగా ఇరీనాని మోచేతితో పొడిచాడు. "విను. వెనకబడిన బాపతట!"

"...సన్నద్ధులయిన కార్మికులు" అంటూ గస్టిల్యోవ్ ప్రారంభించాడు. కౌంటర్లను ఒకదాని తరవాత ఒకటి కదుపుతూ. "పదకొండుమంది, వాసిలీని, టారాస్‌ని మినహాయిస్తే (యీతడవ కౌంటర్లను చప్పిడిఅయేటట్లు ఆడించాడు) తొమ్మండుగురే. ఏమంత పెద్దసంఖ్యకాదు, తీసిపారెయ్యడానికి."

బుక్కుకీపరుకు అలవాటయిన విన్యాసంతో జంత్రిని పక్కకు తిప్పాడు. కౌంటర్లుకిందరాలాయి. సంఖ్య మాయమయింది.

"భలేతమాషాగావుంది!" అన్నాడు బామన్ పకపకా నవ్వుతూ. "మాంచిప్రావీణ్యం చూపించావు.—ఒకమనిషినుంచి ఇంకో మనిషిని తీసివేసి లెక్కపెట్టడంకోసమే మా తలలు అక్కడ వున్నాయా అనిపిస్తూంది."

కొజుబా మీసాలు మెలివేసి, "అయితే నీవుద్దేశం మేమంతా యేమీచెయ్యకుండా యేపార్కు బెంచీమీదో కాళ్ళు ముడుచుకుని పండుకోవాలనా ?" అన్నాడు.

"పోట్లాట అయిపోయింతరవాత పిడికిలి బిగించేవాళ్ళ విషయమయి ఒక సామెతవుంది," అన్నాడు గస్టిల్యోవ్ బుస్సుమంటూ.

"పోట్లాట జరిగిందాయేం ?"

బామన్ ప్రశాంతంగా సూచనాప్రాయంగా వేసిన ఈ ప్రశ్న విని కొజుబా, ఇరీనా అతనివంక తిరిగి చెవులు నిక్కబొడుచుకున్నారు.

"మేము పోట్లాడవలసిందేనంటావా?" అని ఇరీనా అడిగింది.

"మరి యిక్కడికి నేనెందుకు వచ్చాననుకున్నావు ?" అని గంభీరంగా జవాబిచ్చాడు, బామన్.

ఇరీనా సంతోషం పట్టలేక చప్పట్లు కొట్టింది.

"పోరాటం ! సమ్మె ! నీకు మతేమన్నా పోయిందాయేం ? యిది పూర్తి తిరుగుబాటు ! వట్టి విప్లవపదజాలం ! సమ్మె ఒక్కరోజుకూడా నడపలేం. యిది శీతాకాలం. తిండేకాదు, వంటచెరుకు, బట్టలుకూడా కార్మికులు చూసుకోవాలి. కాస్త వాళ్ళయిళ్ళకివెళ్ళి చూడు. చెప్పులులేక సగంమంది పిల్లలు పక్కలమీదనే పడివుంటున్నారు. ఆ పిల్లలగోలవింటే, గుండె బద్దలయిపోతుంది. ఒక్కరోజుకూడా సమ్మె కొనసాగించలేరు. అంతేకాదు, నిజంగా క్లిష్ట పరిస్థితి యేర్పడ్డపుడు సమ్మె లేవదీయడం మంచిదికాదు. 'రుస్కియేనొవోస్త్రీ'కూడా క్లిష్టపరిస్థితి యేర్పడిందని రూఢిచేస్తోంది."

"అవును" అని జవాబిచ్చాడు బామన్ సౌమ్యంగా మందహాసంచేస్తూ. 'పోలీసుపత్రిక మాస్కో వస్కియేవెడొకోస్తి'లో నుంచికూడా వుద్ఘాటిస్తే మరీబాగుంటుంది. తిండిపడవేసేవారిని మితవాదులుకూడా బలబరుస్తారని స్పష్టమయింది. యిప్పుడు సమ్మె

చేయడం మాస్కో వస్త్రపుత్పత్తిదారులకి వెన్నుపోడవడమేగాబట్టి క్లిష్టపరిస్థితి యేర్పడిందని యెలుగెత్తిచాటాలిమరి! మొరొజోవ్, కోన్షిన్, ప్రోషిన్ మొన్ననే పెద్దగవర్నమెంటు కంట్రాక్టు పుచ్చుకున్నారు. తొందర తొందరగా సైనికదుస్తులు తయారుచేసి యివ్వాలి. యీ కంట్రాక్టును నిర్వహించకపోతే అది యే పీటర్స్‌బర్గ్‌వాళ్ళకో, లాడ్జ్‌వాళ్ళకో యిచ్చివేస్తారు. ఆ కంట్రాక్టు పోకుండా వుండానికి యెంతకయినా తెగిస్తారు. మిలిటరీ కంట్రాక్టుల్లో అమితలాభాలు వస్తాయని నీకు తెలిసిందేగా, లక్షలకొలది లాభాలు తీస్తున్నారు.''

"కంట్రాక్టు! నీకెలా తెలిసింది!'' అంటూ గస్టిల్యోవ్ గొణిగాడు.

"నీకెందుకు తెలియలేదు, అని నేను అడగాలిసింది. శత్రు శిబిరంలో యేంజరుగుతున్నదీ తెలుసుకోకుండా పోరాటాన్ని యెలా నడపగలుగుతావు?''

ఇరీనా, కోజుబాలు ఒకరికేసి ఒకరు చూసుకున్నారు.

"కంట్రాక్టు విషయం నిజమేనా అని నాకు కొద్దిగా అనుమానం వేస్తోంది.'' అని ఆమె నసిగింది. "అదే నిజమయితే ఘర్షణ వచ్చే పరిస్థితి యెందుకు తీసుకు వస్తారు? జీతాలు కోత పెట్టడం యెందుకు?''

"అసలు విషయం యేమిటంటే, ఘర్షణ రాదనే వాళ్ళ నమ్మకం.'' అంటూ బామన్ చేతులు తిప్పాడు. "కార్మికులలో వాళ్ళ యేజెంట్లు వున్నారు. వాళ్ళు చీకట్లో యేమీ తడుముకోవడం లేదు. యీ జిల్లాలో యెన్ని వేలమంది చేనేత కార్మికులు వున్నదీ, సమ్మె పిలుపు యివ్వడానికి యెందుకు వీలు లేనిదీ, కార్మికులు లొంగిపోవడం వుత్తమమనీ రుజువు చేస్తూ _ఒక్క క్షణం క్రితమే మీరు చెప్పారు. యెవరు చెప్పింది? మామూలు కార్మికుడా కాదు. జిల్లా ఆర్గనైజరు, సోషల్ డెమాక్రాటు! జీతాలలో కోత

పెట్టడం వల్ల చిక్కు లేమీ వచ్చిపడవనే ధీమాతోనే యిందుకు తలపడ్డారని మనం పోరాటం ద్వారా రుజువుచెయ్య గలుగుతాం."

"యిది పచ్చి మోసం!" అని గస్టిల్యోవ్ సమాధాన మిచ్చాడు. "మనం పోరాడలేమని నీకు బాగా తెలుసు. కార్మికులు తయారుగా లేరు."

"పోరాట కాలంలోనే జనులు తయారవుతారు." అన్నాడు బామన్ గట్టిగా.

"సరే, పోదాం పదండి" అంటూ కొజుబా కళ్ళ మీదికి టోపీని పట్టిబలవంతాన లాక్కున్నాడు. డ్రయింగ్ షెడ్డు దగ్గర కలుసుకుని అంతా తేల్చేసుకుందాం రమ్మని అందరినీ ఆదేశించాను. అక్కడే తేల్చేసు కుందాం. యింతకీ నీ పేరేమిటి కామ్రేడ్ ?"

"రూక్"

"రూక్ !" కొజుబా ఆలోచనా పూర్వకంగా పునరుద్ఘాటించి, "రూక్ పక్షి వసంతా గమనాన్ని సూచించే దూత! మరేమంత చెడ్డ మారుపేరు కాదు కామ్రేడ్ !" అని ఒక సెకండు నిశ్శబ్దంగా ఉండి గస్టిల్యోవ్ కేసి తల పంకిస్తూ "నువ్వూ యితని జట్టులో వాడివేనా ?" అని అడిగాడు.

"ఊహుఁ–" అంటూ బామన్ నవ్వాడు. "నేను 'రబోచెయాడెలో' మనిషినీ కాను. ఆర్థికవేత్తనూ కాను. ఇస్క్రా పేరు యెపుడయినా విన్నావా ?"

"ఆఁ– యెవళ్ళో అంటూంటే విన్నాను." అని కొజుబా అలవాటు చొప్పున ఎడమకన్ను కుంచించుకుంటూ జవాబిచ్చాడు. "కాని దాని విషయం నాకు స్పష్టంగా తెలీదు. నిజం చెప్పాలంటే మిమ్మల్ని అర్థం చేసుకోవడం కష్టం. మీరంతా యేదో భాష మాట్లాడతారు. యిక్కడ చాలాకాలం పాటు వుంటావా?"

“అదంతా” బామన్ గస్టిల్యోవ్ కోపముఖం కేసి చూసి, “ఆధారపడి వుంటుంది. సరే, యీ లోపున మనం వెళ్ళి వాళ్ళతో మాట్లాడదాం పదండి. మీ దగ్గర వుపకరణా లేమయినా వున్నాయా ?” అని ప్రశ్నించాడు.

“పెద్దగా యేం లేవుగాని, ఒక జెల్లీగ్రాఫు మాత్రం వుంది” అంది ఇరీనా సగర్వంగా. “నా దగ్గరే వుంది. ఒక్క రాత్రిలో వందా, రెండు వందల దాకా కాపీలు తియ్యగలను.”

# 10

# డ్రయింగ్ షెడ్డు

గస్టిల్యోవ్ జంత్రిమీద లెక్కించిన తొమ్మండుగురేమిటి, నూరుమంది వరకూ డ్రయింగ్ షెడ్డులో నిరీక్షిస్తున్నారు. డ్రయింగ్ షెడ్డులో సమావేశం జరుగుతుందనే వార్త ఎంతరహస్యంగా చెప్పినా జనం పసిగట్టి బలవంతాన లోపలికి చొచ్చుకువచ్చారని స్యోమా కొజుబాకి వివరించి చెప్పాడు. అక్కడికి వచ్చినవారంతా నమ్మకస్తులు. అందుచేత అపాయమేమీ లేదని వాదించాడు.

ఇదంతా కొజుబాకి ఆశ్చర్యం కలిగించింది. టారాస్, వాసిలీ ఆ జనంతో కలిసిరావడంతో ఆశ్చర్యం ఇనుమడించింది. పోలీసులు వారిని నిర్బధంలో ఉంచలేదు. అంతేకాదు మానేజరు వారి “సాహసాన్ని” క్షమిస్తానని వాగ్దానం చేసాడు. కొత్తజీతాలకు అంగీకరించి, కార్మికులను రెచ్చగొట్టమని మాటఇస్తే మిల్లులో ఉంచడానికికూడా అంగీకరించాడు.

“మాటయిచ్చాను” అన్నాడు టారాస్. నవ్వుతూ “అయితే యీ చిన్నమాట ప్రవాహాన్ని ఆపలేదు. యిటువంటి వ్యవహారా

లలో యుద్ధంలోలాగానే కాస్త యుక్తిచెయ్యాలి శత్రువును వంచించడం తెలిసుండాలి."

టారాస్, వాసిలీలను వదలిపెట్టడం వల్ల మిల్లు యజమానికి తగాదా కొనితెచ్చుకోవడం ఇష్టం లేదని స్పష్టమవుతోందంటూ బామర్ ప్రసంగం ప్రారంభించాడు. మిల్లు యజమానికి కలిగిన ఈ భయానికి కారణాలు విశదీకరించి చెప్పేసరికి మొదటిసారిగా వారి మొహాలు వికసించాయి. సమ్మెచేస్తే ప్రోషిన్ లొంగివచ్చే లక్షణాలు కనిపించాయి.

కాని నిర్ణయం చేసుకోవడం సహజంగా భీతావహంగానే ఉంటుంది. ప్రోషిన్ మిల్లులో ఎన్నడూ సమ్మె జరగలేదు. తమ చేతులతో యంత్రాలను ఆపివేయడం భయకారణ మయింది. సగం కడుపు మాడుతున్నా మిల్లువల్ల ఏదో కొంత రాబడి వస్తోంది.

"పరిస్థితులను బట్టి చూస్తే ప్రోషిన్ లొంగక తప్పదు. లొంగకపోతే యెట్లా? నిజంగా మిల్లు మూసేస్తే!"

కాని ఈ ఊహలుపుట్టగానే తరిమివేయడం జరిగింది. ప్రోషిన్ తనలాభాలను వదులుకొని ఇంకో ఉత్పత్తిదారుడు ధనరాసులు పోగుచేసుకునేందుకు అంగీకరించడు. గవర్నమెంటు కంట్రాక్టు ఇంకొకరికి దక్కనీయడు. అలాచేస్తే మొదటికే మోసం వస్తుంది.

"మళ్ళీ కోసక్కులను పిలిపిస్తే? గవర్నరును వూరికే అప్పనానికికూడా తీసుకువచ్చాడా? ఆ జనరల్ తనకు మద్దతు యిస్తాడని మనకి చూపించడానికే!" యువకులు నవ్వారు.

"మనకి వేరేయేం చూపక్కర్లా, అందరికీ తెలిసిన విషయమే. చాలాకాలం కితమే మొరోజోవ్ కార్మికులు:

"వైసగలవారిదే ప్రాభవము పలుకుబడి
వేరెవ్వరికీ లేదు వారంత చెల్లుబడి" అని పాడారు.

"ఒకనిమిషంఆగండి, డబ్బుకుబదులు యేవి వుపయోగిద్దా మనుకుంటున్నారు ? సమ్మె జరుగుతున్నదని తినడం మానేయలేం గదా! సమ్మె చేసీచెయ్యగానే లొంగివస్తాడా? లాంఛనంగానయినా తన్నాలని చూస్తాడు."

కాని ఈ విషయంలోనూ ఒకమార్గందొరికింది. జీతాలు ఇచ్చే రోజుకీ రోజుకీ మధ్య కార్మికులు బజాణా పుచ్చుకుంటూం టారు. అంతకుముందే జీతాలు తీసుకున్నారేమో, వారంరోజుల దాకా ఇబ్బంది ఉండదు. ఉదయాన్నే ఫ్యాక్టరీ దుకాణానికివెళ్ళి సాధ్యమయినంత అప్పుగా పుచ్చుకుందామని స్వ్యామా సలహా చెప్పాడు. ఇదివరలో అప్పు ఇస్తున్నారు. తగాదాకూడదని ప్రోసిన్ తలిస్తే అప్పు రెట్టింపు ఇవ్వవచ్చు. చేతిలోఉన్న డబ్బుతో బజా రులో ఆహారపదార్థాలు ఇంకా కొనుక్కోవచ్చు.

"బజారులో యెందుకు కొనాలి?"అని ఇరీనా అభ్యంతరం చెప్పింది. "ఆహార పదార్థాలు హోలుమొత్తంగా కొని పంచి పెడదాం. అలా చేస్తే చవకగా గిడతాయి. బావుండలా, కామ్రేడ్ రూక్ ? పసిపిల్లలను జాగ్రత్తగా సాకేటట్లు చూద్దాం."

ఆహార పదార్థాలు మొత్తంగా కొనడం, పిల్లలను జాగ్రత్తగా సాకడం అనే భావాలు కార్మికులకు సంతృప్తి కలిగించాయి.

"ఆ విధంగా చెయ్యదలుచుకుంటే డబ్బు కూడా మొత్తంగా వకచోటే వుంచేద్దాం."

"సమ్మె నిధి యేర్పరచాల్సిందే. అంతా చందా వేసు కుందాం."

"మేము కూడా సహాయం చేస్తాం" అన్నాడు బామర్. "నేను కూడా కొంత డబ్బు తెచ్చాను. యితర మిల్లులు కూడా మీకు సహాయం చేస్తాయి. ఆ విషయం పార్టీ చూస్తుంది. పెట్టు బడిదారుల మీద తీసుకునే ప్రతి చర్యా కార్మికు లందరికీ సంబం-

ధించిందే. కమిటీ సభ్యుల దగ్గిర నుంచి, సామాన్య సభ్యుల దాకా అందరూ మద్దతు యివాల్సిందే.''

బారకాసులలోను, కార్మిక పేటలలోను సన్నాహాలు ఆలస్యం చేయకూడదని నిర్ణయించారు. కార్మికులు సిద్ధం కాకముందు ఏం జరుగుతున్నదీ మిల్లు గూఢచారులు పసికట్టకుండా జాగ్రత వహించి సమ్మె కమిటీకి తెలియజేయాలి. మొరొజోవ్, కోన్షిన్ మిల్లు కార్మికులకు పిలుపు ఇవ్వడానికి బామన్ ఆ మరునాడు జిల్లా కేంద్రానికి వెళ్ళాలని నిశ్చయ మయింది. కొజుబా పరిచయ లేఖలు ఇచ్చి ఎవరెవరితో మాట్లాడాలో చెప్పతాడు. మొరొజోవ్, కోన్షిన్ మిల్లులలో సోషల్ డెమాక్రాటిక్ పార్టీ సంఘాలు పనిచేస్తున్నాయి. ఆ సంఘాలు చిన్నవే కాని వాటిని కాదనలేం.

మూడు మిల్లులలోను ఒకేసారి సమ్మెచేసే ఏర్పాటును చేయడానికి బామన్ పూనుకున్నాడు.

కాని ప్రోఖీన్ కార్మికులు అభ్యంతరం లేవదీసారు.

''అందరూ కలిసి యెందుకు సమ్మె చేయాలి? మొరొజోవ్ కార్మికులు సమ్మె చేసేదాకా మే మెందుకు ఆగాలి? ఉహుం– సమ్మె చేయాలని అందరికంటే ముందు ఆలోచించింది మేము. మేమే ముందు చేస్తాం. వాళ్ళనే మమ్మల్ని అనుసరించ మనండి. ఆ ఫ్యాక్టరీలు పెద్దవి. అక్కడి వాళ్ళంతా సిద్ధం కావడానికి రెండు రోజులయినా పడుతుంది. అక్కడ పనులు తొందరగా ప్రారంభ మయేటట్టు చేయడం కష్టం. యిక యిక్కడో? వక రోజులో సన్నాహాలు పూర్తి చేయవచ్చు. యేవుంది, అందరితో మాట్లాడడం, ఆహార పదార్థాలు కొనడం, యెల్లుండి మిల్లు కూయగానే పనిలోకి వెళ్ళకుండా సమ్మె కమిటీని నాయకుడుని యెన్నుకోవడం, యింతేగా!''

నాయకత్వ విషయం వచ్చేదాకా అంతా సాఫీగానే జరిగి పోయింది. అపుడు అందరి దృష్టీ బామన్ మీద పడింది. కొజుబా అందరిలోకి పెద్దవాడు, గౌరవపాత్రుడు. అందరి తరఫునా, ''వక

నిమిషం, యెవరిదారిన వాళ్ళు వెళ్ళిపోతూంటే నాయకత్వ విష యం యేం జేసినట్టు? సమ్మె కమిటీకి యెవరు అధ్యక్షుడుగా వుంటారు ?'' అన్నాడు.

"నువ్వా !''

"నేనా ?'' అని కొజుబా ఆశ్చర్యంతో తన ఆసనంలోనుంచి ఇవతలకి ఉరికాడు.

కార్మికులు ఈ ప్రతిపాదనను సానుభూతితో బలపరుస్తూ గొణిగారు.

"యెందుకు అధ్యక్షుడుగా నువు వుండకూడదు ?'' అని బామర్ అడిగాడు నవ్వుతూ, "నువు బాగా నిర్వహించగలవనే నా నమ్మకం.''

"అలానా ?'' అన్నాడు కొజుబా మెల్లిగా. "అది బాధ్యతతో కూడినపని. స్పష్టంగా చెప్పాలంటే, రాజకీయాలకు సంబంధించినపని. నేను రాజకీయాలకి పనికివస్తానా ?''

"అది రాజకీయాలకు సంబంధించినపనే, నిజం. యీ సమ్మె నీ రాజకీయశక్తి సామర్థ్యాలను లోకానికి తెలియజేస్తుంది.''

కొజుబా కళ్ళు కుంచించుకుని మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"మాకు ద్రోహం చెయ్యకేం'' అన్నాడు వాసిలీ కొజుబా వీపుమీద తట్టుతూ. "యెలుగుబంటును మచ్చిక చేయగలవా ?''

గస్టిల్యోవ్ అంతా విన్నాడు. అతనినెవరూ ఖాతరు చేయలేదు. ఎవరూ అతని గమనించినట్టే లేదు. కార్మికులు బామర్ మాటలు ఎంతో ఆసక్తితో విన్నారు. అతనికి ఎదురుచెప్పి ప్రయోజనంలేదు. సమ్మె విఫలమవుతుందనే నమ్మకంతో గస్టిల్యోవ్ ఏమీ మాట్లాడలేదు. పైగా ఇటువంటి విషయాలలో ఇస్క్రా మనిషికి స్వేచ్ఛ ఇవ్వడమేమంచిది. వ్యవహారమంతా బెడిసి, ఆకలితో అలమటిస్తూ కార్మికులు పనిలో చేరిన తరువాత, దీనిని ఉదాహరణగా చూపి ఇస్క్రాను బలపరిచేవారిని అధిక్షేపించవచ్చు.

ఇదంతా లెనినిస్టుల మాటవిన్న ఫలితం, వాళ్ళమూలంగా కార్మికుల బాధలు రెట్టింపు అవుతున్నాయని చెప్పవచ్చు.

తరువాత తను చేయదలుచుకున్న ఆక్షేపణలకు ఇప్పటి నుంచీ రంగం తయారుచేయాలనే ఉద్దేశంతో ఒక్కమాటుమాత్రం గస్టిల్యోవ్ మాట్లాడాడు. "నేను సమ్మెకు అభ్యంతరం చెప్పడం లేదు. కాని ఒక విషయంమాత్రం చెప్పదలుచుకున్నాను" అంటూ సమ్మె ఫలితంగా పోలీసు అత్యాచారాలు ప్రబలుతాయనీ, అరెస్టులు జరుగుతాయనీ కార్మికులకు జ్ఞాపకం చేసాడు.

కాని కార్మికులు అతనిని అర్థంచేసుకున్న విధానానికి అతనికి కోపంవచ్చింది. అధ్యయన తరగతులకు హాజరయేవారు తమ నాయకుడు, సన్నాహకర్త ఇలా మాట్లాడుతున్నందుకు సిగ్గుపడుతూ కూర్చున్నారు. ఇక తక్కినవారికి బుక్కకీపరు సమావేశంలో ఏదిచేస్తున్నదీ తెలియలేదు.

యువకులలో ఒకనికి గస్టిల్యోవ్ మాటలు మింగుడుపడలేదు.

"అరెస్టులా ? జరిగితేయేం ? యుద్ధంలో నష్టాలు కలగకుండా యెలావుంటాయి ? మేము కళ్ళుమూసుకుని ముందుకేమీ సాగిపోవడంలేదు. భయపడేవాళ్లు యిక్కడనించి దయచెయ్యొచ్చు" అన్నాడు.

గస్టిల్యోవ్ ఎలాగో ఈ అవమానాన్ని భరించాడు. తన తడాఖా చూపించడానికి ఇది తగినసమయంకాదు. బామన్ చట్ట విరుద్ధంగా ఇక్కడికి వచ్చాడు. వ్యవహారాలలో తలదూరిస్తే అతనిది ఏమిపోతుంది ! కాని తాను, గస్టిల్యోవ్. చట్టవిరుద్ధమయిన పనులలో ఎందుకు జోక్యం కలుగజేసుకోవాలి ? తాను చట్టబద్ధమయిన పార్టీని అభిమానిస్తున్నాడాయె !

ఈకారణాలవల్ల అతను సమావేశంలో మాట్లాడకుండా కూర్చున్నాడు.

# 11

# రాత్రి బస

ఆ రాత్రి బామన్ పూర్వం తనతోపాటు ప్రవాసం అనుభవించిన కామ్రేడ్ ఇంటికి వెళ్ళలేదు. నాలుగు సంవత్సరాలక్రితం 'కార్మికవర్గ విముక్తి పోరాట సమితి * లో పాల్గొన్నందుకు ఇద్దరినీ ఒకేసారి వ్యాట్కా మండలం లోని ఒర్లోవ్ పట్టణానికి ప్రవాసం పంపారు. అయినా గస్టిల్యోవ్ బామన్‌ను ఆహ్వానించలేదు. ఈ ఒర్లోవ్ పట్టణం ప్రశాంతంగా ఉంటుంది. దేశపటంలో ఎక్కడా కనిపించదు. ప్రవాసంలో ఉండగా ప్రతిరోజూ ఒకరి నొకరు కలుసుకోవడం వారికి విసుగెత్తలేదు. కాని ఇప్పుడు అరగంటసేపు సంభాషణ కొనసాగించలేక పోయారు.

కొజుబా దీనిని కనిపెట్టాడు. సమావేశ సమయంలో గస్టిల్యోవ్ చెవిలో ఏదో చెప్పాడు. కను చీకటి పడగానే బామన్ సూటుకేసుల కోసం మనిషిని గస్టిల్యోవ్ ఇంటికి పంపాడు.

సమావేశం ముగిసి, కార్మికులు కుట్రదారుల లాగా ఒక్కొక్కరు, జంట జంటలుగా వెళ్ళిపోయిన తరవాత ఈ రాత్రి ఎక్కడ గడుపుదామా అని బామన్ ఆలోచించ సాగాడు. ఈ విషయం కొజుబా రెండు మాటల్లో నిర్ధారణ చేసాడు. గస్టిల్యోవ్‌తో కరచాలన చేసి బామన్ వంక తిరిగాడు.

"రాండి"

ఇది కొజుబాకు అభిమాన పాత్రమయిన మాట!

---

* ఈ సమితిని వి. ఐ. లెనిన్ 1895 లో సెయింట్‌పీటర్స్ బర్గ్‌లో స్థాపించాడు. రష్యాలోని విప్లవ కార్మిక పక్షానికి ఈ సమితి మూలవిరాట్. కార్మికవర్గ ఉద్యమంలో మార్క్సిజమును కలపడానికి కృషి చేసింది.

బామన్ కూడా గస్టిల్యోవ్‌తో కరచాలనం చేసి, "నా సూటుకేసు సంగతి యేమిటి?" అని అడిగాడు.

"మా యింటికి తెప్పించేసాను." అని కొజుబా సమాధాన మిచ్చాడు. ఇద్దరూ కలిసి వెళ్ళిపోయారు.

ఫ్యాక్టరీ పట్టణ శివార్లలో శిథిల మయిన ఒక ఇంట్లో కొజుబా నివసిస్తున్నాడు. ఆ ఇంటిలోని ఒక గది మాత్రమే అతని కింద ఉంది. ఆయింటి అవతల హోరుబయట చీకటి పడింది. నడుస్తూంటే మంచు కాళ్ళక్రింద గరగర లాడుతూ సరిహద్దు దాటడం బామన్‌కి జ్ఞాపకం చేసింది.

స్థానిక వ్యవహారాలను గురించీ, స్థానిక ప్రజలను గురించీ చెప్తూతూ కొజుబా యింటికి చేరుకునే వరకూ మాట్లాడుతూనే ఉన్నాడు. అయితే ఆ మాట్లాడడం కూడా మితంగా. సూటిగా మాట్లాడడం వల్ల మిల్లులోని నేత పనివారి వంటి అజ్ఞానులకు, సగం రైతు తత్వంగల కార్మికులకు నాయకత్వం వహించడానికి కొజుబా తగిన వాడని బామన్ గ్రహించాడు. మొహమాటం లేకుండా ఈ విషయం అనేసాడు.

సరిగ్గా ఆ సమయంలో వారు గదిలో ప్రవేశించారు. కొజుబా బామన్‌ని గుమ్మంలో ఆపుజేసి ఒంటరిగా చీకటిలోకి వెళ్ళాడు,

"కొంచెం యిరుకుగా వుంటుంది. దీపం వెలిగించే దాకా కాస్త ఆగండి. లేకపోతే మీరు చీకట్లో యేదో ఒకటి పగల గొడ తారు, దెబ్బ తగిలించు కుంటారు."

అగ్గిపుల్ల వెలిగింది. గ్లాసు తీసిన చప్పుడయింది. కొజుబా దీపం వెలిగించి అతిథివంకకు తిరిగి, దీపం వెలుగులో అతనిని అప్యాయంగా పరికించి చూసాడు.

"నేను తగినవాడినే నంటారు! పొరబాటు పడడం లేదు గదా? నే నొక పొరబాటు చేసాను. మొదట్లో మిమ్మల్ని చూసి

యెవరో అనుకున్నా. మీ కాలరు, బూట్లు చూసి-సరే నను కున్నాను... కాని తీరా పరీక్షకు పెట్టితే..."

"యేమిటీ?" అన్నాడు బామన్ నవ్వుతూ.

లాంతరు పెద్దగా వెలుగుతూ, గదినంతా బాగా ప్రకాశింప జేస్తోంది. బామన్ చుట్టూచూసి తన అదృష్టానికి సంతోషించాడు. సరియయిన మనిషి దొరికాడు. గది చాలా చిన్నది. చేతులు చాచ డానికి కూడా వీల్లేదు. తెల్లటి కొయ్యబల్ల, పెద్ద మంచం మధ్య అతని సూటుకేసు, రెండు స్టూలుబల్లలు ఉన్నాయి. ఇక చోటంటూ లేదు. అవును. ఆగది చాలా చిన్నది. నిరాడంబరమయింది. కాని పసందుగాఉంది. పరిశుభ్రంగా ఉంది. పరిశుభ్రంగా ఉండా లనే ఉద్దేశంతో ఆగదిని శుభ్రపరిచారేగాని ఆడంబరంకోసం కాదు. నిశ్చయంగా ఈ కొజుబా యోగ్యుడు!

ఆగదిలో ఒకడే ఉంటున్నాడా?

లేదు. పక్కమీద ఒక స్త్రీ పండుకుని ఉంది. జడ తలగడ మీద వేలాడుతోంది. గడ్డందాకా దుప్పటి కప్పుకుంది.

"నమస్తే! కాస్త అటువయిపు తిరగండి. నేనులేచి పొయ్యి వెలిగిస్తాను" అంది ఆమె.

"బలే, బలే.!" అంటూ కొజుబా ప్రోత్సహించి అవసరం లేకపోయినా అంతా విశదీకరించాడు.

"నాభార్య. రాండి, కూర్చోండి టీ తాగుదాం"

"అబ్బే! వద్దు. పొద్దుపోయింది." అని బామన్ చేయి ఆడించాడు. మంచం కిర్రుమంది. ఆమె తొందర తొందరగా లేచింది.

"అతిథి వస్తే టీ యివ్వకపోతే యెట్లా?" అన్నాడు కొజుబా గట్టిగా. "అట్టే ఆలస్యం లేదు. నా న్యూరా టీ చేయ డంలో మంచి దిట్ట. నిమిషంలో తయారు చేసేస్తుంది. టీ చెరుపు కాదు."

"రష్యాలో యెవడూ టీ తాగి చచ్చిపోలేదు." అని భర్త మాటలు రూఢి పరిచింది న్యూరా, పొయ్యిలో చిదుకులు వేస్తూ. "అగ్గిపెట్టె యిలా యియ్యి"

కొజుబా భార్యకి అగ్గిపెట్టె అందించి, స్టూలుబల్ల బామర్ కేసి తోసాడు.

"నిజం చెప్పాలంటే, గస్టిల్యోవ్‌ని నాయకుడుగా యెన్నుకుంటారని నేను అనుకున్నాను. కాని యే పార్టీకి సంబంధించని నన్ను మీరు ముందుకు తోసారు."

బామన్ కనుబొమలు ముడిచాడు. ఈ విషయయి మాట్లాడడం అతనికి రుచించినట్లు లేదు. అయినా వెంటనే, "ఒక విషయం మనసులో పెట్టుకోవాలి. యింతవరకూ పార్టీ అంటూ యేర్పడలేదు. యేర్పరచే సన్నాహంలో వున్నాం. ఆ దృష్టితో ఒక ఆలోచించడమంటూ యింతవరకు లేదు. పార్టీ సభ్యులు కాని వారు కూడా సభ్యులుగా చెలామణి అవుతున్నారు. వారికా అధికారం లేదు. యిక రెండో విషయం: కార్మిక ప్రయోజనాల పట్ల భక్తి విశ్వాసాలు గల విప్లవకారులు పార్టీలో చేరుతున్నారంటే, చేరి తీరాలంటే దాని అర్థం విప్లవం కోసం, కార్మికవర్గ ప్రయోజనాల కోసం జీవితాలు ధారపోయగల సమర్థులు లేరని కాదు."

"అవును. సరిగా చెప్పారు" అంటూ కొజుబా తల పంకించాడు. "నేనూ యిదే అస్తమానం చెపుతున్నాను. గస్టిల్యోవ్ కార్మికుడు కాదు, అతని మాటలు వినవద్దు అని చెప్పాను."

"ఒక నిమిషం ఆగు కొజుబా!" అన్నాడు బామర్ ఆశ్చర్యంతో, ఒక వేలు పైకెత్తి బెదిరిస్తున్నట్టు "నేనూ కార్మికుడిని గాను!" అన్నాడు.

"కాని మీ సంగతి వేరు." అన్నాడు కొజుబా ప్రశాంతంగా మందహాసం చేస్తూ. "యీ విషయం చెప్పండి: మీ రెపుడూ యింత చెలాకీగానూ వుంటారా?"

బామన్ నవ్వుతూ వణికిపోయాడు. నేలమీద కూర్చుని సూటుకేసు తెరుస్తూ,

"అవును, యెపుడూ చెలాకీగానే వుంటా" అన్నాడు.

"యెందుకని ?"

బామన్ బుజాలు ఎగరవేసాడు. కళ్ళల్లో నవ్వు మాయమయింది.

"జీవితంలో సరయిన మార్గాన నడుస్తున్నానని తెలుసును గనుక."

"సరయిన మార్గం ?" కొజుబా కనుబొమలు తీవ్రంగా దగ్గిరికి ముడుచుకున్నాడు. "సరయిన మార్గమని యెలా అనుకున్నారు? మీ అంతట మీకే తోచిందా ?"

సూటుకేసు తెరిచి బామన్ లేచి నిలుచున్నాడు.

"లేదు. లెనిన్ నాకు సహాయం చేసాడు."

"లెనిన్ !" అని కొజుబా గొణిగాడు బామన్ కేసి చూడకుండా. "లెనిన్, లెనిన్—అని డ్రయింగ్ షెడ్డులో ఆ పేరు చాలా సార్లు యెత్తారు......మీ లెనిన్ కి భూమ్మీద సత్యం యెక్కడుందో, దానిని కనుక్కోవడం యెలాగో తెలుసా ? నా మట్టుకు నాకు యెక్కడ ప్రారంభించాలో తెలీదు."

బామన్ సూటుకేసులోని బట్టలు ప్రక్కకు నెట్టి వార్తాపత్రికల కట్ట బయటికి తీసాడు. అవన్నీ ఇస్క్రా కాపీలు. అన్నిటికన్న పైన నాలుగో సంచిక ఉంది. బామన్ కట్ట విప్పి వేలితో కొజుబాకు చూపించాడు.

కళ్ళు కుంచించుకుని కొజుబా స్పష్టంగా, పెద్దగా కనిపిస్తున్న

ఎక్కడ ప్రారంభించాలి?

అనే శీర్షిక చదివి ఇకిలించాడు.

"బలే! బలేబాగుంది! అద్భుతం! చదువుతాం. యివన్నీ మాకోసరమేనా ?" అని ఆదుర్దాగా అడిగాడు కొజుబా. బామన్

బల్లమీద కాగితాల బొత్తి పెట్టడం చూసాడు. బలే! మిల్లుదగ్గిర నిజం కోసం మే మెంత అలమటించి పోతున్నామో మీరు నమ్మరు. కరపత్రం రావడం ఆలస్యం, చదవక ముందే చేతిలోంచి లాగేసుకుంటారు." బామర్ కళ్ళల్లోని ఆదుర్దా కనిపెట్టి విరగబడి నవ్వాడు. "నా భార్య విషయం మీరేం ఆందోళన పడక్కర్లేదు. అదీ మనలోని మనిషే. చదవనూ, రాయనూ రాదు కాని ప్రతిదీ అర్థంచేసుకో గలుగుతుంది. న్యూరా! ప్రస్తుతానికి వీటిని యెక్కడన్నా దాచు."

బామర్ బుజం మీదగా వంగి సూటుకేసులోకి చూసి ఈలవేసాడు.

"వీటితో నిను పట్టుకుంటే, కఠిన నరకం విధిస్తారు."

బామర్ మందహాసం చేసి, సూటుకేసు మూసివేసాడు.

"కఠిన నరకం నుంచీ తప్పించుకోవచ్చు."

న్యూరా టీ పాయి బల్లమీద పెట్టింది. అది పాతది, ఒక వైపు సొట్టపోయింది. కాని తళతళా మెరుస్తోంది.

"యిదివరకు తప్పించుకున్నావా ?"

"ఆఁ- ప్రవాసం నుంచి తప్పించుకున్నా."

అంటే జైలుకు వెళ్ళొచ్చావన్న మాట !"

సెయింట్ పీటర్స్‌బర్గ్ జైలు, పీటర్-పాల్ కోటలో అట్టే బెట్టారు. అది ఒక దీవిలో వుంది."

"అక్కడ చాలాకాలం వున్నారా ?"

"దగ్గిర దగ్గిర రెండేళ్ళు"

"ఆ కాలమంతా హుషారుగానే వున్నారా ?"

బామర్ తిరిగి నవ్వాడు.

"యేడుస్తూ కూర్చుంటాననుకున్నావా ?"

కొజుబా తల పంకించి,

"మీరు చిత్రమయిన మనుషులు. మీలాంటి వారిని నే నింతవరకు యెక్కడా చూడలేదు. అంతదాకా యెందుకు, యే నిమిషాన బడితే ఆ నిమిషాన మీ మీదపడి సంకెళ్ళు వేయవచ్చు. మీ పరిస్థితిలో వుంటే వూపిరి తీయడానికే నాకు భయం వేస్తుంది. యెందుకలా నవ్వుతారు?"

"బామన్ నవ్వుతూనే ఉన్నాడు.

టీ తాగి పడుకుందాం. లేకపోతే యే నిమిషాన మీరు పారి పోతారో అని భయంగా వుంది."

# 12

# సమ్మె

ఇరినా జాలిగ్రాఫ్ మీద తీసిన ధూమ్రవర్ణపు అక్షరాలు స్పష్టంగా కనిపించటం లేదుగాని తేలికగానే చదవవచ్చు.

ప్రోషిన్ మిల్లు కార్మికుల కోర్కెలు

1. జీతాలకోత రద్దుచేసి, రూబులుకు మూడు కోపెక్కుల చొప్పున పెంచడం,
2. స్త్రీలకు, రోజుకూలీలకు 24 కోపెక్కుల జీతం ఇవ్వడం,
3. రోజుకు పది గంటల పని,
4 మిల్లులో గాయపడ్డవారికి గది ప్రత్యేకించడం, లేకపోతే ఆసుపత్రిలో కనీసం ఒక మంచమన్నా ఏర్పాటుచేయడం,
5. చట్టప్రకారం ఉత్పత్తి,
6. బాలురచేత ఆరోగ్యం చెడేటంత ఎక్కువ పనిచేయించక పోవడం,

7. ప్రత్యేక పట్టికలో ఉదహరించినవారిని మానేజుమెంటునుంచి తొలగించడం. వీరి విషయంలో కార్మికులలో అధికసంఖ్యాకులు నిరసన తెలియజేశారు.

8. ఇతర పరిశ్రమలలోని కార్మికుల కోర్కెలను అనుసరించిన ఇతర కోర్కెలు.

ఇందులోని విషయాలు కొంచెం మోటుగా ఉన్నాయి. కార్మికులు వెలువరించిన కోర్కెలనేగాక వారుపయోగించిన మాటలనే తీర్మానంలో కొజుబా బుద్ధిపూర్వకంగానే పొందుపరచాడు. మాటలు ఇష్టంవచ్చినట్టు ఉపయోగించినా ప్రతి కార్మికుడూ సమిష్టి కార్యభారం—నిర్ణయానికి తానూ సహాయపడ్డాననేభావం ఇందువల్ల కలిగింది.

కార్మికులందరిపరిస్థితీ బాగుపడాలనే ఉద్దేశంతో ప్రోషిన్ కార్మికులు సమ్మె చేస్తున్నారని తెలపడానికే వాసిలీ, టారస్ ఆఖరిఅంశం చేర్పించాడు. దీనినెవరూ కాదనలేదు.

మొరొజోవ్ కార్మికులుకూడా సమ్మె చేసేందుకు వీలుగా తాము సమ్మె చేయడం రెండురోజులకు వాయిదావేస్తానని కొజుబా బామన్‌కి మాటయిచ్చినా సమావేశంలో యువకార్మికులను, ముఖ్యంగా టారాస్‌ని ఆపలేక పోయాడు. తాము అందరికన్నా ముందు సమ్మె చేయదలచామనీ ఆలస్యంచేయకుండా సమ్మెకు పిలుపు ఇవ్వవలసిందనీ వారు పట్టుపట్టారు. మొదటికే మోసం వస్తుందేమోనన్న భయంతో కొజుబా వారిని ఎదిరించకుండా జాగ్రత్తపడ్డాడు. ఎదిరించితే వారు చల్లబడి ఊరుకోవచ్చు. ప్రోషిన్ కార్మికలను సమ్మెకు ఒప్పించడం ఏమంత తేలికకాదు. అందువల్ల ఎవరూ బహిరంగంగా వారి ప్రతిపాదనను ఎదిరించలేదు. కాని మగవారు చిర చిరలాడుతూ మౌనంగా కూర్చున్నారు. స్త్రీలు నిట్టూర్చారు. వృద్ధులు సణుగుకొన్నారు. తీర్మానం వోటుకుపెట్టకుండా కొజుబా చాలాసేపు తటపటాయించాడు. మిల్లు నిర్వాహకులంతా పారిపోయారనే గస్టిల్యోవ్ వార్త తీసుకురావడంతో ఆవరణలోని

కార్మికులందరిలో చలనం కలిగింది. ఇక తటపటాయించనక్కర లేదని స్పష్టమయింది. వ్యవహారం నెత్తిమీదకు వచ్చింది. పోరాటం ప్రారంభమయింది. ఇక వెనుదిరగడం సాధ్యంకాదు.

కోజుబా నాయకుడుగా సమ్మె కమిటీని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. సమ్మెనిధి ఏర్పాటుకు సన్నాహాలు జరుగుతున్నాయనీ, సమ్మె కాలంలో కొంతజీతం ముడుతుందని ప్రకటించేసరికి కార్మికుల ఉత్సాహం మిన్నుముట్టింది.

ఫాక్టరీ దుకాణంలోంచి ఆహారపదార్థాలు సంపాదించారు. అయిదు రోజులదాకా ఏంపరవాలేదు. ఈ అయిదు రోజులు సమ్మె ఎలా పరిణమిస్తుందోనని ప్రశాంతంగా నిరీక్షిస్తూ కూర్చోవచ్చు. కాని అయిదు రోజులు మాటలుకాదు. కార్మికులు వారి జీవితంలో ఎన్నడూ భవిష్యత్తునుగురించి ఆలోచించడానికి అలవాటు పడ్డవారు కారు. పాటలు పాడడంతో సమావేశం ముగిసింది.

ఆ మర్నాడు మొరోజో, కొన్నిస్ కార్మికులుకూడా సమ్మె చేయబోతున్నారనే వార్త వచ్చింది. పరిస్థితి ప్రోత్సాహకరంగానే ఉంది. ఒంటరిగాకుండా బుజంబుజం రాసుకుంటూ పురోగమించడం! ఓహో!

# 13

# ఎవరికోసం బాబూ, ఈ నిరీక్షణ?

సాయంకాలం కావస్తోంది. ప్రోషిక మిల్లుకు వెళ్ళే సందుకు అరవెర్స్టు దూరంలోని హైరోడ్డుమీద మిఖల్‌చక్ వణికిపోతూ నేలను తన్నాడు.

శీతాకాలంలో త్వరగా సందెపడుతుంది. హైరోడ్డు మీది మంచుగుట్టల అవతలి కొండరావిచెట్ల చుట్టూ క్షణక్షణానికీ పొగమబ్బు దట్టంగా వ్యాపిస్తోంది. దూరాన బొందలు సల్లబడ్డాయి. చీకటిలో చూడడం ప్రయాస అయిపోయింది. హైరోడ్డు మలుపులో దాడుతీసే గుర్రాల ఆకారాలు కనిపిస్తాయని ఆశించాడు.

వ్యాకులపాటుతో కుంగిపోయాడు. మొలొజోవ్, క్నోషిక, ప్రోషిక మిల్లు యజమానులు కార్మికులకు లొంగిపోతారని అతడు ఎన్నడూ అనుకోలేదు. 'కాలం అనుకూలంగా లేదు. ఈసమయంలో గనక సమ్మె జరిగితే, పెద్ద పెద్ద కంట్రాక్టులు దక్కకుండా పోతాయి అని మానేజరు చెప్పాడు. కంట్రాక్టు లాడ్జ్ మిల్లుకు ఇవ్వడానికి అంతా సిద్ధమయింది. కార్మికులు అంత ఉత్సాహంగా ఉండడం అతను ఎన్నడూ చూడలేదు. వారి ఉత్సాహం వర్ణింప శక్యం గాకుండా ఉంది! కొజుబాకి పట్ట పగ్గాలు లేవు. యజమాని పక్షం వహించి తాను, మిఖల్‌చక్, గొప్ప తప్పిదమే చేసాడు. ఇక కార్మికులు అతనిని ఎగతాళి పట్టిస్తారు. బహుశా మిల్లులోనుంచి బయటికి తరిమివేస్తారు కూడా.

కాని పరిస్థితులు యథాప్రకారానికి వస్తాయని మానేజరు చెప్పాడు. జీతాలకోత జరుగుతుంది. మళ్ళీ పాత ఏర్పాట్లు అమలులోకి వస్తాయి. పాత ఏర్పాట్లు మళ్ళీ అమలులోకి వస్తాయా అని

సందేహించాడు. సమ్మె విజయవంత మయింది. మిల్లు కార్మికులను గుర్తు పట్టడం కష్టంగా ఉంది. వాళ్ళు పూర్తిగా మారిపోయారు.

మిఖల్‌చక్ ఈ ఆలోచనలలో మునిగి పోయాడేమో, మిల్లు వేపు నుంచి ముగ్గురు మనుష్యులు అతని వెనకాలే రావడం గమనించలేదు. వారు మిఖల్‌చక్‌ను చూడగానే అడుగులో అడుగు వేసుకుంటూ నడవాలని ఒకరి నొకరు సంజ్ఞలు చేసుకున్నారు. ఆముగ్గురిలో సమీపంలో ఉన్న మనిషి భుజం గట్టిగా పట్టేసేసరికి మిఖల్‌చక్ వెనక్కి తిరిగి చూసాడు.

"యెవరుకోసంబాబూ, యీ నిరీక్షణ ?"

హఠాత్తుగా ఈ ప్రశ్న వేసేసరికి మిఖల్‌చక్ తబ్బిబ్బయిపోయాడు. పిడికెళ్ళు బిగించబోయాడు. కాని తాను ఒక్కడు, ఎదురు ముగ్గురు, లడాయికి దిగడం వెర్రితనమని గ్రహించాడు. అతని బుజంపట్టుకొన్నది యెగార్ నికిఫొరోవ్. ఆ జిల్లాలో మంచి బలిష్టి అని పేరుపొందాడు. మిల్లు కార్మికులు పట్టణవాసులతో జట్లు పందాలు ఏర్పాటు చేసినపుడు నికిఫొరోవ్‌కు సరయిన ఉజ్జీ పట్టణంలో ఎక్కడా దొరకలేదు. ఆమాటకొస్తే మాస్కోలోనే లేదు. రెండవ మనిషి టారాస్. ఇక మూడవ వ్యక్తి కార్మికుల దుస్తులలో ఉన్నాడు. మిఖల్‌చక్ అతనిని ఎన్నడూ చూడలేదు. చూసేవుంటే, ఎన్నటికీ మరిచేపోయేవాడుకాదు. ఆవ్యక్తికళ్ళు తేటగా, ఆశ్చర్యజనకంగా ఉన్నాయి. ముక్కుమీద మచ్చఉంది. ఆ మచ్చ అతనికంట పడితీరేదే!

టారాస్ ఆ కొత్తవ్యక్తితో గౌరవపురస్సరంగా మెల్లిగా మాట్లాడాడు.

"కామ్రేడ్! మెల్లిగా పదండి. సూటిగా యీదోవవెంట పదండి. వీడితో ఒకమాట మాట్లాడి క్షణంలోవచ్చి కలుసుకుంటాం."

ఆ తేటకళ్ళు శ్రద్ధగా మిఖల్‌చక్‌ని పరీక్షించాయి.

"ఊహుఁ–" అని ఆ కొత్తవ్యక్తి సమాధానమిచ్చాడు.

F10053

"అంతా కలిసే మాట్లాడుదాం. యింతట్లో మించుకు పోయిందేముంది ?"

"మించుకుపోయిందేంలేదు" అన్నాడు నికిఫొరోవ్. "నిజం"! మిఖల్‌చక్‌కు దగ్గిరగా తలవంచి, "వినిపించిందా ? యెవరికోసం నిరీక్షిస్తున్నావు ? అని అడుగుతున్నా."

మిఖల్‌చక్ తాబేలులాగా మెడ కుంచించుకుని నికిఫొరోవ్ కేసి, కొత్తవ్యక్తి కేసి ఓరచూపు చూసాడు.

"నన్ను వెళ్ళనీయండి" అని గొణిగాడు. "యెవరికోసం నిరీక్షిస్తాను ? షికారుగా వచ్చా అంతే."

"షికారు !" అని ఎత్తిపొడిచి యెగార్ మిఖల్‌చక్ బుజం ఇంకా గట్టిగా నొక్కాడు. ఉక్కులాంటి వేళ్ళు తాకిడి కోటుగుండా తగిలింది. "షికారు చేయడానికి నువేమన్నా పడుచుపిల్లవా? నిన్న గాక మొన్న నువు మాస్కో యెందుకు వెళ్ళావు ? నిజం చెప్పు."

మిఖల్‌చక్ కాలరులోకి తల ఇంకా దించుకున్నాడు. నికిఫొరోవ్ అతనిని వదిలిపెట్టి ఉన్ని చేతితొడుగును తీసేసుకున్నాడు. మిఖల్‌చక్ మనసులో కుంగిపోయాడు.

"మా అక్కకి జబ్బుగా వుంది, చూడడానికి వెళ్లాను." అన్నాడు కళ్ళు మూసుకుని మెలమెల్లిగా.

"ఊం- మీ అక్క పోలీసుస్టేషనులో చికిత్స పొందుతోందేం ? నువు పోలీసుస్టేషనులోకి వెళుతూండగా చూసినవాళ్లు చెప్పారు."

యెగార్ అతనికోటు పట్టుకుని లాగాడు. గుండీలు, కొక్కాలు నేల రాలాయి.

"యెవరినో చూసి నేననుకున్నారు" అని మిఖల్‌చక్ గొణిగాడు పిచ్చిగా.

"భగవంతుడి సాక్షి ! యెంత నొట్టుపడితె అంత వొట్టు. నాకు పోలీసుస్టేషనుకు వెళ్ళవలసిన పనేముంది !"

"అదే నేను తెలుసుకోవాలను కుంటున్నాను" అన్నాడు టారాస్ దృఢనిశ్చయంతో. "నిజం చెప్పు యిచ్చకాలమారి వెధవ, నిజం చెప్పు. యెవరిగుట్టు బయటపెట్టావు ? యెవరిగుట్టో బయట పెట్టావని నీమొహమే చెపుతోంది. యేమీ చెప్పదలచుకో లేదా ? సరే యెగార్, కానీ, చూస్తావేం ?"

"ఆగు" అన్నాడు కొత్తవ్యక్తి యెగార్ని ఆపుతూ, "యిటువంటి విషయాలలో యిలాకాదు వ్యవహరించ వలసింది."

"మరెట్లా ?" అన్నాడు టారాస్ వికృతంగా. "తాచు పామును చంపకుండా వదిలేస్తే కాటేస్తుంది."

మాట ఆపి విన్నాడు. మిఖల్చక్ కళ్ళు సంతోషంతో వెలిగిపోయాయి. హైరోడ్డునుంచి టాంగా గంటలు గణగణధ్వనీ, గుర్రాల సకిలింపులూ, మనుషుల గొంతులూ వినిపించాయి.

"పోలీసు యినస్పెక్టరు ! టాంగాలో యింకెవరు వస్తారు ? అయన కోసమే గదూ, నువు నిరీక్షిస్తోంది ?"

యెగార్ మిఖల్చక్ మొహంమీద ఈడ్చి పిడికిలితో ఒక పోటు పొడిచాడు. కిక్కురు మనకుండా మిఖల్చక్ వెల్లకిలా పడి పోయాడు. టారాస్ కిందపడ్డ మిఖల్చక్ మీదికి వంగాడు. కాని ఇంతలో గుర్రాల డెక్కల చప్పుడు దగ్గరగా, మరింతదగ్గిరగా వడి వడిగా భయోత్పాదకంగా వినవచ్చింది పోలీసులు...

"తొందరగా పద యెగార్ ! అడవిలోకి పద. అక్కడి కయితే గుర్రాలు మనల్ని వెంటాడలేవు"

కదలకుండా పడిఉన్న మిఖల్చక్ని ఒకతన్ను తన్ని యెగార్, "యెక్కడికి పోగలవు ! తరవాత తేల్చుకుందాలే" అన్నాడు.

కొత్తవ్యక్తి సహచరుల వెనకాలే మంచుగుట్టల గుండా దూసుకు పోయాడు. అలా దూసుకు పోతుండగానే మిఖల్చక్ దేహంప్రక్కగా సెగలుకక్కుతూ గుర్రాలు జోరుగా దాడు తీసాయి.

"ఆగు !" అని ఒక గద్గదిక స్వరం పలికింది.

టాంగామనిషి గుర్రాలకళ్ళాలు లాగాడు. పక్కకు పడవేసిన ఎలుగుగొడ్డు చర్మం రగ్గుమంచుకు కొరడాలా కొట్టుకుంది. ఎర్ర అంచుల ఊదా పోలీసుటోపీ పెట్టుకుని ఒక పొడుగాటి అధికారి టాంగాలోంచి కందికి దూకాడు. అతని వెనకాల లావుపాటి ఇనస్పెక్టరు కష్టంమీద కాళ్లు చాచి టాంగాలోనుంచి బయట పడడానికి సిద్ధమయాడు.

"ఆగు, లేకపోతే కాల్చేస్తాను."

పోలీసు అధికారి రివాల్వరు ఎత్తాడు. కాని దట్టమయిన అడవిలోకి దూసుకుపోతున్న ఒక వ్యక్తి కీనీడ హైరోడ్డు పక్క కందకం ఒడ్డున ఉన్న చెట్లలో మాయమయింది.

"వెంబడించండి"

రౌతు గుర్రాలను అదలించాడు గాని మంచు దట్టంగా పడడంవల్ల గుర్రాలు వెనుదిరిగి మొరాయించాయి.

"యీ మంచులో పడి వెళ్ళలేం. దొరా! రాత్రిపూట అడవిలో వాళ్ళని కనిపెట్టలేం. మంచు దట్టంగా పడింది. యేదో విధంగా నడచి వెళ్ళగలం గాని గుర్రాలమీద యెక్కి, ఊహుం—వెళ్ళలేం."

ఇనస్పెక్టర్ మిఖల్‌చక్ దేహంమీదకు వంగి బిగ్గరగా, నిట్టూర్చాడు. మిఖల్‌చక్ కళ్ళు తెరిచాడు.

"బతికే వున్నాడు, వెధవ" అన్నాడు ఆశాభంగం పొందిన ఇనస్పెక్టరు. "ముక్కులోనుంచి రక్తం కారుతోంది. వెధవ వేషాలు వెయ్యక లే. నిన్ను వాళ్లు చంపే సారనే అనుకున్నాం."

"వ్యవధి చిక్కలేదు, లేకపోతేనా..." అన్నాడు మిఖల్‌చక్. రొప్పుతూ, తూలుతూ లేచాడు.

"యీ చుట్టుపక్కలంతా దుర్మార్గులే. నేను పోలీసుస్టేషనులోకి అడుగుపెట్టబోతుంటే మిల్లుతాలూకు పనివాడెవడో అలా

వచ్చాడు వాడికంట పడ్డాను. యింకేవుంది, నికిఫొరోవ్ నన్ను చంపడానికి సిద్ధమయాడు."

"చంపేస్తారు నిజం!" అన్నాడు ఇనస్పెక్టరు.

"ద్రోహులని వాళ్లేం దయదలచరు. మొన్నీ మధ్యనే యిద్దరు యేజంట్లని మంచుకన్నంలో ముంచి చంపేశారు. యెవరీ పని చేశారు? తెలుసుకోవాలని యత్నించిచూడు!"

"వాళ్ళకోసరం మనం, మనంకోసరం వాళ్ళూ తిరుగు తూంటాం." అని పోలీసు కాప్టెను టాంగాదగ్గిరికి తాపీగా నడిచి వెళ్ళాడు. "మరేం గందరగోళ పడక్కర్లేదు... నీ పేరేమిటి?"

"మిఖల్‌చక్" అని ఇనస్పెక్టరు అందించాడు పోలీసు అధి కార్తతల పంకించాడు.

"సరే, నువు యిక్కడినుంచి మాయమయిపోవాలి. నిన్ను మాస్కోలో అట్టేపెడతాం. పేరు మార్చేస్తాం. సంగతి సంద ర్భాలు తెలియడానికి నీవంటివాళ్ళ పేర్లను వాళ్లు అందరికీ అంద చేస్తారు. యికనించి నిన్ను మిఖాలిన్ అంటాం. జుట్టు కత్తిరించి, నున్నగా గడ్డం గొరిగిస్తే మీ అమ్మకూడా నిన్ను ఆనవాలు పట్టలేదు."

మిఖల్‌చక్ పెద్దగా ఇకిలించాడు.

"ఐతే, బాగుంది" అన్నాడు కాప్టెన్ అనుగ్రహంతో. "దేవుణ్ణి ప్రార్థించినా, జారుకు కాస్త సేవచేసినా వృథాపోదు. యిక యీ నికిఫొరోవ్ విషయం, పురుగును చూసినట్టు చూస్తాం. కాలికింద నలిపివేస్తాం. ఒంటరిగానే వచ్చాడా?"

"ఉహూం-టారాస్, ప్రొఖోరోవ్‌కూడా వున్నారు. యింకొ కడు-యిక్కడివాడు కాడు." అన్నాడు మిఖల్‌చక్ తొందర తొందరగా.

"యిక్కడివాడు కాడూ?" అని కాప్టెన్ చెవులు నిక్క పొడుచుకున్నాడు. "ఆగు ఫియోడోర్!" అన్నాడు పోబోతున్న టాంగా మనిషిని ఆపుతూ. "వాడిమొహం జ్ఞాపకం వుందా?"

కోటు అడుగుభాగం వెనకకు తీసి, జేబులోనుంచి ఒకసంచి, సంచీలోనుంచి ఒక ఛాయాచిత్రం పైకి తీసాడు.

"యిల్యూపెట్రోవిజ్, అగ్గిపుల్ల వెలిగించు. సరే, ఆనవాలు పట్టావా?"

మినుకుమినుకు మంటున్న అగ్గిపుల్ల వెలుగులో ఒక యువకుని ఛాయాచిత్రం మిఖల్‌చక్ చూసాడు. ఆ చిత్రంలోని వ్యక్తి గడ్డం చిన్నది. సన్నటి కోటు, నుదుటిమీదకుపడే మడత హాటు. కళ్లు, ముక్కు- స్పష్టంగా కనిపించడం లేదు. ఆవ్యక్తి రెండు సూటుకేసులు మోసుకుపోతున్నాడు.

"ఉహుఁ- అతడుగాదు"

"వాడే అవాలి" అన్నాడు పోలీసు కాప్టెన్ కఠినంగా. "వాడే యిక్కడ, యీ జిల్లాలో వున్నాడని మాకు గట్టి సమాచారం చేరింది. మొరోజోవ్, ప్రోషిన్ మిల్లులదగ్గిర కనిపించాడు. యీ జట్టుకంతకీ వాడే నాయకుడు. వాడు కాకపోతే పీకకోసేసుకుంటా. మళ్ళీ సరిగాచూడు. యిల్యాపెట్రోవిచ్! యింకో అగ్గిపుల్ల వెలిగించు."

మళ్ళీ అగ్గిపుల్ల మినుకు మినుకు మంది. అడవిలో ప్రశాంతంగా ఉంది. గుర్రాలు సకిలించాయి. గుర్తు పట్టగలడా? వాడే వీడని చెప్తాడా? ముందుగా చెప్పనందుకు అనేక ప్రశ్నలతో చంపేస్తారు.

"ఉహుఁ- యీ మనిషిని యెన్నడూ నేను చూడలేదు."

"యెన్నడూ చూడలేదూ?" అని అధికారి వెక్కిరించాడు. "వెర్రిమొహం!"

"అడవిలోంచి సరాసరి రైల్వే పట్టాల దగ్గరికి మార్గం వుంది" అన్నాడు ఇనస్పెక్టరు ఆదుర్దాతో. "యిక్కడ మనం కాలం వృథాపుచ్చుతూంటే, అక్కడ వాళ్ళు రైలు స్టేషనుకి జేరుకోగలరు. మనం అక్కడికి వెళ్ళడం మంచిదే నంటారా? మిఖల్‌చక్ పట్టణంలో వాళ్ళని ఒక కంట కనిపెడుతూంటాడు."

మిఖిల్‌చక్ మొహం భయంతో పీక్కు పోయింది. ఒంటరిగా అక్కడ వదిలిపెట్టి వెళ్ళిపోతావా యేం? ఏమయినా సరే, వీల్లేదు.

"ఉహుఁ- స్టేషనుకు వెళ్ళివుండరు. కూడా సామానేం లేదు. నా వెంటబడి వచ్చారు. వొట్టు. మనకంటె ముందుగానే కార్మికుల పేటకి వెళ్ళి వాళ్ళని హెచ్చరిస్తారని నాకు అనుమానంగా వుంది."

"వెధవ...వీడు చెప్పిందే నిజం కావచ్చు." అంటూ కాప్టెను మొహం చిట్లించు కున్నాడు. "సరే, యెక్కు. మాతో పాటు నువ్వూ రా. అందరి యిళ్ళూ చుట్టివద్దాం. యిక నువు దాక్కో వలసిన పనిలేదు. అసలు రంగు బయట పెట్టచ్చు. ఊఁ- ఫియొడోర్?"

టాంగావాడు కళ్ళాలు వదిలాడు. గంటలు గణగణా మోగాయి. ఇనస్పెక్టరు ఎక్కిన టాంగాతో పాటు స్వారీ చేయడానికి రౌతులు గుర్రాలను అదలించి దౌడుతీయించ సాగారు.

## 14
## అచ్చు ఆఫీసు

బడిలోని తన గదికి వెళ్ళగానే ఇరీనా హృదయం సంతోషంతో ఉప్పొంగి పోయింది. బామన్ విషయంలో చాలా ఆదుర్దా పడింది గాని అతనిని సురక్షితంగా పంపడం జరిగింది.

అక్కడి స్టేషనులో ఎక్కకుండా పక్క స్టేషనులో రైలు ఎక్కుతాడు. ఆమె, కొజుబా తదితర పరిచయస్తులు అతనిని స్టేషను వరకూ సాగనంపుదా మనుకున్నారు.

"రూక్-వసంత కోకిల! ఈ ముక్క జ్ఞప్తికి వచ్చినపుడల్లా మందహాసంతో ఆమె మొహం ప్రకాశించేది.

కాని జాగ్రత్తగా మెసలుకోవాలని నిశ్చయించుకున్నారు. వారంతా వెళ్ళి ఉన్నట్టయితే గుట్టు బైట పడేదే. అవాంతరం ఏదయినా జరిగితే అతనిని రక్షించడానికి టారాస్, నికిఫొరోవ్ కూడా వెళ్ళారు.

స్యోమా సూటుకేసులు తీసుకుని వేరే దోవను వెళ్ళాడు. సూటుకేసులు ఖాళీ! కరపత్రాలన్నీ ఆ జిల్లాలో పంచిపెట్టడమయింది.

ఇక ఆ జిల్లా? ఆ ఆదివారం, ఆ ఘడియ తరవాత గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. అక్కడి జనం ఇంత అద్భుతమయిన వాళ్ళని ఆమె ఎన్నడూ అనుకోలేదు? సంవత్సరాల తరబడి ఇరుగు పొరుగున నివసిస్తున్నారు. కాని ఒకరి నొకరు గమనించలేదు. ఆ ప్రదేశం విసుగు పుట్టించేది. ఆసక్తి కలిగించేదేమీ అక్కడ లేదు. కాని సమయం వచ్చే సరికి ఆ కుర్రకారంతా అద్భుతంగా నిలబడ్డారు. రెండు సంవత్సరాలుగా ఆమె స్యోమాను ఎరుగును. ఇద్దరూ ఒకే రాజకీయ అధ్యయన సమితికి చెందినవారే. అతడు మామూలు యువకుడే అనుకుంది. ఇక ఇపుడు... బౌమన్ కాస్త దోవలో పెట్టాడు. మనిషి మారిపోయాడు.

గస్టిలోవ్ కి కోపం వచ్చింది. కొజుబా ఒకడే కాదు, స్యోమా, టారాస్ కూడా అతనిని లెక్క చేయలేదు. మాస్కో వెళ్ళిపోతానని చెప్పాడు అటువంటివాళ్ళు చాలామంది అక్కడ ఉన్నారు. ఇంకా బురదలోపడి ఉన్నవాళ్ళు అన్నాడు బౌమన్ వీరిని గురించి.

ఇరీనా తలమీద రుమాలు తీసివేసుకుని అద్దంలో చూసుకుంది.

"ఓ-బలే" అనుకుంది.

జుట్టు సవరించుకుని, ఎదుటి గోడకు ఆనుకుని ఉన్న బీరువా దగ్గిరికి వెళ్ళింది. బీరువా బహుచక్కగా ఉంది. గదిలోని ప్రతి వస్తువూ ఆమె కొద్దిజీతంతో బతికే పంతులమ్మ అని చెప్పకయే చెపుతోంది. ఇరీనా జీతం ఏదో తిండికీ బట్టకి సరిపోతుంది. మంచి మంచి సామాను ఎలా కొనగలుగుతుంది ? మంచం, బల్ల, పుస్తకాల అలమారా, నీళ్ళకుండీ, అద్దం-ఇంతే, ఆ గదిలో ఉన్నవి. ఒక్క అరగంటలో అన్నీసర్ది బండిలో ఎక్కించవచ్చు. ఒక్క బీరువా తప్పితే తక్కినవన్నీ చవకరకం. పైగా అసహ్యం గొలుపుతాయి. బీరువామాత్రం పెద్దది. ఖరీదయింది. దేవదారు చెక్కతో చేసింది. ఒకపుడు ఏ వర్తకుడి భార్యో నగలు పెట్టడానికి దానిని ఉపయోగించి ఉంటుంది.

బీరువాదగ్గిరికి వెళుతూ ఇరీనా పాడసాగింది. ఆ సమయంలో ఒక ముసలావిడ ముందుగా తలుపు కొట్టకుండా లోనికి చక్కా వచ్చింది. సంసార పక్షంగా దుస్తులు ధరించింది. నెరిసిన జుట్టు మీద నల్లజాలరు ముసుగు వేసుకుంది.

"యింత ఆలస్యంగా యింటికి రావడం ప్రారంభించావేం?" అని అడుగుతూ తలపంకించి నిట్టూర్చింది." యింటి సంగతే మరిచే పోయినట్టున్నావు. ఆడదానికిది తగిందికాదు. యింటో కాలు నిలవనిదాన్ని యెవరు పెళ్ళాడతారు?"

ఇరీనా నవ్వి బీరువా దగ్గిరనుంచి వచ్చి ఆ ముసలమ్మను పట్టుకొని మెల్లగా నొక్కింది.

"నీకు ఆవగింజంతయినా యేమీ తెలియదు. అమ్మా! గొడవ చెయ్యకు. ఓ అంతా అద్భుతంగా వుంది. నాకు బోలెడు పని వుంది కాబట్టే యింటిపట్టున యెక్కువగా వుండడానికి వీల్లేకపోతోంది. బోలెడంత పని !"

తల్లిని బుజాలు పట్టుకుని తిప్పి గుమ్మంలోకి తీసుకువెళ్ళింది. "రేపటికి సాధ్యమయినంత తొందరగా సిద్ధం కావాలి." గుమ్మంలో తల్లిని ముద్దిడుకుని తలుపు తెరిచింది.

"కాస్త యేదయినా తినగూడదూ" అని తల్లి బతిమాలింది. "మధ్యాహ్నం భోజనం చెయ్యనేలేదుగా!"

"లేదు" అని ఒప్పుకుంది ఇరీనా. "కడుపులో నకనక లాడు తోంది. వెచ్చచేసి, యిక్కడికి తీసుకునిరా, అమ్మా! యేమాత్రం తీరుబడిలేదు. పనిచేసుకుంటూ తింటాను."

ఆ ముసలమ్మ బరువుగా నిట్టూర్చి తల అడిస్తూ వెళ్ళిపో యింది. ఇరీనా తలుపు గడియవేసి బీరువా దగ్గిరికెళ్ళి ఆఖరి సొరుగు లాగింది. అందులో జత మేజోళ్ళున్నాయి. ఇంకేమీ లేవు. అవ యినా పాతవి. అనేకసార్లు చినిగిపోవడం, కుట్టడం, జరిగింది. ఆమె జాగ్రతగా దొంగ సొరుగులాగి అందులోనుంచి, ఉలిపిరి కాగితాల కట్ట, మాటలు వ్రాసిన స్టెన్సిలు, ఒక కార్డుబోర్డు చట్రం, రోలరు పైకితీసింది. స్టెన్సిలుచుట్టూ కార్డుబోర్డు చట్రం అమర్చి, దాని కింద కాగితం పెట్టింది. రోలరు సిరాలో ముంచింది. సిరా రంగు లేతధూమ్రం. (ఎంత యత్నించినా అచ్చుసిరా రంగు కంటె ఎక్కువ కారురంగు తీసుకురాలేకపోయింది.) రోలరు స్టెన్సిలుమీద దొర్లించింది. అలా అచ్చయిన కరపత్రం తీసివేసి, ఇంకో తెల్ల కాగితం పెట్టింది. స్టెన్సిలుమీద రోలరు మళ్ళీ దొర్లించింది. ఇంకో కరపత్రం తయారయింది.

రష్యన్ సోషల్–డెమాక్రాటిక్ లేబరుపార్టీ
ప్రపంచ కార్మికులారా ఏకంగండి!
మాస్కో జవులిజిల్లా కార్మికులకు
కామ్రేడ్స్!

"మనసమ్మె విజయవంత మయింది. నేతపనివారి, వడుకు పనివారి సంయుక్త కార్యాచరణకు పెట్టుబడిదారులు వెనకంజ వేశారు. కార్మికవర్గాన్ని సరిగా సన్నాహపర్చి, క్రమపద్ధతిలో నడి పితే వారిబలం అజేయమని చెప్పడానికి ఈసమ్మె విస్పష్టమయిన ఉదాహరణ. కామ్రేడ్స్! సమ్మె ముగిసింది. ఇకనుంచీ ఈ ఐక్య

తను కొనసాగిద్దాం. ఇతర జిల్లాలలో, ఇతర మండలాలలో ఉన్న మన కామ్రేడ్స్‌తో సంబంధాలు పెట్టుకుని, తద్వారా మన ఐక్య తను మరింత బలపర్చుకుందాం. మనందరి ప్రయోజనాలు ఒకటే! మనందరి వర్గ శత్రువూ ఒకడే. కామ్రేడ్స్, జ్ఞాపకం ఉంచుకోండి. మన శత్రువుకు స్వతస్సిద్ధంగా బలంలేదు. మనఅనైక్యతే మన శత్రువుకు బలం!"

తక్కిన మాటలు స్పష్టంగా కనిపించడంలేదు. "మొరోజ్ ఓస్ ... 82 ... ఆటోక్రీ ..."

ఇరీనా మనసులో బాధపడుతూ తల పంకించి అచ్చు కాగితాలను అవతల పెట్టింది. చాలా పనిచేయాలి. స్టెన్సిలుమీద జాగ్రతగా వ్రాయడం మాటలుకాదు. చాలా ఓపిక ఉండాలి. తెల్లవారేసరికి కరపత్రాలు తయారవాలి. అచ్చు ఆఫీసులో తయారయిన కరపత్రాలలోలాగా అక్షరాలు విస్పష్టంగా కనిపించాలని ఆమె తాపత్రయం. ఇది విజయ.కరపత్రం. బామన్ ఇతర మిల్లులలో వారిని సన్నాహపరిచేందుకు వెళ్ళేముందు ప్రోఖ్ కార్మికుల ఎదట వ్రాసిన కరపత్రం

తలుపు కొట్టిన చప్పుడు వినిపించింది.

"యిదిగో ఒక్క నిమిషంలో వస్తున్నా" అంది ఇరీనా చిరచిరలాడుతూ.

మళ్ళీ రాజసంగా తలుపుకొట్టిన చప్పుడయింది.

"ఒక్క నిమషం ఆగలేవా యేం?"

ఇరీనా స్టెన్సిలు బీరువామీదపెట్టి రాగంతీస్తూ గుమ్మం లోకి వెళ్ళింది. తాళంచెవిపెట్టి తిప్పింది. బయటనుంచి తలుపు తోసారు. కాని తలుపు తెరుచుకోలేదు రెండు సార్లు చెవి తిప్పింది

"అంత తొందరెందుకు" అని ఇరీనా నవ్వింది.
చెవి రెండోసారి తిప్పి ఒక తలుపుబుజంతో నొక్కిపట్టి తలుపు సందులోకి చెయ్యి పోనిచ్చి కొద్దిగా తెరిచింది.

"సరే, ఆ ప్లేటు యిలా యియ్యి. నువ్వు లోపలికి రావడానికి వీల్లేదు. నా రహస్యాలు నా కున్నాయి."

కాని పెద్ద వేళ్ళు ఆమె మోచేతిపైన పడి గట్టిగా పట్టు కున్నాయి. తలుపు గట్టిగా తోసేసరికి బాగా తెరుచుకుంది. ఆ తెరుచుకోనడంలో తలుపు ఇరీనా బుజానికి గట్టిగా తగిలి బాధ కొట్టింది.

"సరే. నీ రహస్య మేమిటో చూస్తాం"

పొడుగ్గా తీగలా ఉన్న బొద్దుమీసాల పోలీసు కాప్టెన్ ఆమె చేతిని వదలలేదు. అతని వెనకాలే పోలీసు జవానులు వచ్చి గుమిగూడారు. వారి వెనక చిరపరిచితమయిన, అసహ్యాకరమయిన మిఖల్‌చక్ మొహం కనిపించింది.

"యీ అమ్మాయేనా?" అని కాప్టెన్ మిఖల్‌చక్‌ను చూస్తూ ఇరీనా కేసి తలపంకించాడు.

"అవును" ఒక సెకండు సేపు కనిపించి ఆ తరువాత మొహం పోలీసుల వీపులమాటున కనిపించకుండా పోయింది.

కాప్టెన్ బీరువా కేసి తిరిగాడు. స్టెన్సిలు, రోలరు కంట పడ్డాయి.

"ఓ-బలే నక్కని తొక్కొచ్చాం" అతని స్వరంలో సంతృప్తి ధ్వనించింది. "అన్ని అంగులూ వున్న అచ్చు అఫీసులా వుందే!"

బీరువాదగ్గరికి ధీమాగా నడిచివెళ్ళి తాపీగా వేలితో దానిని చూపించాడు.

"బలే! యింతవరకు యిలాంటి బీరువా నేనెన్నడూ చూడ లేదు. యిదంతా నీ స్వయంకృషి అనుకుంటా"

ఇరీనా చీదరతో చేయి తడుముకుంది. పోలీసు కాప్టెను గట్టిగా పట్టుకున్నప్పుడు మోచేతిమీద గాయమయింది.

"అవును." అంది మందకొడిగా.

"నువ్వు యింజనీరువయితే బాగుండిపోను" అని కాప్టెన్ ఆమె మాట అంగీకరించినట్లు తల ఊపాడు.

"అవును. బాగుంటుంది" అని ఇరీనా అంగీకరించింది.

కాప్టెన్ ఊదా కాలరుమీద కొట్టవచ్చేటట్లున్న గొంతుక ముడి బాగా కనిపించేటంతగా తల వెనకకివంచి విరగబడి నవ్వాడు. "యింటి పనులు చూసుకుంటూ భర్తని కనిపెట్టుకుని వుండడం స్త్రీలపని. రాజచట్టం స్త్రీలు యింజనీర్లు కావడానికి వొప్పుకోదు, నీకు తెలిసేవుంటుంది."

"అలాఅయితే యీ సామ్రాజ్యంలో నేను యింజనీరుగా పని చెయ్యను." అంది ఇరీనా బుజాలు ఎగరవేస్తూ. "యిపుడు కాదు, కొద్ది సంవత్సరాల తరవాత, సామ్రాజ్యం... ఊం–"

పోలీసులు గదిఅంతా గాలించారు. తాళపుచెవులు మోగించుకుంటూ లావుపాటి పోలీసు సార్జంటు టేబిలు సొరుగుతాళం తీసి ఎక్సరుసైజు పుస్తకాలు, కాగితాలు, ఉత్తరాలు బయటకు తీసాడు. ఇరీనా మొహం చిట్లించుకుంది. ఆ ఉత్తరాలు ప్రమాదమయినవేం కావు, పరిచయస్తులు, స్నేహితురాండ్రు వ్రాసినవి. కాని పోలీసులు ఆ ఉత్తరాలు చదువుతారేమోననే ఆలోచన అసహ్యం గొలిపింది.

చాపకిందనుంచి ఇస్క్రా పత్రిక కాపీలు ఒక పోలీసు బయటకు లాగాడు. ఆ చాపకింద ఉన్నాయన్నమాట! ఆ చాపకింద పెట్టానని ఎలా మరిచిపోయిందో! సమ్మె విజయవంతం కావడంతో, బామన్‌ను భద్రంగా పంపగలగడంతో ఆమెతల తిరిగిపోయింది. బామన్ చెప్పనేచెప్పాడు, ఇంటిలో ఏమీ ఉండనీయొద్దు – ముఖ్యంగా చట్టవిరుద్ధమయిన సాహిత్యం అని హెచ్చరించాడు. అరెస్టులు జరగకపోయినా సోదాలు దిరిగితీరుతాయని కూడా చెప్పాడు. చెప్పినంతా జరిగింది.

కాప్టెన్ మెల్లిగా పత్రికలు లెక్కపెట్టాడు. లెక్కపెట్టడం పూర్తిచేసి వక్రంగా మందహాసం చేసాడు.

"అచ్చు ఆఫీసు ఇస్క్రా సాహిత్యం. ఆదివారపు బడి వంకతో ప్రచారం. ఆదివారపు బడిలో పాఠాలు చెపుతూంటావు కదూ? మీస్కూలు, నేనెన్నడూ చూడలేదనుకో, రొమనోవ్‌ల గొప్పదనాన్ని గురించి బోధించడం లేదని నాకు తెలుసులే. యిదంతా యెలా కనిపిస్తోందో తెలుసా? యింకేంవుందీ, కఠిన నరకమే!"

ఇరీనా ఏమీ మాట్లాడలేదు. ఆలోచనలు కూడ గట్టుకోవాలి. జైలులోకి ఏవేవికూడా తీసుకు వెళ్ళవచ్చునో అడగడమా? బట్టలు, పుస్తకాలు? ఉహూఁ-పుస్తకాలు అసలు తీసుకు వెళ్ళనియ్యరు."

కాప్టెన్ బల్లముందు కూర్చుని చేతిసంచిలోంచి తెల్ల కాగితం పయికి తీసాడు.

"అసలుప్రతి, ప్రోషినో, నెం 47."

"నేను, ప్రత్యేక శాఖకుచెందిన, పోలీసు కాప్టెన్‌ను, ..."

ఇరీనాకేసి చూసాడు. రెండు జడలు వేసుకుని పొడుగ్గా అందంగా కనిపించింది. కలం కింద పెట్టేసాడు.

"యిందులో నువు ప్రమేయం యెందుకు పెట్టుకున్నావు? మంచి వయసులో వున్నావు. మీఅమ్మ చాలా మంచిదికూడాను."

అవును. తల్లి గదిలోలేదేం? బయట నిలబెట్టేసారా? ఆమెను అరెస్టు చేసారా? లేకపోతే ఆమె కావాలని వైదొలగిందా?

కాప్టెన్ మళ్ళీ కలంపట్టాడు. ముత్యాలలాంటి అక్షరాలతో దగ్గరదగ్గరగా ఆసలు ప్రతి వ్రాసాడు. ఏయే వస్తువులు, ఎక్కడ, ఏవిధంగా దొరికినవి సవిస్తరంగా వ్రాసాడు. పోలీసులు గోడవారే మాట్లాడకుండా నిలబడ్డారు. మిఖల్‌చక్ వెళ్ళిపోయాడు. అతను చేయవలసిన పని, ఆమెను పట్టివ్వడం, చేసాడు. మాయమయి చక్కాపోయాడు. సిగ్గుపడ్డట్టు కనిపించాడు. తను వృత్తిగా పెట్టుకున్న ఈ పనులకు సిగ్గుపడ్డాడా? లేక ఇరీనాను పట్టిచ్చానని మాత్రమే సిగ్గుపడ్డాడా? కిందటి సంవత్సరం వచ్చి ఇరీనా దగ్గిర

కొద్దిగా అప్పు పుచ్చుకున్నాడు. అతని సోదరికి జబ్బు చేసింది. ఇరీనాను బతిమాలుకున్నాడు, చివరికి ఏడ్చాడు, అప్పియ్యాలసిందని. ఆమెకి వచ్చేజీతం ఇద్దరికి సరిపోదు. ఇక ఇతర్లకి సహాయం చేయడం కష్టం. అయినా ఇచ్చింది. మరి అతనో...

కాప్టెన్ వ్రాత కట్టిపెట్టి జేబులోనుంచి సంచి, సంచిలోనుంచి ఒక ఛాయాచిత్రం తీసాడు. "యీ బందిపోటు దొంగేనా ఇస్క్రా పత్రికను నీకు పంపింది?"

బామన్! మెత్తటి మడత హాయిపెట్టుకుని, మందహాసం చేస్తున్నాడు. పొడుగ్గా ఉన్నాడు. సూటుకేసులు మోసుకు వెళుతున్నాడు. అది అతని అకస్మిక ఛాయా చిత్రం! చాలా బాగుంది!

ఈ ఆలోచనలకు చిరునవ్వు వచ్చింది కాని కాప్టెన్ ఆమెను జాగ్రత్తగా కనిపెట్టి చూస్తున్నాడు ఆమె పెదవులలో, కళ్ళల్లో మందహాస భావాలు రానీయలేదు.

"అతడెవరో యెరగను."

కాప్టెన్ ఆమెను నిశ్చలంగా కనిపెట్టి చూసాడు.

"యెరగనని చెప్పి లాభంలేదు. అతన్ని యిక్కడ యీ పట్నంలో అరెస్టు చేసాం. అతనితో నీకు సంబంధం లేదని యెలా నమ్మమంటావు? నీ మేలుకోసమే అడుగుతున్నాను. నువు చిన్నదానివి. అనుభవం లేనిదానివి. ఇక అతడో ఆరితేరిన ఘటం. యిలాంటివాటిల్లో నిన్ను యిరికించాడంటే చిత్రమేముంది? యిదంతా నిదానంగా ఆలోచిస్తున్నాం. గొడవలేకుండా తప్పు ఒప్పుకోవడం మంచిది. ఎక్కువచిక్కుల్లోపడవు."

"మీ విషయం జాగర్త పడుదురూ, నా సంగతి తరవాత చూద్దాం" అంది తీక్షణంగా, పోలీసులవైపునుంచి తల తిప్పుకుంటూ. "చివరికి నష్టపడేది మీరే, నేనుకాను, సామాను సర్దుకోనా?"

అద్దందగ్గరికి వెళ్ళి అలంకరణ బల్లమీది హేటు తీసుకుంది. అద్దం వెనక ఉన్న గోడఅవతల ఆమెతల్లి వెక్కివెక్కి ఏడుస్తోంది.

మనసులో బాధపడి తనలోకి తాను కుంచించుకుపోయింది. పెదవులు వణికాయి, బొమ ముడిపడింది. గోడమీద వేళ్ళ కనుపులతో నొక్కి- మెల్లిగా తల్లిని పిలిచింది.

"అమ్మా! యేడవకు. గుడ్ బై!" అంది.

# 15

# పోలీసు మంత్రి

సెమినోవ్ లైఫ్ -గార్డు రెజిమెంటుకు చెందిన పటాలానికి ముందు నడుస్తున్న డోలువాయిద్యకులు మేళం దేశీయమంత్రిత్వశాఖ భవనానికి సూటిగా వచ్చారు. దేశీయశాఖామంత్రి, పోలీసుముఖ్యాధికారికి - అతను కచేరిలో ఉన్నా లేకపోయినా ఆభవనం ముందు నుంచి వెళ్ళే ప్రతి పటాలం ఆగి సైనిక వందనం అర్పించి మరీ ముందుకు సాగిపోవాలి. బ్యాండు నాయకుడు గిర్రున తిరిగి, వెనకకు నడుస్తూ తెల్లటి తొడుగు వేసుకున్న చేయి ఎత్తి వేత్రం ఆడించాడు. పెద్ద వెండిబాకాలు, తాళాలు మోగాయి, చలిగాలి గుండా 'సెమినోవ్ మార్చి' గీతం బ్యాండు వాయించింది. ఆ గీతం ఆడంబరంగా, అహంకారపూరితంగా, ఉద్రిక్తంగా ఉంది. బూడిద రంగు దుస్తులు ధరించిన సైనికులు వళ్ళు బిగపట్టుకుని నిలుచున్నారు. తళతళా మెరిసే సన్నీలు పైకి లేచాయి. ఆ తరువాత అడుగుల చప్పుడయింది.

"లెఫ్ట్, లెఫ్ట్! వన్, టూ..."

... ... ... ...

... ... ... ...

నగిషీ చెక్కిన పెద్ద సిందూరపు వ్రాతబల్ల ముందుకూర్చున్న దేశీయ శాఖామంత్రి తనముందు పడిఉన్న సన్నటి అచ్చు కాగితాలమీదనుంచి కళ్లు పైకెత్తాడు. చిరాకు వేసింది కిటికి బయట బ్యాండువాళ్ళు వాయించిన పాట అసంగతంగా ఉంది. అతని ఆలోచనా పరంపరకు అడ్డు తగిలింది. అతిముఖ్యమయిన 'ప్రభుత్వ విషయాల'ను గురించి ఆలోచిస్తున్నాఁడు. మంత్రికి ఆలోచించడానికి ఇంకేం ఉంటాయి ? ఆ ఆలోచనలు తిరిగిరావడం లేదు. దాంతో వాటివిలువ పెరిగింది. అతను ఆలోచిస్తున్న విషయం జారుకు, దేశానికి అతిముఖ్యమయినదేమో ?

పడకకుర్చీ పక్కగా వినయంగా నుంచున్న ఒక పోలీసు సూపరింటెండెంటు పై అధికారికోప కారణం గ్రహించి, భూమ ముడివేసి, కిటికీతెరవంక అయిష్టంగా చూసాడు. ఆ కిటికీ వెనక నుంచివచ్చే ధ్వనిలో అతని రిపోర్టు మునిగిపోయింది. మంత్రి సూప రింటెండెంటు బొమ ముడివేయడం చూసి అంగీకార సూచకంగా కనుబొమలు ఆడించాడు పై అధికారి చిత్తవృత్తిని కిందివాళ్ళు ప్రతిబింబిస్తూండాలి. అతను పై అధికారియొక్క రూపాంతరంగా ఉండాలి, నీడలా ఉండాలి.

... ... ... ...

"లెఫ్ట్ ! లెఫ్ట్ ! వన్, టూ..."

... ... ... ...

సైనికశ్రేణి కదిలిపోయింది. బ్యాండువాద్యం ఆగింది. దూరాన్నుంచి డోళ్ళ చప్పుడు మాత్రమే వినిపిస్తోంది. కాని ఆ ఆలోచనలు తిరిగి రాలేదు.

"సరే, కానీయి" అన్నాడు మంత్రి చివుక్కున కస్సుబుస్సు లాడుతూ.

"వీళ్ళంతా కీవులో సభ జరపబోతున్నా రంటావు, అంతే కాదూ ?"

సూపరింటెండెంటు తల పంకించి. చురుకుగా చీలమండలు టక్ టక్ లాడించాడు.

"సరిగ్గా అంతే. సోషల్ డెమాక్రాటిక్ పార్టీ వర్గాలలో 'సుందరం' అని పిలువబడే క్రోక్‌మాక్ అనే కీవుబారిష్టరు..."

"అది అతని మారుపేరా ? లేక నిజంగానే అతను సుంద రుడా!" అని తలఎత్తి మంత్రి అడిగాడు.

సుందర పురుషుడు ఇలా ఉంటాడని చెప్పడానికి రొమ్ము విరిచి, పెదవులు ముందుకు జాచాడు. సూపరింటెండెంటు తొందరగా తల ఆడించాడు. కళ్ళల్లో మందహాసం మెరిసింది.

"అతని ఛాయాచిత్రాన్ని బట్టి అతను యింకా అరెస్టు కాలేదు. చక్కటివాడనే తోస్తుంది." అన్నాడు చులకనగా. "యీ క్రోక్‌మాక్ మహాసభ యేర్పాట్ల విషయం మాట్లాడడా నికి మాస్కో వెళ్ళాడు."

"అక్కడ యేంమాట్లాడాడు ?"

"దురదృష్ట వశాత్తు" సూపరింటెండెంటు చేతులు చాపి, "సమాచారమంతా బయటవుండి పరిశీలించి సంపాదించిందే. క్రోక్‌మాక్ మీద నిఘాపెట్టి వుంచాం. తక్కినవాళ్ళలాగా అతడు రహస్య కుట్రదారు కాదు. రాకపోకల విషయంలో అజాగ్రత మనిషి."

మంత్రి మందహాసం చేసి "సుందర పురుషులు స్వభావ సిద్ధంగానే అజాగ్రత మనుషులు" అన్నాడు.

మంత్రిగారి హాస్యోక్తిని తనెంత మెచ్చుకుంటున్నదీ వెల్ల డించడానికి సూపరింటెండెంటు పెద్దగా నవ్వాడు. అతి చనువుగా మెలిగిన ఈ సమయంలోకూడా గౌరవభంగంగా ప్రవర్తించలేదు.

"సరిగ్గా అదే నేనూ చెప్పబోతున్నాను. మహాసభ..."

"యీ మహాసభ" మంత్రి అడ్డంవచ్చి, "విదేశాలలో లెనిన్ పూనుకుంటానని చెప్పిన విషయం గురించేనా ?

సూపరింటెండెంటు భయంతో కళ్ళు చికిలించాడు.

"క్షమించండి. సరిగా అర్థంకావడంలేదు. యిది..."

"మనమీద బహిరంగంగా, నిశ్చితంగా లెనిన్ ప్రకటించిన యుద్ధానికి సంబంధించింది" అన్నాడు మంత్రి తనముందున్న పత్రిక అంచుకింద వేలిగోటితో చారపడేట్టుగీస్తూ, "యిదిగో యీ పత్రిక నువ్వుచదివేవుంటావనుకుంటా. కిందటి సంవత్సరం మే నెలలో వెలువడినా యిపుడే నాకంట బడింది. దారుణం, మహాదారుణం? విదేశాలలో యేజంట్లుకి డబ్బు తగలేస్తున్న దెందుకు?"

సూపరింటెండెంటు తొందర తొందరగా కళ్ళజోడు సవరించుకున్నాడు. మళ్ళీ ఇస్క్రా! మంత్రి కళ్ళముందు ఎవడు పడవేశాడు?

" రష్యాకు యేజంట్లను పంపడం అన్న విషయం దగ్గిర నుంచి చదివిచూడు. యీ సోషలిస్టుల వ్రాతలు నాకు వెంటనే అర్థంకావు."

సూపరింటెండెంటు గొంతు సవరించుకుని, "యిక్కడ నుంచా?"...పరిస్థితులు ఎరిగి, ఒకరితో ఒకరు సజీవ సంబంధాలు పెట్టుకునే యేజంట్లు ఐక్యసంఘటన, యేజంట్లు మనకిపుడు అవసరయిన సంస్థకు, దేశమంతటా విస్తరించుకోగలిగిన సంస్థకు ఈ ఏజెంట్లు మూలకందంగా తయారుకావాలి."

"చూసావా?" అంటూ మంత్రి చూపుడువేలు పైకెత్తాడు. "దేశమంతటా!"

"...పని విభజనను వివరంగా, ఖచ్చితంగా బహుముఖాల అమలు జరపగలిగినంత పెద్దది, ఏ పరిస్థితులలో నయినాసరే, ఎట్టి చిక్కులలోనయినా సరే, ఎట్టి అవాంతరాలలో నయినాసరే అప్పగించిన పనిని వెనకాడకుండా చేయగలిగినంతగా ఆరితేరి ఒకచోటే తన బలాన్నంతా కేంద్రీకరించి అత్యధిక సంఖ్యాకంగా ఉన్న శత్రువును బహిరంగంగా తలపడకుండా తప్పుకునేటంత సరళమయి యీ శత్రువుయొక్క క్లిష్టపరిస్థితిని అవకాశంగా తీసుకోగలిగిన..."

60

మంత్రి పెదవులు వణికి వెక్కిరించాయి. సూపరింటెండెంటు కష్టంమీద ఊపిరి పీల్చాడు.

"ఆగారెందుకు? చదవండి"

"యెప్పుడు అవకాశం చిక్కితే అప్పుడు, యెక్కడ అవకాశం చిక్కితే అక్కడ హఠాత్తుగా దాడి చేయడం..."

పూర్తి అయిందని చెప్పడానికి మంత్రి ఆ పత్రికా భాగం మీద చేయిపెట్టి మూసేసాడు.

"యిది లాంఛనప్రాయంగా యుద్ధం ప్రకటించడమే! యేమిటి? రాజకీయపు యెత్తుగడ అనాల్సి వుంటుంది."

"రాజకీయపు యెత్తుగడ!" అంటూ సూపరింటెండెంటు అసహ్యాభావంతో పెదవులు విరిచాడు." తగని గౌరవం వాళ్ళకిస్తున్నారు. లెక్కకి సరిగా నలుగురు లేరు, వాళ్ళు సవాలు..." సగర్వంగా బాగా వెండిపూసిన బాడ్జీ పైకెత్తాడు. "ప్రపంచంలోకల్లా గొప్పసామ్రాజ్యంమీద చేస్తే!"

మంత్రి దృష్టి మరలించి పరధ్యానంలో బరువాటి పేపరు వెయిటును - చలువరాతి దిమ్మమీద వెండి ఎలుగుబంటి-కదిలించాడు.

"అవునవును. లెక్క నలుగురు! ఒంటరిగావుంటే అపాయం లేదుగాని, యెక్కడయినా అల్లర్లు సాగితే, కార్మికుల సాయుధ తిరుగుబాట్లు సాగితే, బాల్టిక్ నౌకానిర్మాణ కేంద్రంలో అసంతృప్తి ప్రబలితే, లక్షలాది కార్మికులు సమ్మెచేస్తే, అప్పుడు లెక్కకు నలుగురుకాదు! రష్యా అంతటా ఇస్క్రా యేజంట్లు విస్తరించుకున్నారా..."

"వాళ్ళంతా కీవ్‌లో సమావేశం కానున్నారని మనవి చేసుకుంటున్నా." అన్నాడు సూపరింటెండెంటు అధికారి దయ సంపాదించాలని. "సమావేశం అయితే మన గుప్పిటలోనుంచి తప్పించుకోకుండా జాగ్రత పడదాం." ఎలుక బోనును అనుకరిస్తూ చేయి

ఆడించి నాలుకతో లొట్ట వేసాడు. కాని మంత్రిమాత్రం అతని వంక చూడలేదు.

"సూపరింటెండెంటు నోవిట్స్కీ శక్తిసామర్థ్యాలలో నీకు నమ్మకం వుందా ? కీవ్‌లోని రహస్య పోలీసు అతని అధీనంలో వుంది, నీకు తెలుసుగా. యీ సమావేశం విషయం నిర్లక్ష్యం చేయడని నీకు నమ్మకమేనా ?''

"ఆఁ-గట్టినమ్మకమే !'' అని సూపరింటుండెంటు చేతులు జోడించడానికి సిద్ధమయాడు. "మంచి శక్తి సామర్థ్యాలు గల వాడు, విశ్వాసపాత్రుడు. క్రోక్‌మాల్ అశ్రద్ధవల్ల అతనితో సంబంధాలు పెట్టుకున్నవారెవరో తెలుసుకోగలిగాం. వారిమీద, విదేశీ యేజంట్లమీద నిఘా వుంచాం. ఉదహరణకి మాస్కోలో అతను బామన్‌ను కలుసుకుని...''

బామన్ అనే పేరు వినబడేసరికి మంత్రి సూపరింటెండెంటు కేసి గుడ్లురుమి చూసాడు.

"ఆ జవులి జిల్లాలో మనల్ని బోల్తాకొట్టించి తప్పించుకున్న వాడేగా ? యీ బామన్‌ను అరెస్టు చేసావన్నమాట ! బలే యీ సంగతి నాతో చెప్పినట్లు జ్ఞాపకం లేదే ?''

"విల్నియస్‌లో కనిపించాడు'' అని సూపరింటెండెంటు నసికాడు. "కాని మళ్ళీ మన యేజంట్లబారినుంచి తప్పించుకున్నాడు. అందువల్ల పెద్ద నష్టమేమీ జరగలేదు క్రోక్‌మాల్‌ని కలుసుకున్నాడు. యీ విషయం నిశ్చయం. తప్పకుండా కీవ్ సమావేశానికి హాజరవుతాడు. నోవిట్స్కీ వాడిపని పట్టిస్తాడు. సూపరింటెండెంటు బారిపడితే యిక తప్పించుకోవడం కల్ల !''

"యీ సమావేశానికి హాజరయిన వాళ్ళనే గనక నోవిట్స్కీ అరెస్టుచేస్తే ఇస్క్రా వ్యవహారమంతా అతనిచేతికి అప్పగించమని జారుచక్రవర్తిని ప్రార్థిస్తా. ప్రభుత్వం యీ వ్యవహారానికి చాలా ప్రాముఖ్యం యిస్తోంది. అందువల్ల అతను యెంతో వృద్ధిలోకి వస్తాడు. యీ విషయం మనసులో పెట్టుకుని మరీ పనిచేయండి.

యీ అంటువ్యాధిని మొదలంటా మాడ్చివేయాలి. డబ్బుకేం కొదువలేదు. రహస్యనిధినుంచి యెంతయినా తీసుకోవచ్చు. జారు చక్రవర్తిగారికి యీ నిధివిషయం తెలుసు. దానికి లెక్కా డొక్కా వుండదు. నిర్బంధాలుండవు.''

సూపరింటెండెంటు కళ్ళలో సంతృప్తి, దురాశ తళుక్కుమన్నాయి.

''డబ్బంటే కొదవేముంది! కొండమీద కోతిని దింపవచ్చు. కీవ్ విషయంలో మీరు గుండెమీద చెయ్యివేసుకుని హాయిగా నిద్రపోండి. నొవిట్స్కీ తప్పటడుగు వేయడు. నేను స్వయంగా యీ విషయం చూస్తాను. తొందరలోనే వుచ్చు బిగించేస్తాం.''

# 16

# కీవ్ వ్యవహారం

నిజంగానే ఉచ్చు బిగుసుకుంది. మహాసభ నాలుగో సమావేశం జరగనున్న ఇంటిని బామన్ సమీపించేసరికి అరగంట ఆలస్యమయింది. రహస్య పోలీసులు ఆ ప్రదేశాన్నంతటినీ చుట్టుముట్టారు. ఎటుచూసినా ఉద్రిక్త వాతావరణమే బామన్‌కి గోచరించింది. రోడ్డుపక్క నేలబాటమీద తొందర తొందరగా వెళ్ళే బాటసారులమధ్య పోలీసు ఏజెంట్లు కానవచ్చారు. గేట్లుదగ్గిర రక్షణ పోలీసులు శుభ్రమయిన దుస్తులు వేసుకుని, ఇత్తడి బాడ్జీలు రొమ్ములకు గుచ్చుకుని కాపలా కాస్తున్నారు. అది మారుమూల వీధి. ప్రశాంతంగా ఉంటుంది. అయినా అక్కడ లెక్కలేనన్ని

టాంగాలు నిరీక్షిస్తున్నాయి. ఇక టాంగాలు తోలేవాళ్ళు బాటసార్లను ఎక్కమని బతిమాలుకోవడం లేదు. దేనికోసరమో నిరీక్షిస్తున్నట్లున్నారు. ఇదంతా చూస్తే వీళ్ళు అక్కడ కేంద్రీకరించిన రహస్య పోలీసు శాఖలోనివాళ్ళనీ, అక్కడే పోలీసులు దెబ్బ తీయాలని చూస్తున్నారనీ ఇట్టే గ్రహించవచ్చు.

బామన్ ఒక్కచూపులో అపాయం గుర్తించాడు. శత్రువు బహిరంగంగానే తలపడ్డాడు. ఇంట్లో జొరబడేముందు చేయవలసిన హంగామా అంతా శత్రువు చేసాడు. ప్రతి సెకండూ విలువయిందే. ఒక్క నిముషమయినా వృధా పుచ్చడానికి వీల్లేదు. ఏమయినాసరే సమావేశం కాబోయేవారికి హెచ్చరిక అందజేయాలి. ఇంటిని పోలీసు గూఢచారులు చుట్టుముట్టినా ఎవరిదారిన వాళ్ళు తప్పించుకు పోవడానికి వ్యవధి చిక్కవచ్చు. ఏమయినా ప్రయత్నించి చూడాలిసిందే, అపాయకరమయినా యత్నించడం ఉత్తమం.

బామన్ ఒక పొట్లం ఊగించుకుంటూ నిశ్చింతగా నడక సాగించాడు.

పొట్లానికీ ఒక ప్రయోజనముంది. చట్టవిరుద్ధంగా పని చేయవలసివచ్చినపుడు పొట్లంకూడా బాగా ఉపయోగపడుతుంది. పోలీసు గూఢచారులు, ఆచూకీని బట్టి పని చేసేటపుడు వారిబారి పడిన మనుష్యులు పట్టుకు వెళుతున్న వస్తువులను శ్రద్ధగా గమనిస్తారు. ఆవ్యక్తి పట్టుకువెళ్ళే వస్తువునుబట్టి సంగతి సందర్భాలు పసి కట్టేస్తారు. చేతిలో ఏమున్నదనేదే ప్రధాన విషయం. ఊగిసలాడే బొమ్మగుర్రమా కాగితాల కట్టా, మాంసంకూరా? కాగితాల అయితే అవేవయినా కరపత్రాలు కావచ్చు.

బామన్ పొట్లంలో ఉన్నది నిజంగా మాంసంకూరే. దానికి చుట్టిన ఉలిపిరి కాగితంలోనించి స్పష్టంగా కనిపిస్తోంది. బామన్ వంక సందేహంతో చూస్తున్న పోలీసు గూఢచారికి సందేహనివృత్తి అయింది. బామన్ ఆ ఇంటికి సూటిగా వచ్చాడు. అక్కడ

ఏంజరుగుతుందీ చూడడానికీ, సంకేతం సరిగా ఉందోలేదో చూడ డానికీ వీలుగా వీధికి అవతలవైపు నడిచాడు. రెండో అంతస్తు కిటికీలో సీసాలో విల్లోమొక్క భద్రంగా ఉంది. దానిఅర్థం ఇంకా పోలీసులు సమావేశాన్ని భగ్నం చేయ లేదన్నమాట. అపాయం గోచరిస్తే ఆసీసా తీసేసేవారే. అంటే దాడి జరుగుతుందని అనుకోవడం లేదనే తోస్తుంది.

ఇక వీధికి అడ్డంగావెళ్ళి ఎవరికంటా పడకుండా ఇంట్లో ప్రవేశించాలి. మాటలుకాదు. పోలీసులు అంత కళ్లు మూసుకుని ఉండరు. కాని తప్పదు, ధైర్యం చేయవలసిందే.

కాలిబాట దిగి వీధిలో అడుగు బెట్టాడు. నల్లటి పెద్దకోటు వేసుకుని ఒక పోలీసు ఆ ఇంట్లోనుంచి ఉరుక్కుంటూ వచ్చాడు. కత్తి చేతపుచ్చుకుని గోడ వెంబడే పరుగెత్తుకుంటూ మూసిన ఇనప గేటుదగ్గరకు వెళ్ళి కత్తివారతో దానిమీద కొట్టాడు గేటుకొద్దిగా తెరుచుకుంది. గేటుగుండా నల్లటిపెద్దకోట్లు వేసుకున్నవారు, పోలీసు అధికారి ధరించే ఊదారంగు టోపీ, బూడిదరంగు పెద్దకోటు తొడి గిన వ్యక్తి బామన్‌కి కనిపించారు. కిటికీకేసి చూసాడు. సీసా మాయమయింది.

"వెళ్ళిపొండి, వెళ్ళిపొండి. యిక్కడ యేంచూస్తారు ?"

బామన్ తనను సమీపిస్తున్న రక్షణ పోలీసును గమనించ లేదు. బుజంమీద చెయ్యిపడుతుందని భయపడ్డాడు. కాని ఆ రక్షణ పోలీసుకి ఆవీధిలో జరుగుతున్న దానిలో ఆశక్తి ఎక్కువయింది. సింహద్వారంవంక, గేట్లవంక, కిటికీలవంక చూస్తున్నాడు. ఆ కిటికీల వెనక కీనీడలు తారాడుతున్నట్టు కనిపించింది. వీధిలోనుంచి రెండో అంతస్తులోని గదిని చూడటం సాధ్యంకాదు.

అలా చూడవలసిన అవసరంకూడా కలగలేదు. అరెస్టులు జరిగాయని స్పష్టమయిపోయింది. అదృష్టవశాత్తూ పోలీసులు తొందర పడ్డారు. అరగంట మాత్రమే ఆలస్యమయింది. తక్కిన వాళ్ళుకూడా ఆలస్యంగానే చేరుకుంటారని బామన్ ఆశించాడు,

పోలీసులే గనక కాస్త ఓపిక పట్టినట్లయితే అందరినీ అరెస్టు చేయడానికి వీలయేది. సంకేతం తొలగించారంటే, మరీ ఏమరపాటుగా ఉండేవాళ్ళు తప్పితే ఇంకెవరూ ఆఇంటిలో ప్రవేసించరు. ఈ ఆలోచనలతో అతని హృదయం కిక్కిరిసిపోయింది. నడక సాగించాడు. వెనకకు తిరిగి చూడలేదు. పోలీసులు ఏదయినా ఇంటిని చుట్టుముట్టి మూక ఉమ్మడిగా అరెస్టులు చేస్తుంటే వెనకకు తిరిగి చూడకూడదు. పొట్లం ఊగించుకుంటూ ముందుకు సాగిపోయాడు. దానికేసి చూస్తేచాలు మాంసంకూర పొట్లం అని విస్పష్ట మవుతుంది.

ఆ రోజునే కీవ్ నుంచి బయలుదేరి వెళ్ళిపోవాలి. వ్యవహారాలన్నీ స్వయంగా చూసుకోవలసిందే. సోదాలు పూర్తి అవుతేనే గాని రహస్య సమావేశ స్థలాలమీద ఆధారపడి లాభంలేదు. ఆరాత్రి రైలు ఎక్కుద్దామని నిశ్చయించుకున్నాడు.

మహాసభ భగ్నమయింది క్రోక్ మాక్ మంచి సన్నాహకర్తకాడు. సమావేశానికి హాజరు కాగలిగిన వారిలో మూడోవంతునుకూడా హాజరు పెట్టలేకపోయాడు. ఈ విషయంలో మొదటి సమావేశంలోనే వాదన రేగింది. సరే, అంతా మంచికే వచ్చింది. మహాసభ భగ్నమయిపోయింది. కాని ఇంకానయం, మరీ విషమించలేదు.

కీవ్ మధ్యలో ఉన్న క్రెశ్లాటిక్ వీధికి చుట్టు దోవన, సందులు గొందులు గుండా చేరుకొని అక్కడినుంచి తాపీగా కువెచెస్కీలోని తన హోటలుకు వెళ్ళాడు. ఇక తొందరలేదు. రైలు సాయంకాలంగాని బయలుదేరదు.

గదిలోకివెళ్ళి సామాను సర్దుకొని. చీటీవ్రాసి, గంట వాయించాడు. ఒక మగనొకరు వచ్చాడు. "వెళ్ళిపోతున్నారా, సార్" అన్నాడు.

'ఆఁ- వెళ్ళి పోతున్నా. యీ టెలిగ్రాం యిచ్చి చిల్లర నీదగ్గరే వుంచుకో. తొందరగా బిల్లు తయారు చేయమని గుమా

స్తాతో చెప్పు, ఒడెస్సా రైలుకు వెళ్ళిపోతున్నాను."

ఆ నౌకరు గడియారంకేసి చూసి, "రైలు మెనిమిది గంటలకిగాని బయలుదేరదు. పెందలాడే సామాను సర్దేసారేం ?"

"యింకా కొన్ని పనులు పూర్తి కాలేదు. అవి పూర్తి చేసుకోవాలి."

♦ ♦ ♦ ♦

ఆ మగనౌకరు టెలిగ్రాం చదువుతూ గబగబా బయటికి వెళ్ళాడు. టెలిగ్రాంలో ఇలా ఉంది:

"అష్కినాజూ అండ్ కో, ఒడెస్సా, 480 టన్నుల గోధుమ కొనడం రూఢిచేయండి. వాగన్లతో ఎక్కించడానికి ఇవాళే బయలుదేరుతున్నాను. —క్యులిలోవ్.

♦ ♦ ♦ ♦

బామన్ బిబికొవస్కీ వీధిలో బండివాడికి కిరాయి ఇచ్చి పంపివేసి తిరిగి క్రెశ్చాటిక్ వీధికి నడిచివెళ్ళి ఒక మంగలిషాపులో ప్రవేశించాడు.

"తలా ? గడ్డమా, ? మాన్షియర్ !"

అద్దంలో చూసుకుంటూ కాతాదారు దీనంగా గడ్డం తడుముకుని, "ఆఁ- నిజంచెప్పాలంటే చిరా కెత్తుతోంది." అన్నాడు,

"చిరాకెత్తుతోందా ? అయితే తరిగిపారేద్దాం" అన్నాడు మంగలి. "ఒక్క నిమిషం పట్టదు. గడ్డంపెరిగితే యేళ్ళుగడిచిన వాడిలా కనిపిస్తారు."

బామన్ ఒక క్షణం ఆలోచించి పెదవి కొరుక్కున్నాడు. మంగలి ఎలాగూ గొరిగించు కుంటాడు గదా అని ముందుగానే దువ్వెన గడ్డంలోకి పోనిచ్చాడు. గడ్డం షోగ్గా కత్తిరించడానికికంటె శుభ్రంగా గొరగడానికి రెట్టింపు ఇచ్చుకోవాలి.

"గడ్డం లేకపోతే షోగ్గా వుంటారు."

"అయినా? అయితేసరే, గొరిగేసెయ్యి."

మంగలి గడ్డం శుభ్రంగా గొరిగేసాడు. బామన్ గెడ్డంలేని చెంపలను చూచుకుని చింతించాడు.

"యేదో కొత్తగావుంది. గడ్డం లేకపోతే మీసం అనాథలా వుంది. అసహ్యంగా వుంది."

మంగలి మళ్ళీ సంతోషంతో నవ్వాడు. ఒక అడుగు వెనకకివేసి కాతాదారుని పరీక్షగా చూసి, "మీరన్నది నిజం. మీసాలుకూడా గొరిగేసెయ్యనా?"

... ... ... ...

ఒడెస్సా రైలు ఎనిమిది గంటలకు బయలుదేరింది. రహదారి చీటి తీసుకుంటూ హోటలులో అధికారికి తాను ఒడెస్సా వెళుతున్నానని బామన్ చెప్పాడు. కాని చెప్పినట్లు ఒడెస్సా వెళ్ళ లేదు. ఖార్కోవ్‌కు రైలుటిక్కెట్టు కొన్నాడు. పది నిమిషాలు ముందే రైలు బయలుదేరింది.

# 17

# రైలులో

కీల్-ఖార్కోవ్-కర్స్క్, -వొరోనెజ్-గ్రియాజీ-యెలెట్స్-టులా... అనుసరించిన వారిని గాబరాపెట్టడానికి బామన్ మాస్కోకు ఈచుట్టుదారిన బయలుదేరాడు. రైళ్ళుమారి ఖార్కోవ్, కర్స్క్ స్టేషన్లు సురక్షితంగా దాటాడు. రైలు వొరోనెజ్ స్టేషను సమీపానికి వచ్చింది.

టికెట్లు తనిఖీచేసే సాకుతో పోలీసులు, రైల్వేకండక్టర్లు, చాలాసార్లు బోగీలోకి వచ్చిపోయారు. ప్రతి తడవా గూఢచారులు బామన్ మొహం చాటుగా పరీక్షించి సాగిపోయారు. నుదుటిమీదికి ఉన్నిటోపీలు లాక్కోవడం మూలంగా వారికళ్లు బయటికి కనిపించడంలేదు. చక్కటిగడ్డం, జొద్దు కనుబొమలు, కళ్లు, మహాచురుకు, పొడుగాటి ఆ విప్లవకారు డెక్కడ? రెండోతరగతి బోగీ మెత్తటి సీటులో కూర్చున్న ఈ యుద్ధకార్యాలయాధికారి యెక్కడ? గడ్డం నున్నగా ఉంది. గుండ్రటి బుజాలు! ఈవ్యక్తు లిద్దరూ ఒకరేనని పోల్చుకోవడం ఎవరితరమూ కాదు. ఆష్కీనీజూ కంపెనీ తరఫున పనిచేసేవ్యాపార సంచారకుడు ఇట్టేఒస్వాల్డ్ మజ్ అనే యుద్ధకార్యాలయాధికారిగా మారిపోయాడు. టోపీకుచ్చు కళ్ళని కప్పివేసింది. (మొదటి మజిలీ ఆఖరున పాకిదొడ్లో కనుబొమలు గొరిగేసుకున్నాడు). గుండ్రటి ఉన్నితువాలు-పటాలంలో దీనిని జారుగారి కళ్లె అంటారు-ఎర్రటి చేతికి కట్టిఉంది. పైన, సామాను అరలో కనిపించేటట్టుగా బంగారుమలాం చేసిన పిడిగల కత్తి ఉంది. చివర ముడివేసిన ధగధగా మెరిసే వెండిరిబ్బను, పిడినుంచివేలాడుతోంది.

యుద్ధకార్యాలయోద్యోగుల రాజభక్తిని ఎవరు శంకిస్తారు? రహస్య శాఖ తర్వాత వీరే ఎక్కువ విశ్వాసపాత్రులు. వయసును బట్టి చూసినా, ఆ మూతిబిగింపు చూసినా అతను తప్పకుండా మంత్రి అయి ఉంటాడని అనుకోక మానరు.

'అలారం గడియారం' అనే హాస్యపత్రిక అతను చదువు తున్నాడు. ఇదీ సల్లక్షణమే ... అనుమానితులు ఈ పత్రిక చదవరు. అత్తలను, వంటగత్తెలను, కార్మిక జనాన్ని, పేదరైతులను, చిన్నచిన్న వర్తకులను, ఆపత్రిక వేళాకోళం పట్టిస్తూంటుంది. అధికారులను, భూస్వాములను, జమీందారులను వేళాకోళంచేయడం మహానేరం. అందువల్ల ఈ పత్రికలో వారి విషయం ప్రస్తావించరు. రాజకీయంగా నమ్మదగిన వ్యక్తులు ఈ 'అలారం గడియారం' చదువుతూ కాలం వృధాపుచ్చరు.

కండక్టరు మోటుగా బోగీతలుపు తోసి 'టిక్కెట్టు, టిక్కెట్టు' అని అడిగినపుడల్లా అతని భుజాల మీదుగా బోగీలోకి తొంగిచూసే పోలీసుల కళ్ళల్లోని ఆందోళనను ఈ పత్రిక, టోపీ, కత్తి చెదరగొట్టాయి.

నమ్మదగిన వ్యక్తి!

తోటిప్రయాణీకులు ముగ్గురు;- అతిగా దుస్తులుధరించిన ఒకస్త్రీ, పన్నెండేళ్ళ కూతురు, బొద్దుగావున్న కొంచెం అందమయిన ఒక ఫాదరీ, వెరసిముగ్గురు.

ఆమె బోగీలోకి అడుగుపెట్టింది లగాయతు ఆమె మాట్లాడ సాగింది. ఒక అరగంటలో ఆమెను గురించి తెలుసుకోవలసిందంతా బామకి తెలిసిపోయింది.

వొరోనెజ్ రాష్ట్రంలో జడునస్క్ యెజెడ్‌లో ఒక జమీ ఆమెకు ఉంది. కాథరీన్ రాణి కాలంనుంచి ఆ జమీ వారి కుటుంబానికే చెందిఉంది. వారికి సారాబట్టీశాల కూడా ఉంది. ఆమె భర్త జమిందారీ వర్గానికి నాయకుడు. వారు వారి గ్రామంలో నివసించడం లేదు. వొరోనెజ్‌లో ఇల్లుఉన్నా అక్కడా ఉండడం

లేదు. తప్పనిసరి అయినపుడు వొరోనెజ్ వెళుతూంటారు. వొరోనెజ్‌లో జమిందారులు సమావేశమవుతున్నారు.

ఏదయినా విదేశ ఆరోగ్య కేంద్రానికి వెళ్ళేముందు వసంత కాలంలో వారు వారి జమీగ్రామంలో ఉంటారు. కాని ఆమె దానిని సంప్రదాయంగా పెట్టుకోలేదు. గ్రామంలో ఆమెకు నిజంగా సుఖంఅంటూ ఉండేదికాదు. పూర్వకాలంలో గ్రామీణ జీవితం రసవత్తరంగా ఉండేది. దాసులు ఆమె తండ్రిని యజమానిగా గుర్తించారు. కాని వాళ్ళు రోజురోజుకీ మోటుగా, అమర్యాదగా ప్రవర్తిస్తున్నారు. పూర్వం అరవెర్స్టు దూరంలో ఉండగానే రైతులు నెత్తిమీద టోపీ తీసేసుకునేవారు. ఇప్పుడో నమస్కరించడంకూడాలేదు. అంతేకాదు, కిందటి సంవత్సరం ఆమె బండి మీద రాయి విసిరివేసారు. తలకు తగలవలసింది, వీపుకు తగిలింది కాబట్టి సరిపోయింది. తలకే తగిలితే ఉపద్రవమయిన గాయం అయేది కాదూ?

బామన్ అడ్డుచెప్పకుండా ఊ కొట్టాడు. ఆమె ఇంకా వాగింది.

"రష్యాలో వుండడానికి అనువయిన పట్నం ఒక్క సెయింట్ పీటర్స్‌బర్గే. అక్కడయితే పిల్లలకి చదువు చెప్పించుకోవచ్చు. నా కూతురు క్లెన్..."

క్లెన్ లేచి నమస్కరించి, మళ్ళీ కూర్చుంది. ఆమె కదులుతూంటే రిబ్బన్ల జడలుకూడా కదలాడాయి. సవినయంగా అరచేతులు కలుపుకుని, కిందికి దృష్టి సారించింది.

తల్లి సంతృప్తిగా మందహాసం చేసింది. బోగీ కుదుపు ఎక్కువగాఉన్నా ఆ బాలిక సరిగానే వంగి నమస్కరించింది. రైలువేగం ఎక్కువయింది.

"వొరోనెజ్, కర్స్కులాంటి వెధవ పట్నాలలో మా అమ్మాయిని బహిరంగ పాఠశాలలకు పంపడం అనే సమస్యే లేదు.

మెచ్చుకోతగిందానిని మెచ్చుకుంటాను. విద్యామంత్రిత్వ శాఖ పాఠ శాలలోకి అలకా జనం ప్రవేశించకుండా చేయగలిగిందంతా చేస్తోంది. కాని క్లియోపక్క కూర్చునే పిల్ల అలగా జాతికి చెందింది కాదని నమ్మడం కష్టం. వాళ్ళు యేదోవిధంగా సందుచేసుకుని దూరుతూనే వుంటారు. అసహ్యం! యెందుకు యీ పాఠశాలల్లో వీళ్ళు దూరతారో నాకు అర్థంకాదు. సైనిక శాఖలోగాని సివిలు శాఖలోగాని వీళ్ళకి పెద్దవుద్యోగాలు రావు. యిక ఆడపిల్లలమాట చెప్పాలా? ఆడదాని స్థానం యింట్లోనే. అందుచేత బడికి వెళ్ళడం అనవసరం."

"కాని మీ అమ్మాయి బళ్ళోకి వెళుతుందిగా? వెళ్ళడం లేదా?" అన్నాడు బామన్. చిరునవ్వు దాచుకోలేక పోయాడు.

"మీ మాటల్లో పొత్తు కుదరడంలేదు."

"బడి?" ఆ జమీందారిణి కోపంతో బిగ్గరగా అంది. "బోర్డింగు స్కూలు? బోర్డింగు స్కూలులోనే సుకుమారంగా పెరిగిన ఆడపిల్లలు జీవితానికి కావలసినవినేర్చుకో గలుగుతారు. మా అమ్మాయి మదాంత్రూబా *బోర్డింగు స్కూలులో చదువు తోంది."

"త్రూబా?" అని బామన్ అడిగాడు వచ్చేనవ్వు బిగపట్టు కుంటూ. "మదాంత్రూబా! యింటిపేరా?"

"ఆమెను గురించి మీరు వినలేదూ?" అని జమందారిణి పొడిపొడిగా అడిగింది, బామన్ కేసి అనుమానంతో చూస్తూ. "సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో నివసిస్తూ ఆమెపేరు వినకపోవడం చిత్రంగానే వుంది. బహుశా మీరు బ్రహ్మచారులయి వుంటారు. అయినా మరేంపరవాలేదు. పిల్లలులేరు. వాళ్ళని యెట్లాసాకడమా అనే ఆలోచనతో రాత్రిళ్ళు నిద్రపట్టక పోవడ మంటూలేదు. అయినా ఒక విషయం గ్యాపకం వుంచుకోవాలి.

---

* రష్యన్ భాషలో త్రూబా అంటే బాకా.

ఆడపిల్ల ఆదర్శప్రాయమయిన, నిజమయిన స్త్రీగా పెంపొందాలంటే మదాంట్రూాబా స్కూలుకే పంపాలి. అది ప్రయివేటు స్కూలు, జీవితంలో అవసరమయినవన్నీ అక్కడ బోధిస్తారు. భూమికొలిచే సర్వేయర్లకు కావలసిన క్షేత్రగణితంతో ఆడపిల్లలను పాడు చెయ్యరు. యిక బీజగణితం అని శాస్త్రీయమయిన పేరుపెట్టి, దానిని బోధిస్తూ పిల్లలను వేధించుకు తినరు. యిది యెవరికీ యెందుకూ పనికిరాదు. జీవితంలో నిజంగా అవసరమయినవే అక్కడ బోధిస్తారు. అంతేకాదు ఆచరణయుక్తంగాకూడా చూపు తారు. ఉదాహరణకు బండిలో ఎలా కూర్చోవాలి అని వట్టి మాటలతో బోధించరు. ఆస్కూలు గదులలో ఒకదాంట్లో నిజ మయిన బండివుంది. ఆడపిల్లలు బండిలో విలాసంగా, వినయంగా రకరకాల దుస్తులతో ఎలా ఎక్కాలో ఎలా దిగాలో నేర్చు కుంటారు. లేకపోతే భోజన సంప్రదాయాలను తీసుకుందాం. గుల్ల చేపలు, దుంపలు, రకరకాల చేపలు ఎలా తినాలో నేర్చుకుంటా రు...విందులో పదిహేడు ఫోర్కులు యెలా వుపయోగించాలో తెలుసుకుంటారు. యిక అల్లికపని. దేశపటాలు గీయడం, సంగీతం పియానో వాయించడం – అదిగాక యేదనా తీగెయంత్రం..."

"తాంబూర" అని బామన్ సూచించాడు.

"వేళాకోళానికి అందున్నారనుకుంటూ" అని జమిందారిణి అసహ్యభావంతో చేతులు సాచింది. "జిప్సీలు, స్పానియార్డులు, లేకపోతే చెడిపోయినవాళ్ళు తాంబుర వాయిస్తారు. ఉహుఁ– వీణ, సారంగి..."

"సితారు" అని ఆమె కూతురు మెల్లిగా అందించింది చేతి చిట్టివేళ్ళు కదుపుతూ.

"ఆఁ–సితారు" అని జమిందారిణి తలాడించింది. యింకా? శాస్త్రాలు సరేసరి. వ్యాసాలు వ్రాయటానికి కావలసినంతమాత్రమే బోధిస్తారు. యిక భాషలు: ఫ్రెంచి, యింగ్లీషు నేర్పుతారు. యెక్కువగా ఫ్రెంచి అనుకోండి. ఫ్రెంచిలోనే బోధనఅంతా జరుగు

తుంది. మతంకూడా. క్లియో, ఎవరయినా మంచి పంక్తులు నాలుగు, కార్నీలా రాసిన వచనలలోనుంచి, చదువమ్మా!”

అరచేతులు కట్టుకుని క్లియో ముక్కుతో రాగం తీస్తూ నిజంగా మంచిపంక్తులే అప్పగించింది, మంచి మర్యాదలు తెలిసిన బిడ్డలాగా. ఆగినపుడల్లా రిబ్బన్లు కట్టిన జడను విదిలించుకోసాగింది. ఒకమూల కూర్చున్న ఫాదరీ ఆ బాలిక అప్పగించిన దాంట్లో ఒక్కమాటా అర్థం కాకపోయినా మెచ్చుకుంటున్నట్టు ఊకొట్టాడు. మొదటి చూపుకు ఆ ఫాదరీకి ఆ జమిందారిణికి ఆకారంలో, వాల కంలో ఎక్కడా పోలికలేదని తోచినా, బామన్ వీరిద్దరూ సమ ఉజ్జీలని భావించాడు. ఆమె మంచి చురుకయింది. ఇక ఫాదరీ గర గరలాడే కారుఎరుపు అంగీ, మృదువయిన చెంపలు, గుండెల మీదికి వేలాడే గడ్డం, సమస్తమూ మురికి కొట్టుకు పోయాయి. అశ్రద్ధ గోచరిస్తోంది. ఆమె ఒకచోట నిలకడగా కూర్చోలేదు. అటూఇటూ తిరిగింది. ఫాదరీ తప్పనిసరయినపుడు తప్పితే తనువు కదిలించలేదు. ఆమె ఒక్క నిమిషంకూడా ఊరుకోకుండా ఏదో వాగుతూనే ఉంది. అతను అంతసేపు ప్రయాణం చేసినా నోరు మెదపలేదు. ఆమెగొంతు పెద్దది. అతని గొంతు హాయిగా, ఖంగు మంటూంటుంది. ఆమె మంచివంశంలో పుట్టిందని స్పష్టమవుతూనే ఉంది. కులీన, జమిందారిణి. పదిమందిలో తిరగనేర్చినది. ఇక అతనివంశం అతని తండ్రి, తాత అంతా ఫాదరీలే. ఇద్దరికీ ఎందు లోనూ పోలికలేదు. కాని ఎందుకో తెలియదుగాని వారిద్దరూ అన్నాచెల్లెలులాగా కనిపిస్తారు.

అందుచేత బామన్ వారు తనను సంబోధించి మాట్లాడి నపుడు ఇద్దరినీ ఒకవిధంగానే చూసేవాడు. ముక్తసరిగా, వినయంగా జవాబిచ్చేవాడు. చట్టవిరుద్ధ మయిన పనిలో నిమగ్నులయినవారు యాదృచ్ఛికంగా పరిచయమయినవారు ఔనన్నది కాదన కూడదు. ఇది వారి ప్రధాన నియమావళిలో ఒకటి. వారు తమవారేనని అప రిచయస్తులు నమ్మేటట్లు చేయాలి. లేకపోతే దూరంగా ఉండాలి. మాట్లాడిస్తే ముక్తసరిగా జవాబు చెప్పాలి.

# 18

# వల

"వార్నెజ్"

బామర్ తొందర తొందరగా కోటు తొడుగుకుని, ఎర్ర అంచుల టోపీపెట్టుకుని గుమ్మంలో కూర్చున్నాడు. జమిందారిణీ, ఆమెకూతురు మాటవరసకు వెళుతున్నామనయినా చెప్పకుండా దిగిపోగానే తలుపు మూసివేశాడు. తొందర తొందరగా బోగీదిగి వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడితే వెంటనే దిగిపోవడానికి ప్రతి పెద్ద స్టేషన్‌లోను బామర్ సర్వసిద్ధంగా ఉండడం మామూలు.

ఈ స్టేషనుకూడా సురక్షితంగా దాటవచ్చు. కాని రెండో గంట కొట్టగానే పెట్టెతలుపు టపీమని తెరుచుకుంది. ఒకలావుపాటి మనిషి మాసిపోయిన ఎలుగుచర్మం కోటు వేసుకుని బలంఅంతా ఉపయోగించి తలుపుతోసి లోపలికి చక్కా వచ్చాడు. గండు చేపలాగా నోరు తెరచి ఊపిరి పీల్చుకుంటుంటే ఈలవేసినట్లు కీచు మని శబ్దమయింది. చిన్న సూటుకేసు సామానుఅరలోకి గిరవాటువేసి కిటికీ వారగా నిలబడ్డాడు. ప్రవర్తన సహజంగా ఉన్నట్లు తోపింపజేయాలని యత్నించాడుగాని బామర్ అనుభవజ్ఞుడామె, ప్లాటుఫారంమీదివారు ఎవరన్నా తనను గుర్తు పడతారేమోనని వణికిపోతున్నట్టు బామర్ కనిపెట్టాడు.

ఈ కొత్త మనిషి బుజాలమీదుగా ప్లాటుఫారంమీది జనాన్ని చూద్దామని బామర్‌లేచి నిలుచున్నాడు.

ఎక్కేదిగే ప్రయాణీకులకు జాగా వదిలి బోగీదగ్గరగా పోలీసులు నిలబడ్డారు.

అక్కడ ఒక పోలీసు కాప్టెన్, ముగ్గురు సార్జెంట్లు ఉన్నారు. ఆరితేరిన పోలీసు సార్జెంట్లకు తగినట్టుగానే వీరి వాలకం హుందాగా ఉంది. మీసాలు కిందికి వేలాడుతున్నాయి. వారిముందు ఒక బక్క పలచటి వ్యక్తి సన్నటి కోటు, దొప్పలాంటి హాటు వేసుకుని చిరాకుగా వంటి బరువును ఒక కాలిమీదనుంచి ఇంకో కాలిమీదికి మోపుకుంటూ నిలబడ్డాడు. అతను పోలీసుబంటు, సందేహంలేదు. చిత్రకారుడు అతనిని మోడలుగా తీసుకోవచ్చు.

ఆ పోలీసుబంటు ఉద్రేకంతో మాట్లాడుతూ బోగీకేసి తల ఆడించాడు. ఆ మనిషి నక్కమొహం ఎక్కడో, కర్నెక్ స్టేషను లోనో, రైలులో టికెట్లు కత్తిరించేటపుడో చూసానని బామన్‌కి తోచింది.

మూడోగంట కొట్టారు. ఎక్కడో - ముందునుంచి సీనియర్ కండక్టరు బిగులు ఊదాడు. ఇంజను జవాబుగా బుస్సుమంది. రైలు ముందుకు ఊగింది. తోడేలును ఎదుర్కొన్న కుక్కలాగా పోలీసు బంటు రెచ్చిపోయి బొంగరంలాగా గిరున తిరిగాడు. దయ్యంపట్టిన వాడిలా కనిపించాడు. సార్జెంట్లు రైలువెంబడే పరుగెత్తారు. ఎర్రటి బుజపు పట్టీలు అటూఇటూ కొట్టుకోసాగాయి. కాప్టెన్ చేయి ఊపి ఏదో అన్నాడు. అతని పెదవులమీద 'ఆగు' అనే మాట తారాడినట్లు బామన్‌కి అనిపించింది.

ఒక పోలీసు సార్జెంటు ముందుకు ఉరికాడు. నడుముకు పెట్టుకున్న కత్తి ఊగిసలాడింది. కాని రైలువేగం అంతకంతకు హెచ్చింది. లయయుక్తంగా తిరిగే చక్రాల మోతకూడా అంత కంతకు హెచ్చింది. నీటిస్తంభం చర్రున దాటిపోయింది. మహా వేగంతో చెట్లు వెనక వెనక్కి పరుగెత్తాయి. ఎలుగుచర్మం కోటు తొడిగినవ్యక్తి కృతజ్ఞతాపూర్వకంగా నిట్టూర్చాడు (ఆ నిట్టూర్పు రైలు కూతలా ఉంది). వారోనెజ్ బండిగుర్రం ఛాతీలాగా బాగా విస్తరించుకున్న ఛాతి మామూలు పరిమాణానికి వచ్చింది. కోటు విప్పిపారేసి, బొజ్జ సవరించుకుని, పెట్టెతలుపులో ఉన్న అద్దములో

చూసుకుంటూ మహదానందంతో కళ్ళు మిణకరించాడు. ఏదో యక్షగానంలోని పాట ఎత్తుకున్నాడు.

దారి కడ్డువస్తే మాయదారి గండు పిల్లి
అహాగండు పిల్లి ఒహోగండు పిల్లి
ఎవడో టపా కట్టేస్తా డీ రోజేతల్లి
ఈ రోజే తల్లి ఈ రోజే తల్లి

"మీ కేం అడ్డురావడం లేదుగదా?"

జవాబు చెప్పడానికి బామన్ కి వ్యవధిలేకపోయింది. అద్దంలో మొహం సంతోషంతో వెలుగుతున్నదల్లా వణికిపోయింద్ది. దాని స్థానంలో ఇంకోమొహం కనిపించింది. ఆమొహం కోలమొహం. ముక్కు వంకర తిరిగింది. వేలాడే మీసం. ఆ తరవాత బామన్ కి ఎర్రఅంచుల ఊదాటోపీ, బూడిదరంగు పెద్దకోటు, వెండి భుజపు పట్టీలు గోచరమయాయి. పోలీసు కాప్టెన్! వొరోనెజ్ స్టేషనులో ప్లాటుఫారంమీద నిలుచున్న పోలీసు కాప్టెన్!

దొప్పటోపీ పోలీసుబంటు అతని వెనక నుంచుని మోచేతి కిందనుంచి తొంగిచూసాడు.

పోలీసు కెప్టెన్ పెట్టెలోకి అడుగుపెట్టలేదు. చూసి ఊరుకున్నాడు. తలుపు తెరిచేఉంచి నడవలోకి వెళ్ళి మడతకుర్చీ వాల్చుకుని కూర్చున్నాడు తాపీగా కోటు అడుగుభాగం వెనకకు తోసుకుని పేరుచెక్కిన సిగరెట్టుకేసు పైకితీసి కిటికీవైపుకు తిరిగి సిగరెట్టు వెలిగించాడు. అక్కడ ఉన్నవారితో అతని కేమీ పట్టనట్టున్నాయి అతని సంచలనం, కుర్చీలో కూర్చున్న విధానం.

ఇది చాలా తీవ్రమయిన విషయమే. పోలీసులు, అందులో ముఖ్యంగా పోలీసు కాప్టెన్లు కదిలే రైళ్ళలోకి తమాషాకోసం ఎక్కరు.

వార్తాపత్రిక అడ్డు పెట్టుకుని ఆ లావుపాటి కొత్తమనిషిని బామన్ పరిశీలనగా చూసాడు. ఇక ఆ కొత్తమనిషి కాప్టెన్ కని పించగానే ఫాదరీ పక్కన కూలబడ్డాడు. మొద్దు పెదవులమీద అణిగిపోతున్న చిరునవ్వును పట్టిఉంచాలని యత్నించాడు. నిర్ల క్ష్యంగా కాలుమీద కాలు వేసుకుని మెల్లిగా ఇందాకటి పాట మళ్ళీ ఎత్తుకున్నాడు.

'అహో గండు పిల్లి... ఒహో గండుపిల్లి'

కాని హుషారుగా ఉండవలసిన పాట విషాదగీతంలా ఉంది. ఊగుతున్న బూటు ముందుభాగం అనుమానంతో వణికింది. భయ పడిపోయాడని స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. తనను వెంటాడుతున్నా రని గ్రహించాడు. తనెవరు ? పోలీసులు తన్నెందుకు వెంటాడుతు న్నారు ? తాను చట్టవిరుద్ధంగా పనిచేసే రాజకీయ కార్యకర్తలాగా కనిపించడం లేదే? వేటాడడం, సారా తాగడం అంటే మక్కువ పడే చిన్న భూస్వామిలాగా, సామాన్య సంపాదనగల వర్తకుడి లాగా కనిపిస్తున్నాడు. పోలీసులు వెంటాడుతున్నారనే భయంతో వణుకుతూ కూర్చున్న తనెన్నడూ విప్లవవాది కాదే? చేతులు వణికిపోతున్నాయి. బామన్‌కు అతనంటే అసహ్యం వేసింది.

ఎక్కడగా ఎక్కడగా ఈ పెట్టెలోకే ఎక్కాలీ? జాగ్రతగా ప్రవర్తించక, పోలీసు కాప్టెన్ దృష్టిలో పడితే ఇంకేముంది? వ్యవ హారం ఎదురు తిరుగుతుంది.

పోలీసుబంటు తిరిగీ తలుపు పక్కగా జారుకున్నాడు. ఎక్కడో ఆ కోలమొహం చూసినట్టు బామన్‌కి తట్టింది.

ఫాదరీ హఠాత్తుగా లేచి తలుపు దగ్గరికి తొందరతొందరగా వెళ్ళాడు. ఆ కొత్తమనిషి తలుపు ఫాదరీ మూస్తాడని ఆశిస్తున్నట్టు బామన్ కనిపెట్టాడు. కాని ఫాదరీ తలుపు మూయలేదు. తీసినది తీసినట్టుగానే ఉంది. ఫాదరీ పాకీదొడ్డి దగ్గిరికి కుడిపక్కగా వెళు తున్నా కాప్టెన్ కిటికీనుంచి దృష్టి మరల్చలేదు. సిగరెట్టు పొగ ఊదుతూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

లావుపాటి కొత్తమనిషి లేచి కాప్టెన్ వీపుమీద దృష్టినిలిపి బామన్ పక్కన చప్పుడు కాకుండా కూర్చున్నాడు. అంత స్థూల కాయుడు చప్పుడు కాకుండా కూర్చోగలుగుతాడని ఎవరను కుంటారు ?

"మీరు అధికారులు కావచ్చు. అందులోనూ యుద్ధకార్యాలయానికి సంబంధించిన అధికారులు కావచ్చు" అన్నాడు మెల్లిగా పెదవులు కదల్చీ కదల్చకుండా. "మీరు పెద్దమనిషిలా కనిపిస్తున్నారు. ఆ బూడిదరంగు కోటూ, ఆ ఊదాటోపీ – ఆ మనిషిని చూస్తున్నారుగా! అతను నావెంట పడ్డాడు. నేను వుచ్చులో చిక్కుకున్నాను."

పోలీసు కాప్టెన్ బుజాలు కదలడం ఆగిపోయింది. అతనిని హెచ్చరించడమా ? మానడమా ? ఊహుం– ఎవడెట్లా పోతేనేం ? కాని ఆ లావుపాటి కొత్తమనిషి అంతా గమనించాడు. గ్రహించాడు.

"నేను" అంటూ ఇంకా మెల్లగా ప్రారంభించాడు. "నేను యువెజ్డ్ కౌన్సిలు సభ్యుణ్ణి. నేను కమ్యూనిష్టునని అనుకుంటారు. కౌన్సిల్లో రాజ్యాంగచట్టం కావాలని కోరుతున్నాను. మా కౌన్సిలర్లంతా అభ్యుదయ వాదులే. అందరికీ రాజ్యాంగచట్టం కావాలనేవుంది. నెలరోజుల కితం ఒకసభలో చక్రవర్తిగారిపట్ల గౌరవం చూపుతూనే "రాజ్యాంగచట్టం వర్ధిల్లాలి!" అని అన్నాను. యిదంతా దాయాలని నేనేం చూడడంలేదు. ఆ రాత్రి మాయిల్లు సోదాచేశారు. యీ పోలీసు కాప్టెన్ సోదాచేసేవారికి నాయకత్వం వహించాడు. పట్నందాటి యెక్కడికి వెళ్ళనని నాచేత కాగితం రాయించుకున్నాడు... నేను సాహసించి, దొంగచాటుగా..."

పోలీసు కాప్టెన్ పక్కకి తిరిగాడు. లేచి పూర్వంలాగానే కిటికీగుండా చూడసాగాడు... కౌన్సిలరుకు గుటక పడలేదు. వేస్టు కోటులోనుంచి నాలుగు మడతలు పెట్టిన సన్నటి పత్రిక తీసి, దానికి తన దేహమంతా మాటుపెట్టి హఠాత్తుగా బామన్ కోటు జేబులో దోపాడు, అలాచేసి దూరంగా జరిగాడు.

"కాస్త సహాయం చెయ్యండి, వేడుకుంటున్నా, యెవరూ మిమ్మల్ని అనుమానించరు ... దోవలో కాప్టెన్ కూర్చుండి పోతాడు. కాని లేకపోతే పాకీదొడ్డిలో దాని రూపుమాపేద్దును. మరేం భయంలేదు. ఆపత్రిక పేరు 'విముక్తి'. వట్టిచెత్త. మితవాదుల పక్షాన స్రూకావే ప్రచురిస్తున్నాడు. అందులో చట్టవిరుద్ధ మయిన దేమీలేదు. విదేశాలలో అచ్చుపడడం మూలంగా చట్టవిరుద్ధ మయిందని అనుకుంటున్నారే గాని అందులో యేమీలేదు. మా యింటిని సోదాచేసి వుండకపోతే..."

ఆ లావుపాటి మనిషి టపీమని ఆగాడు. ఫాదరీ బాతులాగా అటూ ఇటూ ఊగుతూ తిరిగి వచ్చాడు. కాప్టెన్ వెనకకు తిరిగి అతనిని అనుసరించి పెట్టెలోకి వచ్చాడు.

# 19

## 'దాగుడుమూచీ దండాకోర్!'

కాప్టెన్ సవినయంగా టోపీ కుచ్చుతాకి కూర్చున్నాడు. ఫాదరీవంక చూసాడు. కౌన్సిలరువంక చూసాడు. ఆ తరవాత దృష్టి బామన్‌మీద సారించాడు. ఆకంటి కదలికనుబట్టి తనవెంటే కాప్టెన్ పడ్డాడని బామన్ నిశ్చయించుకున్నాడు. ఆలావుపాటి కౌన్సిలరు తన కష్టగాథ చెపుతూండగానే ఈ అనుమానం ఎక్కువయింది. వల వేసారు. ఆ తెలివితక్కువ మొద్దుకోసం కాదు. ఆ వెర్రిబాగుల వాడికోసం వలపన్నారని ఒక సెకండయినా ఊహించుకుని కనుమల గడం బామన్‌కి రుచించలేదు.

ఇక ఆ పోలీసు బంటును కర్స్కు రైలుస్టేషనులో తాంగ్రడ తింటూంంటే చూసినట్టు బామన్‌కి జ్ఞాపకం వచ్చింది. ఆ దృశ్య

మంతా కళ్ళకు కట్టింది. తాంౖడ అతని కోటుమీదికి కారింది. చినిగిపోయిన బట్టలు కట్టిన ఒకబాలిక అతని పక్కనే నుంచుని తాంౖడవంక చూస్తోంది. ఇద్దరికీ ఆకలి మండిపోతోంది. అందుకనే ఆ మనిషి తనను తరుముకు వస్తున్నాడని ఊహించలేదు. బామన్ మనసు ఇతర విషయాలలో లగ్నమయిఉంది. ఇంతకీ పోలీసుబంటు అదృష్టవంతుడు! తలుపు పక్కనుంచి జారుకుంటూ వికటంగా ఎందుకు నవ్వాడో బామన్‌కి ఇపుడు అర్థమయింది.

ఈ విషయం పరీక్షకు పెట్టి తేల్చుకుందామని బామన్ నిశ్చయించుకున్నాడు.

టోపీ సర్దుకుని, కోటుగుండీలు పెట్టుకుని లేచాడు. కాప్టెన్ ఆదుర్దాపడ్డాడు. తొందర తొందరగా జేబులోకి కుడిచేయి పోనిచ్చి లేచి నుంచున్నాడు. రివాల్వరా! ఈల! ఈలవేస్తే రైలులో ఒక్కడెక్కడ దాక్కున్న పోలీసులూ చక్కా వస్తారు. బంటును ఒక్కడినే వెంటపెట్టుకుని కాప్టెన్ ఇంతదూరం ౖపయాణం ఎలా చేస్తాడు?

బామన్ కిటికీ దగ్గిరికి కదిలివెళ్ళి, పోలీసు కాప్టెన్‌ను శాంత పర్చడానికి టోపీతీసి కోటుదగ్గిరసా లాక్కుంటూ కూర్చున్నాడు.

ఇక అనుమానం లేదు. వచ్చే స్టేషనులో అతనిని అరెస్టు చేసేస్తారు.

సీటుమీద రైళ్ళ రాకపోకల పట్టిక పడిఉంది. బామన్ దానినితీసి పుటలు తిరగవేయసాచాడు. కాప్టెన్ కునుకిపాట్లు పడు తున్నట్లునటిస్తూ తనను పరిశీలిస్తున్నాడని బామన్ ౖగహించాడు.

వొరోనెజ్-మాస్కో-వెదకుతున్నది కనిపించింది.

వొరోనెజ్, ఆౖటోజ్కా, ౖఏస్విటస్కోయే, ౖగాయి స్కాయా, బెలియనో, మాస్కోవకా, ౖడయూస్కీ, ౖపిబిట్కోవో, ౖగియాజీ... ఆౖటోజ్కా ౖగియాజీ మధ్య, స్టేషనులలో రైలు ఆగదు. ఆౖటోజ్కా వెళ్ళిపోయింది. అందువల్ల ౖగియాజీలో అరెస్టు చేస్తారు.

రెండుగంటల ఇరవయి నిమిషాలలో గ్రియాజీ చేరుకుంటారు. ఈ లోపలే ఏదో విధంగా ఈచిక్కు తప్పించుకోవాలి.

చొక్కా చేతులలోకి చేతులు పోనిచ్చి, స్వస్థతగా కూర్చుని మనసును లగ్నం చేయాలని కళ్ళు మూసుకున్నాడు. కాని అతనిని ఆలోచించని స్తేనా!

"చూడండి" అన్నాడు కౌన్సిలరు సానుభూతిగా మృదుల స్వరంతో "యిక్కడ వుక్కబూసి చస్తూంటే, మీరు కోటుదగ్గరికి లాక్కుని యెలా వుండగలుగుతున్నారు?"

"మన్యపు జ్వరం" అని బామన్ సమాధానమిచ్చాడు. జ్వరం తగలడంవల్ల గొంతు చెడిందా అన్నట్లు అతని గొంతు గద్గదికమయింది. "నేను టర్కీస్తాన్‌లోని మెర్వ్‌లో పనిచేశాను. ప్రతిసంవత్సరం అక్కడి పటాలంలో సగంమంది యీజ్వరంతో చస్తూవుంటారు. నాకూ యీజ్వరం పట్టుకుంది. క్వినయిను మింగీ మింగీ తగని చెవుడు వచ్చింది. యేంలాంభం? జ్వరం వదలలేదు."

"క్వినయిను పుచ్చుకుంటేనా?" అన్నాడు కౌన్సిలరు పెద్దగా చప్పుడు అయేటట్టు చప్పట్లుకొడుతూ. "సిసలయిన జ్వరం యీ మందు నీళ్ళకు తగ్గుతుందా? నాసలహా విన్నారా, వారం రోజులలో తగ్గిపోతుంది. నాదీపూచీ. పెద్దవైద్యమేమీకాదు. నలుగురికీ తెలిసినమందే. సాలిగూడు!" బామన్ ప్రత్యుత్తర మివ్వలేదు. సీటుకు ఆనుకుని కూర్చున్నాడు.

"సాలిగూడా?" అని కాప్టెన్ అడిగాడు, మాట ప్రతిధ్వనించేటట్టు.

కౌన్సిలరు బాగా కండ తేరిన మెడ వంచాడు అతివినయంగా. ప్రశ్నలో స్నేహభావము, చనువు ద్యోతక మవుతున్నా కాప్టెన్ కేసి చూడడానికి ధైర్యం చాలకపోయింది.

"సరిగా అంతే" అని తొందర తొందరగా ప్రారంభించాడు. "మామూలు సాలిగూడు యేయింట్లో నయినా దొరుకుతుంది.

అందులో దుమ్ము, పురుగులువుంటె శుభ్రంచేసి, వుండచుట్టి, పరగడపున తీసుకోవాలి. వారంరోజులలో జ్వరం అయిపు లేకుండా పోతుంది. వినిపించిందా ?" ఈ ఆఖరి ప్రశ్న బామర్గను సంబోధించి వేసిందని స్పష్టమవుతూనే ఉంది.

"ఆఁ– వినిపించింది" అని బామర్గ జవాబిచ్చాడు కళ్లు తెరవకుండానే. "పరగడుపున గూడు వుండజుట్టి మింగాలి కాని యీక్షణంలో వేరే విషయం ఆలోచిస్తున్నాను. రైలు ప్రయాణంలో యెవరికయినా జబ్బు చేస్తుందనుకో– అందుకని ఎక్సుప్రెస్ రైలులో ప్రత్యేకంగా బోగీలో పక్క, డాక్టరు, మందులు. వుంటే బావుంటుంది. జ్వరం యింకా తీవ్రమయితే పక్కమీదికి మీరు నన్ను జేరుస్తారుగదూ?"

కౌన్సిలరు ఏదో చెప్పబోయాడు. కాని కార్ప్లె అడ్డు వచ్చాడు. అతని స్వరంలో సంతోషం, విశ్వాసం ధ్వనించాయి.

"అవును, మీకు సేవ చేయడం మహాభాగ్యంగా యెంచుకుంటాను. పక్కమీదికి తీసుకువెళ్ళమంటారా? అనవసరంగా బాధపడడ మెందుకు?"

బామర్గ కృతజ్ఞత తెలియజేస్తూ, "యింకా కాసేపు చూస్తాను. మానాన్నగారి వైద్యుడు ప్రొఫెసర్ జకార్లి అన్నిటికంటె ముఖ్యమయింది, అందులోనూ మందుకంటె మరీ ముఖ్యమయింది, జబ్బుగా వున్నాననే భావానికి లోనుకాకూడదనేదే అని చెపుతూండేవారు. యేమయినాసరే నిమ్మళిస్తుందని యెవరికివారు ధైర్యం చెప్పుకోవాలని చెప్పారు. అది నా మనసులో నాటుకుపోయింది. పడకవేసే ముందు జబ్బుగావుందనే విషయం మరిచేపోవడానికి యత్నించాలి." అన్నాడు.

"బలే, బలే!" అని కౌన్సిలరు పొగిడాడు. "ఓ– బలే నియమం! జారుచక్రవర్తిగారు జకార్లినిచేత వైద్యం చేయించుకునేవారంటే వూరికే చేయించుకున్నారా? 'జబ్బు నిమ్మళించాలని నిశ్చయించుకోవాలి.' యిది బాగా జ్ఞాపకం పెట్టుకుంటా. బలే!

యేదయినా యింకో పనిమీద మనసును మళ్లిస్తే సరి. యేపని మీద మళ్ళించాలి? పేకాట అయితే మజాగావుంటుంది. నాదగ్గిర పేకలేదు, యేంజేస్తాం!"

ఫాదరీ హఠాత్తుగా దగ్గాడు.

"పేక నాదగ్గిర వుండాలి"

"అదృష్టమంటే యిలా కలిసి రావాలి! మీరు బలే గొప్ప వారు! సరే. పైకి తియ్యండి. ఆట యీ పళంగానే మొదలు పెడదాం."

ఫాదరీ బనీను పైకిఎత్తి పంట్లాంజేబులోంచి రెండు పేకలు పైకి తీసాడు. 'డియోసెజ్ న్యూస్' అనే వార్తాపత్రిక కాగితం ముక్కలో అవి చుట్టిఉన్నాయి. జాగ్రతగా పైకాగితం ఊడదీసి కౌన్సిలరుకు అందించాడు. కౌన్సిలరు వాటిని ఒడుపుగా కలిపాడు. నిశ్చింత ప్రస్ఫుటమయింది.

"యేంఆట ఆడదాం? మకావ్. మేజు కొద్దిగానే పెట్టు కుందాం. ముక్క తీసుకోండి,"

ఇంతలో కాప్టెన్ అడ్డువచ్చి, ప్రతిమాటా జాగ్రతగా గంభీర స్వరంతో మాట్లాడుతూ.

"మీ స్థానంలో నేను కూర్చుంటాను. మీరు యెలాగో బయటికి చూడడం లేదుగదా! నాకు యీ శీతాకాలపు ప్రకృతి దృశ్యాలన్నా, మంచు, దేవదారుచెట్లు అన్నా మహా ఇష్టం.'

'రైతు సోదరుడు బండిని గట్టి
రయమున సాగెను జాడనుబట్టీ'

"నాలుగుగోడల మధ్యా వుద్యోగం చేసుకునేవాడిని. బయటికి తిరగడానికి వీల్లేదు."

"ఓ-అలాగే" అని ఫాదరీ వెంటనే తల ఊపాడు. ఆ మరు క్షణంలో బామర్ మోకాలికి కాప్టైన్ కాలు బరువుగా వచ్చి తగిలింది. "మీరుకూడా ఆడరాదూ? మీ బాగుకోసమే చెపుతున్నా."

"సరే, ఆరంభిద్దాం" అని బామర్ నిస్త్రాణగా సమాధాన మిచ్చాడు. "యిదే నాకు తగిన ఔషధమేమో!"

ఆ సమయంలో అతని మనసులో ఒక ఆలోచన తళుక్కు మంది ఒక ఎత్తు. ఈ పేకాటమూలంగా అవసరమయిన అవకాశం చిక్కుతుందేమో. నిజానికి...

విసనకర్రలా విస్తరించుకున్న పేకలోంచి ముక్క తీసుకోవడానికి చేయి జాపాడు. కాప్టైన్ వేళ్ళువచ్చి తగిలాయి. ఆహ్వానం కోసం ఆగకుండా బామర్ ముక్క తీసుకుంటూంటే చిటికెనవేలు వంచి తానూ ఒకటి తీసుకున్నాడు. ఆ వేలికి పచ్చలు పొదిగిన సన్నటి ఉంగరం ఉంది.

"అరకు తొమ్మిది. అన్నిటికంటె పెద్దది. నాదీ గెలుపు" అంటూ తానొక గేస్తులాగా మాట్లాడాడు. అతని ప్రవర్తనకీ కంఠ స్వరానికీ సరిపోయింది. "బల్ల బదులు యేం వుపయోగిద్దాం"

సామాను అరమీదకు అతని దృష్టిపారి, బామర్ సూటు కేసుమీద నిలిచింది. పెదవులమీద మందహాసం తాండవించింది.

"ఆ సూటుకేసు తగిపోతుంది. తలకిందులు చేస్తే బల్లలాగానే వుంటుంది. యిది మీదా?" అని ఫాదరీని ప్రశ్నించాడు.

ఫాదరీ తలెత్తి చూసి నిట్టూర్పు విడిచాడు. ఆ నిట్టూర్పులో విచారము, అసూయ మిళితమయి ఉన్నాయి.

"అబ్బే! నాదికాదు. అంత ఖరీదయిన సూటుకేసు నాకెక్కడిది! ఆ పెద్దమనిషిది."

కాప్టైన్ పెదవులమీది మందహాసం ఇంకా స్థయిర్యం, ద్వేషం పుంజుకుంది.

"కిందకు దింపుతాను..."

మునివేళ్ళమీద తేలికగా లేచి నిలబడి సూటుకేసు కిందికి దింపాడు. అతనికి ప్రతీదీ తడిమిచూడడం అలవాటు. ఆ అలవాటు ప్రకారమే సూటుకేసు అడుగుభాగం తట్టి చూసాడు.

"అవును. చాలా ఖరీదయిందే, విదేశాలలో తయారయిన దానిలావుంది.

"అవును. విదేశాలలో తయారయినదని స్పష్టమవుతూనే వుంది" అని కాప్టెన్ అభిప్రాయం రూఢిపరిచాడు కౌన్సిలరు. పెదవులమీద నవ్వు వణికింది.

సీట్లమధ్య స్థలంలో సూటుకేసు నిలువుగా పెట్టారు దారి బందయిపోయింది. కాప్టెన్ దానిమీద గట్టి నమ్మకంతో చేతులు పెట్టి, కాళ్ళతో ఒడిసిపట్టి మొదటిసారిగా బామ్మ కళ్ళల్లోకి సూటిగా చూసాడు.

## 20

## పేకాట

సూటుకేసు అడుగు రహస్యంగా తొలగించవచ్చు. కాప్టెన్ తట్టి చూసినపుడు ఈ రహస్యం పసికట్టాడా? పసికట్టినా కట్టకపోయినా దానినిమాత్రం చేయి జారనివ్వడు. సూటుకేసుకు నీళ్ళు వదలుకోవలసిందే. అదృష్టవశాత్తూ చట్టవిరుద్ధమయిన సాహిత్యం ఏమీ అందులోలేదు. డ్రాయర్లు, కాలర్లు, టైలు... ఇత్యాది మాత్రమే ఉన్నాయి. కాప్టెన్‌కి ఈ విషయం తెలిసిఉంటే కండలు తేరిన కాళ్ళతో సూటుకేసును ఒడిసి పట్టేవాడుకాదు. బహుశా పెద్దలాటు దొరికిందని సంబరపడుతూ ఉండిఉంటాడు. కోటు తీసేసుకోలేదు. 'మీకూ జ్వరంగావుందా?' అని అడిగితే?

కాప్టెన్ నిర్లక్ష్యంగా పేక కలిపాడు. తెల్లటి వేళ్ళతో సున్నితంగా పేకముక్కలను విడదీస్తూంటే కౌన్సిలరు సంతోషంతో, దయ సంపాదించాలనే అభిప్రాయంతో వాటివంకే చూసాడు. ఇక ఫాదరీ జేబులోనుంచి గుప్పిళ్ళతో రాగి, వెండి నాణేలు తీసి (ఆ జేబుకు అంతులేనట్టుగా బామన్‌కి తోచింది) పక్కన వార్తా పత్రికలమీద నీటుగా బొత్తులు పెట్టాడు. ఆ తరవాత వయ్యారంగా మెడలోని బంగారపు గొలుసు, గొలుసులోని శిలువ మెడవెనకకు, తోసేసుకున్నాడు.

"అదేమిటి, అలా వెనక్కి వేసుకున్నారు?"

"అంతేలే" అన్నాడు విచారంగా ఫాదరీ తను చేసిన పనికి చింతిస్తున్నట్టు, "మన రక్షకుణ్ణి శిలువ వేసారు, యిక పేకలో శిలువ వేయడం తురుపులోనేగా. వీపుమీద పడివుంటే పేకాట చూడలేదు."

"పదిరూబుళ్ళు" అన్నాడు కాప్టెన్ సంతోషంతో, ఫాదరీని పేకను కొయ్యనిస్తూ.

ఆట ప్రారంభమయింది. గ్రియాజీ చేరుకోవడానికి ఇంకా గంటానలభై రెండు నిమిషాల వ్యవధిఉంది.

రైలు చక్రాలు ఎవరితోనూ తమకు నిమిత్తం లేదన్నట్లు వరస తప్పకుండా మోగుతున్నాయి. మాసి, చినిగిపోయిన పేకను గబగబా కలిపారు. కిటికీలోనుంచి ఎత్తయిన చెట్లు మంచుగప్పి, అంతులేని కోసు గోడలా కనిపించాయి. రైలు వేగం బాగా తగ్గింది. బామన్ మంచుగప్పిన కిటికీకి దగ్గరగా మొహం పెట్టాడు. వెంటనే కాప్టెన్ శరీరమంతా తిప్పి బామన్‌ను అనుసరించాడు. కాని కిటికీ అవతల అసాధారణంగా ఏమీలేదు-మంచు, అడవులు, ఆకాశం, అంతే.

"యేమటి చూస్తున్నారు? అక్కడ యేం వుందేం?"

బామన్ ఇకిలించాడు. కాప్టెన్ కంఠస్వరంలో ఆదుర్దా స్పష్టంగా గోచరిస్తోంది. కాస్త హాస్యంపట్టించక ఊరుకోలేకపోయాడు.

"కనిపించలా? రూక్ పక్షులు యిలా యెగురుతూ వెళ్ళాయి"

"రూక్ లా?" అన్నాడు ఫాదరీ. "అసంభవం! యిది తగిన ఋతువు కాదే!"

బామన్ కౌన్సిలరు వేపుకి వంగి, "మళ్ళీ జ్వరం ముంచుకు వచ్చేస్తున్నట్టుంది. కిటికీదగ్గిర కూర్చుంటే చలిగాలి విపరీతంగా కొడుతోంది. మీ స్థానంలో కూర్చుంటాను." అన్నాడు.

"గుమ్మం దగ్గిర చలిగాలి యింకా విపరీతంగా కొడుతుంది." అని కాప్టెన్ వెంటనే హెచ్చరించాడు.

కాని అప్పటికే కౌన్సిలర్ బామన్ మాట పాటించి లేచి నిలబడ్డాడు. బామన్ వెళ్ళి కౌన్సిలర్ స్థానంలో కూర్చున్నాడు. ఇదివరలోలాగానే కాప్టెన్ పెదవులు ఆతురతతో గుంజుకుపోవడం బామన్‌కు సంతృప్తి కలిగించింది.

తెల్లటి చెక్కమీద నల్లటి అక్షరాలతో స్టేషను పేరు-ఉస్మాన్, కిటికీ పక్కనుంచి తళుక్కుమనిపోయింది. ఇక గంట కూడా వ్యవధిలేదు. పరిస్థితిలో మార్పేమీరాలేదు.

తగు సమయం వచ్చేలోపల ఆటలోనుంచి లేచిపోకుండా ఉండడమే ఇపుడు ప్రధానవిషయం. ఆ సమయంలోపలే గనక దగ్గిరఉన్న డబ్బంతా పేకాటలో ఓడిపోతే పేకముక్క తీసుకునే టపుడు బామన్ మనసులో తారాడిన ఎత్తు భగ్నమయిపోతుంది. ఓడిపోవడం పెద్ద కష్టంకాదు. దగ్గిరఉన్నది బహుకొద్ది. కీవ్‌లో రైలు ఎక్కేటప్పటికి జేబులో అయిదురూబుళ్ళు మాత్రమే ఉన్నాయి. చిల్లరఖర్చులు పోను అంతవరకే మిగల్చకలిగాడు. తక్కిన ఆటగాళ్లు తడవతడవకీ పదేసిరూబుళ్లు ఒడ్డుతూంటే ఎంత సేపు తాను ఆడగలుగుతాడు? ఫాదరీమాత్రం తెమలనియ్యకుండా ఆట ఆడుతూ పరిస్థితిని కాపాడుకుంటూ వస్తున్నాడు. ఆట్టే ఒడ్డడం లేదు. చిన్నిబొత్తి- యూభై కోపెక్కుల బొత్తి సూటుకేసుమీదికి జరుపుతూ నిట్టూర్చి తగని ఆలోచనలో పడేవాడు.

ఆఖరి ఆట !

ఆట మొదలుపెట్టిన తరవాత మొదటిసారిగా డబ్బు ఊరికే దొర్లిపోతోంది. అంతవరకు మూడోవరస తిరిగేలోగా ఒకటో వాడో రెండోవాడో మూడోవాడో కొట్టేసేవాడు. ఈ తడవ ఏడుసార్లు వరస తిరిగి కాప్టెన్‌వంతు వచ్చింది.

బహు నేర్పుగా ఆడాడు. గట్టిగా ఊపిరి పీల్చాడు. కొంచెం మీసాలు మెరిసిపోయాయి. మనసంతా ఆటమీదే లగ్నమయింది. ఆట ప్రాణం అయిపోయింది. బలం ఎక్కువయింది. అదృష్టం పండింది. ఫాదరీ బొత్తులు, కౌన్సిలరు నోట్లు సూటుకేసుమీద కుప్పగా పడిఉన్నాయి. ఫాదరీ ఉన్నదంతా ఒడ్డేసాడు. మొత్తం రెండువందల రూబుళ్ళు అయాయి.

"మీపందెం ఒడ్డండి."

కౌన్సిలరు తల పంకించి రెండు పాతిక రూబులు నోట్లు ఒడ్డాడు. బామన్ ఎవరికంటా పడనీయకుండా మిగిలిన ఒక్క పచ్చ రూబులునోటూ లావుపాటి జేబుపుస్తకం కిందకి తోసాడు. సీటు మీద పుస్తకం అందరికీ చక్కగా కనిపించింది. బామన్ రహదారి చీటి అంచుపైకి కనిపిస్తూ కాప్టెన్ దృష్టిని ఆకర్షించింది.

"గుడ్డిగా ఆడేస్తాను. ఆవిధంగా అయితే అదృష్టం తోసుకు వస్తుందేమో! మేజు సంచి కిందవుంది."

ఫాదరీ ఆలోచనలో పడ్డాడు. చర్చిలో మతబోధ చేసేటపుడు ఆత్మవిశ్వాసంతో, ప్రతిధ్వనించేటట్టు మాట్లాడినట్టే హఠాత్తుగా అన్నాడు. "వొడ్డుతాను."

"అయితే ఒడ్డుతాను నేను" అని సూటుకేసుమీద మూడు వందల రూబులునోట్లు విడదీసి పడవేసాడు. వాటిని చూసేసరికి కాప్టెన్ కళ్ళు, కౌన్సిలరు కళ్ళు గౌరవంతో, అసూయతో వెలిగి పోయాయి.

పెట్టెలో నిశ్శబ్దం రాజ్యంచేసింది. కుడికన్ను కుంచించి, పేకముక్క మూల కొంచెంఎత్తి ఫాదరీ చూసాడు. తొమ్మిదో, ఎనిమిదో అయిఉంటుంది. ఇక దానికిమించిన ముక్క ఆ ఆటలో లేదు. కాని అది తొమ్మిదీకాదు, ఎనిమిదీకాదు.

కాప్టెన్ నిట్టూర్చి! "నిలవ పేకలోనించి ఒకముక్క కొనుక్కుంటారా?" అని అడిగాడు.

కౌన్సిలరు ఒకముక్క తీసుకుని ఆలోచించాడు. ఎక్కువగా ఉంది. ఇంకోముక్క కొంటే మొత్తం తొమ్మిదవుతుంది. కొనడమా మానడమా? లేక ఉన్న అయిదుతో తృప్తిపడడమా?

ఫాదరీ అరచేతితో పెరిగిన గడ్డం సవరించుకుంటూ ఊగిసలాడాడు.

బామన్ లేచి నిలబడి అన్నాడు:

"నాచేతిలోవున్నదే చాలు. నేను కొనదలచుకోలేదు- ఒక నిమిషం అట్లా వెళ్ళివస్తాను. మరుగుదొడ్డి కుడివైపునే వుందికదూ"

"టోపీ పెట్టుకోండి" అన్నాడు ఫాదరీ. ముక్కలు పట్టుకున్న కాప్టెన్ వేళ్ళు కొద్దిగా వణికాయి. "నడవలో చలిగావుంది."

"మరేం పరవాలేదు. సెకనులో వచ్చేస్తాగా. సమయానికి తిరిగి రాకపోతే నాముక్క తిప్పండి."

పేకకొయ్యడం అయింది. ఫాదరీ లేవడానికి వీల్లేదు. ఆ సమయంలో ఆట ఆపడం సాధ్యంకాదు. సరిగ్గా ఇదే బామన్‌కి కావలసింది. ఫాదరీ ఆట మానేస్తే ఒడ్డిందంతా దండగయిపోతుంది. మేజుమీద నాలుగువందల రూబుల్లున్నాయి. అంత మొత్తం కాప్టెన్ చచ్చినా వదులుకోడు.

బామన్ తలుపువైపుకి బయలుదేరాడు. కాప్టెన్ మొహం కనిపించలేదు. అతని వెనకనుంచి ఉద్రేకంతో బొంగురుపోయిన గొంతుతో కౌన్సిలరు, "యింకోముక్క" అన్నాడు.

సరిగ్గా ఆ సమయాన్నే ఇస్పేటురాణి సూటుకేసుమీద వచ్చి పడింది. ఫాదరీ భయంతో కీచుమని అరిచాడు. కాప్టెన్ హృదయం సంతోషంతో చిందులు తొక్కింది.

"చూడకుండా యింకోముక్క యియ్యి"

............

నడవలో ఎవరూ లేరు. కాస్తయినా చప్పుడు కాకుండాం నడిచివెళ్ళి మరుగుదొడ్డి దాటి బామన్ కుడివైపుకి మళ్ళాడు. చలికి బిగుసుకుపోయిన ఇనప తలుపు లాగాడు. కదలలేదు. తాళంవేసారా? బఫరుమీది వెక్కి వెళితే? పిడి పుచ్చుకుని మళ్ళీ లాగాడు. రెండో మాటు గట్టిగా లాగేసరికి తలుపు క్రిరుమని తెరుచుకుంది. చలిగాలి రయ్యిమని వచ్చి కొట్టుకుంది. అక్కడక్కడా తోపులు, మంచు భారంతో చిత్తడి నేలమీదికి వంగినచెట్లు కనిపించాయి. చివరి మెట్టుమీది జారీ ఒక్కఉరుకు ఉరికాడు.

♦ ♦ ♦ ♦

"మెనిమిదా? మీదే గెలుపు."

ముభావం నటిస్తూ వణికే చేతులతో పేకముక్కలు సూటు కేసుమీద పారేసాడు, కాప్టెన్. ఫాదరీ నోట్లు, చిల్లర డబ్బులు పోగుచేసుకుని, అత్యాశతో బామన్ సంచిపైకి ఎత్తాడు. మాసిపోయిన రూబులు నోటుమీద వేలుతో పొడుస్తూ ముసిముసి నవ్వు నవ్వి, "బలే పెద్దమనిషి!...యుద్ధకార్యాలయాధికారి కూడాను" అన్నాడు.

కాని కాప్టెన్ ఈ మాటలు వినిపించుకోలేదు. గలగలలాడే గుర్రపుతట్టు ముళ్ళు ప్రతిబంధకంగా ఉన్నా సూటుకేసు మీదుగా దాటి వెళ్ళాడు. ఆ దాటడంలో అతని కోటుతగిలి ఫాదరీ గెలుచుకున్న డబ్బంతా కింద పడిపోయింది. ఎడమగుమ్మం అవతల నడవలోనుంచి ఆ గలగలకు జవాబుగా తట్టుముళ్ళు గలగల లాడాయి. సేవకులు కూర్చునే పెట్టెలోనుంచి ఇద్దరు సార్జెంట్లు గబగబా

చక్కా వచ్చారు. వారివెనకనే కాలరులోకి తల దూర్చుకుని పోలీసుబంటు భయంతో గజగజలాడుతూ వచ్చాడు. కాప్టెన్ మొహం చిట్లించుకుని, తనవెంట రమ్మని సైగచేసి మరుగుదొడ్డి వైపు బయలుదేరాడు. మెల్లిగా నడుస్తున్న పోలీసు సార్జెంట్లను దాటి పోలీసుబంటు నడవ మధ్యలో కాప్టెన్‌ను కలుసుకున్నాడు.

కాప్టెన్ తలుపుపిడి తిప్పాడు. మరుగుదొడ్డి తలుపు తెరుచుకుంది. అందులో ఎవరూ కనిపించలేదు.

కాప్టెన్ గిర్రున వెనకకు తిరిగాడు. బంటు భయంతో గుడ్లు తిప్పాడు.

"వాడు యెక్కడికి వెళ్ళాడు?" అని బొంగురు గొంతుతో ఆ అధికారి ముక్తసరిగా అడిగాడు.

జవాబుకోసం ఆగకుండా పిడికిలి బిగించి ఆ పోలీసుబంటు మూతిమీద ఈడ్చి చచ్చేటంత దెబ్బ కొట్టాడు.

# 21

# అల్లంమర్బా అమ్మే కుర్రవాడు

లోతుగా, మెత్తగా దుప్పటి పరిచినట్లు విప్పుకున్న మంచు మీద బామన్ వెళ్ళిపడ్డాడు. అడవి అంచునఉన్న చిత్తడినేల వెంట కుప్పలుకుప్పలుగా పడ్డ మంచుమీదికి రైలుకట్టమీదనుంచి కిందికి సురక్షితంగా దొర్లాడు.

రైలు గర్జిస్తూ వెళ్ళిపోయిన తరవాత లేచి నిలబడ్డాడు. కణతలు మందంగా కొట్టుకుంటున్నాయి. మోకాళ్ళు, బుజాలు, ఎదురురొమ్ము నొప్పి పెట్టసాగాయి. అదురుదెబ్బకు వికారపెట్టింది. నోరు చేదెక్కింది. గొంతుకలో నొప్పిబయలుదేరింది. అయితేనేం, తప్పించుకుని బయటపడ్డాననే సంతోషంతో మనసు స్థిమితపడింది.

అల్లం మిఠాయి అమ్మే కుర్రవాడు పాడినపాట జ్ఞాపకం వచ్చింది:

ఆకొన్న ఎలుగులా
ఉన్నావులే నీవు
నన్ను కూడా నమిలి
మింగజూస్తున్నావు
కుందేలునే పరుగు
పందెమున గెలిచాను
ఎందుకీ అడియాస
అందనుకద నేను!

ఆ చిత్తడి నేలమీద అతనిచుట్టూ అక్కడక్కడా కొండ రావిచెట్లు గాలికి ఊగులాడుతున్నాయి. ఆకులు రాలిపోయాయి. వంగిపోయాయి. చలి విపరీతంగాఉంది. శీతలం చెవులను చేతులను కరిచివేస్తున్నట్లుంది. కోటు జేబులోనుంచి గుండ్రటి గొర్రెపిల్ల చర్మంటోపీ తీసి పెట్టుకున్నాడు.

"ఒక్కనిమిషం" బామన్ తనలోతాను అనుకున్నాడు. "ఆలోచించుకోవాలి"

రైలు బోగీ తలుపులు ఈ వైపుకే తెరచుకుంటాయి. బామన్‌కోసం గాలించడం ప్రారంభిస్తే, ప్రారంభిస్తే కాదు, ప్రారంభించినపుడు పోలీసులు రైలుమార్గానికి ఈవేపునే వెదుకుతారు. అవతలివేపుకు చేరుకోవడం మంచిది. అంతేకాదు. ఆ ప్రాంతం వదిలిపెట్టి నైరుతి రైలుమార్గం చేరుకుని మెలెట్స్‌కు రైలు ఎక్కాలి. అక్కడినుంచి మాస్కో వెళ్ళడం ఏమంత కష్టం కాదు.

సరే, బాగానేఉంది, కాని డబ్బు ఎక్కడనుంచి వస్తుంది? చేతిలో చిల్లిగవ్వలేదు. చేతిలో ఉన్నదంతా తప్పించుకుని బయట పడడానికి బోగీలో వదిలిపెట్టి వచ్చాడాయె.

ఇలా ఆలోచించి బౌమన్ ఇకిలించాడు. బోగీలో వదిలి పెట్టి వచ్చింది పెద్ద మొత్తమేంకాదు. సంచిలో ఉన్నది ఇంతాచేస్తే అయిదురూబుళ్ళే. జేబులో చెయిపెట్టి చూసుకున్నాడు. ఖాళీ! సంచి చూడడంకూడా అనవసరం. మహాఉంటే ఇరవయి అయిదు కోపెక్కులు ఉంటాయేమో!

ఏమయినాసరే ముందుకు సాగిపోవాలి. తోవలో ఏదో ఒక మార్గం తోచకపోతుందీ?

కోటు చేతులలోకీ, కాలరులోకీ దూరిన మంచుకరిగి కాలువలుగట్టి కిందికి జారుతోంది. సాధ్యమయినంతగా మంచును విదిలించి పారేసి గట్టుఎక్కాడు. అవతలవేపున అడవులు పల్చపల్చగా ఉన్నాయి. బౌమన్ కిందకు జారకూడదనీ సాధ్యమయినంతవరకు ఆచూకీ తెలియనీయకూడదనీ నిశ్చయించుకున్నాడు. స్లీపర్ల వెంబడే వొరోనెజ్ దిక్కుగా బయలుదేరి నడక సాగించాడు. కొంతదూరం వెళ్ళేసరికి కుడిచేతివేపున అడవిలోకి కనిపించీ కనిపించని కాలిజాడ పొడగట్టింది. మంచులో కాలిజాడ సన్నగా మెలికలు తిరిగిఉంది. వెడల్పాటి బూట్లు తొడిగిన భారీమనిషి వేసిపోయిన అడుగు జాడలవెంటే సాధ్యమయినంత వేగంతో నడవ సాగాడు. ఆ అడుగు జాడలు ఎన్నడో పడినవి. ఆ కాలిజాడవెంట ఎక్కువగా జనం నడవరని స్పష్టమవుతూనే ఉంది. పలాయనం చిత్తగించేటపుడు దారిలో మనుషులను కలుసుకోవడం అంత ప్రమాదం ఏదీలేదు. పాడుపడిపోయిన తోవలవెంట వెళ్ళడం ఉత్తమమయిన పద్ధతి.

ఆ కాలిజాడ అడవిమధ్యకి అతనిని తీసుకువెళ్ళింది. బాగా వంగి నెత్తికి తగులుతున్న కొమ్మలకు తెల్లటిమంచు పట్టుకువేలాడుతోంది. సమీపంలో కాకి అరిచింది. బహుశా ఆహారంకోసం వెతుకుతోందేమో? బౌమన్‌కి పొద్దు తెలియలేదు. గడియారం ఆగిపోయింది. రైలుకట్టమీద నుంచి కిందపడినపుడు అదురుదెబ్బకి గడియారం తీగ విరిగిపోయి ఉంటుంది. ఇది మరీ అధ్వాన్నపరిస్థితి.

డబ్బు లేకుండా ప్రయాణం చేయడమే ప్రయాస. ఇక పొద్దుకూడా తెలియకపోతే చెప్పేదేముంది?

పిరికి కుందేలు వేసుకుంటూపోయిన కాలిజాడ బామన్ తోవకు అడ్డం తగిలింది. మెత్తటి పిరికిపాదాలు వంకర టింకరగా వేసిన జాడకేసి చూసి బామన్ మందహాసం చేసాడు. కుందేలు ఒక చోట ఉరికినట్టుంది. అక్కడ మంచు నున్నగా ఉంది. అంటే ఆ కుందేలు ఆచుట్టుపక్కల ఎక్కడో దాక్కుని ఉంటుంది. దానిని హడలుగొట్టడమా, మానడమా? చప్పట్లు కొట్టాడు. గాలి కదలాడడంలేదేమో ఆశబ్దం తుపాకీ పేల్చిన శబ్దంలా ఉంది. మంచు ఎత్తుగా పేరుకున్నచోట చెట్లు పడిపోవడం గమనించాడు. వాటి వెనక కదలిక ఏమీ కనిపించలేదు. ఎక్కడో, దూరాన చెట్టుమీద నుంచి కాకిమాత్రం అరిచింది.

జోరుగా నడవసాగాడు. పోనుపోను అడవి దట్టమయింది. కుందేటి కాలిజాడలు ఎక్కువగా కనిపించాయి.

ఎంతసేపటినుంచి నడుస్తున్నాడో? గంట రెండుగంటల నుంచా? అడవులకు అంతు లేనట్టుంది. చీకటిపడింది. చీకటిపడ డానికి రెండు కారణాలున్నాయి. ఒకటి: రాత్రికావస్తుండడం; రెండు: ఇక్కడ చెట్లుఎత్తు ఎక్కువ, దగ్గిర దగ్గిరగా ఉండడం; చివరకి ఎలాగయితేనేం నాలుగురోడ్ల కూడలికి చేరుకున్నాడు. ఎటుపోవాలి? ఎడమవేపుకా, కుడివేపుకా? దిక్కులు తెలియడం లేదు. చెట్లలో వంకరటింకరగా ఉన్న కాలిజాడను బట్టి ప్రయాణం చేస్తే జరిగేదింతే. వొరోనెజ్ ఎడమవేపున ఉండితీరాలి. అందువల్ల అతను కుడివేపుకు వెళ్ళడం మంచిది. మళ్ళీ ఆలోచించాడు. వొరోనెజ్‌కి వెళ్ళడం తేలికకాదూ? అక్కడ ఒక సానుభూతిపరుని ఇంట్లో సమావేశాలు జరుగుతూండేవి. ఆ ఇల్లు పోలీసు నిఘాలో పడకపోతే మంచి అవకాశం చిక్కుతుంది. అంతేకాకుండా వొరోనెజ్‌లో అతని స్నేహితురాలు ఉంది. జమిందారిణి. ఎక్కడా ఆస్కారం లేకపోతే ఆమె ఇంటికి చేరుకోవచ్చు.

ఆమెనుగురించి ఆలోచించగానే పెద్దగా నవ్వకుండా ఉండ లేకపోయాడు. ఆమెఇంటికి వెళ్ళడం తమాషాగా ఉండదూ ? ఆమె భర్త కచేరి గదిలోకి తాను ప్రవేశించడం ఊహించుకున్నాడు. ఆ కచేరిసాఫిడి రాజదర్బారులలోలాగా నేర్పుగా అమర్చబడిందేమో! ఆ రోజుల్లో జమీలు చితికిపోతున్నాయి. రాబడి తగ్గిపో యింది. జమిందారుల పని నానాటికీ తీసికట్టుగా ఉంది. రష్యా సామ్రాజ్య వ్యవస్థకు మూలస్తంభాలలో ఒకటయిన జమిందారీ వర్గం ఆర్థికంగా పతనమయిపోతోంది. కచేరీగది కిటికీలకు కట్టిన సన్నటి తెరలు, వాటిమీద గొల్లపిల్లలు పిల్లంగ్రోవివాయిస్తున్నట్టు, మెడలో రిబ్బన్లు కట్టిన లేళ్ళు సమీపంలో మేత మేస్తున్నట్టు అచ్చుగుద్దిన బొమ్మలు ఊహించుకున్నాడు. గోడలవెంబడే బంగారుమలాం చేసిన తిరుగుడు కుర్చీలు అక్కడక్కడా ఒక వరసలోవేసి ఉంటారు. ఒకమూల పంజరం, పంజరంలో ఆకుపచ్చని చిలక ఉండిఉంటాయి. చిలక మాట్లాడలేదు. బ్రెమ్ విధానం అనుసరిస్తే ఆ చిలకచేతా మాట్లాడించవచ్చు,

"క్లైన్, మంచిపంక్తులు నాలుగు అప్పగించు..."

వొరోనెజ్ దిక్కుగా వెళుతూ దాని ఎదుటి దిక్కుగా వెళు తున్నానని నమ్మి బామన్ చిరునవ్వు నవ్వుకున్నాడు. వొరోనెజ్‌లో ఆ జమీందారును కలుసుకోవడం తిరిగి ఊహించుకోసాగాడు. వారి సమావేశం, తాను అతనిదగ్గిర యాభై రూబుళ్ళు అప్పు పుచ్చుకో వడంతో ఆఖరవుతుంది. ఆ జమిందారుకు చెంపమీసాలు. మొఖ మల్ వేస్టుకోటు ధరించి ఉండవచ్చు. మాస్కో చేరుకోవడానికి పదిరూబుల్లు ఉంటేచాలు. కాని యాభైరూబుళ్ళకంటె తక్కువ అడగడం తెలివితక్కువ.

శీతలం తీవ్రమయింది. కనుచీకటి దట్టమయింది. రైలుబండి వెళ్ళిన జాడలు కొంతదూరంవెళ్ళి వెనకకు తిరిగాయి. చెట్లుకూడా పలచబడ్డాయి. బామన్ అడవి అంచుకు చేరుకున్నాడు.

మంచుకప్పిన ఊదాపొలాలు దిఙ్మండలంవరకు వ్యాపిం చాయి. నక్షత్రాలు కనిపించాయి. అక్కడ రోడ్డు రెండుగా

చీలింది. అడవి అంచును రాసుకుంటూ బండిదారి, కాలిజాడ ఎత్తు ప్రదేశం వెంబడే వెళ్ళాయి. బామన్ తటపటాయించకుండా ఎడమవేపు రోడ్డు పుచ్చుకున్నాడు. వొరోనెజ్ రైలుమార్గానికి సాధ్యమయినంత దూరంలో ఉండాలని అతని ఉద్దేశం.

హఠాత్తుగా వీపు భాగంలో నొప్పి బయలుదేరింది. దానితో బాటు ఎడమమోకాలులో కూడా నొప్పి ప్రారంభమయింది. శరీరం బరువు మోపేసరికి బాధపెట్టింది. నాలుగు అడుగులు వేసాడో లేదో కుంటవలసి వచ్చింది.

రైలులోనుంచి దూకినందుకు తగిన ప్రాయశ్చిత్తమయింది. తరుచు ఇలా జరుగుతూనే ఉంటుంది. ఆ ఆవేశంలో దెబ్బ తగిలినట్టు అనిపించదు. కాని ఆవేశం తగ్గిన తరువాత ఏకాలు విరగడమో, ఎముక విరగడమో, కండరం వాచి పోవడమో, దెబ్బలు తగలడమో తెలిసివస్తుంది. బామన్ రైలులోనుంచి దూకి చాలా సేపయిన మాటనిజమే. చీకటిని పట్టి తెలుసుకోవచ్చు. దూకినపుడు గడియారం రెండూ పదిహేడునిమిషాలకు ఆగిపోయింది. దెబ్బ ఎక్కువ తగలక పోవడం మూలంగా నొప్పికానరాలేదు. కాస్త జాగ్రతపడి, మధ్యమధ్య ఆగి విశ్రాంతి తీసుకుంటూ, మెల్లగా నడిచి ఉన్నట్లయితే ఇంతదాకా వచ్చేదికాదు ... అలా చేయకుండా పందెపునడక సాగించాడు. లెక్కకట్టుకుంటే ఇరవయి అయిదు వెర్స్టుల దాకా నడిచినట్టు తేలింది.

హోరు బయటికి రాగానే కాలునొప్పిపెట్టి, కుంటవలసి రావడం మహాఘోరం అనిపించింది. ఈనెప్పి అడవిలో ఉండగానే వచ్చిఉంటే నడకకి ఊతంగా ఏచెట్టుకొమ్మో విరిచి ఉపయోగించేవాడు. ఇక ఇప్పుడు మంచుకప్పిన పొలాలలో కుంటుకుంటూ నడవాలి. అసలు నడక మానేయడంకంటే కుంటుకుంటూ నడవడం మెరుగు. తరచు బండిగాడిలో కాలు జారిపడుతూ లేస్తూ ముందుకు సాగిపోయాడు.

శీతలం అంత తీవ్రంగా ఉన్నట్టు కనిపించలేదు. నక్షత్రాలు మెరిసాయి. ఆకాశంలో మేఘాలు కమ్మాయి. మొహం కరిచి బాధపెడుతూ గాలి తీక్షణంగా వీవసాగింది. సరిహద్దు దాటిన రాత్రికూడా ఇలానే శీతలం మొహం కొరికేసింది. మంచుతుపాను కిది నాందా ! ఈ ప్రదేశంలో పెద్దపెద్ద మంచుదిబ్బల మూలంగా ఏకబిగిని ఇరవయినాలుగు గంటలసేపు రైళ్ళన్నీ ఆగిపోయాయని ఇటీవలనే పత్రికలలో చదివాడు. చుట్టుప్రక్కల గ్రామాలనుంచి వేలకొలది జనంవచ్చి పనిచేసినా రైలుపట్టాలమీద మంచును తొలగించడం సాధ్యంకాలేదు.

ఇపుడే గనక మంచుతుపాను ప్రారంభమయితే రైలుమార్గం బందయి పోతుంది. ఆ చుట్టుపక్కలనుంచి తప్పించుకుపోయే అవ కాశాలు భగ్నమవుతాయి. ముప్పయి వెర్ట్సుల కైవారంలో ఎక్కడా ఇల్లుగానీ గుడిసెగానీ లేదు.

గాలి ఇంకా తీవ్రంగా వీచింది. బూడిదరంగు మంచు మేఘాలు మంచుకప్పిన పొలాలమీదుగా కదలాడుతున్నాయి. కాలునొప్పి సంగతి మరిచిపోవాలని యత్నించాడు. వేగం హెచ్చించాడు.

దూరాన దీపాలు గోచరించాయి. రివ్వుమని గాలిలో కుక్కల మొరుగులు వినిపించాయి. బామన్‌కి పొగవాసన కొట్టింది. బహుశా ఏదయినా గ్రామం అయిఉండవచ్చు. వెంటనే తను ఎంత అలిసిపోయిందీ, ఎంత ఆకలి గొన్నదీ గుర్తించాడు. రాత్రివేళ గ్రామంలో ప్రవేశించడం ప్రమాదం. అందులోనూ సైనికదుస్తులు వేసుకుని, జేబులో గవ్వలేకుండా కుంటూకుంటూ గ్రామంలో ప్రవేశించడం మరీప్రమాదం. ఇటువంటి వెనకపడ్డ ప్రదేశాలలో రైతులు కొత్తమనుషులను అనుమానంతో చూస్తారు. గొప్పవంశానికి చెందినవాడులా కనిపించేవారందరినీ శత్రువుకింద జమకడతారు. రైతులు బీదవారికి, ఎంత తిరుగుబోతు లయినాసరే, ఆశ్రయ మిస్తారుగాని గొప్ప వంశీకులకు ఆశ్రయం ఇవ్వరు. ఎంత బతిమాలుకున్నా చెవిటివానిముందు శంఖం ఊదినట్టే. మనసు కరగదు.

పెడేలుమని తలుపు వేసుకుంటారు. ఆ గ్రామంలోని పోలీసుల దగ్గరికి తీసుకువెళితే అతనిపని ఏమవుతుంది?

అందువల్ల గ్రామంలో ప్రవేశించడమనే ప్రశ్నే లేదు. ఆ విధంగా పట్టుపడడానికి సిద్ధంగాలేదు. గ్రామం పక్కగావెళ్లి రోడ్డు ఎక్కడంకంటె గత్యంతరం కనిపించలేదు.

ఈ ప్రాంతంలో ఎందుకున్నావని ఎవరయినా ప్రశ్నిస్తే తగు సమాధాన మివ్వడానికి ఆలోచించే ఓపికకూడా బామన్‌కు లేదు. ఎవరయినా తారసిల్లితే ప్రశ్నలు వేయకుండా మానరని అతనికి తెలుసు.

కుక్కల మొరుగులు స్పష్టంగా వినిపించాయి. చీకట్లో మినుకుమినుకు మంటున్న పచ్చదీపాలు ఇంకా విస్పష్టంగా కనిపించాయి. ఇక రోడ్డుదిగి పక్కదారి పట్టవలసిందే.

సరిహద్దు దాటిన రాత్రిలాగానే మంచుగుట్టలగుండా కాళ్ళీడ్చుకుంటూ పోవలసిందేనా?

ఇపుడు నడవడం సులువుగా ఉంది. నేలమీద మంచు గట్టిగాఉండి బరువుకు కుంగిపోవడంలేదు. ఆ గ్రామంలోని దీపాల మీదనే దృష్టినిలిపి బామన్ అతికష్టంమీద నడక సాగించాడు. ఎక్కువదూరం చుట్టిరావాలని లేదు. హఠాత్తుగా అతనికి ఎడమ వైపున చీకటిలో ఒకపెద్ద కొత్తనీడ అస్పష్టంగా కనిపించింది. హఠాత్తుగా కనిపించేదేమో, వణికిపోయాడు. కాని ఆ తక్షణమే తన ముందున్నదేదో గుర్తించి సంతోషంతో మందహాసం చేసాడు. ఇంతకీ అదృష్టవంతుడు! అది నీడకాదు గడ్డివామి! పడుకోడానికి మహావీలుగా ఉంది. వెచ్చగా భద్రంగా ఉంటుంది. కాకపోతే కాపలా మనిషంటూ అక్కడఉంటే వాడికంట పడతానేమోనని మాత్రం బాధపడ్డాడు.

బామన్ చెవియొగ్గి వింటూ గడ్డివామికి దగ్గిరసా నుంచు న్నాడు. చుట్టుపక్కల మనిషిజాడ లేదు. గాలి వీచినపుడల్లా గడ్డి

కొద్దిగా కదిలి చప్పుడవుతోంది. బామన్ గడ్డివాములో గుంటచేసి దానిలో ముడుచుకుని పడుకున్నాడు.

ఎంత ఆనందంగా ఉంది! కొన్ని గంటలసేపు ఆలోచనలు, ఆదుర్దాలు కట్టిపెట్టి కాళ్లు చాచుకుని అలసిపోయిన అవయవాలకు విశ్రాంతి ఇచ్చి నిద్రపోవచ్చు.

# 22

# తోటి ప్రయాణీకులు

బామన్‌కు మెలకువ వచ్చింది. అలసట తీరింది. కాని ఆకలి నకనకలాడుతోంది. గడ్డివామిలో దూరి పడుకున్నప్పటికంటె ఆకలి మూడురెట్లు అధికమయింది. ఏదయినా కాస్త తిండి పడితేనే తప్ప కదిలే స్థితిలేదు.

కాని తినడానికి గడ్డితప్ప మరేంలేదు. జేబులో ఉన్నదల్లా ఊడిపోయిన కోటుగుండీ ఒకటే! సంచిలో ఇరవయి అయిదు కోపెక్కులున్నాయి. వాటితో రొట్టె కొనుక్కోవచ్చు. కాని అమ్మే దుకాణాలేవీ? ఉదయమయింది. ఎర్రటి కాంతిలో చిన్న కుగ్రామం కనిపించింది. అందులో రొట్టెల దుకాణం ఉన్నట్టులేదు. ఆ కుగ్రామంలో ఇంతాచేస్తే పదో పన్నెండో తాటాకు గుడిసెలుంటాయి. చలిగాలి రాకుండా కిటికీలలో ఇంతగడ్డి కుక్కారు. వాటి నొష్టమీద దారిద్ర్యం వ్రాసిపెట్టుంది. అమ్మకం విషయం అలాఉంచి, ఆ గ్రామస్థులకు తినడానికి రొట్టెలు కరువయినట్టుంది. కొత్తపంట వచ్చేదాకా అక్కడివారికి పండినపంట సరిపోదు. సగం శీతాకాలం బాతుకాళ్లు, ఆలుగడ్డ తొక్కలతో రైతులు పొట్ట నింపుకుంటారు. గ్రామంలోకి ప్రవేశిస్తే ప్రమాదం అలా ఉంచి, ప్రయోజనంకూడా ఏమీ కనిపించదు.

జనంలేచి తిరగసాగక ముందే ఆగ్రామం దాటిపోవాలనే ఉద్దేశంతో బామన్ గుట్టల మరుగునుంచి వడివడిగా ప్రయాణం సాగించాడు. గ్రామానికి కనుచూపుమేర దాటగానే మళ్ళీ రోడ్డు ఎక్కి ఇంకా వడిగా సాగిపోసాగాడు. కాలునెప్పి రాత్రే తగ్గిపోయిందేమో కుంటకుండా నడవగలిగాడు. రోడ్డువెంటే వెళ్ళగా వెళ్ళగా ఒకవంతెన, పెద్దనదీ తగిలాయి. ఆ నది వొరోనెజ్ రాష్ట్రంలో ఉన్నట్టు అతనికి జ్ఞాపకంలేదు. లాటిన్ భాషా క్రియలు బాగా జ్ఞాపకం ఉన్నాయిగాని రష్యా గ్రామీణ ప్రాంతం ఎరగనే ఎరగడు. బడిలో దానినిగురించి బోధించనేలేదు. ప్రవాసంలో ఉండగా వ్యాట్కా-రాష్ట్రం గురించి కొంత తెలుసుకున్నాడు. ఇప్పుడు వొరోనెజ్ రాష్ట్రంలో దోవకోసం దేవులాడుకుంటూ వెళ్ళవలసి వచ్చింది!

ఇంతవరకూ ఎవరూ త్రోవలో తారసిల్లలేదు. వంతెన మీద మాత్రం ఒక ముదుసలి ముష్టివాడిని దాటి వెళ్ళాడు. ఆ ముష్టివాడి వీపుకు గడ్డిపరకలు అంటుకొని ఉన్నాయి. అతడూ ఏగడ్డివామిలోనో రాత్రి గడిపిఉంటాడు.

"చాలాదూరం వెళుతున్నావా, తాతా?

ముష్టివాడు ఆశ్చర్యంతో తేరిపారజూసాడు. ఇంత పొద్దున్నే ఇంత గొప్ప పెద్దమనిషి ఈ మారుమూల ప్రాంతానికి ఎందుకు వచ్చినట్టు?

"జడోన్‌స్కీకు వెళుతున్నా" అన్నాడు ముష్టివాడు చనువుగా.

ముష్టివాడు ఎండిపోయిన రొట్టెముక్క నమిలి తింటున్నాడు. ఆదృశ్యం చూసేసరికి బామన్‌కి వికార పెట్టింది. ఎందువల్లో మళ్ళీ ఆకలయింది, అలసటవచ్చింది.

జడోన్‌స్కీ! అటువంటి పేరుగల స్టేషను ఉందని ఎన్నడూ వినలేదే! బహుశా జడోన్‌స్కీ రైలుమార్గంమీద లేదేమో? అడుగుదామని అనుకోకుండానే అడిగేశాడు.

"యిక్కడనుంచి జడోన్‌స్క్ యెంతదూరం ?"

ఆ ముష్టివాడు మంచుకేసీ, ఆ తరవాత ఆకాశంకేసీ చూశాడు. ఆకాశంలో బూడిదరంగుగా, కిందటి రోజులాగానే మబ్బుపట్టివుంది.

"భగవంతుడి దయవల్ల రేపు సాయంకాలానికి పట్నం చేరుకోవచ్చు. డాన్‌కి వెళ్ళే హైరోడ్డు చేరుకుంటే చాలు. అక్కడనుంచి రోడ్డు శుభ్రంగా, చదునుగా వుంటుంది. నాకు తెలుసు."

డాన్‌కు వెళ్ళేరోడ్డా ? అక్కడకా తాను వెళుతున్నది ? సరే, చేయగలిగిందేమీలేదు. అంటే జడోన్‌స్క్ డాన్ నదికి అవతల ఉందన్నమాట.

"యెలెట్స్ యెంతదూరంలో వుంది, తాతా ?"

"యెలెట్స్ !" అన్నాడు తెల్లబోతూ.

"యేమిటి ? యెలెట్స్ యిక్కడెక్కడ వుంది. చాలా దూరం."

తనలో తానేదో గొణుగుకుని బుజంమీది సంచి సర్దుకున్నాడు. సంచి గలగలమంది. ఆ గలగల శబ్దాన్నిబట్టి అందులో రొట్టెముక్కలున్నాయని బామన్ గ్రహించాడు. 'బీదవాణ్ణమ్మా! కాస్త ముష్టిపెట్టండి' కిటికీల కిందనుంచి రాగాలు పెడుతూ ఏడ్చినా ఇలాంటి తిరుగుబోతులకు ఎవరూ రొట్టెముక్కలు ముష్టి వేయరు.

బామన్‌కు మళ్ళీ వికారం పెట్టింది. కడుపులో తిప్పింది. ఒక రోజుకంటె ఎక్కువ పస్తు పడుకోలేదు. తీవ్రమయిన చలిగాలిలో నడక సాగించాడేమో ఆకలి నకనక లాడింది.

"రొట్టెలు యేమన్నా వున్నాయా, తాతా ? అమ్మరాదూ, అయిదు కోపెక్కులకు".

"రొట్టా ?" అని ముష్టివాడు బామన్‌వంక తేరిపారజూచి హఠాత్తుగా తనను తాను సంరక్షించుకోవడానికా అన్నట్లు కర్ర పైకెత్తాడు.

"దూరంగా వుండు, పాపిష్టి మొహమోడా! దూరంగా వుండు, దొంగవెధవ, కేకపెట్టానంటే పొలాలలోంచి రైతులు పరుగెత్తుకుంటూ చక్కావస్తారు."

రోడ్డు దిగువను లోతుగా పేరుకొన్న మంచుమీదికి వెళ్ళి గొంతు బాగాఎత్తి అరిచేవాడిలా నటించాడు. ఆ సమయంలో అతను తల విరయబోసుకుని కయ్యానికి కాలు దువ్వేవానిలా కనిపించాడు.

పొలాలలో రైతులు లేరని ఆ ముష్టివాడికి తెలుసు. మంచు మీద కాకులు నల్లటి చుక్కలలాగా ఉన్నాయి. శిలువ గుర్తులు చెక్కిన కొండరావి చువ్వ చేతిలో వణికింది. ఆ ముష్టివాడు ముసిలి వాడు. మెడ పట్టుకుని సంచీలోనుంచి కావలసినన్ని రొట్టెముక్కలు గుంజుకోవడం ఏమంత కష్టంకాదు. కడుపు మాడుతూంటే జడోన్స్క్ మీదుగా ప్రయాణం చేయలేనని బామన్‌కు అనిపించింది.

"పిచ్చివేషాలు వేయకు, తాతా" అన్నాడు బామన్ ప్రశాంతంగా అయిదు కోపెక్కులు సంచిలోనుంచి తీస్తూ, "నేను బందిపోటు దొంగనేంకాదు. నేను వైద్యుణ్ణి. మనుషులను చంపను. జబ్బులు కుదురుస్తా. దారిలో ఆకలేసి రొట్టెముక్క అడిగితే యింత గొడవ చేయడం దేనికో అర్థం కావడంలేదు. యిదిగో, అయిదు కోపెక్కులు తీసుకో. రొట్టెముక్కలు యియ్యి. నేను తీర్థయాత్రలకు బయలుదేరానేమో. అందుకే వుపవాసం చేస్తున్నానేమో, నీకేం తెలుసు."

సంచీ రోత వస్తోంది. ఆరొట్టెముక్కలు ఎవరు దానం చేశారో, ఎలా ఎండిపోయాయో ఎవరికి తెలుసు? కాని బామన్ రోడ్డువెంట నడుస్తూ కరకరా నమిలి మింగాడు. మంచి రుచిగా ఉన్నట్టే అనిపించాయి. ఒక్కముక్క తిన్నాడోలేదో కొత్తబలం పట్టినట్టయింది.

   

ముష్టివాడు కుంటినడక నడిచాడేమో బాగా వెనక పడి పోయాడు. రోడ్డు మొదటిమలుపులోనే ఇద్దరూ విడిపోయారు. బామన్ మోకాలు మళ్ళీ నెప్పిపెట్టసాగింది. ఎత్తుపల్లాలు ఎక్కడం దిగడం కష్టంఅనిపించింది. అయినాసరే బుద్ధిపూర్వకంగానే బామన్ ముష్టివాడిని వెనక తొక్కేసాడు. ఆముసలివాడిని వెంట బెట్టుకుని ప్రయాణం చేయడం మంచిదికాదు. బామన్ ఆచూకీ వాడికి తెలియకుండా చేయడం ఉత్తమం.

ఆ ముసిలి ముష్టివాడు చెప్పిన హైరోడ్డు దగ్గిరలోనే తగి లింది. కాని బామన్‌కు నడవడం తేలిక అనిపించలేదు. రోడ్డుమీద బండిచారలు బాగా లోతుగా పడ్డాయి. మంచుతో చదునయిన బండిబాటలో కంటె ఇక్కడ కాలునెప్పి ఎక్కువగా బాధించింది.

♦ ♦ ♦ ♦

ఎంతదూరం వెళ్ళాడు? తెలుసుకునే సాధనంలేదు. కొండలు, పొలాలు-ఇంతే ఇంకేమీ తగలలేదు. మధ్యమధ్య మెలికలు మెలికలు తిరిగిన వెడల్పాటి నది పొడగట్టింది. నది నిర్మలంగా, మంచుతో కప్పబడి ఉంది. అది డాన్‌నది కావచ్చు. పైన ఆకాశం పూర్వంలాగానే బూడిదరంగుగా, మేఘాలతో బరువెక్కి, వికా రంగా ఉంది. గడియారంలేదు. ఎన్నిమైళ్ళు నడిచిందీ, ఉదయం లగాయతు ఎంతసేపు నడిచిందీ తెలియడంలేదు.

♦ ♦ ♦ ♦

కంకరవేసిన హైరోడ్డు నుంచి కుడివేపుకు చాలా బండి బాటలు కనిపించాయి. దూరాన కొండలకు ఆనుకుని దగ్గరదగ్గరగా ఉన్న గ్రామాలలో, బాటలు అంతమయాయి. పొగగొట్టాలనుంచి ఊదారంగు పొగ చుట్టలు చుట్టగా పైకిలేచింది. హైరోడ్డుకు దగ్గ రలో ఎక్కడా గ్రామాలుగాని, కుగ్రామాలుగాని, చివరికి రోడ్డు బాగుచేసేవాడి గుడిసెగాని లేదు. డాన్‌నదికి అవతలివేపున పది సామానుబళ్ళు మాత్రం ఒకసారి కనిపించాయి.

హఠాత్తుగా వెనకనుంచి గుర్రపుడెక్కల టకటక శబ్దం, టాంగా వెంట పరుగెత్తేమనుషుల కిరకిర శబ్దం వినిపించాయి. వెనకకు తిరిగిచూశాడు. వెడల్పేగాని ఎత్తు అట్టేలేని టాంగా బండి చారలవెంట గుద్దుకుంటూ ఊగుకుంటూ వస్తోంది. టాంగా బామన్‌ను దాటిపోయింది. దాటిపోతుండగా అందులో తలకు గుడ్డటోపీ, నడుముకు వెడల్పాటి ఎర్రపటకా పెట్టుకుని కూర్చున్న రైతు బామన్ కేసి తీక్షణంగా తేరపారజూసాడు. బొద్దు కనుబొమలు మంచుతో కప్పేసుకుపోయాయి, అనుమానంతో ముఖం, చిట్లించుకుని బామన్ నోరు తెరచి మాట్లాడ బోయేసరికి గుర్రాన్ని కొరడాతో కొట్టి కదంతొక్కించాడు.

రెండువందల గజాలదూరం వెళ్లినతరవాత రైతు గుర్రాన్ని ఆపి బామన్‌కోసం నిరీక్షించాడు. ఈలోపున బామన్ బుద్ధిపూర్వకంగానే నడక వడి తగ్గించి మెల్లిగా నడుస్తున్నాడు.

"ఖైబ్లోనోయె వెళుతున్నారా?" అని ఆరైతు మెల్లిగా బొంగురు గొంతుతో బామన్ సమీపించగానే ప్రశ్నించాడు.

"ఆఁ-ఖైబ్లోనోయెకే." అని బామన్ మృదువుగా సమాధానమిచ్చాడు.

"డాక్టరు పియొటర్ ఆండ్రియెవిచ్ వెలెజోవ్ యింటికేనా? యెక్కి కూర్చోండి. తీసుకువెళతా."

బామన్ గడ్డికిందఉన్న గోనెసంచిని పక్కకునెట్టి టాంగాలో ఎక్కి కూర్చున్నాడు. గోనెసంచి గుబగుబా కదిలింది. పందిపిల్ల గురుగురుమంది. బామన్ టాంగాకు ఒకపక్కగా జరిగి కూర్చున్నాడు.

"యిదిగో, ఆయనగారిని తన్నబోకేం." అన్నాడు రైతు చుట్టూచూసి మనసు కష్టపెట్టుకుంటూ.

"మీకు తెలియదు గావును. పది వెర్స్టుల దూరంనుంచే ఆ ఊడేలు పందిఅరుపు వినగలుగుతుంది."

"యీా ప్రాంతాల్లో తోడేళ్లు వున్నట్టు విన్నావా?"

రైతు చుట్టూచూసాడు. కొండలవంక, డాగా నదిలోని మంచువంక చూసాడు. నది తిరిగీ పొడగట్టింది. దానికి అవతల కొండల సానువులమీాద దట్టంగా అడవులు అల్లుకున్నాయి.

"యెందుకు వుండవు? చుట్టుపక్కల కొన్నిమైళ్ళవరకు కొంపంటూలేదు. అడవులు, కనుమలు అంతే. పైగా పొద్దు కూకస్తోంది."

గుర్రాన్ని కొరడాతో కొట్టాడు. ఈ తడవ పందిపిల్ల మెల్లిగా గురుగురుమని మెదలకుండా పడుకుంది.

"నేను డాక్టరుగారి యింటికి వెళుతున్నానని యెలా వూహించావు?" అని గడ్డిమీాద హాయిగా సర్దుకు కూర్చొని బామర్ అడిగాడు.

"యింకెక్కడికి వెళతారు?" అని ఆరైతు ఇకిలించాడు. నలభయి వర్స్టులలోపల యెవరూ లేరు. ఒక నిమిషం మానం వహించి మళ్ళీ అన్నాడు: "మంచివాడు. రైతులకు సాయం చేస్తుంటాడు."

"సాయం చేస్తున్నాడంటే?" అని బామర్ అడిగాడు జాగ్రతగా. "యేవిధంగా?"

"నీకు బాగా తెలుసు" అని రైతు జవాబిచ్చాడు, తలతిప్పి కనుగీటుతూ. గుర్రం వీపుమీాద కొరడాతో ఈడ్చి కొట్టేసరికి, అది పిచ్చిగా దౌడు తీయసాగింది.

"హేయ్, చల్ చల్ చల్"

# 23

# స్వాగతం, సుస్వాగతం!

ఆరైతు గ్రామ పొలిమేరలో బామన్‌ని దిగబెట్టాడు. ఆ వైద్యునిఇల్లు ఒంటరిగా, గ్రామానికి కొద్దిదూరంలో ఉంది. అది కొయ్యతో కట్టిన ఇల్లు. కప్పు బాగా ఏటవాలుగా ఉంది. కిటికీ కమ్మీలవరకు మంచు పేరుకుంది. కొయ్యబద్దలతో అల్లిన కోరడి లోపలి వరండామీద మంచు దట్టంగా కురిసింది. పొన్నులు మినహా కోరడి అంతా మంచుతో మునిగిపోయింది. తోటలో కాలిబాటలు గాని జాడలుగాని లేవు. బొద్దుముక్కు, మోచేతి కింద నల్లటి చిపురుతో మంచుమనిషి లేదు. మంచుమనిషి లేక పోవడం ఆ ఇంటిలో పిల్లలులేరని సూచిస్తూంది. బామన్ మొహం ముడుచుకున్నాడు. పిల్లలులేని ఇంటిలో స్నేహపూర్వకమయిన ఆదరణ లభిస్తుందని ఆశించలేము.

దొడ్డి దోవన ఇంటిని సమీపించాడు. కొట్టాంలోనుంచి తల బయటపెట్టి కుక్క మొరుగుదామని నోరు తెరిచి మళ్ళీ మాను కుంది.

బామన్ పోర్చిలోకి వెళ్ళాడు. తలుపు బిడాయించి ఉంది. ఇనప సమ్మెటతో తలుపుమీద కొట్టాడు. సన్నని స్వనం వినిపిం చింది. పిడికిలితో తలుపుమీద దబదబా బాదాడు. వెనువెంటనే కోపంతో ఒక స్త్రీ లోపలనుంచి,

"యెవరక్కడ ? తలుపు అలా పగలగొట్టేస్తున్నారేం ?" అన్నది.

"పియోటర్ అంద్రియెవిచ్‌ని చూడడానికి వచ్చాను" అని బామన్ తెలియజేసాడు,

తలుపు తెరుచుకోలేదు.

"యెవరక్కడ ?"

"బాటసారిని. పియోటర్ ఆంద్రియెవిచ్ స్నేహితుణ్ణి." భయంతో, ముభావంతో, సందేహంతో తలుపు తెరవక పొయే సరికి బామన్ బెదిరింపుగా, "సెయింట్ పీటర్స్‌బర్గ్‌నుంచి, రాజధానినుంచి వస్తున్నా" అన్నాడు.

గడియ కిర్రుమంది. చలికి బిగుసుకుపోయిన చేతితో బామన్ తెరిచాడు. వంటింటిలోనుంచి వెచ్చటిగాలి కొట్టింది. అతని ఎదట ఒకస్త్రీ ప్రత్యక్షమయింది. ఆమె మొహం నిద్రమత్తుగా, బొద్దుగా, దోసెలా గుండ్రంగా ఉంది.

"బయట చలిలో అట్టేబెట్టడం యెందుకు ? చచ్చేదాకా కొట్టినా దిక్కున్నట్టు లేదే ?

హాలులోనుంచి వంటింటిలోకి వెళ్ళే ద్వారంలోనుంచి పొయ్యి కనిపించింది. పొయ్యిదగ్గరికి చేరితే వెచ్చగా ఉంటుంది గదా అని బామన్ గుమ్మందాటాడు. పొయ్యిమీద దగ్గర దగ్గరగా ఉన్న రాగి గిన్నెలలోనుంచి ఆవిరి వెడుతోంది. ఆ గిన్నెలలో కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి. అయినా అన్నీ సమానంగానే మెరిసిపోతున్నాయి. మాంచి వంటకాల వాసన ఘుమ్ముమని కొట్టి నోరు ఊరింది.

భారంగా ఊగుతూ ఒక అడుగు ముందుకువేసి ఆ స్త్రీ వంటింటికి ఎడమవైపున ఉన్న తలుపుతీసి,

"నీ కోసం యెవరోవచ్చారు." అంది.

ఆమె వెనకాలే నిలుచున్న బామన్‌కి కూడా వినిపించకుండా ఉండాలని అతి మెల్లగా మాట్లాడింది.

"యెవరినీ లోపలకి రానీయవద్దని చెప్పలా?" అని ఒక కంఠం కోపంతో మెల్లిగా జవాబిచ్చింది. ఈ జవాబుకూడా చెవిలో చెప్పినట్టే ఉంది. కాని ప్రతిమాటా బామన్‌కి వినిపించింది.

ఆ స్త్రీ చుట్టూచూసి నెత్తి గోక్కుంటూ,

"మీా స్నేహితుడని చెప్పాడు." అంది.

"నా స్నేహితుడా?" ఆకంఠంలో ఆశ్చర్యం ద్యోతకమయింది.

బామన్ ఆస్త్రీ బుజాలు పట్టుకుని పక్కకులాగి గదిలోకి వెళ్ళాడు.

ఆ గదినిండా సామానే. పెద్దపెద్ద బీరువాలు, మందపాటి కాళ్ళ పడకకుర్చీలు, ఎత్తువెన్ను సోఫా. ఒక కుటుంబం కుటుంబానికి సరిపోతుందా అనిపించే పెద్దమంచం-నలువైపులా బామన్‌కి కనిపించాయి. మేజాబల్లమీాద పింగాణి గిన్నెలు, పడపోత పాత్రలు, రేకుడబ్బాలు, సీసాలు కుప్పలు కుప్పలుగా పడిఉన్నాయి. ఉదయం పలహారవేళ దగ్గిరనుంచి అలాగే పడిఉన్నట్టు కనిపిస్తున్నాయి. ఒకపంజరం, పంజరంలో ఒకజీనువాయి పిట్టాఉన్నాయి. ఆపిట్ట ఈకలు ముడుచుకుని, రెక్కలు విప్పుకుని నోరు తెరిచింది. దానిపక్కనే ఒక బొద్దుమనిషి - జుట్టు ఊడిపోతోంది, ఉబ్బు మొహమయినా రమ్యంగా ఉంది. మూత్రపిండ రోగిలా కనిపించాడు. రాత్రిదుస్తులు వేసుకున్నాడు. గడ్డం మాసింది. బామన్ కనిపించగానే రెండు చేతిబొటనవేళ్ళూ చొక్కాపట్టీలలోకి పోనిచ్చి పట్టుకున్నాడు. తెల్లటి చొక్కామీాద ఆపట్టీలు తళుక్కుమంటున్నాయి.

"క్షమించండి, ఇంకా దుస్తులు వేసుకోలేదు."

"మనలో మనకి పెద్దమర్యాద లెందుకు?" అంటూ ప్రారంభించాడు బామన్ స్నేహపూర్వకంగా మందహాసం చేస్తూ. కాని ఆవైద్యుడు ఆశ్చర్యపోవడం చూసి తొందరతొందరగా,

"నేనూ వైద్యుడినే. నా పేరు నికొలాయ్ వాసిలియెవిచ్ పెట్రోవ్. స్వతంత్రించి మీాకు అంతరాయంగలిగి..."

మాటముగియకముందే వెలెజోవ్ తలుపుకేసి చూశాడు. తలుపు తెరిచి ఉంది.

బామన్ నెమ్మదిగా నవ్వి,

"చిన్న తమాషాజరిగింది." అన్నాడు. "నేను ఒక స్నేహితుడితో పందెంవేసి కాలినడకను వొరోనెజ్ నుంచి రోస్టోవో బయలు దేరాను. యీవేళ ఉదయం రోడ్డుమీద కొంతమంది దుర్మార్గులు నన్ను దోచేసుకున్నారు. నాదగ్గిరవున్న ఆహార పదార్థాలు, డబ్బు ఒకటేమిటీ సమస్తమూ లాగేసుకున్నారు. నా కోటు, టోపీ తీసుకోలేదు నయం. దీనికితోడు నా మోకాలు బెణికింది. అదృష్టవశాత్తు ఒకరైతు కనిపించి బండీలో తీసుకుని వచ్చి యిక్కడ దింపాడు. మీరు అన్నివిధాలా ఆదరిస్తారనికూడా చెప్పాడు. మనం యిద్దరం వైద్యులం గనక యింకా బాగా ఆదరిస్తారన్నాడు. యిక కాలి ప్రయాణం చేయడంలో అర్థంలేదు. మోకాలు బెణికిందా, యిక నడిచే స్థితిలోలేను. వొరోనెజ్ తిరిగి వెళ్ళడానికి పదిరూబుళ్ళు మీరు బదులు యిస్తే తిరిగి పంపించేస్తానని వేరే చెప్పాలా!

బామన్ మాట్లాడుతున్నంతసేపూ వెలెజోవ్ అతని మొహాని కేసి పరీక్షగా చూశాడు.

"తమాషా జరిగిందేం?" అని ఆశ్చర్యం ప్రకటించాడు ఎగతాళిగా. "దొంగవెధవలు!"

బామన్ పక్కగా వెళ్ళి తలుపు బిగించి గిర్రున తిరిగి ఆగంతకుని కళ్ళల్లోకి చూసాడు.

"నాకు కోపం వచ్చేదే" అంటూ నెమ్మదిగా మొదలుపెట్టాడు. "యెందుకీ కథ అల్లావు? పందెం, దోపిడి, మోకాలు బెణకడం... యివన్నీ నువ్వు అల్లినవే. నువు యెవరవో స్పష్టంగా తెలుస్తూనేవుంది." హెచ్చరికగా చేయి ఎత్తి "నేను విప్లవకారుడిని కానువీరుడునికాను. ప్రజల క్షేమంకోసం పాటుబడుతున్న సామాన్య మానవుణ్ణి. నా గొడవయేదో నా అంతట నేనుపడుతున్నాను.

కాని నా బీదసహోదరులకు సాయంచేయడం నా కర్తవ్యమని తెలుసు. మనం మేధావులం. కార్మిక వర్గానికి తీర్చుకోలేనంత రుణపడివున్నాం. కాని నేను చేతనయినంత వరకు రుణం తీర్చాలనే యత్నిస్తున్నాను. నాముందు నువ్వు దొంగవేషం వేయవలసిన అవసరంలేదు. నా మాటనమ్ము. యేమీ సంకోచంలేకుండా యిక్కడికి యెందుకు వచ్చావో చెప్పు. నువ్వు చెప్పకపోయినా యింతకుముందే నేను గ్రహించేసాననుకో. నువ్వు మమ్మల్ని రెచ్చగొట్టడానికి వచ్చావు. నువ్వు సోషలిస్టు విప్లవ కారుడివి."

ప్రేమతో, స్నేహంతో, చిత్తశుద్ధితో చేతులు జాపాడు.

"మీరు కొద్దిగా పొరబడ్డారు" అన్నాడు బామన్ ఆయనతో కరచాలనం చేస్తూ. "మీ రైతులను రెచ్చగొట్టడానికి నేనిక్కడకి రాలేదు. నేను వేరేపనిమీద వచ్చాను. నేను నరోడ్నిక్‌ని కాను. కాని మొత్తంమీద మీరు సరిగానే వూహించారు. నేను విప్లవ కారుడనే. నిజం. అయితే నేను సోషలిస్టు విప్లవకారుడినిమాత్రం కాను, సోషల్ డెమాక్రాట్‌నే. అరెస్టుగాకుండా తప్పించుకుని రొస్టోవ్ చేరుకోవాలని చూస్తున్నాను."

"అలా అయితే" అన్నాడు వెలెజోవ్ ఇంకా గట్టిగా బామన్‌తో కరచాలనం చేస్తూ, "నిజంగా స్నేహభావం అంటే యిదే. యిప్పుడు నువ్వుమాట్లాడేదాంట్లో అర్థంవుంది. పదిరూబుళ్ళు కావాలన్నావు గదూ, యిరవయి, నలభయి, నీకెన్ని కావలసివస్తే అన్నీ తీసుకో. బతికి వున్నంతవరకు నీకు రుణపడి వుంటాను. ప్రజా విముక్తికి యింత సాయపడడం యెంతో గౌరవంగా యెంచు కుంటాను. మాట్రినా !"

వెంటనే తలుపు తెరుచుకుంది. ఒకస్త్రీ మహాకుతూహలంతో గదిలోకి తొంగిచూసింది. చాటునుంచి వింటుంది. అనుమానం లేదు. వెలెజోవ్ ఆదరణ సూచకంగా చేతులుజాపి,

"వండినవన్నీ వడ్డించు. పదార్థాలు రుచిగా లేకపోతే నీ మర్యాద నిలవదు. మన అతిథికి విందు పెట్టడానికి ఆవుపెయ్యని కొయ్యాలి."

ఆస్త్రీ మారుమాటాడకుండా తలుపువేసి వెళ్ళిపోయింది. వెలెజోవ్ బొమన్ చేయిపట్టుకుని పడక కుర్చీదగ్గిరికి తీసుకుని వెళ్ళి,

"హాయిగా కూర్చో. గ్రిబొయెడోవ్ చెప్పినట్లు; యిదిగో సోఫా - ప్రశాంతంగా విశ్రమించు" ద్వారంవంక చూచి కుట్రదారునిలా స్వరం తగ్గించి, "మనిద్దరిమధ్యా దాపరిక మెందుకు, బయటపడిపోవడం మంచిది. నిన్ను యెవరన్నా వెంటాడుతున్నారా? మా యింట్లో ప్రవేశిస్తుండగా ఈ గ్రామస్థులెవరన్నా చూశారా?"

"ఆ విషయంలో మీరేం భయపడనక్కర్లేదు." అని బొమన్ చెప్పాడు సంతోషంతో నవ్వుతూ. తలపంకించి, నా వెంటపడ్డా ఈపాటికి నిరాశ చేసుకుని వుంటారు. నా ఆచూకీ యెవరికీ తెలీదు, నన్ను యిక్కడ దించినబండివాడు యీ వూరివాడుకాదు. క్లైబ్నాయేలో వాడికి పనేంలేదు. నన్ను యిక్కడ దించగానే కుడివైపుకు బండి తోలుకు చక్కాబోయాడు. యెవరూ నన్ను చూడలేదు. యిక్కడ వున్నానని కూడా తెలీదు."

ఆవైద్యుడు భారం తగ్గిందని సంతోషంతో తల పంకించాడు.

"బాగా అలిసిపోయావా? కాసేపు విశ్రాంతిగా పడుకుంటావా?"

బొమన్ పక్కకేసి చూశాడు. సరిగా వేసిలేదు. బొంతు ఈక పరుపుకిందికి వేలాడుతోంది. తలగడాలు నలిగి మురికి కొట్టుకొని ఉన్నాయి. ఇంకా నూనెమరకలు కానవస్తున్నాయి. బొమన్ పడుకోవడానికి వెంటనే నిరాకరించాడు.

"అయితే కాసేపు కూర్చుని విశ్రాంతి తీసుకో. నేను ఆసుపత్రికి వెళ్ళి కట్టుకట్టివస్తాను. తొందరగా వెళ్ళాలి. నిజానికి వెళదామనుకుంటుంటే నువు చక్కావచ్చావు. అప్పుడే దుస్తులు వేసుకోబోతున్నా".

"చొక్కా పట్టీలు దగ్గిరికి లాక్కుని కుడిచేతినీ తొడుక్కున్నాడు.

"క్షమించు. ఆసుపత్రి దగ్గర్లోనే వుంది. తొందరగానే తిరిగి వచ్చేస్తాను. నేను వెళ్ళిందగ్గిరనుంచి విశ్రాంతి తీసుకో. లేదూ, కావాలంటే యీ చిన్న జానువాయిపిట్టని వేధించుతూ కూర్చో. దానికి కోపంరావడంచూస్తే తమాషాగా వుంటుంది."

పంజరంలో వేలుపెట్టి పొడిచాడు. తక్షణమే ఆజానువాయి పిట్ట రెక్కలు విప్పుకుని ఆత్మరక్షణకు ముక్కు తెరిచింది.

"చూడు, చూడు." అంటూ సంతోషంతో వెలెజోవ్ నవ్వాడు... సరే, వెళుతున్నా."

తలుపు టపీమని మూసుకుంది. వెళుతూవెళుతూ వెలెజోవ్ కోటుగుండీలు పెట్టుకున్నాడు. ఒకటవ అలెగ్జాండరుకాలంలో తయారు చేసినట్లున్న ఆ పడకకుర్చీలో బామన్ హాయిగా కాళ్ళు చాచుకుని పడుకున్నాడు.

తిరిగి పిచ్చిఆకలి వేసింది. వెలెజోవ్ భోజనం పెడతానని మాట ఇచ్చాడు. చక్కటి భోజనం దొరికితే ఎంత తృప్తిగా ఉంటుంది? సుష్టుగా భోజనంచేసి ఎంతకాలమయిందో! రొట్టెలతో కాలక్షేపం చేస్తున్నాడు.

ఆ స్త్రీవచ్చి మేజాబల్లమీది మురికిపళ్లాలు తీసేసింది. ఆమె స్నేహభావంతో చూసేసరికి బామన్ "భోజనం యెప్పుడు పెడతావు? తొందరగానేనా?" అని అడగకుండా ఉండలేకపోయాడు.

ఆమె పళ్ళాలు చప్పిడిచేసుకుంటూ, దీర్ఘాలుతీస్తూ, "మేమిపుడే ఫలహారాలు చేసాం. భోజనానికి యింకా మూడుగంటల వ్యవధివుంది." అంది. బామన్ చిన్నపోవడం చూసి, "చాలా దూరం ప్రయాణంచేసి వచ్చినట్టున్నారు. యేమయినా తింటారా? తీసుకువస్తానుండండి."

"పెడతానంటే వద్దంటానా!"

కొద్దినిమిషాల తరవాత ఊరవేసిన కుక్కగొడుగులు, పులిసిన ద్రాక్షసారాయిలో చేపలు, వోడ్కావడపోతగిన్నెలు, మిరి

యాలగుండ, చల్లారిపోయిన బాతురెక్క, తొడ, మాంసం, పెనం మీద వేయించిన అయిదు కోడిగుడ్లు అతనిముందు ఉంచింది.

కోడిగుడ్లు, కొద్దిగా వోడ్కా ముందుగా తీసుకున్నాడు. ఆ తరవాత కుక్క గొడుగులు, మళ్ళీ వోడ్కా, ఇంకా మొదట్లోనే ఉన్నాడు. తిననకొద్దీ ఆకలి హెచ్చింది. తొడ, మాంసం అతని ఆకలిని తీర్చలేకపోయాయి. ఆమె గదిలోనుంచి వెళ్ళిపోయింది. ఇక అతనిని అడ్డుపెట్టేవాళ్లు లేరు.

వెలెజోవ్ తిరిగి వచ్చేసరికి బామన్ బాతురెక్క శుభ్రంగా తినేస్తున్నాడు.

"విందారగిస్తున్నారా? మాత్రినా తెలివిగల పని చేసింది" అంటూ ఆమోదం తెలిపాడు.

"వెళ్ళే హడావిడిలో భోజనానికి పొద్దుపోతుందని చెప్పడం మరిచేపోయాను."

"యిక దానిపని మనమేం పట్టించలేం!" అని బామన్ నవ్వాడు. "వారం రోజులదాకా యిక ఆకలివేసేటట్టులేదు."

"ఆకలిని నమ్మివుండకూడదు! మధ్యాహ్నానికి మళ్ళీ ఆకలి చుర్రుమంటుంది. మాత్రెనా వంట యెలావుంది? సామాన్యపు రైతుబిడ్డ. కాని వంట మహాపసందుగా చేస్తుంది."

"అవును. మహాపసందుగా చేస్తుంది." అని బామన్ అతనితో ఏకీభవించాడు." అయినప్పటికీ కడుపులో యెక్కడా ఖాళీ లేదు.

"హుం—" అని వెలెజోవ్ దృష్టి తిప్పేసుకున్నాడు. "యిక బయలుదేరుదామనుకుంటున్నావా?" అని తొందర తొందరగా రహస్యంగా అడిగాడు.

"చదువుకునే రోజులనాటి సంగతులు తెల్లవార్లూ మాట్లాడుకోవాలని నాకైతేవుందిగాని, నీయిష్టం. ఆరోజులు

యెటువంటి రోజులు! సరే. నీస్థితి నాకు అర్థమయింది. నిన్ను అనవసరంగా యిక్కడ ఆపదలుచుకోలేదు."

కాని తొందరగా వెళ్ళిపోవాలనే ఆలోచన ఆ సమయంలో బామన్‌కి లేదు. వెచ్చగా ఉంది. మస్తుగా తిన్నాడు. ఇంకేం కునుకుపాట్లు వచ్చాయి. పాదాలు జలదరించాయి. మోకాలు నెప్పి మళ్ళీ తయారయింది. రాత్రి యిక్కడ యెందుకు గడపకూడదు? అపాయం ఉన్నట్టు ఎక్కాడా కనిపించడంలేదు.

కాని వెలోజోవ్ అతిమెల్లగా మాట్లాడుతూనే ఉన్నాడు:

"ఇపుడు బయలుదేరి వెళ్ళితే రాత్రికల్లా రైయిలులో వుంటావు. యిది చాలా అనుకూలమయిన సమయం. రైతులంతా యిళ్ళల్లోపడి వుంటారు. యెవరికంటా పడకుండా వెళ్ళచ్చు."

"ఈ మానవుడికి తారెత్తింది." అని బామన్ విసుగుతో అనుకున్నాడు. "యెదోవిధంగా నన్ను తొందరగా వదిలించుకోవాలని చూస్తున్నాడు, వీడి దుంపతెగ. సరే. బయలుదేరతాను.

మనసులో వెళ్ళాలని లేదు. ఏం చేస్తాడు? లేచాడు. వెళ్ళడం ఇష్టంలేదనే సంగతి అతని మొహంలో, ప్రవర్తనలో కనిపిస్తూనే ఉంది. కాని వెలెజోవ్ అది గమనించనేలేదు. పొయ్యిదగ్గిర వేలాడవేసిన బామన్ కోటుతీసి ఇవ్వడానికి తొందరగా వెళ్ళాడు. జీనువాయిపిట్ట తిరిగి రెక్కలు విప్పి నోరు తెరిచింది. ఆ వైద్యుడు ఓవరుకోటు పంజరానికి మరీ దగ్గిరగా పట్టుకుని నుంచున్నాడు.

"కాస్త సాయంచేస్తాను. యీ దోవంటే వెళ్ళి హైరోడ్డు తగలగానే కోరండివెంటే గ్రామాన్ని చుట్టివెడితే కుడివైపున బాగా నలిగిన కాలిబాట కనిపిస్తుంది. కంచెదాటి వెడితే యెడమ చేతివేపున ఒక గుర్రపుశాల, సైనుబోర్డు కట్టిన గుడిసె తగులుతాయి. పరిస్థితుల వొత్తిడివల్ల నువు తొందరగా వెళ్ళిపోవలసి వచ్చినందుకు నాకు చాలా విచారంగా వుంది. సరే, శుభం, వెళ్ళి రా.'

మళ్ళీ బామన్ చెయ్యి తన చేతిలోకి తీసుకుని గట్టిగా ఊపుతో, "సరేగాని నీదగ్గిర యేమయినా సాహిత్యం వుందా? నిజం చెప్పాలంటే యిక్కడ, యీ గ్రామంలో చదవడానికేమీ లేక మొహం వాచిపోయున్నాం." అని అడిగాడు.

సాహిత్యం! కౌన్సిలరు తన జేబులో కుక్కిన 'విముక్తి' పత్రిక బామన్‌కి జ్ఞాపకం వచ్చింది తగిందే.

"జేబులో యేదోవుండాలి" అని అనుకోకుండానే నవ్వాడు. జేబులోనుంచి పత్రికదీసి, "యెలాంటి స్థితిలోవుందో కనిపిస్తోందిగా?"

"మరేం పరవాలేదు. సాఫు చేయిస్తాగా మాక్రైనా దానిని కొత్తదానిగా తయారుచేస్తుంది. ఆమెకు చదువురాదు. అందువల్ల పత్రిక చేతికిస్తే ప్రమాదం లేదు. కృతజ్ఞుణ్ణి! సరే, శుభం వెళ్లిరా."

బామన్‌ను చెయ్యి పట్టుకుని గుమ్మంలోకి తీసుకువెళ్ళాడు. గుమ్మంలో, బామన్ సందేహించడం కనిపెట్టి, ఆగి నుదురు కొట్టుకుని, "బలేవాణ్ణి! డబ్బుసంగతే మరిచేపోయాను. పదిరూబుళ్ళు కావాలన్నావు గదూ?"

మొద్దులాంటి వేలిమీద ఉమ్మివేసుకుని డబ్బు లెక్కపెట్టి బామన్ చేతికి అందించాడు.

"సరే నేను యిచ్చాననే సంగతే మర్చిపో. తిరిగి యివ్వక్కర్లేదు. పోస్టలు ఆర్డరు పంపకు. విప్లవానికి కాస్తోకూస్తో విరాళం అనుకుందాం"

"బలే జిత్తులమారి నక్క! కడుపునిండా తిండి పెట్టాడు. చేతిలో పదిరూబుళ్ళు కుక్కాడు. యిక నేనుమాత్రం నోరు మెదపరాదట! సరే, యెక్కడికక్కడికే. గుడ్డికన్నుకంటె మెల్ల కన్ను నయం" అనుకున్నాడు బామన్.

వంటింటిలో నుంచి మాంచి వాసన ఘుమ్మమంది. గిన్నెలలోనుంచి ఆవిరి వెలువడుతోంది. పెనంమీద వెన్న చుయ్ మంటోంది. మాక్రైనా తొందరగా తలుపు గడియ వేసింది.

తలుపు గడియవేసి నందుకు సంతోషించినట్టు, బామన్ దొడ్డి జారుడుమెట్లు దిగాడు. ఈతడవ కుక్క పిచ్చిగా మొరిగింది.

బామన్ మలుపుతిరిగేవరకూ వెలెజోవ్ కిటికీదగ్గిర నిల్చుని మందహాసం చేసి చేయి ఆడించాడు.

బామన్ కొండదిగాడు. ఆకొండమీదే ఆసుపత్రి ఉంది. గుర్రపు మజిలీకి వెళ్ళాలనే ఉద్దేశంలేదు, పోలీసులు తాము వెంటాడుతున్న మనిషి ఆనవాళ్ళు రైలుస్టేషనులకే గాక గుర్రపు మజిలీలకి కూడా తంతిద్వారా తెలియజేస్తారు. ఎవరిదృష్టిలోనూ పడకుండా జాగ్రతగా జడోవ్స్క చేరుకోవాలి. అట్టేదూరం వెళ్ళ నక్కరలేదు. అక్కడ నుంచి మెలెట్స్ వెళ్ళి రైలు ఎక్కవచ్చు.

గ్రామ పొలిమేరలోని గుడిసెలమధ్య సందులోనుంచి బామన్ రాజవీధి దారి పట్టాడు. వీధిచివర యెక్కడో ఒక స్త్రీ బావిలోనుంచి జొక్కెనతో నీళ్ళు తోడుతోంది. ఆమె తప్ప ఇంకెవరూ వీధిలో లేరు. తొందరలో ఉన్నట్టు కనిపిస్తే ఆమె గమ నించవచ్చు... అంతకంటె తెలివితక్కువ వేరే ఉండదు. అందు కని మెలిమెల్లిగా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ నడిచాడు.

ఇలా ముప్ఫయి, నలభయి గజాలు వెళ్ళాడోలేదో ఈల మోతతో నలుదిక్కులూ విపరీతంగా మార్మోగిపోయాయి. ఉక్కు వంటి బరువయిన చేయివచ్చి అతని తలవెనక టపీమని పడింది. దాంతో టోపీ నేలరాలింది. బామన్ తనను తాను రక్షించుకోవ డానికి జేబులలోనుంచి చేతులు పయికి తీసుకుని ముందుకు తూలాడు. కాని వెనుదిరిగేలోపున ఒక బలమయిన మనిషి బామన్‌మీద వచ్చి పడ్డాడు. అతని తలవెనక ఆవ్యక్తి వేడివేడి శ్వాసవచ్చి తాకింది. ఇనుపవంటి చేతులతో అవ్యక్తి భల్లూకం లాగా బామన్ నడుం వాటేసుకున్నాడు? ఇంకోపొట్టిమనిషి వచ్చి బామన్ ముందు నిల్చున్నాడు. అతనికి నెరిసిపోయిన చక్కటి గడ్డం ఉంది. పసందయిన గొర్రెచర్మం కోటు తొడిగాడు. ఎదు రొమ్ముమీద గుండ్రటి కంచుపతకం పెట్టుకొన్నాడు.

ఈలమోతకు దగ్గిర దగ్గిర ఇళ్ళతలుపులు దభీదభీమని మూసుకున్నాయి. పోర్చిలోనుంచి ఒకపిల్లవాడు బంతిలాగా ఉరుకుతూంటూ వచ్చాడు.

"మింకా !" పతకం ధరించిన వ్యక్తి చెవులు చిల్లులు పడేటట్టు విజయగర్వంతో అరిచాడు. "పరుగెత్తుకుని వెళ్ళి పోలీసుని తీసుకురా. నేను పంపించానని చెప్పు. ఒక విద్యార్థిని పట్టుకున్నామని చెప్పు. వీడు రాజకీయ యేజంటు, యిక్కడ అల్లర్లు రెచ్చగొట్టడానికి వచ్చాడనీ. వూరిపెద్ద, అతని అసిస్టెంటు గట్టిగా పట్టుకుని వున్నారని చెప్పు."

"మీ కేమయినా మతి పోయిందా ?" అన్నాడు బామన్ చేతులు విడిపించుకోవాలనీ, ప్రశాంతంగా ఉండాలనీ యత్నిస్తూ. "నన్ను పోనీయండి, నేను వైద్యం చేసుకునేవాడిని."

ఆ ఊరిపెద్ద పిడికిడి జాడించి బామన్ బొడ్డుమీద పొడిచాడు.

"నోరుముయ్ ! తీసుకెళ్ళి జైల్లో పడేయండి"

అప్పటికపుడే జనం గుంపుగా చేరారు. ముసిలమ్మలు కాళ్లు బిగుసుకుపోయినా అలానే కుంటుకుంటూ చక్కా వచ్చారు. మొగవాళ్ళు మొహాలు చిట్లించుకున్నారు. ఇద్దరు బామన్‌ను పట్టుకున్నారు. ఒకడు జేబులు వెతికాడు. ముగ్గురూ కంచుపతకాలు ధరించారు. ఆ పతకాలు వారి వారి హోదాలను తెలుపుతున్నాయి.

పోలీసు కోటుగుండీలు పెట్టుకుంటూ తయారయాడు. మింకా సంబరపడుతూ పోలీసుకు ముందుగా కుప్పిగంతులు వేస్తూవచ్చాడు. పోలీసు తొందరగా నడక సాగించాడు. కత్తి కాళ్ళకు తగులుతోంది.

రాజకీయ ఖైదీల విషయంలో, విద్యార్థుల విషయంలో మంచి ప్రవీణుడులా బామన్‌ను ఎగాదిగా చూసి ఆమోదసూచకంగా తల పంకించాడు.

ఊరిపెద్ద బామన్ జేబులు వెదకడం పూర్తయింది. వెలె జోవ్ ఇచ్చిన డబ్బు మినహా తక్కినవన్నీ గుండీతో సహా పోలీసుకు అప్పగించాడు. ఆ డబ్బును భద్రంగా తన జేబులోకి ఎక్కించాడు.

"యేమిటది ?" అని పోలీసు గట్టిగా ప్రశ్నించాడు, ఊరి పెద్ద చేయిపట్టుకుని "యెదీ యిలాయియ్యి"

కాని ఊరిపెద్ద తల పంకించాడు.

"అరెస్టు చెయ్యగానే డబ్బు తెచ్చి యియ్యవలసిందని పియోటర్ ఆండ్రియెవిచ్ చెప్పారు. అలాచేస్తే కాగితంమీాదికి డబ్బుసంగతి యెక్కదు. అక్కడికి చేరుకుంటే మీారు యీాలవేసీ మరీ తెప్పించుకోవచ్చు"

పియోటర్ ఆండ్రియెవిచ్ ! బామన్ విపరీతమయిన కోపంతో విదిలించుకున్నాడు. కాని వారు అతనిని గట్టిగా పట్టుకున్నారు.

# 24

## పోలీసు శాఖ

అరిగిపోయి తుప్పుపట్టి కిరకిరలాడే కమానుల మీద రెండు జైలుబగ్గీలు ఒక భవనంమెట్ల దగ్గిరికి వచ్చి ఆగాయి. ఆవాహనాల కిటికీలకు తెరలుకట్టి ఉన్నాయి. ఆ భవనానికి మరమ్మతులుచేసి చాలా కాలమయింది. మెట్లపైన పాతబడిన ఒక సైనుబోర్డు మీద

'కీవ్ మండల పోలీసుశాఖ' ...

అని వ్రాసిఉంది. బగ్గీల కమ్మీలు కొట్టుకోటానికి సిద్ధమయాయి. బగ్గీవాళ్ళు కొరడాలు ఆడించి గుర్రాలను తోలుతున్నారు. ఎవరికివాళ్ళు మెట్లదగ్గిరికి ముందు చేరుకోవాలని యత్నిస్తున్నారు. రెండు బగ్గీల తలుపులూ ఒకేసారి తెరిచారు. వెలిసిపోయిన ఊదా తెరలు గాలికి ఎగరసాగాయి. ఎత్తుబూట్లు, తట్టుముళ్ళు వేసుకున్న పోలీసులు బగ్గీలలోనుంచి దిగారు. పక్కబాట మీద నిలబడ్డ ఒక బాలిక వారివంక తేరపార జూచింది. కాపలా మనిషి హెచ్చరికను ఆబాలిక లెక్కచేయలేదు. కాపలాడబ్బా రంగుమాసి, భవనంలాగానే అదీ శిథిలమయి పోతోంది. మొదటి బగ్గీలోనుంచి బామన్ ఇద్దరు పోలీసులు చేరోవేపునా, ఒక పోలీసు వెనకా రాగా మెట్లుఎక్కి వెళ్ళాడు. రెండో బగ్గీలోనుంచి ఒక కార్మికుని దించి అదేవిధంగా ఆభవనంలోనికి తీసుకువెళ్ళారు. ఆ కార్మికుని తలమీద ఏమీలేదు మెడపట్టీదగ్గర చొక్కాచిరిగిపోయి ఉంది.

ఆ భవనంలో ప్రవేశించి మళ్ళీ మెట్లెక్కారు. మెట్లచివర వారికొక అధికారి చంకలో ఫైళ్ళబొత్తి పెట్టుకుని ఎదురయినాడు.

కీచుగొంతుతో, "సూపరింటెండెంటు నొవిట్స్కీ దగ్గిరకేనా?" అని ప్రశ్నించి తల ఆడించి జవాబుకోసం నిరీక్షించకుండా చక్కాబోయాడు.

బామన్ నడవలోకి తీసుకువెళ్ళారు. ఆనడవలో ఎర్రి అంచుల చాపపరిచి ఉంది. ఈజనమంతా వెళ్ళి ఒక తలుపుదగ్గిర ఆగారు. ఆ తలుపుపక్కన ఒక పోలీసు స్థిమితంగా నుంచున్నాడు. ఊదా యూనిఫారం వేసుకున్నాడు. బుజాలకు ఎర్రిటి కుచ్చులు, ఒరతీసిన కత్తి చేతిమడతలో ఆనుకునిఉంది. సరిగా అదేసమయంలో కార్మికుని కూడా తీసుకువచ్చారు. బామన్‌ని చూడగానే అతను చిరునవ్వు నవ్వ చేయిజాపాడు. బామన్‌కూడా చిరునవ్వు నవ్వాడు. ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు. ఇంతలోకే ఒక బక్కపలచటి వ్యక్తి ఎక్కడినుంచో వచ్చి వారిముందు నిలిచాడు. అతని మొహం నక్కమొహం. చిన్నది. ముక్కు గద్దముక్కు.

"మీయిద్దరూ ఒకరినొకరు యెరుగున్నారేమేం?"

"వెర్రినాయనా! యెరిగివుంటే యిక్కడ మేం యిలా ప్రవర్తించే వాళ్ళమేనా? యిదేనా మీకు పోలీసుఠాణాలో నేర్పింది?"

తలుపు దగ్గిర కాపలా మనిషి భుజంమీదికి కత్తి తీసుకుని టంచనుగా నుంచున్నాడు. తలుపు తెరుచుకుంది. మెట్లమీద ఎదురుపడ్డ అధికారి గుమ్మంలో ప్రత్యక్షమయాడు. ఇటీవలి తర హాలోకుట్టిన పొడుగాటి గౌను వేసుకునేసరికి, అసలే సన్నని నడుమేమో ఇంకా సన్నగా కనిపించింది. కచేరీకి కాపలాఉండే వారి కంటె ముందుగా ఏలా చేరుకోగలిగాడు? కిందనుంచి వేరేప్రత్యేకమయిన దోవ ఉందా? రహస్యపుగది ఉందా?

కొన్నికొన్ని పట్టణాలలో పోలీసులు ఖైదీలను చిత్రహింసలు పెడతారని చాలాకాలం కిందట బామన్ విన్నాడు. చట్ట విరుద్ధంగా నడిచే పత్రికలు రీగాలో ఇటువంటి హింసలు జరుగుతున్నాయని పత్రాలు చూపి రుజువుచేసింది. కీవ్‌లో ఇంతేనని కూడా

విన్నాడు. ఇంతవరకు ఈ విషయం బామన్ ఆలోచించనే లేదు. ఇప్పుడే జ్ఞాపకం వచ్చింది.

ఆ అధికారి చిటికెనవేలి గోటితో పలచని ఉంగరాల మీసం సవరించుకున్నాడు.

"కిరిల్ వాగ్రిన్‌కిన్" అన్నాడు.

"నేను" అన్నాడు కార్మికుడు బామన్ కేసి కనుగీటి.

ఆ అధికారి తలుపు బార్లా తీసి కిరల్ వాగ్రిన్‌కిన్‌ని లోపలికి పంపాడు. అతనితో వచ్చిన పోలీసుకూడా లోపలికి వెళ్ళాడు.

"యిక మీరు" అన్నాడు అధికారి గుమ్మంలోనుంచి బామన్‌ని సంబోధిస్తూ. వికటంగా నవ్వాడు. "కాసేపు ఆగాలి మీమీద అనుగ్రహం చూపాలనే ముందుగా కార్మికుడిని జనరల్ పిల్చారు. కార్మిక వర్గమే ముందుదారి తీయాలనే మీరే అంటారుగా!"

బిగ్గరగా నవ్వి కచేరీలోకి వెళ్ళి గట్టిగా తలుపు వేసేసుకున్నాడు. బామన్‌తోకూడా వచ్చిన పోలీసు ఊపిరి ఎగబీల్చాడు. తలుపు తిరిగి తెరుచుకోవడానికీ, మండల పోలీసుశాఖ సూపరింటెండెంటు కచేరీముందు కాపలామనిషికి తగినట్టు టంచనుగా నిలబడడానికీ చాలాసేపు పడుతుందని సూచించడానికా అన్నట్లు అక్కడి కాపలా మనిషి మందకొడిగాని ముభావంగా, కత్తి చేతి మడతకు తిరిగి ఆనించుకున్నాడు.

# 25

# కిరిన్ వాగ్రాన్కిన్

మండల పోలీసు శాఖాధికారి కార్యాలయం ఆ భవనంలో బాగా వెలుతురువచ్చే భాగంలో ఉంది. చురుకైన కిరణపుంజాలు పారదర్శకమయిన కసవురంగు తెరలుగుండా వచ్చి పెద్ద ఆకోటు వ్రాతబల్లమీద, తివాసీమీద, సూపరింటెండెంటు బుజం పట్టీల మీద పడుతున్నాయి. పోలీసు అధికారి నోవిట్స్కీ నోటిలో చుట్ట పెట్టుకుని పడకకుర్చీలో దొర్లుతున్నాడు. అతని వెనకగా 'సుఖప్రదంగా పరిపాలిస్తున్న' చక్రవర్తి పటం వేలాడుతోంది. కుడివేపున ఒకమూల ఎత్తుగా సెయింట్ జార్జి, సర్వం ప్రతిమా ఉంది.

"గ్రెబరోవ్ ఫాక్టరీలో ఫిట్టరు కిరిన్ వాగ్రిన్ కిన్ !"

ఆ కార్మికుడు చుట్టూచూసి అతి వినయంగా "అవును, యువర్ ఎక్సలెన్సీ !" అన్నాడు.

పోలీసు అధికారి తనముందు పడిఉన్న ఊదా ఫైలుమీద చేయివేసి కాగితాలు తిప్పాడు.

"మేడే ప్రదర్శనంలో తనవిధి నిర్వహిస్తున్న ఒక పోలీసు అధికారిని నువ్వు కర్రతో కొట్టావని నేరమాపాదింప బడింది."

వాగ్రిన్ కిన్ ఇకిలిస్తూ తల పంకించి, "అవును. పోలీసు అధికారి కర్ర చేత్తోపట్టుకుని తన విధి నిర్వహిస్తున్నాడు"

అతనితోకూడా వచ్చిన పోలీసులు పళ్ళు బిగబట్టాడు. మీసాలు కిందకి వాలాయి.

"పిచ్చిపిచ్చి వేషాలు వెయ్యకు" అన్నాడు సూపరింటెండెంటు హఠాత్తుగా మండిపడుతూ. "అతనిదగ్గిర కాదు నీ దగ్గిర కర్ర వుంది."

"నా దగ్గిరా?"

వ్రాగాన్‌కిన్ పెద్దగా మంచిగా ఇకిలించి చిరిగిపోయిన చొక్కా చేతిని పైకిచుట్టి చేయి ముడుచుకున్నాడు. అతని చేయి మంచి పుష్టిగా ఉంది. ఉక్కులాంటి కండరాలు కనిపించాయి.

పోలీసు అధికారి పడక కుర్చీలో వెనకకు వాలాడు. కూడా వచ్చిన పోలీసులు కత్తులు ఒక బుజంమీాదనుంచి ఇంకో బుజానికి మార్చుకున్నారు.

ఆ కార్మికుడు రొమ్ము విరిచి,

"జైల్లో బరువు తగ్గాను. కాని జైల్లో పెట్టకముందు నేనెవరి నయినా, కర్రతో కాదు, యీ పిడికిలితో కొట్టితే పుర్ర రెండు వక్కలయేది." అన్నాడు.

"హుc."

పోలీసు ప్రధానాధికారి ప్రాతబల్ల దగ్గిర నిల్చున్న పొడుగాటి అధికారి కేసి చూసాడు. ఆ అధికారి తిరిగి అతని కేసి చూసాడు.

"అలాగా" అని పోలీసు ప్రధానాధికారి తలపంకిస్తూ దీర్ఘాలు తీసాడు. "అయితే నువుకాదు..."

"అదే నేను చెపుతూంది" అని కార్మికుడు నొక్కిచెప్పాడు. "వుత్త పుణ్యానికే నన్ను యింతకాలమూ జైలులో పెట్టాను."

"యిక చాలించు" పోలీసు ప్రధానాధికారి మొహం జేవిరించింది. "నాకు నీతులు చెప్పాలని చూస్తున్నావా? యేం కారణం లేకుండా యేపనీ చెయ్యం. ప్రదర్శనంలో నువ్వు వున్నావా లేదా? అవును. వున్నావు, యెందుకు వున్నావు?"

ఆ కార్మికుడు జవాబియ్యలేదు. దాంతో నొవిట్స్కీకి ఉత్సాహం వచ్చింది.

"యెందుకున్నావు ? నిన్నే అడిగేది ! అడ్డమయినవాళ్ళతో కలిసి తిరిగితే యేమవుతుంది ? అల్లర్లు రెచ్చగొట్టేది వాళ్ళు, జైలుకు వెళ్ళేది మీరు. నువు రష్యన్‌వే కదూ ?"

ఫిట్టరు కనుబొమలు ముడుచుకున్నాడు.

"కావచ్చు. అయితే, దానికీ దీనికీ సంబంధ మేమిటి ?"

నోవిట్స్కీ కుర్చీలో ఉండే వెనకకి తిరిగి 'సెయింట్ జార్జి – సర్పం' ప్రతిమ కేసి వేలెత్తి చూపించాడు.

"ఇది రష్యన్ ప్రభుత్వ చిహ్నం. అశ్వంమీద విజేత, అతనికింద అణగారిపోయిన రాజద్రోహం. కళాకారుని భాషలో – సర్పం, శాస్త్రీయంగా మాట్లాడితే, వేయి తలల నాగు – రష్యన్ కార్మికుడుగా నీ స్థానం యేమిటి ?"

"గుర్రంమీద, స్పష్టమవుతూనే వుందిగా ?" అని వాగ్రాన్ కిన్ జవాబిచ్చాడు తటతటాయించకుండా.

"ఊఁ– అయినప్పటికీ వేయితలలు నాగులాగా గుర్రం కింద పాకులాడుతున్నావు,"

ఆ కార్మికుడు తల పంకించాడు. అతని కళ్ళల్లో కృత్రిమ కాంతి వెల్లివిరిసింది.

"అక్కడే మీరు పొరబడుతున్నారు, సూపరింటెండెంట్ గారు వేయి తలలు నాగుఅంటే పెట్టుబడిదారీ విధానమని అందరికీ తెలిసిందే. అందువల్ల యిక నేను శ్రామికవర్గ..."

నోవిట్స్కీ పెదవులమీది చిరునవ్వు మాయమయింది. పిడికిలి బిగించి పళ్ళు కనిపించకుండా పై పెదవి ముడుచుకున్నాడు.

"అది నీ వాదన ! గుర్రంమీద కార్మికుడు? వేళాకోళంగా వుందా ?. ప్రపంచం తలకిందులయినా అలా జరగదు !"

"బలే !" అన్నాడు ఫిట్టరు ఉండబట్టలేక.

"తలకిందులు !" అని మండిపడ్డాడు నొవిట్స్కి. గొంతు బొంగురుపోయింది. "యింతకింతా అనుభవిస్తావులే. నీకు సంకెళ్ళు తగిలిస్తాను."

ఆ కార్మికుడు చేతులు వెనకకు పెట్టుకున్నాడు. పెద్ద పెద్ద కండరాలు తొణికిసలాడాయి. బుజాలు ఎగరవేసి, "సంకెళ్ళు వేయడానికి చట్టం అనుమతించదు" అన్నాడు.

"చట్టం !" అని అరిచాడు నొవిట్స్కి లేచి ఎదురొమ్ము మీద కొట్టుకుంటూ. "నేనే చట్టం !"

కొయ్యబొమ్మలాగా నిలుచున్న అధికారి కనిపించీ కనిపించకుండా కనుగీటాడు. వ్రాగాన్ కిన్ వెనకాల నిలుచున్న పోలీసులు అతని చేతులకు సంకెళ్ళు తగిలించారు. వ్రాగాన్‌కిన్ చేతులు విదిలించుకునే లోపలనే సంకెళ్ళ తాళాలు పడిపోయాయి. పోలీసు మెడమీద, బుజాలమీద చేయివేసి పట్టేసాడు.

అధికారి కళ్ళు కుంచించుకుని పిడికిలి బిగించి ఫిట్టరు దగ్గరికి వెళ్ళాడు.

"మరేం గొడవచెయ్యక్కర్లేదు" అన్నాడు నొవిట్స్కి అధికారిని వారిస్తూ. "తివాసీ పాడుచెయ్యడ మెందుకు? వాడికి ముట్టచెప్పేది తరవాత ముట్టచెపుదాం." వ్రాగాన్‌కిన్‌తో వచ్చిన పోలీసులను చూసి తల పంకించి, "లోపలి గదిలోకి తీసుకుపొండి. వాసిలీ లియోన్ టివిచ్ అక్కడ ముఖాముఖి మాట్లాడతాడు." అన్నాడు.

[గది చివర గోడలో కనిపించని ఒక చిన్న ద్వారం తెరుచుకుంది. ఒక పోలీసు దోవతీసాడు. వ్రాగాన్‌కిన్‌ని ఆతని వెనకాలే తోసారు. పొడుగాటి అధికారి చివర నడిచాడు.]

నొవిట్స్కి మళ్ళీ చుట్టవెలిగించి గుప్పున పొగవదిలాడు.

"ముష్టి వెధవ! తలపొగరుకేం లోటులేదు. వాళ్ళంతా యెక్కడినుంచి వచ్చి పడుతున్నారు ? రోజు రోజుకి అధ్వాన్నంగా వుంది, వీళ్ళకి అంతువున్నట్టు లేదు..."

కోపంతో వ్రాతబల్లమీద కాగితాలు తోసేసాడు. అవి చిందరవందరగా నేలమీద పడ్డాయి. బూతులు తిట్టుతూ గంట వాయించాడు. ఒక పోలీసు సార్జెంటు చక్కా వచ్చాడు.

"ఆ నేలమీది కాగితాలు తీసి, ఏమూలోనుంచో, నోరో నెజ్ నుంచో, మరెక్కడనుంచో పట్టుకువచ్చిన అతడిని యిలా తీసుకురా."

# 26

## ముగ్గురా? ఒకడా?

నెలల తరబడీ ఏకాంత వాసం. (యూఫావోరోనెజ్, ప్రవాస ప్రయాణంలో మజిలీలు) రాత్రింబవళ్ళను వేరుపర్చలేని చీకటిజైలు, రైలుబోగీలో అంతూపొంతూ లేని ప్రయాణం, తెరలు కట్టిన గుర్రపు బగ్గీలో ప్రయాణం, నడవలో నిరీక్షణ తరవాత పోలీసు అధికారి కార్యాలయంలో వెలుగులోకి రాగానే బామన్ కళ్ళు మిరుమిట్లు గొలిపాయి. వెలుగులో బామన్ కళ్లు ఎలా మిటకరించిందీ నోవిట్స్కి కనిపెట్టి తిరిగి హుషారులో పడ్డాడు. వాగ్రాన్కిన్‌తో సంభాషణ మూలంగా బాగా కలతచెందాడు. ఖైదీలలో మనస్థయిర్యం అతను సహించలేడు. సంతోషంతో బామన్ సంభాషణ కోసం నిరీక్షించడానికి ఇంకా ఇతర కారణాలు కూడా ఉన్నాయి.

బామన్‌ను పోలీసు నోవిట్స్కి వ్రాతబల్ల దగ్గిరికి తీసుకు వచ్చాడు. నోవిట్స్కి చేసిన సంజ్ఞ ననుసరించి తలుపుమూసి వెళ్ళిపోయాడు. బామన్ వ్రాతబల్లకేసి దృష్టి సారించాడు. పోలీసు

అధికారి ముందు తెరిచిన ఫైలు, రెండు రహదారి చీట్లుఉన్నాయి. నోవిట్స్కి ఆ రెంటిలో ఒకటి పైకితీసి.

"జడోన్స్కి జిల్లాలో క్లెబోన్నయేలో నిన్ను అరెస్టు చేసిన పుడు యీ రహదారి చీటి నీదగ్గిర దొరికింది. దీనిప్రకారం నీపేరు నికోలాయ్ వాసిల్యెవిచ్ పెత్రోవ్" అన్నాడు.

"అవును" అన్నాడు బామన్ బుజాలు కొద్దిగా ఎగరవేస్తూ.

పోలీసు సూపరింటెండెంటు ఈ రహదారి చీటిని బల్లమీద పెట్టి రెండోదానిని పైకి తీసాడు.

"ఆస్వాల్డ్ గ్రెనిఖోవిచ్ మిజాజ్! యిదీ నీపేరేనా?"

ఫైలుకు అంటించి రహదారి చీట్లుకింద ఒక ఆకస్మిక ఛాయా చిత్రం బామన్ కంటపడింది. అది అతని ఛాయాచిత్రమే. రెండు సూటుకేసులు మోస్తున్నట్లుంది. కిందటి డిశంబరులో జెనీవానుంచి బయలుదేరినప్పుడు వేసుకున్న దుస్తులు అవే. మంచి చిత్రం! జెనీవాలోని కామ్రేడ్స్‌ని హెచ్చరించాలి. అక్కడ రహస్య పోలీసు శాఖ బాగా పనిచేస్తున్నట్టుంది. లేకపోతే విల్నియస్ 'యినస్పెక్టరు' ఈచిత్రం తీసాడా?

నోవిట్స్కి, బామన్ ఛాయాచిత్రంమీద దృష్టి పరపడం కనిపెట్టాడు.

"బాగుందా? అచ్చంగా నీ చిత్రమే! కాదూ? నిను నువే పోల్చుకోగలవు. అవును. మేమూ అలాగే పోల్చుకున్నాం. 'ఒకరిలో ముగ్గురు, ముగ్గురిలో ఒకరు' ప్రశ్నోత్తర పాఠంలోలాగా; మిజాజ్ వురఫ్ పెట్రోవ్ వురుఫ్..." నోవిట్స్కి తెరిచిఉన్న ఫైలు మీదికి వంగి వేలితో కొడుతూ, సంతోషంతో ప్రతిమాటా ఉచ్చరిస్తూ మెల్లిగా చదివాడు. "బామన్, నికోలాయ్ ఎర్నెస్టోవిచ్, జననం 1873. పశువుల వైద్యుడు. సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మిక వర్గ విముక్తి పోరాట సమితి కేసు సందర్భంలో 1897 లో అరెస్టు చేయబడ్డాడు. పీటర్స్‌పాలె దుర్గంలో ఇరవయిరెండు నెలల కారా

గారశిక్ష, ఆ తర్వాత వ్యాట్కా పరగణాకు ప్రవాసం పంపబడ్డాడు. అక్కడినుంచి తప్పించుకుని పారిపోయాడు...”

వ్రాతబల్ల దగ్గిర ఒకేఒక కుర్చీ ఉంది. అందులో పోలీసు అధికారి కూర్చుని ఉన్నాడు.

పోలీసు అధికారి అయితేనేం, రాజకీయ ఖైదీని నిలబెట్టడం సంభావ్యం కాదు.

బ్రామన్ చుట్టూచూసి సరాసరి గోడ దగ్గరకు వెళ్ళి అక్కడ ఉన్న ఒక పడకకుర్చీ వేసుకు కూర్చున్నాడు. నొవిట్స్కి చదవడం ఆపివేసి ఆశ్చర్యంతో బామన్ కేసి చూసాడు.

కాని ఏమీ మాటాడలేదు. బామన్ కుర్చీలో కూర్చో గానే పెద్దగా ఏమీ జరగనట్టు చదవడం తిరిగి కొనసాగించాడు.

“...విదేశాలకు పారిపోయాడు. గమ్యస్థానంలో అడుగు పెట్టగానే రష్యన్ సోషల్ డెమాక్రాట్ సమితిలో చేరాడు. ఆ సమితికి జూరిచ్‌లో ఇతడు ప్రతినిధి. 1900 సంవత్సరం ఏప్రిల్ 5 నుంచి 18 వరకు జెనీవాలో జరిగిన సోషల్ డెమాక్రాట్ రహస్య సమావేశంలో పాల్గొన్నాడు. బామన్ కొత్తగా స్థాపించ బడిన ఇస్క్రా విప్లవసంస్థలో, ఆ సంస్థకు చెందిన అచ్చు ఆఫీసులో కంపోజిటరుగా పనిచేసాడని రహస్య పోలీసుశాఖ నివేదిక వల్ల రూఢిపడింది. అంతేకాదు, ఆ సంస్థకు బాధ్యత వహించిన నాయ కుడుగా...” నోవిట్స్కి కనుబొమలు చిట్లించి, “...జర్మనీలోని ప్రధాన కేంద్రాలలో ఇస్క్రా పంచడం, సామ్రాజ్యంలోకి ఇస్క్రాను పంపించడం ఇతనికి అప్పగించారు. 1901 డిశంబరులో పైన పేర్కొన్న బామన్ రష్యాకు బయలుదేరాడు...”

“డిశంబరులోనా?” అని ఎగతాళిగా అంటూ బామన్ అడ్డువచ్చాడు.

“మరెప్పుడేం?” అని పోలీసు సూపరింటెండెంటు సిరా బుడ్డిలో కలంముంచుతూ ఫెడేల్మని జవాబిచ్చాడు. “దయయుంచి

చెప్పు. తప్పుదిద్దుతాను. నీ విషయమయిన సమాచారం చదివి వినిపిస్తా. విదేశాలనుంచి తిరిగి వచ్చిన తరవాత యేం చేయదల చావు ?" బామన్ పడకకుర్చీలో కాళ్ళు పారజాపి పడుకుని కళ్ళు మూసుకున్నాడు. నొవిట్స్కి నిరీక్షిస్తూ కూర్చున్నాడు.

"యీ ఫైలులోని పోలీసు నివేదికనుబట్టి నువ్వు నలుగురితో కలిసి మెలిసి తిరిగేరకం కాదని తెలుతోంది." అన్నాడు కట్టుడు పండ్లలోనుంచి, ఆశాభంగంతో ఫైలుపేజీలు తిరగవేస్తూ. 'సాక్ష్య మివ్వడానికి నిరాకరించాడు,' 'ప్రశ్నలకు జవాబివ్వడానికి నిరాక రించాడు' యేమంత బాగుండలా? యూఫా, వొరోనెజ్‌లో యేకాంతవాసం కోరుకున్నావు యెందుకని? యిదేమీ ప్రయో జనం లేదు. బామన్, నీ సంగతి నీకు బాగా తెలుసు."

బామన్ బారెల్ ఆర్గన్‌పిడి తిప్పుతున్నట్టు అభినయించి,

"దర్యాప్తు సమయంలో మీరంతా ఒకటే పాట, 'అంతా మాకు తెలుసు' అనే పాట పాడతారు, విసుగెత్తుతుంది. సూపరిం టెండెంటు యేదయినా కొత్తయెత్తు యెత్తడం మంచిది."

"నీకు నమ్మకం కుదరలా ?" పోలీసు సూపరింటెండెంటు మొహం ఎర్రబారింది. "సరే, సరే. చూపిస్తాను. యీ చిన్నపత్రం చూడు." ఇస్క్రా తెరిచి తిరిగి చదవనారంభించాడు. "ఇస్క్రా సంస్థ సభ్యులు రహస్య భాషలో వ్రాసుకున్న ఉత్తర ప్రత్యుత్త రాలవల్ల ఇద్దరు ప్రధానవ్యక్తుల విషయం అతి రహస్యంగా వుంచు తున్నారని తెలుతోంది. వారిమారుపేర్లు 'ఆకిమ్, రూక్'. విదేశాల లోని మా ఏజంట్లవద్దనుంచి వచ్చిన సమాచారాన్నిబట్టి బామన్ రష్యాలో వున్నాడనే సంగతి పోలీసులకు తెలిసి పోతుందని కాంది శీకులు భయపడుతున్నట్టు తేలుతోంది. వారి అభిప్రాయంలో అతని అరెస్టు" నోవిట్స్కి వికటంగా నవ్వాడు. "'విప్లవానికి అమిత నష్టదాయకం' దీనినిబట్టి బామన్ మారుపేరు ఆకిమ్‌లేక రూక్ అయివుంటుందని వూహించవలసివస్తోంది. సూపరింటెండెంటు

కొంచెం ఆగి, "సరే, మాకు నీవిషయం కొంత తెలుసునని స్పష్టమవుతూందిగా. యింకా అనుమానం వుందా? విచారణ సమయంలో నీవిషయం మాకంతా తెలిసి పోయిందని నువే గుర్తిస్తావు. నీసాక్ష్యం మాకు అక్కరలేదు. దర్యాప్తు పూర్తిచేశాను. నేను! హిజ్‌మజెస్టీ చక్రవర్తి" జారుచక్రవర్తి పవిత్ర బిరుదావళిని ఉచ్చరించే ముందు గుండీలు సరిగా ఉన్నాయో లేవో అని నొవిట్స్కీ అంగీ వేళ్ళతో తడిమి జూచుకున్నాడు.

"...హిజ్‌మజెస్టీ జారుచక్రవర్తి దయతో ఇస్క్రా కేసును నాకు, చీఫ్ సూపరింటెండెంటు నొవిట్స్కీకి వప్పగించారు. యీ ముక్క మనసుల్లో వుంచుకో."

చుట్టపీక నోటిలో పెట్టుకొని పీల్చాడు. పీకకొద్దిగా కదిలింది గాని పొగరాలేదు. మళ్ళీ ఆరిపోయింది. సూపరింటెండెంటుకు చుట్ట అలవాటులేదు.

"నేను, చక్రవర్తిగారు నామీద వుంచిన విశ్వాసాన్ని నిలబెట్టుకున్నాను. యీ ఇస్క్రా కేసుకు కాస్తాకూస్తా డబ్బు ఖర్చు కాలేదు. లక్ష బంగారు రూబుళ్ళు ఖర్చాయాయి. ఖర్చుచేసాం. మీతోకను కత్తిరించాం," వేళ్ళతో గాలిని కత్తిరించి, తల వెనకకు వాల్చి పక్కున నవ్వాడు. "మీ లెనిన్ తంత్రమంతా భగ్నమయి పోయింది. సింహాసనాన్ని, జమీందారులను, వర్తకులను కూలదోద్దామని ఆలోచించారు కదూ? 'ప్రపంచ కార్మికులారా, ఏకంకండు!' ఊహుం- యెన్నటికీ సాగదు. సాగదు" పిడికిడితో బల్లమీదగుద్ది, రొమ్మువిరుచుకుని కూర్చున్నాడు. "యేమాత్రం సందేహంలేదు. మిస్టర్ బామన్! నీపనీ, నీ స్నేహితులపనీ అయిపోయిందనే నమ్మకం లేకపోతే యీ రహస్యపత్రాలు నేను నీకు చదివి వినిపించేవాడినా? యిక మీకు బేడీలే గతి! కఠిన వరకం! వెలుగంటూ చూడరు. నీగతి, నీ స్నేహితుల గతీ యింతే. విప్లవాన్ని రగుల్కొల్పడానికి లెనిన్ యెంతమంది ఇస్క్రా ఏజంట్లను పంపాడు?

---

రూబులు = రూపాయిన్నర

పదకొండు మందిని, యెంతమంది పట్టుబడ్డారు? పదకొండు మంది!"

సూపరింటెండెంటు విజయ గర్వంతో వ్రాతబల్లమీద కొట్టాడు.

"వారంతా యెక్కడ వున్నారు?" అని బామన్ ప్రశాంతంగా అడిగాడు.

నొవిట్స్కీకి ఈ ప్రశ్న అర్థంకాక కనుబొమలు పైకెత్తాడు.

"యెక్కడ?" అని గొణిగాడు కంగారుగా బామన్ కేసి ఎగాదిగా చూస్తూ. "జైలులో అనివేరే చెప్పాలా. లుక్యానోవ్కా జైలులో."

బామన్ లేచి నిలబడి నిర్లక్ష్యంగా పడకకుర్చీని కాలితో పక్కకు తన్ని గుమ్మంలోకి వెళ్ళి తలుపు బార్లా తెరిచాడు

"బగ్గీ! లుక్యానోవ్కా జైలుకు బగ్గీ తెండి" అని అరిచాడు. రక్షణపోలీసులు అతని దగ్గరికి ఉరుక్కుంటూ వెళ్ళారు.

## 27

# కారాగారప్రవేశం

తుప్పుపట్టిన బందీల ఇనప సింహద్వారం కిర్రుమంది. కిందుగా వెడల్పుగాఉన్న ఆర్చీచివర ఇంకో ఇనపగేటు ఉంది.

ఈ రెండు గేట్లమధ్య ఆర్చీ కుడివేపు గోడలోని జైలు కార్యాలయద్వారం దగ్గరకి కొత్త ఖైదీని జైలు రక్షకాధికారి కలుసుకున్నాడు. అతను చినిగి మాసిపోయిన అంగీ ధరించాడు. బుజంమీద కత్తిఉంది.

బౌమన్‌తో వచ్చిన పోలీసు వారంటు అందిచ్చాడు. తాగు బోతు కళ్ళతో వారంటుచూసి బౌమన్ మీదికి భారంగా శ్వాస వదలుతూ మర్యాదగా తల ఊపాడు. శ్వాసలో వోడ్కా వాసన గుప్పున కొట్టింది.

"అభివందనాలు! శీతాకాలం నొరోనెజ్‌లో గడిపావన్న మాట! లేకపోతే యూఫాలో గడిపావా? డబ్బుకోసం నీపని పట్టించారా? అక్కడ చలికి బిగుసుకుపోయుంటావు, యేం? వెధవ జైలు! అక్కడ ఆరు నెలలపాటు పనిచేసాను. వెధవన్నర జైలు! యిక్కడ నువు హాయిగా విశ్రాంతి తీసుకోవచ్చు; వేసవి విడిదిలా వుంటుంది. యిక్కడ అన్నీవున్నాయి. బలే మంచివాతావరణం. మోర్గన్‌ట్సావ్! యితడిని రాజకీయ ఖైదీల దగ్గిరికి తీసుకువెళ్ళు. ప్రస్తుతానికి ఆమాట అలావుంచు... నీకు గది ప్రత్యేకించేదాకా." బౌమన్ కళ్ళల్లోని ఆశ్చర్యంచూసి తల పంకించాడు. "యిది యిక్కడి నియమం. యేకాంత నిర్బంధంలో యెవరుండాలి, యెవరు సమిష్టి గదులలో వుండాలి అనేది రాజకీయ ఖైదీలు తమలోతామే నిర్ణయించుకోవాలి. దీనివల్ల అపార్థాలకు తావుండదు. సహజంగా యేకాంతవాసం లభిస్తే వుబ్బి తబ్బిబ్బవుతారు. జైలులో, నీకు తెలిసిందేగా, రాజకీయ ఖైదీల విషయం ముందు చూడాలి..."

వార్డరు మోర్గస్‌ట్సావ్ బౌమన్ మోచేతిని తాకి,

"నావెంట రా," అన్నాడు. రెండు అడుగులు వేసి, "యీాయనగారు కాస్త చుక్కవేస్తే చాలు రోజురోజల్లా యిలా వాగుతూనే వుంటారు" అని చెప్పాడు.

"అయితే యెపుడు తెలివిలో వుంటాడు?" అని బౌమన్ చమత్కరించాడు.

"యెన్నడూ వుండడు." అని వార్డరు నవ్వాడు, రెండో ఇనపగేటులోని చిన్నద్వారం తెరుస్తూ. "ఆ మూటేనా యింకేమన్నావుందా?" "అరెస్టు చేసినపుడు అదొక్కటే నా దగ్గిర వుంది." అన్నాడు బౌమన్ తిరిగి నవ్వుతూ. "అప్పటినుంచీ

దుస్తులు సంపాదించుకునే అవకాశమే చిక్కలేదు, సరేగాని, ఆ గొడవ చేస్తున్న దెవరు ?" అని అడిగాడు మొదటిగేటువేపుకి తల ఊపుతూ.

"సులీమా ! యీ జైలులోని రాజకీయ ఖైదీలమీది అధికారి. యిదీదారి ! యిదిగో యీ నడవవెంటే వెడితే పెరటిలోకి వెడతావు. అక్కడ అందరినీ చూడచ్చు. యిక్కడ యెలాంటి నిర్బంధాలూ లేవు. యిది వేసంగి విడిదిఅని కాప్టెన్ అనడం సరిగానే వుంది."

"వేసంగి విడిది !" బామన్ వార్డర్‌కేసి అనుమానంతో చూసాడు. "రహస్య పోలీసుల మాటేమిటి ? నొవిట్స్కీ ?"

"యీజైలు అతని అధికారం కింద లేదు" అని వార్డరు జవాబిచ్చాడు ముసిముసి నవ్వుతో.

"పూర్వం నొవిట్స్కీ అధికారంకింద వుండేది. కాని యిపుడు న్యాయశాఖామంత్రి అధికారం కిందకి వచ్చింది. యిది వేరేశాఖ. నొవిట్స్కీకి యీ శాఖకు ప్రత్యక్ష సంబంధం యేమీలేదు. లేకపోతే..."

ఈల వేసాడు. ఈల వేయడం జైలు నిబంధనలకు వ్యతిరేకం. జైలు పరిభాషలో 'బద్దలు కొట్టడ' మయిందని బామన్‌కు విస్పష్ట మయింది. ఇందులో రాజకీయ ఖైదీలు యిష్టంవచ్చినట్టు గడప వచ్చు.

నడవలోనుంచి, అనేక గుమ్మాల పక్కగా, మరుగుదొడ్డి, శిషుగది, సామానుగది ... పక్కగా, వెళుతూండగా బామన్‌కి ఈ విషయం మరింత రూఢి అయింది. చెక్కటి వ్రాతలో తెల్ల కాగితంమీద ఈక్రింది ప్రకటన గోడకు కొట్టిఉంది.

ఆగస్టు 2, 6 గంటలు

కామ్రేడ్ లెనిన్ రచన 'ఏంచేయాలి ?' అనేదానిపై జైలు రెండోభాగంలో చర్చ జరుగుతుంది.

ఈ కరపత్రం ఇంతవరకు చదవని కామ్రేడ్స్ జైలు రాజకీయశాఖ పెద్ద, కామ్రేడ్ గర్కిన్స్ వద్దనుంచి పొందవచ్చును.

గర్కిన్స్! ఇస్త్రాకామనిషి! సరే, గర్కిన్స్ యిక్కడ పెద్ద అయితే యిక చెప్పేదేముంది?

"లెనిన్!" బామన్ తిరిగి ప్రకటనను పరికించి చూసాడు "ఏం చేయాలి? అద్భుతం!"

వార్డర్ తలుపు తోసాడు. పెరటిలోవారు ప్రవేశించారు. నడవలాగానే ఇదీ ఇరుకుగా ఉంది. దీనిచివర ఇంకోద్వారం, ఆ ద్వారం అవతల అసలు పెరడు! మొట్టమొదటగా బామన్ దృష్టి రక్షకపోలీసు చేతిలోని తుపాకీ గొట్టంమీద పడింది. ఆ పోలీసు నిద్రమత్తుగా ఒంటరిగా "కుక్కగొడుగు" కింద నిల్చున్నాడు. ఆ కుక్కగొడుగుకు ఇనప పైకప్పు ఉంది. మధ్యన స్తంభం ఉంది. చుట్టూ గుంపులు గుంపులుగా, ఒంటరిగా జనం! జనం!

"ఒక నిమిషం యిక్కడ ఆగు." అన్నాడు వార్డరు ఆదుర్దాగా. "పెద్దకోసం వెతుకుతాను. అందరికీ అనుకూలంగా వుండేలా పెరడు విభజింప బడింది. అందువల్ల యెవరితో కలిసి కాలక్షేపం చేయదలిస్తే వారిని యెంచుకోవడానికి వీలవుతుంది. వేసంగిలో ఖైదీలు పగలల్లా యిక్కడే గడుపుతారు. గదులకు తాళాలు వెయ్యడం, మారియాన్ గర్కిన్స్ సాధారణంగా రెండోభాగంలో ఆడుతూంటాడు."

ఎక్కడో గొరోడ్కి ఆట సాగుతోంది. సంభాషణ రణగొణధ్వనిని మింగివేస్తూ సూదులను కొయ్యపుల్లతో కొట్టిన టక టక ధ్వని, నేలమీద దభీమని బామన్‌కు వినిపించింది.

వార్డరు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ చక్కా బోయాడు. బామన్ ఆగి నిరీక్షించలేదు. చుట్టూ చూసుకుంటూ, తన అనుమానులు గ్రహించడానికి యత్నిస్తూ వార్డరును అనుసరించి నడవ

---

రష్యన్ ప్రజాభిమాన పాత్రమయిన ఒక ఆట. వివిధ వస్తువులకు బదులు ఏర్పర్చిన అయిదు కొయ్యసూదులమీద కర్రపుల్లలతో కొట్టడం.

సాగాడు. మూడు రాతిగోడలు ఉన్నాయి. మొదటిది నివాస గృహాలకు చెందినది – రాజకీయ ఖైదీలు ఉండే భాగం. రెండో గోడ వెనకనుంచి వివిధ గొంతుల రణగొణధ్వని, నవ్వులు, కేరింతలు వినిపించాయి. కేరింతలు మామూలు నేరస్తుల అపభ్రంశ భాషలో ఉన్నాయి. అంటే ఆభాగం మామూలు నేరస్తులు నివసించేదని రూఢి అయింది. మూడోగోడ ఎత్తు 14 అడుగులు. దాని అవతల ఇక ఆకాశమే! అంటే స్వేచ్ఛ! 'కుక్క-గొడుగు' నుంచి పెరడు పొడుగునా భవనానికి సమాంతరంగా ఒక రాతి గోడ ఉంది. ఆరాతిగోడ అట్టే ఎత్తులేదు. ఇది పెరడును రెండు భాగాలుగా విభజిస్తోంది. 'కుక్క-గొడుగు' నుంచి చూస్తే రెండు భాగాలూ కనిపిస్తాయి. బామన్ వార్డరును కలుసుకున్నాడు. నలువైపులనుంచి అతనికి పరిచయంలేని మనుషులు అతనివంక చూస్తున్నారు. సంభాషణ తునియలు తునియలుగా వినిపించ సాగింది.

"...మొట్టమొదటగా మనం నిజమయిన విప్లవాత్మక శక్తులను ఐక్యం చేయగలిగిన సంస్థను నిర్మించాలి. ఆ తరవాతనే దాడికి పిలుపు యివ్వగలుగుతాం."

"మళ్ళీ లెనిన్!"

బామన్ వారివంక చూసాడు. ఉహుఁ- ఆ ఇద్దరిలో ఒకడినీ ఎరగడు.

ఇంకో అడుగు వేసేసరికి ఉద్రిక్తంగా సంభాషణ సాగుతోంది.

"మీ రబోచెయెడెలో వాళ్ళమాట వింటే పార్టీ అవసరం లేదని, ట్రేడు యూనియన్లు వుంటే చాలుననీ అనిపిస్తుంది. యీ విధమయిన భాషణ కార్మిక వర్గానికి ద్రోహంచేసి బూర్జువాలకి అప్పగించడమే అవుతుంది."

"ద్రోహం? వాళ్ళకి ద్రోహంచేస్తే నీతోపాటు యిక్కడ వుండేవాళ్ళమే గాదు. బూర్జువాలు మా జీవితాన్ని గులాబీపూల పాన్పుగా తయారుచేసి పెట్టేవారు."

"తయారుచేసి పెడతారు, మరేం బెంగ పెట్టుకోకు. మీ మాటలు వాళ్ళకింకా అర్థం కాలేదు. అర్థం చేసుకోగానే మిమ్మల్ని వదిలిపెట్టడమే కాదు, బంగారు బగ్గీలలో వూరేగిస్తారు కూడా. అంతేకాదు మంత్రుల్ని చేసేస్తారు."

వార్డరు చిరునవ్వు నవ్వుతూ బామన్ కేసి తిరిగాడు.

"రోజల్లా యిలాగే వాదించుకుంటూంటారు. దేనినిగురించి? యెవడికీ తెలీదు. వినీవినీ విసుగెత్తింది. కాని అర్థం కాలేదు సరే. అదుగో పెద్ద!"

అవును. దూరాన్నుంచి గర్నీక వారిని పరీక్షించి చూస్తున్నాడు. కళ్ళు కుంచించుకుని, నల్లటి గడ్డం సవరించుకుంటున్నాడు. మారియన్ గర్నీక! ఇస్క్రాను బలపర్చే మనిషి! కామ్రేడ్!

"నమస్తే"

# 28
# డ్రెస్సు రిహార్సలు

సవినయంగా గర్నీక ప్రతినమస్కారం చేసాడు, వినయంగా అధికారికంగా. కొత్త ఖైదీని ఎరుగున్నానని సూచనప్రాయంగా నయినా వెల్లడించలేదు. అంతకంటె చేయగలిగిందీ లేదు. అతని ముందు నిలబడింది, పెట్రోవ్, ఇవనోవ్, వాసిల్యేవ్, కురిలోవ్, మీజ్, వగైరా వీరిలో ఎవరో? ఏ పేరుతో ప్రయాణం చేసాడో? ఎక్కడ, ఎందుకు అరెస్టయినాడో? తెలియదాయె. బామన్ పరిస్థితిని వివరించడానికి వేగిర పడ్డాడు.

"దురదృష్టవశాత్తు నేను అసలు యెవరినో కనిపెట్టేసారు."

"తెలివయినవాళ్ళు" మారియన్ నుదుటిమీద కర్కశ రేఖలు తిరిగి సరళమయినాయి."

"నిన్ను పట్టుకున్నారన్నమాట, వెధవలు" వెనుదిరిగి, "యిడిగో బామన్!" అని కేకపెట్టాడు.

అంతా బామన్ చుట్టూ మూగారు. ఒకరు కావలించుకున్నారు. ఇంకొకరు స్నేహపూర్వకంగా వెన్నుమీద చరిచారు.

"హాఁ, హాఁ హాఁ! అన్నీ యెరుగున్న మొహాలే! అరె! లిట్వినోవ్ కూడా యిక్కడే వున్నాడే! ఆ తెలివితక్కువ నోవిట్స్కీ డప్పాలు కొట్టాడనుకున్నా. కాని నిజానికి రష్యన్ ఇస్క్రా మనుషులంతా యిక్కడే వున్నారే!"

"లక్షరూబుళ్ళు ఖర్చయింది ... రష్యాలోని వివిధ ప్రదేశాలలో మిమ్మల్ని పట్టేసాం!" అన్నాడు లిట్వినోవ్ కళ్ళు మూసుకుని నోవిట్స్కీని అనుకరిస్తూ. "మీ పదకొండు మందిని పట్టేసాం"

ఎత్తుగోడవంక తల ఊపాడు. గోడనిండా సంతకాలే! రాజకీయ ఖైదీలు జైళ్ళలో, ఎక్కడ సాధ్యమయితే అక్కడ, సంతకాలు చేస్తారు. వేలు కాదుగాని వందల కొలది సంతకాలు ఆగోడమీద ఉన్నాయి. బామన్ దృష్టి మసకేసింది.

"అక్కడ చూడకు, పైకి చూడు."

బామన్ తల పైకెత్తాడు, వంకరటింకర అక్షరాలపైన తెల్లటి ఖాళీస్థలం కనిపించింది. ఇంకొకరి బుజంమీద నిలబడ్డా ఆ స్థలాన్ని అందుకోవడం కష్టం. పెద్దపెద్ద అక్షరాలలో ఆ గోడ మీద ఇస్క్రాను బలపర్చేవారి పేర్లు ముద్రితమయి ఉన్నాయి.

బాబ్రోవస్కీ పొడుగాటి బొగ్గుముక్క బామన్ చేతిలో పెట్టాడు.

"సంతకం చెయ్యి"

బామన్ తనకీ గోడమీది ఖాళీ స్థలానికీ మధ్య దూరం కంటితో కొలిచి ఆలోచించసాగాడు.

"యెలా నిర్వహించ గలిగారు ?"

"యెలాగో తెలీడంలేదా ? ఇస్కా మనిషినని చెప్పుకుంటు న్నావే ?"

బామన్ తిరిగీ చూసాడు. గోడ బాగా నున్నగా ఉంది. మెట్లులేవు. తుప్పుపట్టిపోయిన ఇనుప నిచ్చెన గోడవెంబడే పైన వేలాడుతుంది. ఎపుడో దీనికి ఎర్రరంగు వేసారు.

"వూహాకు వదిలిపెట్టకండి. యీ నిచ్చెన యెక్కడ సంపా దించారు ?"

ఇస్కాని బలపర్చేవారంతా నవ్వారు.

"చూడండి, యేం కావాలంటున్నాడో ? నిచ్చెన కావా లట! గోడ యెక్కడానికి! నిచ్చెనమీదగా యెక్కనిస్తారూ ? ఉహుం-యెక్కే విధానం నువే చూసుకో. చూసుకోలేవూ ? సరే అయితే కళ్ళు మూసుకో.

బామన్ కిక్కురు మనకుండా కళ్ళు మూసుకున్నాడు.

"సిల్విన్ ! జాగ్రతగా చూస్తుండు" అని గర్స్కి చప్పట్లు కొట్టాడు.

పెరడుకు వెళ్ళే భాగం చివరికి సిల్విన్ తొందర తొందరగా వెళ్ళి, మూల నిలబడి చేతులు చాచాడు.

"యెవరూ లేరు"

తక్షణమే ముగ్గురు గోడకు ఆనుకుని ఒక పంక్తిలో నిలబ డ్డారు. ముందున్న కామ్రేడ్ బుజాలమీద చేతులు వేసారు. ఇంకో ఇద్దరు చాచిన చేతులమీద ఎక్కి కూర్చున్నారు. వెనకకూర్చున్న మనిషి ముందున్నవాని బుజాలమీద చేతులు వేసాడు.

"సరే, రాజా!" అన్నాడు బొబ్రోవస్కీ, బామన్‌ను మోచేతితో పొడుస్తూ "యిక కళ్ళు తెరువు. అదిగో 'యేనుగ'! యెక్కు."

బామన్ మోచేతిని గట్టిగా పట్టుకుని పై మనుషులమీదకు ఉరకడంలో సహాయపడ్డాడు. బామన్ శరీరంలోని శక్తినంతా ఉపయోగించవలసి వచ్చింది. జైలు జీవితంవల్ల శరీరం ఎంత బలహీనమయిపోయిందో ఇపుడు తెలిసివచ్చింది. ఇక్కడ వ్యాయామం చేస్తేతప్ప ఆరోగ్యం కుదటపడదు.

ఆ 'ఏనుగు' వెనకనుంచి గోడమీది ఇనప నిచ్చెన దగ్గిరలోనే ఉన్నట్లు అనిపించింది. కాస్త చెయ్యి జాపితే అందుకోవచ్చు...

ఎంతదూరం ఉందో అంచనా వేసుకుని తాడు చివరి గాలమును పైకి ఎగరవేస్తున్నట్టు కదలి ఆ స్థలాన్ని అందుకోవాలని చూసాడు.

"రూక్! యిక కట్టిపెట్టు!" అని పెరటిలోని ఒక ఇస్క్రా మనిషి హెచ్చరించాడు. కాని బామన్ మందహాసం చేస్తూ పైకి చూస్తూనే ఉన్నాడు. ఇంత గొడవ పడడమెందుకు? సిల్విన్ కాపలా కాస్తున్నాడు. మరేం అపాయంలేదు. చుట్టూ స్నేహితులుఉన్నారు.

"కింద పడదోసేస్తాం"

ఆ ఆరుకాళ్ళ 'ఏనుగ' కదిలింది. బామన్ గోడను పట్టుకుని వేలాడవలసి వచ్చింది.

"సంతకంచేసి దిగిరా"

"సరే. సరే."

బామన్ గోడవైపుకి వంగి బామన్ అని వ్రాస్తుంటే బొగ్గుముక్క విరిగి ఊరుకుంది. ఇస్క్రా వారి సంతకాలపైన పెద్ద పెద్ద అక్షరాలతో

ఇస్క్రాను బలపరిచేవారు అని వ్రాశాడు.

"చాలు, దర్యాప్తు సమయంలో మేము ఇస్క్రావారమని ఒప్పుకోలేదు. నువ్వు మాగుట్టు బయట పెడుతున్నావు తెలిసిందా?"

"మరేం పరవాలేదు." అని బామన్ తల వంచుకుంటూ నవ్వాడు.

"యిక వచ్చే చిక్కేమీ లేదు."

"యెందుకని?"

జాబితా పూర్తిఅయిందని సూచించడానికి సంతకాలకింద బొద్దుగా గీతగీసి బామన్ గోడకేసి మళ్ళీతిరిగి దానికింద

తప్పించుకున్నారు......1902-జ. సి అని గట్టిగా వ్రాసాడు.

"రూక్ ! నీకేమయినా పిచ్చెత్తిందా? చెరిపేసేయి త్వరగా !"

ఒక క్షణంసేపు బామన్ తన వ్రాతను ఆప్యాయంగా పరీక్షించి చూసి కోకిలలాగా తల ఒకవేపుకు వంచాడు. ఆ తరవాత చొక్కాచేతితో మొదటి పంక్తి, ఆఖరి పంక్తి తుడిచివేసి కిందకు దిగాడు. ఆ దిగడంలో గార్కిన్వరిన్‌నికూడా కిందికి లాక్కుపోయాడు. వెంటనే గంభీరభావం వహించి వ్యవహారాలు మాట్లాడుతున్న వాడిలాగా లిట్వినోవ్‌ని "మనం యెప్పుడు తప్పించుకున్నాం?"అని ప్రశ్నించాడు.

ఇంక మాట్లాడడానికి అవకాశం కలగలేదు. పక్కనే నుంచొన్న బసోవస్కీ జేబురుమాలు అతని నోటిలో కుక్కాడు. ఏమి జరుగుతున్నదీ గుర్తించేలోగా దుప్పటివచ్చి తలమీదపడింది. నలుగురూ గట్టిగా అతనిని పట్టేసారు. ఒకక్షణం కొట్టుకున్నాక పడత్రోసారు. బలంగల చేతులు వచ్చి నేలకు అణచిపెట్టాయి. కాళ్ళకు ఏదో కట్టేసారు.

ఇలా ఆకస్మికంగా మీద పడడంతో ఊపిరాడక, ఆదుర్దాతో, దెబ్బతిన్నాననే బాధతో కదలకుండా గట్టిగా అణచి

పెట్టారు. ఒకతను మెల్లిగా బుజాలు నేలకు ఒత్తుతూ ఈకింద జోల పాట పాడాడు:

జోజో కన్నా
జో కొడుతున్నా.

ఎలాగయితేనే పట్టు వదిలారు. బామన్ లేని దుప్పటి తీసి పారవేశాడు. ఏమి చేయడానికీ తోచలేదు. తమాషా తమాషాయే. కాని శృతిమించింది.

"మళ్ళా మితిమీరిపోయావు" అన్నాడు బసావస్కీ బబ్రావస్కీ వంక అనుమానంతో చూస్తూ. "ముందు మోకాలి నరం మీద కొట్టి ఆతరవాత ముసుగు వేయాల్సింది. హూనం అయిపోయినాక అపుడు తెలుస్తుంది. కాని యేం జరిగిందో చూసావా? యిలా జరుగుతుందని ముందుగా తెలియక పోయినా..."

మూలనుంచి సన్నగా ఈల వినవచ్చింది. అందరూ సిల్విన్ వైపుకు తల తిప్పారు. 'కుక్కగొడుగు' కింద కాపలా మనిషి పొడుగాటి విగ్రహం బామన్ కంటపడింది. లిట్వినోవ్ కనిపించీ కనిపించనట్లుగా కనుగిలిపాడు. బామన్‌కి అర్థమయింది. ఒక క్షణం కిందటి అవమానబాధ మటుమాయ మయింది.

"యిది 'డ్రెస్సు రిహార్సలా' యేం?" అని వెంటనే అడిగాడు మృదువుగా మందహాసం చేస్తూ.

# 29

# ప్రాథమిక సంభాషణలు

బామన్ గౌరవార్థం ఆ సాయంకాలం నాట్యప్రదర్శనం జరగబోతోంది.

కొత్తగా వచ్చినవాళ్ళ గౌరవార్థం నాట్యప్రదర్శనం యివ్వడం లుక్యానోవా జైలు రాజకీయ ఖైదీలకు సంప్రదాయం.

కాప్టెన్ సులీమా స్వయంగా ఈ విషయం బామన్‌కు వివరించి చెప్పాడు.

"జైలు నియమాలకు విరుద్ధమయినా కాస్త ఆటాపాటకు భంగం కలిగించాలని నావుద్దేశం కాదు." అన్నాడు భోజనానంతరం విశ్రాంతికాలంలో కొట్టు లన్నిటినీ ఒకమాటు చుట్టివస్తూ. "హిజ్ ఇంపీరియల్ మజెస్టీ పీటర్ ది గ్రేట్ అనేవారు. 'అవసరమయినప్పుడు నియమాలు మార్చుకోవచ్చు' అని, ఆ మహారాజు నిర్ణయం ప్రకారమే నేను పనిచేస్తున్నా! యేవిధమయిన ఫిర్యాదు రాకుండా నేరస్తులు జైలులోవున్నా యింట్లో వున్నట్టే భావించేటట్టు చేయాలని నా తాపత్రయం. అ విధంగానే సాగిస్తున్నా. అలా చేస్తే మీకూమాకూ అందరికీ సుఖంగా వుంటుంది ... సాయంకాలం హాజరుపట్టీ తరవాత ఖైదీలు గంటో రెండు గంటలో కులాసాగా కాలక్షేపం చేస్తే యెవరిదేం పోయింది? కొట్లకు తాళాలు వేయకపోతేనే? బంగీల విషయంలో కూడా మేము నిర్బంధాలు పెట్టం. యెవరయినా ఓ వంద మాంసం ముక్కలు పంపిస్తే వందా మీకు అందజేస్తాం" కళ్ళు కుంచించుకుని సంతోషంతో దీర్ఘంగా నిశ్వాసం వదిలేసరికి గదంతా వోడ్కా వాసనతో గుప్పుమంది.

"నేనేమీ అడ్డంకులు పెట్టను. అందుచేతనే ఖైదీలు నన్నెంతో గౌరవిస్తారు. పై అధికారులు నన్ను మెచ్చుకుంటారు. కొన్ని జైళ్ళల్లో సమ్మెలు, కొన్నింటిలో యేవేవో అల్లర్లు జరుగుతుంటాయి. కాని యిక్కడమాత్రం యేగొడవలూ లేకుండా ప్రశాంతంగా నిశ్శబ్దంగా వుంటుంది." ఆఖరిమాటలను ఒత్తి ఒత్తి పలికి నవ్వాడు. "నిశ్శబ్ద విషయం: యెక్కువగావుండదు. నాట్యం చేస్తూ డబ్బాలు వాయిస్తుంటారు. తుపాకీ పేల్చినంత ధ్వని రావడానికి బంతినికొట్టే రాకెట్టుచాలు."

"తుపాకి కాల్పులు జరపాలని వుందా?" అని బామన్ నవ్వుతూ అడిగాడు.

"ఊహుఁ- తుపాకులు కాల్చడ మెందుకు?" అన్నాడు మందకొడి వాతపుకళ్ళు బాగావిప్పి. ఏదోజ్ఞాపకం వచ్చినట్లు అతని మొహం మసక వేసింది. కోపంతో కొట్టుతలుపు దభీమని మూసి వెళ్ళిపోయాడు. బామన్‌ను 'గౌరవప్రదంగా' బొబ్రొవస్కీతో పాటు ఒక గదిలో బంధించారు.

"యితడి గొడవ యేమిటి?" అని ఆశ్చర్యపోతూ బామన్ అడిగాడు కాప్టెన్ కేసి తల ఆడిస్తూ.

"యీతడి బుర్ర శీలలు వదులయినాయి" అంటూ బొబ్రొవస్కీ వేలితో తన నొసలు తాకుతూ చెప్పాడు" మితిమీరిన తాగుడు. చేతులు యెలా వణికాయో గమనించావా? అందుచేతనే తొందరగా ఖాళీ చెయ్యాలి. యిక్కడ యే జైలులోను లేనంత స్వేచ్ఛ అనుభవిస్తున్నాం. కొట్లకు తాళాలు వేయడంలేదు. కావలసినన్ని బంగీలు మాకు వస్తున్నాయి. క్రాల్‌మాల్‌కి చట్ట విరుద్ధమయిన వార్తాపత్రికలు కూడా అందుతున్నాయి."

"అయితే సారాకూడా రానిస్తున్నారా?"

"సారా?" బొబ్రొవస్కీ ఇకిలించాడు.

"ఊహుఁ- రమ్ము, వోగ్నాక్. ఒకసీసా మాకు ఒకసీసా అతనికి అంటే సులీమాకి. యేమీ లాభం లేకుండానే బయటి

వారితో సంబంధం పెట్టుకోనిస్తున్నాడనుకున్నావా? ప్రతి బంగీ లోంచి సులీమాకి భాగం ముడుతూనే వుంటుంది. యిక చూచీ చూడనట్లు నటించక యేంచేస్తాడు? కాని యిలాంటివాళ్ళతో యెన్నటికైనా ప్రమాదమే. యివాళ మెత్తగా వున్నట్టే వుంటారు. కాని రేపు యేంచెప్పగలం, మనల్ని వూపిరయినా పీల్చుకోకపో నివ్వచ్చు.''

"అలాఅయితే మనం యెంత త్వరగా తప్పించుకుని బయట పడితే అంతమంచిది. యింతకీ తప్పించుకోడానికి ఆటంకంయేమిటి?''

"మాకు సంబంధించినంతవరకు సర్వం సిద్ధంగా వుంది.'' బ్రొబ్రొవస్కీ బామన్‌కు దగ్గరగా జరిగి గొంతుస్థాయి తగ్గించి, "గోడమీదుగా వెనక భాగానికి చేరుకోవాలి. వెళ్ళేవిధం నువు యిందాక చూసిందే. 'ఏనుగ'మీదనుంచి గాలం పైకి వేస్తాం. నిచ్చెన తయారుచేయడానికి సామానువుంది. తాడు పట్టుకుని గోడ వతలికి దిగుతాం. మన 'భార్యలు' ప్రతి బంగీతోనూ జనపనార కాస్త పంపుతూ వున్నారు. అట్వెనోవ్ మొదలయినవాళ్ళు సామాను గదిలో ఆ నారతో తాడు పేనుతున్నారు. ఆపని అతనికి అప్పగించాం. సామాను సరిచూస్తున్నట్టు లోపల గడియ వేసుకు కూర్చుని తాడు పేనుతున్నారు.''

"అంటే గోడదాటి వెళ్ళదామనేగా మీవూహ''

"అవును'' అని బ్రొబ్రొవస్కీ తలవూపాడు "గోడ అవతల-సరే అక్కడికి చేరుకున్నామంటే యిక గట్టెక్కినట్టే కొండలు కోనలు, యెత్తుగా పెరిగిన గడ్డి, వాగులు – హోరుబయలు!''

"అయితే కాపలా పోలీసుల సంగతేమిటి? యెవరూ వుండరాయేం?''

"అసలు విషయ మేమంటే: కాపలా పోలీసులు యెనిమిదింటికల్లా, సాయంకాలం హాజరుపట్టీవేసి ఖైదీలను గదులలోకి పంపిన తరవాత, వెళ్ళిపోతారు. రాత్రి పదకొండుదాకా అంటే

బాగా చీకటిపడేదాకా మేము తిరగాడుతూనే వుంటాం. సులీమా యీవిషయంలో నోరెత్తడు.''

''బలే'' అంటూ బామన్ ఆనందంతో శ్వాస పీల్చాడు. ''అయితే యింకా అడ్డేమిటి?''

''రెండు చిక్కులున్నాయి.'' అని బ్రొబ్రొవస్కీ మొహం ముడుచుకున్నాడు. ''ఒకటి: చేతిలో డబ్బులేదు. తప్పించుకోవడంతో సరిపోదు. వెంటనే మనం చీలిపోవాలి. పదకొండు మందిమి వున్నాం. ఒక్కొక్కడికి కనీసం రెండువందల రూబుళ్ళన్నా చేతిలో వుండాలి. యిక యిక్కడి ఖర్చులు, రెండు, రెండున్నర వేలదాకా అవుతాయి. యింతడబ్బు యెలావస్తుంది?'

''డబ్బు! డబ్బుకేమిటి. యెలాగో ఒకలాగ సంపాదించవచ్చు.'' అన్నాడు బామన్ మెత్తమీద పడుకుంటూ, చాలా కాలంగా తిరుగుతున్నాడేమో ఈ స్నేహితుల మధ్య అతని పని హాయిగా భద్రంగా ఇంటికి తిరిగి వెళ్ళినట్టే ఉంది.'' తప్పించుకుని బయట పడితే డబ్బు సంపాదించడం యేమంత కష్టంకాదు. యింతకీ యిపుడు యేమాత్రమయినా డబ్బు వుందా?''

'' 'భార్యలు' కొద్దిగా పంపారు'' అన్నాడు బ్రొబ్రొవస్కీ ఇకిలిస్తూ: ''ఒక్కొక్కరికీ వంద పంపారు''

''వంద!'' అన్నాడు బామన్. ఉత్సాహంతో గబుక్కున లేచాడు. ''యింకా తటపటాయిస్తున్నారా?''

''ముందు కేకలు కట్టెయ్'' అని బ్రొబ్రొవస్కీ మందలించాడు. ''యిక్కడి వార్డర్లవి పాముచెవులు. యేవయినా చెవులేగా వినిపోతారు. వంద యేంచాలుతాయి. యిటువంటి విషయాలలో, నీకు తెలియందేముంది? తప్పటడుగులు వేయకూడదు. ఒకళ్ళమూ పట్టు పడకుండా తప్పించుకుని, ఇస్కా కేసు పూర్తిగా బగ్గం పాడు చేస్తే రాజకీయంగా ఫలితం దక్కుతుంది, ఓ—యెంత హంగామా అవుతుందో వూహించుకో. రష్యన్ జైళ్ళ చరిత్రలో కనివినీ యెరగనంతమంది తప్పించుకు పారిపోవడం!''

"తప్పించుకోడానికి పరిస్థితులు యేమంత కష్టమైనవి కావు. సరే. అంగీకరిస్తా"నన్నాడు బామన్ మొహం ముడుచుకుని. "యిక్కడి అవకతవక పాలనచూస్తే మన పదకొండుమందియే కాదు. యిక్కడున్న రాజకీయ ఖైదీలందరూ యిట్టే బయటికి నడిచివెళ్ళిపోవచ్చు. అందువల్ల మనం అనుకున్నంత హంగామా యేమీ వుండదు."

"వుండక పోవడమేమిటి, వుంటుంది" అని దృఢవిశ్వాసంతో బ్రాబ్రొవస్కీ తల పంకించాడు.

"మనలని చల్లగా పారిపోనిచ్చామని వాళ్ళు అంగీకరిస్తారనుకున్నావా? ఊహుఁ– స్థానికాధికారుల నివేదికను పత్రికలలో చదువుతూంటే నవ్వలేక కడుపు చెక్కలవుతుంది. వున్నదీ లేనిదీ కల్పించి బ్రహ్మాండంగా చిత్రిస్తారు. కాపలా పోలీసులతో హోరాహోరీగా పోరాడి, యేదో పెద్దతంత్రాంగంపన్ని పారిపోయినట్లు చిత్రిస్తారు. నేరమంతా మననెత్తిన రుద్దడానికి వాళ్ళవాళ్ళలో ఒకడిని గాయపరిచినా ఆశ్చర్య పడవలసిన పనిలేదు..."

"స–హా–యం" అని ఎవరో నడవలోనుంచి పిచ్చిగా కేక వేసారు.

"ఆ కేక పెట్టింది మార్ట్సమన్" అన్నాడు బామన్ గొంతు గుర్తుపట్టి. వెంటనే పక్కమీదనుంచి లేచాడు. బ్రాబ్రొవస్కీ చేయి పట్టుకుని ఆపాడు. కేక ఇంకా పిచ్చిగా మళ్ళీ వినిపించింది.

"స–హా–యం"

బామన్ చేతిని ఇంకా గట్టిగా పట్టుకుని బ్రాబ్రొవస్కీ తలుపు తెరిచాడు. మార్ట్సమన్ నడవమధ్యలో నిలబడి గొంతెత్తి అరుస్తున్నాడు.

"యెవరూ రావడంలేదు, చూశావా?" అన్నాడు బ్రాబ్రొవస్కీ సంతృప్తితో బామన్ చేయి వదులుతూ. "తెలిసిందా? కాపలా పోలీసులను తప్పుడు హెచ్చరికలకు అలవాటు పడిపోయే

టట్లు చేస్తున్నాం. మొట్టమొదట యిలా కేకవేసినపుడు వార్డనుతో సహా జైలుజైలంతా కదిలి వచ్చింది. యిక యిపుడో గంటకి గంటలు అరిచినా ఒకడూ కదిలిరాడు. నడవలో డ్యూటీలోవున్న వార్డర్ కూడా పట్టించుకోడు. గొంతు చించుకున్నా పరవాలేదు"

బామన్ గదిలోకి తిరిగివచ్చి మళ్ళీ పండుకున్నాడు.

"మీరు పరిస్థితులన్నిటినీ గుప్పిటలోకి తెచ్చుకుంటున్నా రన్నమాట. యిక డబ్బు విషయం: దానిదేముంది? మనిషికి ఓ వందచాలు. మరి రెండోచిక్కేమిటి? యింతవరకు చెప్పలేదు."

"రెండోచిక్కు యింకా క్లిష్టమయింది" అంటూ బ్రాబ్రా వస్కీ నిట్టూర్చి తిరిగీ కూర్చున్నాడు. "మనదగ్గిర గాలం లేదు."

"గట్టిచిక్కే!" అని బామన్ మొహం చిట్లించాడు. "గాలం లేకపోతే అంతా భగ్నమయిపోతుంది."

"చాలాకాలంక్రితమే దానికోసం కబురు పెట్టాం. బయట వారితో రోజూ సంబంధాలు పెట్టుకుంటూనే వున్నాం. మామూలు ప్రకారం మా అందరికీ బయట 'భార్యలు' వున్నారు. యింతవరకు వారిని స్వేచ్ఛగా లోపలికి రానిస్తున్నారు. గాలం సంపాదించడం కష్టంకాదుగాని లోపలికి తేవడం యెలా? అంతపెద్ద వస్తువును యే బజ్జీలోనో పెట్టి తీసుకురాలేరుగదా. అంతేకాదు, బజ్జీలన్నిటినీ విరిచి చూస్తారు. అది యిక్కడ నియమం! మిఠాయి పొట్లంలో దాచడానికీ వీల్లేదు."

"ఆఁ" అన్నాడు బామన్ కళ్ళుమూసి, ఏదో ఒకమార్గం కనిపెట్టాలని ఆలోచిస్తూ. "బాగా ఆలోచించాలి."

"యెంత ఆలోచించినా మార్గం దొరకదు. అపాయంలో చిక్కుకునే పనులేమీ మనం చేయకూడదు. తెలిసిందా? యీవ్యవహారం గురి తప్పిందంటే మనమీద తప్పించుకుని పారిపోవడానికి యత్నించామని యింకోకేసు బనాయిస్తారు. అంతకంటె ముఖ్యమయిందేమంటే యిక యిక్కడ స్వేచ్ఛకు స్వస్తి చెప్తారు. ఆ తరవాత మనం బయట పడడం కల్ల."

"దానిని జైలులో తయారుచేయడం సాధ్యమవుతుందా ?"

"ఆఁ-సాధ్యమవుతుంది" అని బొబ్రొవస్కీ తల ఊపాడు. "మామూలు ఖైదీలను అడుగుదామనుకున్నాం. యిక్కడ బేడీలు, గొలుసులు తయారుచేసే దుకాణంవుంది. అందులో మామూలు ఖైదీలు పని చేస్తుంటారు. కొంత డబ్బిస్తామని వాళ్ళని ఒప్పించవచ్చు. వాళ్ళు అందుకు తయారుగానే వున్నారు."

"అయితే యిక ఆటంకం యేమిటి ?"

"కాని చాలా ప్రమాదం. వాళ్ళు గాలం తయారుచేసి యిస్తారు సరే ఆ తరవాత మనగుట్టు బయట పెట్టరని యెలా ? వాళ్ళంతా వట్టి దొంగలు. హంతకులు. ఆఖరి నిమిషంలో డబ్బుకి గడ్డితిని మనగుట్టు బయట పెట్టవచ్చు. ఊహుఁ-మనం యింకా గట్టి పథకం వేయాలి. అదలావుంచు, నువ్వు యిక నిద్రపోవడం మంచిది. లేకపోతే సాయంకాలం జరిగే నాట్యంలో నువ్వు నిద్రమత్తుతో తూలుతుంటావు"

# 29

# నాట్య ప్రదర్శనం

నాట్యప్రదర్శనానికి పూర్వం ఏడుగంటల కల్లా అందరూ ఒకచోట గుమిగూడారు. సదుపాయంగా ఉండడానికి కావలసిన తలగడాలు, దుప్పట్లు, బొంతలు మొదలయినవి కూడా తెచ్చుకున్నారు. చీకటి పడగానే లాంతర్లు కూడా పెట్టారు.

దుప్పట్లు, బొంతలు పరుచుకుని నాట్యానికని మధ్యలో కొంత ఖాళీస్థలం అట్టేపెట్టి అంతా వర్తులాకారంలో పంచుకొన్నారు. బామన్ ఆనాటి 'కథానాయకుడు' గదా ! అందుకని మొదటి వరసలో అతనికి స్థానం ఇచ్చారు.

గాయక బృందంలో యాభైమంది ఉన్నారు. అందరి గొంతులు మేళవించాయి. కీవ్‌లోని ప్రభుత్వ యక్షగానబృందం

దీనికి తీసికట్టే! అయితే ఈ బృందంలో స్త్రీలుమాత్రం లేరు. సులీమా యిందుకు ససేమిరా ఒప్పుకోలేదు. స్త్రీలు, పురుషులు ఒకచోట చేరడానికి అతను అంగీకరించలేదు. స్త్రీ పురుష శాఖలో రెంటికీ కలిపి ఒక పెద్దను యెన్నుకోనిచ్చాడు గర్స్కీ అలా ఎన్నికయినందున ఆడవాళ్ళ కొట్లలోకి వెళ్ళడానికి గర్స్కీకి స్వేచ్ఛ లభించింది. ఈ నియమమే సరుకుల గదికి కూడా అనువర్తింప జేసారు. సరుకులగది లిట్వినోవ్ అధీనంలో వున్నందున యెవరయినా ఆడ ఖైదీలను చూడాలంటే అతనిద్వారా సరకుల గదిలో చూడడానికి ఏర్పాటు చేసుకోవచ్చు."

ఆడగొంతులు లేకపోయినా ఈ గాయకబృందం రమణీయంగా పాడారు.

కడలిలాంటి బైకాలు సరస్సున
పడవతీర దశగా తిరిగింది.

బామన్ కాళ్ళు చూచుకుని వెల్లకిలా పడుకుని నీలి ఆకాశం కేసి చూసాడు. నక్షత్రాలు ఒకటొకటీ ఉదయించ సాగాయి.

"వెనుకనుంచి అల తోసుకవస్తే"
జీవించి ఉండడం ఎంత పసందుగా ఉంది!
"మినుకులోనె గమ్యం వస్తుంది"

"సులీమా వచ్చాడు" అని పక్కన ఉన్న ఒక కామ్రేడ్ ముక్తసరిగా చెప్పాడు.

రాజకీయ ఖైదీల శాఖాధిపతి కాప్టెన్ సులీమా! అవును. ఇది జైలు.

జైలు అయితేనేం? జీవించి ఉండడం బహు పసందుగా ఉంది...

"బామన్ !"

బామన్ మోచేతిమీద లేచాడు.

"యిక నీవంతు. మాకూటమిలో చేరే ప్రతివ్యక్తీ వచ్చిన రోజు సాయంత్రం యేదోవక కథ చెప్పడం యిక్కడ సంప్రదాయం !"

"ఊహుం- అసంభవం !" అని బామన్ నవ్వాడు.

"యేమయినా చేయగలను గాని కథమాత్రం చెప్పలేను. నాకు తెలివితేటలు లేవు. రెండుపంక్తులు అల్లలేను."

"మేము సాయం చేస్తాములే" అని బ్రొబ్రొవస్కీ అతనిని శాంత పరిచాడు. "కట్టుకథలు నలుగురూ కలిసి అల్లిన బాపతే. నువ్వు ప్రారంభించు. ఆ తరవాత దానంతటదే సాగిపోతుంది. నువ్వు తడబడితే మేము అందిస్తాంగా."

"కిందటి తడవలాగా చెప్పడానికేం వీల్లేదు" చీకట్లో ఎక్కడినుంచో సులీమా అన్నాడు, చివాట్లు పెడుతున్నట్లు. వోడ్కాతో నానిన అతని బొంగురు గొంతును బామన్ ఇట్టే గుర్తు పట్టేసాడు.

"కట్టుకథల రూపంలోనైనా రాజద్రోహకర మయిన విషయాలు చెప్పడానికి వీల్లేదని యిందుమూలంగా పదేపదే హెచ్చరిస్తున్నాను."

"అచ్ఛా !" అని లిట్వినోవ్ వెంటనే జవాబిచ్చాడు.

"కట్టుకథలలో చెప్పేది వాస్తవంకాదు. కాని ప్రభుత్వమో వాస్తవమయింది. ప్రభుత్వమే గనక వాస్తవమయింది కాకపోతే మీరు నెత్తిటోపీలకు తువాలు పెట్టుకునేవారా, గద్ద బొమ్మల గుండీలు పెట్టుకునేవారా ?"

చీకటిలోనుంచి సులీమా బిక్కమొహం ప్రత్యక్షమయింది.

"మిస్టర్ వాల్కా ! నీ యిష్టంవచ్చినవారిని యెంతైనా వేడుకో. కాని కథ చివరికి చక్రవర్తిగారికి వ్యతిరేకంగా..."

"అది కథ తప్పుకాదు" అంటూ అడ్డువచ్చాడు లిట్వినోవ్. "సరే. ఒప్పుకున్నాం. రూక్! ప్రారంభించు పూర్వకాలంలో..."

"ఒకానొక దేశంలో, ఒక..."

"జారు!" అందరూ ముక్త కంఠంతో అరిచారు.

"చూశారా, చూశారా!" అంటూ సులీమా మళ్ళీ గొణగసాగాడు. "మళ్ళీ జారు!"

"విసిగెత్తి పోయిందా?" అని బామన్ సానుభూతితో అడిగి తల పంకించాడు. "మాకూ విసిగెత్తి పోయింది. కాని యీ కథలో నేనామాట వుపయోగించదలచలేదు పూర్వకాలంలో ఒక నీచుడు నివసిస్తూండేవాడు:"

"అది వేరేవిషయం" అని సులీమా త్వొందర త్వొందరగా వార్డర్లను దాటి వెనక్కి వెళ్ళిపోయాడు. వరుసగా నుంచున్న వార్డర్లు దారి ఇచ్చారు. వీరంతా ఖైదీల వెనక నిలబడి శ్రద్ధగా వింటున్నారు.

"అతడు అల్పుడేగాని గొప్ప వంశంలో పుట్టాడు" అని కొనసాగించాడు బామన్.

"వట్టి పశువు. చనిపోయినవారి ఆత్మశాంతికోసం ప్రార్థించేవాడు. కాని బతికున్నవారిని పీక్కుతినేవాడు. యిక తెలివి తేటలకి గాడిద. వట్టి తాగుమోతు, తండ్రిపోలిక, అతని తండ్రి యెల్లవేళలా తాగి తందనా లాడుతుండేవాడు. ముక్తసరిగా చెప్పాలంటే దిష్టిబొమ్మ! హార్డ్ది కాదు, ఖోడిన్స్కీది..."

"యికచాలు!" హఠాత్తుగా హెచ్చుస్థాయిలో ఒక బొంగురు గొంతు కీచుమని వినిపించింది.

"గవర్నరు మీభారం నామీద పెట్టి వెళ్ళాడు. నేను యిదేమీ సాగనివ్వను. యిదంతా యెవరిని దృష్టిలో పెట్టుకొని చెప్పుతున్నదీ గ్రహించలేనంత తెలివి తక్కువ మొద్దులమనుకున్నారా?"

"అదీ చూదాంగా. కథ సాగినకొద్దీ తెలుస్తుంది. అడ్డు పుల్ల వెయ్యకుండా విను, చీఫ్‌వార్డర్ సిట్కొవస్కీ!" అన్నాడు బ్రొబ్రొవస్కీ గట్టిగా. "బామన్! కథసాగించు"

వెంటనే నూటయాభై గొంతులు, "కథసాగించు" అని బొబ్బరించాయి.

"ఆపండి, ఆపండి. లేకపోతే గవర్నర్ని పిలుచుకు వస్తాను" అని సిట్కొవస్కీ గొంతు హెచ్చుస్థాయిలో మోగింది. వెనక్కి తిరిగి వెళుతూంటే అతని అడుగుల చప్పుడు మందంగా వినిపించింది.

"ఆసిట్కొవస్కీ వట్టి త్రాష్టపు వెధవ! యెప్పుడూ చాటు నుంచి వినడమే వాడిపని. బామన్ సాగించు."

"సరే—అతను తన సౌఖ్యంకోసంమే జీవించాడు. యెందుకో నేను చెప్పడమెందుకు, మీకు తెలిసిందేగా. ఒకానొక రోజున అతనికంట్లో అగ్నికణం రగిలింది..."

బామన్ కళ్ళు మిటకరించి చుట్టూచూసాడు.

"ఇస్క్రా?" అని అంతా అడిగారు.

"మొదట సంచిక డిశంబరు 1900. రష్యన్ సోషల్ డెమాక్రాటిక్ లేబర్‌పార్టీ వార్తాపత్రిక మకుటం, అగ్నికణం జ్వాలను రగులుస్తుంది! పుష్కిన్‌కు డిసెంబరిస్టుల జవాబు."

"లిట్వినోవ్! అడ్డుపుల్ల వెయ్యకు."

కాని లిట్వినోవ్ చలించకుండా కొనసాగించాడు. "మొదటి సంచిక, ఒకటో పేజీ, సంపాదకీయం; 'మన ఉద్యమ అత్యవసర కర్తవ్యాలు,' నిరంకుశ రాజరికాన్ని కూలదోసి రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించడమే రష్యన్ కార్మికపక్షంయొక్క తక్షణ రాజకీయ కర్తవ్యమని రష్యన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీ అనేక సార్లు ప్రకటించింది."

వంగిన సన్నటి సులీమా విగ్రహం చీకటిలోనుంచి వచ్చి లాంతరు వెలుగులో ఆగింది.

"క్షమించండి. యేమిటి? సిటోర్వస్కీ చెపుతున్నది యేమిటి?"

"సిటోర్వస్కీ అంతే? మాకేం సంబంధంలేదు" అన్నాడు బామన్ సముదాయించుతూ. ఇంకా నొక్కి చెప్పేందుకని మోకాలు రుద్దుకున్నాడు.

"గొప్పవంశంలో పుట్టిన ఆయనగారి కంట్లో అగ్నికణం దూరింది. ఆ అగ్నికణం అసాధారణమయింది. ఒక్క డాక్టరూ దాన్ని బైటికి తీయలేకపోయాడు. ప్రార్థనచేసి యే ఫాదరీ తీయలేక పోయాడు. యే మాంత్రికుడూ దాన్ని మాయంచేయలేకపోయాడు. అది కంట్లో మండింది, మండింది అనిచెపుతున్నా అంతే."

"అగ్నిమాపక దళాన్ని పిలిపించాల్సింది" అని సలహా ఇచ్చాడు క్రోక్‌మాల్ దీనంగా.

క్రోక్‌మాల్ అందగాడు. ఆ సాయంకాలం మొత్తంమీద విచారంగానే ఉన్నాడు. జైలులో బామర్‌ను కలుసుకోవడం అతనికి కోపకారణ మయింది. కీవ్ సమావేశం భగ్నమయిన రోజునే బామర్ ఆరాత్రి క్రోక్‌మాల్ గదిలో గడిపాడు. అ నగరంలోని రహస్యసంస్థ సమావేశ విషయమయి రహస్యం కాపాడలేక పోయిందని ఎత్తి పొడిచాడు. ఆఎత్తిపొడుపుముఖ్యంగా క్రోక్‌మాల్‌కు అన్వయించింది. ఇద్దరికీ అభిప్రాయభేదం ఏర్పడి బామర్ ఉదయాన్నే ఒక హోటలుకు వెళ్ళిపోయాడు. అయితేనేం దానివల్ల ప్రయోజనం లేకపోయింది. గూఢచారుల బారినుండి తప్పించుకో లేకపోయాడు. ఈ విషయాలు స్వయంగా గాని ఇతరులద్వారాగాని క్రోక్‌మాల్‌కి జ్ఞప్తికి తెచ్చే సూచనేమీ బామర్ చేయలేదు. అయినా కోపం ఎందుకో?

"కాని స్వతంత్రులను అంతఃపురంలోకి రానిచ్చే వాడు కాదు" అన్నాడు బామర్ నవ్వుతూ, "వాళ్ళకు భయం భక్తీ

లేదు. అపాయాన్ని ఆహ్వానించే రకం. అటువంటివాళ్ళు యే నిమిషాన యేంచేస్తారో చెప్పలేం. యేమయినా అంగరక్షకులను మాత్రమే అతని దగ్గిరికి రానిచ్చేవాడు."

"ఆ స్వతంత్రులిన్ని వీథుల్లో, దూరాన్నుంచి వాళ్ళ పనేదో వాళ్ళని చేసుకోనిస్తే బాగుండేది."

"అసంభవం!" అని బామన్ అభ్యంతరం చెప్పాడు. ఒక నిమిషం ఆలోచించి." అతడు యెన్నడూ అంతఃపురం వదిలి బయటికి వెళ్ళలేదు. వట్టి భయస్తుడు. వీథిలో మొహం పెట్టీపెట్టగానే గద్దలు పొడిచి చంపేస్తాయని అతనికి తెలుసు."

"రూక్ పక్షులు" అని గాల్బెరిన్ అందించాడు.

అంతా గొల్లుమని నవ్వారు.

"బలే పెద్దమనుషులు!" సులీమా కీనీడ విచారంగా తల పంకించింది. "మళ్ళీ నిషేధాజ్ఞలు అతిక్రమిస్తున్నారు. చక్రవర్తిగారి విషయం యెత్తమని మాట యిచ్చారు. అటువంటపుడు అంతఃపురం ప్రసక్తి యెందుకు?"

"అంతఃపురం?" బామన్ సులీమావంక ఆశ్చర్యంతో చూసాడు. "క్షమించండి. మీకు రష్యన్ భాష సరిగా వచ్చినట్లు లేదు. నిజినీ-నొవ్గొ రోడ్‌లో మేమూ యిక్కడివారు విశాలమయిన ముంగిలికి పెరడులకు తేడా చూపడానికి ముంగిలిని అంతఃపురం అంటూంటాం." అని చేయిచాచి చూపాడు.

ఈ మాటలకు అంతా మళ్ళీ గొల్లుమని నవ్వారు.

"అవును. పెరడు అందులోనూ చిన్నది. అంతఃపురం అనే పదమే నీచమయింది. యీకథ సాధారణ వ్యక్తికి సంబంధించిందని యిదివరకే చెప్పాను. ఆ వ్యక్తిపేరు చెప్పితే మరీ నీచ మయిపోతుంది సరే మళ్ళీ కథకు వద్దాం. అతగాడి కంటిలోనుంచి ఆ అగ్నికణాన్ని బయటికి తీయకపోతే కంటిని మెదడును కాల్చివేసి ఆ విగ్రహాన్నే నాశనం చేస్తుందని అందరికీ తెలుసు. కాని యెవ

రికీ సాధ్యంకాలేదు. అగ్నికణాన్ని కంఠంలోనుంచి బయటికి లాగి అతనిని-ఆ కంచు విగ్రహాన్ని మృత్యువునుంచి రక్షించే వారెవరన్నా వున్నారేమోనని రాజ్యమంతటా చాటింపు వేయించాడు. చాటింపుల వాళ్ళు బయలు దేరారు. యెంతకాలం గడిచిందో చెప్పలేను—క్రియకంటె మాటలు చప్పున చెప్పవచ్చు. చాటింపు వాళ్ళు ఒక కీకారణ్యం ప్రవేశించారు. అక్కడ సగం పడిపోయిన ఒక గుడిసెలో ఇవాన్ ..."

"వెర్రి ఇవాన్ !" అని గర్కీ సూచించాడు.

"నువు పొరపాటు పడ్డావు" అని బామన్ జవాబిచ్చాడు మనస్ఫూర్తిగా. "యేమన్నా అను, యివాన్ మాత్రం వెర్రి వాడు కాదు".

"కాని కథల్లో మాత్రం అతను వెర్రివాడే" అని అందరూ బామన్ మాటకు అభ్యంతరం చెప్పారు...

కాని బామన్ మాత్రం తనపట్టు వదల్లేదు.

"పాతకథల్లో అయితే ఆ కథల్లో రక్షా యెటువంటిదని చెప్పబడింది. ?"

కళ్ళు సగంమూసి ఆవేశంతో,

అడవిని ఎటుచూసినా
అంతులేని వింతలు
చెట్టునుంచి చెట్టుకు
పిశాచాల గెంతులు !

కొండవాగు గుములలో ప
రుండు మచ్చెకన్నెలు
నేలమీద ఏవో భూ
తాల కాలిచిన్నెలు !

కొక్కిరాయి కాలిమీద
చక్కని ఒక కుటీరం

హనగులేని జాలకాలు
రంగులేని ద్వారం

అని పాడాడు.

"యిక ఆ పుష్కిన్ గీతం కట్టిపెట్టు బామన్! లేకపోతే యిక నీకథ వినబుద్ధి పుట్టదు."

"అదే సరిగ్గా నాకు కావలసిందీనీ" బామన్ నవ్వాడు. "క్లుప్తంగా చెప్తా. ఆ కట్టుకథల కాలం తరవాతనుంచీ ఇవాన్ తెలివి మీరాడు. అంతకుముందు భూమంటూ అతనికి వుండేది కాదు. కటిక దరిద్రుడు. కాని తెలివి తెచ్చుకున్నాడు. చాటింపు వాళ్ళు ఇవాన్ గుడిసెముందు నిలబడి అగ్నికణం గాథ చెప్పారు, వినినకొద్దీ ఇవాన్‌కి కుతూహలం హెచ్చింది. చాలాకాలం క్రితమే ఆ విగ్రహం సంగతి విన్నాడు. సింహాసనం యెక్కిన రోజునే లక్షల కొలది ప్రజల రక్తం వొలికించాడనే పుకార్లు దేశం నలుమూలలా వ్యాపించాయి..."

"బామన్!" అంటూ సులీమా మూలిగాడు. నేలమీది లాంతర్ల వెలుగులోకి వస్తూంటే అసలే వంగిన దేహం నీడ ఏటవాలుగా, వికారంగా పడింది. "నేను కఠిన చర్యలు తీసుకోవలసి వస్తుంది.

"అ గొడవంతా ముగిసిపోయింది" అన్నారొకరు నవ్వుతూ. "యిక కథ సాఫీగానే నడుస్తుంది. యింకోవిధంగా నడవడానికి వీల్లేదు. గీతంలోనుంచి సాహిత్యం తీసి పారేయలేం. వొడిన్‌స్క్‌లో మహా విపత్తు సంభవించిందా లేదా? జారుగారి ఆనందంకోసం పదివేల మందిని చిత్రవధ చేసారా లేదా?"

"ప్రయాణీకుల ద్వారా ఆరాజ్యం నాలుగు సముద్రాల మధ్య వుందనీ యెక్కడ పడితే అక్కడ బంగారం, వజ్రవైఢూర్యాలు దొరుకుత్తాయనీ ఇవాన్ తెలుసుకున్నాడు. అంత భాగ్యవంత మయిన దేశం, అంత పేరుప్రతిష్టలు పొందిన దేశం

యింకేదీ లేదు. కాని ఆవిగ్రహం మూలంగా ఆ రాజ్యంలో దరిద్రం తాండవిస్తోంది...ఇవాన్ అగ్నికణం సంగతి విననగానే ప్రయాణీకులు చెప్పిందంతా జ్ఞాపకం వచ్చింది. తుమ్మరెమ్మ విరిచి..."

"యేమండోయ్ !" అంటూ ఒక వార్డరు రొప్పుకుంటూ వారి మధ్యకు వచ్చాడు. "ఆఫీసులో మిమ్మల్ని పిలుస్తున్నారు. సూపరింటెండెంటు నోవిట్స్కీ, పబ్లిక్ ప్రాసిక్యూటరు వచ్చారు."

సులీమా రెండు చేతులూ చాచుకుంటూ బయలుదేరాడు. ఆ వెలుగులో బక్కపలచటి ఆకారం తూలుతూ, గడ్డం వణుకుతూ వికృతంగా ఉంది.

"విన్నారా ? మీామీా కొట్లలోకి వెళ్ళమని వేడుకుంటున్నా. సూపరింటెండెంటుకు, పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కు యిదంతా తెలిస్తే..."

మాట పూర్తికాలేదు. అవసరమూ లేదు. చెప్పనక్కర లేకుండానే ఏంచేయాలో అందరికీ తెలుసు. దుప్పట్లు, తలగడాలు, బొంతలు తీసుకుని ఖైదీలంతా లేచి లాంతర్లు ఆర్పివేసారు.

"కామ్రేడ్స్ ! జంటజంటలుగా బయలుదేరండి. ఒకళ్ళనొకళ్లు తోసుకోకండి. క్రమబద్ధంగా పదండి. తొందర తొందరగా పదండి."

ఇరుకు నడవలోనుంచి ఖైదీలు ఒక వరసలో 'కుక్కగొడుగు' దాటి భవనంలో ప్రవేశించారు. ఆ ఖైదీల శ్రేణి మహా ప్రశాంతంగా కదిలిపోయింది. వార్డర్లు కూడా ఆ వాతావరణానికి లోనయిపోయి చప్పుడు గాకుండా బొటన వేళ్ళమీాద నడిచి పోయారు.

# 30

# "ఏం చేయాలి?"

తొందర తొందరగా కొట్లకు తాళాలు వేసారు. ఖైదీలను ఎవరూ తనిఖీ చేయలేదు. ఎప్పుడూ ఇంతేననీ, ఏ ఖైదీ ఎక్కడ ఉండేదీ, ఏ కొట్లో ఎంతమంది ఖైదీలున్నదీ జైలు అధికారులకే తెలియదని బ్రాబోవస్కీ వివరించి చెప్పాడు. కొట్లలోని ఖైదీల నడవలోని ఖైదీల జాబితా లేదు. సులీమా దగ్గరఉన్న సమిష్టి జాబితాకూడా నానా కంగాళీగా ఉంది. ఆ జాబితాలో బెమన్‌ఫీల్డ్ అనే పేరుంది. కాని ఆ పేరుగల రాజకీయ ఖైదీ ఆ జైలులోనే కాదు ప్రపంచం మొత్తంలోనే లేదు.

ఇందాకటి హెచ్చరిక సరయిందని కాదని రుజువయింది. నోవిట్స్కీగాని పబ్లిక్ ప్రాసిక్యూటరుగాని రాజకీయ ఖైదీల నడవలోకి అడుగు పెట్టలేదు. బామన్ కొట్టు కంతమీంది రెక్క ఒక్కమారూ తొలగలేదు. బామన్ పెద్దగా నిదరపోయే రకంకాదు. నిద్రలో తూలుతూ ఒక వార్డరు ఒక్కసారి అతని కొట్టు ముందుగా వెళ్ళిన చప్పుడు మాత్రం వినిపించింది

ఉదయాన్నే

ఓహో కార్మికులారా!
మోహరించిరండి!
సమరం సాగించుకొరకు
సన్నద్ధంకండి!

అనేపాట ఆ భాగమంతా మార్మోగటంతో బామన్‌కు మెలుకువ వచ్చింది.

కొట్టు తాళంలో చెవి కీయంది.

“యేమిటది?” అని అడిగాడు బామన్ కాళ్లు నేలమీదకు ఊపుతూ.

“వార్డర్ చెకునోవ్!” అని మధురంగా బొబ్రొవస్కీ కూని రాగం తీసాడు. “యీ విధంగా ప్రతి వుదయం మేలుకొలుపుతూ వుంటాడు. సరయిన పద్ధతే అవలంభించారు. చెకునోవ్ అని తెలిసినా వెంటనే మేలుకొంటాం.” ఆవలించి స్టూలు బల్లమీద నుంచి పంట్లాం తీసుకున్నాడు. “కాని తొందర తొందరగా లేవాలి. భోజనవేళ విషయంలో మాత్రం యిక్కడ నియమాలు కఠినంగా అమలు జరుపుతారు. వెంటనే వెంటనే మేలుకోకుండా ఆలస్యం చేస్తే టీ ముట్టదు.”

* * * *

ఉదయం హాజరు పట్టి, స్నానాలు టీ... బామన్ లుక్యనోవ్స్కి జైలుజీవితం ప్రారంభించాడు. మధ్యాహ్నానికల్లా లెనిన్ రచించిన ‘ఏంచేయాలి’ అనే కరపత్రం చదువుతూ పెరటిలో ఇస్క్రా వారి భాగంలో కూర్చున్నాడు. పుస్తకం పదిమంది చేతుల్లోనూ పడి చినిగి పోయి ఉంది. ఇంతవరకు ఒక మజిలీనుంచి ఇంకో మజిలీకి, ఒక జైలు నుంచి ఇంకో జైలుకు కష్టంమీద ప్రయాణం చేసాడేమో చేతికి పుస్తకం దొరకడం ఇదే మొదలు. అందులో లెనిన్ ఆర్థికవాదులను చావుదెబ్బ కొట్టాడు. సిసలయిన విప్లవ వాదులంతా కలలు కంటున్న దృఢమయిన పార్టీని నిర్మించి సంఘటిత పర్చడానికి ఒక పథకం తయారు చేసాడు.

రెండో ఇస్క్రా-కొట్టులో అమర్నాడు చర్చలు జరుగుతాయి. అందుచేత బామన్ గబగబా చదవ వలసివచ్చింది. అక్కడ లెనినిస్టులు కొద్దిమందే ఉన్నారు. తక్కినవారంతా ‘రబోచెయే డెలో’ కో ‘ఆర్థికవాదుల’కో చెందిన వారు. క్లుప్తంగా చెప్పాలంటే కార్మికుల పక్షాన బూర్జువా వర్గమే విప్లవాన్ని తెస్తుంది, కాబట్టి వారిని రాజకీయాలలోకి ఈడ్చవలసిన అవసరం లేదని వాదించే

వారు. అందువల్ల చర్చ ఘాటుగా ఉంటుందని లిట్వినోవ్ ముందుగానే బామన్‌ను హెచ్చరించాడు.

"చర్చలు జరుపుతున్నా రన్నమాట ! ఊం-- "

లిట్వినోవ్ తల పంకించి ! ఏం చేయాలి? అనే గ్రంథం అట్టమీది మకుటంకేసి చూపించాడు.

"...పార్టీ పోరాటాలు పార్టీకి బలాన్ని, జీవశక్తినీ చేకూరుస్తాయి. చీలికలు, విస్పష్టంగా నిర్వచించిన హద్దులను పాటించక పోవడమే పార్టీ బలహీనతకు ప్రబల నిదర్శనం. క్షాళన ద్వారానే పార్టీ బలపడుతుంది... (జూన్ 24, 1852లో మార్క్సుకు లాసలీ వ్రాసిన ఉత్తరం నుండి)

"క్షాళన!" అని బామన్ మెల్లిమెల్లగా తిరిగీ అన్నాడు. "నిజం, నిజం! నిర్ణయాత్మక మయిన సమయంలో మనలను వెనకకు గుంజేవారు, మనలను బోల్తా కొట్టించ చూసేవారు మనలో వున్నంత వరకు మనమేమీ సాధించలేం. విడిపోవాలనే సమస్యను తీవ్రంగా లేవనెత్తి లెనిన్ సరియయిన పనే చేస్తున్నాడు. ఒకేఒక ఆలోచన, ఒకే ఒక సంకల్పంతో బంధించబడిన బలమయిన పార్టీని ముందుగా యేర్పరచాలి. అప్పుడే విప్లవం విజయవంత మవుతుంది. లేకపోతే యిదివరలో లాగానే చరిత్ర పునరావృత మవుతుంది..."

"కామ్రేడ్స్! రూక్ చదువుకుంటున్నాడా, ఆటంకం కలిగించకండి." అన్నాడు బాబ్రొవస్కీ నవ్వుతూ. "చర్చను ప్రారంభించ మందాం. గర్స్కీ చదరంగం ఒక ఆట వేదామా? యీలోపున రూక్ తనవాదన తయారు చేసుకుంటాడు."

కాని అది అనవసరమని రుజువయింది. వాదన అంతా లెనిన్ కరపత్రంలోనే ఉంది. లెనిన్ మాటలను, సూత్రాలను ఉపయోగించుకోవాలని బామన్ నిశ్చయించు కున్నాడు.

# 31

## 'భార్య'

జైలుకార్యాలయంలో తనను చూడడానికని ఎవరో వచ్చారని చెప్పగానే బామన్‌కు ఆశ్చర్యం వేయలేదు. లుక్యానోవ్స్కి జైలుకు తీసుకువచ్చిన రోజునే గర్సీస్కి బయటి వారికి బామన్‌కు ఒక 'భార్య' ని ఏర్పాటు చేయవలసిందని కబురు పెట్టాడు.

కార్యాలయానికి వెళ్ళే దారి మధ్యలో గర్సీస్కి బామన్‌ను కలుసుకున్నాడు. (రాజకీయ ఖైదీలకు గర్సీస్కి పెద్ద. అందుచేత జైలులో స్వేచ్ఛగా సంచరించవచ్చు) గర్సీస్కి సంజ్ఞచేయగానే బామన్ ఆగిపోయాడు.

"నీకు ఆరేళ్ళ కొడుకున్నాడనే సంగతి మరిచిపోకేం," అంటూ ఇకిలించాడు గర్సీస్కి. "వాడిపేరు ల్యోషా."

"వాడి తల్లిపేరేమిటి ?"

"ఆరే ?" గర్సీస్కి కళ్ళు ఆశ్చర్యంతో బాగా తెరుచుకున్నాయి. "నా బుర్రలోనించి పేరు ఎగిరి చక్కా పోయింది. మాషా-వార్యా. యేదో ఒకటి అయివుంటుంది. ఊహుం- సరే. మరేం పరవాలేదులే. అక్కడ మీరుతప్ప యింకెవరూ వుండరు. చిక్కేమీ వుండదు." అని నవ్వాడు. "అంటే మీకంటే ముందు యెవరినీ ప్రవేశపెట్టకుండా వుంటే. ఆవిడా యేమీ పొరబడదు. నీకు కొద్దిగా గూనివుందనీ, జుట్టు-బట్ట తల పోగా మిగిలిన ఆకాస్తేననుకో- యెర్రగా వుంటుందనీ చెప్పాను. యిక ప్రత్యేకంగా కంటిమీద మచ్చసంగత్తు చెప్పాను. సరే, పద. కుర్రవాడిని యేదో విధంగా దగ్గిరికి తీసుకుని లాలించు. తెలిసిందా ?"

♦ ♦ ♦ ♦

కచేరీగదిలో ఒకటికాదు రెండు చత్రాలు గది పొడుగునా ఆ గోడనుంచి ఈ గోడవరకు పెట్టిఉన్నాయి. రెంటిమధ్య రెండడుగులు. వార్డర్లందరిలోకీ ముసిలివాడయిన తెల్ల మీసాల మొకెయిచ్ మోకాళ్ళమీద కత్తిపెట్టుకుని రెండుచత్రాల మధ్య కుర్చీ వేసుకు కూర్చున్నాడు.

ఆ 'వధువు', వధువేమిటి ఆరేళ్ళకొడుకు ఉన్నాడుకాదూ, భార్యే అందాం, ఆ 'భార్య' వచ్చి నిరీక్షిస్తోంది. ఆమె పొడుగ్గా, అందంగా ఉంది. తెల్లటి గడ్డిహాటు పెట్టుకుంది. వెడల్పాటి అంచు కింద ఎర్రటి పట్టులాంటి గసగసాలపూలు తళుక్కు తళుక్కుమంటున్నాయి. నల్లటికళ్ళు, ఆమె చూపులో సంశయం, ఆశ, ఆందోళన బామన్‌కు గోచరించాయి. ఒక కుర్రవాడి చేయిపట్టుకుని ఉంది. ఆ కుర్రవాడు తెల్లటిసూటు వేసుకున్నాడు. కాలరు నావికులకాలరులాగా ఉదాగాఉంది. అంచున రిబ్బను. సూటు మాసిపోకుండా ముందు గుడ్డ కట్టుకున్నాడు. ఈ గుడ్డ ఎందుకు కట్టుకున్నదీ బామన్‌కు ఒక నిమిషం తరవాతగాని బోధపడలేదు. ఆమెకేసి చూస్తుంటే అతనికళ్ళల్లో మందహాసం పొటమరించింది. ఆ మందహాసం కొత్తమనిషి మందహాసంకాదు. అందులో ఆప్యాయత, ఆర్ద్రత గోచరించాయి. ఆమె తిరిగీ మందహాసం చేసింది. ఎర్రబారిన చెక్కిళ్ళకు చేయి అడ్డుపెట్టుకుని గబగబా అసంబద్ధంగా మాట్లాడసాగింది. ఆమె చెప్పేదేమిటో అర్థం చేసుకోవడం అసంభవం. చాలాకాలం వియోగం తరవాత జైలులో కలుసుకున్నపుడు 'భార్య' భర్తతో అలాగే మాట్లాడాలి. ఆమె అలా మాట్లాడడం సహజం. మంచిదీని. కాని కొడుకు ఆసక్తి చూపకపోవడం అసహజంగా ఉంది. మంచిది కాదు కూడాను. బామన్ రాగానే ఒక సెకండు అతనికేసి చూసి ఆతరవాత ఆ ముసిలి వార్డరు, తెల్లమీసాల వంక, కత్తివంక, తాడు కట్టిన రివల్వారువంక, తళతళలాడే చొక్కా గుండీల వంక తేరపార చూడసాగాడు.

ఇలా తండ్రిఎడ ఆసక్తి చూపక పోవడం అనుమానాలకు తావిస్తుంది. వార్డర్లలందరిలోకీ మొకెయిచ్ మెత్తటివాడు. ఇపుడు కూడా పూర్తిగా మేలుకుని లేగు.

"ల్యోషా ఆమె మొదటి సంబంధం కొడుకేమో?" అనుకున్నాడు బామన్. "ఆమె నావధువా? భార్యా? గర్సీని అడగక పోవడం బుద్ధిపొరపాటే! ఊహుఁ- 'భార్య' అని స్పష్టంగా చెప్పాడు."

"ల్యోషా!" అని బామన్ పిల్లవాడిని పిలిచాడు. "నన్ను పూర్తిగా మరిచిపోయావాయేం, నాయనా?"

"చాలాకాలం అయింది కదూ" అంటూ పిల్లవాడిబదులు తల్లి జవాబిచ్చి పిల్లవాని ముఖకవళిక కనిపించకుండా పిల్లవాడికి వార్డరుకు మధ్య నిలుచుంది. ఆమెగొంతు గంభీరంగా, ఇంపుగా ఉంది. మొత్తంమీద బామన్కు 'భార్య' అంటే సంతృప్తి కలిగింది.

ఆమె మృదువుగా మాట్లాడ సాగింది. ఆదేశానుసారంగా మొకెయిచ్ వారి సంభాషణ వింటున్నాడు. కాని బామన్కు జైలు నిబంధనలు తెలుసునని తొందర్లోనే గ్రహించాడు. సంభాషణ కుటుంబ వ్యవహారాలకు మాత్రమే సంబంధించి ఉండాలి. లేకపోతే వెంటనే ఆపివేయవచ్చు. ఇకముందు ఇలాంటి సందర్శనానికి అనుమతి నిరాకరించ వచ్చు.

అనుమతించిన విషయాలే బామన్ మాట్లాడాడు. పిల్లవాడిని గురించి: సరిగ్గా ప్రవర్తిస్తున్నాడా? తల్లిని తిప్పలు పెట్టడంలేదు గదా? ఇంట్లో పిల్ల ఎలాఉంది 'భార్య' వ్యాయామం చేస్తూందా? చేతులు ఇపుడు ఎలా ఉన్నాయి?

"పూడు * బరువు యెత్తగలవా?" అని అడిగి బామన్ చిరునవ్వు నవ్వాడు.

---

* పూడు - 36 పౌనులు

మొకెయిచ్ ముసిముసినవ్వు నవ్వాడు. అంతటి సుకుమార మయిన స్త్రీని పట్టుకుని హఠాత్తుగా పూడు బరువు ఎత్తగలవా అని అడగడమేమిటి?

ఆ తరవాత వారు పూవులను గురించీ అతని జన్మదినోత్స వానికి పూవులు పంపడంగురించీ చాలా సేపు మాట్లాడుకున్నారు. జన్మదినోత్సవం ఇక మూడురోజులు ఉంది.

అంతేకాదు ఏదో మందువిషయం కూడా మాట్లాడు కున్నారు. ఇంకా తనకు ఎందుకు అందలేదని బామన్ అడిగాడు.

"అందకపోవడమేమిటి?" అని ఆదుర్దాగా అడిగింది. "నేను స్వయంగా తెచ్చి ఆఫీసులో యిచ్చాను బహుశా నీకింకా పంపించివుండరు. అవునవును. మర్చిపోయాను: యెగోవామామకి జబ్బుగా వుందికదూ. ఉహుఁ- మరేం అంటువ్యాధి కాదు."

ఆ పేరు వినిపించేసరికి మొకెయిచ్ చెవులు నిక్కబొడుచు కున్నాయి. ఆమాట అనేకసార్లు విన్నదే. ఇటువంటి సందర్భనా లలో రాజకీయఖైదీలు దీనిని ప్రస్తావించడం విన్నాడు.

మనసులో ఆమాటనే వల్లెవేయసాగాడు. కాని ఆలోచనా పరంపర కిలకిలధ్వనితో ఛిన్నాభిన్నమయింది.

"అవును. మనిషి చాలా మంచివాడు"

బామన్, ఆ స్త్రీ ఇద్దరూ అతనికేసి చూసారు. మొకె యిచ్ మొహం చిట్లించుకుని లేచి నిలబడ్డాడు. చూసినవ్వాడంటే ఏదోదోషం ఉన్నదన్నమాటే! అందులోనూ జైలులో! సరే, ఏమయినా వేళ అయిపోయింది.

వేళ అయిపోయింది అని చెప్పడానికి నోరు తెరవబోయే సరికి 'భార్య' అతను చెప్పనక్కరలేకుండానే;

"ల్యోషాని ముద్దెట్టుకోవాలనుకుంటున్నాడు. పెట్టుకో వచ్చా, కూడదా? నువ్వు మంచివాడివి. ముద్దుపెట్టుకోనిస్తావు కదూ?" అంది.

"నిబంధనలకి వ్యతిరేకం!" అని అరిచాడు మొకెయిచ్ నిజంగా భయపడి. బయటి మనుషులతో ఖైదీలకు సాంగత్యం పనికిరాదు. అయితే ఆదేశాలలో పిల్లల విషయం చెప్పలేదు. కాని పిల్లవాడయినా మనిషేకదూ!

కాని వార్డరు మాట వినిపించుకోకుండా ఆమె పిల్లవాడిని పైకి ఎత్తింది. చట్రం పెద్ద ఎత్తేమీ లేదు. పురుషునికంటె కాస్త ఎత్తు ఉంటుందేమో. ఒక్క సెకండులో ఆకాశానికీ భూమికీ మధ్య తల్లి చేతుల్లో పిల్లవాడు ఊగుతున్నాడు.

"పట్టుకో" అంది సంతోషంతో. కాని ఆమె గొంతులో హెచ్చరిక ధ్వనించింది. "కింద పడవేస్తానేమో! పట్టుకో"

"బలే!"

ముసిలివార్డరు పిల్లవాడిని పట్టుకున్నాడు. తల్లి వదిలివేసింది. వార్డరువేళ్ళు తగిలేసరికి పిల్లవాడు పిచ్చిగా తన్నుకోసాగాడు.

"అమ్మా?" అని ఏడ్చాడు.

"యిలాయియ్యి" అనిబామర్ ఉల్లాసంగా రాగయుక్తంగా అన్నాడు.

పిల్లవాడు కేకలు వేయడంమూలాన వార్డరుకు కోపం వచ్చింది. రెండో చట్రంమీదుగా ల్యోషాని బామర్ చేతులకు అందించాడు. బామర్ ఆపిరికిపిల్లవాడిని చేతులతో ఒత్తుతూ లాలించాడు. పిల్లవాడికికట్టినగుడ్డ పక్కజేబులో లావుపాటి పొట్లం చేతికి తగిలింది. అందుకూ ఆగుడ్డ కట్టుకున్నది ?

ఆమె చట్రంగుండా వార్డరుకేసి చూస్తూ మందహాసం చేసింది.

"కృతజ్ఞురాల్ని, నువు మహామంచివాడివి!"

తలతిప్పి ఒక సెకనుసేపు మొకెయిచ్ ఆమెకేసి చూసాడు. చాలు! ఆ పొట్లం పిల్లవాడి పక్కజేబులోనుంచి బామన్ చొక్కా

చేతిలోపలికి వెళ్ళిపోయింది. పొట్లం బుజాల దగ్గరికి జేరుకునేందు కని బామన్ చేతులుచాచి పిల్లవాడిని బాగా పైకి ఎత్తాడు.

"సరే. యిదిగో, పట్టుకో"

ఆ పిల్లవాడి నల్లటికళ్ళు బామన్ మొహానికి అంటుకు పోయాయి. ఏదో విశేషముందని గ్రహించాడుగాని అదేమిటో చెప్పలేకపోయాడు.

"ఊఁ—"

పిల్లవాడు చట్రంమీదుగా ఆ ముసిలివార్డరు చేతుల్లోకి వెళ్ళిపడ్డాడు. తక్షణమే రెండోచట్రం దాటించాడు మొకెయిచ్.

"అమ్మా!"

ల్యోషా పెద్దగా మందహాసం చేసాడు. ఈ తడవ మహా సంతోషం కలిగింది. ముఖ్యంగా ఆ పొడుగాటి మనిషి గాలిలోకి విసిరివేసేసరికి పిల్లవాడు పొంగిపోయాడు.

"మళ్లీ" అన్నాడు.

ఆ ముగ్గురు పెద్దవాళ్లూ నవ్వారు.

కాని మొకెయిచ్ తమాయించుకుని గట్టిగా బుగ్గలు గాలితో పూరించుకుని,

"నిబంధనలకు వ్యతిరేకం!" అన్నాడు.

కాని ల్యోషా కాళ్లు అప్పటికే మొదటి చట్రంమీద వేలాడుతున్నాయి.

వార్డరు పిల్లవాడిని బామన్‌వైపుకు చట్రంమీదుగా లేవ నెత్తి నిలబెట్టాడు. బామన్ పిల్లవాడిని ముద్దిడుకుని తననెత్తి మీదకు లేవనెత్తాడు. మళ్ళీ పిల్లవాడు తల్లిచేతుల్లోకెళ్ళి పడ్డాడు.

మొకెయిచ్ నుదుటిమీద ఏర్పడ్డ చెమటబొట్లు తుడుచు కుని. "వేళ అయిపోయింది" అన్నాడు ముఖం చిట్లించుకుంటూ, ఒరలోనికత్తిని ఖణేల్‌ఖణేల్ అనిపిస్తూ. "యిక దయచేసివెళ్ళండి."

మొకెయిచ్ మాటలకు అధికారముద్ర వేయడానికా అన్నట్లు సులీమా గుమ్మంలో ప్రత్యక్షమయాడు. నున్నగా క్షవరం చేసుకుని శుభ్రమయిన అంగీవేసుకున్నాడు 'భార్య' మెప్పు పొందడాని కీవేషమంతా. సందేహంలేదు. ఎవరయినా 'భార్యలు' వచ్చినపుడు సులీమా అందంగా కనిపించాలని చేసే యత్నాలుచెప్పి ఇస్కా(స్రి)వారు నవ్వడం బామన్ విన్నాడు. బక్కపలచని శరీరం ముందుకువచ్చి, మీసాలు మెలవేసుకుంటూంటె మహాసొగసుగా ఉన్నాడు! ఎడమచేతిలో తెల్లటి చేతితొడుగుల జతఉంది. కవాతు మైదానంలో ఉన్నట్టున్నాడు.

అందరి దృష్టి సులీమామీద ప్రసరించగా బామన్ చొక్కా చేతిని చేతికిందకి లాగి జేబులోకి పోనిచ్చి విదిలించాడు. పొట్లం అతని జేబులోకి జారింది. అంతా సవ్యంగా జరిగిపోయింది. సులీమా 'భార్య' వంక ఓరచూపు చూస్తూనేఉన్నాడు.

"వేళ..." అంటూ ప్రారంభించాడు సులీమా.

"నేను యిదివరకే చెప్పాను" నిబంధనల ప్రకారం నిలబడి మొకెయిచ్ చెప్పాడు.

"యింకాకాసిని నిమిషాలు మాట్లాడుకోనిద్దురూ. కాలం యిట్టే గడిచిపోయింది." అంది ఆమె.

"ఊహుం–" అన్నాడు సులీమా ఠీవిగా చేయి ఆడిస్తూ. "నేను చేయగలిందేమీ లేదు. వేళాగీళా అయిపోయింది."

"యేమిటీ!" అంది భయంతో కనుబొమలు పైకి లేవనెత్తుకుంటూ.

"గీళా!" అన్నాడు కాప్టెన్ మడమలు టక్‌టక్ మని చప్పుడు చేసుకుంటూ. "అంతే. యిక్కడి యుక్రేనియన్ భాష నీకు తెలుసుననుకున్నా. నీ రూపురేఖలు, నీపేరు పట్టి..."

"నేను యుక్రేనియన్‌ని అనుకున్నారా" అంటూ నవ్వింది. "లూస్యా యుక్రేనియన్ పేరాయేమిటి?"

"అలా అయితే యీమెపేరు లూస్యా అన్నమాట!" బామన్ గట్టినేలమీద ఉన్నట్టే భావించుకున్నాడు.

"త్వరలోనే కలుసుకుందాం, లూస్యా!"

"గుడ్ బై, నికొలాయ్!"

... ........

ల్యోషా జేబులో దొరికిన పొట్లంలో పదకొండు రహదారి చీట్లు ఉన్నాయి. తప్పించుకు పోవలసింది పదకొండుమంది. పదకొండుమందికి పదకొండు రహదారి చీట్లు! సరిపోయింది. ఒకపొట్లం లోనే పదకొండు చీట్లు పెట్టి పంపడం ఎలాగయినా ప్రమాదమే. కాని గట్టిగా ఆలోచిస్తే రహదారి చీట్లు తెచ్చేమనిషి పట్టుబడితే ఒకటి ఉన్నా ఒకటే, పదకొండుఉన్నా ఒకటే! దొంగ రహదారి చీట్లు ఎన్నయినా సంపాదించవచ్చు.

బామన్ నవ్వాడు. వివిధ దృక్కోణాలలో ఈ విషయం ఆలోచించి బయటివారు ఈ రహదారిచీట్లు అన్నిటినీ ఒకపొట్లం కట్టి పంపి సరయిన పనే చేశారని నిర్ణయానికివచ్చాడు. పదకొండు సార్లుకంటె ఒకసారే సాహసంచేయడం ఉత్తమం. అలాచేస్తే పది సార్ల ప్రమాదం తప్పుతుంది.

ఇక ఆలూస్యా బలేమనిషి! ల్యోషాని అంత తేలికగా ఎత్తేసింది! ఎంతబలమో! ఆమె ఎవరు?

ఇస్క్రా మనుషులెవరూ ఆమెని ఎరగరు.

ఎరగకపోతే మాత్రమేమిటి? లూస్యాతో ఇదే మొదటి సమావేశం, ఆఖరి సమావేశంకూడా. బామన్ అంతిమాదేశం ఇచ్చాడు. ఇక తప్పించుకుపోవడం. మూడురోజులలో

# హెచ్చరిక

వేగంగా తప్పించుకుపోవాలని బామన్ పట్టుపట్టాడు. మామూలుగా ఆప్యాయంగా మృదువుగా మందహాసంచేస్తూ ఇంకా ఆలసించడానికి కారణం కనిపించడంలేదని చెప్పాడు' 'తొందరపడుతున్నావు' అన్నాడు క్రోక్‌మాల్, కాని అందరికీ రహదారిచీట్లు, డబ్బు దొరికాయి. నిచ్చెనకు కావలసిన సామగ్రి- అట్టలు, తువాళ్ళు స్టూలుబల్లలు, కుర్చీలు- కొట్లలోనేఉన్నాయి ఇక డ్యూటీలోఉండే వార్డరుమీద ప్రయోగించబోయే మందు - మత్తుమందు ముందుగా మార్ట్సమన్ మొదలయినవారిమీద ప్రయోగించి చూసారు. మోతాదు ఎంత ఇవ్వాలో నిర్ణయించడ మయింది. మత్తుమందు చాలా నిలవచేసారు. అది చెడిపోకముందే ఉపయోగించాలి. గాలం విషయంకూడా ఏర్పాటు చేసారు. ఇంకా ఆలస్యం చేస్తే వర్షాలు కురవడం ఆరంభిస్తాయి. సాయంకాలపూట బయటికి వెళ్ళడానికి వీలుపడదు.

బామన్ వాదనను ఎవరూ ఎదిరించలేకపోయారు. ఆరాత్రే బామన్, బ్రాబ్రొవస్కీలు జైలు గుడ్డలు ముక్కలుగా చింపి నిచ్చెన తయారు చేశారు. స్టూలు బల్లలకోళ్ళు, కుర్చీలకోళ్ళు నిచ్చెన మెట్లుగా ఉపయోగించారు. చాలకొట్లల్లో ఖైదీలు స్వంత డబ్బుతో కుర్చీలు కొనుక్కున్నారు.

నిచ్చెన పూర్తిఅయింది. పదిహేనుమెట్లు, పద్ధెనిమిది అడుగుల ఎత్తు.

బామన్ పడుకునే మెత్తకింది చాపల్లో దానిని దాచారు. చాపలు పైకిలేచి మెట్లు ఆకారాలు స్పష్టంగా కనిపించసాగాయి. బామన్ చాపలను చదును చేయాలని ఎంతో యత్నించాడు కాని

లాభంలేక పోయింది. దీనితో తప్పించుకు పోయేరోజు నిర్ణయించక తప్పలేదు. కొట్లో నిచ్చెనను అలాగే ఉంచడానికి వీలులేదు. వార్డర్ల కంట పడవచ్చు. కొట్లు ఊడ్చడానికి వచ్చే మామూలు నేరస్తులకి తెలిసిపోవచ్చు. ఇంకేముంది? తంత్రమంతా బైటపడి పోతుంది!

అందుచేత ఇక ఆలసించడమనే సమస్య లేదు. ఎల్లుండి యత్నించాల్సిందే.

తలగడా తలకి తగలగానే బ్రాబ్రొవస్కీకి నిద్రపట్టింది. నిజానికి ఆరోజల్లా తల బద్దలు కొట్టుకోవలసి వచ్చింది. పూర్తిగాఅలసి పోయాడు.

కాని అలసట బామన్‌కి అందుకు వ్యతిరేక ఫలితాన్నిచ్చింది. అసలు నిద్రే పట్టలేదు.

నిద్రపట్టకపోతే చెడ్డకష్టంగా ఉంటుంది. విసుగెత్తుతుంది. మనసులో భారంగా అనవసరమయిన ఆలోచనలు తారాడినపుడు అలసట వల్ల నిద్ర పట్టదు.

ఏవేవో ఆలోచనలు దేనినిగురించో స్పష్టంగా తెలియదు. కంటికి కనిపించిన దానిమీదల్లా ఆలోచన పరంపర చెలరేగింది. ఒకదాని కొకటి అనుసంధించాలని సోమారి యత్నం చేస్తారు. దీనిని చింతన అనగలమా? ఊహుం అలా అనడానికి వీలులేదు. ఇంకోపేరు పెట్టడం మంచిది. బహుశా శాస్త్రాలలో దాని కోపేరు ఉందేమో? కాని బామన్‌కు మాత్రం ఆ పేరేమిటో తెలియదు.

బ్రాబ్రొవస్కీ ఒళ్లు తెలియకుండా నిద్రపోతున్నాడు. గురక కొట్టడంలేదు. అలసి నిద్రపోయినపుడు ఎవరూ గురక పెట్టరని బామన్ గమనించాడు. ఇది అందరికీ వర్తిస్తుందా? లేక బామన్ ఎరుగున్నవారు మాత్రమే అలసి నిద్రించినపుడు గురక కొట్టరా? బ్రాబ్రొవస్కీ సాధారణంగా గురకపెడుతునే ఉంటాడు. కాని ఇపుడుమాత్రం ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. శవంలాగా, మానవావశేషంలాగా ఏమాత్రం చలనంలేకుండా పడుకున్నాడు.

పార్టీవర్గాలలో అతని మారుపేరు 'రెలిక్' (అవశేషం)

బాగా ఆలోచిస్తే ఆ మారుపేరులో అర్థం కనిపించదు. లిట్వినోవ్‌కు పెట్టిన మారుపేరు అతనికి తగిందే. పాపా! ఎస్సెన్ మారుపేరుకూడా సరిపడిందే. ఇక ఎలీనా డిమిత్రీయెవ్నా. ఆమెకు 'కేవలము' అనే మాటంటే ఇష్టం. అందుకని 'కేవలము' అనే అందరూ ఆమెను పిలవసాగారు. తన మారుపేరు మంచిదే ననుకున్నాడు బామన్. కొజుబా అన్నాడు: 'వసంతాగమనాన్ని తెలిపేదూత' అని.

లాంతరు తగ్గిపోయి మసక మసకలాడింది. కొట్లో చీకటి ఎక్కువయింది. లాంతరులో కిరసనాయిలు అయిపోయినట్లుంది. బామన్ మోచేతిమీద లేచేసరికి కిటికీదగ్గిర బయట గోడవెనుక తారాడుతున్న పెద్దపెద్ద ఎలుకలు భయపడి తోకను నేలకు రాసు కుంటూ పారిపోయాయి.

కిటికీ చువ్వలకు కట్టిన మాంసపుకూర, వెన్న వాసన కొట్టుతూ అంతటా వ్యాపించి ఆకలి కలిగిస్తోంది. ఆ వాసనే ఎలుకలను ఆక ర్షించింది. కాని కిటికీ చువ్వలు వాటికి అందుబాటులో లేవు.

ఎలుకల విషయం ఆలోచించిడం బామన్ మానివేసాడు. అవి ప్రతి రాత్రీ అతని కొట్లోకి వచ్చిపోయేవే.

ఆరిపోతున్న లాంతరు బామన్‌కు చిరాకు కలిగించింది. దీపం ఆరిపోవడం అశుభం! అవును, అశుభం! ఆమాట అనడానికి అతను భయపడలేదు. మాటలు మనిషిని భయపెట్టలేవు.

అశుభం!

కిలకిలలాడే మానవస్వరం వినాలని, కామ్రేడ్స్‌లో ఒకని బలమయిన చేతితో కరచాలనం చేయాలని అతనికి తీవ్రవాంఛ కలిగింది, బ్రొబ్రావస్కీని లేపడమా? లేకపోతే గోడమీద కొట్టి పక్కకొట్టులోని లిట్వినోవ్‌ను లేపడమా?

బాగుంది. లుకోయ్నోవ్కా జైలులో పక్కకొట్టులో వారికి సందేశం అందించే అవకాశం ఇప్పటివరకు రాలేదని అనుకునేసరికి బామన్ పెదవులమీద చిరునవ్వు వెలిసింది. అయినా దీనిని జైలు అంటున్నారు. సంజ్ఞాలిపి మరిచేపోయాడా? కాస్త కళ్ళు తెరిస్తే జైలు సంజ్ఞాలిపి అంతా బల్లమీద వ్రాసినట్లు అతని కళ్ళముందర కనిపిస్తుంది.

బామన్ గోడవైపుకు తిరిగి హఠాత్తుగా నిద్రపోయాడు.

చెవిలో రెండుసార్లు తుపాకిమోతలు గింగురుమన్నాయి.

"కాల్పులు సాగిస్తున్నారు. వినిపించాయా?"

బామన్‌కు తక్షణమే మెలుకువ వచ్చింది. బొబ్రొవస్కీ మెత్తవంక చూసాడు. 'రెలిక్' నేలమీద కాళ్ళు పెట్టుకుని కూర్చున్నాడు. జుట్టు నుదురుమీద పడిఉంది. అతిశ్రద్ధగా వింటున్నాడు.

కాల్పులేనా? ఊహుఁ- అంతా ప్రశాంతంగా ఉంది,

మరణ సమానమయిన నిశ్శబ్దం కొట్టులోనే కాదు, జైలు అంతటా వ్యాపించింది.

బొబ్రొవస్కీ కాలిబొటన వేళ్ళమీద నడిచి ద్వారంవద్దకు వెళ్ళాడు. నిశ్శబ్దం హఠాత్తుగా భగ్నమయింది. అరుపులు, అడుగుల దబదబలు, హెచ్చరిక గంట మోతా బిగ్గరగా వినవచ్చాయి. అతి సమీపంలోనే గోడకింద పిస్తోలు మోతలు వినిపించాయి. బరువయిన బూట్లు చప్పుడు చేసుకుంటూ కొట్లుదాటి నడవ వెంట ఎవరో సాగిపోయారు.

బామన్ దిగ్గునలేచి బొబ్రొవస్కీని కలుసుకున్నాడు.

తలుపుదగ్గిరగా చెవులుపెట్టి భారంగా నిట్టూరుస్తూ నడవలో మాటలు వినసాగారు.

రాజకీయ ఖైదీలభాగంలోనూ, వీధిలోనూ మళ్ళీ అంతా నిశ్శబ్దంగా ఉంది. అయితే బామన్‌గాని బొబ్రొవస్కీ గాని తలుపు

దగ్గర నుంచి కదలలేదు. కాళ్ళకు ఏమీ తొడుగుకోకుండా, దుస్తులు వేసుకోకుండా అలానే నిలబడి వినసాగారు.

కుడిచేతి వేపు గోడనుంచి తొందర తొందరగా అతి జాగ్రతగా తట్టినట్లు వారికి వినిపించింది. ఆ తట్టిన చప్పుడు కలతను, అలసటను పారదోలింది. జైలులో అందరూ మేలుకున్నారు.

మెత్తమీద వెల్లకిలా పడుకున్న బామన్‌కు అక్షరాలు విస్పష్టంగా వినిపించాయి. మొదటి అక్షరం వినడానికి వ్యవధి లేక పోయింది.

రా–రీ–

జైలులో నుంచి పరారీ అయారు!

నారు లేకుండానే? లిట్వానోవ్ కూడా లేకుండానే? లిట్వానోవ్ ఇక్కడ ఉన్నాడని వాళ్ళకి తెలుసు. అతనిద్వారానే సందేశాలు నడుస్తున్నాయి.

బామన్ కూడా గోడమీద కొట్టసాగాడు. తొందరపడుతున్న చేతిని అరికట్టాలని యత్నించాడు. కాని దురదృష్టవశాత్తూ అక్షరాలన్నీ పెద్దవి, ఒకొక్క అక్షరానికీ ఏడు సంజ్ఞలు.

ఎ-వ-రు

బ్రాబావస్కీ అతని పక్కనే గోడకు చెవి ఆనించి పడుకుని తట్టిన సంజ్ఞలను అక్షరాలలోకి అనువదిస్తున్నాడు. జవాబుగా వచ్చినమాట దీర్ఘమయినది; కాని కొద్ది సంజ్ఞల తరవాత ఆమాటేమిటో ఊహించాడు.

మామూలు ఖై ... ... ...

మామూలు ఖైదీలు!

"అందులోనూ, మనం ఆ ప్రయత్నంలో వుండగా... యిక జైలు అంతటా బందోబస్తు కఠినం చేస్తారనుకుంటా."

"యేమాత్రం సందేహం లేదు" అని అంగీకరించాడు బ్రాబావస్కీ. మొహం విచారగ్రస్తమయింది. "బాగా బిగించే

స్తారు. యిటువంటి సంఘటనలు జరిగిన తరవాత యెప్పుడూ కఠినం గానే వుంటారు. యేమయితేనేం రేపటి మన పన్నాగమంతా బూడిద పాలయిపోయింది."

"ఊహుం–" అని బామర్ పిడికిలితో బల్లమీద గుద్దాడు. కాని ఆ మరుక్షణంలోనే పస్తాయించాడు.

రేపటివిషయం, చేసేదేమీలేదు. ఇక ఉదయాన తిరోగమనానికి సంకేతం ఇవాలి. తప్పించుకుపోవడానికి వారు పెట్టుకున్న సంకేతం తెల్లతువాలు. మానడానికి బామర్ నల్లచొక్కా.

పొట్లవిస్కాయా వీధిలో నిలబడితే అతని కొట్టు కిటికీ కనిపిస్తుంది. సంకేతంకోసం ఎవరోఒకరు అక్కడ నిరీక్షిస్తూంటారు.

"యేమిటీ వ్యవహారం? యేవిధంగా చూసినా యీదొంగ వెధవలు పారిపోయి రేపటి మన కార్యక్రమాన్ని పాడుచేసారు."

నడవలో తలుపు టపీమంది. అది పెరడులోకి వెళ్లేగుమ్మం తలుపుఅయి ఉంటుంది. ఇంకొకటయితే అంత పెద్దగా కిర్రుమనదు. ఆయుధాల గలగలశబ్దం, అడుగులశబ్దం బామర్ బ్రాబ్రొవస్కీలకు వినిపించాయి.

అంటే సోదా చేయడానికి బయలుదేరారన్నమాట.

ఆనుపానులు మాసిపోకముందే అన్వేషణ జరగడం మామూలు.

గోడనుంచి గట్టిగా కొట్టిన చప్పుడయింది.

సో–దా

'ఆ. తెలిసింది' అని బామర్ పిడికిలితో సంజ్ఞలుకొట్టాడు.

నిచ్చెన విషయంచూడాలి మెలిచుట్టిన పద్ధెనిమిది అడుగుల బట్ట, పదమూడు మెట్లు, బొంతనుచించి వాగ్దల్లు చూస్తు న్నట్లు అనిపించింది. నిచ్చెన ఆకారం కళ్ళకు స్పష్టంగా కనిపిస్తూంటే చేతికి తగిలి సోదా చేయకుండా ఎలాఉంటారు? ఎలకబోను లాంటి కొట్లో ఆ పదమూడు మెట్లను ఎక్కడ దాయడం?

కత్తుల గలగలధ్వనితో పాటు పాదాలచప్పుడుకూడా దగ్గిర లోనే స్పష్టంగా వినిపించింది.

పరాజయమేనా? ఊహుఁ-

కొట్టులోఉన్న ఒక్కస్టూలు బల్లను చేతితో గట్టిగా పట్టుకుని ద్వారబంధానికి ఎడమబుజం ఆనించి దెబ్బ కొట్టడానికి బ్రొబవస్కీ సిద్ధంగా ఉన్నాడు. తలుపు తెరుచుకుని ఎవరయినా లోపలికి అడుగుపెట్టీ పెట్టగానే స్టూలుబల్లతో కణతమీద కొట్టి అక్కడికక్కడే చంపేయాలని అతనిఊహ. అలాచేస్తే ఆయుధాలు ఇద్దరికీ లభిస్తాయి.

బామర్ స్టూలుబల్లను బ్రొబవస్కీ చేతులలోనుంచి లాగుకొని మెత్తమీదికి అతనిని తోసివేసాడు.

"తప్పుకోవడానికి మార్గం వుండకపోదు. ఒక్కగోరీలో నుంచి మాత్రమే తప్పించుకోలేం. ఆ గోరీలోకి వెళ్ళాలని వుందా యేం?"

పడుకుని గట్టిగా తలగడాలో మొహం పాదుకున్నాడు. కాని తలుపు పక్కనుంచే గొంతులు వినిపించాయి. ఏదో అస్పష్టంగా మాట్లాడుకున్నారు. తాళంలో చెవి తిప్పిన చప్పుడు కోసం మాత్రమే బామన్ వేచి ఉన్నాడు. కాని ఆచప్పుడు కాలేదు.

నడవలోనుంచి నవ్వులు వినిపించాయి. ఎవరో కొత్తమనిషి ముందు నవ్వాడు: దానిని అందుకని వార్డర్లూ నవ్వారు. అడుగుల చప్పుడు తగ్గింది. బరువాటి ఇనప తలుపు మూసిన చప్పుడయింది. మళ్లీ అంతా నిశ్శబ్దం.

"వాళ్ళేం మాట్లాడుకున్నారో వినిపించిందా, బ్రొబొవస్కీ! వాళ్ళ అదృష్టం పండింది. ఇద్దరు చనిపోయారు, ముగ్గురికి గాయా లయాయి. ఒకనిని కొట్టిచంపారు. తక్కినవాళ్ళందరిని యేకాంత నిర్బంధంలో వుంచారు. రేపు విచారణకు పంపేముందు కొరడాలతో చావకొట్టేస్తారు"

బ్రొబొవస్కీ సమాధాన మీయలేదు. అతిప్రయాస మూలంగా నరాలు సళ్ళిచ్చాయి. మగత వచ్చేసింది.

# పూలగుత్తిలో గాలం

"కొజుబా!"

"ఆఁ—" అన్నాడు కొజుబా మొహం పైకెత్తిచూస్తూ.

ఆ గదిలో అతనిపక్కనే అయిదారుగురు కార్మికులుకూడా ఉన్నారు. గులాబీపూలు, బంతిపూలు, మొదలయిన పూలు చిందరవందరగా పడిఉన్న ఒక బల్లచుట్టూ వారు నిలబడ్డారు. ఇద్దరుబాలికలు ఆ పూలు గుత్తులుగా కడుతున్నారు.

అప్పుడే లోపలికి వచ్చిన ఒకవ్యక్తి నలువైపులా చూసి, "చూపించవచ్చా?" అని అడిగాడు.

కొజుబా ఆప్యాయంగా నవ్వాడు.

"పిల్లలముందరా? వాళ్ళని బయటకు పొమ్మని యెలా అన గలం? సరే, సెమ్యాక్, ప్రదర్శించి చూపు."

సెమ్యాక్ కుర్చీమీద ఒక చుట్టపెట్టి దానిమీది రుమాలు తీసి వేసాడు. దానిలోనుంచి అయిదుపళ్ళ ఇనపగాలం బయటికి తీసాడు.

"ప్రదర్శించిచూపడం సంగతి నాకు తెలీదుగాని యిది మాత్రం యేనుగంత బరువును-లాగుతుంది."

"అవును యేనుగంత బరువు నే లాగబోతోంది. సరిగానే వూహించావు. యిది గట్టిదే గదూ?"

కొజుబా గాలాన్ని చేతితో తూచి చూసాడు. ఇనుమును పరీక్షించాడు. ఆ అయిదుపళ్ళూ గట్టిగా పట్టేసుకునేవి గానే కని పించాయి. కొజుబాకు సంతృప్తి కలిగింది.

కీవ్ అతనికి కొత్త. అలాంటప్పుడు ఈ పరాకీ వ్యవహార విషయమయి బాధ్యత తీసుకోవడం ఎలా సంభవించింది? వయసును బట్టా? కార్మికుడును బట్టా? స్థానిక పార్టీనాయకులందరినీ కీవ్ పోలీసులు జైలులో పెట్టిన తరవాత రైలుడిపో-కార్మికులు, కార్ఖానా కార్మికులు, గ్రెటరోవ్ మిల్లు కార్మికులు తదితరులు ఆదేశాలకోసం తన దగ్గరకెందుకు వచ్చారు?

"యిదుగో, మేరియాఫ్యోడొరోవ్నా, నేను చెప్పినట్లు దీనినిగుచ్చు"

ఆ బాలిక పొట్టిగా సొగసుగా ఉంది. చెక్కిళ్ళు గులాబీ రంగు. కొజుబా చేతిలోనుంచి గాలం తీసుకుని రొప్పుతూ, "అబ్బో! యింత బరువేం? ప్రాణం పోయినా లూస్యామాత్రం దీన్ని మోసుకు వెళ్ళలేదు."

కొజుబా ఆమెవంక తీక్షణంగా చూసాడు. "మోసుకువెళ్ళి తీరాల్సివుంటే, మోయలేదని అంటావేమిటి? అలాగానే మాట్లాడేది? అవసరమయితే నేను నా జేబులో ఫిరంగిని పెట్టుకుని వెళ్ళి యిచ్చివస్తాను. నేను చెప్పినట్లు చెయ్. కాలం వృధా చేయడానికి వీల్లేదు" మేరియా గాలాన్ని మేజాబల్లమీద పెట్టింది.

"నేలిపో బాగా పొడిచినా గాలం సంగతి బయటపడకుండా పెద్దపెద్ద పువ్వులు దట్టంగా కాడకు కట్టండి.

తనభావం ప్రదర్శించి చూపడానికని కొజుబా చామంతి పూల గుత్తిని వేలుతో పొడిచాడు.

"పూలు యెలాగుచ్చాలో నువు మాకేం నేర్పక్కర్లేదులే" అంది మేరియామొహం ముడుచుకుంటూ.

"యిక మమ్మల్ని వదిలేయ్. మాపనులు మేముచూసుకుంటాం."

ఆ ఇద్దరు బాలికల వేళ్ళు చురుకుగా పనిచేసాయి. ఇంతలోనే గాలంపూలతో మాయమయింది.

"యిది ఆగస్టు. తిలాక్ పూలు దొరకవు. గాలాన్నే కాదు మనిషిని మనిషినే తిలాక్ పూలల్లో దాచవచ్చు."

పురుషులు సలహా ఇవ్వదలచారు. కాని ఎందుకనో మెల్లిగా వినిపించీ వినపించనట్లు మాట్లాడారు.

"పూలు కాస్త ముందుకు లాగండి"

"కాడచుట్టూ దట్టంగా కట్టండి"

మేరియాతో పాటు పూలుగుచ్చుతున్న బాలిక పొడుగ్గా ఉంది.

"మీ సలహాలు కట్టిపెట్టండి. మీ మూలంగా పని సాగడం లేదు. యిపుడున్న పాళంగా చూస్తే యిది పూలగుత్తిలా కాక పెద్ద కాబేజీ పూవులాగా కనిపిస్తుంది."

"పూలు దగ్గిర దగ్గిర గుచ్చకపోతే దేనికి గాలం తగులుతుంది.

"వేలికి తగులుతుందీ?" అని మేరియా ఎత్తిపొడిచింది. గులాబీపూలు యెందుకు తెచ్చామనుకున్నారు. దానిచుట్టు గులాబీలు కడతాం. అపుడు తాకిచూస్తే తెలుస్తుంది. కోనేటపుడు బాగా ముళ్ళున్నవి యేరి మరీకొన్నాను. అవతలకి, ఉండండి! మీకింకేం పనీపాటా లేదూ? అంతా సిద్ధమయిందా?"

నిజానికి అంతా సిద్ధమయింగా?

కొజుజా మేజాబల్ల దగ్గరనుంచి వెళ్ళిపోయి వందోసారి వివరాలన్నిటినీ నెమరు వేసుకున్నాడు. పదకొండు రహదారి చీట్లూ లోనికి పంపడ మయింది. తప్పించుకున్న తరవాత ఖైదీలు వెళ్ళవలసిన ఇళ్ళచిరునామాలు అందజేయడ మయింది. డబ్బు-ఒక్కొక్కరికి వంద రూబుళ్ళు-వారి చేతికి అందింది.

జైలులో ఉన్నజనాని కంతటికీ సరిపోయే మందు-మత్తుమందుకూడా లోపలికి చేరింది.

ఇక వారిలో కొందరిని నీపర్ నది దిగువకు డార్నిట్సాకు తీసుకు వెళ్ళడానికి పడవ—

"పడవ సరయిన స్థితిలోనే వుందా ?"

"నల్ల సముద్రం దాకా తీసుకు వెళ్ళగలిగిన స్థితిలోఉంది"

అంటే అంతా సిద్ధమయిందన్న మాట! ఇక మిగిలిందల్లా గాలం జైలులోకి పంపడం ఒక్కటే. బామన్ 'భార్య' ద్వారా ఇది జరగాలి.

మీసాలు సవరించుకుంటూ బల్ల వేపు ఓరచూపు చూసాడు. మేరియా పక్కనేకూర్చున్న ఆ నల్లజుట్టుఆవిడే బామన్ అసలుభార్య. ఆమె పేరు నాడెజ్డా. క్లుప్తంలో నాడ్యా. వారం రోజులకితం డబ్బు తీసుకుని వచ్చింది. ఇస్రాకా సహాయం చేసింది. ఇసాక్రాయే గనక సహాయం చేయకపోతే తప్పించుకు పోవడానికి పన్నాగం సాధ్యమయేది కాదు. స్థానికంగా ఇసాక్రాను బలపరచే వారెవ్వరూ సహాయం చేయడానికి ముందుకు రాలేదు. నోవిట్స్కా చేసిన అరెస్టును వారిని భయకంపితులను చేసాయి. వారు వట్టిలంపటులు.

బామన్ అసలు భార్య అక్కడేఉంది. కాని జైలుదగ్గరికి వెళితే అరస్టుఅయే ప్రమాదం లేకపోలేదు. ఆమెకూడా ఇస్కా్రి పనిచేస్తోంది. విదేశాలనుంచి వచ్చింది. జెనివాలోని ఇస్కా్రి అచ్చు ఆఫీసులో తాను, బామన్ చేసిన పనిని వారికి తెలియ జేసింది.

"తయారయింది. లూస్యాని పిలవండి"

ఆ పెద్ద పూలగుత్తిని సులువుగా నాడ్యా బాగాపైకెత్తింది. ఆమె బలం గలది.

మేరియా ఈ విషయమే ఆలోచిస్తున్నదేమో అనుమానంతో తల అడ్డంగా తిప్పింది.

"అమితబరువు! లూస్యా మోయగలుగుతుం దనుకోను"

"మోయలేనూ? యేదీ మళ్ళీ ఆమాటఅను చెప్తాను, మేరియా ఫ్యొడొరోవ్నా! నామొహంమీద అను చూదాం"

మేరియా ఆమెవెనక తెరిచిఉన్న గుమ్మంకేసి చూసి నవ్వింది.

"నువెపుడూ అసమయంలోనే వస్తూంటావు. సరేగాని, యివాళ మహాఅందంగా వున్నావే!"

"యివాళేనా?" లూస్యా నవ్వుతూ దుస్తులు సవరించుకుంది. అవసరంకంటె ఎక్కువగా నవ్వుతున్నట్లుంది. ఆమెకళ్ళల్లో విపరీతమయిన కాంతి ప్రవేశిస్తోంది. బహుశా అందుకే ఇవాళ ఆమె మొహం అంత ఆకర్షణీయంగా ఉంది.

అవును. ఆమె అందంగాఉంది. ఆమెకళ్లు నల్లనివి, పెద్దవి. జుట్టు సొగసుగా ఎర్రవాగుగా ఉంది. హేటుకొత్తది. అంచు వెడల్పాంటిది. పైకి వంపుతిరిగింది. నడుంబెల్టుకు పూలుఉన్నాయి. ల్యోషా ఆదివారపు దుస్తులు వేసుకుని తల్లి దుస్తుఅంచు పట్టుకున్నాడు.

లూస్యా అజాగ్రతగా నాడ్యాదగ్గరనుంచి పూలగుత్తి తీసుకుంది. పూలగుత్తి బరువుగావుందేమో చేతిని లాగేసి నేలమీదపడి ఖంగునమోగింది. అంత బరువుందని ఆమె అనుకోలేదు.

"జాగ్రత! కింద పడేసావా మేంపడ్డ కష్టమంతా వృథా అయిపోయేదే, ఇంకానయం, నువు మొయ్యలేవని నేనుచెప్పలా!"

లూస్యా తెల్లబోయి కోపంతో మేరియావంక తిరిగి, "సిగ్గులేదూ ? అంత బరువున్నదనుకోలేదు. ముందు జాగ్రత పడితేనా, చూడు"

చేయిజాపి పూలగుత్తిని పైకి ఎత్తింది. గదిలోని వారంతా ఆ పూలగుత్తి వంక, ఆ సన్నని పాలిపోయిన చేతివంక తేరిపార జూచారు. చేయి కొద్దిగా వణికింది.

"మరేం పరవాలేదు" అంది నాడ్యా లూస్యాకు మద్దతు ఇస్తూ. వాళ్ళు గమనించినా జైలులోవున్న భర్తని చూడడానికి వచ్చినపుడు భార్య చేయి వణకడం సహజమే అనుకుంటారు" ఆందోళన చెందినపుడు మన చేతులూ యింతకన్న యెక్కువగానే వణుకుతాయి. పూలగుత్తిని యింతసేపు పట్టుకుని వుండక్కర్లేదుగా. సెకండుసేపు యెత్తి వుంచితే చాలు ఆపైన అతను తీసుకుంటాడు"

ఏదో అనుమానిస్తున్నట్లు కొజుబా కనుబొమలు ముడిచి ఆదుర్దాగా చూసాడు. చెప్పకపోయినా లూస్యా ఇది పసిగట్టి తనూ ఆదుర్దాగా తలుపువంక చూసింది. పూలగుత్తిని కిందికివంచి పిల్లవాడిచేయి పట్టుకుంది.

"సరే, గుడ్ బై చెప్పు"

"యేర్పాట్లన్నీ జ్ఞాపకం వున్నాయికదూ?" అన్నాడు కొజుబా మెల్లగా. సంజ్ఞచేసేపార్లో పొల్లవస్కా-యా వీధిలో నిరీక్షిస్తున్నాడు. అతన్ని మరిచేపోకు. సరే. గట్టిగా నిలవతొక్కుకో, లేకపోతే పుచ్చెలు యెగిరిపోతాయి"

... ... ...

లూస్యా వెళుతూంటే ఎవరూ మాట్లాడలేదు. కాని ఆమె స్నేహితులచూపులు ఆమెను అనుసరించాయి.

ఆమె తిరిగివస్తుందా? గాలం బైటపడితే ఇక ఆమెకు జైలే! ముందు నోవిస్కీన్స దగ్గరకు తీసుకువెళతారు. ఆ తరవాత జైలు.

అందుకనే ల్యోషానుకూడా తీసుకువెళ్ళింది. తనను అరెస్టుచేసినా పిల్లవాడుకూడా ఉంటాడు.

లూస్యా బయటికి వెళ్ళిపోగానే కొజుబా తక్కినవారిమీద దృష్టి పరపి అన్నాడు!

"యిక మీమీ స్థానాలకు వెళ్ళండి, కామ్రేడ్స్! చిరునామాల విషయం ధృవపరుచుకోండి. చీకటి పడగానే సిద్ధంగా వుండాలి సుమా!"

# 32

# గాలిబుడగలు

అల్లంత దూరాన్నుంచే లూస్యా పావ్లోను గుర్తుపట్టింది. ఉంగరాల జుట్టు, ఎండకు కమిలిన శరీరం. మెరిసేటి కాలికో చొక్కామీద గుడ్డ పీఠి వర్తకులను వీధి పక్క కాలిబాట మీదకు రానీయదు. అందుకని మురికి కాలవమీద రోడ్డుకు ఆచివరనుంచి ఈ చివరకు తిరుగుతున్నాడు. పావ్లో చిన్న వ్యాపారం చేస్తున్నాడు. చేతిలోన ట్వయిను దారానికి రంగు రంగుల గాలిబుడగలు గుత్తిగా కట్టిఉన్నాయి. సుమారు నలభయి బుడగలు–నీలి, ఎరుపు, ఆకుపచ్చ మొదలయిన రంగురంగుల బుడగలు ఉన్నాయి. ఈగుత్తికి పైన తెల్లటి పెద్ద గాలిబుడగ ఉంది. దానిమీద ఊదారంగు కోడిపుంజు బొమ్మ. ఇది సంజ్ఞ ఇవ్వడానికి ఉపయోగించే బుడగ. అన్నిటికంటే పెద్దది, ఖరీదయినది.

లూస్యాని చూడగానే తల పంకించి బాగా మెరుగు పెట్టిన ఎత్తుబూట్లు టకటక లాడించుకుంటూ ఆమెదగ్గరికి వెళ్ళాడు. చుట్టూ బాటసారులకేసి చూసి నిజమయిన వీధివర్తకుడి లాగా హుషారుగా సరుకు అమ్మజూపుతూ కేకలు వేసాడు.

"గాలిబుడగలు, రంగురంగుల గాలిబుడగలు! ఒక్కటి కొనిచూడండి! అయిదు కోపెక్కుల బుడగ యింటి పైకప్పుదాకా ఎగురుతుంది. రూబులుబుడగ మిమ్మల్ని చంద్రమండలానికి తీసుకు పోతుంది!"

బొద్దుపాటి ఆడమనిషి పట్టుజాలరు పట్టుకుని, కుక్కగొడుగు లాంటి గడ్డిహాటు పెట్టుకుని అతనికి ఎదురయింది. ఆమెదారిని అటకాయించి, "ఒకబుడగ కొనమ్మా!" ఆమె పక్కనే నడుస్తూ

బుడగ అందియ్యబోయాడు "అయిదు కోపెక్కులు. యింటి పై కప్పుదాకా యెగురుతుంది. నాదీ గారంటీ."

బాటసారులు వేడుకగా చూసారు.

"యింటి పై కప్పుదాకానేనా ?" అని తాగిన కార్మికుడు పావ్లోవంకచూసి కనుగీటాడు. "అటువంటి కళేబరాన్ని దీప స్తంభం యెత్తు యెత్తేటట్టు చేయాలి"

లూస్యా ల్యోషాను ఎవరి దృష్టిలోనూ పడకుండా వీధివర్తకునికి బరాబరిగా వచ్చారు. నాడూ వారికేసి తిరిగి, టోపీ చేతితో మిక్కిలిగా ఆడిస్తూ.

"అయిదు కోపెక్కులు – పై కప్పుకు యెగురుతుంది. ఆ పిల్లవాడికి ఒకటి కొనిపెట్టరాదూ ?"

లూస్యా మందహాసం చేసింది. ఆమె కణతలు బద్దలేసుకుపోతున్నాయి. పత్రిక కాగితంలో చుట్టి ఎడమచేతితో మోసుకుపోతున్న పూలగుత్తి మహాభారంగా ఉంది. జైలుకు చాలాదూరం నడిచివెళ్ళాలి. మధ్య మధ్య చేయి మార్చుకోవలసి వస్తోంది. అంతదూరం పూలగుత్తిని ఒక చేతితో మోసుకుపోలేదు. ఇక ఇప్పుడు రెండు చేతులూ నెప్పులు పుడుతున్నాయి. వణికిపోతున్నాయి.

ఇక్కడ పావ్లో తిరుగుతున్నాడంటే జైలు అట్టే దూరం లేదన్నమాట. దరిదాపులకు వచ్చేసినట్లే.

ఆమె చేతికండరాల వణకు ఆగింది.

"సరే. కొంటే, చంద్రమండలానికి వెళ్ళేదే కొనాలి. అంతేనా. ల్యోషా."

'ల్యోషాకి అపరిమిత సంతోషం వేసింది. ఆ సంతోషాన్ని కప్పిపుచ్చడానికి తలవంచి నేలకేసి చూసాడు. పావ్లో ల్యూషాకేసి సూటిగా చూసి తొందర తొందరగా ఊదాకోడి బొమ్మవేసిన తెల్లగాలి బుడగను గుత్తిలోనుంచి ఊడతీసాడు.

"గట్టిగా పట్టుకో, అబ్బాయి! వదిలిపెట్టావా, తోక పైకెత్తుకుని యెగిరిపోతుంది"

ల్యోషా తల పైకెత్తి గబగబా కళ్ళు ఆర్చుకుంటూ చూసాడు.

"పావ్లోమామా!"

రహస్య కార్యకలాపాలలో పని చేసేవాళ్లు ఒకరికొకరు కలుసుకున్నపుడు సూటిగా కళ్ళల్లోకి చూడకూడదు. అలాచేస్తే తప్పకుండా గుర్తు పట్టేస్తాడు. మొహం, గొంతు, ఎత్తు మార్చుకో వచ్చు, కాని కళ్ళు–కళ్ళనుమాత్రం దాచడం సాధ్యంకాదు. పావ్లో ఈ జాగ్రత తీసుకోలేదు. లూస్యా మొహం వెలవెలబోయి ఉండడం చూసేసరికి పావ్లో మనసు బహుశా చివుక్కుమని ఉంటుంది. అందుచేత వీధి వర్తకుడిలాగా మాట్లాడినా కళ్ళను మాత్రం దాచలేకపోయాడు. ల్యోషా అతనిని వెంటనే గుర్తు పట్టేసాడు.

లూస్యా కొడుకును దూరంగా లాగి

"యేవిటి పావ్లో! నువెపుడూ యెదోవకటి వూహించుకుంటూనే వుంటావు"

అదృష్టవశాత్తూ వారికి దగ్గరలో ఎవరూ లేరు. పిల్లవాడి మాటలు ఎవరూ వినలేదు. కొద్ది అడుగుల దూరంలో ఒక ముసిలి గూనవ్వ కనిపించింది. జుట్టు చిందరవందరగా ఉంది. నుదురును కప్పివేసే రుమాలు తలకు చుట్టుకుంది. చేతిలోని బుట్టలోంచి చేప తోక బైటికి కనిపించుతోంది. బహుశా ఆమెకు చెముడని లూస్యా నిర్ధారణ చేసుకుంది.

ఈ లోపున పావ్లో చాలాదూరం ముందుకువెళ్ళిపోయాడు. నాలుగు రోడ్ల కూడలిలో నిలబడి రంగు రంగుల గాలిబుడగలనుత్తి ఆడిస్తూ వాటిని అమ్మజూపుతున్నాడు. "గాలిబుడగలు!" అంద చందాల గాలిబుడగలు!" అని అరిచాడు. జైలు ఎత్తుగోడ అవ

తల ఆఖరి భాగంమీది రెండో అంతస్తులోని ఇనపచువ్వల కిటికీ కేసి ఓరచూపు చూస్తూ.

లూస్యా ఇచ్చిన సంజ్ఞకు జవాబు ఆ కిటికీలో నుంచి రావాలి.

"చంద్రమండలం దాకా యెగురుతుందనే అనుకుంటు న్నావా ల్యోషా! తోక పైకెత్తి యెగురుతుందని చెప్పడం విన్నావా? తమాషాగా వుంటుంది కదూ, యిక పిడికిలి తెరిచి యెగరెయ్"

ఆ పిల్లవాడు తల్లి కేసి కళ్ళల్లో అనుమానం పెట్టుకుని చూసాడు. అతడికళ్ళూ లూస్యా కళ్ళలాగానే పెద్దవి, నల్లనివి. పిడికిలి మరింత బిగించి తాడు పట్టుకున్నాడు.

లూస్యాకి ఆందోళన హెచ్చింది. పిల్లవాడు తిప్పలు పెట్టే టట్టున్నాడు.

"ఆకాసంవంక చూడు; యెంత నీలంగా వుందో! బుడగ తెల్లనిది. పైన యెగురుతూంటే యెంతో ముచ్చటగా వుంటుంది. తమాషాగా వుండదూ?"

ల్యోషా శ్రద్ధగా విన్నాడు. ఎడమ చేతిని తల్లి పట్టునుంచి విడిపించుకుని రెండు చేతులతోనూ దారాన్ని గట్టిగా ఒడిసి పట్టాడు.

"ల్యోషా!"

♦ ♦ ♦

జైలు ఆవరణలో గుండుసూదుల మీద కర్రముక్కల చప్పుడు అసాధారణంగా ఎక్కువగా ఉంది. అది భ్రమేకావచ్చు ఆరోజున ప్రతిదీ-గొంతులు, బూట్లకింద నలిగే ఇసుక చప్పుడు, పిచ్చుకల కిచకిచ ధ్వనులు, గొరోడ్డీ కర్రముక్కల చప్పుడు-బిగ్గ రగా వినిపించాయి.

గర్నీకా బౌమన్‌లు ఒకరిచేయి ఒకరు పట్టుకుని నడుస్తున్నారు. మధ్య మధ్య ఎంతో ఆసక్తితో ఆకసంవంక చూసారు. ఆరోజున ఆకాశం నిర్మలంగా ఉంది. సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు. ఆకాశం నీలంగాఉంది. మచ్చుకయినా మబ్బుతునక లేదు. అటువంటి ఆకాశంకేసి చూస్తూ ఖైదీమాత్రం ఎందుకు ఆనందించకూడదు? బేడీలతో కఠినసరకం అనుభవించేటపుడు ఆకాశం అలా నీలంగా ఉండదు. సైబీరియాలో కీవ్‌లాగా ఉండదు. ఇస్క్రా వారిని సైబీరియా పంపుతారని జైలులో అందరికి తెలిసిన విషయమే. నోవిట్స్కీ దర్యాప్తు పూర్తి చేసాడు. అంటే కఠిన నరకం విధించడానికి కావలసిన నిబంధనలు న్యాయశాస్త్ర గ్రంథాలలో నుంచి తీసిపెట్టాడు. వారిమీది నేరారోపణలు: చక్రవర్తిగారిని అవమానించడం; 'ప్రస్తుత వ్యవస్థను బలప్రయోగంతో కూలద్రోయడానికి' కృషి చేయడం; చట్ట విరుద్ధమయిన సంఘానికిచెంది ఉండడం... ఏదీ అతని దృష్టినుంచి తప్పించుకోలేదు.

'కుక్కగొడుగు' కింది కాపలా పోలీసు నిర్లక్ష్యంగా నిట్టూర్చాడు. చేతిలో తుపాకి ఊగిసలాడుతోంది. దాని మూతి నేల వేపుకు ఉంది. ఈజైలులో అతను ఆరేళ్ళనుంచీ పనిచేస్తున్నాడు. ఇక్కడనుంచీ రాజకీయ ఖైదీలు ఎందరో ఒక్క సైబీరియాకే కాదు, ఉరికంబాలకు కూడా వెళ్ళడం చూసాడు. గోడలమీద వూరికే సంతకాలు పెట్టారా!

ఇస్క్రావారి సంతకాలు కూడా స్మృతిచిహ్నంగా గోడ మీద ఉన్నాయి.

"యింకా సంజ్ఞ రాలేదు" గర్నీకా గడ్డంలోకి వేళ్ళు పోనిస్తూ గురుగ్రిమన్నాడు. గడ్డం చేయించి చాలా కాలమయిందేమో చిక్కిరి బిక్కిరిగా ఉంది. "దాని అర్థం బంగీ రాదనేనా! అంటే గాలం సిద్ధం కాలేను, లేకపోతే యేమయినా చిక్కు తటస్థించిందా?"

"ఊం– వూహాగానం కట్టిపెట్టు" అంటూ బౌమన్ మొరటుగా తోసాడు.

ఇంకా ఏదో చెప్పేవాడే, కాని ఇంతలో ఉదారంగు కోడిబొమ్మ వేసిన తెల్లటి గాలిబుడగ ఇళ్ళ పైకప్పులు దాటి ఆకాశంలో విహరిస్తోంది.

"అదిగో సంజ్ఞ ! బలే! రూక్! తిరిగి జవాబుయివ్వు. వాళ్ళ జవాబుకోసం నిరీక్షిస్తుంటాను"

గర్కిన్న గొరొడ్కి ఆటగాళ్ళ వంక గిరుక్కున తిరిగాడు. ఒక లావుపాటి కర్రముక్క చరుక్కున వచ్చిపడింది.

"మతి పోయిందా ? ఆట ఆడుతూంటే అడ్డంవస్తావేం ? కాలు విరగ కొట్టించుకోవాలని వుందా యేం ?"

కొట్టులోకి వెళ్ళి బామన్ స్టూలుబల్లమీద నిలబడి తుప్పుపట్టిన కిటికీ చువ్వలలో ఒకదానికి తెల్లటితువాలు కట్టాడు.

ఆ దేక్షణంలో రంగురంగుల బుడగల పెద్దగుత్తి ఆకాశం లోకి హుషారుగా లేచింది. తువాలు కనిపించగానే పావ్లో చేతి లోని దారం వదలివేసాడు. ఇం కేముంది బుడగలు ఎగిరి చక్కా పోయాయి. వీధిలో పరుగెత్తుతూ కేకలు వేస్తూ ఆ బుడగల వెంట పడ్డాడు.

"ఛీ! వదిలేసాను. చేయి జారిపోయాయి! పట్టుకోండి, బాబూ! పట్టుకోండి."

తన గాలిబుడగ ఎగిరిపోవడం మరిచేపోయి ల్యోషా బాగా నోరు తెరచుకుని చూసాడు.

ఎగిరిపోతున్న గాలిబుడగల వెంటపడి పావ్లోచేస్తున్న కోతి చేష్టలకు బాటసారులు నవ్వారు. ఆకాశంలో మాయమయి పోతున్న బుడగలవంక తల పైకెత్తిచూస్తూ జైలువార్డర్లుకూడా నవ్వారు. అవి క్రమక్రమంగా చిన్నవవుతూ నిలకడగాఉన్నట్లు కనిపించాయి.

"యజమానిచేత ముక్కచివాట్లు తింటాడులే! వాటిఖరీదు యిరవై కోపెక్కలన్నా వుంటుంది. పిచ్చివెధవ!"

# 36

# గులాబీలు

ఆ గాలిబుడగలు పైపైకి ఎగిరి సూదిమొనలంతలయి చివరకు కనిపించకుండా మాయమయిపోయాయి.

మూడు సంజ్ఞలు పూర్తిఅయాయి. చెప్పవలసిందేమిటో చెప్పడమయింది.

"మేము సిద్ధంగా వున్నాం."

"మేమూ సిద్ధంగావున్నాం"

"గాలం పంపుతున్నాం."

లూస్యా, ఆమె పిల్లవాడు జైలుగేటును సమీపించారు. ఆమెలో ఆందోళన ఇంకా తగ్గలేదు. పైపెచ్చు పావ్లో కేకలు వేస్తూ పరుగెత్తుతూంటే తుప్పుపట్టిన కిటికీల చువ్వలనుంచి తువాలు గాలిలో రెపరెపలాడడం ఆమెకు స్పష్టంగా కనిపించింది. ఆ పట్టణమంతా చూసిందనే ఆమె భావించుకుంది. మూడుసంజ్ఞలు ఎందుకు ఇచ్చారో, నడిరోడ్డుమీద ఒక యువకుడు గాలిబుడగల వెంట పిచ్చిగా ఎందుకు పడుతున్నాడో, ఒక అందమయిన స్త్రీ పెద్ద పూలగుత్తి పత్రికకాగితంలో ఎందుకు తీసుకు వెళుతూందో అందరికీ తెలుసు అనుకుంది. ఇదంతా పట్టణమంతటికీ తెలుసుననీ, ఇక ఏం జరుగుతుందో చూద్దామని వేచిఉన్నారనీ ఆమెకు నమ్మకం కలిగింది.

లూస్యా ఎంతో కష్టంమీద ధైర్యం చిక్కబట్టింది. ఇదివరలో ఎన్నడూ ఆమెచెక్కిళ్ళు ఇంత ఇదిగా మండిపోలేదు. ల్యోపాకూడా ఇది కనిపెట్టాడు.

"యేమిటి సంగతి అమ్మా! యెందుకలా బాధపడతావ్?" అని ఆ పిల్లవాడు అడిగాడు.

గేటులో డ్యూటీలోఉన్న వార్డరు నిద్రమత్తు కళ్లు విప్పీ విప్పకుండా వెళ్ళిపొమ్మని చేయి ఊపాడు.

"వెళ్ళిపో. యివాళ యెవరినీ రానియ్యకు"

"దయయుంచి ఆఫీసులోనుంచి రాజకీయశాఖాధికారిని పిలు." అంది లూస్యా ఏమాత్రం తొణకకుండా పూలగుత్తిని ఆడిస్తూ. "ఆయనకు తెలుసు"

వార్డరు ఉమ్మివేసి కాలుమీద కాలువేసుకున్నాడు.

"యెవరినీ పిలవబోవడం లేదు. వెళ్ళిపొమ్మని చెప్పానా! అసలు నువు యిక్కడ నిలుచోడానికే వీల్లేదు"

అతనిస్వరం ముభావంగా ఉంది గాని కాఠిన్యం తగ్గలేదు. ఇక వార్డరు ఆమెని లోపలికి వెళ్ళనిచ్చేటట్టులేదు. వెంటనే లూస్యా తమాయించుకుని పక్కగేటు ఇనపగుమ్మంమీద బూటు చివరతో టక్ టక్‌మని కొట్టింది.

"వెంటనే గేటు తెరుస్తావా తెరవవా? అధికారిని పిలవ నడానికి నీకు హక్కులేదు. అది నీ కర్తవ్యం"

తలవనితలంపుగా వార్డరుకు అరికాలిమంట నెత్తికెక్కింది.

"వెళ్ళిపో. పొమ్మని చెపుతున్నా," అని ఎలుగుగొడ్డులా గుర్రుమన్నాడు. "వెళ్ళిపోకపోతే నిన్ను అరెస్టు చేస్తాను"

లూస్యా మొహం వికసించింది. అదయినా మంచిదే. అరెస్టుచేస్తే గేటులోపలికి వెళ్ళవచ్చు. లోపలికి వెళ్ళితే ఇక పరవాలేదు.

"యేమాత్రం అరెస్టుచేస్తావో చెయ్యి చూదాం."

వార్డరు గడ్డంలోకి వేళ్ళుపోనిచ్చి సవరించుకుంటూ లేచాడు. అ సమయంలో గనక గర్నిక లోపలిగేటులోని చిన్న ద్వారంలోనుంచి వచ్చి కచేరీవేపు నడక సాగించకపోయి ఉంటే ఏం జరిగేదో!

"గర్నీక్! శామన్‌కోసమని పువ్వులు తెచ్చాను" అంది లూస్యా తెగించి, అతను కనిపించేసరికి కలిగిన ఆశ్చర్యంనుంచి కోలుకోకుండానే. కాని ఆమాటలు ఆమె నోటనుంచి వెడలీ వెడలకముందే ఇది యాదృచ్ఛికంగా కలుసుకోవడంకాదనీ గర్నీక్ ఆమెకోసం ఎదురుచూస్తున్నాడనీ గుర్తించింది. మళ్ళీ ఆమెకు కంపరం బయలుదేరింది.

గర్నీక్ ఆగి తలపంకించాడు. కళ్ళతో మందహాసంచేసి కచేరీలోకి వెళ్ళిపోయాడు.

వార్డరు చిన్నద్వారం దగ్గర ఆలోచిస్తూ నిలబడిపోయాడు. అతను లూస్యావంక చూడలేదు. లూస్యాకూడా అతనివంక చూడలేదు. ఇద్దరూకూడా రెండుగేట్లకి మధ్యగాఉన్న గోడలోని కచేరీ గుమ్మంవంక చూస్తున్నారు.

ఇంతలో ఆ ద్వారం తెరుచుకుని గర్నీక్, సులీమాలు బయటికి వచ్చారు. సులీమా శుభ్రమయిన చొక్కా తొడుక్కున్నాడు. అసలుకంటె ఎక్కువ పొడుగుగా, ఎక్కువ పీలగా కనిపిస్తున్నాడు. తాగితూలుతూ లూస్యాకేసి ఓరచూపు చూసి బిగ్గరగా వార్డరుని

"ఆమెని లోపలికి వెళ్ళనీ" అన్నాడు.

విసుగు, కోపంతో వార్డరు తాళంలో చెవిపెట్టి కిర్రుమని తిప్పాడు. ల్యోషానికూడా లాక్కుంటూ లూస్యా లోపలకు అడుగుపెట్టింది. ఎందుకనో ఆ పిల్లవాడు లోపలకురానని మొరాయించాడు.

సులీమా సాల్యూటుజేసి అతనిబూట్లకు తట్టుముళ్ళు ఉన్నట్టు, అవి జీవరక్షణాధికారి ముళ్ళలాగా గలగలమంటాయనీ భావించుకున్నట్లు మడమలు టకటక లాడించాడు. నిజానికి అతని బూట్లకు తట్టుముళ్ళులేవు. మడమల టకటక సరిగా వినిపించలేదు.

"యేమయినా యింకా వుపకారం చెయ్యాలా ?"

ల్యోషా తలను తల్లి దుస్తులలో దాచుకున్నాడు. మంచిదే అయింది. ఇక లూస్యా ఉక్కిరి బిక్కిరయింది. కారణం గాలం మాత్రంకాదు. ఆమెఆందోళనకు కారణం వేరు. గర్కీన్ కళ్ళల్లోకి చూసింది. అతనేదో ఆమెకు చెప్పదలచినట్టున్నాడు- ఆనాటి వారి తంత్రం విషయమయి ఏదోచెప్పదలచినట్టున్నాడు. అదేదో అతిముఖ్యమయినదయి ఉంటుందని ఆమెభావించింది. ఆపని సూచనను అర్థం చేసుకోలేక అంతా పాడుచేస్తానేమోనని భయపడింది. అందుచేత ఆమె కళ్ళల్లో ఒకేపర్యాయం ఏకాగ్రత, ఆనందం, వేడికోలు గోచరించాయి.

సులీమా గమనించిందల్లా ఆమె తనకేసి చూడడం లేదనే. తాగినవాళ్ళకి కోపం ఇంతలో వస్తుంది. అలాగే సులీమాకుకూడా విపరీతమయిన కోపం వచ్చింది. భర్త పుట్టిన రోజు పండగగురించీ, తాను పూవులు తీసుకురావడం గురించీ, ఆయనను చూడాలనే తన కోరికను గురించీ లూస్యా చెపుతూంటే వినిపించుకోనేలేదు.

"చూస్తావా ? ఉహుఁ-సాధ్యంకాదు."

పదిహేను నిమిషాలక్రితం వార్డరు స్వరం ఎలావుందో అదే విధంగా సులీమా స్వరంకూడా కొయ్యలాగా మూర్ఖంగా ఎక్కడా సందివ్వకుండా ఉంది. కాని మళ్ళీ మూర్ఖంగా.

"ఉహుఁ- చూడనీయడానికి వీల్లేదు" అన్నాడు.

"బామన్‌ని చూడడానికి యిదివరలో వెళ్లనిచ్చావుగా సులీమా !" అన్నాడు గర్కీన్ బతిమాలుకుంటున్నట్టు. "యిది బామన్ పుట్టినరోజు పండగ; రోజూ వచ్చేపండుగ కాదుగదా. బామన్ భార్య..."

కనిపించీ కనిపించకుండా ఎడమ కనురెప్ప కదిలించి లూస్యాకు సైగచేసి పెదవులు ముడుచుకున్నాడు. ఆ కనుసైగలో ఆపెదవి కదలికలో తమాషా, ఆత్మ విశ్వాసం గోచరమై, లూస్యాకు ఉత్సాహం కలిగింది.

కాని సులీమా చొక్కా వేళ్ళతో తడుముకుంటూ ముక్కుతో మాట్లాడసాగాడు. లూస్యా ఉత్సాహమంతా చచ్చి పోయింది.

"ఆతనిని చూడడానికి గాని, బంగీ యివ్వడానికిగాని అనుమ తించేది లేదని స్పష్టంగా చెపుతున్నా, యివి పువ్వులేనా ?"

ఇలాఅని పూలగుత్తిమీద కాగితాన్ని వేలితో పొడిచాడు కాగితం చినిగిపోయి సూదిలాంటి ముల్లు బయట పడింది. ముల్లు గుచ్చుకుందేమో సులీమా వేలిని చటుక్కున లాగేసుకున్నాడు. ఇదంతా లూస్యాకి వేడుక అనిపించి, మందహాసం చేసింది.

"జాగ్రత్తగా వుండాలి, తెలిసిందా ? అవి గులాబీ పువ్వులు, ముల్లు గుచ్చుకుంటాయి."

గర్స్కి మళ్ళీ చమత్కారంగా కనుసైగచేసి, సులీమా కదలివెళ్ళిపోక మునుపే ముందుకువచ్చి లూస్యా చేతిలోనుంచి పూలగుత్తి తీసేసుకున్నాడు.

"యిది బామన్‌కు నేను బహూకరిస్తాను. స్వయంగా అతను నిన్ను కలుసుకోకపోయినా యిది కొంత వుపశమనంగా వుంటుంది. యేంచేస్తాం, కాప్టెన్ సులీమా యింత మొండిపట్టు పట్టితే ! ఆయ నకి కనికారం లేదని అందరికీ తెలుసు, గుడ్‌బై."

సైనికునిలాగా వెనుదిరిగాడు. సులీమా పెదవికొరుక్కుంటూ ఆలోచించాడు. నిజానికి పూలగుత్తిని పరీక్షించవలసింది. పై అధి కారులకు యీ సంగతి తెలిస్తే, వార్డరుఅంతా చూడనే చూసాడు చిక్కుల్లో పడిపోతాడు;

చెదిరిపోయిన తాగుమోతు ఆలోచనలను గుదిగూర్చుకోవా లని యత్నిస్తూండగనే గర్స్కి మాయమైపోయాడు. వెళుతూ లూస్యావంక తిరిగి మందహాసంచేసి తల పంకించాడు. ఆఖరి అడ్డంకి తొలగిపోయింది. పూలగుత్తి గమ్యస్థానం చేరుకుంది. ఇక ఆరోజున ఖైదీలు తప్పకుండా తప్పించుకు పోతారు అని దాని అర్థం !

# 37

# పరారీ

చీకటి పడవచ్చింది. 'కుక్క-గొడుగు' కింద లాంతరులో దీపకాంతి తగ్గి మసకమసకలాడుతోంది. ఆ ఆవరణలోకల్లా అదొకటే లాంతరు. ఏకాంత నిర్బంధంలోఉన్న ఖైదీలు లాంతర్లు బైటికి తీసుకురాలేదు. ఆకాశం మేఘాలతో నిండిపోయింది. వాతావరణం చెమ్మగా శీతలంగాఉంది. అటువంటి వాతావరణంలో హొరుబయట చదువుకోవడం సాధ్యంకాదు. అసలు ఆవరణలో నేలమీద కూర్చోవడమే మంచిదికాదు. ఆనాటి సాయంకాలం ఖైదీలంతా ఆవరణలో అటూఇటూ నడుస్తూ పొద్దుపుచ్చుతున్నారు.

ఎత్తుగోడల మధ్య భారంగా కాళ్ళీడ్చుకుంటూ వర్తులంగా నడిచారు. అంతూపొంతూ లేకుండా ఇలా ప్రదక్షిణం చేయడం వల్ల జనంతో నిండిన జైలుఆవరణమీదపడే మంచుపొగ దట్టంగా, పీడగా గోచరించింది.

కాని ఇస్కాన్ ఖైదీలభాగంలో గోరోడ్కి ఆట హుషారుగా సాగుతోంది.

"అదిగో, ముక్కుమీద గుద్దేస్తా. మళ్ళీ తిన్నగా పెట్టు"

"యీ చీకటిలో చిన్నచిన్న వస్తువులు కనిపించవే, యెలా ఆడగలుగుతున్నావు?"

"పొరపాటు పడ్డావు" అని బామన్ నవ్వాడు.

"గుండుసూదులనే కాదు, గోడవతల యేం జరుగుతున్నది కూడా చూడగలను"

"గర్స్కీ లోపలికి వెళ్ళడం చూసావా?"

చీకటిలోనుంచి తొందర తొందరగా మెల్లిగా వెలువడిన ఆ మాటలకు బామన్ వెనుదిరిగి చూసాడు. మనిషి ఆకారాన్ని బాగా పరీక్షించాడు. పరారీకాకుండా జైలులోనే ఉండి వారికి సాయపడదలచిన ఒక కామ్రేడ్ ఆకారం అది. అతను కాపలా ఉంటాడు.

"అపుడే తొమ్మిది గంటలయిందా? కాలం నాతో సయ్యాటలాడుతోంది. నిలచిపోయినట్లుంది. ఎప్పుడో తొమ్మిది అయిందనుకున్నాను గాని నా అంచనాను నేనే నమ్మలేక పోయాను. యికపద, బ్రాబ్రావస్కీ!"

నిచ్చెన తీసుకురావడానికి ఇరుకు ఆవరణలోనుంచి భవంతి లోకి వెళ్ళి అక్కడనుంచి రెండో అంతస్తు చేరుకున్నారు. వీరికి కేటాయించిన పని ఇది. ఆనాడు డ్యూటీలోఉన్న వార్డరిద్దరికీ మత్తుమందు ఇచ్చి కదలకుండా చేసి బామన్ ప్రభృతుల మార్గం నిష్కంటకం చేయడం గర్స్కీ, మాల్ట్సమక్‍లవంతు.

అక్కడ కాపలాఉన్నదల్లా ఇద్దరే ఇద్దరు వార్డర్లు. అసి స్టెంటు చీఫ్‌వార్డరుకూడా డ్యూటీలో ఉండవలసిందే. కాని అల వాటు చొప్పున అదివరకే ఇంటికి వెంచేసాడు. అతని ఇంట్లో రాత్రి ఎనిమిదిన్నరకల్లా భోజనాలు అయిపోతాయి. ఈ విష యంలో అతనిభార్య ఖచ్చితమయిన మనిషి. రాజకీయఖైదీలు అందరికీ ఈ సంగతి తెలుసు. అందువల్ల ఎపుడూ ఇంటికిఆలస్యంగా వెళ్ళేవాడుకాదు. ప్రతి సాయంత్రం ఎనిమిది గంటల హాజరుపట్టీ వేసిన తరవాత ఎదోఒక వంకచెప్పి వెళ్ళిపోయేవాడు. హాజరుపట్టీ తరవాత నిజానికి ఖైదీలందరినీ వారివారి కొట్లలో పెట్టి తాళం వేయాలి.

రుడిన్‌స్కీ, వాల్టోన్‌లను మార్గనుంచి తొలగించడమంటే జైలుతలుపు తెరవడమే. ఇక ఉన్న ఆటంకంమల్లా 'కుక్కగొడుగు'

కింది కాపలాపోలీసు ఒక్కడే. కాని మార్ట్సెనర్ అన్నట్టు, 'అనేకమాట్లు పరీక్షించి' చూస్తే ఇస్కా)వారికి సంబంధించినంత వరకు కాపలా లేనట్టేలెక్క. కాకపోతే నడవలోని వార్డర్లిద్దరి విషయం జాగ్రత్తపడాలి. అందులోనూ రుడిన్స్కీ విషయంలో మరీ జాగ్రత వహించాలి. అతడు మహాపట్టుదల మనిషి.

బామన్, బొబ్రొవస్కీలు రెండో అంతస్తుమెట్లు చివరికి చేరుకునేసరికి రుడిన్స్కీ 'ఏకాంతఖైదీల నడవ' గుమ్మంలో నిలబడి ఉన్నాడు. వారిని అనుమానంతో ఎగాదిగాచూసి కళ్ళల్లో అలవాటయిన గుర్రుతో.

"నిద్రపోవడానికి అప్పుడే వెళుతున్నారా? యివాళ పెందలకాడే బయలుదేరారే?" అన్నాడు.

బామన్ జవాబియ్యలేదు. నడవచివర ఉన్న తనకొట్టుకి మెల్లిగా నడుస్తూవెళ్ళాడు. దోవలో క్రోక్మాల్ కొట్టులోనుంచి వస్తున్న వోల్టోవ్‌ను కలుసుకున్నాడు. దీనిఅర్థం ఏమిటి? ఖైదీలు లేనపుడు వార్డర్లు వారిగదిలో కాలుపెట్టడానికి ఇదివరకెన్నడూ సాహసించలేదు. గర్స్కి, మార్ట్సెనర్ ఏంచేస్తున్నారో?

ఈ ప్రశ్నకి జవాబా అన్నట్లు గర్స్కి గొంతు వినిపించింది.

"వోల్టోవ్! ఒక్కనిమిషం, యిలారా"

వోల్టోవ్ వెనకకు తిరిగాడు. బామన్, బొబ్రొవస్కీ వారి కొట్టులోకి వెళ్ళి బొంతకింది నిచ్చెన, తలగడాలోని గాలం బయటికి తీసారు. ఉదయమే పువ్వులలోనుంచి గాలంతీసి తలగడాలో దాచిపెట్టారు.

"యిక్కడ కడదామా, ఆవరణలోనా?"

బామన్ విని,

"యిక్కడే యెక్కువ సదుపాయంగా వుంటుంది. అక్కడయితే యిష్టమున్నా లేకపోయినా తొందరపడాలసి వుంటుంది. గర్స్కి యింకా తచ్చాడుతున్నాడు. అంటే మనకింకా వ్యవధి వుందన్నమాట" అన్నాడు.

నిజం, ఇంకా వ్యవధిఉంది. వార్డర్లకి మత్తుమందు ఇవ్వడం ఆలస్యమయింది.

వోల్కోవ్ లోపలికి రాగానే మార్ట్సమన్ తన మెత్తదగ్గరగా గోడకు బిగించిన ఇనప బల్లమీాది లావుపాటి సీసాలను చూపించాడు. ప్రతి సీసామీాదా బంగారపు చీట్లు, చీట్లమీాద నోరూరించే మాటలు ముక్తసరిగా.

జమయికా రమ్ము—అని అచ్చుకొట్టి ఉన్నాయి.

వెంటనే వోల్కోవ్ ఆ సీసాలమీాదనుంచి దృష్టి మరల్చుకున్నాడు. చీటీ చదవవలసిన అగత్యం లేదు. ఆ సీసాల ఆకారమే వీటిలో ఏమున్నదీ చెప్తోంది. మంచి రమ్ము! నాలుకతో ముళ్ళలాంటి మీసాలు తడుముకున్నాడు.

"మనకి బిరడాలు తీసే స్క్రూ కావాలి." అన్నాడు గర్స్క వార్డరులాగానే తనూ మీసాలు నాలుకతో తడుముకుంటూ.

'ఊం-కానీయ్' అని ఎప్పుడంటారా అని వోల్కోవ్ ఎదురు చూస్తున్నాడు. రాజకీయ ఖైదీల కొట్లలోకి తరుచుగా రమ్ము వస్తూఉంటుంది. గత కొద్దివారాలలో ఈ మార్ట్సమన్‌కు బంగీలలో మునుపటికన్నా ఎక్కువగా రమ్ము వస్తూన్నట్టుంది. ప్రతి బంగీలోనుంచి వార్డర్లకు ముడుతోంది. అసలు మార్ట్సమనే తాగుబోతులా కనిపించాడు.

వోల్కోవ్ చేయి పట్లాం జేబులోకివెళ్ళి స్క్రూఉన్న చాకును గట్టిగా పట్టుకుంది. స్క్రూని పైకితీయడం సెకండ్లమీాద పని. గట్టిగా బిగుసుకున్న బిరడా పైకి లాగుతూంటే వచ్చే 'టప్' అనే ధ్వని అతని చెవులకు సంగీతంలాగా ఉంటుంది:

"కృతజ్ఞుణ్ణి" అన్నాడు గర్స్క. పళ్ళు తళతళా మెరిసినాయి. "దయచేసి గ్లాసుకూడా తీసుకువస్తే బాగుంటుంది. జల్సా చేసుకుందాం."

అపేక్షతో నిండిన కళ్ళను వోల్లోవ్ తిప్పి వేసుకుని.

"డ్యూటీలో వున్నపుడు... నిబంధనలకి వ్యతిరేకం"

గర్సీక్ కడుపుబ్బా నవ్వాడు. మెత్తమీద కూర్చున్న మాల్ట్సమన్ విసుగుతో చేయి ఆడించాడు.

"మరేం పరవాలేదు. యిదేం మొదటిసారా? గ్లాసు తీసుకురా."

వార్డరు తలుపుకేసి చూసి

"గ్లాసుకోసం వార్డర్ల గదికి వెళ్ళాలిమరి. అక్కడరుడిన్‌స్కీ వున్నాడాయె." అన్నాడు.

గర్సీక్ ఆ సూచనను అందుకున్నాడు.

"రుడిన్‌స్కీని కూడా తీసుకు చక్కారా. అంటె రెండు గ్లాసులు."

"తప్పకుండా తీసుకురమ్మంటే తీసుకువస్తా."

వోల్లోవ్ ఎడమ చేతితో కత్తి ఒర గట్టిగా పట్టుకుని తొందర తొందరగా వెళ్ళాడు. నడవలోని గడియారం విచారంగా టిక్ టిక్ మంది.

"తొమ్మిదీ యిరవయి? వీళ్ళ దుంపతెగ!"

గడియారం పదినిమిషాలు ముందుకు తిరుగుతోంది.

బామన్ కొట్టుగుమ్మంలో కనిపించి, "యింకా యేం జేస్తు న్నారు? యిప్పటికే యిరవయి నిమిషాలు ఆలస్యమయింది." అన్నాడు.

"మరేం పరవాలేదు ఆ యిరవయి నిమిషాలు కూడ దీస్తాలేం గర్సీక్! మత్తుమందు కలుపుదాం. ఆ వెధవ రమ్ము కాస్త పారపోయి."

గర్సీక్ తన లోటాలో కొంత, మార్క్స్‌మర్ లోటాలో కొంత రమ్మపోసి మెత్తవెనక కొంత పారపోసాడు. ఘాటు వాస నతో కొట్టునిండిపోయింది,

"యిక ? 'మందు' వేదాం"

మార్స్కమన్ ఆకుపచ్చని చీటి అంటించిన గొట్టం చేతిలో పట్టుకుని సిద్ధంగా ఉన్నాడు దానిమీద.

పైపూతకు మాత్రమే—అని వ్రాసిఉంది.

"పట్టుకో ! చాలు"

కాని మార్స్కమన్ మొండిగా తలఊపి, "అదంతా నీ కెందుకు ! యెంత వేయాలో నాకు తెలుసు. ప్రయోగ సందర్భంలో యీ చెత్త పందికొక్కులాగా యెంత తాగానో నీకు జ్ఞాపకం లేదూ ?"

గొట్టం కాస్త కాస్త పైకెత్తుతూ మత్తుమందు పోస్తున్నాడు. "జాగ్రతగా వేయకపోతే చచ్చూరుకుంటారు" అని. గొణిగాడు గర్స్కి అడుగుల చప్పుడు వినడానికి చెవులు నిక్కబొడుచుకుంటూ.

"యేమయినా సరే, యెవరినీ చంపకూడదని నిర్ణయించుకున్నాం. మరిచేబోకు."

మార్స్కమన్ పళ్ళు బయటపెట్టాడు.

"యీ నక్కల్ని చంపడమా ! ముసిడిమత్తు మందు పౌను వేసినా వీళ్ళనేం చంపిచావదు. లొట్టలు వేసుకుంటూ తాగుతారు."

గొట్టం ఖాళీ అయిపోయింది. జొంతకింత దాచి సీసా బాగా కుదిపాడు. ఇంతలోకే తలుపు తెరుచుకుంది. కళకళలాడుతూ రుడిన్స్కీ వారిని చూసి చిరునవ్వు నవ్వాడు. వార్డరిద్దరూ నెమ్మదిగా కాలిబూట్లు ఈడ్చుకుంటూ ప్రవేశించారు. ఇద్దరి చేతుల్లోనూ చెరోగ్లాసూ ఉంది.

సీసాలోనుంచి రమ్ము జలజలమంది. గ్లాసు పూర్తిగా నింపడమయింది. గర్స్కి, మార్క్స్మన్ తమ తమ లోటాలు పైకెత్తి,

"మీకు ఆరోగ్యం వర్ధిల్లుగాక ! మీ కోరికలు నెరవేరుగాక !" అన్నారు. రుడిన్స్కీ ఒక గుటకలో తాగేసాడు.

క్షవరం చేయించుకోక మాసిన రెండు మొహాలు ఒకే సారి వెనకకు వాలాయి. ఒకగుక్కలో రమ్ము మాయమయింది. రుడిన్‌స్కీ మీసాలు నాలుకతో తడుముకున్నాడు.

"యింకా కావాలా?" అని మాల్ట్‌స్మన్ కర్కశంగా అడిగాడు.

జవాబుకోసం నిరీక్షించకుండా మళ్ళీ గ్లాసులు నింపసాగాడు. వార్డర్లు పెదవులు కదుల్చుతూ, ఊపిరాడక కొట్టుకుంటూ, రమ్ము ధారవంక చూడసాగారు.

"చాలు" అని గర్స్కీ సీసాకోసం చేయిచాచాడు.

మార్ట్‌స్మన్ మోచేతితో అతనిని నెట్టి, "యింత పిసినారి తనం పనికిరాదు" అన్నాడు.

బొంగురుగా, ధిక్కారసూచకంగా నవ్వాడు. వార్డర్లు అతి వినయంతో కులుకి నమస్కరించి రెండుగ్లాసుల రమ్ము తీసుకున్నారు.

హఠాత్తుగా రుడిన్‌స్కీ మోకాళ్ళు వణకడం ప్రారంభించాయి. నోటికి గ్లాసు దూరమయింది, పెదవులు గ్లాసును మళ్ళీ కొరుచుకున్నాయి. ఉక్కిరి బిక్కిరవుతూ, చొక్కామీద, నేల మీద పారపోసుకుంటూ తాగేసాడు. బడాయి ప్రదర్శించడానికి బల్లమీద పెట్టుతున్నవాడిలా గ్లాసు పట్టుకుని వదిలేసాడు. గ్లాసు పగిలి గాజుముక్కలు టింగుటింగు మని కొట్టు నలుమూలలా పడ్డాయి. అతను వికటంగా నవ్వి మెడపట్టీ దగ్గరనుంచి చొక్కాపక్కవరకు తుడుచుకుని, గుండీలు ఊడతీసుకుని, నాలుగు తిట్టి, గిర్రున తిరిగి గుమ్మంలోకి వెళ్ళాడు.

రుడిన్‌స్కీని చూసి వోల్లోవ్ తాగడం కట్టిపెట్టివేసాడు. ఎర్ర బారిన కళ్ళల్లో భయం తళుక్కు మంటుంది. గ్లాసు కిందబెట్ట బోతూంటే మార్ట్‌స్మన్ అతనిచేయి పట్టుకుని,

"పిచ్చా? తాగేసెయ్" అన్నాడు.

వోల్టోవ్ కళ్ళు గట్టిగా మిణకరించి ఒక మెత్తమీద వెళ్ళి కూర్చున్నాడు.

"ఊం- తాగు" అని మార్సమన్ దబాయించాడు, నేలను కాలుతో తన్నుతూ.

కళ్ళజోడు ముక్కుమీదనుంచి జారిపడిపోయింది. గర్స్కి కొయ్యబారిన వార్డరు వేళ్ళలోనుంచి గ్లాసు లాగేసాడు.

"అప్పుడే వీడిపని అయిపోయింది. చూడు, కళ్ళు గాజు కళ్ళలా యెలా తయారయయో! యెక్కువ వేస్తున్నావని చెప్పి తినిగా!

మార్ట్సమన్ ముభావంగా అవతలవేపుకు తిరిగి కళ్ళజోడు సరిచేసుకున్నాడు.

"మరేం పరవాలేదు, చావడులే"

వోల్టోవ్‌ను బుజంపుచ్చుకుని తోసాడు, తోయగానే వార్డరు మెదలకుండా సాగిలపడ్డాడు.

ఇంతలో బ్రాబావస్కీ, బామన్ దుప్పట్లు కప్పిన బొంతను తీసుకుని వారి కొట్టుముందుగా పరుగెత్తుకుంటూ వెళ్ళారు.

"రుడిన్‌స్కీ వార్డర్ల గదికి వెళ్ళాడు." అని కేకపెట్టాడు బామన్ వెళుతూ వెళుతూ.

"యెవరూ రాకముందే త్వరపడడం మంచిది."

గర్స్కి గుమ్మంలోనుంచి ఆఖరుసారిగా కొట్టులోపలికి చూసాడు.

"యేమీ మరిచిపోలేదు గదా?"

"యీ 'శవాన్ని' తప్ప యింకేమీ మర్చిపోలేదు" అన్నాడు మార్ట్సమన్ ఇకిలిస్తూ, వోల్టోవ్ కేసి వేలితో చూపుతూ.

ఆ మందు మోతాదు ముందుగా తాను పుచ్చుకుని పరీక్షించుకున్నాడుగా! వార్డరు బిగ్గరగా గురక పెడుతున్నాడు. టోపీ నలిగిపోయింది. తల తలగడామీద వేలాడుతోంది.

"చూడు, మనం చచ్చేటంత మందిస్తామని భయపడితివిగా నేను చెప్పలా..."

మాట పూర్తి కాలేదు. ఆవరణలోకి తెరుచుకున్న కిటికీగుండా నడవలోకి యుక్రేనియన్ పాటకు ఆటకు చెందినమాటలు, టిన్నుడబ్బాల మోతలు వినిపించాయి.

"యిదిగో నాజొన్నరొట్టె ఇంక నడువుదారిబట్టి"

"అప్పుడే? ఏం జరిగిందో?"

పరారీవిషయం తెలిసిన ఖైదీలతో ఏర్పాటు జరిగింది. ఆ ఏర్పాటు ప్రకారం ఇస్కా-రిభాగంలోని గడబిడ వినిపించకుండా వారు రాజకీయఖైదీలభాగం సింహద్వారంచుట్టూ మూగి గొడవ గొడవగా పాటపాడాలి. భవంతినుంచి ఆఖరికి వెళ్ళే గర్స్కి సంకేతం ఇస్తాడు. గర్స్కి సంకేతంకోసం ఆగకుండా మొదలు పెట్టారంటే, దానిఅర్థం...

గర్స్కి, మాల్ట్స్‌మన్ కొట్టులోనుంచి గబగబా చక్కా వచ్చారు. కాని పడవలో రుడిన్‌స్కీ దారిని అటకాయించాడు. అతనిమొహం నిప్పు కుంపటిలా ఉంది. కళ్ళు మందకొడిగా భీతావహంగా ఉన్నాయి. అటూఇటూ తూలుతున్నాడు. పరుగెత్తుతున్న ఖైదీలనుచూసి 'యేయ్' అని అరిచి నేలమీద కూలబడిపోయాడు. కాని వారు అతనికి సూటిగా వచ్చేసరికి మెల్లిగా నడవ మధ్యలో పడి పెద్దపెద్ద చేతులుజాపి,

"సహాయం చేయండి. వాళ్ళని అటకాయించండి" అని అరిచాడు.

గర్స్కి ఏదోవిధంగా పక్కకు దూకగలిగాడు. ఒక అడుగు వెనకనడున్న మాల్ట్స్‌మన్ ఊపిరి పీల్చుకోవడానికి ప్రయాసపడుతూ ఆగిపోయాడు.

ఆవరణలోనుంచి సంగీతం ఇంకా జోరుగా దగ్గిరగా వినిపిస్తోంది. ఇస్కాన్‌వారు తప్పించుకుపోతున్నారన్నమాట. ప్రతినిమిషమేకాదు, ప్రతి సెకనూ అమూల్యమయిందేనని స్పష్టంగా తెలుస్తూనే ఉంది.

"కుడివైపున పట్టేసెయ్" అని గర్స్కీ మెల్లిగా చెప్పాడు. దృఢనిశ్చయంతో రొమ్ము విరుచుకుంటూ, ఎడమవేపుకివెళ్ళి దెబ్బ తీయడానికి పిడికిలి బిగించి సిద్ధంగా ఉన్నాడు.

"తోలుపటకాతో కట్టేసేద్దాం."

"ఊఁ అలాగే కానీ" మాల్ట్సమన్ రోగిలా మందహాసంచేసి ఒక అడుగు వెనక్కి వేశాడు. "తెలివిలోవుంటే మనబోటివాళ్ళని పదిమందిని పడేసేసేవాడు. తాగివున్నమీదట...స్టూలుబల్లతో అప్పుడే ఒక దెబ్బ కొడితే బాగుండిపోయేది."

"రక్తపాతం జరగకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాంగా" అన్నాడు గర్స్కీ పళ్ళసందుల్లోంచి, వంటిబరువును ఒక కాలిమీద నుంచి ఇంకో కాలిమీద మోపుకుంటూ.

ఈ పిచ్చి రాక్షసుడిమీద పడితే వాడి భల్లూకపు పట్టులో చిక్కుకునే ప్రమాదం ఉంది. లేకపోతే స్టూలుబల్లమీద కొట్టడమా ?

రుడిన్స్కీ వేళ్ళతో గాలిని పట్టుకుంటున్నాడు. హఠాత్తుగా అతని మందకొడి కళ్ళల్లో పిచ్చి వెలుతురు కనిపించింది. నడవలోకి జాపుకున్న అతని కాలిమీదనే అతని దృష్టి పడింది. వెర్రికోపంతో సగం లేచాడు. తన బూటు ముందుభాగాన్నే గోళ్ళతో గట్టిగా పట్టేశాడు. రుడిన్స్కీ ప్రయాసతో మూలిగి, "దొంగవెధవల్లారా, చిక్కారు" అన్నాడు.

అతని వెనకగా గోడవెంటే రెండు నీడలు జరిగిపోయాయి. మాల్ట్సమన్, గర్స్కీ మొదటిమెట్టుకు చేరుకుని రెండు రెండు మెట్లు చొప్పున దాటుతూ కిందికి పరుగెత్తారు. గర్స్కీ ఒక సెకండు ఆగి,

"యేం జరిగింది ?" అని అడిగాడు.

"ఆవరణలోనుంచి మనల్ని గెంటేస్తున్నాడు."

"యెవరు ?"

"సులీమా, విపరీతంగా తాగేసాడు. లేదు అంటే ఒప్పుకోవడం లేదు. వెనక్కి తిరగడం మంచిది."

"వెనక్కి తిరగడమా? ఉహూఁ—నేనా?"

చుట్టూ ఉన్న జనాన్ని భుజాలతో తోసేస్తూ, పిల్లవాడిలాగా కటకటాల చువ్వను పట్టుకుని కిందికి జారాడు. ఆవరణనుంచి బయటికి వెళ్ళే గుమ్మంలో సులీమా నిలబడ్డాడు. ఇద్దరు వార్డర్లు చెరోవైపునా ఉన్నారు. సులీమా చేయి ఊపుతున్నాడు. ముందు ఖైదీలు చాలా మంది గుంపుగూడి అసమ్మతి తెలుపుతున్నారు. చివరనున్నవారు బిగ్గరగా పాడుతున్నారు. తాళాలు ఎవరో పిచ్చిగా వాయించేస్తున్నారు. ఈ గందరగోళంలో సులీమా గొంతు వినిపించడమే లేదు.

గర్స్కి కటకటాల వెంటే కిందికి వడివడిగా జారి సులీమాను, వార్డర్లను దాటిపోయాడు.

"యెక్కడికి వెళ్ళడం?" అని కేకపెట్టాడు సులీమా, "మీ మీ కొట్లకి వెళ్ళిపోండి."

కాని గర్స్కి వెళుతుంటే వెనక జనం కమ్మేసారు. అంగలు వేసుకుంటూ గబగబా వెళుతూంటే దోవ ఇచ్చారు.

"మాల్ట్స్‌మన్ యెక్కడవున్నాడా?"

"యిప్పుడే వచ్చాడు. గర్స్కి! యేదీ నీ చెయ్యి"

ఎవరో స్నేహపూర్వకంబుగా అందించిన చేతిని అందుకుని కరచాలనం చేసి కాపలా పోలీసుస్థానం దగ్గరికి వెళ్లాడు.

'కుక్కగొడుగు' దగ్గర ఎవరూ లేరు. జనం ఇంకా ముందుకు వెళ్లారు. ఏకాంత నిర్బంధితులభాగం ద్వారపు నీడల్లో కదలిక కలిగింది. ఎదురు రొమ్ముమీద తలవాల్చుకుని, సున్నీ నేలవేపు పెట్టి, తుపాకీ చేతిమీద వేసుకుని కాపలాపోలీసు దీపంకింద నిలబడ్డాడు. దగ్గిరలో టిట్వినోవ్; భామన్, సిల్విన్ ఉన్నారు. చేతులమీద దుప్పట్లు వేసుకుని ఆవరణలో పచార్లు చేస్తున్నారు. గర్స్కి కనిపించగానే పిలిచి "తొందరగా వెళ్ళు. మాల్ట్స్‌మన్ యిందాకనే అక్కడికి చేరుకున్నాడు, నువే ఆఖరివాడివి."

గర్సీక చీకట్లో మాయమయాడు. ఖైదీలంతా వారి వారి కొట్లకు తిరిగి వెడుతూంటే ఈ ఖైదీ ఆవరణలో చాలాదూరం ఎందుకు వెళ్ళుతున్నాడా అని ఆశ్చర్యపడుతున్నట్లు కాపలాపోలీసు తల ఎత్తాడు. చీకటింటిలోకి చూస్తూ గర్సీక వెంటబడ్డాడు. కాని బామన్ దుప్పటి మెల్లిగా విప్పుచూ అతనిని వెంబడించాడు.

లిట్వినోవ్ ఒక్క దెబ్బ కొట్టేసరికి కాపలా పోలీసు చేతిలో తుపాకి కింద పడిపోయింది. సిల్విన్ బుజాలు పట్టేస్తాడు. ఒక్క క్షణంలో అతని నోరు నొక్కేసి తలమీద దుప్పటి కప్పేసారు. కాపలా పోలీసు నేలమీద పడిపోయాడు. ఇంకా రెండు దుప్పట్లు అతనిని చుట్టవేశాయి.

ఇదిగో జొన్నరొట్టె ఇంక నడుపు దారిబట్టి

గుంపు చివరిజనం 'కుక్కగొడుగు' దగ్గర కొట్లాట విని వెనుదిరిగి చూసే ఉంటారు. ఏం జరుగుతున్నదీ చూశారా? కాపలా పోలీసు కిందపడడం, ముగ్గురు మనుషులు అతనిని గోడదగ్గరకు లాగుకుని వెళ్ళి చేతులతో మోకాళ్ళతో అణచిపెట్టడం చూశారా? సంగీతం, తాళాలజోరు ఇనుమడించింది. అంటే వారిదంతా తప్పకుండా చూసే ఉంటారు.

కాపలా పోలీసు కేక పెట్టాడా? లేదు. సిల్విన్ రొప్పుకుంటూ కాపలా పోలీసును తాటితో బంధించడానికి యత్నిస్తున్నాడు.

"గట్టిగా అణచిపెట్టండి" అని లిట్వినోవ్ మెల్లమెల్లగా చెప్పాడు. "పైకి మీరు వెళ్ళవలసిన సమయం రాగానే నెజ్నమోవ్ సైగ చేస్తాడు. అదిగో, అక్కడ ఆమూల నిలబడ్డాడు. రూక్! తుపాకీలోనుంచిగుళ్ళు తీసేసాను? ఎక్కడుంది?"

కాని బామన్ అప్పటికే చక్కా బోయాడు. బోర్లాపడ్డ కాపలా పోలీసు వీపుమీద మోకాలుతో గట్టిగా అణచివేస్తున్నాడు. కాపలా పోలీసు చచ్చినవాడిలా కదలడంలేదు. ఊపిరాడక చావలేదు గదా? ఉహు – అసంభవం. నటిస్తున్నాడు. అంతే.

ప్రహరీ గోడదగ్గర అప్పుడే 'ఏనుగ' ఏర్పడింది. మధ్యమధ్య 'ఏనుగ' చెదిరిపోయింది. కాని వారుమాత్రం పట్టు విడవకుండా యత్నిస్తూనే ఉన్నారు. నిచ్చెనకు కట్టిన గాలం ఇసుకమీద పడిఉంది. దాని సన్నటి పళ్ళు కనిపిస్తున్నాయి.

"యింకా మొదలు పెట్టలేదేం" అన్నాడు గర్స్కి వరుగెత్తుకుని వస్తూ.

" నీకోసం, లిట్వినోవ్ కోసం యెదురు చూస్తున్నాం " అని క్రోక్‌మాల్ జవాబిచ్చాడు అతి మెల్లగా.

" యెదురు చూస్తున్నారా ? చేయి అందివ్వండి "

'ఏనుగ' అడుగు భాగంలోని మనుషుల బుజాలమీద, చేతుల మీద మోకాళ్ళు నొక్కిపట్టి గర్స్కి పైకి ఎక్కి గాలం అందించాడు. గాలం తీసుకొని గోడమీదికి విసిరాడు. గోడమీది ఇనప కమ్మీలకి తగిలి గాలం పళ్ళు ఖణీలుమన్నాయి. బలమంతా ఉపయోగించి గర్స్కి లాగి చూసాడు. ఇనుము ఇనుము రాసుకున్న చప్పుడయింది.

గోడకు జార్లవేసిన నిచ్చెన మీదుగా ఎక్కి నుదురుమీదికి చేరుకున్నాడు. గాలానికి కట్టి ఇంకో తాడు ఉంది. ఈ తాడును గోడమీదుగా కిందికి జారవిడిచి దాని వెంబడే కిందికి దిగాడు. అవతల హోరుబయలు!

వెనువెంటనే 'ఏనుగ' చెదిరిపోయింది. 'ఏనుగ' పైభాగంలోని మనుషులిద్దరు కిందకు దిగకుండా నిచ్చెన పట్టుకుని పైకి ఎక్కారు. ఒకరి నొకరు తోసుకుంటూ ఆలస్యం చేయకుండా దిగవలసిన వరస క్రమం ముందే నిర్ణయించు కున్నారు.

మూలలో నిలబడి హెచ్చరిక చేయవలసిన నెజ్నమోవ్ వారొక్కొక్కరూ దిగుతూంటే ఆదుర్దాగా లెక్కించాడు

"-అయిదు, ఆరు—ఆరి దేవుడా, ఇంత ఆలస్యం చేస్తున్నారే?"

తొందర తొందరగా దిగడంలో ఇస్క్రావారి మోకాళ్ళు ఇటు కలకుతగిలి గీసుకుపోయాయి. వారి శరీరం బరువుకు నిచ్చెన మెట్లుగా చుట్టిన—తువాళ్ళు, పక్క దుప్పట్లు విడిపోయాయి.

"...ఏడు...ఎనిమిది..."

సిల్విన్‌కి సైగచేయవలసిన సమయం వచ్చింది. అతను ఇంకా కాపలా మనిషిని అణిచిపెట్టే ఉంచాడు.

నెజ్నమోవ్ ముందుకు కదిలి వెనువెంటనే గోడ నీడలో దాక్కోవడానికి దానిని ఆనుకున్నాడు. పాట ఆగిపోయింది. మిగిలిన రాజకీయ ఖయిదీలు బూట్లకు అంటుకున్న ఇసుక దులుపుకుంటూ సులీమానుదాటి భవనంలోకి వెళ్ళిపోతున్నారు. వారిద్దరూ చెరో దీపం పట్టుకొని ఇరుపక్కలా నిలబడగా కాప్టన్ ఎవరన్నా ఇంకా తచ్చాడుతున్నారేమోనని ఆవరణలోకి దృష్టి సారించాడు. కాపలా పోలీసు లేకపోవడం చూసి తప్పకుండా పిలుస్తాడు. అపుడు ఆ ముగ్గురు ఆవరణలోకి వెళతారు. వారి దీపాల వెలుగులో కాపలా పోలీసు మీద సిల్విన్ వంగి వుండడం, ఇక్కడ తాను నెజ్నమోవ్, నిలబడి ఉండడం సులీమా చూస్తాడు. నెజ్నమోవ్ వెనకకు తిరిగి చూశాడు. గోడమీద నీడలు కనపడలేదు. ఒక సెకండుకిందఇక ఇపుడు ఖాళీగా ప్రశాంతంగా ఉంది. అంటే అంతా తప్పించుకొని పారిపోయారన్న మాట!

భవంతి అంతటా కేక ప్రతిధ్వనించింది. పై నడవలో గ్లాసు బద్దలయింది, ఉన్మాదంతో బొంగురుపోయిన గొంతు

"పట్టుకోండి, పట్టుకోండి."అని అరిచింది.

సులీమా, వార్డర్లు తటాలున వెనుదిరిగి నడవ వెంబడే పరుగెత్తారు. గుమ్మం తెరిచేఉంది. ఎవరినీ గమనించకుండా నెజ్నమోవ్ ఆ గుమ్మం వైపుకు పరుగెత్తుచూ

"పరుగెత్తండి" అని కేకపెట్టాడు.

తప్పించుకునే యత్నం విఫలమయిందా? పోలీసులు పొంచి ఉన్నారా ?

సిల్విన్ కాపలా పోలీసు మీదనుంచి లేచి, ముందుకు వంగి నెజ్నమోవ్ వెనకగా కాలి బలంకొద్దీ పరుగెత్తాడు. భవంతి కేకలతో అడుగుల చప్పుడుతో మోగిపోతోంది. సింహద్వారంలోకి చొచ్చుకు

పోయాడు. పోలీసులకు ఇస్తా—వారు తప్పించుకోవడం తెలిసిపోయిం దనే అతని నమ్మకం.

ఆఖరు మెట్టుమీద సిల్విన్ నెజ్నమోవ్‌ను కలుసుకున్నాడు. సిల్విన్‌ను చూడగానే నెజ్నమోవ్ కొయ్యబారిపోయాడు. కళ్ళు భయంతో వర్తులమయాయి.

"యేమిటి? నువు తప్పించుకోలా? కేక వేసానే..."

వెంటనే సిల్విన్ తమాయించు కున్నాడు. నెజ్నమోవ్ వాలకంలో అంతటి అపరాధం, నిరాశ గోచరించాయి.

"నిన్ను అపార్థం చేసుకున్నాను. యీవైపుకు పరు గుచ్చు తున్నావు. నేను..."

ఇలా అని వెనుదిరిగి ఒక మెట్టు కిందికి దిగాడు.

"బహుశా యిప్పుడయినా..."

ఊహ ఆవరణలో తుపాకీ మోత! టప్‌మని వినిపించింది. కాపలా పోలీసును ఎలా లొంగ తీసుకున్నదీ మనసులో చిత్రించు కున్నాడు. వాడి చేతిలోనుంచి తుపాకిని లిట్వినోవ్ పడగొట్టగానే అది కిందపడి దొర్లింది. బామన్ దానిలోని గుళ్ళు తీసేయవలసింది. అధమపక్షం దాని బోల్టు అయినా లాగివేయవలసింది.

మళ్ళీ ఇంకోమారు తుపాకీమోత సిల్విన్ వికటంగా నవ్వాడు.

"వాడు బతికే వున్నాడు. వూపిరాడక చస్తాడేమోనని బాధపడ్డా. అంతా వెళ్ళిపోయారా?"

నియమిత స్థానమును వదిలివెళ్ళిన అపరాధిలాగా నెజ్నమోవ్ సిగ్గుపడి.

"ఆఁ—" అని గొణిగాడు, దృష్టి ఇంకోవేపుకు మరల్చి, "లెక్క—పెట్టాను".

కాని ఈమాటను అంటూంటే అతని మనస్సు కుంగిపోయింది. తొమ్మిదిమందిదాకా లెక్క—పెట్టాడు. సిల్విన్ కాకుండానే పదకొండు మంది వెళ్ళి ఉండాల్సింది.

'ఏకాంత నిర్బంధ' నడవలో సులీమా గొంతెత్తి!

" మీ మీ కొట్లలోకి వెళ్ళండి. తలుపులు తాళాలు వేయండి" అని కేకలుపెట్టడం వినిపించింది.

కాని ఖైదీలు కదలలేదు. సీనియరు వార్డరు రుడిన్‌స్కీ చుట్టూ నిలబడ్డారు. తప్పతాగి ఒళ్ళు తెలియకుండా నడవమధ్యలో సాగిలా పడి గురక పెడుతున్నాడు రుడిన్‌స్కీ.

కిటికీ కింది హెచ్చరిక గంట మోగింది. మామూలు నేరస్తులు తప్పించుకొనడానికి యత్నించిన నాటి రాత్రి ఏం జరిగిందో ఇవాళ కూడా సరిగ్గా అదే జరిగింది.

" మీమీ గదులకు వెళ్ళండి. హాజరుపట్టీ వేయండి"

# 38

# తుంగ ముక్కలు

జైలుదుప్పట్లతో నిచ్చెనతయారు చేసారని తేలిపోయింది. ఇస్కాన్ మనుషులు తొందర్లో ఉన్నారేమో, వారి శరీరాల బరువు రెట్టింపు అయింది. నిచ్చెన మెట్లకు చుట్టిన దుప్పటిగుడ్డ చినిగి పోయింది. మెట్లు వదులయి తొలగిపోతున్నాయి. బామన్‌వంతు వచ్చేసరికి నిచ్చెన ముక్క ముక్కలయింది.

"యింకా తొందరగా" అని కిందనుంచి ఎవరో అరిచారు ఇంకా ముగ్గురు ఎక్కాలి. అనాలోచితంగా బామన్ ఊగుతున్న నిచ్చెన మెట్లనుకున్నాడు. మెట్టు ఊడిపోయింది. బామన్ కింద పడ్డాడు. చీలమండలో నెప్పి బయలుదేరింది. లేచి కూర్చున్నాడు. గోడపైకి చేరుకోలేననే నిరాశ ఒక క్షణం అతని మనసులో మెరిసింది. మళ్ళీ ప్రయత్నించాడు. మళ్ళా కిందపడ్డాడు. లేచి నిలబడాలని యత్ని స్తూండగా ఆఖరిమనిషి గోడమీద మాయమయాడు. మూలనుంచి నెజ్నమోవ్ ఏదో అరిచి పరుగుత్తుకుని వెళ్ళిపోయాడు. ఆవరణంతా నిశ్శబ్దంగా ఉంది. ఒక నిమిషం గడిచిందో లేదో తుపాకిమోత విని పించింది. 'కుక్కగొడుగు' దగ్గిర జరిగిన దొమ్మీలో తుపాకీనుంచి గుళ్ళు తీసివేయడం మరిచేపోయిన సంగతి గుర్తుకు వచ్చింది. గుళ్ళు తీసివేయడం అతనివంతు. ఆవరణ ద్వారంలో ఒక నీడ పొడగట్టింది. రెండోతడవ తుపాకిమోత వినిపించేసరికి అది గురిచూసి కాల్చిందేనని అతను గుర్తించాడు. గుండు ఎక్కడో దగ్గరలోనే వచ్చిపడింది. ఎంతో కష్టంమీద బామన్ పైకి చేరుకున్నాడు. గోడమీద ఇనుపతీగ చేతికి తగిలింది. వెంటనే గోడమీదుగా కిందికి దొర్లాడు.

ఎలాగయితేనేం గోడ దాటాడు! గోడ అవతలికి చేరుకోగానే కాపలా పోలీసుల పాదాలకింద బాగుగా నలగిన కాలిబాటవెంటే

బయలుదేరాడు. చుట్టూ దట్టంగా ఎత్తుగా పెరిగిన తుంగలోకి ఆదా దారితీసింది. ఒక లోవ అడుగుకు వెళ్ళి పరుగెత్తసాగాడు. కాలికి దెబ్బ తగిలింది, ఒకబూటు మడమ ఊడిపోయింది. అలాగే సాధ్యమయినంత వేగంతో పరుగెత్తాడు. చీలమండ బెణకడం ఇది రెండోసారి.

లోవ పాములాగా కుడివేపుకి ఎడమవేపుకి వంకరలు తిరిగింది. నేల బురదగా ఉంది. ఇటీవల కురిసిన వానలకు రేగడిమట్టి తడిసి సాగి కాలుజారింది. అప్పటికే రెండుసార్లు కాలుజారింది. బురద బట్టలకు కొట్టుకుంది. చేతులు బురదఅయాయి. లోవ అతనిని ఇంకా ఇంకా ఎడమవేపుకి తీసుకు వెళుతోంది. అతను వెళ్ళవలసిన మార్గం అదికాదు. గోడవెంబడే హైరోడ్డుకు సూటిగా కుడి పక్కగా వెళ్ళమని చెప్పారు. లోవ వెంటే నడిస్తే దోవ తప్పడం ఖాయం.

నిటారుగా ఉన్న సానువు ఎక్కాడు. అక్కడా ముళ్ళపొదలు, తుంగ, దట్టంగా పెరిగి ఉన్నాయి. ఏమయినా వినిపిస్తుందేమోనని ఆగాడు. అంతా నిశ్శబ్దం. ఆకు కూడా కదలాడడం లేదు. మేఘాలు ఆకాశాన్ని కమ్మివేసి నేలనుకూడా తాకుతున్నట్టున్నాయి. ఇస్త్రాకా వారంతా ఆవేపునుంచే బయలుదేరినా ఎక్కడా ప్రాణి అంటూ కనిపించలేదు. అంత వెనకపడిపోయాడా?

రోడ్డుకు అడ్డంగా సెలయేర్లు, పిల్లకాలవలు! కాలికింద బురద జారుతోంది. ఎక్కడికి వెళుతున్నదీ, సరయినదోవ పట్టిందీ లేనిదీ బామన్‌కు తెలియలేదు. నాడ్యా అతని కోసం హోటలులో ఎదురు చూస్తుంటుంది. కాని ఈ పరిస్థితిలో అక్కడికి చేరుకోవడం సాధ్యం కాదు. ఆమె వచ్చిఉందని అతనికి తెలియజేసారు. అతని కాలిజోడు, దుస్తులు బురద అయిపోయాయి. హాటు లేదు. ఒక బూటు మడమ వేలాడుతోంది. ఇవన్నీ అతనిని పట్టిస్తాయి. హోటలులో అడుగుపెట్టిన మరుక్షణంలో అరెస్టుచేస్తారు.

ఇక హోటలుకు వెళ్ళే సమస్యేలేదు. అంటే...

ఇస్త్రాకాని బలపర్చేవారు అరెస్టుకాక పూర్వం కీవ్‌లో భద్రంగా ఉండే కొన్ని ఇళ్ళ చిరునామాలలో ఒకటి జ్ఞాపకం చేసుకోవాలి. కీవ్‌లో ఉండగా హోటలులోకి మారకముందు, క్రోక్‌మాల్ బసలో

ఒక రాత్రి గడిపాడు. కాని ఇపుడక్కడకు వెళ్ళడానికి వీలులేదు. రీటాార్నాయా వీధిలో ఏడో నెంబరు ఇంటికి వెళ్ళవచ్చు. కాని గది నెంబరు జ్ఞాపకంలేదు. కళ్ళు మూసుకుని గట్టిగా ఆలోచించాడు. ఆ నెంబరు అతనిని కికురించింది. బహుశా అతనికి ఆ నెంబరు తెలియదేమో! ఒకమాటు అక్కడికి ఎలా వెళ్ళారో చెప్పారుగాని అతను వ్రాసుకు పెట్టుకోలేదు.

ఇంకో లోవకు చేరుకున్నాడు. ఆ ప్రాంతంలో హైరోడ్డు ఉన్న సూచనలేమీ కానరాలేదు. ప్రదక్షిణం చేస్తున్నానని బామన్ భావించుకున్నాడు. చాలాసేపునుంచి నడుస్తున్నాడు. జైలు అవతలి బంజరు ఇంత విశాలమైందికాదు.

నిశ్శబ్దంగాఉన్న తుంగ, నిలకడగా కిందుగా వేలాడుతున్న మేఘాలు ఇంతవరకు ఎన్నడూ అనుభవించనంతటి విపరీతమయిన నిరాశాభావాన్ని, ఒంటరిభావాన్ని అతనిలో కలిగించాయి.

కాని కనురెప్పపాటు కాలంలో ఆ అనుభూతి సమసిపోయింది. ఆ కనురెప్పపాటు కాలం—ఆ చీకటిలో నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ గుర్రపుదాడు వినిపించింది. ఆ ధ్వని వెనకనుంచి రాలేదు. ఎదురునుంచి వస్తోంది. గుర్రాల బుస్సులు, ఎండుతుంగ పెళపెళలు, ఆజ్ఞలు జారీచేసే స్వరం వినవచ్చాయి. ప్రతి అక్షరం వినిపించేటంత సమీపంలో ఆ ధ్వని వచ్చేసింది.

"యెడమ వేపుకి తప్పుకో"

అది ఒక కొసాక్ దళం.

ఆ ధ్వనులకు బామన్ ప్రాణం లేచివచ్చింది. శత్రు మృత్యు పాదంతో ఆ బంజరుభూమిలో మళ్ళీ కదలిక వచ్చింది. అపాయం మసక మసకలాడే ఆ నిశీథానికి వెలుగునిచ్చింది.

జీనులమీద బాగా వంగి చేతిలోని ఈటెలతో తుంగలోనికి పొడుస్తూ ఆ రౌతులు వడివడిగా సాగిపోయారు.

బామన్ నేలకు హత్తుకుని చుట్టుముట్టిన కొసాక్ దళం మధ్యగా దోవచేసుకుని పాక్కుంటూ వెళ్ళాడు.

# 39

# అడకత్తెర

గడియారము పన్నెండు కొట్టేది.

శుభ్రంగా, సదుపాయంగా ఉన్న గదిలో దీపం వెలుగుతోంది. కొజుబా, కిరిల్ వాగ్రాన్‌కిన్, లూస్యా, లోష్యాలు ఆగదిలో కూర్చున్నారు. లోష్యా నిద్రమత్తులో తల తల్లికి ఆనించాడు.

"నిద్రవేళయింది. లోష్యా!" అంది లూస్యా అలసిపోయిన గొంతుతో. ఈమాట చెప్పడం ఇది మొదటిసారి కాదు. చాలసార్లు చెప్పింది. చెప్పినా ప్రయోజనం లేకపోయింది.

కాని ఆపిల్లవాడు ఆమెన్ను ఇంకా దగ్గరగా పొదువుకుని,

"నాన్న తొందర్లోనే వస్తారని చెపితివిగా" అన్నాడు.

లూస్యా పెదవులు వణికినాయి.

"యివాళ రాకపోవచ్చు, ఊహూఁ యివాళ రారు. బాగా పొద్దుపోయింది. అంతేకాదు, వానకురుస్తోందికూడా. వినిపించడంలే? యిక నిద్రపుచ్చేస్తాను."

కిరిల్ కంపించిపోతూ సోఫామీదనుంచి లేచాడు.

"సరే, నువేం చేయదలచుకున్నావో నాకు తెలియదుగాని, కామ్రేడ్ కొజుబా, నేనుమాత్రం వెళ్ళిపోతున్నాను. ఏదో చిక్కు వచ్చి పడిందనే నా నమ్మకం. తొమ్మిదీ యిరువయి నిమిషాలకు హెచ్చరిక చేయడమయింది. పదింటికి కొసాకులు పోల్చవస్తాయా దిగువన గుర్రాలమీద దాడు తీయడం చూసాను. అందువల్ల వ్యవహారమంతా ఏదోవిధంగా చెడిపోయి వుంటుంది. వాళ్ళు తప్పించుకుని బయటపడినట్లయితే రాజిన్ యీపాటికి యిక్కడికి చేరుకుని నాలుగో కప్పు టీ తాగేవాడే"

"కూర్చో" అన్నాడు కొజుబా మొహం బాగా చిట్లించుకుంటూ.

"ఈ వేళపుడు యెక్కడికి వెళతావు? చీకటి. పైగా వర్షం... అతన్ని వెదికి పట్టగలవనేనా నీ వుద్దేశం. బహుశా దోవతప్పి వుంటాడు."

"దోవ తప్పాడా?" అని కిరిల్ మండిపడుతూ అరిచాడు. "లూస్యా! విన్నావా? నీ భర్త దోవ తప్పాడట! కీవ్‌లో యెక్కడికయినా కళ్ళకి గంతలు కట్టుకుని మరీ వెళ్ళగలడు. పట్నం అంత బాగా తెలుసు...ఊహు – యేదో జరిగే వుంటుంది."

ఇలా అని లేచాడు. కొజుబా కోపంతో కూర్చోమని సైగచేస్తే మళ్ళీ కూర్చున్నాడు.

"యిక్కడే వుండు. యింత రాత్రివేళ జాబితాలో వున్న యింటి యింటికి పిలవడానికి వీల్లేదు. వ్యవహారమంతా చెడిపోతే యిపుడు మనం చేయగలిగిందేమీ లేదు. యెదురు తెన్నులు కాస్తూ కూర్చోడంకన్న నామర్దా యింకొకటిలేదని నాకూ తెలుసు. కాని యీ సమయంలో మనం చేయగలిగిందేమీలేదు."

గంటమోత వినిపించినట్లు వారు భావించారు. మోత బహు మందంగా ఉందేమో వారి చెవులను వారే నమ్మలేకపోయారు. కాని అందరూ అదిరిపోయారు. లోస్యా ముందుకు బిగదీసుకుపోయింది. గంట మళ్ళీ మోగింది. ఈ తడవమోత స్పష్టంగా, ఏకధాటిగాఉంది.

రాజిన్!

లూస్యా కొద్దిగా లేచి అనుమానంతో రొప్పుతూ మళ్ళీ కూర్చుండిపోయింది. ల్యోషా ఆశ్చర్యంతో ఆమె చేయిపట్టుకున్నాడు. కిరిల్ గుమ్మంలోకి వెళ్ళాడు. గంట మూడోసారి మోగింది. గంట మోగిస్తున్న మనిషి మనసు మార్చుకున్నాడా అని అనిపించేటట్లు ఈ తడవ వినిపించీ వినపించనట్లుగాఉంది మోత.

"మనవాళ్ళలోవాడే, సందేహంలేదు" కొజుబా దృఢ విశ్వాసంతో అని గుమ్మంవేపు బయలుదేరాడు.

గుమ్మంలోకి కొజుబా చేరుకోక మునుపే తలుపు తెరుచుకుంది. కలవరపడుచున్న కిరిల్ మొహం పొడగట్టింది. ఆ తరవాత ఒకవ్యక్తి కిరిల్ వెనకాలే గదిలోకి తూలుతూ వచ్చాడు. ఆ వ్యక్తి దుస్తులు బురద కొట్టుకునిపోయి ఉన్నాయి. కోటులేదు. జుట్టు చిందరవందరగా ఉంది. నుదురు విశాలంగా, కళ్ళు తేటగా ఉన్నాయి.

"రూక్!" అని కేకపెట్టి ఆ కొత్త వ్యక్తిని వణికే చేతులతో దగ్గిరసాపొదువు కున్నాడు కొజుబా. "యిక్కడికి వచ్చావేం? యెలా రాగలిగావు? నీ కింకో చిరునామా యిచ్చాంగా. కాని నిను చూడగలగడం మహాసంతోషంగా వుంది."

ల్యోషా బామన్‌ను కళ్ళార్పకుండా చూస్తూ తల్లికి ఇంకా దగ్గరగా జరిగాడు.

"ఉహుఁ- యీాయన మా నాన్నకాదు. యీాయన ..." లూస్యా మొఖం పాలిపోయింది. ల్యోషా చెవిలో,

"ఊష్- ఉహుఁ- యీాయన మీా నాన్నకాదు. యీాయన వచ్చాడంటే మీా నాన్నకూడా తొందర్లోనే వచ్చేస్తాడన్న మాట!" బామన్‌తో అన్నది. "తక్కినవాళ్ళేమయ్యారు చెప్పు?"

భల్లూకంలాగా కావలించుకున్న కొజుబా కౌగిలినుంచి తప్పించుకుని'

"మాస్కోనుంచి వచ్చేసానన్నమాట. సరే. నాకు సంతోష మయింది..." అని రెండు చేతులూ లూస్యావైపుకు జాచాడు. "తక్కినవాళ్ళా? అంతా గడియారం నడిచినట్లు నడిచిపోయింది. కాని నేను, నా 'భార్య'ని కలుసుకుంటానని అనుకోలేదు. యిక్కడికి రావాలని నిశ్చయించుకోవడం మంచిదే అయిఁది, చూసావా. నాడ్యాదగ్గరకు వెళ్ళడం ప్రమాదమని మానేసాను. యీా దుస్తులతో హోటలుకు యెలా వెళ్ళను? అందుకని వెళ్ళలేదు. అందులోనూ సామానేమీా లేకుండా వెళ్ళడం యెలా?"

మందహాసంచేస్తూ బామన్ తన దుస్తులు, బూట్లు వేలితో చూపించాడు.

"తాగినవాడిలా నటించి భద్రంగా వీధిలోంచి నడిచి రాగలిగాను. అయితే పోలీసులు పట్టుకునేటంత తప్ప తాగినట్లు నటించలేదు. నా వంటినిండా బురద కొట్టుకోవడానికీ, బూటు మడమ పూడిపోవడానికీ కారణం తాగుడే ననిపించేటంత మాత్రంగానే నటించాను."

పాదం పైకెత్తి మడమ జాడించాడు. కొద్ది పట్టుమాత్రమే ఉండి ఊగిసలాడింది.

"కనిపించడంలా? యిదెంత అవస్థపెట్టిందో మీరు వూహించలేరు. ప్రాణం పోతుందనుకున్నా. అదృష్టవశాత్తు రీటర్‌స్కాయా వీధిలో నేను వెళ్ళదగినయిల్లు జ్ఞాపకంవచ్చింది. సరే, యేమయితే అవుతుందని బయలుదేరా? నా 'భార్య' యెలావుంది? వేరే దుస్తులు యిస్తే వెళ్ళిపోతా...."

బీరువా మీది గడియారంవంక కొజుబా చూడకుండా ఉండలేకపోయాడు. బామన్‌కూడా గడియారంకేసి చూసి మొగం చిట్లించుకున్నాడు.

"పన్నెండుంబావు! పొద్దుపోయింది. యేమంటావ్?"

అలసినగొంతు ఆగిపోయింది. పిల్లవాడు బతిమాలుతున్నట్టుంది. కొజుబా అనుకోకుండా నవ్వాడు.

"యేమో, నేను చెప్పలేను. మళ్ళీ తాగి యే వినోదప్రదర్శనం దగ్గిరనుంచో వస్తున్నట్టు నటించవచ్చు. అక్కడ జనం తెల్లవారగట్ల రెండింటిదాకా రెండింటిదాకా యేమిటి నాలుగింటిదాకా కూడా తాగుతూనే వుంటారు."

కాని కిరిల్ తల అడ్డంగా తిప్పాడు.

"అదేమంత తెలివిగలపని అనుకోను. అంతేకాదు, నీకు సరిపోయే దుస్తులు మా దగ్గిర లేవు" ఇంతలో బామన్ చూపులోని కలవరపాటు గమనించి వివరించి చెప్పడానికి పూనుకున్నాడు.

"రాజిన్‌కోసం యిక్కడ కాచుకొని వున్నాం. అతను మన యెకటెర్నిస్లోవ్ కామ్రేడ్స్‌లో ఒకడు. మేడేన అరెస్టుఅయినవాళ్ళల్లో వున్నాడు. అతను యిక్కడికే రావాల్సివుంది"

"రాజిన్? అని అడిగాడు బామన్ కనుబొమలు పైకెత్తుతూ. "కాని మాతో రాకూడదని నిన్న నిశ్చయించుకున్నాడు"

'యేమిటి?" "అని అరిచింది లూస్యా" తనంతట తానే వెనక వుండిపోయాడా ?"

"అవును" అని బామన్ తలపంకించాడు.

"సాహసించడం అనవసరమనుకున్నాడు. మేడే ప్రదర్శనాల సందర్భంలో అరెస్టు చేసారా. మహాపంపితే దగ్గిరప్రదేశానికే ప్రవాసం పంపుతారు. యింతేగా ?"

లూస్యా రెండుచేతులతోనూ తల పట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ,

"ల్యోషాను తీసుకుని పనిగట్టుకుని వచ్చాను. నేను వచ్చినట్లు ఆయనకి కావాలనే తెలియనీయలేదు. ఆశ్చర్యంలో ముంచెత్తాలని చూచాను. యిక్కడ కలుసుకోమని అంది"

"లూస్యా, రాజిన్ భార్య; తెలిసిందా ?" అంటూ కొజూబా వివరించి చెప్పాడు." వ్యవహారం తలకిందులయింది. భర్తకోసం లూస్యా యెంత యెదురుచూసిందో నువు చూడాల్సింది!"

"యీసంగతి అతనికి తెలిస్తేనా ?" బామన్ మెల్లిగా గొణిగాడు. "కాని అతనుచేసింది మంచి తెలివయిన పనేనని తెలియడంలా ?"

"తెలివయిన పని!" అని మాట విసిరింది లూస్యా కోపంతో రొమ్ము విరుచుకుంటూ. సరే, అలా అయితే ఆ తెలివితేటల్తోనే ఆ జైల్లోవుండిపొమ్మను నేను లేకుండా...రా, ల్యోషా!"

"అంత కోపమెందుకు ?" అన్నాడు బామన్ చిరునవ్వుతో. "యెందుకు ? కొంతవరకు తప్పునీదే. నువు యిక్కడవున్నావని అతనికి యెందుకు తెలియజేయలేదు. తెలిస్తే మాతోటే చక్కా వచ్చేవాడేమో!"

లూస్యా సూటిగా బామన్ కళ్ళల్లోకి చూసింది.

"దాంతో నాకేం సంబంధం? యెందుకీ నటన? తప్పించుకునేఅవకాశం చిక్కినపుడు ఒక్కనిముషమయినా జైల్లోవున్నవాడువిప్లవ

వాది కాదనే నాభావంతో యేకీభవించనట్లు మాట్లాడతావేం? ఆయన 'తెలివితేటల'ను, 'అంచనాల'ను నేను లక్ష్యపెట్టను. బుక్ కీపరు అయితే బావుండేది."

"మీా యిద్దరూ వట్టి చంటిపిల్లలు?" అన్నాడు బామన్ నవ్వుతూ. "యీా లోషా్య లాగానే చిన్నచిన్న విషయాలకి కూడా రాజిన్ యిలాగే మండిపడతాడు. నరోడ్నిక్లతో వాదిస్తుండగా నువు చూడాల్సింది! యీాకలు యెగిరిపోతాయి."

"యీానెలు?" అంది లూసా్య మెత్తపడుతూ. "నువు..."

బామన్ కనురెప్పలు బరువుగా మూసుకున్నాయి. తూలి సోఫాలో కూర్చున్నాడు. లూసా్య భయంతో అతని మీాదికి వంగి "దెబ్బ తగిలిందా?" అని అడిగింది.

"ఊఁ" బామన్ తల పంకించాడు.

"ఉహు - బాగా అలసిపోయాను. అంతే, రెండు రోజులనించీ నిద్రలేదు. యిక్కడికి రావడానికి చాలాసేపు పట్టింది. అయినా అలిసి పోవడం నిజంగా పరువుతక్కువే..."

సోఫామీాద కాళ్ళు చాపుకుని, చిందరవందరగా తడిగాఉన్న తల దిండుమీాద పెట్టుకున్నాడు.

"కా్రమేడ్!" అని కిరిల్ పిలిచాడు గాని బామన్ జవాబియ్య లేదు. మొద్దునిద్ర పట్టింది. కిరిల్ కొాజుబావంక ప్రశ్నార్థకంగా చూసాడు.

"యిపుడేం చేదాం. కా్రమేడ్ కొాజుబా?" అని అడిగాడు. "యిక్కడ వంటరిగా వదిలిపోలేం. సోదా దళం వచ్చిందంటే యిట్టే గుర్తుపట్టేస్తారు. శుభ్రంగా గడ్డం గీకి, జుట్టు కత్తిరించవలసింది. అపుడు మొహం మారిపోతుంది.

"నిద్రపోనీ" అన్నాడు కొాజుబా ని కిరిక్ తప్పుకోమని చేతితో సైగచేస్తూ, "బాగా అలిసిపోయాడు! శుభ్రంగా క్షవరంచేసినా, యీా రాత్రిగనక వాళ్ళ కంటపడితే, యింత అలసిపోయినవాడిని చూడగనే వాళ్ళు ఈ పెద్దమనిషెవరో గుర్తు పట్టలేరంటావా? నిద్ర పోతున్నపుడు పట్టుకోవడం తేలిక. నిద్రపోయే మనిషి శవంతో

సమానం. చూడ్రా, అరచేతులు యెలా రక్తంతో తడిసాయో! తాడు ఒరుసుకు పోయిందో యేమో! గుర్తు పట్టేస్తారు." ప్రేమతో నిద్రపోతున్న వ్యక్తి ప్రశాంత మొహంకేసి చూసాడు. "మనం నిజంగా చేయవలసింది దుస్తులు, ముందుగా బూట్లు తీసేసెయ్యాలి."

"యేమో, నాకేమీ తెలీదు" అంది లూస్యా ఆలోచనా పూర్వకంగా. "అవసరం పడుతుందేమోనని ఒక బూట్ల జతకూడా తెచ్చాను. కాని రాజిన్ (ఆపేరు ప్రస్తావించి మొహం చిట్లించుకుని నిట్టూర్చింది) పాదాలు చిన్నవి."

"అబ్బే!" అంటూ కొజుబా అడ్డువచ్చాడు.

"ఆంగుస్తాను ముక్కకయినా పెట్టుకోవచ్చు. ఆబూట్లు యిలా యిచ్చి నువ్వువెళ్ళి ల్యోషాని నిద్రపుచ్చు. యిక నువ్వు చేయవలసిందేం లేదు"

లూస్యా గడియారంకేసి చూసింది.

"యీాయన యిక్కడికి చేరుకున్నాడని నాడ్యాకి తెలియ జేయడం మంచిది. ల్యోషాని నిద్రపుచ్చి వెళతాను. సరే. యెవరూ అనుమానించరు. అతనికి కష్టం కలిగించడమెందుకు? నా అభిప్రాయం సరయిందేనా?"

"ఆఁ" అంటూ కొజుబా ఆమెతో ఏకీభావం తెలియ జేసాడు. "నిద్రపోవడం మనిషికి చాలా అవసరం. అలసట తీరితే నెత్తి మీద చంద్రమామనయినా తెచ్చి యీయగలడు. సరే! వెళ్ళు. యిక యితని దుస్తులు తీసేస్తాం"

కొజుబా దృఢనిశ్చయంతో బామస్ పాదంనుంచి చినిగిపోయిన బూట్లు ఊడపెరికాడు.

"కొద్దిగా లేవనెత్తండి — జాగ్రతగా కిరిల్ పట్లాం వూడ దీయాలి."

లూస్యా ల్యోషా, చేయ పుచ్చుకుంది. ఆ పిల్లవాడు కళ్ళుబాగా తెరిచి బామన్ వంక తేరిపారజూస్తున్నాడు.

ఇద్దరూ వెళ్ళిపోయారు. కొజుబా, కిరిల్ చినిగి మాసిపోయిన బామన్ దుస్తులు ఊడపీకుతున్నారు.

♦ ♦ ♦

దీపం మసక మసకేసింది. కిటికిలోనుంచి చంద్రకాంతి పుంజాలు పుంజాలుగా నేలమీదపడింది. గదిలో మళ్ళీ వెలుతురు—బహుశా దీపం వెలుగుతున్నపుడు కంటె ఎక్కువ వెలుగుగాఉంది.

బామన్‌కిరుకొత్త చొక్కా తొడిగారు. సన్నటిదుప్పటి కప్పారు. గాఢనిద్ర పట్టింది.

తలుపు నెమ్మదిగా తెరుచుకోవడం, లూస్యా బొటనవేళ్ళమీద లోపలికి రావడం అతనికి తెలియదు. వెన్నెలలో గది అతి విశాలంగా ఉన్నట్లనిపించింది. ఆ పిల్లవాడు పక్కతలవేపుకు వెళ్ళి గుమ్మం మొహంగా తిరిగి, భయంకరమయిన అడకత్తెర—పళ్ళు కనిపిస్తున్నాయి. చేతిలో కత్తి—నేలమీద పెట్టాడు.

"యిక యెవరూ లేవరులే" అన్నాడు ల్యోషా వెళుతూ వెళుతూ.

# 40
# రహస్య పేటిక

ఆ ఉదయం వాతావరణం చలిచలిగా ఉంది. కీవ్‌లో సెప్టెంబరు నెలలో యిలా ఉండడం అపూర్వం. పట్టణమంతా సాధారణంగా పసుపు ఎరుపు కలిసిన రంగుల్తో అలరారుతుంది. మందకొండిగా, వర్షంగా ఉన్న ఆ ఉదయాన అసాధారణమయిన సంఘటన ఒకటి జరిగింది.

సోఫా చర్చిముందు చౌకులో బోగ్డాన్‌ఖ్మెలన్‌ట్స్కీ స్మారక చిహ్నం పాదపంలో గస్తీ పోలీసులకు చిన్న కొయ్యపెట్టె దొరికింది. ఆ పెట్టెమీంద పెద్ద పెద్ద అక్షరాలలో ఈ కింది మాటలు వ్రాసి ఉన్నాయి.

కీవ్ మండల పోలీసుశాఖ
చీఫ్ సూపరింటెండెంటు నోవిట్స్కీ

రహస్యం.

రహస్యం అనేమాట కింద రెండు నల్లటి గీతలు !

సార్జంటు తడబడుతూ ఈమాటలు చదివిన మరుక్షణంలో పోలీసులు అదిరిపోయి వెనకంజవేసారు. ఆపెట్టె పోలీసుశాఖవారికి, అందులోనూ ఆ శాఖాధికారికి పంపబడిందంటే, అందులో బాంబో, తుపాకి మందుగొట్టమో ఉండి ఉంటుంది. కిందటి సంవత్సరం ఒక మాటు ఇలాగే అరాచక వాదులు వీధిలో పెట్టె ఒకటి విడిచిపెట్టి వెళ్ళారు. దానికికొట్టిన మేకులు ఊడగొట్టడం మొదలుపెట్టీ పెట్టగానే పేలిపోయింది.

ఒక పోలీసును ఆపెట్టె జాగ్రత్తగా చూస్తుండమని చెప్పి ఠాణాకు ఉరుక్కుంటూ వెళ్ళాడు. వీధిమూలలలో ఒక అందమయిన స్త్రీ ఒక పిల్లవాడి చేయి పట్టుకుని తీసుకు వస్తూ ఎదురుపడింది.

సార్జంటు ఆమె పక్కగా పరుగెత్తుకుంటూ వెళుతూంటే చూసి పక్కన నవ్వింది. ఆనవ్వుకు అతను నిలబడిపోయాడు. గౌరవంగల స్త్రీ ఉదయం ఆరుగంటలకు చౌకులో నడుస్తూండడం అతనికి అనుమానం వేసింది. ఆమెను ఠాణాకు రమ్మని అనే హక్కు అతనికి ఉంది. కాని ధ్యాసంతా ఆపెట్టెమీద ఉండి ఆమెజోలికి పోలేదు. లూస్యా ఇంకా కొంచెంసేపు అక్కడే నిలబడింది. ఆపోలీసు ఆపెట్టెను విడిచిపెట్టి కదిలేధోరణి కనిపించక పోయేసరికి ల్యోషాను ఎత్తుకుని బోగ్డాన్ ఖ్మెలినిట్స్కీ ప్రతిమ చేతితో చూపిస్తూ,

“అడుగో, పోలిష్ సేనాని, చూడు” అంది.

ఆ తరవాత చర్చినిచుట్టి బిషప్పు ఇంటెనిదాటి ఆతల్లీ బిడ్డలు వెళ్ళిపోయారు.

పెట్టె కనిపించిన విషయం అన్ని పోలీసు ఠాణాలకు టెలిఫోను ద్వారా తెలియపరిచారు. పోలీసు కమీషనరు ఆజ్ఞప్రకారం ఆ చౌకును పోలీసులు చుట్టివేసారు. బాంబు పక్కగా ఏ బండి వెళ్ళినా పేలిపోయే ప్రమాదం ఉంది. ఇటువంటి పరిస్థితిలో ఎంత కొద్దిమంది అక్కడ ఉంటే అంత మంచిది.

ఆ విధంగా పోలీసులు చుట్టుముట్టిన చౌకులో పోలీసులు, అధికారులుకాక శతఘ్నిప్రవీణుడు ఒకడు ఉన్నాడు. సైనిక ప్రధాన కార్యాలయం వారు పోలీసు కమీషనరు కోరికపైన అతనిని పంపారు. అతనుగాక మండలశాఖనుంచి ముగ్గురు పెద్ద అధికారులు, అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు, మేయరు, ప్రథమ సమాఖ్యకుచెందిన ఒక వర్తకుడు ఉన్నారు. ఆ వర్తకునికి పెద్ద గడ్డం, పుట్టెడు చెముడు. పంచదార మిల్లుకు అతను యజమాని. ఆ పెట్టె సంగతి వినిన వెనువెంటనే అనేక బహుమతులుపొందిన పందెపు గుర్రంమీద దౌడుతీస్తూవచ్చాడు. ఇక మేయరుకు ఇలాంటి విచిత్ర సంఘటనలంటే ఇష్టం. ఎక్కడయిన అగ్నిప్రమాదం జరిగిందంటే తప్పకుండా హాజరయేవాడు. అగ్నిప్రమాదపు హెచ్చరిక వినిపిస్తే ఎంతపొద్దుపోయినా సరే లేపవలసిందని నౌకర్లను ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞప్రకారం ఈతడవకూడా లేపివేసారు. పేలుడు అగ్నిప్రమాదంకన్న ఎక్కువ అలజడి కలిగించే విషయం!

ఎందుకయినా మంచిదని అగ్నిమాపక దళాన్ని కూడా పిలి పించారు. ఆ దళంవారు ప్రభుత్వ కార్యాలయం దగ్గర సిద్ధంగా నిలబడ్డారు. ఆ స్మారక చిహ్నానికి కొద్ది దూరంలోని చర్చి మూలలలో వివిధ శాఖాధికారులు గుమిగూడారు. అక్కడనుంచి చూస్తే ఆ ప్రమాదకరమయిన పెట్టె ఇనప తీగకోరడి పక్కన తెల్లటి మచ్చలా కనిపించింది.

"యింతకంటె మంచిచోటు దొరకలేదు కాబోలు!" అన్నాడు మేయరు నిందిస్తున్నట్లు తల ఆడిస్తూ. శతఘ్ని ప్రవీణుడు ఇద్దరు సైనికులతో స్మారక చిహ్నంవైపుకి అంగలు వేసుకుంటూ వెళ్ళుతూంటే మేయరు దృష్టి వారిని అనుసరించింది. ఆ శతఘ్ని ప్రవీణుడు మామూలు దుస్తులతో రొమ్ము విరుచుకుంటూ నడిచాడు గాని అడుగులు తడబడ్డాయి. "యింతకంటె మంచిచోటు దొరకదు! యిక్కడ కచేరీ, మఠం, చర్చి, ఒకటేమిటి. అనేకం వున్నాయి. పేలితే పదిహేను చర్చీల శిఖరాలు యెగిరి చక్కా పోతాయి."

"పేలదు" అన్నాడు పోలీసుశాఖ కమీషనరు.

"శతఘ్నిశాఖ ఆ విషయం చూస్తుంది. శాస్త్రీయపద్ధతులు వుపయోగించి దానిని ప్రమాదకరం కాకుండా ప్రవీణుడు చేస్తాడు. కాల్పులు కూడా జరగవు. కనిపెట్టిచూడు."

శతఘ్ని అధికారి ఆ పెట్టెమీదకు వంగాడు. చేతిలో తళతళా మెరిసే సాధనాలెన్నో ఉన్నాయి. సైనికులు అతని పక్కన కూర్చున్నారు.

"సైనికులకు మహాధైర్యం!" అని అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు తియతియ్యగా పాడాడు.

"అదిగో, సిగరెట్టు వెలిగిస్తున్నాడు" అన్నాడు. ఒక పోలీసు అధికారి ఉత్సాహంతో "సిగరెట్టు వెలిగిస్తున్నాడు, చూడండి. అంటే ప్రమాదం లేదన్నమాట!" అన్నాడు.

ఆ శతఘ్ని అధికారి నిలబడి అగ్నిపుల్ల వెలిగించాడు. ఒక నిమిషం తరవాత సిగరెట్టుపొగ వదిలాడు. సైనికుల ప్రవర్తన ధైర్యాం

గోలిపేదిగా ఉంది. పెట్టెను తలకిందులచేసి దానిమీద అనాదరంగా చేతులు పెట్టాడు.

"తప్పుడు హెచ్చరిక" అని ఆశాభంగం పొందిన అధికారులు శతఘ్ని అధికారి దగ్గరకు గుంపుగా చేరారు. వారు ఆ అధికారి దగ్గరకు వెళ్ళేసరికి అతను పెట్టెను నిర్లక్ష్యంగా ఒక తన్ను తన్నాడు.

"మరేం ప్రమాదం లేదు. సీసపుముక్కలు తప్పితే యేమిలేవు. బల్లెపుదళ నాయకుడుకూడా యివి సీసపుముక్కలే అని హామీ యిస్తున్నాడు"

సైనికులలో ఒకడు అరచేతిని టోపీమీదికి పోనిచ్చి సాల్యూట్ చేసి,

"అవును, సార్. నేను పూర్వం పైపులు తయారుచేసేవాడిని. యిది సీసపుముక్క, సందేహంలేదు" అన్నాడు.

"అక్షరాలు అరిగిపోయి సరిగా కనిపించడంలేదు. యిది **E, F, T,** లలో యే అక్షరం?"

"దీనంతటి వెనకాలా యేదో తమాషా వుంది" అన్నాడు పోలీసు ఇనస్పెక్టరు ఆలోచనాపూర్వకంగా. చేతితో వాటిని అటూ ఇటూ తిప్పుతూ, "జాగ్రత్తగా చూసారా? యీ సీసపుముక్క దేన్ని కప్పిపుచ్చడానికో?"

"పెట్టెను కదలించి చూసాం, యినస్పెక్టర్!" అంటూ శతఘ్ని అధికారి అతనిని శాంతపరిచాడు. యిందులో సీసపుముక్కలు తప్పితే మరేంలేవు పైన యీ ఉత్తరం వుంది."

ఇనస్పెక్టరు జాగ్రతగా ఆ కవరును తీసుకొని చిరునామా చూసాడు.

చీఫ్ సూపరింటెండెంటు నొవిట్స్కి

కీవ్ మండల పోలీసుశాఖ

రహస్యం.

"పేలిపోయేదేమీ యిందులోలేదని నీకు నమ్మకమేనా? యిటువంటివి అనేకం జరిగాయి. తపాలాలో పంపినవికూడ పేలాయి"

శతఘ్ని అధికారి ఆ కవరును వేళ్ళతో దులిపాడు,

"పరీక్ష చేశాను. యిందులో పేలిపోయేవేమీలేవు. యింకా అనుమానంగావుంటే యీకవరు చించడానికి అనుమతి యిచ్చిచూడు."

జవాబుకోసం ఆగకుండా కవరుచించి అందులోనుంచి నాలుగు మడతలుపెట్టిన పసుపుపచ్చని కాగితం బయటకు తీశాడు.

"అచ్చుకాగితమా ?"

ఇనస్పెక్టరు మొఖం ముడుచుకుని కాగితం మడత విప్పాడు.

రష్యన్ సోషల్ డెమాక్రెటిక్ లేబరు పార్టీ

కీవ్ కమిటీనుంచి.

మేయరు దృష్టిని మరలించుకున్నాడు. తక్కినవారి మొహాలు మండిపోయాయి. వారికి మూడు వారాలక్రితం జరిగిన ఒక చెడ్డ సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆగస్టు 18వ తేదీన ఒక జైలునుంచి పదకొండుమంది రాజకీయ ఖైదీలు తప్పించుకున్నారు. వారిలో ఒకడు కీవ్‌కు కొద్ది దూరంలో పట్టుపడ్డాడు. అతను నరోడ్నికు. తక్కినవారు మాయమయిపోయారు. ఆచూకీ కూడా తెలియదు. ఆ పదిమందీ సోషల్ డెమాక్రాట్లు, ఇస్క్రాను బలపరిచేవారు.

రాజకీయ ఖైదీలు పరారీ కావడం మూలంగా పోలీసు శాఖ శాఖంతా కుమిలిపోయింది. జారు కుమిలిపోయాడు. ఈ అతిరహస్య సంఘటన బయటికి పొక్కితే ప్రపంచం ఆశ్చర్యంతో ముక్కుమీద వేలు వేసుకునేది.

"పరారీనిగురించేనా !" అని అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు చిన్న పుచ్చుకుని అడిగాడు. "మళ్ళీ! యింతవరకు రెండు ప్రకటనలు వెలువడ్డాయి...."

"యింకా యిరవయి రెండు వెలువడతాయి" అన్నాడు ఇనస్పెక్టరు పరిహాసపూర్వకంగా, కావేశంతో కూడిన సంతోషంతో.

ఆ జైలు దేశీయశాఖామంత్రి అధికారంకింద లేదు. న్యాయ శాఖామంత్రి అధికారంకింద ఉంది. ఒక శాఖలో పొరబాటు జరిగితే ఇంకో శాఖవాళ్ళు సంతోషించేవాళ్ళు. రాజకీయ ఖైదీలు తప్పించుకోవడంవల్ల దేశమంతటా ఆశాఖ అప్రదిష్ట పాలయింది. ఒకరికి తలవంపులు జరిగితే రెండోవారు ఎందుకు సంతోషించకూడదు ?. ఎందుకు వెక్కిరించకూడదు?. ఇంతే కాకుండా ఈ వ్యవహారంలో పోలీసు శాఖకు లక్ష రూబుళ్ళు వ్యయమయింది. గొడవ పెట్టడానికి ఇదిచాలు.

"సరే, వ్లాడిమియర్ జార్జియెవిచ్! అందులో యేమి వ్రాసి వుందో చదవండి."

"యీ గొడవంతా యెందుకో అర్థంకావడం లేదు. మంత్రిగారి సేవా రజతోత్సవ సందర్భంలో అభినందిస్తూ వ్రాసిందిలాగావుంది."

"అలా అనకు!" అన్నాడు మేయరు హుందాతనాన్ని అవతలకి నెట్టి మోకాలిమీద చరుచుకుంటూ.

"అబ్బే! అదయివుండదు, మంత్రిగారు యివాళ రజతోత్సవం చేసుకుంటున్నారనుకో."

"అభినందనాలా?" అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు దీర్ఘాలు తీస్తూ అన్నాడు. ముందుకు చత్వారపు కళ్ళతో ఇనస్పెక్టరు చేతిలోని కాగితం చూసాడు. "బలే! ఆసాంతం చదవనా?"

"బిగ్గరగా చదువు" అని మేయరు వేడుకుని చెవుడు మూలంగా బాగా వినిపించడానికి చెవులలో పెట్టుకున్న యంత్రం చేతితో ఊపాడు. "అంతా స్నేహితులమేగా!"

శతఘ్ని అధికారి కోపంతో సైనికులను వెళ్ళిపొమ్మని చేయి ఊపాడు. వాళ్ళు గిరున వెనుకకు తిరిగి మడమలు టకటకలాడించి అగ్నిమాపక యంత్రశాల వేపుకు వెళ్ళిపోయారు. అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు ఉత్తరం చదువుతున్నాడు. చదువుతున్నకొద్దీ అతని స్వరంలో కావేషం పెరిగింది.

చీఫ్ సూపరింటెండెంటు నొవట్స్కీగారికి-

25 సంవత్సరాలనుంచీ మీరు కీర్తివంతంగా నిర్వహించిన పదవికి రాజీనామా యివ్వాలని తలపోస్తున్నట్లు తెలుస్తోంది ఇందుకు మేము చాలాచాలా విచారిస్తున్నాం..."

"సింగినాదం జీలకర్ర! స్పష్టంగా కనిపిస్తోందిగా!" అని ఇనస్పెక్టరు అరిచి అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు చేతిలోనుంచి ఆ కాగితం లాగివేయాలని యత్నించాడు.

"చదవడం వృథా కాలయాపన!"

"పాతమాటేగా!" అంటూ అసిస్టెంటు పబ్లిక్ ప్రాసిక్యూటరు ఇకిలించాడు. సంతోషాన్ని దాచుకోవాలని చూడలేదు. యీ 'కాల

యాపన' గురించి గొగోల్ యెక్కడో వ్రాసాడు. చదివాం. మీరు అడ్డం రాకుండా వుంటేచాలు''

స్వరంస్థాయి క్రమేపీ హెచ్చిస్తూ చదవడం కొనసాగించాడు.

''...అమాయకులు వేలకువేల మందిని అరెస్టు చేస్తూనే మీరు సానుభూతితో మమ్మల్ని, అంటే సోషల్ డెమాక్రాటిక్ పార్టీ సభ్యుల్ని తాకకుండా 'దయతలచారు'. మా కొత్త అచ్చు ఆఫీసు నాలుగు సంవత్సరాలనుంచి పనిచేస్తోంది. వేయి యిళ్ళకి తక్కువకాకుండా సోదా చేసారు. కాని అచ్చు ఆఫీసు యెక్కడ లేదో యెక్కడ వుండదో ఆ యిళ్ళు మీరు సోదా చేసారు. శాంత మనస్కులు మిమ్మల్ని భయంకరంగా చిత్రిస్తూ, ద్వేషంలో మాట్లాడ తారు...

''క్షమించండి'' అన్నాడు ఇనస్పెక్టరు కోపంతో. దృఢనిశ్చ యంతో కాగితాన్ని చేతితో మూసివేసాడు. ''దీనిని బహిరంగపరచ డానికి వీల్లేదు. న్యాయచట్టానికి ప్రతినిధులయిన మీరు యీసంగతి గుర్తించి గ్యాపకం పెట్టుకోవాలి. యిలా యివ్వండి''

ఆకాగితం ఇనస్పెక్టరు చేతికి వచ్చింది. మడతపెట్టాడు. చిరచిర మాయమయింది. కాని ఆక్షణంలోనే అతని మొఖం కోపంతో ముడుచుకుంది. సరిగ్గా అలాంటి కాగితమే ఒక సబ్ఇనస్పెక్టరు చేతిలో కనిపించింది.

''అదెక్కడ దొరికింది?'' అని అడిగాడు బొంగురుగొంతుతో. సబ్ఇనస్పెక్టరు అపరాధిలా దృష్టి మరల్చుకుని

''పట్టణమంతటా అంటించారు. వాటన్నిటినీ యీపాటికి చింపేసా రనే అనుకుంటున్నాను.''

''నాకు తెలుసు'' అంటూ దీర్ఘాలు తీసాడు ఇనస్పెక్టరు. ''మీవాళ్ళు యెలావాటిని చింపుతారో నాకు తెలుసు. ఒకటి కని పిస్తే కనిపించకుండా పదివుంటాయి''

నిజం! ఇక్కడకూడా, చౌకుకు కొద్ది అడుగులదూరంలోని చర్చి ఆవరణలో, మఠంగోడమీద, డెసిటనాయా వీధిలో రహస్య ప్రకటనలు అచ్చువేసి అతికించారు. కార్మికులు, వీధివర్తకులు లాంటి

అలగాజనం పనికి వెళుతూ ఆ ప్రకటనపత్రాల చుట్టూ చేరి నవ్వుతున్నారు.

"...మళ్ళీ మా కాళ్ళమీద నిలదొక్కుకుని, బలపడి, మా కార్యకలాపం ప్రస్తుత స్థితికి విస్తరించుకోవడానికి సహాయ పడ్డారు. మీరు మాకు చేసిన వుపకారానికి యెంతో కృతజ్ఞులం. మీ జ్ఞాపకార్థం మా అచ్చుఆఫీసులో అరిగిపోయిన పాత సీసపు అచ్చు ముక్కలు పంపుతున్నాం"...

"అవును, నిజం!" అన్నాడొక పాఠకుడు.

"యీ పత్రాలు కొత్తటైపుతో అచ్చు వేసారు. కనిపిస్తూనే వుంది."

"పత్రిక చదివావా?" అని ఇంకొక వ్యక్తి అడిగాడు. "యివాళ నోవట్నీ రజతోత్సవం! సమయానికి అభినందనాలు అందాయి"

"బహుమానం కూడా పంపారు. పెట్టెబాగా బరువుగా వున్నట్టుంది."

"యేం లాభం? దానిని ఆయన కంటపడనీయకు" అన్నాడొక వీధి వర్తకుడు. యిటువంటి రోజున మంత్రిగారికి బాధ కలిగించరు."

మంత్రిగారికి ఎలాంటి బాధా కలిగించకుండా తీసుకోవలసిన జాగ్రతలన్నీ తీసుకున్నారు. నోవిట్నీ, ఆయన భార్యా ఇంక లేచి బయటికి రాలేదు. వెండి పళ్ళెంలోఉన్న అభినందన తంతులలో ఈ పసుపుపచ్చరంగు పత్రం దొరకకుండా చేసారు. పోలీసుశాఖ పత్రాలలో దానిని కలిపివేసారు. కాని తపాల్లా కచేరీలో ఒక పొరపాటు జరిగింది. ఎర్ర గులాబీలు కప్పిన ఒక కార్డు నీటుగా మడచిన టెలిగ్రాం ఫారాల మధ్యనుంచి కవర్ల మధ్యనుంచి తొంగిచూస్తోంది.

నోవిట్నీ మంచి హుషారుగా ఆ అభినందన లేఖల ముందు నిలబడి ముందుగా ఆ అందమయిన కార్డును పైకిలాగాడు. ఒక్క

చూపు! అతని కనుబొమలు చికాకుతో బాధతో పైకి లేచాయి. కార్డుమీద స్విడర్లండు తపాలా ముద్రఉంది. ఆ కార్డుమీద:

"నీ బారినుండి తప్పించుకుని మేము సురక్షితంగా యిక్కడికి చేరుకున్నందుకు వేడుకగా 'అండర్ ది గోల్డుస్టార్' అనే భోజనశాలలో సమావేశమయి యీ విషయం మీకు తెలియజేయడం అవసరమని భావించాం. మేము, ఆ పదకొండుమందిమీ, రష్యాలో పనిచేయడానికి అద్యతనభావిలో వస్తున్నామని తెలియజేస్తున్నాం."

దీనిక్రింద లుక్యనోవ్కా జైలుగోడమీద ఏ వరసక్రమంలో ఏ సంతకాలుఉన్నాయో ఆ వరసక్రమంలో ఆ సంతకాలు ఉన్నాయి.

# 1

# "గొట్టంబావి" రహదారిచీటి

1930 డిశంబరులో జారిస్టు పోలీసు శాఖకు స్విడ్జర్లండులోని రష్యన్ కాందిశీకులను రెచ్చగొట్టే ఏజంట్ల దగ్గరనుంచి సాంకేతిక భాషలో ఈ క్రింది తంతివార్త చేరింది:

అత్యధిక అధికారాలతో బామన్ మాస్కో బయలుదేరాడు. విల్హెలం జెమ్స్ ఫగ్ పేరుతో జర్మన్ రహదారి చీటి.

నేల ఉమ్ములతో, బూట్ల అట్టలనుంచి కారిన మంచునీటితో నిండిపోయింది. గోడలు ఎత్తు తక్కువ, భయంకరంగా ఉన్నాయి. లోకపు బీటులువారి వెలవెల బోతోంది. కటకటాలకు వార్నీసు పూసి ఎంతోకాలమయింది. విరిగిపోయి, మరమ్మతుచేసినా లాభంలేని స్థితికి వచ్చాయి. సుంక శాఖాధికారులు సుముఖంగా లేరు. అన్ని హోదాల పోలీసు అధికారులు గోడల ప్రక్కన, గుమ్మాలలో, మూలల నిలబడ్డారు. రష్యన్ సామ్రాజ్య సరిహద్దులోని ఈ రైల్వే స్టేషనులో అడుగుపెట్టిన ప్రతివాడూ తనను అరెస్టు చేస్తారేమోనని అనుమానించేటట్టుంది, ఈ పోలీసు దళం.

విదేశీయులకు ఈభావం అనుభూతిలోకి రాదు. సుంకశాఖాధికారులు తమ తలబిరుసుతనాన్ని రష్యన్‌ప్రజలమీద చూపేవారు. ఇంగ్లీషువారికి, జర్మన్లకి వంగి వంగి సలాములు చేసేవారు.

రహదారిచీట్లు తిరిగి పుచ్చుకోవడంకోసం కటకటాలదగ్గర నిరీక్షించేవారిలో ఎవరు ప్రియతమ మాతృదేశానికి తిరిగివస్తున్న రష్యనులో, ఎవరు రష్యా సందర్శించడానికి వచ్చిన విదేశీయులో ఇట్టే పోల్చవచ్చును. విదేశీయుల వైఖరి గర్వంతో, స్వేచ్ఛతో కూడి ఉంటుంది.

ఒక పోలీసు అధికారి పరీక్షించిన రహదారి చీట్లకట్ట చేతులో పెట్టుకుని జనసమూహాన్ని ఎగా దిగా చూసి చేతిలోని రహదారిచీటీ మీద పేరు చదివేసరికి రష్యన్లకి, విదేశీయులకు కూడా ఆశ్చర్యం వేసింది.

"మిస్టర్ ఆర్థర్ – విలెలంనా – మేరియా – జీగ్లర్ !"

రహదారిచీటీకి సంబంధించిన గొడవ ఏదో ఉంటేనే ఇలా ఆవ్యక్తిని పిలుస్తారు. స్టేషనులో చేరిన జనం గుసగుసలాడుకుని చుట్టూ చూసారు.

ఒక విదేశీయుడు, గుండ్రటి బుజాలు, కారురంగు జుట్టు – చుట్టను నోటిలో ఎడమవైపునుంచి కుడివైపుకు మెల్లిగా జరుపుకుని "యేమిటి ?" అని అడిగాడు జర్మన్ భాషలో.

పోలీసు తెల్లటి చేతితొడుగులు పెట్టుకున్న చేతితో టోపీతాకి, "మిస్టర్ జీగ్లర్, దయయుంచి నావెంటరాండి" అన్నాడు.

ఆ పోలీసు మీసాల కొనలు సూదులలాగా ఉన్నాయి. మందహాసం చేసాడు. మందహాసం చేయడం శుభసూచకం గాదు. ఈ విషయం ఆ పోలీసు దాచిపెట్టలేదు. జీగ్లర్ చుట్టూ మూగిన జనం దూరంగా తప్పుకున్నారు. ఒకవ్యక్తి, బహుశా అమాయకుడయి ఉంటాడు, అందరి మనసులలోను తారాడుతున్న భావాన్ని మాటల్లో పెట్టాడు.

"యిక ఫయిసలాయే" అని అరిచాడు.

ఇంకోపోలీసు జీగ్లర్ లోపలికి వెళ్ళడానికి కటకటాలు తెరిచాడు.

ఆ జర్మన్ గుప్పుగుప్పున చుట్టుపొగ వదులుతూ నిశ్చింతగా లోపలికి వెళ్ళాడు. వెంటనే ఊదా యూనిఫారాలు వేసుకున్న ఇంకో ఇద్దరు అతని వెనక ప్రత్యక్షమయారు. ఒక పోలీసు సైగ చేసినమీదట ఒక కూలీ బరువయిన సూటుకేసు తీసుకుని వారి వెంట బయలు దేరాడు. సుంకశాలలో దానిని తనిఖీచేసి పంపారు.

స్టేషనులో మూగిన జనసందోహం శాంతంగా ఈ 'ఊరేగింపు' తిలకించారు. బామన్ కళ్ళుకూడా మాయమవుతున్న తన కామ్రేడ్‌ను అనుసరిస్తూ నిశ్చలత తాల్చాయి.

అతను, లెన్గ్నిక్ జెనీవానుంచి బయలుదేరేటప్పుడు తీసుకో వలసిన జాగ్రతలన్నీ తీసుకున్నారు. లెన్గ్నిక్ కేంద్ర కమిటీ సభ్యుడు. ఇస్క్రాను బలపరిచేవారిలో మొదటివాడు 1890 నుంచి కార్మికోద్య మంలో పనిచేస్తున్నాడు. రహస్య కార్యకలాపాలలో మంచి ప్రవీణుడు.

బౌమన్‌కి అతని రహదారి చీటి ఇంకా తిరిగి ఈయలేదు. పేరు పిలవగానే పరిస్థితి ఏమిటో తేలిపోతుంది.

లెన్గ్నిక్ అతని వెంట వెళ్ళినవారు సరిహద్దు రక్షణ కార్యా లయంలో ప్రవేశించేసరికి అందులో సందులేకుండాఉంది. ఒక వ్యక్తిని నిలవరించారనే సంగతి ఇట్టె పాకిపోయిందేమో, వివిధ ఉద్యోగులు అక్కడ మూగారు. ఏదయినా దురదృష్టసంఘటన అంటే వీరు చెవులు కోసుకొంటారు. తెల్లబడుతున్న ఎర్రజుట్టు అంటకత్తెర వేయించుకున్న ఒక పోలీసు ఇనస్పెక్టరు, వయసు ఎంతో చెప్పడం కష్టం, అచ్చుఫారం మీద ఈకింది మాటలు వ్రాయడం ప్రారంభించాడు.

"రహస్య పోలీసు శాఖకు చెందిన నేను......"

వ్రాతబల్లను చేరుకున్న లెన్గ్నిక్ గుట్టు పట్టేయడానికా అన్నట్లు కళ్ళు కుదించాడు. ఆ తరవాత తిరస్కార సూచకంగా పై పెదవిచివర పైకెగరేసాడు.

"సరే. అనుకున్నట్లే అయింది. యీతనేనా ఆర్డర్! యింటి పేరేమన్నారు?"

చుట్టూ మూగిన జనంకేసి, ఇనస్పెక్టరుకేసి చూసి లెన్గ్నిక్ చుట్ట నోటిలోనుంచి తీయకుండానే,

"నా పేరా? అందులో రాసేవుందిగా!" అని జర్మన్‌భాషలో బొబ్బరించి గడ్డంతో రహదారి చీటిని చూపించాడు. ఆ రహదారి చీటీని లెన్గ్నిక్‌ను తీసుకుని వచ్చిన పోలీసులు ఇనస్పెక్టరు ముందుపెట్టారు. లెన్గ్నిక్ మాటలకు చూపరులు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. బవేరియా ఉచ్చారణతో, రష్యన్ అధికారు లను విదేశీయులు సామాన్యంగా సంబోధించే నిర్లక్ష్యంతో, లెన్గ్నిక్ నిజంగా జర్మన్‌లాగానే మాట్లాడాడు. కొంపదీసిఅతడు నిజంగా పౌరుడు కాదుగదా!

ఇనస్పెక్టరు మొహం వాడిపోయింది. అతని మనసులోనూ ఈ భావమే ప్రవేశించింది. పోలీసు శాఖనుంచి వచ్చిన హెచ్చరిక తంతిలో పేరు జెంఫెగ్ అని ఉంది. కాని ఆ పేరుగల రహదారి చీటీ లేదు. జీగ్లర్ అనే పేరుతో రహదారి చీటి ఉంది. సాంకేతిక భాషలో ఇచ్చే తంతిలో తప్పు దొర్లడం అసంభవం కాదు. అలా అనుకున్నా, జెంఫెగ్, జీగ్లర్- ఈ రెండు మాటలకు ఎక్కువ సామ్యం లేదు. మొదటి పేరులో కూడా తేడా ఉంది. జెంఫెగ్ మొదటిపేరు విల్హెలం. కాని ఇతనిపేరు ఆర్థర్- విల్హెలం జర్మన్‌లాగానే కనిపిస్తున్నాడు.

ఆ ఇనస్పెక్టరు సూదిలాంటి చూపు లెన్‌గ్నిక్ శరీరంలోకి తొలుచుకుపోతున్నట్లు అనిపించింది. లెన్‌గ్నిక్ నటిస్తున్నాడనే నిర్ధారణకు వచ్చాడు. బిగ్గరగా, "రష్యన్‌భాషలో వివరంగా చెప్పండి" అనేసరికి అతనిమెడ ఇంకా కాషాయరంగు తాల్చింది.

ఆతరవాత జరిగిందేదో పోలీసు ఆదేశాలలో గాని రహస్య పోలీసు కాగితాలలో గాని లేదు. ఆ బవేరియన్ నోటిలోనుంచి చుట్ట తీసి, కనుబొమలు పైకెత్తి ఎవరో ఒకరిని ఉద్దేశించినట్టు కాకుండా స్పష్టంగా, "యేమిటి వీడి వుద్దేశం?" అని మళ్ళీ జర్మన్‌భాషలోనే అడిగాడు.

అంతటితో ఊరుకోక ఇంకోమాట – మనసు నొప్పించేమాట అన్నాడు. జర్మన్‌భాష తెలియనివారికి కూడా ఇట్టే అర్థమయిపోయింది. ఆతరవాత చేయిచాపి మెదలకుండా వ్రాతబల్లమీాద రహదారిచీటి తీసుకున్నాడు.

"దుబాసీ?" అని ఇనస్పెక్టరు బొంగురు గొంతుతో అరిచాడు. "యెక్కడచచ్చాడు?"

"యినస్పెక్టర్! అయిదు నిమిషాలలో రైలుబయలు దేరుతుంది" అని చెప్పాడు సీనియరు కండక్టరు అనుమానిస్తూ.

ఇనస్పెక్టరు వ్రాతబల్లమీాది రహదారిచీట్ల బొత్తివంక తేరిపార జూచాడు. వాటిని పరిశీలించాలి. ఒక పోలీసు సార్జెంటును రమ్మని

సైగచేసి త్వరత్వరగా రహదారీ చీట్లు ఒకొక్కటీ తిరగవేసి ఆ సార్జంటు అరచేతిలో పెట్టాడు.

జీగ్లర్ వెనుదిరిగి వెళ్ళబోయాడు. కాని అతని వెనకఉన్న పోలీసు దారి అటకాయించాడు. ఆకుపచ్చ అంచు నల్లకుడితినీ తొడిగిన సుంకశాఖాధికారి ఒకడు వచ్చీరానీ జర్మన్‌భాషలో, అర్ధమయేటట్టు లాంఛనంగా కొంత కార్యక్రమం ముగిసేవరకూ వెళ్ళడానికి వీలులేదని వివరించి చెప్పాడు. సరిగ్గా ఆ సమయానికి దుబాసీ చక్కా వచ్చాడు.

ఆ దుబాసీ బక్క పల్చని మనిషి తిసుగుడుకళ్ళు. జర్మన్ గబగబా మాట్లాడగలడు, డాబుగా ఉచ్చరించగలడు.

ఇనస్పెక్టరుకు హుషారు ఎక్కింది. ప్రశ్నలు ప్రారంభమయాయి.

"ఆయన అంటున్నారు" అన్నాడు దుబాసీ. "నారెమ్‌బర్గులో పుట్టాను, ఫ్రాన్‌బర్గులో నివాసం, యిటీవల మ్యూనిచ్‌లో వుంటున్నా, వృత్తి నూతులు తవ్వడం, గొట్టంబావులు దించడంలో ప్రవీణుణ్ణి."

"గొట్టంబావులు, అందుకే మాస్కో వెళుతున్నాను"

"ఒహో!" అంటూ ఇనస్పెక్టరు సంతోషంతో "అప్పుడే అబద్ధాలు మొదలుపెట్టాడు. మాస్కోలో బావులు! నీళ్ళు కరువయాయా యేం? మాస్కో పురాతనమయినదయినా రాజధాని!"

దుబాసీ గబగబా మాట్లాడసాగాడు. ఇనస్పెక్టరుకు కలిగిన ఉద్రేకం అతనికీ అంటుకుంది. జాడతీసేటప్పుడు వేటకుక్క మొరిగినట్టు మొరిగాడు. కాని ఆజర్మన్ జవాబిచ్చేలోపునే సుంకశాఖాధికారి ఇనస్పెక్టరుమీదికి వంగి రహస్యంగా,

"క్షమించు, యినస్పెక్టర్! పొరబడుతున్నట్టున్నారు. సెయింట్ పీటర్స్‌బర్గ్ టంకశాలలో నేను పనిచేసాను. అక్కడకూడా గొట్టంబావులున్నాయి" అన్నాడు

ఇన్‌స్పెక్టరు విసుగుతో మీసం మెలివేసాడు. కాని తక్షణమే తమాయించుకున్నాడు.

"అక్కడ గొట్టం బావులు దించవచ్చు. కాని యితను దించడం లేదు. లేకపోతే పీకకోసేసుకుంటూ, ఒక నిమిషంలో బయటపడుతుంది. అవునవును, మిస్టర్!" జీగ్లర్ కేసి చూసి,

"నీ మొహంమీద, నిర్మొహమాటంగా చెపుతున్నా. రష్యన్ భాష రానట్టు నువ్వెంత నటించినా నే చెప్పేదంతా నీకు చక్కగా అర్థమవుతోంది. యిదిగో, మానికిన్, గొట్టం బావంటే యేమిటో స్వంత మాటల్లో చెప్పమను."

"రైలు బయలుదేరడానికి సిగ్నలు యివ్వాలి" అంటూ సీనియరు కండక్టరు వేడుకున్నాడు. "గొట్టాలు దింపడంగురించి మాట్లాడడం మొదలుపెడితే... రైలు ఆపివేయాలంటారా?"

"కాసేపు ఆగు!. అని ఇనస్పెక్టరు అతనిని పొమ్మన్నాడు." "తొందరపెట్టొద్దు. ప్రభుత్వానికి సంబంధించిన విషయాలు యివి. సరే, ఆయనే మంటున్నాడు?"

జీగ్లర్ ఏదో ఘాటుగా మాట్లాడాడు. దాంతో చుట్టూ మూగిన జనం ముసిముసి నవ్వులు నవ్వసాగారు. దుబాసీ పండ్లికిలించాడు

"ఊఁ - యేమంటున్నాడు. చెప్పు." అని తిరిగి అడిగాడు ఇనస్పెక్టరు కోపంతో.

దుబాసీ ఒకక్షణం తటపటాయించాడు.

"గొట్టంబావి అంటే ఏమిటో జారిస్టు పోలీసు యినస్పెక్టరుకు తెలియకపోవడం ఆశ్చర్యంగావుంది అంటున్నాడు"

"నువ్వు అబద్ధాలాడుతున్నావు. అతను యింకేదో అన్నాడు" ఇన్‌స్పెక్టరు తల వంకిస్తూ మళ్ళీ జీగ్లర్‌నే సూటిగా.

"నాకు తెలియకపోతే యెందుకు అడుగుతాను. స్పష్టంగా తెలిసిందా ? నేను చెప్పుతున్న దేమిటో నాకే తెలియకపోతే నిన్నెలా పరీక్షిస్తాను. బాధ అనుకోకుండా వివరించి చెప్పు." అని అడిగాడు.

ఇనస్పెక్టరు చెప్పినది దుబాసీ అనువదించి చెప్పగానే జీగ్లర్ బుజాలు ఎగరవేసి విసుగు గొంతుతో మాట్లాడ సాగాడు. దుబాసీ గొంతుకూడా విసిగెత్తినట్లుంది.

"సరిగా తూచి చెప్పాలంటే వొత్తిడివల్ల నీరుపారే బావి గొట్టం బావి. నేలను తొలుస్తాం. తొలిచే విధానం-చెప్పడం యెలా?... యివన్నీ పారిభాషికపదాలు."

ఆ జర్మన్ ఆగకుండా మాట్లాడుతూనే ఉన్నాడు. సుంక శాఖాధికారి తల పంకించి, కుడితినీ సర్దుకుని బయటకు వెళ్ళిపోయాడు. సంభాషణలో ఆసక్తి అందరికీ నశించిపోయింది ఇనస్పెక్టరు పొరపాటు పడ్డాడని స్పష్టమయింది.

కాని పట్టు విడవలేదు. దర్జాగా దుబాసీమాటలు వినసాగాడు.

"కన్నం వ్యాసం, పిల్టరువ్యాసం లోతుమీద, కావలసిన నీటి పరిమాణంమీద ఆధారపడి వుంటాయి. ఫిల్టరును..."

దుబాసీ నుదురు తుడుచుకున్నాడు. జీగ్లర్ హడావిడిపడకుండా సాఫీగా చుట్ట తీసివేసి మాట్లాడుతున్నాడు.

"...నీరున్న పొరలో యిసుక వుంటే, రకరకాల వంపుల ద్వారా నీటిని పైకి పంపుతాం".

మునిగిపోయేవాడు గడ్డిపరకను పట్టుకోడానికి చేయి కదలించి నట్లు ఇనస్పెక్టరు తటాలున చేయి కదిలించి,

"రకరకాల? ఉహు-అంతటితో చాలదు. యేరకం వుపయో గిస్తారో నిక్కచ్చిగా చెప్పాలి"

దుబాసీ చెప్పిన మాటలు వినగానే జీగ్లర్ విసుగుతో ఇనస్పె క్టరుకేసి చూసాడు. అతనిచ్చిన జవాబు పొడుగ్గా ఉంది.

"నీటిమట్టం యెక్కువగా వుండి పంపు చేసేటపుడు మెల్లిగా పడు తుంటే లంబాక్షం గల మధ్యాకర్షామి అయిన ఫారొక్క-రకం పంపు వుపయోగిస్తాం. నీటిమట్టం తక్కువగా వుంటే లామట్ వొత్తిడి పంపు వుపయోగిస్తాం. యింజనీరు రాకీ కనిపెట్టిన విధానంలో నేను ప్రవీణు డిని యీవిధానంలో ప్రవీణుడయిన యింజనీరు-టెక్నాలజిస్టు సుఖనోవ్ యింజనీరింగు ఆఫీసులో చేరడానికి మాస్కో వెళుతున్నాను. రాకీ యిచ్చిన సిఫార్సు పత్రం నాదగ్గర వుంది"

మునుపటిలాగానే నిర్లక్ష్యంగా జీగ్లర్ జేబులోనుంచి మంద పాటి నిగనిగలాడే కవరు తీశాడు. దానిమీద జర్మన్ వ్యాపార సంస్థ

ముద్ర ఉంది. కాని ఇనస్పెక్టరు అతనికేసి చూడడం లేదు. ఇంతే సేపటినుంచీ సంభాషించడం లేనట్టు, ఎదుట జీగ్లర్ లేనట్టు ఏవేవో కాగితాలు చూడడంలో నిమగ్నుడయాడు. సీనియరు కండక్టరు ఈల పైకితీసి ఆ గదిలోనుంచి తొందర తొందరగా బయటికి వెళ్ళాడు.

ఇక అక్కడ బౌమన్ రైలుబోగీలవెంటే అటూ ఇటూ పచార్లుచేస్తూ నిరీక్షిస్తున్నాడు. ఏ చిక్కూ పెట్టకుండా అతని రహదారి చీటి అతనికి తిరిగి ఇచ్చివేసారు. ఆ రహదారి చీటిమీద డ్రొల్గనోవ్, కోర్టు కౌన్సిలరు అని వుంది. (ఆ హోదాయే గౌరవభావం కలిగిస్తుంది). ఇక వీసా, దానిమీద ముద్ర స్పష్టంగాఉంది. దొంగ వీసా అని పోలీసులు అనుమానపడడానికి వీలులేదు. అందుకనే ఈ రహదారి చీటీ చూపించాడు. కాని జెంఫెగ్ పేరిట రహదారి చీటీ చూపలేదు. జెనీవా నుంచి బయలుదేరగానే జెంఫెగ్ రహదారి చీటీలో ఏదో తప్పు దొర్లిందని తెలుసుకున్నాడు. తప్పు చిన్నదేగాని అనుభవంగల సరిహద్దు కాపలా పోలీసులు దానిని పట్టుకునే ప్రమాదంఉంది.

బౌమన్ సూటుకేసు వంటి సూటుకేసు పట్టుకుని ఒక కూలీ తొందర తొందరగా అతని పక్కనుంచి వెళ్ళాడు. కొత్త చుట్ట కాల్చుకుంటూ ప్రశాంతంగా జీగ్లర్—లెన్గ్నిక్ కూలీ వెనుక తనను, తన దేశాన్ని అమితంగా గౌరవించే విదేశీయునిలాగా తాపీగా, హుందాగా నడుస్తూ వస్తున్నాడు. మూడోసారి ఈలవేసినా హడావిడి పడడంలేదు.

బౌమన్ ఎక్కిన బోగీ పక్క బోగీలో లెన్గ్నిక్ ఎక్కాడు.

రెండు గంటల తరవాత, ముందుగానే కూడపలుకుకున్న ప్రకారం, బుజాలమీద తువాళ్ళు వేసుకుని, చేతులతో సబ్బు పెట్టెలు పట్టుకుని మరుగుదొడ్డి అవతల వాకు కలుసుకున్నారు. చీకటి పడింది. నడవలో ఎవరూ లేరు. మరుగుదొడ్డిలోనూ ఎవరూలేరు.

"యీ వ్యవహారంలో యెంత డాబుచేయవలసి వచ్చిందో, చూడు." అన్నాడు లెన్గ్నిక్ నవ్వుతూ. "గొట్టం బావులను గురించి చదివి వుండకపోతే, నువు రాకే వ్రాసినట్టు సిఫార్సు కాగితం రాయకపోతే చిక్కుల్లో పడేవాడినే"

# 2

# సూక్ష్మ జీవులు

రైలు మాస్కో చేరుకోకముందే లెన్‌గ్నిక్ దిగి వెళ్ళి పోయాడు. ఉత్తరాదికి వెళ్ళాలి. బామన్ ఒంటరిగా రాజధానీ నగరం చేరుకున్నాడు.

జెంఫెగ్ రహదారిచీటీ చూపించి 'హోటల్‌పారిస్' లో దిగినపుడు విదేశీ రహదారి చీటీవల్ల కలిగేలాభం అలాఉంచి, ఎడతెగని ఆచూకీ ఎవరికీ అందకుండా ఉండేందుకని రహదారిచీట్లు మార్చాలనే నియమాన్ని బామన్ పాటించేవాడు. ఒకేతడవ గనక రెండుమూడు రహదారి చీట్లు ఉపయోగిస్తే అవన్నీ ఒకనికే చెందినవని ఎంతనేర్పుగా నిఘా వేసినా వెంటనే తెలుసుకోవడం కష్టం.

చిట్టాలో ఎక్కించడానికి రహదారిచీటీ హోటలులో ఇచ్చిన రెండోరోజున ఏదో కొంప మునిగిందని బామన్ పసిగట్టేసాడు. మగ నౌకరు చూపులు, శ్రద్ధగా తలత్రిప్పడం, ఆడనౌకరు బెదురుచూపులు, అతని రాకపోకలను హోటలు మానేజరు, బొద్దుపాటి కూలీ కనిపెట్టి చూడడం ఏదో గొడవ ఉన్నదనడానికి నిదర్శనాలు.

వీధులవెంట తిరుగుతూ, దోవలోని ఇండ్లలో ప్రవేశిస్తూ, ఒక గుర్రపు ట్రాం బండినుంచి ఇంకోదానిలోకి మారుతూ ఆరోజల్లా గడిపాడు. అతనివెంటే నీడలా పట్టుదలతో బహిరంగంగా పోలీసులు పడ్డారు. ఈ వ్యవహారాలలో అపుడే అడుగుపెట్టిన కొత్తవాడుకూడా ఇది ఇట్టే గ్రహిస్తారు. బామన్ మాస్కో చేరిన తరవాత పార్టీతాలూకు వారిని ఎవరినీ కలుసుకోలేదు, పార్టీవారినే కాదు ఇతర్లను కూడా కలుసుకో లేదు. అందుచేత ఈవేట అతనికి మరింత ఆశ్చర్యం కలిగించింది. ఇలా తనమీద నిఘా వేయడానికి రహదారిచీటికి సంబంధించిన

జయి ఉంటుందని నిశ్చయించుకున్నాడు. రైలుస్టేషనునుంచి తనను ఎవరూ అనుసరించలేదని కూడా అతనికి గట్టి నమ్మకం.

హోటలుకు తిరిగి వెళ్ళేసరికి ఆఫీసులో ఒక పోలీసు ఇనస్పెక్టరు ఉండడం గమనించాడు. తన గదికి వెళ్ళకుండా బామన్ మాలీ నాటక శాల టికెట్టు కొనుక్కొని రమ్మని హోటలు హర్కారాను పంపాడు. భోజనం తన గదిలోకి తీసుకురమ్మని చెప్పి ఈలోపుగా స్వయంగా తీసుకువెళ్ళగలిగినదంతా జేబుల్లో వాటిల్లో సర్దేసాడు. మొదటి అంకం జరుగుతూండగానే నాటకశాలనుంచి బయటలుదేరి ఆనుపానులు తెలియ కుండాచేసి పదిగంటలకల్లా సోకోల్నికే పార్కు చేరుకున్నాడు. ఈసారి ఎవరూ అతనిని వెంటాడడంలేదు.

హోటలుకు తిరిగి వెళ్ళడమంత తెలివితక్కువ వేరొకటుండదు. ఆరాత్రే అతనిని అరెస్టుచేయడానికి సన్నాహాలు చేస్తున్నారని ప్రతిదీ సూచిస్తోంది. సామానులేకుండా ఇంకో హోటలుకు వెళ్ళి విదేశీ వీసాతో 'కోర్టుకాన్సిలరు' రహదారిచీటీ చూపితే అనుమానం రేకెత్తించడ మవుతుంది.

జెనీవాలో యిచ్చిన చిరునామాలన్నిటినీ జ్ఞాపకం చేసుకొని ఆర్బట్ వీధిలోని మామూలు మలుపులో ఉన్న ఒక డాక్టరు ఇంటికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. మాస్కో ఇదివరలో చూచాడేమో ఈ మలుపులన్నీ అతనికి బాగా తెలుసు. ఆ మలుపులలో స్వప్నంలా నిశ్శబ్దం! గాలికూడా కదలాడదు. ఎవరయిన వెంటబడితే ఆ నిశ్శబ్దం అతనిని తరిమివేస్తుందని బామన్ విశ్వాసం. ఇదివరలో ఆ మలుపు అతనిలో కలిగించిన భావముద్ర తలచుకుని ఆ రాత్రి బస చేయడానికి అదే సురక్షితము, అనుకూలము అయిన స్థలమని నిర్ణయించు కున్నాడు.

ఆ సంవత్సరం శీతాకాలంలో వీధులలో జనసంచారం లేదు. వీధులమధ్య మంచు ఎత్తుగా పేరుకుంది. వరిగిపోయిన లాంతరు స్తంభా లకు లాంతర్లు ఆట్టేలేవు. స్తంభాలకు రంగుపూసి ఎన్ని సంవత్సరా లయిందో! ఆ యిల్లు కష్టపడక్కరలేకుండానే కనిపించింది. బూడిద రంగుగా ఉంది. ఒకటే అంతస్తు. కొయ్య నరంబీ ఉంది. గుమ్మానికి

అడ్డంగా మంచి విలువగల ఆకుపచ్చ గుడ్డ కట్టారు. ధగధగా మెరిస్తే ఇత్తడిరేకుమీద డాక్టరుపేరు, దానిక్రింద 'సూక్ష్మక్రిమి శాస్త్రజ్ఞులు' అని వ్రాసి ఉంది.

ఇంకా యవ్వనంలో ఉన్నట్లు కనిపించే ఒక స్త్రీ తలుపు తెరిచింది. డాక్టరు లోపల వున్నారని చెప్పిందిగాని ఆమె కళ్ళల్లో అపనమ్మకం, ప్రతికూలభావం ద్యోతకమయాయి. వెనకకు తిరిగి వెళ్ళిపోవడం మంచిదేమో ననిపించింది. ఆ స్త్రీ పార్టీమనిషి కాదని స్పష్టంగా తెలుస్తోంది. ఇంత పొద్దుపోయి, అర్ధరాత్రివచ్చి తలుపు కొట్టడం ఆమెకు కష్టంవేసింది.

ఆమె పిలవగానే డాక్టరు హాలులోకి చక్కావచ్చాడు. మంచిగా, ఆకర్షణీయంగా ఉన్నాడు. బట్టతల, చుట్టూ మెత్తటి వెంట్రుకలు చిందరవందరగా ఉన్నాయి. దట్టమయిన గడ్డం. ఆ గడ్డం అతనిది అవునా కాదా అన్నట్టు చిక్కిరిబిక్కిరిగా ఉంది. బంగారపు కళ్ళద్దాలు. చూపు విశ్వసనీయంగా, చల్లగా ఉంది. అందుకని బాటమన్ సంకేతపు మాట చెప్పలేదు (ఆడనౌకరు ఇంకా అక్కడే ఉండి ప్రతికూలభావంతో చూస్తోండడం ఇంకో కారణం). డాక్టరు వెచ్చటి చేతిని పట్టుకుని ఊపి, "యెటు ?" అని అడిగాడు. దాని మీద డాక్టరు సంతోషంతో తనలోతాను నవ్వుకుని

"యిక్కడికే" అంటూ ఒక గది తలుపు తెరిచాడు.

ఆ ద్వారంగుండా ఘాటుగా జంతుమదవాసన కొట్టింది. శీతాకాలంలో గాలి ఎక్కువగారాని బోనులలో జంతువులను బంధించి నప్పటి జంతు ప్రదర్శనశాలలాగాఉంది ఆగది.

ఇక్కడా బోనులు, చిన్నవీ పెద్దవీ; ఒంటరిగా కొన్ని వరసగా కొన్ని, గోడకు ఆనుకుని కొన్ని, గది మధ్యగా కొన్నిఉన్నాయి. వాటిలో చెవుల పిల్లులు, సీమ పందికొక్కులు, పావురాలు, తెల్ల చుంచులు, సున్నితమయిన తోకలున్న తెల్లఎలుకలు(లుక్యానోవా జైలు లోని గోధుమరంగు ఎలుకల వంటివి కావు) కనిపించాయి.

"వీటిని పెంచుతున్నా వెందుకు"

కాని జవాబు చెప్పకుండా డాక్టరు అసలు వ్యవహారాలకుదింపి, "క్షమించు కాని..."

అప్పుడు సంకేతం చెప్పాలనే విషయం జ్ఞాపకం వచ్చి బామన్ చెప్పాడు. ఇద్దరూ కరచాలనం గావించుకున్నారు.

"యీ రాత్రి యిక్కడ గడపదలచుకుంటే, సరే. కోటు తీసేసి హాయిగావుండు. కాస్త వాసనే అనుకో. కాని దురదృష్టవశాత్తూ యీ సమయంలో యింకో గది యేదీ ఖాళీగాలేదు. యిక్కడ నీకు పక్క అమరుస్తాం."

బోనులమధ్య ఉన్న ఒక జిడ్డుచర్మపు సోఫాదగ్గరికి వెళ్ళి దానిని తట్టాడు. బిగువు తీగలు కిర్రుమని డాక్టరు చేతిని ఎగతన్నాయి.

"తీగలు బాగానే వున్నాయి. చూచావుగా" అన్నాడు సంతృప్తి తోకల ఆడిస్తూ "సదుపాయంగా వుంటుందికదూ ?"

"తప్పకుండా" అని బామన్ తల ఆడించి గది నలుమూలలా పరికించి చూడసాగాడు. "కాని యీ జంతువులను యెందుకు పెంచు తున్నావో చెప్పావుకాదు?"

డాక్టరు ప్రేమతో గదిని పరీక్షగా చూసి,

"నేను సూక్ష్మజీవ శాస్త్రజ్ఞుణ్ణి" అన్నాడు.

బామన్ ఈసంబంధ మేమిటో గ్రహించక "అయితేమాత్రం జంతువులతో దానికి సంబంధమేమిటి ?" అని అడిగాడు.

"ఓ ! ప్రయోగాలకు వాటిని వుపయోగిస్తాను. యిదిగో చూడు."

ఒక వ్రాతబల్ల దగ్గరకు డాక్టరు వెళ్ళాడు. దానిమీద పరీక్ష నాళికలు, వంకరమెడ సీసాలు, పిచికారులు, ఒక భూతద్దం ఉన్నాయి.

"ఇంజెక్షన్లా ?"

"ఆ"

సమీపంలో ఉన్న బోను తాకాడు. తీగవల వెనక ఒక సీమ పందికొక్కు మెదలకుండా నాలుగు పంజాలు శరీరం కిందకి ముడుచు కుని పడుకుంది. బొచ్చు నిక్కపొడుచుకుని ఉంది. మూతి ఘాటూ వాసనకొట్టే గడ్డిపక్కమీదికి నిరాశతో వాలి ఉంది.

"దానికి జబ్బుగావుందా ?" అని అడిగాడు బామన్ స్థాయి తగ్గించి.

డాక్టరు తల ఆడించాడు.

"విషప్రయోగం. అంగుడువాపు"

బామన్ తీగవలకు మొహం ఆనించి ఆపేక్షతో ఆ పందికొక్కు వంకే చూసాడు. పందికొక్కు కదలలేదు. దానికి ఈ లోకం గొడవ పట్టలేదు. బామన్ ముందుకు వంగినవాడల్లా నిటారుగా నిలబడి,

"అద్భుతమయిన శాస్త్రం! సూక్ష్మజీవుల శాస్త్రం. అన్నాడు"

"ఆసక్తి కలిగించేది కూడా" అన్నాడు డాక్టరు బహుమెల్లిగా."

"నిజానికి ప్రపంచంలోకల్లా యెక్కువ ఆసక్తి కలిగించేదిదే. ముఖ్యంగా, యెవరికి విషప్రయోగం చేదామా అని తిరిగే ప్రబలశత్రువు."

"దీనికి చాలా ఖర్చయివుంటుందే! అంగుడు వాపురోగంలో మాత్రమేనా నీకు ఆసక్తి?"

"కలరా" అని జవాబిచ్చాడు డాక్టరు." "యింకా..."

"యిన్ని పెంచుతున్నా రెందుకు?"

డాక్టరు బుజాలు ఆడించాడు. ఈప్రశ్న అతనికి సరిపడలేదు.

"కొద్దిగా అమ్మకంగా కూడా వుంది. రాష్ట్రాలలో వీటికి గిరాకీ యెక్కువ. సరఫరా చేసేదల్లా నా ప్రయోగశాలవంటివే. యీ విషయంలో ప్రభుత్వం శ్రద్ధతీసుకోవడం లేదు. ప్రభుత్వానికి వోడ్కా అమ్మకంలో ఆసక్తి హెచ్చు"

"చిత్రంగానే వుంది?" అని బామన్ తల ఆడించాడు. "యిటువంటి విషయంలో ప్రభుత్వం వ్యక్తులను విశ్వసించడం చిత్రంగానే వుంది!"

"యెందుకు విశ్వసించకూడదూ?" అన్నాడు డాక్టరు జాగ్రత పడి. జవాబు ఏమివస్తుందో తెలుసుననే సంగతి డాక్టరు కళ్ళల్లో గోచరించింది.

అయినా బామన్ జవాబిచ్చాడు.

"కామ్రేడ్ వాలెన్‌రాడ్ అనే గ్రంథంలో ప్రవేశిక గామికివిజ్ ఒక వీరగీతం రచించాడు. ఆ గీతం ఒక ఆఫ్రికన్ ఆల్మన్‌సూర్‌కు

సంబంధించింది. ఆతనిని స్పెయిన్ సైన్యాలు ఓడించాయి. పగ తీర్చుకోవడానికి వారి శిబిరాలకు కలరా వ్యాపింపజేసాడు. ఆయుధాలకన్న అదే బలీయమయిందని ఋజువయింది.

ఆస్పెయినువారు శురు - గెత్తారు హడలెత్తి
కొండకోనలనుంచి - పారారు తారెత్తి
దారిలోనే విరుచు - కొనితింది మామ్మారి
పీనుగులను చూస్తే బుగు - లౌను గుండెలుజారి!

"అవును, ఆయుధాలకన్న బలీయమయింది!" అంటూ డాక్టరు ఒప్పుకున్నాడు. "కాని రాజభవనాలమీద కాదు. అంటువ్యాధులు ముందుగా బీద పేటలకు వ్యాపిస్తాయి. సరిగా తిండీ తిప్పలు లేక బలహీనమయినవారి దేహాలకు సోకుతాయి. మృత్యువు యెపుడూ అత్యల్ప ప్రతిఘటననే వెంటాడుతుంది."

బామన్ ఉద్రేకంతో డాక్టరు చేతిమీద చేయివేసాడు.

"బాగా చెప్పావు. మృత్యువు యెప్పుడూ అత్యల్ప ప్రతిఘటననే వెంటాడుతుందనేది అక్షరాలా నిజం. కాని మనదే పైచేయి అయినప్పుడు మానవజాతి మృత్యువును ప్రతిఘటిస్తుంది. నిజం!"

"అలానా? దురదృష్టవశాత్తు నాకో నమ్మకం వుంది (గట్టి నమ్మకం కాదనుకో). ఆల్మన్ సూర్ పద్ధతిలో క్రిమి యుద్ధం చూడడానికి నువ్వూ నేనూ బతికే వుంటాం, కాకపోతే ఒక భేదంవుంది. భావి ఆల్మన్ సూర్‌లు పైనుంచి క్రిములతో నిండిన సీసా కింద పడేస్తారు." పటాలున డాక్టరు ఆగి తనను తాను మందలించుకున్నట్లు తల పంకించాడు "చలి ఎముకలు కొరికేస్తూంటే నేను చర్చలు కొనసాగిస్తున్నాను. యివాళంతా శీతలంగా వుంది. యింత టీ తాగించి నీకు వుత్సాహం కలిగిస్తానులే."

డాక్టరు గదిలోనుంచి వెళ్ళాడు. బామన్ సోఫామీద కూర్చున్నాడు.

అతని ముందున్న నిర్దాక్షిణ్యమయిన మహాపోరాటం గురించిన ఆలోచనలు ఈ సమయంలో అతని మనసులో పాగాడడం చిత్రం

గా నేడుంది. మంచి పడుచుతనంలో విప్లవ మార్గంలో అడుగుపెట్టి టపుడుగాని, సెయింట్ పీటర్స్‌బర్గ్‌లోగాని, ఆ తరవాత పీటర్స్— పాల్ కేసులోగాని, న్యార్కా—లో ప్రవాసం అనుభవించేటప్పుడుగాని, విదేశాలలో పనిచేస్తూ లెనిన్‌తో మాట్లాడినపుడుగాని యీ ఆలో· చనలుతీవ్రంగా, యింత స్పష్టంగా రాలేదు.

(క్రిమియుద్ధం! వర్గపోరాటం యుద్ధభూమిలోకి ఈడ్చుతున్న రెండు ప్రపంచాలకు రాజీ కుదిరే అవకాశంలేదు. ఉండదు. అందులో కార్మికవర్గ శత్రువు, పెట్టుబడితో దోచుకునేవారు తమ అధికారాన్ని కొనసాగించుకోవడానికి దేనికయినా, కలరా వ్యాపింపజేయడానికయినా ఒడిగడతారు.)

బామన్ లేచి నిలబడి అటూ ఇటూ పచారుచేయసాగాడు.

రెండుసార్లు తిరిగాడో లేదో తలుపు తెరచుకుని ఒక స్త్రీ గుమ్మంలో ప్రత్యక్షమయింది. ఆమె మొహం ఎరిగిన మొహంలానే ఉంది. కాని బామన్ వెంటనే గుర్తుపట్టలేకపోయాడు.

ఒక సెకండుకూడ తటపటాయించక ముందే 1902 లో మాస్కో శివార్లలోని ప్రోషిన్‌మిల్లులో జరిగినసమ్మె జ్ఞప్తికి వచ్చింది. ఇలీనా! మందహాసం చేస్తూ, ఉద్వేగంతో అతనిని సమీపించింది.

"ఆశ్చర్యం! నువ్వని అనుకోలేదు. డాక్టరు యేమాత్రం సందివ్వలేదు. అతనెంత దాపరికపు మనిషో నీకు తెలుసు. ఒక మనిషి నను చూడడానికి వచ్చాడు" అనిమాత్రం చెప్పాడు. 'సాధారణ మయిన మనిషి' అన్నాడు.

" అవును. ఆయన చెప్పింది నిజం. " అని అడ్డు వచ్చాడు బామన్ ఆమెతో కరచాలనంచేస్తూ.

"నేను అసాధారణమయిన వాడినేం కాను. సరేగాని, నేను వచ్చానని యెలా గ్రహించావు?"

"తలుపు కంతలోంచి తొంగిచూసాను" అంది ఇరీనా నవ్వుతూ. నువ్వు సోఫామీద కూర్చుంటివి. కంతలోనుంచి సోఫా కనిపించలేదు. అందుకని కాసేపు ఆగవలసి వచ్చింది. నువేగనక మాలో ఒకడవయితే ఎక్కువసేపు కూర్చోలేవని నా నమ్మకం. నువ్వు లేచి పచార్లు

చేస్తావని నాకు తెలుసు. చివరికెలాగయితేనేం నువు సోఫామీదనుంచి లేవడం వినిపించింది. అప్పుడు నా కంటపడ్డావు. తక్షణమే నిన్ను గుర్తు పట్టేసాను."

"కాని నేను వస్తానని నీకు యెవరు చెప్పారు?"

"మార్యా పావ్లోవ్నా."

"మార్యా పావ్లోవ్నా! డాక్టరు భార్యా? ఆమె..."

"పార్టీ సభ్యురాలా? కాదు." అని ఇరీనా తల ఆడించింది. డాక్టరూ పార్టీ సభ్యుడుకాదు. క్రిమిశాస్త్రజ్ఞుడు. కాని మనమంటే ఆయనకి సానుభూతి. అన్ని యిళ్ళల్లోకి యిదే వుత్తమమయింది. చాలాకాలంనుంచి యీ యింటిని వుపయోగించుకుంటున్నాం. నువు రావడం, మనం కలుసుకోవడం యెంత అద్భుతంగావుంది? యింటికి చేరుకోబోతున్నా. డాక్టరుతో కొజుబా...."

"ఒహో!" అన్నాడు బామన్ సంతోషంతో. "కొజుబాకూడా యిక్కడే వున్నాడా? కీవ్‌లో వున్నాడనుకున్నాను"

"మెన్షివిక్కులు అతనిని కీవ్‌లో నిలవనిస్తేనా?" అని ఇలీనా మొహం ముడుచుకుంది. "వాళ్ళు మనవారిని పనిచేయనీయడం లేదు. మనను గురించి పోలీసులకి కొండాలు చెప్పడం తప్ప వేరే ఆలోచన వాళ్ళకి లేదు. కొజుబా యిది పెద్దగా తీసుకోలేదు. మాస్కోలో వుండడమే అతనికి యెక్కువ యిష్టం. యిక్కడకూడా మెన్షివిక్కులదే పైచేయిగా వుంది. వారి అదుపులో ఇస్క్రా చాలా నష్టం కలగ జేస్తోంది. లెనిన్ అధీనంలో వున్నపుడు ఇస్క్రాని ప్రజలు యెక్కువ చదువుతుండేవారు. అందులో ప్రతిమాటా నమ్మతగిందేనని వారికి తెలుసు యిక యిపుడో, పత్రిక పూర్తిగా మారిపోవడం కార్మికులకు ఆశ్చర్యం వేసింది. అయినా యిప్పటికీ ప్రతిమాటా శ్రద్ధగా వింటు న్నారు. ఇస్క్రాకి లెనిన్‌కి సంబంధం లేదని మెన్షివిక్కులు కార్మికులకు చెప్పడంలేదు."

"మరేం పరవాలేదు. కార్మికులు వాళ్ళంతట వాళ్ళే తెలుసు కుంటారు" అని బామన్ చిరునవ్వు నవ్వాడు. సరేగాని నువు

మాస్కోలో యెందుకు వున్నావు? నిన్ను అరెస్టుచేసి తూర్పు సైబీరియాకు ప్రవాసం పంపారని నేను కీవ్‌లో వుండగా కొజుబా చెప్పాడే?''

''ప్రవాసంనుంచి కూడా తప్పించుకోవచ్చని కొజుబాతో అంటేవిగా, జ్ఞాపకం లేదూ? ప్రోషిన్‌మిల్లుకు వచ్చిన రాత్రి చెప్పావు. యెప్పుడూ అదేస్మరణ. సరే, ప్రవాస ంనుంచే తప్పించుకోగలమంటే, ప్రవసానికి వెళ్ళే దారిలో తప్పించుకోవడం చిన్నపిల్లల ఆట! వాలోగ్డా దాకా వెళ్ళాను. అక్కడ తప్పించుకు బయటపడడానికి పిల్లలు సాయపడ్డారు. యిపుడు నేను రాజకీయ కార్యకర్త్రిని కామ్రేడ్ రూక్! చట్టవిరుద్ధంగా పనిచేస్తున్నాను. సరటోవ్‌లో కొంత పనిచేసాను. అక్కడనుంచి యిక్కడికి వచ్చాను. యిపుడు కొలోమ్నాలో నివసిస్తున్నా.''

''కమిటీకా వెళ్ళడంలేదా?''

''మాస్కో కమిటీనే? ఉహుం- వెళ్ళడంలేదు. అందులో అంతా మెన్షివిక్కులే.''

''ఒక్క నిమిషం ఆగు'' బామన్ మొహం విచారగ్రస్తమయింది. ''మనవాళ్ళెవరూ ఆ కమిటీలో లేరనేగా నువు చెప్పదలచింది?''

''కొజుబా ఒక్కడున్నాడు. అతని నేమీ చేయలేకపోయారు! ప్రొఖొరోవ్ మిల్లులో పనిచేస్తున్నాడేమో అందులోని కార్మికులందరూ అతనిని బలపరుస్తున్నారు. అంతేకాదు, రహస్యంగా సంచరించడంలేదు. నికొలాయ్ నికొలయేవిచ్ గ్రాకోవ్ అని మారుపేరు పెట్టుకుని బహిరంగంగానే తిరుగుతున్నాడు. నీచేతిచల్వ నువ్వేగా ఆపేరు పెట్టింది.''

''ఇంతకీ అతనెక్కడున్నాడో నీకు తెలుసా?''

ఇరీనా ఒకసెకను ఆలోచించి,

''చెబుతా. విను...యిపుడు అతని దగ్గరకు వెళ్ళడం మంచిది కాదు. వుదయం తీసుకు వెళతా. తప్పకుండా తీసుకు వెళతా. రేపు కమిటీ సమావేశం. సమావేశానికి ముందే అన్నివిషయాలు అతనితో నువు మాట్లాడడం మంచిదనుకుంటాను.''

''సరే'' అని బామన్ తలఊపాడు. ''రేపు యెక్కడ కలుసుకుందాం?''

"యిక్కడే." అని ఇరీనా మందహాసం చేసింది. "యీ రాత్రికి యిక్కడే వుండిపోతాను మార్యాపావ్లోవ్నా అభ్యంతరం చెప్పదు. నన్ను చాలా దయతో చూస్తుంది. మనం లోపలికి వెళ్ళడానికి చాలా వ్యవధివుంది. యీలోపున తాజావార్తలు చెపుతా. యిక్కడ పని చేయడం చాలా కష్టంగా వుంది. కామ్రేడ్...నికొలాయ్ ! ఒక వేపున మెన్షివిక్కులు, గస్టిల్యోవ్ కూడా ప్రోఖొరవ్ మిల్లునుంచి యిక్కడకు వచ్చేసాడు. ఆ తెలివితేటలతో యిక్కడ చాలా ముఖ్యమయిన వాడుగా తయారయ్యాడు. యింకోవేపున, జుబటోవ్ వస్తినా ♦ కార్మికులలో రహస్య పోలీసుశాఖ బాగా పనిచేస్తోంది. వాళ్ళు మెన్షివిక్కుల లాగానే విప్లవం గొంతు నులిమేయాలని ఆట ఆడుతున్నారు."

"ఆగు. జుబటోవ్ కి కిందటి సంవత్సరం వుద్వాసన జరగలా?"

ఇరీనా నిట్టూర్చింది.

"జుబటోవ్ అయితే వెళ్ళిపోయాడు గాని యింకా జుబటోవ్ వస్తినా పోలేదు. జుబటోవ్ కు వుద్వాసన జరిగినట్లు లేదు. పోలీసుశాఖలో పని చేస్తున్నాడంటున్నాడు"

తలుపు తెరచుకుని డాక్టరు చశ్కా వచ్చాడు.

"ఒకరినొకరు యెరుగున్నారన్నమాట, యింకేం. కాసేపు రహస్య కార్యకలాపం గాలికి వదలివేసి లోపలికి వస్తే యింత టీ తాగుదాం..."

---

♦ జుబటోవ్ వస్తినా రహస్యపోలీసుశాఖ ఉన్నతోద్యోగి జుబటోవ్ స్థాపించిన సంఘం. 'పోలీసు సోషలిజం' ను ప్రచారం చేయడానికి ఈ జుబటోవ్ యత్నించాడు రహస్య పోలీసుశాఖ రక్షణకింద కపటపు కార్మికసంఘాలను ఏర్పాటుచేసి విప్లవోద్యమంనుంచి కార్మికులను మళ్ళించాలని చూసాడు.

# 3
# కమిటీ సభ్యులు

కొజుబా కమిటీ చిరునామా ఇచ్చాడు. ఆ ఇల్లు ఒక దంత వైద్యుడిది. రహస్యంగా పనిచేసేవారికి ఇటువంటి చిరునామాలు చాలా అవసరం. నౌకర్లకు అనుమానం కలిగించకుండా రోగులమని చెప్పుకుని లోపలకు వెళ్ళవచ్చు. అంతేకాదు ఆగృహస్తునుకూడా ఎవరూ అనుమానించరు రోగులమంటూ వస్తే ఆబాధ్యత డాక్టరుదికాదు. ఈతడవ కమిటీసభ్యులు బ్రొనాయా వీధిలోని ఒక దంతవైద్యుడి ఇంటి నాలుగో అంతస్తులో కలుసుకుని, అతని కచేరీగదిలో సమావేశమయారంటే ఆబాధ్యత డాక్టరుదా ? ముందుగా వేళ నిర్ణయించుకునే రోగులను పరీక్షిస్తాడు. ఇవాళటి జాబితాలోని పేర్లు మారుపేర్లని ఎవరు రుజువు చేయగలరు ? దంతాలు కట్టలేదు, పీకలేదు అని ఎవరు రుజువు చేయగలరు ? ఇదంతా రష్యన్ సోషల్ డెమాక్రాటిక్ లేబరుపార్టీ మాస్కో కమిటీ సమావేశమవడానికి ముసుగు అని ఎవరు రుజువుచేయగలరు ?

ముందుగా నిర్ణయించుకున్న వేళలోనే రోగులను చూస్తానని డాక్టరు పట్టు. ఒకవేళ కమిటీ సమావేశమవుతున్న వేళలో ఎవరయినా రోగి గంట కొడితే బామన్‌కు జవాబు చెప్పినట్లే అతనికి జవాబు చెపుతాడు. బామన్ కొజుబా సూచించిన వేళకు డాక్టరు గదిలో ప్రవేశించాడు.

"క్షమించండి. యివాళ మిమ్మల్ని చూడలేను యింకా నాలుగు రోజులవరకూ తీరుబడివుండదు. రోగులను పరీక్షించడంతో సరిపోతుంది. వచ్చేవారం మధ్యలోగాని మిమ్మల్ని చూడడం పడదు."

సంకేతం చెప్పకుండా బామన్ డాక్టరు ఈచిన్న ఉపన్యాసం ఇచ్చేటట్టుచేసాడు. ఇక్కడకు రావడం సురక్షితం అవునో కాదో తేల్చుకోవాలనుకున్నాడు.

దంత వైద్యుడు తలుపు తీసాడు. ఈవేళలో నౌకర్లు ఇంట్లో ఉండరు. సంకేతం కోసరమని అతను స్వయంగా తలుపు తీస్తాడు. ఈ లాంఛనాలు నిజానికి అనవసరమే. కమిటీ కార్యదర్శి గ్రిగరీ వాసిల్యేవిచ్ అతని స్నేహితుడు. తక్కిన సభ్యులందరి మొహాలు బాగా ఎరుగును.

కాని ఈతడవ కొత్తమనిషి ఎదురయాడు. ఆ కొత్త మనిషి సంకేతం చెప్పలేదు. అనుమానంతో చుట్టూచూసి దంత వైద్యుడికేసి తేరిపారజూచాడు. కళ్ళు వెలిగిపోయాయి. కాని డాక్టరు భయంతో, కోపంతో, "క్షమించు" అని బొబ్బరించాడు.

"యీ తడవకు చూసి పంపుదురూ?"

"ఉహుఁ – క్షమించు. రోగులునిరీక్షిస్తున్నారు." అని దంత వైద్యుడు తలుపు తెరిచాడు.

బామన్ కోటు ఊడదీసి,

"మార్యా పెట్రొవ్నా దగ్గరనుంచి వచ్చాను" అన్నాడు.

దంత వైద్యుడు తలుపుమూసి, "మార్యా పెట్రొవ్నా బాగా వుందా?" అని గొణిగాడు కళ్ళు పైకెత్తి చూడకుండా.

"బాగానేవుంది." అన్నాడు బామన్ మెడ రుమాలు ఊడ తీసుకుంటూ. "కబార్డియన్లతో రష్యన్ల యుద్ధం లేక అందమయిన మహమ్మదీయ స్త్రీ..."

"...భర్త శవపేటికమీద మరణం" అని దంత వైద్యుడు సంతోషంతో పూర్తిచేసాడు. "యిక్కడికి రాగానే యీ ముక్కలు మొదుకు అనలేదూ? నువు కొత్తవాడివా? నేను అనుకున్నాను..."

"ఆఁ –" అని బామన్ జవాబిచ్చాడు. "లోపలికి వెళ్ళవచ్చా?"

తెర తొలగించి కచేరీ గదిలోకి వెళ్ళాడు.

అయిదుగురు వ్యక్తులు ఒక మేజాబల్ల చుట్టూ కూర్చున్నారు. మేజామీద మొఖమలు గుడ్డ పరిచిఉంది. నిరీక్షణ గదిలో నిరీక్షించే అందరిలాగానే వారూ పత్రికలు చదువుకుంటున్నారు.

ఈ కొత్త రోగి ప్రవేశించేసరికి నాలుగు మొహాలు పత్రికల చాటునఉన్నాయి. నాలుగు జతల కళ్ళు అచ్చుమీద కేంద్రీకరించాయి!

ఇక అయిదో వ్యక్తి చూపు కిందకు లేదు. అతను గస్టిల్యోవ్-బామన్‌ను చూడగానే గుర్తుపట్టాడు.

బామన్ గుమ్మంలోనుంచే వంగి నమస్కరించాడు. నిమిషం కితం హాలులో నవ్వినట్టే అతని కళ్ళు ఇప్పుడూ నవ్వుతున్నాయి. ఆ వ్యక్తులంతా రహస్య కార్యకర్తలలాగానే ప్రవర్తిస్తున్నారు. తనే గనక పోలీసు బంటు నయితే అక్కడేం జరుగుతున్నా గ్రహించే వాడినని బామన్ తలపోశాడు.

"క్షమించండి. ఆఖరివారెవరు ?"

"కామ్రేడ్స్!" అన్నాడు గస్టిల్యోవ్ మెల్లగా. మొహాలకు అడ్డంగా ఉన్న పత్రికలు తొలిగాయి. ఆశ్చర్యం, జాగరూకత ఆ మొహాలలో గోచరించాయి. "ఈతను రెండో పార్టీ కాంగ్రెసుకు మాస్కో సంఘ మాజీ ప్రతినిధి, కామ్రేడ్..."

"సారోకిన్" అని బామన్ తొందర తొందరగా మళ్ళీ వంగి నమస్కరించాడు. "మాస్కో సంఘానికి నన్ను పంపారు."

"ఆదేశపత్రంయేదీ?" అని అతిమెల్లగా అన్నాడు గ్రిగరీ వాసిల్యేవిచ్ కొత్తమనిషివంక ప్రతికూల దృష్టిపరుపుతూ. కాంగ్రెసులో సారోకిన్ పట్టుదలతో ఇస్క్రా పక్షం వహించాడనీ, లెనినిస్టు అనీ అతనికి తెలుసు. "ఆదేశ పత్రంఉందిగదూ, కామ్రేడ్ సారోకిన్!"

బామన్ తల పంకించి జేబులోంచి చాకుతీసి చొక్కా చేతి కుట్టును కోసి సన్నటి గుడ్డముక్క పైకి తీసాడు.

"కేంద్ర కమిటీనుంచి ఆదేశ పత్రం" అన్నాడు కార్యదర్శి, తదితరులవంక చూసాడు. వారూ అతనివంక చూసారు.

కేంద్ర కమిటీలో ప్లెఖనోవ్, మార్టోవ్‌లకు వ్యతిరేకంగా లెనిన్ తీవ్రంగా పోరాటం సాగిస్తున్నాడని ఆ అయిదుగురుకీ తెలుసు. ఈ కారణంవల్లనే కొత్తమనిషివంక కంపరంతో చూసారు. ఇతను ఎవరిపక్షం వహిస్తున్నాడో?

కేంద్ర కమిటీలో మెన్షివిక్కులదే పైచేయిగా ఉంది. ఆదేశ పత్రం నిజమయినదే. సరిగా అధికారయుతంగా ఉంది. నిరసించ

డానికి కారణాలు కనిపించవు. గ్రిగరీ వాసిల్యెవిచ్ తన ఆలోచనలు గుదిగుచ్చి బిగ్గరగా,

"యేమంటారు కామ్రేడ్స్? కేంద్రకమిటీ ఆదేశాలప్రకారం కామ్రేడ్ సొరోకిన్‌ను చేర్చుకుందామా?" అని అడిగాడు.

ఒకరూ జవాబు చెప్పలేదు. ఈ కొత్తమనిషి 'అన్యశిబిరా'నికి చెందినవాడేమో? ఆదేశపత్రం లిఖించబడిన గుడ్డపీలిక అంచును కాలుచున్న సిగరెట్టుకొనకు అంటించాడు. అంటుకుంది. ఉంగరాలు ఉంగరాలుగా పొగలేచింది. గుడ్డపీలిక బూడిదగా మారి ఆష్‌ట్రేలో పడింది.

"విదేశాలలోని పార్టీవర్గాల పరిస్థితినిగురించి చెప్పమని యీ కామ్రేడ్‌ను అడుగుదాం. లెనిన్ పూర్తిగా పరాజయం పొందేడనే మాట యెంతవరకు నిజం? యెంత పతనమయాడు? బయలుదేరే ముందు జార్జి వాలెన్‌టినోవిచ్ ప్లెఖనోవ్‌ని చూచావనుకుంటాను?"

ఈప్రశ్న కోపాన్ని రగిల్చేదే. బామన్‌కు యుక్తిగా మాట్లాడే హక్కును ఇచ్చింది. కాని రాజకీయాలలో ఒకరిమీద ఒకరు దుమ్మెత్తి పోసుకోవడం, తంత్రాలు బామన్ సహించలేదు. ఇక్కడి మెన్షివిక్కులకే అది తగిపోయింది.

"నేను ప్లెఖనోవ్‌ను చూడలేదు, వ్లాడిమిర్ ఇల్యిచ్ లెనిన్‌ను చూచాను."

"లెనినిస్టు!"

బామన్ మాటలు వారిలో తీవ్రమయిన హఠాత్సంచలనాన్ని కలిగించాయి. గ్రిగరీ వాసిల్యెవిచ్‌కి ఆశ్చర్యంతో గొంతు పెగల లేదు. కాని ఆ మరుక్షణంలో హాలులో గంటమోగింది. కొజుబా లోపలికి చక్కావచ్చాడు. కమిటీసభ్యులను ఎగాదిగా చూసి మొహం ముడుచుకుని "యిక్కడికి పోలీసుబంటును యెవరు తీసుకువచ్చారు? చెప్పండి. సింహద్వారంలో పోలీసుబంటు వున్నాడు."

బామన్ తల పంకించి,

"గ్లోరియోలు హాటు పెట్టుకున్నాడు. హాటునెత్తిమీద ముడత వుంది. వచ్చేటపుడు నేనూ చూసాను." అన్నాడు.

"నా వెనకాలే తలుపుమూసుకుంది" అన్నాడు కొజుఖా మీసా లకు అంటుకున్న మంచునీరు పీల్చుతూ.

"నా వెనకే వచ్చాడని తలుస్తున్నాను."

"అసంభవం!" అని గస్టిల్యోవ్, గ్రిగరీవాసిల్యెవిచ్‌లు ఏక కంఠంతో అరిచారు." "బయటపడకుండా వుండడానికి పోలీసు యేజంట్లు గుమ్మాలదాకా యెవరినీ అనుసరించిరాకూడదని నిక్కచ్చిగా నిషేధం వుంది"

"అవును, వుంది" అంటూ ఏకీభావం తెలిపాడు కొజుఖా. "అయినా వచ్చాడు."

హాలులో తిరిగీ గంట మ్రోగింది. అస్పష్టంగా వినిపించీ వినిపించ నట్లుంది. భామన్ మందహాసంచేసి తల ఆడించాడు.

"అధికార ఆదేశాలను యేజంట్లు వుల్లంఘిస్తున్నారని పోలీసు శాఖకు ఫిర్యాదుచేస్తే బాగుంటుందని నాకు తోస్తోంది."

# 4

## రోగి

ఆ పోలీసుబంటు వెంటనే గంట వాయించలేదు.

కొజుబాని అనుసరించి ఆ భవనంలోనికి వచ్చాడు. వచ్చాడంటే ఈ భారీమనిషిని, ఈ గడ్డంమనిషిని, వయసుమీరిన వాడిలాగా కనిపించినా నీటుగా కుడిటినీ, టోపీ ధరించిన ఈ కార్మికుని అనుమానించికాదు. ఆ భవనం చాలా పెద్దది. చవకబారు గదులు చాలా ఉన్నాయి. దర్వానా లేదు. రకరకాల మనుషులు ఇందులో నివసిస్తున్నారు. ఇటువంటి భవనంలో నివసించడానికి కావలసింది. ఆ మనిషి సంపాదిస్తున్నాడని పై ఆకారంవల్ల తెలుస్తూనేఉంది. బయట శీతలం తీవ్రమవుతోంది. అందుకూ పోలీసుబంటు లోపలికి వచ్చింది! చెవులు, చెంపలు తిమ్మిరెక్కినాయి. వాటిని రుద్దుకోవడం చాలా అవసరం. అతని కచేరీ బూట్లు బొటనవేళ్ళనేం రక్షించడం లేదు. బొటనవేళ్ళు గడ్డకట్టుకుపోకుండా కాళ్ళు జాడించుకోవాలి. హాలులో వెచ్చగా ఉంటుంది. ఈ భవనంలోకి రావడం అతనికి కొత్తకాదు. వచ్చినపుడల్లా రెండుగంటలకు తక్కువకాకుండా ఉండి వెళ్ళేవాడు. ''మృత్యుముఖం''లో పడే ప్రమాదంలేదు. ('మృత్యుముఖం' అనేది గస్టిల్యోవ్ పేరుగా పోలీసు గూఢచారులకు తెలుసు. వారి నివేదికలలో అలానే పేర్కొనేవారు) అందుచేత...

లోపలికి వెళ్ళి, కొజుబా మెట్లుఎక్కి వెడుతూంటే అలవాటు చొప్పున అడుగుల చప్పుడు వినడానికి చెవులు నిక్కబొడుచుకుని సిగరెట్టు వెలిగించాడు. హఠాత్తుగా అడుగుల చప్పుడు ఆగిపోయింది. ఆ కార్మికుడు ఆఖరిమెట్టు మీదగాక మెట్లమధ్యలో ఆగాడని తలచి ఆ పోలీసు బంటు చెవులు దొరచేసుకు విన్నాడు. వెంటబడ్డాడో లేదో అని నిర్ధారణ చేసుకోడానికి ఆగాడు?

తిరిగీ అడుగుల చప్పుడు కాగానే పోలీసుబంటుకు అనుమానం ఎక్కువయింది. రాజకీయంగా అల్లర్లు లేవదీసేవాళ్ళే ఎవరయినా వెంట పడ్డారేమోనని ఆగిచూస్తారు. అందుకని ఈ కార్మికుడు...

పేరు సంపాదించుకుని పైకి రావడానికి అవకాశం చిక్కిందనే ఆశాభావంతో పోలీసుబంటు గుండె టకటకా కొట్టుకుంది. వెంట పడ్డాలనే ఆవేశం అతనిని చుట్టివేసింది.

మెట్లమీద గబగబా నడుస్తూ పైవాళ్ళ కంట పడకుండా నేర్పుగా జాగ్రతపడ్డాడు. కార్మికుని అడుగుల చప్పుడు నాలుగో అంతస్తుతో ఆగిపోయింది. నిశ్చయం. సమయం కోసం కాచుకుని గోడకు ఆనుకుని పోలీసుబంటు నిలబడ్డాడు. తలుపు మూతపడింది ఒక క్షణం ఆగి పైకివెళ్ళాడు.

నాలుగోఅంతస్తు ఆఖరిమెట్టు దగ్గరగా ముందు గుమ్మాలున్నాయి. మొదటిగదికి కొయ్యచెక్కమీద 'గార్డ్సు కలనల్ వాన్ డెర్‌పాలెన్' అని వ్రాసి ఉంది. కార్మికు డెవడూ ఆగుమ్మంగుండా వెళ్ళడు. ఇక ఆగదిలోకి వెళితే ప్రయోజనం లేకపోగా తన్ని తరిమివేస్తాడు. ఆకార్మికుని ఎవరయినా మరమ్మతులు చేయడానికి పిలిస్తే దొడ్డిదోవను వెళ్ళేవాడు. రెండో అంతస్తులోకి కార్మికుడు వెళ్ళడం కూడా సంభవం కాదు. ఇంపీరియల్ సంగీతనృత్యనాటక బృందానికి చెందిన ఒక నటి ఆగదిలో ఉంటోంది. మూడోగది తలుపుమీద

దంతవైద్యులు

విల్హెలం ఫెర్డినాన్డోవిచ్

వాగ్‌ట్

ప్రవేశగంటలు : ఉదయం 11-2; సాయంత్రం 6-8.

మంగళవారాలు మినహా.

వీధిలోనుంచి చర్చి గంటల గణగణధ్వని వినిపించింది. సాయంకాలం ప్రార్థనలకు రమ్మని గంట మోగిస్తున్నారు. ఆ రోజు శనివారం. అంటే డాక్టరు రోగులను చూచేరోజే.

కాని సాహసించడం మంచిదా?

పోలీసు ఆదేశాలు ఖండితంగా ఇటువంటిపనిని నిషేధించాయి. అతను శిక్షణ పొందిన పోలీసుబడిని నడిపింది మెడ్నికోవ్. ఈ మెడ్ని కోవ్ అపరాధపరిశోధనలో మంచి నేర్పరి. కాని ఆదేశాలు ఆదేశాలే. బుద్ధినికూడా ఉపయోగించాలనే సంగతి ఈ పోలీసుబంటుకు తెలుసు.

"బయట పడవద్దు" అనేది ఆఖరుకు యథార్థమయినా, ఇంకో రాజకీయ నేరస్థుణ్ణి బట్టబయలుచేసే అవకాశం లభించినపుడు, కార్మి కుణ్ణి చితకదన్నడానికి అవకాశం లభించినపుడు, ఇంకో రహస్య చిరు నామా తెలుసుకునే అవకాశం లభించినపుడు ఏంచేయాలి? 'మృత్యు ముఖం' అక్కడ ఉంటే తను చేసినదానికి ఎవరూ తప్పుపట్టరు. పెద్ద కేసు తయారవుతుంది. ఈ ఆలోచనతో అతను ఉక్కిరి బిక్కిరయ్యాడు.

కార్యాచరణకు తొందర తొందరగా పథకం వేసుకొన్నాడు. హాటు తీసివేసాడు. జేబులోంచి రుమాలుతీసి (రుమాలు మాసిపో యింది. ఇలాంటి అవాంతరం వస్తుందని అతనికేం తెలుసు.) చెంపలు మీదుగా నెత్తికి కట్టుకొని తటపటాయిస్తూ గంట నొక్కాడు. తలుపు తెరవలేదు. లోపల ఏదో జరుగుతోందని అనుమానం హెచ్చింది. సమాచారం అందజేస్తే రహస్య పోలీసుశాఖ బాగా డబ్బు ముట్టజెప్తు తుంది. పోలీసు సోదా బృందంలాగా గంట గట్టిగా నొక్కాడు.

దంతవైద్యుడే స్వయంగా తలుపు తెరిచాడు. పోలీసు బంటు హాలులోకి జేరుకున్నాడు. అక్కడ వేలాడుతున్న కోట్లులో ఆ కార్మి కుని కోటు, 'మృత్యుముఖం' ఓవరుకోటు కనిపించేసరికి పొంగిపోయాడు.

నిరీక్షణ గదిలో కూర్చున్నవారు హాలులో జరుగుతున్న సంభా షణ విన్నారు. హెచ్చరిక సూచకంగా దంతవైద్యుడు బొంగురు గొంతుతో మాట్లాడుతున్నాడు.

"వాదించుకుంటున్నారు" అన్నిగ్రిగరీ వాసిల్యెవిచ్ ఆదుర్దాగా మెల్లిగా చెప్పాడు "వినిపిస్తోందా? పోలీసులువాడివెంట వున్నారంటావా? యేదో ఒకటి చేయాలి!

అప్పటికే అంతా జాగ్రతపడ్డారు. గోడవారనే ఉన్న పడక కుర్చీలలో డాక్టరుచేత పరీక్ష చేయించుకోవడానికి నిరీక్షిస్తున్నట్టు కూర్చున్నారు. అంతా వార్తాపత్రికో, పత్రికో చదువుతున్నారు.

బామన్ మేజాబల్ల దగ్గరేఉండి, 'రూసకోయేస్లోవో' అని పత్రిక ముందు వంగి చదువుతున్నాడు.

హాలులో వాదన బిగ్గరగా, ఇంకా బిగ్గరగా వినిపించసాగింది. తరవాత గొంతులు వినిపించలేదు.

తెర కొద్దిగా తొలగించుకుని ఒక వ్యక్తి హాలులో మెల్లగా అడుగుపెట్టేసరికి గస్టిల్యోవ్ కనుబొమలు భయంతో పైకి ఎగరడం బామన్ కనిపెట్టాడు. ఆ వచ్చిన వ్యక్తి కురూపి. కుడితినీ వేసుకున్నాడు. పంట్లాం చినిగిపోయినా మడత శుభ్రంగాఉంది. గూఢచారి వేషం బాగా ఉండాలని మెడ్నికోవ్ నొక్కి చెపుతూండేవాడు. "గూఢచారి పెండ్లికొడుకులు వేషం వేసుకోవాలి. పెండ్లికొడుకులు నటించాలి." ఇవీ అతనికి అభిమానపాత్రమయిన మాటలు!

చెంపలమీదుగా తలకు కట్టుకున్న రుమాలుమీద చేయి పెట్టుకుని ఆ పోలీసుబంటు భయపడుతూ తిరుగుడు కుర్చీలో కూర్చున్నాడు. ఆ కుర్చీ హాలు గుమ్మంవారే ఉంది.

గదిలో నిశ్శబ్దం. కోజుబా మినహా తక్కినవారంతా పత్రికలు చదువుకోవడంలో నిమగ్నులయారు. చిన్న సోఫాలో ఆనుకుని కూర్చుని పోలీసుబంటు వంక అమాయికంగా తేరిపారజూచాడు. లోపలికి రావడానికి ఎంత ధైర్యం! ఇంతటితో ఊరుకుంటే లాభంలేదు.

ఇదే ఆలోచన బామన్ మనసులోనూ తారాడింది. వార్తాపత్రిక మొదటి పేజీలోని ప్రకటనలలో నిమగ్నుడయినట్లు నటించసాగాడు.

ఇంకెపుడయినా అయితే ఆ ప్రకటనలు ఆసక్తిని రేకెత్తించేవే. జీవితంలోని ప్రధాన విషయాలకు సంబంధించిన వా ప్రకటనలు.

"ఒక పెద్దమనిషికి పెళ్ళి కుదిర్చే మనిషి కావాలి. నూరు రూబుళ్ళ నోటు నెం 146588 తాలూకు, కేంద్రతపాలా కచేరీ అని వ్రాయాలి

"కాటలయును. కొనోటాప్‌లోని ఒక వాణిజ్య పాఠశాలకు క్రిస్టియన్‌డాక్టరు కావాలి"

'క్రిస్టియన్' అనేమాట పెద్ద అక్షరాలలో అచ్చువేసారు. అచ్చుఆఫీసులో మేకప్‌మాన్ పని బాగా తెలిసినవాడయి ఉంటాడు.

ఇంకా క్రింద 'బాక్సు' కట్టి ఉంది.

"హృదయకవచం. తుపాకిగుండ్లనుంచి, కత్తిపోట్లనుంచి రక్షణ. గ్యారంటీ. పెద్ద పెద్ద హోదాలలో ఉన్నవారనేకమందికి సరఫరా చేయబడింది"

అందులో "పెద్ద పెద్ద హోదాలలో ఉన్న..."

"తయారీ! యన్. రీజర్, ఆచర్ట్‌లో నేతపాఠశాల మాజీ హెడ్మాస్టరు"

ఈ ప్రకటనలు చదువుతూనే బామన్ పోలీసు బంటుమీద ఒక కన్ను వేసి ఉంచాడు. పోలీసు బంటు ఇది గుర్తించాడు. ఊరికే కదిలిపోతూ మూలిగాడు. బామన్ వెంటనే అతనికేసి చూసి,

"అంత బాధగావుందా?" అని అడిగాడు.

అతని గొంతు ప్రశాంతంగా, సానుభూతితో కూడి ఉంది.

"మహా బాధగావుంది" అంటూ పోలీసు బంటు మూలిగాడు. "వరసగా మూడు రాత్రిళ్ళనుంచీ నిద్రలేదు. పిచ్చెత్తేటట్లుంది."

బామన్ గ్రిగరీ వాసిల్యెవిచ్‌ని పిలిచాడు. శస్త్రచికిత్స గది గుమ్మంలో గ్రిగరీ కూర్చుని ఉన్నాడు. ఆ గదిలోనుంచి తొలుస్తున్న శబ్దమయింది. (రోగిని పరీక్షిస్తున్నట్టు డాక్టరు నటిస్తున్నాడు).

"క్షమించండి. యీతడవ మీావంతేనా? యీ పెద్దమనిషిని ముందు పరీక్ష చేయించుకోనివ్వండి. పంటిపోటుతో మహా బాధపడుతున్నారు."

"సరే. సరే" అని వెంటనే అంగీకరించాడు గ్రిగరీ వాసిల్యెవిచ్. "తప్పకుండా నేను మూడు పళ్ళు కట్టించుకోవాల్సివుంది. చాలా సేపు పడుతుంది. వారికి అభ్యంతరం లేకపోతే..."

"ఉహుఁ—" అని పోలీసుబంటు బిగ్గరగా అన్నాడు. విపరీతమయిన భయంవేసింది. భయంతో, ప్రార్థనాపూర్వకంగా నలిగిపోయిన చొక్కా ముందుభాగం పట్టుకున్నాడు. వ్యవహారం ఇలా తిరగడం అతనికి రుచించలేదు.

"మీా కెందుకూ శ్రమ యివ్వడం."

"దయాధర్మం" అని కొజుబా బొబ్బరించాడు. సోఫాలోనుంచి అతని గొంతు ఖంగుమంది. గొంతు అతని గొంతులాలేదు. "మని షికి సహాయం యెందుకు చేయకూడదు?"

హాలు తలుపు తెరిచి మూసిన చప్పుడయింది. బహుశా దంత వైద్యుడు రోగిని పంపించి వేస్తున్నట్లున్నాడు. శస్త్రచికిత్స గది తలుపు తెరుచుకుంది. వాగ్ట్ తరవాత రోగిని రమ్మన్నాడు. గ్రిగరీ వాసిల్యె విచ్ లేచి నుంచుని ఏదో చెప్పబోయాడు. కాని బామన్ ముందు గానే,

"డాక్టర్ ! ముందుగా రోగిని పరీక్షించండి. మాకేం అభ్యం తరం లేదు" అంటూ పోలీసుబంటును చూపించాడు. "చాలా అవస్థ పడుతున్నాడు. వెంటనే చికిత్స చేయాలి."

దంతవైద్యుని కళ్ళల్లోకి సూటిగా చూసాడు. ఎడమ కను రెప్ప కనిపించీ కనిపించకుండా కదలాడింది. దంతవైద్యుడు తల పంకిం చాడు. అతని కళ్ళచుట్టూ సన్నటి ముడతలు కనిపించాయి. బామన్ యిచ్చిన సూచన గ్రహించాడు.

"అలా అయితే లోపలకురండి" అన్నాడు, పోలీసుబంటుతో.

పోలీసుబంటు లేచాడు. కాని మనసు మార్చుకుని మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు.

"కృతజ్ఞుణ్ణి. కాని నేను నిరీక్షిస్తాను. ఇప్పుడు మరేమంత బాధగా లేదు."

"లోపలికి దయచేయండి" అని దంతవైద్యుడు కొద్దిగా నేల మీాద తన్నుతూ గట్టిగా చెప్పాడు. "తక్కినవాళ్ళనికూడా నిలవరించే స్తున్నారు, రండి."

మెన్షికోవ్ అతని విద్యార్థులకు మర్యాదగా ప్రవర్తించడం నేర్పాడు గూఢాచారి పెళ్ళికొడుకులాగా కనిపించాలి, నటించాలి. పోలీసుబంటు దర్జాగా నడుస్తూ గది దాటాడు. గొప్పవారంతా అలా నడుస్తారని మెన్షికోవ్ చెప్పాడు. కాని దానికి సంబంధించిన ఫ్రెంచి

మాట కొాబే, టోబే, ఫాబే, వీటిలో ఏదో జ్ఞాపకం రాలేదు. ప్రాణం రక్షించుకోవడానికయినా జ్ఞాపకం రాలేదు.

"ఓ" అని సణుగుకొని గుమ్మంలోనికి శరీరం జేరవేశాడు.

అతనిని లోపలికి పోనిచ్చి దంతవైద్యుడు వెనకకు తిరిగి చూసాడు. కొజుబా పెదవులతో "పోలీసుబంటు" అని చెప్పాడు.

దీనికితోడు బామన్ ఆవృత్తిలో వాళ్లు తమకర్తవ్యాన్ని ఎలా నిర్వహిస్తారో వేళ్ళతో చూపెట్టాడు. దంతవైద్యుడు ఇకిలించి పోలీసుబంటు వెనకే వెళ్ళాడు. గులాబిరంగు బట్ట తల తళతళా మెరిసింది.

గస్టిల్యోవ్ లేచి నిలబడి,

"మనం వెంటనే యెవరిదారిని వాళ్ళం వెళ్ళిపోవాలి. అతను లోపల వుండగానే వెళ్ళిపోవాలి." అతనిని ఆపుచేయాలనే జ్ఞానం డాక్టరుకి వుందనే అనుకుంటున్నాను"అన్నాడు.

"ఆవుద్దేశం నీబుర్రలోనుంచి తీసిపారేసుకో." అన్నాడు కొజుబా." మనం వెళ్లిపోతే యీ యింటికి మనం నీళ్ళు వదులుకోవాల్సిందే. హాల్లో కోట్లు వాడుచూసేవుంటాడు. అన్నిటినీ మనసులో గుర్తుపెట్టుకున్నాడు, సందేహంలేదు. వీడు గట్టివాడే! కమిటీ సమావేశం మధ్యలో యిక్కడ దిగాడంటే, యిక వూహించుకోండి. బయటికి వచ్చేసరికి యేడుకోట్లు మాయమయితే తెలివితక్కువ మొద్దయితే తప్ప అంతా గ్రహించేస్తాడు."

"అవును" అంటూ ఒక విద్యార్థి కొజుబాను సమర్థించాడు. "మనం యిక్కడేవుండి, డాక్టరు వాడిని పంపించేసిన తరవాత, ఒకొక్కళ్ళమే వెళ్ళాలి. యీలోపున సమావేశం కొనసాగిద్దాం"

ఆ విద్యార్థి మాట్లాడడం ఇదే మొదటిసారి. బామన్ అతనికేసి చూసి చిరునవ్వు నవ్వాడు. ఆ చిరునవ్వుకు జవాబుగా ఆ విద్యార్థి మొహంలో చిరునవ్వు వెలిగింది.

దంత వైద్యుని సైగమేరకు పోలీసుబంటు కుర్చీలో కూర్చున్నాడు. మెడ్నికోవ్ ఆదేశం: కంగారు పడకు. తనెవరో అందరికి తెలిసిపోయింది, తన్నితగిలేస్తారు అనుకోగానే మొదట్లో బెదిరిపో

యాడు. గాని తరవాత తమాయించుకున్నాడు. ఇప్పుడు డాక్టరు ఎదుట కూర్చోగానే స్వస్థత చిక్కింది. అంతేకాదు ఉత్సాహంకూడా కలిగింది. బహుశా, ముందు ముందు, యిదే మంచిదిగా పరిణమిస్తుందేమో! నిరీక్షణ గదిలో కూర్చున్నవారిని లెక్కపెట్టాడు. వారి మొహాలు జ్ఞాపకం పెట్టుకున్నాడు వారి ఛాయాచిత్రాలను గుర్తుపట్టగలనని అతనికి గట్టి నమ్మకం కుదిరింది. దీనికిమించి, దంతవైద్యుడి ఇంట్లో సమావేశం జరిగిందని వ్రాయడానికి కావలసిన సాక్ష్యం దొరికింది. ఇంకేమాత్రం ఆలసించకుండా వెళ్ళిపోయేవాడే!

మంచి హుషారుగా ఉంది. కుర్చీ మెత్తగా సదుపాయంగా ఉంది. గాజు అలమారాకేసి సంతోషంతో చూసాడు. అందులో చిత్రమయిన పనిముట్లు కనిపించాయి. గుమ్మానికి దగ్గరగా కుడివైపున చిన్న బల్లమీద తెల్లటి మోటు గచ్చు దంతాలు, తేలికపాటి బరమాచక్రం ఉన్నాయి.

"నోరుబాగా తెరు."

పోలీసు బంటు ఆ ఆదేశాన్ని పాటించి నోరు తెరిచాడు. పళ్లు ఏలోపం లేకుండా తెల్లగా సమమట్టంగా ఉన్నాయి. వాటినిచూచుకుని గర్వపడవచ్చు.

దంతవైద్యుడు దర్పణం పట్టాడు. పసుపువన్నె కిరణం వెళ్ళి రోగి కళ్ళమీద పడింది. తల తిప్పేసుని కళ్ళు మూసుకున్నాడు.

"యే పన్ను?"

పోలీసుబంటు పై దవడలోని ఎడమ కోరవేపు ఆలోచించకుండా చూపించాడు. దంతవైద్యుడు ఒక పనిముట్టుతో దానిని కొట్టిచూసాడు. ఏమాత్రం అరిగిపోలేదు సరిగదా, బీటుకూడ పడలేదు.

"యిదేనా? ఒక్కటేనా?"

దంతవైద్యుడు తనను పరిహాసిస్తున్నాడని ఆ బంటుకు అనిపించింది.

"ఊహుం—అది ఒక్కటేకాదు" అన్నాడు మాటతిప్పుకుంటూ "దాని పక్కదికూడా"

"చల్లటివి తింటే యెక్కువ బాధపెడుతుందా, వెచ్చటివా?"

"రెండూ బాధిస్తాయి. డాక్టరుగారూ, దయయుంచి ఆబొట్లు మందు రాసివ్వండి. లేకపోతే ఆ పసుపు పచ్చటిది యింత దానిమీద వేయండి."

దంతవైద్యుడు జవాబీయలేదు. అలమారాకేసి తిరిగి ఏదో బయటికితీసి బర్నరుమీద వేడిచేసాడు. పోలీసు బంటు అదేమిటో తెలుసుకోలేకపోయాడు. దంతవైద్యుని వీపు అడ్డంవచ్చింది. ఆతరవాత దంతవైద్యుడు దర్పణాన్ని పక్కకు నెట్టాడు. మళ్ళీ పోలీసు బంటు కళ్ళమీద కాంతి కిరణం ప్రసరించి కళ్ళు కనిపించకుండా చేసింది. దిగ్భ్రమ చెంది పోలీసు బంటు ఏమీ ఆలోచించలేకపోయాడు.

"నోరు తెరు."

"ఓ..."

దంతవైద్యుడు ఎడమచేతితో పోలీసుబంటు తల కుర్చీ వీపుకు నొక్కాడు. అంత చిన్న మనిషికి అంతబలం ఎక్కడిదా అని పోలీసు బంటు ఆశ్చర్యపోయాడు. చల్లటి ఉక్కు అతని చిగుళ్ళవెంటే వెళ్ళి పంటికివచ్చితగిలింది. దంతవైద్యుడు నొక్కితిప్పాడు. అమ్మో అని అరుపు! పడకకుర్చీ పక్కని మేజా బల్లమీదను పీకిన దంతం వచ్చిపడింది. దాని రెండు మూలములు పైకి పొడుచుకొని ఉన్నాయి. ఏం జరుగుతుందో పోలిసుబంటుకు తెలియకముందే పటకారు రెండో దంతంమీద వచ్చి పడింది. దంతవైద్యుడు చేతితో బంటు కణత నొక్కిపట్టేసాడు. వణకిపోతూ కుర్చీ చేతులు గట్టిగా పట్టుకున్నాడు బంటు. ఈ దంతపు మూలాలు చాలా పొడగయి ఉంటాయి. ఈ దంత వైద్యుని మొహం జేవురించింది. పటకారు విప్పినపుడల్లా పోలీసుబంటు పిచ్చిగా బొబ్బలు పెట్టాడు. చివరికి ఆ ఘోర పరిస్థితి అర్థమయింది. కుర్చీ చేతులు వదిలిపెట్టి దంతవైద్యుని మోచేయి ఒడిసిపట్టేసాడు. ఏం లాభం? అప్పటికే రెండో దంతం ఊడపెరకడం అయిపోయింది.

"నీళ్లతో పుక్కిలించి పుమ్మేయి" అన్నాడు దంతవైద్యుడు ఇప్పటివరకు పడ్డ శ్రమకు రొప్పుతూ. జేబురుమాలు తీసుకుని మెడ, బట్టతల తుడుచుకున్నాడు. "బలేపళ్ళు! గుర్రపుపళ్ళంత గట్టిగా

వున్నాయి. యిలా అన్నానని మరేంకోపం పెట్టుకోకేం. యేదయినా మందు వ్రాయమంటివిగా. యేమందూ నీపంటిమీద పనిచేయదు. పుక్కిలించి వుమ్మేయి.''

డేకిసాదగ్గరికివెళ్లి పెడలునొక్కాడు. వెంటనే నీళ్లు ధారగా పైకి వచ్చాయి. అతనిగొంతు నీళ్ళలాగానే గలగలమని పోలీసు బంటును పరిహసిస్తున్నట్లుంది. పోలీసుబంటు మాట్లాడకుండా లోహపు వాసనకొట్టే వేడినీళ్ళతో నోరు నింపుకుంటూ మూలిగాడు. మూలాల చుట్టూ నెత్తురయిన రెండు దంతాలు బల్లమీదనుంచి అతనిని వేధించ సాగాయి.

''పుక్కిలించి వుమ్మేయి''

కమిటీ పని ముగించుకోనడానికి వ్యవధికోసం ''దంత'' వైద్యుడు కాలహరణం చేయసాగాడు. కమిటీ ఏమి చేస్తోందో అతని కేమాత్రం తెలియదు. బాగా గట్టిగాఉన్న రెండు దంతాలను పెకిలివేయడం సరి అవునో కాదోకూడా తెలియదు. పళ్ళు పీకేటప్పుడు అతనికే అను మానం వేయలేదు. ఆ కిలాడీ వెధవికి బుద్ధి చెప్పాలనే దొరకటే అతని ఆలోచన. తేటకళ్ళ కొత్త మనిషి కనుగీటడంలో అర్థం ఇదేనని భావించాడు. బలే తమాషాగాఉంది! కాని పోలీసుబంటును క్రూరంగా పరిహసించబోతే అది తిరిగి తనకే తగిలి సాఫీగా, హాయిగా జరిగిపోయే తన బ్రతుకును తలకిందులు చేస్తుందని ఇపుడు గుర్తించాడు. పేరు ప్రతి ష్టలు సంపాదించుకున్నాడు. మంచి రాబడిఉంది. కాని రహస్య పోలీసు శాఖాధికారి కలంపోటుతో చుక్లోమాకో, సాల్విచెగోడ్స్కీకో ప్రవా సానికి వెళ్ళవలసిరావచ్చు. రష్యన్ సామ్రాజ్యంలో రహస్య పోలీసు శాఖ అధికారం ఇంతా అంతా కాదు.

మనిషి కుంగిపోయాడు చేసినపనికి విచారపడ్డాడు. అనాలో చితంగా ఈపని చేసినందుకు, చట్టవిరుద్ధంగా పనిచేసేవాళ్ళల్లో చిక్కు కున్నందుకు పస్తాయించాడు. చిరకాలంగా గ్రిగరీ వాసిల్యెవిచ్ అతని దగ్గరికి మందులకు వస్తున్నాడు. గౌరవంగల బారిస్టరు. సోషల్ డెమాక్రాట్లు చట్టబద్ధమయిన పోరాటాన్ని మాత్రమే గుర్తిస్తారని హామీ ఇచ్చాడు. చట్టవిరుద్ధమయిన కార్యకలాపం పార్టీ ప్రధాన

సూత్రాలకే హానికరమయింది, తగిందికాదు అని వారే భావించారు. తిరుగుబాట్లు, బాంబులు వేయడం అనే సమస్యే లేదు. తన మాటలను సమర్థించుకోవడానికి గ్రిగరీ వాసిల్యేవిచ్ పుస్తకాలు తెచ్చి, ఇచ్చాడు. దంతవైద్యుడు వాటిని చదవలేదుగాని పుటలు తిరగవేస్తే శాంతంగా చట్టబద్ధంగా జీవించాలనే వారికోసం అవి వ్రాసారని తోచింది. అవన్నీ చూసుకునే తనభాగంలో సమావేశాలు జరుపుకోవడానికి డాక్టరు అంగీకరించాడు. సమావేశాలకు వచ్చేవారు చట్టబద్ధంగా వర్తించేవారిలాగానే కనిపించారు. వారిమాటలు అర్థంకాకపోయినా ప్రభుత్వ పునాదులనుగాని సాంఘిక పునాదులనుగాని కదలించేవి కాదని మాత్రం గ్రహించాడు.

వారు చెప్పిందంతానమ్మాడు. నమ్మి వారాని కొక పర్యాయం అతని భాగంలో సమావేశ మవడానికి అంగీకరించాడు. ఇక ఇప్పుడు ఆలోచిస్తే క్షమించడానికి వీలులేని తప్పు చేసినట్లు తోచింది. నైతికంగా అతని వృత్తికి వ్యతిరిక్తమయినపని, విషఫలితాల నిచ్చేపని చేసాడు.

దంతవైద్యుడు వెనుదిరిగి పోలీసుబంటుకేసి చూసాడు. అతనూ సమయంకోసం కనిపెట్టుకుని ఉన్నాడు. ఇక తొందరపడ నవసరం లేదని గ్రహించాడు. శస్త్రచికిత్స గదిలో వెచ్చగా ఉంది. దంతవైద్యుడు నిర్దాక్షిణ్యంగా చిగుళ్ళమీద చేసిన గాయపుబాధ నీళ్ళు పుక్కిలించి పోయడంతో తగ్గింది. అంతకుముందు అమిత బాధ అనుభవించాడేమో సొమ్మసిలి పోయాడు.

దంతవైద్యుడికి పశ్చాత్తాపం ఇనుమడించింది. చేతులు తుడుచుకుంటున్న తువాలు కోపంతో అవతలకు గిరాటు వేసాడు. రహస్య పోలీసు ఏజెంటును అక్కడే నిలిపివేయడం మూలంగా కమిటీకి సహాయపడుతున్నాడు. కాని చట్టవిరుద్ధంగా పనిచేసే సంఘంలో ఇంకా ఎక్కువగా చిక్కుకు పోయాడు. ఇక ఆ సంఘంతో జోక్యం పెట్టుకోకూడదని నిశ్చయించుకున్న తరవాతకూడా ఈ విధంగా ఎందుకు ప్రవర్తిస్తున్నదీ అతనికి బోధపడలేదు. ఆ సంఘంతో శాశ్వతంగా తెగతెంపులు చేసుకుతీరాలని నిశ్చయించుకున్నాడు.

"సరే" అన్నాడు దృష్టి మళ్ళించుకుంటూ. "యిక చాలు ననుకుంటా. వెళ్ళచ్చు. రేపు పుదయం వేడి పదార్థాలేవీ తినవద్దు. తాగవద్దు. యిక బాధించవనుకుంటా, ఒకవేళ బాధిస్తే రేపు మళ్ళీ యేవేళపుడయినాసరే, వస్తే సరిచేసి పంపిస్తా."

పోలీసు బంట్రోతు లేచి దంతవైద్యుడికేసి చూసాడు. ఆచూపు విషంకక్కుతోంది. దాంతో దంతవైద్యుడి వెన్నుపూస వణకిపోయింది.

"రుసుం పదిరూపాయిలు" అని గొణిగాడు ధైర్యం కూడగట్టుకుని రొమ్ము విరుచుకుంటూ. "కాని నువ్వు వున్నవాడివిలా కనిపించడంలేదు. వుద్యోగం చిన్నదిలాగుంది. అటువంటివాళ్ళదగ్గిర నేనేమీ పుచ్చుకోను."

హాలు తలుపు తెరిచాడు. కోట్లు అన్నీ వేలాడుతున్నాయో లేవోనని పోలీసుబంటు తొంగి చూసాడు. 'మృత్యుముఖం' కోటుతో సహా అన్నీ వేలాడుతున్నాయి. నడుం విరిగినట్లయింది. 'మృత్యుముఖం' కూడా పండ్లు పరీక్ష చేయించుకోడానికి వచ్చాడేమో? డీలాగా ఉన్నట్లున్నాడు. పండ్లు పుచ్చి అరిగిపోయి ఉంటాయి. పండ్లు మంచివి రెండూ పోవడం పోలీసుబంటుకు జ్ఞప్తికి వచ్చి క్రుంగిపోయాడు.

మొదటి మెట్టుమీద కాలు పెట్టాడు. తలుపుటపీమని మూసుకుంది. ఆగి పరిస్థితిని ఆలోచించసాగాడు. దంత వైద్యుడి సంగతి, ఈ వ్యవహారం సంగతి పై అధికారులకు చెప్పడమా? మానడమా? దంతాలను గురించి పై అధికారులు వేళాకోళం పట్టిస్తారేమో? చిక్కుల్లోపడడం నీతప్పే అంటే? పన్ను పీకించడానికి దంత వైద్యుడి దగ్గరికి వెళితే 'మృత్యుముఖం', కార్మికుడు కనపించారని చెప్పితే సరిపోతుంది. దంత వైద్యుడి విషయం అనుమానాస్పదంగా ఉందనికూడా చెప్పవచ్చు.

అయితే స్థానిక పోలీసు ఇనస్పెక్టరుగాని, సూపరింటెండెంట్లుగాని ఈ దంత వైద్యుడిచేత వైద్యాం చేయించుకుంటూంటే? తన భాగం బాగా అలంకరింపబడి ఉంది. విప్లవం రావాలని అలకాజనం మాత్రమే కోరుతున్నారనిస్పష్టమవుతునేఉంది. తప్పటడుగు వేసాడా, దెబ్బతింటాడు.

పోలీసుబంటు నిట్టూర్చి గుమ్మం దగ్గిరగా నెత్తురు ఉమ్మేసాడు. ఏ నిర్ణయానికీ రాకుండా మెట్లు దిగసాగాడు.

# 5

# ఒడంబడిక

కోట్లు అన్నీ అక్కడే ఉన్నాయి. ఎవరూ వెళ్లిపో లేదు. వెళ్ళే వీలులేదు. దంతవైద్యుడి వెంట పోలీసుబంటు 'కసాయి' గదిలోకి వెళ్ళగానే, బాగా చప్పుడయే తెరలు యథాస్థానానికి రాగానే, వాదన చెలరేగింది. దంతవైద్యుడు పళ్ళు పీకుతున్నంతసేపు వాదన రేగడమేగాక క్షణ క్షణానికి తీవ్రమయింది.

దంతవైద్యుడు పోలీసుబంటును బయటికి పంపించివేసి మెట్లు దిగి వెళ్ళాడని నిర్ధారణ చేసుకున్న తరవాత పోలీసుబంటు వెళ్ళి పోయాడు, 'ఇక ఎవరిదోవన వాళ్ళు వెళ్ళండి, ఇక ముందుమాత్రం ఎన్నడూ రాకండి' అని చెప్పాలనే తలంపుతో దంతవైద్యుడు గుమ్మంలో తలపెట్టాడు. కాని అతడు విన్నమాటలకు విస్తుపోయి ఒక అడుగు వెనుకకు వేసాడు.

"ద్రోహం!"

బామన్ మాట్లాడుతున్నాడు.

ఉపన్యాసకుడిలా కాకుండా, చేతులు ఊపకుండా, మాటలు ఒత్తి ఒత్తి పలకకుండా సరళంగా మాట్లాడాడు. అతని మాటలలోనే శక్తిఉంది. ఇతర విషయాలలోలాగానే మాట్లాడే విధానంలోకూడా బామన్ లెనిన్ శిష్యుడు అనిపించుకున్నాడు. ఎంత ప్రమాదకరమయిన సమయాలలో నయినా, ఎంత ఉద్రేకంలో నయినా, లెనిన్ గొంతు చించుకునేవాడు కాదు. పెదవులతో కళ్ళతో మందహాసం చేస్తూ తీక్షణంగా హుషారుగా ఇతరుల హృదయాలను చీల్చి చూసే చూపుతో, వేస్టుకోటు చంకలలో బొటన వేళ్ళు పెట్టుకొని మాట్లాడే వాడు.

"ఖచ్చితంగా చెప్పాలంటే కార్మికవర్గానికి ద్రోహం చేయడమే! అల్పసంఖ్యాకులని పిలవబడేవారు యే పరిస్థితిని తీసుకురావాలని పట్టు పడుతున్నారో దానికి యిదొకటే పేరు. సిగ్గుచేటు! సిగ్గులేక మార్క్సును వుదహరిస్తున్నారు. వీరా మార్క్సిస్టులు ? యెపుడో 1880 లో రష్యా ప్రపంచ విప్లవానికి దారి చూపుతుందని మార్క్స్ చెప్పాడు. ప్రపంచమంతటా పర్యటించిన మార్క్స్ యీ రష్యాలో విప్లవం వస్తుందని ఎంతో ఆశించాడు. యెటువంటి విప్లవం ఆశించాడు? ప్రపంచ ప్రాముఖ్యాంగల విప్లవం. యికమీరు కార్మిక వర్గాన్ని యెక్కడికి నడుపుతున్నారు? స్వాతంత్ర్యంకోసం పోరాడడానికి బయటికి తీసుకు రావడానికి బదులు జైళ్ళలోకి, కసాయిశాలలలోకి తీసుకు పోతు న్నారు! యిదంతా యెక్కడ జరుగుతోంది? మాస్కోలో! రష్యాలో కార్మికవర్గ శక్తులకు ద్వితీయ కేంద్రమయిన మాస్కోలో..."

"శక్తులు ?" అంటూ అడ్డుతగిలాడు గస్టిల్యోవ్. "యెందుకు వచ్చిన వుపన్యాసాలు. మనం యధార్థాలను యెదుర్కోవాలి. నువ్వు చెప్పే కార్మికవర్గ శక్తులు యేవీ? యెక్కడ వున్నాయి ? వేలకువేలు మతఛాందసులు, నిరక్షరాస్యులూవున్నారే, వాళ్ళ నేం చేద్దాం ? కమిటీలో వేసుకోవడానికి జనం కరువయ్యారు. లెక్కకి నలుగురు!"

"అవునవును" అని గ్రిగరీ వాసిల్యేవిచ్ సమర్థించాడు. "చాలా జిల్లాలలో మనకి సన్నాహకర్తలు కూడా లేరు"

"ఊహు-మీరు చెప్పేది వట్టి చెత్త" అన్నాడు బామన్ విసుగుతో బుజాలు ఎగురవేస్తూ. చెత్త! రష్యాలో అసంఖ్యాకమయిన జనం వున్నారు. కార్యకర్తలను చేర్చుకోవడంలో యింకా దృఢనిశ్చయం ప్రదర్శించాలి. యింకా పెద్దయెత్తున ధైర్యంగా పనిచేయాలి. కార్మికులను "యువకులను పార్టీలోకి తీసుకురాండి"

"కార్మికులు !" అని గ్రిగరీ వాసిల్యేవిచ్ ద్వేషంతో పలికి కాలుమీద కాలు వేసుకున్నాడు.

"ఆ - అవును" అన్నాడు బామన్ ఉద్రేకంతో. మొహం కందగడ్డ అయింది. తమాయించుకుని తాపీగా, "మరేం వ్యధపడకండి. వాళ్ళని సరయిన తోవలో పెట్టండి. తోవలో పడితేచాలు మీకు

యెక్కడున్నదీ తెలుసుకునే లోపలే మిమ్మల్ని దాటి ముందుకు పురోగమిస్తారు. 'వర్గ' పదజాలం యెంత బిగ్గరగా వుచ్చరిస్తున్నా మీతో వున్న చిక్కు, మీ అపరాధం కార్మికవర్గంలో మీకువిశ్వాసం లేకపోవడమే. మీ హృదయాంతరాళాలలో వారిని మీరు గొర్రెల మందగా, చరిత్రకు సంబంధించిన గ్రాసంగా భావిస్తున్నారు" అన్నాడు.

"అలామాటాడే హక్కు నీకు లేదు" అని విద్యార్థి కోపంతో చెప్పి లేచాడు. "మేము, యువకులం..."

బామన్ చేతితో అతనిని వారించాడు,

"వ్యక్తిగతంగా నిన్నుగురించిగానీ, మెన్షివిక్ కింద చలామణి అయే ప్రతివానిని గురించీగాని నేను మాట్లాడడంలేదు. అలా అను కుంటే మాట్లాడవలసిన అవసరమే లేదు. నేను వివరంగా..."

"అంటే తిట్టడమా?" అని గ్రిగరీ వాసిల్యేవిచ్ ఎత్తిపొడి చాడు. "మీ బోల్షివిక్కులు వాదించే విధానం మాకు తెలుసు."

"ఏకాభిప్రాయానికి రావడానికి ప్రయత్నిద్దాం". మీ కళ్ళ ముందే వుద్యమం దినదినాభివృద్ధి అవుతోందని మీరూ గ్రహించే వుంటారు. రాజరికాన్ని కూలదోయడం నేటి కర్తవ్యంమయివుంది. మీరు యెంత కొట్టుకున్నా కూలదోయకుండా ఆపలేరు."

"మాకు యెవరినీ యెక్కడికీ బలవంతాన లాక్కుపోవాలని లేదు" అన్నాడు గస్టిల్యోవ్. "మీలాగా మేము ప్రజల్నిగాని చరి త్రనుగాని" బలవంతపెట్టం. యీ దృష్టిలో మేమూ రాజరికాన్ని కూల దోయడానికి నిలబడతాం. దానంతటదే వస్తే సాయుధ తిరుగుబాటుకు కూడా మాకు అభ్యంతరంలేదు. కాని దానికి సంసిద్ధం చేయడం మాత్రం మా పనికాదు."

"అదే, అదే. అక్కడేవుంది అసలు గొడవంతా...! పార్టీ కర్తవ్యం అదే. సాయుధ తిరుగుబాటుకు సంసిద్ధం చేయడమే పార్టీ ప్రథమ కర్తవ్యం. మన కర్తవ్యం రాజరికాన్ని కూలదోయడం మాత్రమే కాదు. రాజరికాన్ని కూలద్రోసిన మరుక్షణంనుంచి విప్లవాన్ని యింకా ముందుకు తీసుకుపోవడం రెండో కర్తవ్యం. యిక మోడోది: కార్మికవర్గాన్ని సాయుధం చేయవలసిన సమయం, అవకాశం కలిగిన

క్షణంలోనే మీరు వాళ్ళని నిరాయుధుల్ని చేయాలని తలుస్తున్నారు. విప్లవం ఆరంభం కాబోయే సమయంలో ముగించాలని చూస్తున్నారు''

"సరిగ్గా యిదే మేము చెయ్యనియ్యనిది'' అన్నాడు కొజుబా గడ్డం సవరించుకుంటూ. "బాగా ఆలోచించండి. నే చెప్పినది సరిగా వుందా, రూక్?''

"రూక్!'' గ్రిగరీ వాసిల్యెవిచ్ అరిచాడు. మొహం మాడి పోయింది.

ఆ పేరు వినపడేసరికి తక్కినవారుకూడా ఆందోళనతో కదలాడారు. రూక్ మాస్కోలో కొద్దికాలండున్నా తుఫాను రేపాడు. అందుచేత మాస్కోవారికి ఆపేరు చిరపరిచితమయిందే.

కొజుబా చుట్టూ చూసాడు.

"అనకూడని మాట అన్నట్టున్నాను. సరే, అనకుండా వుండలేకపోయాను. ఒకే కమిటీలో కూర్చున్నా మనం స్నేహితులమనే భావం రావడంలేదు. యేంచెయ్యను?''

"మరేం పరవాలేదు'' అన్నాడు విద్యార్థి తడబడుతూ. "బోల్షివిక్కులకీ, మెన్షివిక్కులకీ యివాళ వివాదమల్లా పార్టీ నిర్మాణం గురించేగా?''

తనమాటలను థామస్ సమర్థిస్తాడని నిరీక్షిస్తున్నట్లు విద్యార్థి అతనికేసి తేరిపార జూచాడు. థామస్ తల ఆడించి,

"అవును. పార్టీనిర్మాణానికి సంబంధించిందే. సోషల్ డెమాక్రసీనిగురించే నుంచే మాట్లాడుతున్నామా, యీ సందర్భంలో పార్టీ నిర్మాణమంటే అర్థం విప్లవానికి సంసిద్ధం చేయడమే.'' అన్నాడు.

తెరలు మళ్ళీ తొలిగాయి. దంతవైద్యుడు దృఢ నిశ్చయంతో ప్రవేశించాడు.

"క్షమించండి'' అన్నాడు. ఒక పడకకుర్చీ వెనక నిలబడి, దాని వీపును గట్టిగా పట్టుకుంటూ. "యివాళ సమావేశం ఆపివేయవలసిందని చెప్పక తప్పడం లేదు...'' ఏడు జతల కళ్ళు అతనిని తేరిపారజూచాయి. కొందరు ఆశ్చర్యంగా, కొందరు వినోదంగాచూసారు. అలా చూసేసరికి అతను వెనుకంజవేసి, చెప్పదలచిందేమిటో తొందర

తొందరగా చెప్పేసాడు"... "యిక యీ యింటి చిరునామా మరిచే పోండి."

దంతవైద్యుడు వంగి నమస్కరించి వెనకకుతిరిగి గుమ్మంవైపుకు నడిచాడు.

"ఒక్కనిమిషం!" అని పిలిచి గ్రిగరీ వాసిల్యెవిచ్ అతని వెనకనే వెళ్ళాడు! "అపార్థం చేసుకున్నారు. నేను విశదంగా...:"

"విశదంగా చెప్పడం దేనికి?" అని విద్యార్థి ప్రహ్యాభావంతో అభ్యంతరం లేవదీసాడు. "విశదీకరించవలసిన అవసరం యేమీ కనిపించడంలేదు. మన దంతవైద్యుడిగారికి కాళ్ళు వణుకుతున్నాయి"

"నేను పిరికివాడిననేనా నువు అనేది?" అన్నాడు దంతవైద్యుడు. కోపంతో మొహం జేవురించింది. "రెండు మంచిదంతాలూ పీకేసాను!"

ఎవరూ మాట్లాడలేదు. ఆ వార్త అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తివేసింది.

"ఆత్మహత్య!" అన్నాడు బామన్ వచ్చే నవ్వు ఆపుకుంటూ. "శ్రద్ధాంజలి అర్పించండి. కాని వెళ్ళేముందు —" దంతవైద్యుని వంక అర్థవంతంగాచూసాడు. దంతవైద్యుడు ఆ చూపులోని అర్థం గ్రహించాడు. వెళ్ళిపోయాడు.

"సరే, అయిందేమిటో అయిపోయింది. మన పనికి సంబంధించిన విషయాలలో ఒక ఒడంబడికకు వద్దాం. బోల్షివిక్కులు, మెన్షివిక్కులు ప్రధాన సమస్యమీద. దెబ్బలాడుకుంటున్నారు. కాని పరిస్థితిని సూక్ష్మంగా అందరూ విశ్లేషించి చూడడం లేదని నిర్ధారణ అయింది. ప్రతి మెన్షివిక్కూ నిజంగా మెన్షివిక్కని అనడానికి వీల్లేదు..."

"ప్రతి బోల్షివిక్కూ నిజంగా బోల్షివిక్కని అనడానికి వీల్లేదు" అని అన్నాడు గ్రిగరీ వాసిల్యెవిచ్ విషం కక్కుతూ.

"అవును" అని బామన్ తలపంకించాడు "నువు చెప్పింది సరిగానేవుంది. ప్రతివాడికీ అతడిస్థితేమిటో తెలుసుకునే అవకాశం కావాలి. కార్యరంగంలోకి దిగితే ప్లెఖనోవ్, మార్టోవ్‌లతో అంటి

పెట్టుకుని వుండడంవల్ల మీకు అహం బలిసే ప్రమాద ముందని మీరే గ్రహిస్తారు. రేపు ప్రత్యేక సమావేశం వేసుకుని తక్షణ కార్యకలాపాన్ని గురించి చర్చించడం మంచిదని నా అభిప్రాయం. అతితక్షణ కార్య కలాపం – అది నిర్ణయించడం తేలిక. కొత్తఅభ్యర్థులను గురించి కూడా రేపు చర్చించవచ్చు. కమిటీలోకి, దాని అనుబంధ సంస్థలలోకి ఆలస్యం చేయకుండా సభ్యులను చేర్చుకోవాలి."

"కార్మికులను, యువకులను!" అని ఎత్తిపొడిచాడు గస్టిల్యోవ్.

ఈసారి బామన్ ఒకడే తల ఊపలేదు. గ్రిగరీ వాసిల్యెవిచ్ మొహం ముడుచుకున్నాడు. విద్యార్థిని బామన్ వశంచేసుకున్నట్లున్నాడు.

"రేపటి సమావేశ కార్యక్రమంలో మూడోది: సాహిత్యం వెలువరించడం. యిక్కడ మన అచ్చు ఆఫీసులేదని చెప్పారు. అచ్చు ఆఫీసు లేకుండా వూపిరి పీల్చడం యెలా? మనం ఒకటి యేర్పాటు చేసుకోవాలి."

"స్థలం యెక్కడా దొరకలేదు" అని గస్టిల్యోవ్ కోపంతో బొబ్బరించాడు. "అనేకసార్లు యీవిషయం ఆలోచించాం. జనంలేరు, డబ్బులేదు, యిల్లులేదు."

విద్యార్థి కొంచెం తటపటాయించి,

"నాగదిలో పెట్టండి" అన్నాడు.

"నీ గదిలోనా?" అని అన్నాడు గ్రిగరీ వాసిల్యెవిచ్ కళ్ళు కుంచించుకుని చూస్తూ, విద్యార్థివిషయమయి వెనుకటి దృష్టి మారి పోయింది. అతడు పొట్టిగా, రోగిష్టిలా కనిపించాడు. గుండె అర్చుకుని పోయినట్లుంది. గడ్డం చిన్నది. బహుశా రోగంతో తీసుకుంటూ ఉండవచ్చు.

సమావేశం ముగిసింది. ఒక్కొక్కరూ వెళ్ళిపోయారు. గ్రిగరీ వాసిల్యెవిచ్, గస్టిల్యోవ్‌లు మాత్రం దిగబడిపోయారు. వారు దంత వైద్యునితో మాట్లాడి విప్లవం రాబోయేముందు తమతో తెగతెం

పులు చేసుకోవడం గొప్ప తప్పిదమనీ, ఆ విప్లవంకోసం చేసే, త్యాగం ఎక్కువగా శ్లాఘింపబడుతుందనీ విశదీకరించాలని తలచారు.

కాని 'త్యాగం' అనే అమంగళకరమయినమాట అసలే హృదయాన్ని చీల్చివేస్తున్న భయాన్ని ఇనుమడింప జేసింది.

ఇక జైలు తప్పదని భావించాడు. ఏమయినా రాత్రిళ్ళు హాయిగా నిద్రపట్టదు. ఏ నిమిషంలో పోలీసుల గంటలు, ఇంటిముందు గంట, వెనకగంట మోగిస్తారో, ఏనిమిషంలో విచ్చుకత్తులు, తట్టుముళ్ళతో వచ్చిపడి కోటకో, కొట్లోకో, లోవకో, కోటబురుజుకో తీసుకుపోతారో నని నిరీక్షించడంతో రాత్రంతా గడిచిపోతుంది.

అందుచేత గ్రిగరీ వాసిల్యేవిచ్, గస్టిల్యోవ్ ఈ విషయంలో చెప్పదలచింది వినడానికి దంతవైద్యుడు నిర్మొహమాటంగా నిరాకరించాడు. "త్యాగం!" ఆత్మగౌరవంగల దంతవైద్యుడికి చెప్పవలసిన మాటకాదు. విప్లవాన్ని బలపర్చినా బలపర్చకపోయినా దంతాలు కట్టించుకునేవారు కరువుకారు. ప్రపంచం సృష్టించబడి నప్పటినుంచీ ఇంతే. రాతియుగపు మనుష్యులుకూడా దంతాలు కట్టించుకునేవారని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. దంతాలు కట్టడం ఎలాగో తెలుసుకుంటే ఎవరి పరిపాలనలోనయినా భుక్తికి లోటుండదు. కావలసిందల్లా రాజకీయాలకు దూరంగా ఉండటమే. రాజకీయాలలో తలదూర్చడం వెట్టి తెలివితక్కువపని. ఆ రెండుదంతాలు మంచిగుణపాఠం నేర్పాయి. ఇం కెపుడూ అటువంటి తప్పు చేయడు.

ఉహుం - ఇక వారివద్ద శలవు తీసుకోవడమే !

గ్రిగరీ వాసిల్యేవిచ్, గస్టిల్యోవ్‌ల వేపు వెన్నుతిప్పి గాజు పలక పరచినబల్ల దగ్గరికి వెళ్ళి రెండు గచ్చుదంతాలు పైకితీసాడు. తన వృత్తిలో నిమగ్నుడయి ఉన్నట్టు ప్రతి కదలికలోనూ కనిపించింది. వారిద్దరికీ వెళ్ళిపోవడం తప్ప గత్యంతరం కనిపించలేదు. గ్రిగరీ వాసిల్యేవిచ్ నిరీక్షణ గదిలో తచ్చాడుతుంటే.

"యీ రూక్ మూలంగా చాలా చిక్కు వచ్చిపడేటట్టుంది." అంటూ గస్టిల్యోవ్ నిట్టూర్చాడు,

గ్రిగరీ వాసిల్యేవిచ్ తిరస్కారంగా "మరేం పరవాలేదు. అతని చేతికింద మనుష్యులను తెచ్చి పెట్టి కమిటీనంతటినీ పాడుచేసి సంఖ్యా బలం సంపాదించుకోకుండా మనం చూడాలి. తానే కమిటీ కార్య దర్శిననుకుని ప్రవర్తించడం నువ్వు కనిపెట్టే వుంటావనుకుంటాను" అన్నాడు.

"అతనిని నిరోధించడం యెలా? కార్మికులను కమిటీలోకి తీసుకోకూడదని అభ్యంతరపెట్టలేం కదా. అలాచేస్తే వీళ్ళు ఫ్యాక్టరీలలో వుపన్యాసాలు దంచుతారు. కాని కార్మికులు కొజుబావంటివారయితే... మనవాళ్ళకి ఫ్యాక్టరీలతో సంబంధాలు, చెప్పుకోతగ్గ సంబంధాలు లేవు".

గస్టిల్యోవ్ మళ్ళీ ఇంకోసారి నిట్టూర్చి మెల్లిగా మెట్లు దిగి వెళ్ళిపోయాడు. బాధాకరమయిన ఆలోచనలతో మనసు నిండి పోయింది.

# 6

# యుద్ధం

వార్తాపత్రికలు అమ్మేకుర్రవాళ్ళు వీధిలో అటూ ఇటూ పరుగెత్తుతున్నారు.

"యుద్ధం ప్రకటించకుండా జపాన్‌వారి దాడి" అని అరిచారు పత్రికలు ఊపుతూ. "ద్రోహం! డిస్ట్రాయర్ల దాడి! రెట్విజాన్, సెసారవిచ్, పల్లాడాల ధ్వంసం!"

యుద్ధం!

ఆ రోజున మంచు కురుస్తోంది. ఒక టాంగా తడిమంచు మీదికి భారంగా వచ్చింది. బామన్ గగనస్కాయా జిల్లానుంచి స్రాటసటనాయాచౌకుకు వెళుతున్నాడు. అక్కడనుంచి క్రిమిశాస్త్రజ్ఞుడి ఇంటికి వెళ్ళాలి.

యుద్ధం!

యుద్ధం ప్రారంభమయితే ఆ తరవాత కొద్ది నెలలలోనే విప్లవం దేశాన్ని ముంచెత్తివేస్తుందనే నమ్మకం బామన్‌కు కలిగింది. లంచగొండితనం రష్యా గొంతుకను నులిమేస్తోంది. జారు యుద్ధంలో జయించడం అసంభవం! యుద్ధంలో అపజయం విప్లవాత్మక పరిస్థితిని తెచ్చిపెడుతుంది. కాని మనం, పార్టీ మనుష్యులం. అందుకు సిద్ధంగా ఉన్నామా? అని తనను తాను బామన్ ప్రశ్నించుకున్నాడు.

సిద్ధంగా లేము. అదే ఆ ప్రశ్నకు జవాబు. కమిటీలో పని సాగనివ్వడంలేదు. మెన్షివిక్కులనుంచి నాయకత్వం గుంజుకున్నా-బోల్షివిక్కులకు ఆరు ఓట్లు, మెన్షివిక్కులకు నాలుగు – మెన్షివిక్కుల ప్రతిబంధకం పూర్వంకంటె తీవ్రంగా ఉంది. సంబంధాలు పెట్టుకోనివ్వడం లేదు. డబ్బు యివ్వడంలేదు.

అచ్చు యంత్రాలు, టైపు సంపాదించారు అంటే, ఆ విద్యార్థి గదిలో నెల రోజులనుంచీ అవి పడి ఉన్నాయి. పని సాగడంలేదు. పని ప్రారంభించకుండా ఏదో ఒక సాకు చెపుతున్నాడు. అతనికి భయం

వేసినట్టుంది. ఉన్నడబ్బంతా అద్దెకింద ఇచ్చి టాగనస్కాయా జిల్లాలో యింకా గదులు తీసుకున్నారు. కాని అందువల్లా ప్రయోజన మేమీ కలగలేదు. వారి అద్దెకు తీసుకున్న మేడకింద నాట్యశాలఉంది. అచ్చు గుద్దడం ప్రారంభిస్తే యంత్రంనుంచి విపరీతమయిన శబ్దం వస్తుంది. ఏ తెలివితక్కువ మొద్దో తప్పితే ఎవరయినా ఏమిటా యంత్రం అని అడగక మానరు. అందుకని అచ్చు ఆఫీసు మూత పడింది.

యుద్ధం రావడంతో ఇక స్తబ్ధుగా కూర్చోడానికి వీలులేదు. రహస్యబోల్షివిక్ అచ్చుఆఫీసు శక్తినంతా వినియోగించి సంఘటనలకు తగినవిధంగా ప్రవర్తించాలి.

అందుకని అచ్చుఆఫీసును క్రాస్నోసెలస్కాయా వీధిలోని తన ఇంటికి తరలించమని ఆదేశాలు ఇచ్చాడు. నిజంగా రహస్య కార్యకలాప సూత్రాలకు ఇది విరుద్ధం. అచ్చు ఆఫీసును వేరేఉంచాలి. కాని బామన్ ఫ్యాక్టరీజనంతో, మిల్లుజనంతో, విశ్వవిద్యాలయంతో ఎడతెగని సంబంధం కలిగేఉన్నాడు. ఒక అరగంటకూడా పార్టీసంస్థకు చెందిన కార్యకలాపంనుంచి దూరంగా ఉండలేదు. (ఈ కార్యకలాపం సంభాషణా రూపమయింది. తరచు నాల్గు ముక్కలుకంటె ఎక్కువ మాట్లాడే అవకాశం ఉండేదిగాదు). నీ ఈ కార్యరూపం పైకి అంతగా కనిపించేది కాకపోయినా పార్టీని, తద్వారా విప్లవాన్ని బలీయం చేస్తుంది.

కార్యకలాపం ఇపుడిపుడే ప్రారంభమయింది. వ్యక్తులతో విడి విడిగా మాట్లాడడం, సమూహాలతో మాట్లాడడం సాగుతోంది. ఎంత మందితో మాట్లాడాం, ఎన్నిమాటలు మాట్లాడాం అని లెక్కచూసు కుంటే మాత్రం సంఖ్య చిన్నదిగానే కనిపిస్తుంది. కాని పునరాలో చించుకుంటే, ప్రతిమాటలోనుంచి ఒక భావం కోసం, కార్యరంగంలోకి ఉరకడానికి సంసిద్ధత జనించినట్టు గోచరిస్తుంది. బామన్‌తో మాట్లాడిన ప్రతివ్యక్తీ తన భావాలను, తన కోపాన్ని, విప్లవం రాబోతున్నదనే ఉత్సాహాన్ని ఇతరులకు అందజేశాడు. ఈ విధంగా పార్టీ వలయం

క్రమక్రమంగా విస్తరించుకుంది. రహస్య సంభాషణలు భయంకర గర్జనలుగా, గుసగుసలు యుద్ధనినాదాలుగా పరిణమించాయి.

ఇదంతా వదిలేయడమేనా ? ఊహుం- వదలివేయలేదు. అతను బాగా చేయనేర్చిన పని ఇదే. హృదయాంతరాళంలోనుంచి సత్యం మాట్లాడుతాడేమో, వినేవారందరిలో సంచలనం కలుగుతుంది. లెనిన్‌తో, ఆ 'తాత' తో కలిసి నిజంగా పనిచేసిన, ఇస్క్రా మనుష్యులలాగానే అతనికీ తాను నిజం చెప్పుతున్నానని తెలుసు.

అదే అతనికి బలం చేకూర్చింది. అతని మాటలు వినేవారికి విశ్వాసం కలిగింది. తనను తాను ఏదోవిధంగా లెనిన్‌తో పోల్చుకుంటున్నాడని ఎవరయినా అంటే వారిని ఎగతాళి పట్టించేవారిలో థామస్ ప్రప్రథముడు. కాని అతని హృదయాంతరాళంలో లెనిన్ యొక్క సత్యం, భావాలు, ప్రేమ, ఉద్రేకం నెలకొన్నాయి. అందుచేత లెనిన్‌చుట్టూ లాగానే అతనిచుట్టూ ముభావంగా ఉండేవారెవరూ ఉండేవారుకారు. అతనిని ప్రేమించేవారు. లేకపోతే గ్రిగరీ వాసిల్యావిచ్; గస్టిల్యోవ్‌లను ద్వేషించినట్లు ద్వేషించేవారు.

శత్రువులు అడుగడుగుకీ ఆటంకాలు కల్పిస్తున్నారు. డబ్బు అందజేయడంలేదు, గదులు ఇవ్వడంలేదు, సంబంధాలు కలిగించడంలేదు. ఇదంతా వారికే నష్టదాయకంగా పరిణమిస్తుంది. అప్రతిష్టపాలు చేస్తుంది. వారిపేర్లు మానవద్రోహుల జాబితాలో ఎక్కే సమయం వచ్చితీరుతుంది.

ఈలోగా అచ్చుయంత్రాలను తనగదికి తరలించాలి. ఇంకెక్కడికయినా తరలించే అవకాశం లేదు. ఆయంత్రాలను అలా ఊరికే పడి ఉండనీయకూడదు. ప్రమాదం అపరిమితమే గాని అంతకన్న చేయగలిగిందేమీ లేదు. ప్రత్యేకంగా గదులు అద్దెకు తీసుకోవడానికి కావలసిన డబ్బులేదు. ఉన్న డబ్బేమిటో ఖర్చయిపోయింది.

గూఢచారులబారినుంచి తప్పించుకోవడానికి కృషిని ఇనుమిట్టుగా చేయాలి. విదేశాలనుంచి రష్యా వచ్చే వారు తనగదికి రాకూడదని హెచ్చరిక పంపాలి. క్లుప్తంలో చెప్పాలంటే కొన్నిచర్యలు తీసుకోవాలి...

# 7

# యుద్ధచర్చలు

దూర్యప్రాచ్యంలోని రష్యన్ సైన్యాలతో స్వచ్ఛందంగా చేరి పోరాడుతూ తమతమ నేరాలను మాపుచేసుకోవడానికి బహిరంగ పోలీసు నిఘాకిందఉన్న (విచారణలేకుండా సామ్రాజ్యంలోని మారు మూలలకు పంపబడిన) రాజకీయ అనుమానితులకు అవకాశమిస్తూ జారు దయవల్ల ఫిబ్రవరి 7న ఒక ఫర్మానా వెలువడింది. 'దేశభక్తి' కారణంగా విప్లవకారులకు సంధి షరతులు జారు ప్రతిపాదించాడు. కార్మిక సంఘాలలో ఈ విషయం చర్చకు వచ్చింది. కమిటీ పిలవ వలసినంత హెచ్చుస్థాయిలో కొన్ని సంఘాలలో చర్చలు జరిగాయి.

ఈసారి కమిటీ సమావేశం వార్ట్ ఇంటిలో జరగలేదు. (ఎంత వాదించినా ఆయన మనసు కరగలేదు). ఒక సుప్రసిద్ధుడయిన చిత్రకారుని చిత్రశాలలోజరిగింది. వార్ట్‌కు పూర్వంనుంచీ ఈచిత్రకారుడుడబ్బు సహాయం చేస్తున్నాడు. కమిటీ సమావేశాలకు తన చిత్రశాల ఇచ్చాడు. చిత్రశాల విశాలమయింది. బాగా వెలుతురు వచ్చేది. గోడల నిండా చిత్రాలు వేలాడుతున్నాయి.

ఆనాటి సమావేశానికి బామన్ అధ్యక్షత వహించాడు. ఫ్యాక్టరీ కార్మికులు మొదటగా తమ నివేదికలను నివేదించారు. నివేదికలు సంతృప్తికరంగా ఉన్నాయి. ఎక్కువమంది కార్మిక సంఘాలలో చేరు తున్నారు. సమ్మెల్ల సంఖ్యకూడా పెరిగింది. ట్వెర్‌లోని మొరోజోవ్ అద్దకపు శాఖలో ఒక సమ్మె విఫలమయిందనే చెడువార్త ఒక కామ్రేడ్ తీసుకువచ్చాడు. ఆ నగరంలోని యంత్ర నిర్మాణశాలలో సమ్మెకూడా భగ్నమయింది. అయినా మొత్తంమీద విప్లవం పైమెట్టులోనే ఉంది.

"ట్వెర్ కార్మికులు సరిగా సంసిద్ధులు కాలేదనుకుంటాను. సమ్మె చేయడానికి ఓర్పు కావాలి. వూరికే కేకలు వేసినంతమాత్రాన యజమానులు లొంగిరారు."

"సమ్మెకు సంసిద్ధులు కాలేదని వాళ్ళని నిందించడానికి వీల్లేదు" అన్నాడు ట్వెర్‌నుంచి వచ్చిన కామ్రేడ్. "సూటిగా చెపుతున్నా. యింకా కొంతకాలంపాటు సమ్మె కొనసాగించేవారే. ఈ మెన్షివిక్కులు సమ్మె విరమించాలంటూ వుపన్యాసాలు దంచేసరికి విరమించారు. భవిష్యత్తులో యే కార్యక్రమానికి పనికిరానంత బలహీనులను చేసి పారేశారు మెన్షివిక్కులు."

"యిదే నీకు వాళ్ళు బోధించింది" అంటూ కొజుబా అడ్డు వచ్చాడు. "ప్రతిరోజూ జరిగేదంతా గ్రహించాలి. అలా గ్రహిస్తే జీవిత కాలమంతా సరిపోయేటంత నేర్చుకోవచ్చు."

"సరే" అంటూ ట్వెర్ కామ్రేడ్ మళ్ళీ ప్రారంభించాడు. "కార్మికులు తిండిలేక మాడిపోతున్నారు. అటువంటి సమయంలో యెందుకయినా వొప్పించడం తేలిక. అందులోను సమ్మె విరమింపజేయడం మరీ తేలిక."

కొజుబా నుదురు ముడతలు పడింది.

"మెన్షివిక్కులకు యేమాత్రం సందీయకూడదు. వారి వాదన తప్పని నిరూపించాలి"

"వాళ్ళ వాదన తప్పని నిరూపించలేం" అన్నాడు మొరొజోవ్ అద్దకపుశాలనుంచి వచ్చిన కామ్రేడ్ అసహ్యంగా చేతులు ఊపుతూ. "మెన్షివిక్కుల దంతా పిడివాదన."

గస్టిల్యోవ్ సంతృప్తితో వికటంగా నవ్వాడు.

"వాళ్ళ వాదనలను చీల్చేయాలని చూస్తే సాగనివ్వరు. మన భావం సరయినదేనని మన యింగితజ్ఞానం చెపుతోందిగదా అని మనం వాళ్ళని మూలకు నెట్టాలనిచూస్తే దుర్మార్గులు రెట్టింపు యిదిగో తిరగబడి పుస్తకాలలోని మాటలకు మాటలు యేకరవు పెడతారు. యిక మనకి నోరు పెగలదు. నిజం చెపుతున్నారో అబద్ధం చెబుతున్నారో యెవడికి తెలుసు? వాళ్ళు వుదహరించే పుస్తకాలను

నేనెప్పుడూ చదవలేదు. వాళ్ళు విజ్ఞానాన్నంతా వొలకపోస్తుంటే మనం నీళ్ళుకారిపోతాం. వాళ్ళంటారూ- మేము- ఆమాటేమిటి? తా..."

"తార్కికులు" అని గస్టిల్యోవ్ అందించాడు ఉపాధ్యాయుడి లాగా.

బామన్ మందహాసం చేసాడు.

"లెనిన్‌లాగానే నువ్వూ వాళ్ళకి – 'తాను దూరడానికి సందులేదు గాని మెడకో గంగడోలు –' అనే సామెత చెప్పు."

ఒక్క గస్టిల్యోవ్ తప్ప తక్కినవారంతా నవ్వారు. సమావేశంలో పాల్గొన్న మెన్షివిక్కు అతనొకడే. కమిటీలోని అధిక సంఖ్యాకులు లెనిన్ పక్షం చేరినప్పటినుంచీ ఇదే పరిపాటి అయిపోయింది. మెన్షివిక్కులు కమిటీలో చురుకుగా పాల్గొనడం మానివేసారు. సంగతులు ముందుగా తెలుసుకోవడానికని వారిలో ఒకరిని సమావేశాలకు పంపుతున్నారు. వారు రహస్యంగా స్వంత కమిటీ ఏర్పచ్చుకున్నారనీ పార్టీ పని వేరుగా చేస్తున్నారనీ పుకార్లు బయలుదేరాయి.

"పుస్తకాల రాయళ్ళు మనకు వుపయోగించరు" అన్నాడు కొజుబా మొహం ముడుచుకుంటూ. "పని తెలిసినవారు మనకుకావాలి. అంతేనా రూక్ !"

"అంతే" అంటూ బామన్ తలఊపాడు. "అంటే సిద్ధాంతాన్ని ఆచరణను వేరుపరిచేవారు మన కనవసరం. కాని పుస్తకాలు-సిద్ధాంతం, శాస్త్రం – మనకు కావాలి. సిద్ధాంతభాగం లేని ఆచరణ అంటూ వుండదు. మనం చదవాలి. కొజుబా యిక్కడ చదువుతున్నాడు. మొదటిదఫా సమ్మెముందు భావాలకోసం యెలా బుర్ర గోక్కునే వాడవో, జ్ఞాపకం వుందా, కొజుబా ? యిపుడు బుర్ర గోక్కొన వలసిన అవసరం లేదనుకుంటాను?"

కొజుబా కర్కశనేత్రాలు స్నిగ్ధమయినాయి.

"యిదంతా నీవనే, నీచలవే, రూక్ ! అంతేకాక నువు చెపుతుంటావుగా. 'జీవితమే ఉత్తమగురువు' అని!"

"అదీ అసలువిషయం" అని బామన్ తలఊపాడు. "అసలు విషయ మేమంటే జీవితమే ఉత్తమగురువు ! లెనిన్ బోధనలలో

జీవితసత్యం యిమిడివుంది. అందుచేత మనలకు ఆవేశం కలిగించ్చే లెనిన్ పెట్టిన ఒరవడిలోనే మనకు బోధిస్తుంది. జీవితం మనకు కార్యాచరణలో బోధిస్తుంది, బోధించి తీరుతుంది."

"కార్యాచరణలో బోధిస్తుందంటారా?" అని అడిగాడు, ఇప్పటివరకూ మౌనంగా కూర్చున్న లిస్ట్వ్ యంత్రాలయ లోహ కార్మికుడు సెమ్యాన్. "కార్యాచరణే లేకపోతే? వుదాహరణకి మా వూళ్లో యుద్ధాన్నిగురించి సణుక్కుంటున్నారు"

"సణుక్కోవడానికి కారణం వుండివుంటుంది."

"విపరీతంగా తన్నులు తింటున్నాం" అన్నాడు ట్వెర్‌నుంచి వచ్చిన కామ్రేడ్. "తలుచుకోడానికికూడా భయంవేస్తోంది. ఆరర్ రేవుదాకా వచ్చేసారు. మనకు తెలియకుండానే పట్టేస్తారు. అపుడు మనం తలలు వంచుకోవాల్సిందే !"

కొజుబా ఉమ్మివేసి,

"సిగ్గుపడడం యెందుకు ?"అన్నాడు

"యేమిటీ ?" అని అడిగాడు ట్వెర్ కామ్రేడ్. మొహం ముడుచుకుని కర్కశమయింది. "మనం..."

"మనం ? తెలివితక్కువా ? యీ యుద్ధంలో మనంకాదు జారిజం తన్నులుతింటుంది"

ఇరీనాకూడా కమిటీ సభ్యురాలే. సమావేశానికి ఆలస్యంగా వచ్చింది. ఆమె అభ్యర్థిత్వాన్ని బామన్ బలపరిచాడు. పెద్ద గొడవ లేకుండానే, ఆమెకి సభ్యత్వం లభించింది. ఆమె చిన్నదయినా అనుభవంతో కాకలుతీరిన విప్లవవాదిని. అచ్చువేయడంలో ప్రవీణురాలు. అందుచేత బామన్ వాదనను కాదంటానికి గస్టిల్యోవ్‌కి దమ్ములు లేకపోయాయి.

అంతావిని మాట్లాడడానికి అనుమతి కోరింది.

"కార్యాచరణ కావాలిగదూ ? యుద్ధానికి వ్యతిరేకంగా ఆదివారంనాడు బోల్షివిక్కు విద్యార్థిసంఘం ప్రదర్శనం లేవదీస్తుంది. ఆ ప్రదర్శనాన్నేగనక బలపర్చడానికి కార్మికులు..."

కొజుబా, సెమ్యాన్ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

"యెందుకు బలపర్చకూడదు? బలేగా వుంటుంది."

"యుద్ధవ్యతిరేక ప్రదర్శనలు చేయడానికి మాస్కో కార్మికులను బయటికి తీసుకురా" అన్నాడు బామన్ మనసులో ఏదో గుణించు కుంటూ. "అందులో చాలా అర్థం ఉంది. యింకా యెవరు మాట్లాడ దలచారు కామ్రేడ్స్!"

"నేనేం సంబంధం పెట్టుకోను" గస్టిల్యోవ్ తొందర తొంద దరగా అని పెదవులు నొక్కుకున్నాడు.

కొజూబా, సెమ్యాన్ తిరిగీ ఒకరి మొహాలు ఒకరు చూసు కున్నారు.

"ఆదివారం దగ్గిరలో పడింది. మనకి వ్యవధి వుంటుందా?"

"వ్యవధి చేసుకోవాలి" అన్నాడు బామన్ కఠినంగా. "మనం తగినంతగా సంసిద్ధంకాందే కార్యరంగంలోకి దిగలేం. అందులోనూ పోరాటానికి కాలు దువ్వుతూ సన్నాహాలు చేయకపోవడం మరీ అధ్వాన్నం. అందుకోసం కాలయాపనచేయడం పనికిరాదు. సైనికుల లాగా పనిచేయడం నేర్చుకోవాలి. ఒకటి: కరపత్రాలు పంచిపెట్టాలి. కరపత్రం యివాళ వ్రాసి సిద్ధంగా వుంచాతాను. సిద్ధంకాగానే అచ్చు వేయాలి. శుక్రవారంలోపునే అచ్చు పూర్తి అవుతుంది. అంతేనా- యిరీనా? ఆరోజునే పంచిపెట్టాలి. దుకాణాలలో సమితి సమావేశాలు జరుపుదాం. శనివారంనాడు సమిష్టి సమావేశాలు జరుపుదాం. ఆదివా రంనాడు – అందరమూ బయటికి వచ్చి ప్రదర్శనాలు చేదాం. మనలో యెవరెవరు యేయేపనులు చేయాలో యిప్పుడేనిర్ణయం చేసుకుందాం."

"నేను సంబంధం పెట్టుకోను" అని తిరిగీ అన్నాడు గస్టిల్యోవ్ ఆసనంలోనుంచి లేస్తూ.

# 8

## చీలిక

కిటికీని అంగుళం అంగుళం తెరతో కప్పేసారు. పెద్ద మేజాబల్ల మీద అచ్చు దిమ్మలు, స్టిక్కులు, ఇనప చట్రంలో బిగించిన అచ్చు కూర్పు పేజీ, రోలరు, రంగులుఉన్నాయి. ఇరీనా మోకాళ్ళమీద క్రింద కూర్చుని అపుడే అచ్చు అయిన ప్రకటన పత్రాల కట్టలను సర్దుతూ లెక్కపెడుతోంది.

"ప్రొఖొరోవ్ కార్మికులకు రైల్వేవారికి"

గంట మోగింది ఇరీనా తలఎత్తి నిరీక్షించింది. ప్రశాంతంగా ఉంది. సడీచప్పుడూ లేదు. మొహం ముడుచుకుంది. నుదుటిమీద కర్కశంగా ముడతలు ఏర్పడ్డాయి. మోకాళ్ళమీద కూర్చున్నదల్లా లేచి మేజాబల్ల దగ్గరకు వెళ్ళి సొరుగులోనుంచి ఒక పెద్ద రివాల్వరు తీసింది. ఆ రివాల్వరు ఆమె మోయలేనంతబరువుగా ఉంది.

మళ్ళీ గంటమోగింది. కొద్ది విరామం (టెలిగ్రాఫ్ ఆఫీసులో మోర్స్ కీ విరామంలాంటిది) తరవాత మూడో తడవ, నాలుగో తడవ మోగింది. టంగ్ టంగ్ టాంగ్! ఇరీనా రివాల్వరు సొరుగులో పారేసింది.

"వట్టి గందరగోళం మనుషులు! గంట సరిగా మోగించడం కూడా చేతకాదు. తప్పకుండా గస్టిల్యోవ్ అయివుంటాడు."

హాలులోకివెళ్ళి తలుపుతాళం తీసింది. అవును, గస్టిల్యోవే కాని ఒంటరిగా రాలేదు. అతనితో గ్రిగరీ వాసిల్యెవిచ్, ఇంకో నల్లటి గడ్డం మనిషి ఉన్నారు. ఇరీనా ఆ మూడోమనిషిని ఎన్నడూ చూడలేదు.

"రూక్ యింట్లో లేడు" అంది ఇరీనా ఉదాసీనంగా. "తప్పడు సంకేతం యిచ్చావేం? రెండుమాట్లు యెక్కువసేపు, రెండుమాట్లు

కొద్దిసేపు గంట మోగించడం సంకేతంగా యేర్పచుకున్నాంగదా! యికముందు యిలాచేస్తే తలుపు తెరవను. యింకోవిషయం. గత్యంతరం లేకపోతే తప్పితే యిక్కడికి రావడానికి వీల్లేదు. రహస్య కార్యకలాప నిబంధనలను వుల్లంఘిస్తున్నావని నేను వేరే చెప్పాలా? పైగా ఒక్కడివేకాక వాళ్ళనీ వాళ్ళనీ పోగుచేసుకు వస్తూంటివి!"

గదిలోకి వెళ్ళిపోతూ ఈమాటలు నాలుగూ చెప్పింది. ఆ ముగ్గురువ్యక్తులూ మొదటిగదిలోనుంచి సరాసరి అచ్చు ఆఫీసులోకి వెళ్ళారు. గస్టిల్యోవ్ ఇదివరకు వచ్చినవాడేమో దోవ తెలుసు.

నేలమీద పడిఉన్న ప్రకటనల కట్టలముందు నిలబడ్డారు.

"యెన్ని?" అని అడిగాడు గస్టిల్యోవ్ చేతిబెత్తంతో దగ్గరకట్టను తాకుతూ,

"రెండువేలు" అంది ఇరీనా గర్వాన్ని దాచుకోలేక. "యీ అచ్చు యెంత అందంగా వుందో చూడు. పూర్వం యెన్నడో జెల్లీగ్రాఫ్ వున్ననాటికీ నేటికీ యెంత భేదమో!"

ఆ మెన్షివిక్కులకు ఈమాటలు సరిపడలేదు. ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. గ్రిగరీ వాసిల్యేవిచ్ అచ్చు కరపత్రం ఒకటి పైకి తీసాడు. కరపత్రంలో ఇలాఉంది:

రష్యన్ సోషల్ డెమాక్రాటిక్ లేబర్‌పార్టీ

ప్రపంచ కార్మికులారా ఏకంకండు!

కామ్రేడ్స్!

యుద్ధంప్రారంభం కాకముందే మేము, సోషల్ డెమాక్రాట్లం, కార్మికులకు, రైతులకు యుద్ధంఅవసరం లేదని చెప్పాం. కొత్తదేశాలను జయించాలనీ, ప్రజారక్తంతో ఉవ్వెత్తుగా లేస్తున్న ప్రజల కోపాగ్నిని చల్లార్చాలని చూసే ప్రభుత్వవర్గానికే ఈ యుద్ధం అవసరం. మన ప్రజానీకం రాజకీయ బానిసత్వంతో మూలుగుతోంది. ఇతర జాతులను బానిసలను చేసే యుద్ధంలోకి ఈడ్వబడుతోంది. మన ప్రజలు ఇక్కడ రాజకీయ వ్యవస్థను పునర్నిర్మించాలని కోరుతున్నారు.

కాని అధికారవర్గం ప్రపంచం చివర శతఘ్ని మోతలతో ప్రజల దృష్టిని మళ్ళించాలని యత్నిస్తోంది.

"వర్గచైతన్యంగల రష్యన్ కార్మికులంతా ఈ అన్యాయ యుద్ధానికి, వినాశనకర యుద్ధానికి అసమ్మతి వెల్లడించాలి. కార్మికవర్గం జాతి ద్వేషాన్ని గుర్తించదని రుజువు చేయాలి..."

గ్రిగరీ వాసిల్యేవిచ్ పెదవులు బిగపట్టుకుని చదివాడు.

"సిగ్గుచేటయిన ఈ జనసంహారం నశించాలి! ఈ నినాదం అందరి హృదయాలలోనుంచి మారుమ్రోగాలి. విప్లవ నినాదంగా ఇది ప్రతి ఫ్యాక్టరీలో, ప్రతి మిల్లులో ప్రతిధ్వనించుగాక!

"ఈ సిగ్గుచేటు యుద్ధాన్ని రగుల్కొల్పిన జారు ప్రభుత్వం నశించుగాక!

"రక్తపిపాసులు నశించాలి!

"శాంతి, స్వాతంత్ర్యం కావాలి!

"మే 25 న ప్రదర్శనంలో చేరండి!

మాస్కో కమిటీ, ఆర్. యస్. డి. యల్. పి..

గ్రిగరీ వాసిల్యేవిచ్ చదువుతూండగా, గస్టిల్యోవ్, నల్లగడ్డం మనిషి స్టోల్ (పొయ్యి) దగ్గరికి వెళ్ళారు. గస్టిల్యోవ్ స్టోల్ తలుపు తెరచి దానిముందు కూర్చున్నాడు నల్లగడ్డం మనిషి తనకు సమీపంలో ఉన్న కరపత్రాల కట్టలను తీసి స్టోవ్‌లో కుక్కాడు.

ఆతనిని వారించాలని ఇరీనా చేయిజాపిందిగాని గస్టిల్యోవ్ ఆమె మణికట్టును గట్టిగా పట్టేసాడు.

"ఉద్రేకం చెందకు. వాటినియేంచేయాలో అదేచేసాం. ప్రదర్శనాలు ఆపుచేశాసాం."

గస్టిల్యోవ్ తొందర తొందరగా అగ్గిపుల్లలు వెలిగించాలని చూసాడు. పుల్లలు తలలదగ్గర విరిగిపోసాగాయి. ఇరీనా విడిపించుకోవాలని యత్నించింది. కాని గ్రిగరీ వాసిల్యేవిచ్ గట్టిగా పట్టుకునే ఉన్నాడు

"వదిలిపెట్టు, యొత ధైర్యం!"—

ఎలాగయితేనేం అగ్గిపుల్ల వెలిగింది. గస్టిల్యోవ్ కరపత్రాల

కట్టకు అంటించాడు. వెంటనే స్టోవ్ తలుపులోనుంచి పెద్దమంట బయలుదేరింది. గ్రిగరీ వాసిల్యెవిచ్ ఇరీనాచేయి ఇంకా గట్టిగా నొక్కి పట్టాడు. ఆమె కదలలేకపోయింది. నల్లగడ్డం మనిషి, గస్టిల్యోవ్ గుప్పిళ్ళతో కరపత్రాలుతీసి మంటలో పడేసారు.

"దొంగవెధవల్లారా! పోలీసులుకూడా యింత దౌర్జన్యకాండకు ఒడిగట్టరు."

ఆఖరి కట్టకూడా మంటలో పడవేయడం అయిపోయింది. గస్టిల్యోవ్ గది నలుమూలలా చూసాడు.

"కదపడానికి యేదయినా యిక్కడవుందా? డేవిడ్ పెట్రోవిచ్! ఆ యినపకడ్డీ యిలాయియ్యి."

గుట్టగాపడ్డ బూడిదను కదిపేసరికి మంట పైకిలేచి మిగిలిపోయిన కాగితపు ముక్కలను కూడా భస్మంచేసింది. వచ్చిన పని అయిపోయింది.

గ్రిగరీ వాసిల్యెవిచ్ ఇరీనాచేయి వదలివేసాడు. చేయి తిమ్మిరెక్కింది. అయినా ఆ చేతినే జాపి చెళ్ళున లెంపకాయ కొట్టింది.

"అదిగో!"

ఏదో అనబోయింది. కాని అనకుండా సూటలు బల్లమీద కూర్చుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

గ్రిగరీ వాసిల్యెవిచ్ ఆశ్చర్యంలో మునిగిపోయాడు. చెంపమండుతోందనితప్ప ఇంకేమి అతనికి తెలియలేదు. గస్టిల్యోవ్, నల్లగడ్డం మనిషి భయంతో అతనికేసి చూసారు. చివరికి తడబడుతూ ఈక్రింది మాటలు అనగలిగాడు:

"యింతకింతా అనుభవిస్తావులే! వింటావుగా!"

హాలులో అడుగులచప్పుడయింది. గస్టిల్యోవ్ తొందరగా స్టోవ్ తలుపు మూసి లేచి నిలబడ్డాడు. తలుపు తెరుచుకుని బామన్ చక్కావచ్చాడు. ఏడుస్తున్న ఇరీనాకేసి, కలిసికట్టుగా నిలుచున్న ఆ మెన్షివిక్కుత్రియంకేసీ చూసాడు. కళ్ళల్లో అగ్ని ప్రజ్వరిల్లింది.

"యిక్కడ యేంచేస్తున్నారు?"

"వీళ్ళు – వీళ్ళు తగలబెట్టేసారు." అని చెప్పింది ఎంతో కష్టం మీాద ఏడుస్తూనే. "కరపత్రాలన్నీ తగలబెట్టేసారు"

"యేమిటి?"

బామన్ ఒక అడుగు ముందుకు వేసాడు. గ్రిగరీ వాసిల్యెవిచ్ చెంప ఇంకా ఎర్రగానే ఉంది. గబగబా మాట్లాడుతూ,

"ప్రదర్శనాలలో పాల్గొనరాదని నిన్నటి సమావేశంలో కమిటీ తీర్మానించింది" అన్నాడు.

"సమావేశం?" బామన్ కంఠంలో అగ్ని ఇంకా ప్రజ్వరిల్లింది. "యేసమావేశం?"

"కమిటీ అత్యావసర సమావేశం" అన్నాడు నల్లగడ్డంమనిషి. గ్రిగరీ వాసిల్యెవిచ్‌కి దగ్గరగాజరిగి పోరాటానికి తయారవుతున్నట్టు రొమ్ము విరుచుకున్నాడు.

"పదిమంది సభ్యులలోనూ ఆరుగురు సమావేశానికి హాజరయారు."

ఇరీనా కోపంతో పిచ్చిగా అరిచి బామన్ కేసి చూసింది. పదిమందికి ఆరుగురు హాజరు! అంటే అధికసంఖ్యాకులు హాజరయినారన్నమాట, కమిటీలో అచ్చమయిన మెన్షివిక్కులు నలుగురే. తక్కినవారంతా బామన్‌పక్షంవారనే నమ్మకం. అధికసంఖ్యాకుల లోని ఇద్దరు నిన్న గ్రిగరీ వాసిల్యెవిచ్ పక్షం చేరివుండాలి. కాని అలా జరగకూడదే! యెక్కడో వెధవపని జరిగింది!

బామన్ మాట్లాడలేదు. నల్లగడ్డం మనిషి చెప్పింది గ్రిగరీ వాసిల్యెవిచ్ రూఢిపరుస్తూ,

"అవును. ఆరుగురు. నువ్వు కనిపించలేదు. యింకా..." ఇరీనాను వేలితో చూపించాడు, ఆమె పేరును ఉచ్చరించలేక.

"అంతా అబద్ధం" అని అరిచింది ఇరీనా. "యిరవయినాలుగు గంటలూ యిక్కడ అచ్చువేస్తూనే వున్నాం, యెవరూ రాందే!"

"కామ్రేడ్ సెమ్యాన్‌కి జబ్బుగావుంది" అంటూ కొనసాగించాడు గ్రిగరీ వాసిల్యెవిచ్ ఇరీనా కేకలను లక్ష్యపెట్టకుండా.

"కొజుబా నీకు తెలుసుగా, జవుళి జిల్లాలో వున్నాడు..."

"నిన్న తిరిగి వచ్చాడు." అంటూ అడ్డువచ్చింది ఇరీనా.

"యిక్కడ మాతో పాటు పనిచేస్తూనే వున్నాడు."

"ఆసంగతి నా కెవరూ చెప్పలేదు" అని జవాబిచ్చాడు గ్రిగరీ వాసిల్యెవిచ్ ఉదాసీనంగా. "అతను యిక్కడ లేడనుకోవడానికి కారణాలున్నాయి. అంతేకాక, అందరికీ తెలియజేసినా వోటింగు ఫలితం తారుమారయేది కాదు. మాకు కోరంవుంది. యింతకుముందు చెప్పాగా, అధిక సంఖ్యాకులు ప్రదర్శనాలు చేయడానికి వ్యతిరేకంగా వోటు చేసారు. కావాలంటే రుజువుచూపిస్తాం"

బామన్ ఏమీ మాట్లాడలేదు. ప్రతిమాటా కత్తిని వాడినట్లు వాడవలసినపుడు తొందరపడి మాట్లాడడం అతని స్వభావంకాదు.

"దోపిడి!" అన్నాడు చివరకు మెలమెల్లగా.

"నిజంగా అధిక సంఖ్యాకుల నిర్ణయాన్ని మీరు కాలదన్నారు"

"సంప్రదాయం ప్రకారం..." అంటూ గ్రిగరీ వాసిల్యెవిచ్ ప్రారంభించాడు.

"విప్లవం అటువంటి మాటలను గుర్తించదు!" అంటూ బామన్ అతనిని నోరు మూయించాడు. "యీ విషయం నీతో చర్చించదలుచుకోలేదు. యిక్కడినుంచి దయచేయండి."

గ్రిగరీ వాసిల్యెవిచ్ నీటిలోనుంచి బయటపడ్డ చేపలాగా నోరు బాగా తెరిచాడు.

"యే – మి – టి?"

"స – రిగా" అంటూ బామన్ జవాబిచ్చాడు కర్కశంగా. "దీంతో ఆఖరు. మాకు చిక్కులు కలిగిస్తూన్నప్పటికీ మీ భయాన్ని సహించాం. విప్లవ కార్యక్రమాన్ని ఛిన్నాభిన్నం చేయడానికి పూనుకుని దిగజారిపోతుంటే, అంటే ప్రత్యక్షద్రోహం తలపెట్టినపుడు లెనిన్ మీ విషయంలో చెప్పిన 'ఒక అడుగు ముందుకు, రెండు అడుగులు వెనకకు' యిక వర్తించదు. యిది శత్రు శిబిరంలో చేరడానికి సూటిగా పరుగెత్తడమే. అదీ మీలక్ష్యం. ముక్తి కలుగుతుంది!"

"యిక చీలిపోవడమేనా?" అని నల్లగడ్డం మనిషి బొంగురు గొంతుతో అడిగాడు రొమ్ము విరుచుకుంటూ. బామన్‌ను కొట్టబోతున్నాడా అనిపించేటట్టున్నాడు.

"చీలిక?" అని బామన్ ప్రశ్నించాడు. "అబ్బే! అదేంకాదు. మిమ్మల్ని గెంటేస్తున్నాం."

ఇరీనా సంతోషంతో నవ్వింది.

"యిక, బతికిపోతాంబాబూ!"

రంగుపూయని బల్లమీది అచ్చు ఆఫీసు సామానువంక, అల్లల్లాడుతున్న స్టూలుబల్లలవంక, పక్కగదిలోకి వెళ్ళే ద్వారం వంక గస్టిల్యోవ్ చూసాడు. పక్కగదిలో సామానేమి లేకపోవడం చూసి నవ్వాడు.

"బలే! మేము సహాయంచేసినా యింతకంటే యెక్కువ..."

"కృతజ్ఞురాల్ని" అంది ఇరీనా విసుక్కుంటూ.

"అవును కృతజ్ఞత చూపాల్సిందే." గ్రిగరీ వాసిల్యెవిచ్ ఒప్పుకుంటూ అన్నాడు" తప్పుడు అంచనాలు వేసుకుని యుద్ధం ప్రకటించావు. సంగతిసందర్భాలు నీకు తెలిసినట్టులేదు. అల్ప సంఖ్యాకుల ప్రతినిధులను తగినంతమందిని తీసుకోవడానికి కేంద్రకమిటీ అంగీకరించిన సంగతి తెలిసివుండదు.—"

గస్టిల్యోవ్, నల్లగడ్డం మనిషి ద్వేషంతో తమలో తాము నవ్వుకున్నారు.

"యింకా, లెనిన్ ఒంటరివాడయిపోయాడు. కేంద్రకమిటీ ఆయనకు స్వస్తిచెప్పింది. మేమ్ము..."

బామన్ ఒక అడుగు ముందుకు వేసాడు. కణత నాళాలు పొంగాయి. కళ్ళు ధగధగ్గా వెలిగాయి.

"పొండి, వెళ్ళిపొండి. యింకొక్కమాట మాట్లాడారా..."

"యేమిటీ? దౌర్జన్యమే?" అని గస్టిల్యోవ్ అరిచాడు. "కేంద్రకమిటీకి తెలియజేస్తాం!"

"మా కేంద్రకమిటీ" అన్నాడు గ్రిగరీ వాసిల్యెవిచ్ మొదటి అక్షరం ఒత్తి ఒత్తి పలుకుతూ. మొఖం వెలవెలబోయింది. కాని ఇరీనా కొట్టిన దెబ్బకు కందిన చెంప కందినట్లే ఉండడం చూసి ఆమె సంతృప్తి చెందింది.

ఒకరివెనక ఒకరు వెళ్ళిపోయారు. తలుపు మూసుకుంది. వ్యవహారం ఇంతటితో ఆఖరా? లేక ఇదే మొదలా?

ఇరీనా కళ్ళెత్తి బామన్‌కేసి చూసింది.

"అబద్ధాలాడుతున్నారు. కాదూ?"

"యేమో తెలీదు" అన్నాడు బామన్ తలపంకిస్తూ. "యిటీవల వచ్చిన అడ్డంకుల మూలంగా కేంద్ర కమిటీలో పరిస్థితి సంతృప్తికరంగా లేదు. వృత్తములకి స్థానంలేకుండా పోయింది. యింతకుముందు మనం చూచిన యీ చిన్నవిషయం దీన్ని సూచిస్తోంది. వెనక బలపరిచేవారు యెవరో లేకపోతే చీలిక తేవడానికి సాహసించేవాళ్ళు కాదు. అటువంటి మనుషులు వీళ్ళు!"

ఇరీనా బొమ్మలా చలనంలేకుండా నిలుచుంది. చేతులు పక్కలన వేలాడుతున్నాయి.

"నిజంగా లెనిన్‌ను వెళ్ళగొట్టేస్తారా ? సాధ్యమవుతుందా ?"

"లెనిన్‌ని వెళ్ళగొట్టడమా?" అని తృప్తిగా బామన్ నవ్వాడు.

"ఊహూఁ- వాళ్ళతరం కాదు. ఆయనతో ఒకగంట గడిపితే యిటువంటి పిచ్చిఅనుమానాలు నీ బుర్రలో ప్రవేశించవు. శాస్త్ర పరిషత్తు మైఖేల్ లో మొనొసోవ్‌ని బర్తరఫ్ చేస్తానని బెదిరిస్తే యేమన్నాడో తెలుసా ?

"అసంభవం! పరిషత్తును బర్తరఫ్‌చేస్తే సాధ్యమవుతుందేమో?' అన్నాడు. ఆ మాత్రంకూడా లెనిన్ అనడు. యెందుకంటే పార్టీని గురించి మాట్లాడుతున్నామంటే లెనిన్‌గురించి మాట్లాడుతున్నట్టే. లెనిన్ అంటే పార్టీయే, పార్టీయే లెనిన్!"

సింహద్వారం తెరిచిన చప్పుడయింది. ఆ తరవాత హాలులో అడుగుల చప్పుడయింది.

కొజుబా హుషారుగా చక్కా వచ్చాడు.

"బయట మూడు అక్కుపక్షులు కనిపించాయే. యిక్కడ నుంచే వెళుతున్నారా ? కోపంగా వున్నట్టు కనిపించారే!"

జరిగిందంతా బామన్ క్లుప్తంగా అతనికి తెలియజేసాడు.

అన్నాడు :

కొజుబా నిట్టూర్చి, "నువ్వు చెప్పిందే సరి. పీడవదలిపోయింది. కాని ఆదివారపు కార్యక్రమమంతా తగులబెట్టేసారు. కరపత్రాలు లేకుండా యెలా ?"

ఇరీనా బల్లమీదికి వంగి ఇనప చట్రంలోని పుటను పరీక్షించింది.

"యేమీ చెదరిపోలేదు. కరపత్రాలు తిరిగీ అచ్చువేయడానికి వ్యవధి వుందంటావా ?"

"శ్రమకాదూ ? నిద్రలేకుండా వరసగా మూడు రాత్రిళ్ళు పని చేయడం..."

జవాబు చెప్పకుండా ఇరీనా తల పంకించి, అచ్చు కూర్చే, స్టిక్కు తీసుకుంది.

"ఆగు, మరి కాగితం మాటేమిటి ?"

"కాగితం ? ఆమె సరయినపనే చేస్తోంది. రూక్ ! కాగితం సంగతేంచేస్తావు ?"

బామన్ తల గోక్కుంటూ నిట్టూర్చాడు.

"కాగితం సంగతా ? కొనాలి. వున్నదేమో వాడేసాం."

"డబ్బేమన్నా వుందా ?"

"ఉహుం - లేదు."

"అంటే..."

"అంటే సంపాదించాలి" అని బామన్ నవ్వాడు.

"నువ్వు పని ఆరంభించు. నేను కుంపటి వెలిగిస్తాను. టీ తాగుతూ డబ్బు సంపాదించే విధం ఆలోచిద్దాం. సాయంత్రానికల్లా డబ్బు దొరి కితే, రేపు వుదయానికి అచ్చు పూర్తయిపోతుంది."

"కొంచెం ఆలస్యం అవుతుంది" అన్నాడు కొజుబా తల ఆడిస్తూ. "ప్రదర్శనాల ముందు కరపత్రాలు బయటికి వస్తాయి"

"ఆలస్యమేననుకో. కాని అసలు మానేయడంకంటె నయం. సరేగాని. కిటికీ తెరలు యెత్తడం మంచిది. దోవ బోయేవాళ్ళు పగలు తెరలు దించారేమిటా అని అనుమానించకుండా చూసుకోవాలి."

కిటికీ దగ్గరకు వెళ్ళి ఒక తాడు లాగాడు. తెర గలగలమంటూ మెల్లిగా లేచింది. సగానికి లేవగానే బామన్ హఠాత్తుగా తాడు వదిలేసాడు. తెర టపీమని పడిపోయింది. బామన్ పరుగెత్తాడు.

"పోలీసులా?" అని కొజుబా అతని వెనకే కేక పెట్టాడు.

కాని అప్పటికే బామన్ గది బయటికి వెళ్ళిపోయాడు. ఇరీనా కొజుబా కేసి మందలింపుగా చూసి,

"అలా అడగవచ్చా? పోలీసులే అయితే రూక్ బయటికి పరుగెత్తుతాడా?" అంది.

ఇరీనా, కొజుబా వినసాగారు.

"తలుపు తీసాడు. యెవరో లోనికి వచ్చారు. తెర యెత్తుతూంటే బండి గుమ్మంలోకి రావడం వినిపించింది. అందుకనే పోలీసులు వచ్చారనుకున్నా. బండిలో యిక్కడికి వచ్చేవాళ్ళెవరున్నారు?"

తల ఒక వేపుకు వంచి, చెవులు నిక్కించి కొజుబా వినసాగాడు. ఆశ్చర్యంతో కనుబొమలు పైకి లేచాయి.

"బలే! వాళ్ళు ముద్దెట్టుకుంటున్నారు, నమ్మ్మ, ముద్దెట్టుకుంటున్నారు."

# 9

# ఎక్స్‌ప్రెస్

రోజుబా చెప్పింది నిజమే.! హాలులో బామన్ ఒక సౌందర్యవతిని ముద్దిడుకుంటున్నాడు. ఆమె పసందయిన వేసవిదుస్తులు, షోకయిన పెద్ద హాటు ధరించింది. హాటుకు ఒక ఈక. పొడుగ్గా, బొద్దుగా ఉంది. మొహం సన్నగా ఉంది. మొహానికి అనుగుణంగా శరీరం లేదు. ఆమె ఎవరో కాదు, నడెజ్డా – నాడ్యా.

"యింతకాలానికా రావడం? నీకోసం నిరీక్షించి, నిరీక్షించి సగం అయిపోయాను. యింతకాలం వుండిపోయావేం?"

"వ్యవహారాలు" అని నాడ్యా నవ్వింది. విదేశాలలో యేం జరుగుతోందో నీకు క్షుణ్ణంగా తెలుసుగా. బందిపోటు! మెన్షివిక్కులకి పట్టపగ్గాలు లేకుండా వున్నాయి."

"అయితే, నిజమేనన్నమాట! మనస్నేహితులు అందుకా చెట్టెక్కి కూర్చున్నారు. సరే. లెనిన్ వాళ్ళపని పట్టిస్తాడులే."

"తప్పకుండా. కాని యీలోగా మనవాళ్ళు నానాఅవస్థలు పడాల్సివస్తోంది. ప్రస్తుతం- పత్రికలన్నీ మెన్షివిక్కుల చేతుల్లో వున్నాయి. రవాణాసౌకర్యం, డబ్బు వుంది. ఆ ఆశా, యీ ఆశా చూపించి లొంగదీసుకోవాలని యత్నిస్తున్నారు. వ్యక్తిగత జీవితాలను తవ్వి పాతసుద్దులు వుపయోగించుకోవాలని చూస్తున్నారు. నిన్ను చీల్చి చెండాడాలని వుబలాటపడుతున్నారు. నిన్ను అప్రతిష్టపాలు చేయడానికి యేదయినా దొరుకుతుందేమోనని వెదుకుతున్నారు. యీ కొట్లాటలు, వెధవ పుకార్లు వాళ్ళు పుట్టిస్తున్నవే!"

"బహుశా యిదంతా గస్టిల్యోవ్ పనికావచ్చు."

"యెవరు?" నాడ్యా ఏదో జ్ఞప్తికి తెచ్చుకుంటున్న దానిలా కనుబొమలు ముడుచుకుంది.

"గస్టి...ఓ– ఆపేరులానేవుంది. అవునవును. యిపుడు జ్ఞాపకం వచ్చింది. గస్టిల్యోవ్ పేరిటివాడే. నీమీద నిందను వేస్తూ యింత పొడుగు వుత్తరం రాసాడు."

"కూర్చో. హాటయినా తీసేసుకో"

ఇద్దరూ నవ్వుకున్నారు.

"వీటికేంగాని, వెంటనే అంతా నీకు తెలియజేయాలి ..."

అని ద్వారంవంక చూసింది. "ఒక్కడివేనా, యింకెవరయినా వున్నారా?"

ఆమె చూసినవైపే చూసి బౌమన్,

"వున్నారు" అన్నాడు.

"మన మాటలు యెవరికన్నా వినిపిస్తాయా? నే చెప్పేది నీకు తప్ప యింకెవరి చెవినా పడకూడదు. ఆనోటా ఆనోటా పాకిపోవడానికి వీల్లేదు."

"పరిస్థితులు అంత అధ్వాన్నంగా వున్నాయా?" అని అడిగాడు బౌమన్ ఆందోళనతో

ఆమె మళ్ళీ నవ్వింది.

"అధ్వాన్నం అనే మాటకు అర్థంతీయడంలోనే అంతా ఆధారపడి వుంది. బోల్షివిక్కులకు అధ్వాన్నం అంటూ వుండదు. ఒకొక్కపుడు కష్టాలు రావచ్చు. కాని లెనిన్ వున్నాడు. భయపడాల్సిన పనిలేదు."

బౌమన్ కళ్ళకు లెనిన్ రూపము పొడగట్టింది. విశాలమయిన నుదురు, ఊడిపోతున్న జుట్టు, కళకళలాడుతూ నవ్వేటి లేత కళ్ళు!

"వుత్తరాలేమన్నా తీసుకు వచ్చావా?"

"ఆఁ- వ్లాడిమిర్ ఇల్యిచ్ దగ్గరనుంచి. చాకు ఒకటి ఇలా యివ్వు...ముందు దుస్తులు మార్చుకోవాలి. లోపలికి యెవరూ రారనే అనుకుంటా"

"వస్తారనుకోను." అని జవాబిచ్చాడు బామన్ కొద్దిగా అనుమానంతో. "మరేం పర్వాలేదు. స్నేహితులే."

"తెర దించెయ్యి. దోవబోయేవాళ్ళు చూడొచ్చు."

బామన్ కిటికీ దగ్గరకు వెళ్ళాడు. నాద్యా జాకెట్టు, గాగరా తీసివేసుకుని బక్కపలాచటి స్త్రీగా మారింది. దుస్తులతోనే బొద్దు తనంకూడా వదిలిపోయింది. "లెనిన్ రచించిన 'ఒక అడుగు ముందుకు రెండడుగులు వెనకకు' రెండు వందల కాపీలు వెంట తీసుకువచ్చాను. తక్కినవి" హాలు గుమ్మంలోఉన్న సూటుకేసు చూపించింది. "అందు లోవున్నాయి. అడుగు రహస్యంగా వూడదీయవచ్చు. యిక చాకు యియ్యి. వుత్తరం గాగరా కుట్లలోవుంది"

బామన్ చాకులోనుంచి కత్తి టక్‌మని తీసాడు. మోకాళ్ళ మీాద కూర్చుని కుట్టును కోసేయడం మొదలుపెట్టాడు.

"అరే, కుంపటి వెలిగించడం మర్చిపోయాను. ఇరీనా !"

"పిచ్చావేం ? నేనింకా దుస్తులు వేసుకోలేదే !"

కాని వ్యవధిలేకపోయింది తలుపు తెరుచుకుంది. ఇరీనా గుమ్మం లోనే టపీమని ఆగిపోయింది, కలవరపడింది. ఇదేమిటి ? కళ్ళముందు దృశ్యం నమ్మలేకపోయింది. ఒక స్త్రీ, పూర్తిగా దుస్తులు వేసుకో లేదు. ఆమె పక్కన మోకాళ్ళమీాద బామన్ !

"సరే ముందు నీకు పరిచయం చేస్తాను." అంటూ పిలిచాడు బామన్. "యీామె నా భార్య."

కుట్టు ఊడదీసి బాగా నొక్కుకుపోయిన రెండు పెద్ద పెద్ద ఉత్త రాలు బయటికి తీసి లేచి నుంచున్నాడు.

"సాంకేతిక భాషలోవున్నాయా ?"

"అవును. ఒక్క నిమిషం ఆగు. ముందు సూటుకేసు తిరగేద్దాం. తాళం తీస్తాను. యెవరయినా ముందు దుస్తులు వేసుకోవాలిగా."

బామన్ సూటుకేసును తొందరగా గదిలోకి లాగుకొని వచ్చాడు. పక్కకువెళ్ళి ఉత్తరం విప్పాడు.

"సరే యిక చచ్చినా మాట్లాడడు" అంది అతని భార్య చేయిఆడిస్తూ. "అంటే ఆ ఉత్తరంలో వ్రాత గ్రహించేదాకా, యిక్కడ వ్యవహారాలనుగురించి చెప్పు. నీపేరు ఇరీనా కదూ ?"

ఇరీనా తల ఊపింది. ఇద్దరూ గట్టిగా కరచాలనం చేసుకున్నారు.

"కంపటిసంగతి చూస్తూ ప్రారంభించండి" అన్నాడు బామన్ ఉత్తరంమీదనుంచి దృష్టి మళ్ళించకుండానే. "విదేశాలనుంచి వచ్చిన యీ అతిథికి యింత టీయివ్వాలిగదా. నాడ్యా! కాకపోతే యెక్కువ తిండి పెట్టలేం, అంతే"

"డబ్బు లేదాయేం ? అవునులే, యిదేంకొత్తా ?" అంది నాడ్యా కొద్దిగా నవ్వుతూ ఆ తరవాత నిట్టూర్చి "మరేం పరవాలేదు. నేను కొంత డబ్బు తెచ్చాలే".

"యెక్కువగానేనా ?" అని కీచుగొంతుతో ఇరీనా అడిగేసరికి నాడ్యాకి నవ్వు వచ్చింది.

"ఓ-చాలా."

"సరే, యిలాయియ్యి" అంటూ ఇరీనా అరిచేయి జాపింది.

"దీంతో కాగితం సమస్య తీరిపోతుంది. విన్నావా రూక్ ?"

"రేపు యిస్తాను" అంది నాడ్యా "యెంత కావలసివస్తే అంత!"

"రేపేంచేసుకోను" అంది ఇరీనా కుంగిపోతూ.

"సాయంత్రం లోపల కాగితం కొనాలి"

"అసంభవం! దగ్గిర యేమీలేదు. బ్యాంకుకు వెళ్ళిరావాలి."

"అబ్బా! యేం అవస్థ వచ్చిపడింది" అంటూ ఇరీనా దిగులుతో చేతులు నలుపుకుంది. "కూడా యెందుకు తీసుకురాలేదు? దుస్తుల మధ్యకుట్టి తీసుకు రావచ్చుగా!"

"సాధ్యపడలేదు. నేను 'ఎక్స్ప్రెస్' గావచ్చాను."

"యేమిటీ నాకర్థం కావడంలేదు" అంది ఇరీనా తడబడుతూ.

"'ఎక్స్ప్రెస్' అంటే తెలియదూ?" అని నాడ్యా ఆశ్చర్యపోయి అడిగింది. కూడా రైలులో సాహిత్యం తీసుకు వస్తూంటే ఎక్స్ప్రెస్‌గా వచ్చాడంటాం. యిలా తీసుకు రావడానికీ కాలినడకను సరిహద్దు దాటించి తీసుకురావడానికీ భేదంచూపించడానికి యీ పేరు పెట్టాం. ఎక్స్ప్రెస్ పద్ధతిలో తొందరగా చేరుకుంటాం."

సూటుకేసు తాళం తీసింది. జాకెట్టు, గాగరా, పై పైకితీసి మాట్లాడుతూనే ధరించసాగింది.

"యిక మాస్కోలో సంగతి సందర్భాలెలా వున్నాయో చెప్పు. నీతో కలసి పనిచేయబోతున్నాను. నికొలాయ్, నేనూ యెప్పుడూ కలిసే పని చేస్తూంటాం."

"కాగితం కొనడానికి ముందు డబ్బు కావాలి" అంది ఇరీనా మొండిగా. "ఆ విషయం ఒకటే యిపుడు మాట్లాడగలను. కాగితం యిపుడు కొనకపోతే ఆదివారం ప్రదర్శనాలు జరగవు."

# 10

## దాడి

ఎంత తంటాలుపడ్డా ప్రదర్శనం సాగలేదు.

మామూలేగా, బ్యాంకుపని ఆలస్యమయింది. శనివారంనాడు కాని డబ్బు తీసుకోవడం పడలేదు. అప్పుడు కరపత్రాలు అచ్చు వేసినా ప్రయోజనం లేదు. సోమవారంనాటికిగాని అవి ఫ్యాక్టరీలకు చేరవు. ఆదివారమే ప్రదర్శనం !

ఇలా జరగడమే మంచిదయిందేమో. ఏమయినా ఆదివారం నాడు సాధించగలిగిందేమీ లేదు. ఉదయాన వాతావరణం శీతలంగా ఉంది. చినుకులు పడసాగాయి. మధ్యాహ్నం విద్యార్థిశ్రేణి స్టాస్టనాయా చౌకునుంచి బయలుదేరాలి. పుష్కిన్ స్మృతిచిహ్నందగ్గర ప్రదర్శకులు గుమిగూడారు. కుంభవృష్టిగా వర్షం ప్రారంభించింది. దారిపోయేవారు చెల్లాచెదరయినారు. వీధులు, చౌకులు నిర్జనమయిపోయాయి స్ట్రాస్ట్నాయ్ మఠం ఆవరణలో, చౌకుకు ఎదురుగా ఉన్న ఇండ్ల ఆవరణలలో ఉన్న ఆశ్వికపోలీసులు, కాల్బలాలు, స్మన్స్కీరాతు దళం తడిసి ముద్దయిపోయారు. వారంతా యుద్ధానికి సిద్ధంగా బయటికి వచ్చారు. వీరికి సహాయంగా గవర్నరుజనరల్ భవనానికి ప్రదర్శకులు వెళ్ళదలచినమార్గాన్ని సురక్షితం చేయడానికి పోలీసుదళాలు, లియొన్‌టవ్స్కీ, గ్నెడ్నిజోవస్కీ వీధులలోని ఆవరణలలో నిలబడ్డాయి.

విద్యార్థుల ఎత్తులు పోలీసులకు తెలిసిపోయాయి. పై అధికారుల దగ్గరనుంచి 'నిర్దాక్షిణ్యంగా అణచివేయండి' అని ఆదేశాలు వచ్చాయి. జారు దయ సంపాదించాలని పట్టుదలతో పోలీసులు సంసిద్ధమయారు.

కాని అవకాశం జారిపోయింది. కుంభవృష్టిలో, నిర్మానుష్యంగా ఉన్న వీధులలో ప్రదర్శనంచేసి ప్రయోజనం లేదని విద్యార్థులు గుమి గూడలేదు.

పిచ్చి ఉత్సాహంగల కొద్దిమంది మాత్రం వానకు తల తడవ కుండా ఓవరుకోటు కాలర్లు పైకెత్తికొని పుష్కిన్ స్మారక చిహ్నం దగ్గర చేరారు.

మఠం గడియారం అరగంట కొట్టేదాకా నిరీక్షించారు. ఇక ప్రదర్శనం జరగదని నిశ్చయించుకుని విద్యార్థి గీతాలు పాడుకుంటూ ట్వెర్‌స్కాయా వీధి దిగువకు బయలుదేరి వెళ్ళారు. వారు పాడిన గీతాలలో విప్లవాన్ని గురించి సూచనా మాత్రంగా నయినా లేదు.

కాని విద్యార్థి గీతాలు పాడడంకూడా ఆ సమయంలో తప్పే. కాస్త అలజడి జరిగినా దానిని సాకుగా తీసుకుని పోలీసులు జోక్యం కల్పించుకుంటారు. అందులో ఆ రోజున తమ విజయాలను పై అధికారులకు నివేదించాలని పోలీసులు తహతహలాడిపోతున్నారు. ఆ వీధిలో డ్యూటీలో ఉన్న పోలీసు ఈల వేసాడు. చాలాసేపటినుంచీ ఈ సంకేతం కోసం నిరీక్షిస్తున్నారేమో, వెంటనే ఇంకో పోలీసు అందుకుని ఈల వేసాడు. ఈ విధంగా ఈలలు స్త్రాస్ట్‌నాయ్ మఠం ఆవరణ వరకు మెరుపులా సంకేతం పాకింది. గుర్రాలమీద పోలీసులు, ఆశ్విక సైన్యదళం అనుసరించి రాగా తిరోగమిస్తున్న విద్యార్థి సమూహం వెనక గుర్రాలను దూకించారు. విద్యార్థులు మహాఉంటే ఒక డజనుమంది ఉంటారు. వీరుగాక ఇక దాడిచేసేవారెవరూ లేరు. అందుకని వెనక కొంతమంది పోలీసులను అట్టేఉంచే అవసరం లేకపోయింది.

జొల్లాయ్ వీధిగుండా పోలీసులను పోనిచ్చి దళనాయకుడు ముందు స్వారీచేస్తూ "కత్తులు దూయండి" అని ఆజ్ఞాపించి గుర్రాన్ని దౌడుతీయించాడు. నాయకుని వెనకనే అనుచరులూ గుర్రాలను దౌడుతీయించారు.

సరిగ్గా ఆ సమయంలోనే గస్టిల్యోవ్ బోల్షాయ్ వీధిలోంచి ట్వెర్స్కాయా వీధిలోకి పరుగెత్తడం సంభవించింది.

దూరంగా ఉండలేకపోయాడు. ప్రదర్శనం భగ్నమయిపోవడం కళ్ళారా చూడాలని బుద్ధిపుట్టింది. అందుకనే గొడుగు వేసుకుని ప్రశాంతంగా, దర్జాగా బోల్షాయ్‌వీధి చివరికి నడిచాడు. గేట్లలో కాపలా కాస్తున్న కాపలా పోలీసులుతప్ప వీధిలో ఇంకెవరూ లేరు. కుంభవృష్టిలో విద్యార్థుల బృందగానం వినిపించేసరికి ఇక నిలవలేక రోడ్ల కూడలికి పరుగెత్తాడు.

అతను ఒకడేకాదు. గేట్లు బళ్ళున తెరుచుకున్నాయి. గుర్రాలను పోలీసులు ఆవరణలోనుంచి దాడుతీయించుకుంటూ వచ్చారు. చలి వానకు తడిసి తడిసీ విసిగి కార్యరంగంలోకి దూకాలనే ఉత్సాహంతో జీనులమీద నిటారుగా కూర్చున్నారు. ప్రదర్శనానికి ఒక గంట ముందుగానే పోలీసులను, సైన్యాలను కేంద్రీకరించారు. బురద కొట్టుకున్న కంకరరాళ్ళమీద గుర్రాల డెక్కల చప్పుడు వినిపించేసరికి గస్టిల్యోవ్ వెనకకు తిరిగి చూసాడు. గుర్రాలు పిచ్చిగా అతనివేపుకే దాడుతీస్తూ వస్తున్నాయి. రౌతులు కత్తులు ఆడిస్తున్నారు. ఆ కత్తుల తళతళలో పెద్ద పతకం ధరించిన ఒక కాపలా పోలీసు అతనివంక వేలు పెట్టి చూపడం గస్టిల్యోవ్ కంటపడింది. చాలాసార్లు అతన్ని పక్కగా వెళ్ళడం జ్ఞాపకం వచ్చింది. అతనిని గమనించలేకపోవడ మేమిటి ? ఆజ్ఞ జారీ అయింది. కాని ఆ ఆజ్ఞ గుర్రాల డెక్కల చప్పుడులో అణగారిపోయింది. కొరడాలు, విచ్చుకత్తులు తలలమీద తిరిగిపోతున్నాయి. తట్టుముళ్ళు గుర్రాల డొక్కలకు గుచ్చుకుంటున్నాయి. ట్వెర్స్కాయా వీధిలోకి పరుగెత్తాడు. పోలీసుదళం ఎదురయింది. బాగా బలిసినగుర్రం రొమ్మువచ్చి మొహానికి తగిలింది. ముందుకు పడిపోయాడు. పడడంలో తల రోడ్డుపక్కాలి బాటకు తగిలి ప్రాణం పోయింది. నాలుగు

గుర్రాలు ఒకదాని వెనక ఒకటి దాడుతీసుకుంటూ ఆ శవాన్ని తొక్కుకుంటూ వెళ్ళిపోయాయి.

పోలీసు హింసాకాండకు బలిఅయింది గస్టిల్యోవ్ ఒకడే. విద్యార్థులు దూరంనుంచే పోలీసులు దాడి ప్రారంభించడంచూసి దగ్గరి ఆవరణలలో దాక్కున్నారు. కొంతమంది మెట్ల వరసకింద దాగారు. కొంతమంది ఇళ్ళల్లో ఆశ్రయం పొందారు. పోలీసుల బారినుంచి తప్పించుకుని పారిపోయి వచ్చిన విద్యార్థులకు గృహస్థులు తలుపులు బార్లా తెరిచి ఆశ్రయమిచ్చారు.

అది గస్టిల్యోవ్ శవమని అక్కడే గుర్తు పట్టారు. గస్టిల్యోవ్ అతి జాగ్రత్తమనిషి. అతనికి సంబంధించిన పత్రాలన్నిటినీ దగ్గరే ఉంచుకునేవాడు. ప్రజలు చందాలు వేసుకుని సమాధిచేసారు. అతని మృతిని గురించి వార్తా పత్రికలలో పడలేదు. గ్రిగరీ వాసిల్యేవిచ్‌కి, నల్లగడ్డంమనిషికి వారంరోజుల తరవాత ఈ వార్త తెలిసింది. గస్టిల్యోవ్ కనిపించకపోయేసరికి అతనిగదికి ఎవరినయినా పంపుదామనుకున్నారు. ఇంతలో ఈ వార్త వచ్చింది.

గ్రిగరీ వాసిల్యేవిచ్ సంతాప ప్రకటన చేశాడు. లిలాక్ రంగులో అచ్చయిన ఆ ప్రకటనను కొజుబా చాలాసేపు ముందు పెట్టుకొని చాలా బాధతో మెల్లగా చదివాడు.

“దీనివిషయం యేంచేదాం?” అని బామన్‌ను అడిగాడు కనుబొమలు బాగా ముడుచుకుని. “అతనిని మహర్షి కింద చిత్రిస్తున్నారు! ప్రజలు నమ్ముతున్నారు. నిన్న చేనేత కార్మిక భవనంలో ప్రత్యేక సమావేశం జరిగింది. కార్మికవర్గంకోసం తన స్థానంలో బలి అయిపోయినట్లు అతనినిగురించి మాట్లాడారు. కాస్త ఆలోచించు, గస్టిల్యోవ్! ఫూ! దీనిని నిరాకరించాలని చూస్తున్నావా?”

“ఆసమావేశంలో నువ్వూ పాల్గొన్నావా?” అని అడిగాడు బామన్ జవాబు చెప్పకుండా.

"ఆఁ – హాజరయినాను" అని కొజుబా గొణిగాడు. కను బొమలు కళ్ళను కప్పేశాయి. ప్రశ్నలవర్షం కురుస్తుందని భావించాడు.

"యీ గొడవంతా బయటపెట్టావా? గస్టిల్యోవ్ యెటువంటి వాడో చెప్పేసావా?"

"నేనేం మాట్లాడలేదు."

"యెందుకని?"

"యెందుకా? యేంచెప్పను? దీనంతటినీ ఖండిస్తూ మాట్లాడితే నేను పోలీసు హింసాకాండను సమర్ధించ యత్నిస్తున్నానన్నేవారు. అంతే కాదు, కార్మిక వర్గమంటే గస్టిల్యోవ్ దృష్టి వివరిస్తే అతను చనిపోయి నందుకు నేను సంతోషిస్తున్నానని తగిన శాస్తి అయినట్టు భావిస్తున్నా ననీ అనిపించేది. దానివల్ల ప్రయోజనం వుండేదికాదు"

"అదీ అసలువిషయం" అన్నాడు బౌమన్ భుజాలు ఎగర వేసుకుంటూ. "నువ్వు నిరాకరణ ప్రకటిస్తావా అని అడుగుతున్నావా? నీయంతట నువే సరయిన నిర్ధారణకు వచ్చావుగదా."

"నిజం" అన్నాడు కొజుబా విచారంగా "అయితే నేం వట్టి చెత్త. మోసం! మెన్షివిక్కులు దీనిని వుపయోగించుకుంటున్నారు"

"మోసం యెంతకాలం సాగుతుంది? యేమయినా మన అచ్చు ఆఫీసులో చేయవలసిన పనులు అతి ముఖ్యమయినవి చాలా వున్నాయి."

నిజం! అచ్చువేయవలసింది చాలా ఉంది. యుద్ధం కొనసాగు తూనే ఉంది. ఫ్యాక్టరీలలో, విశ్వవిద్యాలయాలలో అశాంతి ప్రబలు తోంది. రైతు అల్లరకు నాంది – భూమి పంచిపెడతారనే పుకార్లు, భూస్వాముల జమీలు పంచిపెడతారనే పుకార్లు పెచ్చుపెరిగి గ్రామ సీమలలో వ్యాపించాయి. లెనిన్ వ్రాసిన ప్రతి ఉత్తరంలోనూ అతి ముఖ్యమయిన సంఘటనలు జరిగి తీరుతాయని సూచించాడు. పార్టీ కార్యకలాపం పెద్దఎత్తున నలుదిక్కులా వ్యాపింపజేయాలనీ తెలిపాడు.

రహస్యాల్లోని కార్మిక, కర్షక విప్లవం ముందుకు ఉరకలు పెడుతోంది. కాని కేంద్రకమిటీలోని ఒక ముఠా మెన్షివిక్కులతో రాజీపడాలని కోరుతుండడంవల్ల పరిస్థితి క్లిష్టంగా తయారయింది. ఉద్యమాన్ని ప్రతిష్టంభింపజేయాలని యత్నించేవారందరినీ నిర్దాక్షిణ్యంగా పక్కకు తోసిపారవేసి కార్మిక విప్లవ అగ్రగామి - బోల్షివిక్ పార్టీ నాయకత్వాన్ని సుస్థిరం చేయాలి. ప్రజలు తిరగబడడానికి సంసిద్ధులయేసరికి యీపని చేయకపోతే వారిలోనుంచి పైకుబికే బ్రహ్మాండమయిన శక్తి వృథా అయిపోతుంది.

మాస్కోలో ఈ చీలిక వాతావరణాన్ని పరిశుభ్రం చేసింది. కాని గస్టిల్యోవ్ మృతితో మెన్షివిక్కుల ఆశలు చిగిరించాయి. వారి ప్రకటన 'మహావీరునికి జోహారు' యల్. యస్. డి. యల్. పి. మాస్కో కమిటీ పేరుతో అచ్చయింది. పోరాటం కొనసాగించాలనే వారి ఉద్దేశం. బోల్షివిక్కులకు డబ్బు అందటం లేదు. మెన్షివిక్కులను ఎదుర్కొని పోరాడడం ఏమంత తేలికకాదు!

ఖర్చు సాధ్యమయినంత తగ్గించేసుకున్నారు. క్రసనోసెలస్కాయా ఇల్లు ఖాళీచేసారు. అచ్చు యంత్రాలు, సామాను తరలించివేసారు. తాత్కాలికంగా వాటిని కొజుబా తన గదిలో భద్రపరిచాడు.

బామన్, అతని భార్య నగర శివార్లలోని పెట్రోవస్కీ పార్కులో కొద్ది అద్దెకు చిన్న ఇల్లు తీసుకున్నారు. మంచి మంచి యంత్రసామగ్రి కొనడానికి, రహస్య కార్యకలాపానికి అనువయిన ఇల్లు అద్దెకు తీసుకోడానికి కావలసిన డబ్బు లభ్యంకాకపోతే ఆ చిన్న ఇంటిలోనే అచ్చు ఆఫీసు పెడదామని వారి ఉద్దేశం. పార్టీ కార్యకర్తలకు - జిల్లా ప్రచారకులకు, సన్నాహకర్తలకు - అలవెన్సులు నెలకు పదిరూబుళ్ళకు తగ్గించారు. ప్రయాణపు ఖర్చుల కింద వేరే ఇవ్వడంలేదు. రోజూ కాకపోయినా తరచు ఇరీనా నగరంలో ఆ కొసనుంచి ఈ కొసకు నడిచి వెళ్ళవలసివస్తోంది. పాఠాలుచెప్పి అదనంగా కొంత సంపాదిస్తున్నా బండి కట్టించుకోవడానికి డబ్బులు మిగిలేవికావు.

బోల్షివిక్కులకు కష్టకాలం దాపరించింది.

సమావేశాలకు గది దొరకడం చాలా కష్టమయిపోతోంది. ఆర్బట్ వీధిలోని క్రిమిశాస్త్రజ్ఞుని ఇంటిలో సమావేశాలు అప్పటివరకు జరుగుతున్నాయి. కాని అక్కడా చిక్కు వచ్చిపడింది. క్రిమిశాస్త్రజ్ఞుని చూపులో భయం, నేరభావం నానాటికీ పెరిగిపోతున్నాయి. 'ఆగంతకులకు' నమస్కరించి కలవరపడుతూ వెళ్ళిపోయాడు. అలాంటప్పుడు అతని బుజాలు కిందకు దించుకుపోయేవి. ఇదివరలో ఎన్నడూ ఇలా ప్రవర్తించి ఎరగడు.

క్రిమిశాస్త్రజ్ఞుని ఆందోళన హెచ్చిపోతోంది. సమావేశాలకు కొత్త స్థలం చూసుకోవడం మంచిది. ఎంత ఆలోచించినా ఈ చిక్కులో నుంచి తప్పించుకోలేక పోయారు. ఒకనాడు కచేరీ గదిలోనుంచి హఠాత్తుగా లెన్గ్నిక్ బయలుదేరేసరికి గుమ్మంలో క్రిమిశాస్త్రజ్ఞుని భార్య, మేర్యా పావ్లోవ్నా ఎదురుపడింది. అలా హఠాత్తుగా లెన్గ్నిక్ ప్రత్యక్షమయేసరికి ఆమె ఒకక్షణం కంగారుపడి వెళ్ళిపోయింది. ఆమె కళ్ళల్లో భయం, కోపం రెండూ గోచరించాయి.

ఇక క్రిమిశాస్త్రజ్ఞుని చూరుకిందకు చేరకూడదనే దృఢనిశ్చయంతో ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. కాని ఏంలాభం? అంతకు ముందే ఈ నిర్ణయం తీసుకోవలసింది. ఆ మరునాడు నిర్మానుష్యంగా ఉన్న చిన్న వీధిలో నడుస్తూంటే వెనక ఎవరో అనుసరించి వస్తున్నారని బామన్కు అనుమానం వేసింది.

# 11

# నటన!

కొజుబా గదిలోకి ఇరీనా పరుగెత్తుకుంటూ వచ్చింది. అతను అప్పుడే మిల్లునుంచి వచ్చి టీ తాగబోతున్నాడు. న్యూరా ఇంకో కప్పు, సాసరు వెతికి తెచ్చి,

"మాతోపాటు టీ తాగుదూ" అంది.

కాని ఇరీనా ఆ భావాన్ని తోసి రాజని "వ్యవధిలేదు. రూక్ చిక్కుల్లో పడ్డాడు" అంది. కొజుబా దిగ్గున లేచాడు.

"అరెస్టు చేసారా యేం?"

"ఈ పాటికి చేస్తే చేసివుండవచ్చు" అని ఇరీనా కిటికీకేసి తల తిప్పింది. అప్పటికే వెలుతురు తగ్గిపోయింది. దీనంగా చూస్తూ "చీకటి పడేవరకూ నిరీక్షిస్తారనుకుంటాను. సామాన్యంగా రాత్రిళ్ళే వాళ్ళు అరెస్టులు చేస్తుంటారు. తప్పకుండా అతనిని అరెస్టు చేస్తారనే నా నమ్మకం. యింటిని పోలీసులు, గూఢచారులు చుట్టుముట్టారు. వంటింటి తోటలోనుంచి లోపలికి వెళ్ళాలని యత్నించాను. కాని పోలీసులు అక్కడకూడా దాక్కున్నారు. నన్నెలా వెళ్ళనిచ్చారో నాకే దురూహ్యాంగావుంది. పోరాటం మధ్యకి వెళ్ళినట్టనిపించింది. అంది "అయితే రూక్ యింకా యెందుకు వేచివున్నాడో అర్థం కావడంలేదు."

"సరిగ్గా అందుకే నేను వచ్చింది, ఆ దుస్తులతో బయటికి రావడం సాధ్యంకాదు. కార్మికులు వేసుకునే దుస్తులు-కుడితినీ, వేస్టు కోటు- యేదివుంటే అది, మిమ్మల్ని అడిగి తీసుకురమ్మని నాడ్యా నన్ను పంపింది. కార్మికుని దుస్తులు వేసుకుంటే పోలీసులు గుర్తుపట్ట లేకపోవచ్చు."

"నా దుస్తులా ?'' కొజుబా, న్యూరా కంగారుగా ఒకరికేసి ఒకరు చూసుకున్నారు. "నాకేం తెలియదు...వున్నవేమిటో వంటి మీదనే వున్నాయి''

"అవును. వుండి యేంలాభం ?'' అంది న్యూరా అనంగీకారంగా. "రూక్ అటువంటి దుస్తులు వేసుకోవడం సాధ్యంకాకపోవచ్చు. యివీ లాగులేనా ? ఛీ! అన్నీ చినుగులే. కాని...

"వ్యవధిలేదు'' అంటూ అడ్డువచ్చింది. ఇరీనా.

"యేమన్నా చేయగలిగితే యిపుడే. ఆపైన లాభంవుండదు. చేతులు కాలినాక ఆకులకోసం వెదకి ప్రమోజనమేమిటి ? సెయింట్ పీటర్స్‌బర్గునుంచి నిన్ననే సైనికుల నుద్దేశిస్తూ వ్రాసిన కాఫీలు పదిహేనువేలు ఆ యింటికి తీసుకొని వెళ్ళారని మరిచేబోకండి.''

దీంతో కొజుబా ఆశ్చర్యంతో.

"వాటిని తగలబెట్టడంటావా?'' అని అడిగాడు.

"ఉహుఁ-యేమయినా నరే తగలపెట్టదు. అదీ అసలుచిక్కు'' అంది ఇరీనా తల ఆడిస్తూ. "సోదాలో బయటపడకుండా దాచే స్తాగాని పదిహేను వేలూతగలబెట్టడమే అంటున్నాడు''

" ఆ కరపత్రాలు వాళ్ళ చేతుల్లో చిక్కితే ప్రత్యేకంగా కేసుపెడతారు''

"పెద్ద తేడావుండదు'' అంది ఇరీనా గర్వంగా చేయి ఆడిస్తూ. "రూక్ యేదయినా ఒకటే. కొత్తగా వాళ్ళు అతనిమీద మోపే నేరాలు యెక్కువగా వుండవు. కాని తప్పించుకోవడానికి మనం సాయపడాలి. దుస్తులు కావాలి. నీదగ్గర లేకపోతే యిరుగుపొరుగువారిదగ్గర తీసుకో''

"తీసుకురాగలనంటావా ? యేమోనబ్బా!'' అని కొజుబా కన్నుమన్నాడు.'' యెవడిదగ్గిరయినా రెండు పాంటులు యేడిస్తేనా?''

ఒకనిమిషం ఆలోచించి నలిగిపోయిన టోపీ బల్లమీద నుంచి తీసుకున్నాడు.''

"సరే, వెళదాం పదండి''

"మరి దుస్తుల సంగతేమిటి?''

కొజుబా కుడితీనీ పైనించి కిందికి సవరించి

"యివిగో వీటిని రూక్ కుయిచ్చి, రూక్ ని నేను వేసుకుంటాను"

"రూక్ దుస్తులా?" అని న్యూరా దీర్ఘాలుతీసింది.

"మతేమయినా పోయిందా తాతా?"

"పిక్కబలం చూపిస్తా, పట్టుకు చావలేరు." అని ధైర్యంగా కొజుబా గుమ్మంలోకి వెళ్ళాడు.

తలుపుగుబ్బమీద చేయివేసాడు. గాని మళ్ళీ తటపటాయించాడు.

"యిక్కడే ఒక్క నిమిషం వుండండి. మరి అచ్చు ఆఫీసు సంగతి నిశ్చయించకుండా—"

ముగ్గురూ గోడకు ఆనుకునిఉన్న ఒక తుక్కు సోఫాకేసి చూసారు. కొజుబా పరుపు పైకెత్తాడు. తుప్పపట్టిపోయిన కమాన్లు కిర్రుమన్నాయి.

పరుపుకింద ఒక ఇనపచట్రం, చిన్నచిన్న సైపు సంచులు, చేతితో తయారుచేసిన అట్టలకేసు, స్టిక్కులు, రోలర్లు ఉన్నాయి.

"అవును వీటన్నిటినీ మూటకట్టి రేపు తీసుకు వెళ్ళిపోదామనుకున్నాను,"

"పోనిద్దూ. యిపుడు మనం చేయగలిగిందేమీలేదు. యివన్నీ చాలా చాలా ముఖ్యమయినవేగాని, పోలీసులు పట్టుకుపోతే తిరిగీ సంపాదించుకోగలం. కాని యెన్నటికీ రూక్ ని మళ్ళీ సంపాదించుకోలేం."

కొజుబా కళ్ళు గట్టిగా మూసుకుని, మళ్ళీ తెరిచాడు. "యింకో న్యూరాని మాత్రం సంపాదించగలమా?

ఇరీనాకు అర్థమయింది.

"న్యూరా వెళ్ళిపోవడం మంచిది. యివి వాళ్ళ కంటపడితే యిక్కడెక్కడా మనం వుండకుండా జాగ్రతపడాలి. అప్పుడు ఆపద యెక్కువగావుండదు. తొందరగా వెళదాం పదండి. వినిపించిందా, న్యూరా నువ్వూ వెళ్ళిపో."

"నేను వెళ్ళను. యీ రాత్రివేళ యెక్కడికి వెళ్ళగలను? యిక్కడవున్నా నాకేం మూడదులే. యిక్కడ వుంటేనే యెక్కువ సహాయం జేయగలుగుతాను."

"అవును నిజమే" అన్నాడు కొజుబా అంగీకారసూచకంగా ప్రేమతో భార్య తల నిమురుతూ. "సరే. ఆమెని అచ్చు సామాగ్రిని జాగర్త పెట్టనీ. నాటి బాధ్యత ఆమెకి అప్పగిద్దాం. వినిపించిందా, ముసిల్దానా?"

"ఆఁ – " అంది న్యూరా స్థిమితంగా. చేతులు గట్టిగా కట్టుకుని పెదవులు బిగించుకుంది.

"యిక వినండి, చీనాలో సామాన్య జనాన్ని యెలా వురితీస్తారో తెలుసా?"

న్యూరా అరచేతులు అడ్డుపెట్టుకుని విరగబడి నవ్వింది.

"నాకేం తెలుస్తుంది?"

"కైపు మొదలయినవాటి విషయంలో జాగ్రత్త తీసుకోకపోతే" అన్నాడు గద్దిస్తూ. "నీకే తెలుస్తుందిగా, చీనాలోలాగానే నిన్ను..."

"కొజుబా!" అని అరిచింది ఇరీనా ఆదుర్దాగా. "ప్రతినిమిషం అతి విలువయింది. కాలం వృథాపుచ్చుతున్నావు"

"ప్రతిదీ తెలివిగా చేయాలి" అన్నాడు కొజుబా శాంతంగా, జేబులోంచి కాగితాలు పైకి తీస్తూ. "తొందరపడ్డకొద్దీ ఆలస్యమవుతుంది. చూడు, తొందర్లో యీ కాగితాలుకూడా తీసుకు చక్కా వచ్చాను. న్యూరా! యివి పరాయివాళ్ళ కంటపడకుండా దాచిపెట్టు"

కాగితాలు ఆమె చేతిలోపెట్టి నుదుటిమీద తొందరగా మోటుగా ముద్దుపెట్టుకున్నాడు. ఆటకాయతనం కోలుపోయిన స్వరంతో ఆమెతో మాటాడాడు.

"చీకటి పడేవరకూ ఆగు" అన్నాడు కఠినంగా. "ఆలోపున నేను తిరిగి రాకపోతే అన్నేటిమోఫెయిచ్ దగ్గిరికి తీసుకువెళ్ళు. అతన్ని యెరుగున్నావుగా! ప్రస్తుతానికి ఆ చట్రం వదిలేసెయ్. అది నువ్వు మోయలేవు. అమితబరువు. తక్కినవాటిని నీ... తెలుసుగా, ఆ విధంగా బయటికి చేరవేసెయ్యి."

తిరిగి భార్య తల నిమిరి, ఇరీనా వెనక బయటికి వెళ్ళిపోయాడు.

తలుపు తాళంవేసి ఆలోచనతో తల పంకిస్తూ కొంచెంసేపు గుమ్మంలో నిలబడింది. చేతిలోని కాగితాలను వదలేసింది. మొదట

స్టోవ్‌లోని ఆవిరి! సొరంగంలోకి పెడదామనుకుంది. స్టోవ్ తెరిచి చేతితో తడిమి చూసింది. బయటికి తీసుకునేసరికి వేళ్ళనిండా మసి కనిపించింది. గది నాలుగుమూలలా పరిశీలించింది. పక్కను తేరిపార జూచింది. ఒక తలగడతీసి కుట్టు కొద్దిగా ఊడదీసి కాగితాలు అందులో కుక్కింది. ఎగుడు దిగుడుగా ఉందేమోనని చేతితో తాకిచూసి సంతృప్తితో నవ్వింది. మంచి ఆలోచనే! తలగడా పక్కమీదపెట్టి మేజా బల్ల శుభ్రంచేసి కుంపటి తీసేసింది. అంతా కడిగి శుభ్రంచేసిన తర వాత ఏంచేయాలా అని ఆలోచించింది. ఒక టావుకాగితం కనిపించే సరికి సిరాబుడ్డి దగ్గరకు తీసుకుని మెల్లిగా-అతిశ్రద్ధగా వ్రాయడం ప్రారంభించింది.

సందెచీకటి క్రమంగా చీకటిపడింది. న్యూరా దీపం వెలిగించి మళ్ళీ వ్రాయసాగింది. అక్షరం తరవాత మెల్లిగా పట్టి పట్టి వ్రాసింది.

ఎవరో తలుపుకొట్టారు. తలతిప్పింది. చూపులో కాఠిన్యం ఏర్పడింది. అటువంటి చూపు ఎవరూ చూసి ఉండరు. చిత్రంగా తలుపు మళ్ళీ కొట్టారు. ద్వేషం! ఊపిరి బిగపట్టి నిరీక్షించింది. ఒక సెకండు గడిచింది. మళ్ళీ పిడికిలితో తలుపు కొట్టినట్లు వినిపించింది.

"యెవరువారు?" అని కేకపెట్టింది న్యూరా. దిక్కులు మారు మోగే తలుపుచప్పుడును మ్రింగివేసే కంచుగొంతుతో. "యెందుకంత పుదేకం?

"తలుపుతియ్యి, ముసలిముండా!" అని ఆగొంతు ఆజ్ఞాపించింది. "నీకు చెవుడా యేమిటి?"

"నీ పెళ్ళానికేమన్నా చెవుడేమో?" టపీమనిఅంది న్యూరా. "నాకుమాత్రం చెవుడులేదు. ఆ తాగుమోతు కళ్ళూ, నువ్వూ! నిన్ను తగలెయ్య! కాపలా మనిషిని పిలిచానంటే, పోలీసుదగ్గరికి మీ తిరుగుబోతుల్ని లాక్కు చక్కాపోతాడు"

"కాపలామనుషులం, పోలీసులం యిక్కడే వున్నాం" అని ఆస్వరం జవాబిచ్చింది. మోటుగా, దయపుట్టేవిధంగా ముసిముసి నవ్వు వినిపించింది. "రాజుగారిఆజ్ఞ. తలుపుతెరు!"

"ఆరిభగవంతుడా!" అని ఉత్తుత్త భయంతో అరిచి గడియ వేసింది.

జిల్లా సబుఇనస్పెక్టరు, ఒక సార్జంటు, ఇద్దరు పోలీసుజవానులు, కాపలామనిషి-ఏమీా సందేహంలేదు- ఒకరితరవాత ఒకరు గదిలో ప్రవేశించారు. ఇనస్పెక్టరు చేతిలో చిన్నసంచి ఉంది.

"నికనార్ రిఫ్ఫ్రేవ్ వుండేది యిక్కడేనా?"

దురహంకారంతో ఇనస్పెక్టరు చూచే చూపుకు తట్టుకోలేక న్యూరా చూపు కిందకు దించేసుకుంది.

"ఆఁ-"

ఇనస్పెక్టరు బొద్దుమనిషి. బట్టతల. టోపీ తీసివేసుకుని నుదురు తుడుచుకున్నాడు.

"యింతకన్న మంచియిల్లు దొరకలా" అన్నాడు రొప్పుతూ.

"ఛీ! యెక్కడో ఆకాశాన్నుండి యీ వెధవమెట్లు యెక్కేసరికి ముచ్చెమటలు పోసాయి. విమానంమీాద దిగాలి. యెవరవు నువ్వు? పొఫ్రిఫ్రేవ్ భార్యవా?"

న్యూరాగుండె టకటకా కొట్టుకుంది. ఏపేరుతో ఆమె నమోదయిందో మరిచేపోయింది. పొఫ్రిఫ్రేవా పేరుతోనా, ఇంకోపేరుతోనా? ఎన్నిసారులు రహదారిచీటి మార్చిందికూడా జ్ఞాపకం లేదు.

ఎందుకయినా మంచిదని ఆమె జవాబివ్వలేదు అదృష్టవశాత్తు ఇనస్పెక్టరు ఆమె జవాబిస్తుందని ఆశించలేదు. గది మధ్యకి వెళ్ళి మెరుగుపెట్టిన బూట్లతో పక్కను ఒక్క తన్ను తన్నాడు.

"వాడెక్కడున్నాడు?"

"నాకేమాత్రం..." అంది న్యూరా ముభావంతో. "నా మొగుడు పట్టి తాగుబోతు."

"తాగుబోతా?" అంటూ ఇనస్పెక్టరు ఆశ్చర్యంతో కావలా మనిషి వేపు తిరిగాడు. ఆసమయంలో కావలామనిషి బిక్కమొహం వేసుకుని గోడకు ఆనుకుని నిలబడి ఉన్నాడు.

కావలామనిషి న్యూరావంక, నేలవంక చూసి తలగోక్కొని బొంగురుగొంతుతో,

"కొద్దో గొప్పో తాగుతాడు. నిజం" అన్నాడు.

"తెలివితక్కువ ముద్దా!" అన్నాడు ఇనస్పెక్టరు అనుమానంతో. "రాజకీయాల్లో తిరిగేవాళ్ళు వోడ్కా తాగరు. యింతవరకు తాగి అల్లర్లు రెచ్చగొట్టిన రాజకీయవాదిని నేను చూడలేదు. యెవరయినా తాగాడంటే వాడు సోషలిస్టు కాదనుకో"

"ఆయన సోషలిస్టే, సోషలిస్టే, నిజం" అంటూ అడ్డువచ్చింది న్యూరా. "సాయంత్రం అవడం ఆలస్యం వోడ్కా సీసాతో తయారవుతాడు. శనిగ్రహం! ఆయన సోషలిస్టే! మీరు సరిగానే చెప్పారు."

"నోరు మూయ్, ముసిలిముండా!" అంటూ ఇనస్పెక్టరు ఆమెను గదమాయించి నోరు మూయించాడు. "పండితుల భాష తెలియక పోతే నోరు మూసుకోవాలిగాని —"

మళ్ళీ భారంగా ఊపిరి పీల్చాడు.

"ఇలా కూర్చోండి," ఇనస్పెక్టరుగారూ "అంది న్యూరా దయ ఉట్టిపడేటట్టుతలవంచి సోఫాకేసి చూపుతూ. చూడండి యెంత చెమట మీకు పట్టిందో– జారే మంచుమీద గుర్రంలా!"

"ఊఁ–" అన్నాడు ఇనస్పెక్టరు కఠినంగా. కాని ఆ మరుక్షణమే కళ్ళమీద చేతిని పెట్టుకుని "ఫూ! అలిసిపోయాను. యిలాంటి నేరాలతో రెండు రాత్రులనుంచీ నిద్రలేదు." సంచి తెరిచి వారంట్లు బొత్తి పైకి తీసాడు. "యీపనికి ఒక వారంకూడా చాలిచావదు. కూర్చుంటే బాగుండిపోను."

సోఫామీద భారంగా కూర్చున్నాడు. అతని బరువు కు కమానులు కిరుకిరుమన్నాయి. పోలీసులు బొంత సవరిస్తున్నారు. న్యూరా తాపీగా పక్కమీదనుంచి తలగడాతీసి గబగబా ఆడించి సోఫామీద వేసింది.

"పడుకోండి, ఇనస్పెక్టరుగారూ! వాళ్ళ పనేమిటో వాళ్ళు చేస్తూంటారు."

"మంచి వుపకారమే చేసావు" అని ఇనస్పెక్టరు నవ్వాడు. "యిక్కడ పడుకుంటే మరేం ప్రమాదం లేదుగా!" సోఫామీద కాళ్ళుపెట్టుకుని కమానులమీద ఊగసాగాడు." బలేమెత్తగా వుంది.

యింతమెత్తగా వుంటుందని అనుకోలేదు." కుడిచేతి గుండీలు ఊడ తీసి సాఫీగా ఊపిరి పీల్చాడు. "నాకు కావల్సిందిదే"

సార్జెంటు కళ్ళు బిగపట్టుకుని ఇనస్పెక్టరు దగ్గరకు వెళ్ళాడు. ఇనస్పెక్టరు కోపంతో "యేమిటి?" అని గదమాయించాడు.

"సోదాపూర్తయింది, సార్!"

ఇనస్పెక్టరు కళ్ళు కుంచించాడు. సోఫామీదనుంచి లేవాలని లేదు.

"యింకా సోదా చేయండి."

పోలీసు సార్జెంటు బుజాలు ఎగరవేసి

"అంతా వెదికాం, సార్! యింకేమీ మిగల్లేదు. నిజానికి సోదా చేయాల్సిన అసరమేమీ లేదు. వున్నదంతా కళ్ళకి కనిపిస్తూనే వుంది. వీళ్ళు – ముష్టివాళ్ళు – అంతే."

ఇనస్పెక్టరు కడుపు పెద్ద కొండలాగా పైకి ఉబికింది. కళ్ళు గట్టిగా మూసుకున్నాడు.

"యింకా సోదా చేయమని చెప్పానుగాదూ, చేయండి"

సార్జెంటు ఎడమ పాదంమీద గిర్రున వెనుకకు తిరిగాడు. పోలీసు జవానులు, కాపలామనిషి గుమ్మంలో కదలకుండా గుంపుగా నిలబడ్డారు. సార్జెంటు కదలకుండా కొద్దిసేపు నిలబడి మళ్ళీ ఎడమ పాదంమీద తిరిగాడు.

"సిద్ధంగావున్నాం, సార్!"

ఇనస్పెక్టరు కళ్ళు తెరవకుండా పక్కలు గోక్కున్నాడు.

"యింకా సోదా కొనసాగించండి"

"సోదా చేయకుండా దిగవిడిచిందేమీ లేదు, సార్"

ఇనస్పెక్టరు కళ్ళు తెరిచాడు. కళ్ళు కోపంతో మండిపో తున్నాయి. "స్టోవ్‌లో చూసారా?"

స్టోవ్ ఇనస్పెక్టర్ వెనకవుంది. సోఫా పక్కన నిలబడ్డ ఒక పోలీసు తొందర తొందరగా సాధ్యమయినంతవరకు చప్పుడు కాకుండా ఆవిరి సొరంగం లోపలకు చేయిపెట్టాడు. న్యూరా పెదవులమీద మందహాసం నాట్యం చేసింది. పోలీసు చేయి బయటికి తీసుకున్నాడు.

మోచేతివరకు మసి అంటింది. రొప్పుతూ నాలుగు అంగల్లో ఇనస్పెక్టరూ పడుకున్న సోఫాదగ్గరకు వెళ్ళాడు.

"అందులో యేమీలేదు, సార్."

"వుండితీరాలి" అన్నాడు ఇనస్పెక్టరు ఒత్తి ఒత్తి పలుకుతూ "అలా మాకు తెలిసింది."

సార్జెంటు నిరాశతో చేతులు జోడించాడు. "ఉహుఁ-సాలె గూడుల దగ్గిరనుంచీ అన్నీ వెదికాం. నేలకూడా కొట్టిచూసాం. మాకు దొరికిందల్లా కాగితంముక్క."

"కాగితం ముక్క!" అంటూ ఇనస్పెక్టరు అదిరిపడ్డాడు.

"ఊఁ- నేను చెప్పలా! యేదీ, యిలాయియ్యి."

సార్జెంటు అతనికి కాగితంముక్క అందించాడు. "యిది-నేనూ రాసాను" అంది న్యూరా సిగ్గుతో మొహం చేతితో కప్పుకుంటూ.

"నువ్వు రాసిందా?" అంటూ ఇనస్పెక్టరు మోచేతిమీద లేచి బుస్సుమన్నాడు. "అలా అయితే నిన్ను లాక్కుపోవాల్సిందే. యేదీ, చదివిచూడనీ."

ఆ కాగితాన్ని కళ్ళదగ్గరగా పెట్టుకున్నాడు. దీపం దూరంగా ఉంది. అక్షరాలు పెద్దవిగా, దూరదూరంగా లేకపోతే చదవడం కష్టమయ్యేదే.

"ఆత్మశాంతి..." అంటూ ఇనస్పెక్టరు చదివాడు ఒక్కొక్క అక్షరం విడివిడిగా ఉచ్చరిస్తూ.

"యిది మా బంధువులకోసం రాసిన ప్రార్థన. ఫాదరీవాళ్ళ పేర్లు చదివి, పరలోకంలో వాళ్ళ పాపాలు తగ్గేటట్లు చేస్తాడు" అంటూ వివరించింది న్యూరా.

"నేనూ క్రైస్తవుణ్ణే, నాకూ తెలుసు" అంటూ ఇనస్పెక్టరు గుర్రుమని తిరిగి చదవనారంభించాడు. 'బానిసలు' దేవుడని యెందుకు రాయలేదు? యెవరిబానిసలు? నాకు తెలుసుకోవాలని వుంది. 'దేవుని బానిసలు' అని రాయాల్సింది"

"అవును దేవుని బానిసలే. అందుకే నేను వేరే రాయలేదు" అంది న్యూరా గబగబా! "అందరికీ తెలిసినవిషయం వేరే వ్రాయడ మెందుకు?"

"...బానిసలు: నికోలాయ్, అలెగ్జాండ్రా, మేరియా, టాట్యానా, ఓల్గా, మేరియా, అనస్టేసియా, అలెగ్జీ..."చదువుతున్న కొద్దీ కనుగుడ్లు గిరుక్కున తిరిగాయి....వీరిలాంటివారంతా"

సోఫాకమానులు కిర్రుమని మూలిగాయి. ఇనస్పెక్టరు లేచి కూర్చుని"

"యిదంతా యేమిటి చెప్పు. జారుగారి కుటుంబానికంతా గోరీ కడదామనా నీ వుద్దేశం?" అని అడిగాడు.

పోలీసులకు కుతూహలం మిన్నుముట్టి చుట్టూచేరారు. గోడకు అంటుకుపోయినట్లు నిలబడ్డ కానలా మనిషికూడా ఇవతలకు చక్కా వచ్చాడు. న్యూరా చేతులు కట్టుకుని:

"అబ్బే! దేవుడితోడు! అలా వుద్దేశించడం మహాపాపం కదూ!" అంది

చుట్టాలేం? యిదంతా యెవరిని వుద్దేశించో పెద్దగా ఆలోచించక్కర్లేదు. ముంజేతి కంకణంలావుంది. నికోలాయ్ - జార్‌గారు. అలెగ్జాండ్రా - రాణీగారు. మేరియా - రాణీగారి తల్లి టాట్యానా తదితరులు కూతుళ్ళు, అలెగ్జీ - యువరాజు... నువు క్రిస్టియనువికాదు. యువరాజుకి యింకా ముక్కుపచ్చలారలేదు, అపుడే ఆయన ఆత్మ శాంతికి ప్రార్థిస్తున్నావా?"

న్యూరాకూడా గొంతెత్తి

"నా నెత్తిమీద యింత అభాండం వేస్తున్నావా? ఆత్మశాంతి కొరకు... బతికుండగా ఆత్మశాంతి కోసరం ప్రార్థిస్తానా?" అంది.

"అవును. బతికేవున్నారు. స్పష్టంగా కనిపిస్తూనేవుంది." అన్నాడు ఇనస్పెక్టరు తీక్షణంగా." వారు మరణిస్తే ఆత్మశాంతికి ప్రార్థనలు చేయవలసిన అవసరంలేదు. ఊఁ - రాజు అక్కరలేకుండానే జీవిద్దామనా! యిది కఠినవరకానికి చీటీ యిప్పిస్తుంది. యిది రాజహత్యతో సమానమే."

చేయి ఎత్తాడు. న్యూరా ఏడవసాగింది. కన్నీళ్ళు కాలువలు కట్టాయి. కీచుమని ఏడ్చింది.

"యిలాంటి అబద్ధపునేరాలు నామీద తోయడం క్రూరం. నేను అట్టే చదువుకోలేదు. రాతలో యేదో కాస్త తప్పు దొర్లితే...?"

"సరే, సరే. అరవడం మానేయి. యేదో వేళాకోళానికిఅన్నాను. అంతే" ఇలా అని ఇనస్పెక్టరు కాగితం ఆమెకు ఇచ్చివేశాడు. "శీర్షిక కొట్టివేసి, దానిమీద 'ఆరోగ్యంకోసం...'అని రాయి.'

న్యూరా ఏడవడం మానివేసి మొహంయెత్తి ఇనస్పెక్టరుకేసి చూసింది. ఆమె కళ్ళు ఇంకా నీటితో నిండే ఉన్నాయి. భయంతో గులాబీరంగు నోరు తెరిచి, "దేవుడు నిన్ను చల్లగా చూచుగాక! వాళ్లు చచ్చిపోతే ఆరోగ్యంకోసం అని యెలా రాసేదీ!"

ఇనస్పెక్టరు మోకాలిమీద కొట్టుకుని,

"అబ్బ! చంపుకుని తింటున్నావు!" అని సోఫామీదిసంచి తీసుకుని అధికారి దర్జా ఒలికించాడు.

"నిజానికి నీమీదా కేసు పెట్టాల్సిందే. కాని సోదాలో యేమీ కనిపించలేదు కాబట్టి ప్రస్తుతానికి నిన్ను వదిలిపెట్టేస్తున్నాం. యింకా యింకా దర్యాప్తుచేస్తాం."

పోలీసులు వెంటరాగా బయటికి వెళ్ళిపోయాడు. న్యూరా తలుపు గడియవేసి కన్నీళ్ళు తుడుచుకుంది.

"తెలివితక్కువ వెధవలు!" అంది బిగ్గరగా. అయిదు, నాలుగు మూడు అంతస్తులనుంచి వెనుతిరిగి పోతున్న పోలీసుజట్టు అడుగుల చప్పుడు వినిపిస్తూనే ఉంది. "వీళ్ళు మనుషులనికాదు, యెలకలని వేటాడుతున్నట్లుంది."

అసహ్యించుకుంటూ రెండు వేళ్ళతో దిండు గలేబును పైకి లాగి ఒక మూలకు గిరాటువేస్తూ నిట్టూర్చి, అనుకుంది:

"మళ్ళీ రహదారిచీట్లు మార్చుకోవాల్సివస్తుంది".

# 12

## జాబితా

ఒక పోలీసు అధికారి బామన్ మేజాబల్లదగ్గర తొందర తొందరగా పెద్దపెద్ద అక్షరాలు వ్రాస్తున్నాడు. బిగుతు ఇజారు తొడుగుకుని కాళ్ళు నిర్లక్ష్యంగా చాచుకు కూర్చున్నాడు. గది అంతా చిందర వందరగా ఉంది. నిర్దాక్షిణ్యంగా గదిఅంతా సోదాచేసారు. నేలమీది కొయ్యచెక్కలు ఊడబెరికేసరికి పెద్దపెద్ద సొరంగాలు కనిపించాయి. నాడ్యా ఒక సోఫామీద కూర్చునిఉంది. సోఫా మెత్త పీలికలు పీలికలుగా వేలాడుతోంది. ఇదంతా పోలీసులపని. బామన్ ఖాళీజేబులలో చేతులు పెట్టుకున్నాడు. ఆ చివరిమూల పోలీసులు కొయ్యచెక్కలు ఊడబెరకడం చూస్తూ కూర్చుంది నాడ్యా. ఆమె చూపులో ముభావం, అలసట గోచరిస్తున్నాయి మేజాబల్లమీదా, పక్కనా కరపత్రాలు కట్టలు కట్టలుగా పడిఉన్నాయి సోదా పూర్తికావచ్చింది ఆ అధికారి ఇలా వ్రాసాడు :

"...పైన ప్రస్తావించిన నాడెజ్డా కాన్స్టాంటినోవ్నా కజ్మినా నివాసం సోదా చేయగా చాలా సోషల్ డెమాక్రాటిక్ సాహిత్యం, వ్రాత ప్రతులు- ప్రకటనల చిత్తు ప్రతులు, విప్లవాత్మక పుస్తకాలలో పొందుపరిచేందుకో, విడి కరపత్రాలుగా అచ్చువేసేందుకో ఉద్దేశించిన వ్యాసాలు- దొరికాయి."

కాగితాలు లెక్కపెడుతున్న పోలీసులకేసి ఆ అధికారి చూసి, "యెన్ని ?" అని ప్రశ్నించాడు.

లెక్కపెడుతున్న కరపత్రాలనుంచి దృష్టి అధికారిమీదకు మరల్చి ఒకనిర్దిష్టఅర్థం స్ఫురించేటట్టు అన్నాడు :

"వీటిలో చాలావాటిమీద ఆర్. యస్. డి. యల్. పి. కేంద్రకమిటీ ముద్ర వేసివుంది సార్ !"

"మంచిది" ఆ అధికారి సంతోషంతో ఉప్పొంగిపోయాడు. ఆ పుట వ్రాయడం పూర్తిచేసి,

"అందువల్ల మాకేమంత కష్టం వుండదు. యీసారి, థామస్, నీకు రాసిపెట్టివుంది" అన్నాడు.

వరండా తలుపు తెరుచుకుంది. అద్దపు బిళ్ళలు పటపట మన్నాయి. ఇంకో పోలీసు ప్రవేశించి,

"బండి సిద్ధంగావుంది" అన్నాడు.

ఆ అధికారి తల పంకించి "కప్పు పైకెత్తేవుందా ?"

"ఆఁ–" అని పోలీసు జవాబిచ్చాడు. రాజకీయ ఖయిదీలను ఇంకా ఎలా తీసుకువెళతారూ ? అని ఆశ్చర్యపోయాడు.

అధికారి దిగ్గున లేచి టోపీ కుచ్చుతాకి,

"మిసెస్ కుజ్మినా ! దయయుంచి..." మేజాబల్ల దగ్గర నిలబడ్డ ఒక కాపలా మనిషికి సంజ్ఞచేసి,

"ఝుకరోవ్, యీవిడవెంట వెళ్ళు" అని ఆజ్ఞాపించాడు.

"టాగాంకాకా ?"

ఆ అధికారి అసంతృప్తితో కనుబొమలు కదిలించాడు. ఏ జైలుకు తీసుకువెళ్ళేదీ ఖైదీలకు తెలియనీయరాదు.

"యేమిటీ ఝుకరోవ్ అనేది ? అనుభవశాలి అయిన రహస్య పోలీసుశాఖకు చెందినవాడు. అయినా..."

థామస్, నాడ్యాలు లేచి నిలబడ్డారు. ఒకరివద్ద ఒకరు శెలవు తీసుకోవడమా ? పోలీసుల ముందు కావలించుకోవడమా ?

ఊహుఁ – ఆమె ఆ ఇంటిలో ఒక భాగం అద్దెకు తీసుకుంది! ఇక అతనో కొత్తవాడు! ఒక గది మాత్రమే అద్దెకు పుచ్చుకున్నవాడు!

పోలీసులు చూస్తూ నిలబడ్డారు. థామస్ న్యాయాల ప్రతి కదలికను ఎనిమిది జతల కళ్ళు శత్రుభావంతో చూస్తున్నాయి.

ఇటువంటప్పుడు ఇక ఎన్నడూ కలుసుకోమని అంతా అనుకుంటారు. కాని థామస్, నాడ్యాలు ఆ విషయం ఆలోచించడం లేదు.

ఒక మాటకూడా మాట్లాడకుండా వారిద్దరూ కరచాలనం చేసుకున్నారు. ఒక ముక్కకూడా మాట్లాడుకోకపోయినా గట్టిగా కరచాలనం చేసుకోవడంలో అంతా చెప్పుకున్నట్లయింది.

తలుపు అద్దాలు మళ్ళీ పటపటమన్నాయి. పోలీసుల తట్టు ముళ్ళు గలగలలాడాయి. అధికారి ఆఖరిసారిగా గదిఅంతా కలియ జూచి మీసాల మెలిపెట్టాడు. ఇద్దరు పోలీసులు బామన్‌పక్కన అప్పుడే నిలబడి ఉన్నారు. బుజాలకు గట్టిగా కట్టుకున్న పట్టీలు వారి గుండెలమీద ఊగుతున్నాయి. పైబడడానికి సిద్ధంగా ఉన్నవారిలా భారంగా ఊపిరి పీల్చారు.

"బేడీలు" అన్నాడు అధికారి హఠాత్తుగా నిండుగొంతుతో.

బామన్ చేతి మణికట్లులకు ఉక్కుబేడీలు తగిలించారు. పొట్టి పొటి గొలుసు విదలించి, "అధికారిగారూ..."అన్నాడు బామన్.

"క్షమించు" అన్నాడు అధికారి అడ్డునచ్చి, ఠీవిగా తల ఒక వైపుకు వంచుతూ. "యిది చట్టవిరుద్ధమయిందే, నాకు తెలుసు. కాని ప్రభుత్వ అవసరాలకు వాటి చట్టాలు వాటి కున్నాయి. జైలుకు చేరుకో గానే బేడీలు తీసేస్తారులే. కాని దోవలోమాత్రం...యెన్నిమాట్లు తప్పించుకున్నారో చెప్పగలరా, మహాశయా!"

ఏదో సైగచేసాడు. పోలీసులు బయలుదేరారు. బామన్ బుద్ధిపూర్వకంగా కాళ్ళీడ్చుకుంటూ వారి మధ్య నడవసాగాడు. అధి కారి చెప్పేది వినడానికని గుమ్మంలో ఆగాడు.

ఆ అధికారి తెల్లటి అందమయిన చేతి తొడుగును ఊడ దీసు కుంటూ అంతిమ ఆజ్ఞను ఇస్తున్నాడు.

"వీధిలోని జనాన్నందర్నీ పట్టుకురండి. యీ గదిలోవిగాని, పై అంతస్తులోవిగాని దీపాలు ఆర్పకండి. వెనక దొడ్డిలోనూ, వేసవి గృహంలోనూ కాపలా మనుషులను పెట్టండి. ఒక్కొక్కచోట యిద్ద రిద్దరు, యెవరికీ కనిపించకుండా దాక్కోవాలి. వుదయాన్నే ఆహారం పంపేటట్టుచూస్తాను. కాపలా రోజుకు పైగావుండాలి. తరవాత పనికత్తె వస్తే - యిక్కడ పనికత్తె వున్నట్టు నమోదయివుంది - తక్షణమే అరెస్టుచేసి ప్రధాన కార్యాలయానికి తీసుకువెళ్ళండి. అవస్థపడాలి."

# 13

# తిరిగి అడకత్తెర ప్రత్యక్షం!

బామన్ నివసిస్తున్న వీధిమూల కొజుబా కోపంతో ఇరీనాని పిలిచి,

"తిరిగి వచ్చేసెయ్. వీధి నిర్మానుష్యంగావుంది. కాపలా తీసేసారా? ఆశ్చర్యంగావుంది. మనం ఆలస్యం చేసామా? వ్యవహారాలు క్లిష్టదశలో పడ్డట్టున్నాయి" అన్నాడు.

నిజం! వీధిలో ఒక్క పురుగయినా లేదు.

ఇరీనా తొందర తొందరగా రహస్యంగా (ఒకరి వెనకాల ఒకరు అపరిచయస్తులులాగా నడుస్తున్నారు) జవాబిచ్చింది.

"అవును. నేను బయలుదేరినపుడు వూపిరి పీల్చడానికి కూడా సందులేనంతమంది వున్నారు. యీ దుకాణం దగ్గిర వేచివుండు. నిమ్మరసం కొనుక్కుని తాగు. నేను ముందుగా నేలతనిఖీచేస్తాను."

"నువు చెప్పేదాంట్లో అర్థంలేదు. నేను వేసుకున్న దుస్తులు—కావాలంటే నువ్వే నిమ్మరసం కొనుక్కొని తాగు. నేను తొందరగా—"

"చెప్పినట్టు విను" అంది ఇరీనా గొంతెత్తి నిజంగా బాధపడుతూ. "రూక్‌ను పట్టుకున్నారా, యిక మన సంస్థను నడపగలిగేదెవరు? నాబోటివాళ్ళు లక్షమంది దొరుకుతారు. నే చేస్తున్న పని చేయడానికి వందలకొలది వున్నారు."

కొజుబా చేతులు చాపాడు కాని తేలికగా తప్పించుకుని దుకాణం దాటి పక్కమలుపులోని చెట్ల చీకటిలోకి మాయమయింది.

నాలుగు అడుగులు వేసిందో లేదో ఒక ఇంటిపక్కని బల్లమీద కూర్చుంది. ఆ బల్లమీదే యుక్రేనియన్ బుటేదారీచొక్కా తొడుక్కుని వెంట్రుకలతో నిండిన చేతిలో తాంబూర పట్టుకుని విచారు

గ్రస్తంగా ఒక వ్యక్తి ఒక పక్కకి ఒరిగి కూర్చుని ఉన్నాడు. ఆమె కేసి తిరిగిచూసి తాంబురా తీగల వెంటే వేళ్ళుపోనిచ్చాడు. మృదువుగా కరుణాపూరితంగా ధ్వని వెలువడింది. నాలుగు బగ్గీలు ఒకదాని వెనక ఒకటి వారిని దాటిపోయాయి. గుర్రాలు మెల్లగా కదను తొక్కుతుంటూ నడిచాయి. ఈ రహస్యశ్రేణి అర్థం ఒకటే! పోలీసులు ఖైదీలను ఈ విధంగానే రహస్యంగా తీసుకు వెడతారు.

ఆవ్యక్తి మీసాలమీద చేయివేసుకుని ఏదో అన్నాడు. కాని ఆమె వినుపించుకోలేదు. బగ్గీలు నిలకడలేని నీడలను ప్రసరిస్తూ వెళ్ళిపోయాయి. ఇరీనా లేచింది.

"క్షమించు. నీకు అడ్డువచ్చానేమో. సొమ్మసిలిపోయి కూర్చున్నాను. యిపుడు కాస్త సేదతీరింది. వెళ్ళగలను." ఆ వ్యక్తి కూడా లేచాడు.

"వెళ్ళడం దేనికి? పోనీ నీ వెంటవస్తాను."

ఇప్పుడు ఆమెమనసు ఆమె స్వాధీనంలోకి వచ్చింది. "వద్దు. కృతజ్ఞురాల్ని. నా – నాభర్త యిక్కడే నాకోసం వేచివున్నారు."

"నీభర్తా?"

అతను బల్లమీద మళ్ళీ విచారగ్రస్తంగా కూర్చున్నాడు. రోడ్డు అవతలవైపు బామన్ ఇంటివైపుగా ముందునడిచింది. ఆమె కణతలు ఈ క్రిందిమాటలతో టకి టకీమని కొట్టుకున్నాయి. "అతనిని తీసుకుపోయారు. తీసుకుపోయారు అవును, నిజం. తీసుకుపోయారు. ఆ నాలుగుబగ్గీలు! అవును,"

మిద్దెమీద, కింద బామన్ గదిలో దీపాలు వెలుగుతున్నాయి పచ్చగా మసకమసకగా ఉన్న నలుచదరపు గాజుపలకమీద కొయ్యతో చేసిన ఒక అడకత్తెర ఇరీనాకు కనిపించింది. అడకత్తెర ఒక కత్తిలా భయంకరంగా ఉంది.

కుటీరం దాటుతూ కళ్ళు గట్టిగా మూసుకుంది. కిటికీలో కనిపించిన అడకత్తెర ప్రమాదాన్ని సూచించేది. కుటీరంలోకి ప్రవేశించకూడదనే సంకేతం!

ప్రియమయిన, ప్రియమయిన మనుషులు! ఏదోవిధంగా అడకత్తెర కిటికీలో పెట్టారు. ఇక పోలీసులు కాచుకుని ఉండనీ, వారం రోజులవరకూ కాపలా కాయనీ, మరేం ఈ వలలో ఎవరూ పడరు. ఆఇంటి చిరునామా తెలిసినవారందరికీ అడకత్తెరసంగతి తెలుసు. రూక్‌కి ఆభయంకరమయిన కొయ్యమనిషంటే మహా ఇష్టం. లుక్యనోవ్కా-నుంచితప్పించుకున్న తరవాత అడకత్తెర తన్నెలా రక్షించిందో జామన్ స్నేహితుల కొక పర్యాయం చెప్పాడు. పోలీసుల సమీపంలోనే రెండువారాలున్నా ఆ అడకత్తెరమూలంగా తాను పట్టుబడలేదని తెలియజేసాడు.

ఇరీనా ఆ ఇంటికి కొంచెం అవతలవరకువెళ్ళి తిరిగివచ్చింది. బల్లమీదకూర్చున్నవ్యక్తి మెల్లగా మధురంగా ఏదో పాడుతున్నాడు. కొజుబా అంబలి తాగుతున్నాడు. చీకటిలోనించి ఇరీనా రావడం చూసీ చూడగానే అంబలి ఖరీదు ఇచ్చివేసి ఆమెను ముందుకు సాగిపోనిచ్చి వెనకాలే వెళ్ళి ప్రశాంతంగా గట్టిగా అన్నాడు ;

"తీసుకు వెళ్ళారు - చూసావుగా!"

"ఆఁ -" అంది ఇరీనా మెల్లగా. "కిటికీలో అడకత్తెర వుంది. అంటే తీసుకు వెళ్ళారనడంలో పొరపాటేంలేదు. రూక్ లేకపోతే మనమేం చేయగలుగుతాం, కొజుబా!"

"కష్టమే, అనుమానం లేదు." అని కొజుబా జవాబిచ్చాడు, ఆలోచనాపూర్వకంగా." అయినప్పటికీ యేదోవిధంగా కార్యకలాపం సాగిద్దాం."

# 14
# మరలా జైలు ప్రవేశం

ఈసారి పూర్వంకంటె ఎక్కువ హృదయభారంతో జైలులో బామన్ ప్రవేశించాడు. ఆ సమయంలో కార్యకలాపాన్నుంచి వేరు చేయబడడం కంటె బాధాకరమైన విషయం ఇంకొకటి ఉండదు. జైలు కార్యాలయంలో లాంఛనాలు జరుగుతూంటే, అతనిని తీసుకువెళ్ళిన పోలీసు వార్డరు అతనితో అన్నమాటలు ఆ బాధను మరింత తీవ్రంచేసాయి. ఆరాత్రే పదిహేను మందిని, 'లెనినిస్టు బృందం' – పోలీసులు పెట్టిన పేరు – అందరినీ ఆరెస్టుచేసారని తెలుసుకున్నాడు. అలా అయితే (అనుమానించడానికి కారణంకనిపించదు) కార్యకలాపమంతా స్తంభించి పోతుంది. మెన్షివిక్కుల వెధవ పనులకు కార్యరంగం విశాలమవుతుంది. ఇంకొక్క అడుగు వారు ముందుకు వేస్తేచాలు చట్టబద్ధంగా వ్యవహరించవచ్చు. ప్రభుత్వం ఇకముందు ఏమాత్రం జోక్యంచేసుకోదు. మెన్షివిక్కులు తమకు బాగా ఉపయోగపడతారనీ, శాశ్వతంగా లొంగ తీయడం కష్టంకాదనీ ఈపాటికే ప్రభుత్వం గుర్తించింది. మెన్షివిక్కులు విప్లవాన్ని విచ్ఛిన్నంచేస్తారు. ఇదివరలోలాగానే కార్మికుల రక్తం చిందించి బూర్జువా భానిసత్వానికి బలం చేకూరుస్తారు. ఈలోపున బామన్ వంటివారు జైలులో నానాఅవస్థలూ పడవలసిందే!

ఈతడవ జైలు నిజంగా జైలులాగానే ఉంది. కీవ్, వొరోనెజ్, యూఫాలోని జైళ్ళలాగాగాని, ప్రవాసానికి తీసుకు వెళ్ళేటపుడు ప్రతి మజిలీలోనూ అతనిని బంధించిన జైళ్ళలాగాగాని ఈ జైలు లేదు. ఈ జైలులో అందులోని ఖైదీలు చెప్పినట్టు 'శీలలు బాగా బిగించి ఉన్నాయి!' తప్పించుకు వెళ్ళే అవకాశం లేదనేభావం అతను కుంగి పోవడానికి కారణమై ఉండవచ్చు.

ఉహుఁ – అదికాదు. కుంగిపోయాడు కాబట్టే తప్పించుకోవాలనే ఆలోచన వచ్చింది. తప్పించుకోలేక పోవడమేమిటి?

నడవలగుండా, వసారాలగుండా వార్డర్లు ముందునుంచి ఆ భవంతి పై అంతస్తులకు తీసుకు పోబడినకొద్దీ బామన్ కాళ్ళకింద ఇనపనేల ప్రతిధ్వనించింది. వారు 'ప్రత్యేకపు కొట్టు'కు వెళుతున్నారు. లావుపాటి పుస్తకంలో అతనిపేరు ఎక్కిస్తూంటే 'ప్రత్యేకపుకొట్టు' అనేమాట వినిపించింది. అతనిని అప్పగించిన పోలీసు కాప్టెన్ చెవిలో "వీడి తాళం పట్టేస్తాడు, మరేం పరవాలేదు" అని చెపుతూ వార్డెన్ వికటంగా నవ్వడం జ్ఞాపకం వచ్చింది.

ఆ వార్డరు గడ్డం మాసింది. బుంగ బుగ్గలు, మురికిచొక్కా కాలరుమీదకు వేలాడుతున్నాయి. కాప్టెన్ చెవిలో అతను గుసగుసలు పోతున్నంతసేపూ కాప్టెన్ చిరునవ్వు అంతకంతకూ విశాలమైంది.

"దర్జాగా చేయడమంటే అలాగా!" అని కాప్టెన్ చివరకు వ్యాఖ్యానించాడు.

"తాళం పట్టేస్తాడు!" క్రూరమైన, అనుమానమైన మాటలు! అమానుషంగా చూస్తారని స్పష్టమైంది. కొట్టును కఠినంగా కాపలా కాస్తారా? ఉహుఁ– అనువాయితీ లేదే! అలా అయితే అంత రహస్యం చెప్పుకోవడమెందుకు? ముసిముసి నవ్వులు నవ్వుకోడ మెందుకు? ఇదేదో ఇంకా అర్ధాన్నమైనదై ఉంటుంది.

జైలులోకి అడుగు పెట్టగానే అతనిని సోదా చేసినపుడు టై తీసి వేయమని పట్టుబట్టారు. ఆశ్చర్యం వేసింది. ఏ జైలులోనూ జేబురుమాళ్ళు, టై తీసేయమనరు. కాని ఇక్కడ ఆ రెంటిని తీసేసుకున్నారు.

"ఎందుచేత?"

వార్డర్ కావేషంతో నవ్వాడు. మొఖం ముడతలుపడింది.

"హఠాత్తుగా నీకు ఉరేసుకుని చావాలని బుద్ధిపుడితే?"

వారు ఇంకో నడవలోకి వెళ్ళారు. ఆ నడవ పక్కన నిలబడి ఉన్న ఇంకో వార్డరుకు మొదటి వార్డరు బామన్‌ను అప్పగించాడు.

ఇద్దరూ కొద్దిసేపు గుసగుసలాడుకున్నారు. రెండవ వార్డరు కనుబొమలు ఆశ్చర్యంతో పైకి ఎగరడం బామన్ గమనించాడు.

"నలభైమూడా?"

బామన్‌తో కూడా వచ్చిన వార్డరు తలపంకించి చెవిలో మళ్ళీ ఏదో చెప్పాడు. కింద కచేరీగదిలో పొడగట్టిన అదే కావేషపు అస హ్యపు చిరునవ్వు ఆ ఇద్దరు వార్డర్ల మొహాలలోనూ గోచరించింది.

"అవును. యేదో అర్థాన్న మైందే" అనుకున్నాడు బామన్.

వార్డరు తాళంచెవులగుత్తిని గలగల లాడించి, ఒకటి ఏరితీసి దూరంగా ఉన్న గుమ్మంలోకి వెళ్ళాడు. పైన లోకప్పులో మినుకు మినుకు మంటున్న చిన్న దీపపు పచ్చని కాంతిలో బామన్‌కు ఒక చిన్న కొట్టు కనిపించింది. కొట్టు గోడలకు బూడిదరంగు పూసారు. మట్టినేల. లోపల ఒక మేజాబల్ల. ఒక స్టూలుబల్ల, ఉన్నాయి. దుప్పటితో సగం కప్పబడిన మొహం, మెరిసిపోయె రెండు నల్లటి కళ్ళు చిన్న మెత్తమీద కనిపించాయి.

# 15

## పిచ్చివాడు?

బామన్ ఒక అడుగు వెనుకకు వేసాడు. కాని వార్డరు అతని దోవను అడ్డగించి,

"రేపు యింకో మెత్తపడవేస్తాం. ప్రస్తుతానికి యెలాగో సర్దు కోవాలి..." అన్నాడు.

కొట్టు అంతా బామన్ చేతితో తడిమి చూసాడు. అది చాలా చిన్నకొట్టు. ఎక్కడనుంచి అయినాసరే రెండుగోడలను తాకవచ్చు.

"యింకోమెత్త! యిందులో ఒత్తిగిలడానికే జాగాలేదు!" కళ్ళు పైకెత్తకుండానే వార్డరు జవాబిచ్చాడు, చేతివేళ్ళు తాళంచేతుల గుత్తితో ఆడుకుంటున్నాయి.

"యేదోవిధంగా చూదాం. పగలు వాటిని బయడపడేస్తాలే."

ఇలాచెప్పి వార్డరు గుమ్మంలోనుంచే వెళ్ళిపోయాడు. తలుపు మూసి తాళంవేసాడు. మెత్తమీది మనిషి దుప్పటితీసి పారేసి లేచి కూర్చుని నేలమీద కాళ్ళు బారచాపాడు. అతనుధరించిన పంట్లాం మాసి చినిగిపోయి ఉంది.

వెంట్రుకలతో నిండిన పెద్ద పంజావంటి చేతినిజాపి, మోటుగా గర్వంతో తనుదానే పరిచయం చేసుకున్నాడు.

"నాపేరు బ్లాంక్వీ!"

ఆ ఫ్రెంచి విప్లవకారుని పేరు వినబడగానే బామన్ మొహం చిట్లించుకున్నాడు. రహస్యంగా రాజకీయ కార్యకలాపం జరిపే ఇతర విప్లవవాదులు, ముఖ్యంగా సోషలిస్టు విప్లవాదులు, మారుపేర్లుగా గొప్పగొప్ప పేర్లు పెట్టుకోవడం బామన్‌కి గిట్టదు.

పెట్టుకున్న మారుపేరు ఆ వ్యక్తి స్వభావాన్ని ప్రతిబింబింప జేస్తుంది. నిజమైన విప్లవవాది నిరాడంబరంగా ఉంటాడు. లెనిన్‌లాగానే సామాన్యమైన మారుపేరు పెట్టుకుంటాడు. లెనిన్! ఆ పేరు కంటె సామాన్యమైన మారుపేరు ఉంటుందా? విప్లవ ప్రపంచంలో అప్పటికే ఆపేరు మోగిపోయింది.

బామన్‌కు అతనంటే వెంటనే అసహ్యం పుట్టింది—ఆ వంటి మీద మురికి, గబ్బువాసన, జడలు కట్టిన జుట్టు! అసహ్యం పుట్టక పంచేస్తుంది! మారుపేరు అసహ్యతను ఇనుమడింపజేసింది. కాని బామన్ తోటిఖైదీని అవమానపర్చే రకం మనిషికాదు. అసహ్యతను కొంటె నవ్వులో మరుగుపర్చాడు.

"అదృష్టమంటే నాదే అదృష్టం! నేను మారట్, నెపోలియన్, జారిన్, బ్రూటస్, లాస్సలీ, ఒడిసియస్, అజాక్స్, అల్యోషా పోపో విచ్‌లను కలుసుకున్నాను!"

బ్లాంక్వీ దవడ ఆశ్చర్యంతో కిందకు దిగజారింది. అతని నోరు తక్కిన అవయవాలలాగానే పెద్దది, భయంకరమైంది. మూతిచుట్టూ కురుపుల మచ్చలు శాశ్వతంగా పడిపోయాయి. ఒక్క పన్నుకూడా లేదు.

"నీపేరేమిటి?"

"రహదారీచీటీ ప్రకారం నాపేరు సిడొరోవ్" అన్నాడు బామన్ చిరునవ్వు చిందుతూ. "యిక్కడికి యెందు కొచ్చావ్, కామ్రేడ్ !"

ఆ ముదుసలి బామన్‌ను సంశయంతో ఎగా దిగా చూసాడు. "నా పేరు బ్లాంక్వీ అని స్పష్టంగా చెప్పానుగా !"

"యెవరునువ్వు ?" అని బామన్ కఠినంగా అడిగాడు.

"నిన్నెరగనే!"

"నన్నెరగవా?" అని ఆ వృద్ధు కోపంతో అరిచాడు.

"మార్క్సు, ఏంజెల్సు నన్నెరుగుదురు. నువు యెరగవా ? అయితే చెప్తా విను. నేను 1805 లో పుట్టాను..."

ఆ మనిషి పిచ్చివాడు, సందేహంలేదు.

"...1827 లో వీధి పోరాటాలలో ముమ్మారు గాయపడ్డాను. యిప్పటికీ మచ్చలు మాసిపోలేదు."

చొక్కా తీసివేశాడు. బామన్ వణికిపోయాడు. ఆమనిషి, శరీరమంతటా చారలే! కొరడాదెబ్బలవల్ల పడ్డ ఆ వాతలకుతోడు కత్తితోచేసిన మూడులోతైన తెల్లటి గాయాలు కనిపించాయి.

"...1830 జులై కాస్త్రగడల బారికేడ్లు మీద పోరాడాను. 1839లో ఒక తిరుగుబాటు నడిపాను. అప్పటినుంచి ఒక కుట్ర తరవాత ఇంకోకుట్ర; యీ వరసన 1848లో జరిగిన ప్రసిద్ధమైన కాస్త్రగడ - కమ్యూన్‌వరకు పోరాడాను."

ఆ ముదుసలి దుబ్బుజుట్టుతలపైకెత్తి బామన్ మొహంకేసి గట్టిగా చూసాడు. బామన్ మెత్తపక్కని స్టూలుబల్లమీద కూర్చుని ఉన్నాడు. ఆ వృద్ధుని నేత్రాలలో ఒక పిచ్చికాంతి మెరిసింది.

"నాకేసి అలా చూస్తున్నావెందుకు? నామీద నమ్మకంలేదా?"

ఆ వ్యక్తి కొద్దిగాలేచి, ఉగ్రుడయిపోయి, బామన్‌మీద విరుచుకుపడి పొడుగ్గా బలంగా ఉన్న చేతులతో గట్టిగా పట్టుకున్నాడు.

"నువు హంతకుడివి అన్నమాట ! రహస్యంగా నిన్ను పంపారా ఓ-ఊహుఁ- నువు చంపవుకదూ ?"

బామన్ అతని చేతులు తోసివేయాలని తీవ్రంగా యత్నించాడు. కాని ఆ భారీ శరీరాన్నుంచి తప్పించుకోలేకపోయాడు. స్టూలు బల్లమీదనుంచి లేవడానికి వీలులేకపోయింది. కూర్చుని ఉండడంవల్ల తగుబలం లేకపోయింది. చుట్టచుట్టుకుని నేలమీద పడ్డాడు. భుజం, తలవెనకభాగం నేలకు తగిలి బాధకలిగింది. ఇక ఆ ముదుసలి సంతోషంతో తనలో తాను ఏవో అర్థంలేని మాటలు మాట్లాడుకుంటూ బామన్ మొహం చేతులు పట్టుకోవాలని శ్రమపడ్డాడు. కంతతలుపు క్లిక్కుమంది. వార్డరే, సందేహంలేదు.

వార్డరు లోపలికి వస్తాడని బామన్ ఆశించాడు.

ఏమాత్రం చప్పుడూ చేయకుండా వారిద్దరూ పెనుగులాడారు. రొప్పుతూ పీల్చే ఊపిరిమాత్రమే వినబడుతోంది. కంత తిరిగీ క్లిక్కుమంది. వార్డరు చక్కాబోయాడు.

హఠాత్తుగా ఆ ముదుసలి కండరాలు సడలినాయి. శరీరం బలహీనమై పోయింది. అలసిపోయింది. జావైపోయింది. బామన్ తేలికగానే తోసేసుకుని బయటపడ్డాడు.

భారంగా ఊపిరి పీలుస్తూ బామన్ మోకాళ్లమీద కూర్చున్నాడు.

ఆపిచ్చివాడు నోరు బార్లా తెరుచుకుని వెలికిలా పడ్డాడు.

"యిదిగో నామెడ! నీకత్తి యేదీ? చంపేసెయ్. నువే గెలిచావు, నువే గెలిచావు, నిను తగలెయ్య!"

అతను కళ్ళు అటూ ఇటూ తిప్పాడు. బామన్ మెల్లగా అతని బుజం తాకాడు.

"విను, తాతా! యేదో తమాషా జరిగిపోయింది. యిహ సర్దుకుందాం. మెత్తమీదకు దూకు. నేను నేలమీద పడుకుంటాను. యిక తమాషా గిమాషా పనికిరాదు. తెలిసిందా! నిద్రవేళయింది."

ఆ వృద్ధుని కనురెప్పలు నెమ్మదిగా తెరుచుకున్నాయి.

"తాతా!"

"ఊఁ- మరేమని పిలవాలి?" అంటూ బామన్ తల ఆడించి చేయిజాసాడు. "యికలే."

"తాతా?" అని తిరిగీ అన్నాడు ఆ వృద్ధు. "అబద్ధ మాడు తున్నావు! అబద్ధం కాకపోతే' యెదీ ముద్దు పెట్టుకో."

"ఉహుఁ—" అని నవ్వాడు బామన్. "ఉహుఁ— నీ ప్రాణం పోయినా సరే! ముందు క్షవరం చేసుకో. మొహం కడుక్కో. ఆ తర్వాత చూదాం."

బామన్ ఆ ముదుసలిని రెక్కపట్టుకుని లాగాడు. అతనూ అడ్డు చెప్పకుండా లేచి బామన్‌కేసి మొఖంపెట్టి, చేయి గట్టిగా పట్టు కుని పడుకున్నాడు.

# 16

## రాత్రి

భరింపరాని మత్తుతో గంటలకు గంటలు గడిచిపోయాయి. ఆముదుసలి బాగా కుదుటపడి చెక్కమీద ముడుచుకు పడుకుని నిద్రపోతున్నాడు. కాని బామన్ నిద్రపోకుండా అతనిపక్కనే కూర్చు న్నాడు. నిద్రపోతున్నా ఆ వృద్ధు బామన్ చేయి వదలలేదు.

అతనెవరు? పరీక్షగా చూసాడు. అతని మొహంమీది ముడు తలు ముసలితనంవల్ల పడినవికావనీ, నోరు బోసిదైనా వంకరపోయినా అతను యువకుడేననీ బామన్ గ్రహించాడు. ఆనోటివంపు పరిచిత మైనదేనని తోచింది. బామన్ ఇంకా దగ్గరకు వంగి బాగా జ్ఞాపకం చేసుకున్నాడు ఉహుఁ—ఇంతకుపూర్వం ఎన్నడూ అతనిని చూడలేదు.

బ్లాంక్వీ పక్కకు తిరిగి గురకపెట్టసాగాడు. అతని కాలు దుప్ప టిలో కదలాడుతోంది. తలుపు కంత చప్పుడు కాకుండా తెరుచుకుంది. మొత్త పక్కన, ముసలివాని చేతిలో తనచేయి, — ఈ దృశ్యం వార్డు చూస్తాడనేభావం అతనిని కలవరపెట్టింది. చేయి ముసలివాని చేతిలో నుంచి లాగుకుని లేచి నిలబడ్డాడు. కంత మూసుకుంది. బామన్ తిరిగి స్టూలు బల్లమీద కూర్చున్నాడు. ఏదో బాధ మెలమెల్లగా అతని

హృదయాన్ని చీల్చివేస్తోంది. జైలులోకి అడుగు పెట్టినపుడు కూడా ఇలాంటి అనుభూతే కలిగింది.

సూర్యోదయం కాబోతుంటే అతనికి నిద్ర పట్టింది. కాని ఎక్కువసేపు నిద్రపోలేదు. జైలులో ఏడుగంటలయేసరికి నిద్రలేచి తీరాలి. అవీ నిబంధనలు. కాని ఏడు గంటలు కాకముందే నడవలో చీపురుకట్టల చప్పుడుకు మెలకువ వచ్చింది. వళ్ళంతా నెప్పిపుట్టింది. మెడ బిగుసుకుపోయింది.

చేతులతో మెడ రుద్దుకుని నిశ్శబ్దంగా ఉదయ వ్యాయామం చేసాడు. ఆ తరవాత చిన్న మూటవిప్పి కూడా తెచ్చుకోనిచ్చిన వస్తువులు – సబ్బు, తువాలు, తేయాకు. . . . బల్లమీద పెట్టాడు. . . . మళ్ళీ నిన్నటి మనోవృత్తి తిరిగి వచ్చింది. హృదయం భారమైంది.

హఠాత్తుగా కిటికీగుండా బిగ్గరగా సుళ్ళు తిరుగుతూనినాదం వినిపించింది. ఆ కిటికీకి అద్దాలు లేవుగాని చువ్వలుఉన్నాయి.

"నిరంకుశత్వం నశించుగాక !"

బామన్ శ్రద్ధగా విని అదిరిపడ్డాడు. దూరాన్నుంచి వచ్చిన ఆ నినాదాన్ని ఇంకొకడు అందుకున్నాడు. దగ్గరగా "నిరంకుశత్వం నశించుగాక !" అని వినిపించింది.

ఇంకొకడు, ఇంకొకడు ఇలా ఒకరి తరవాత ఒకరు ఆ నినాదం అందుకున్నారు. ఆ నినాదం దగ్గరగా, ఇంకా దగ్గరగా వినవచ్చింది.

"నిరంకుశత్వం నశించుగాక !"

ఆ ముదుసలికి మెలకువ వచ్చింది. తల పంకించి, లేచాడు. దుప్పటి నేలమీద పడింది. ఒక కాలు బల్లమీద, ఇంకో కాలు మెత్త మీదవేసి కిటికీలోకి ఎక్కి సంతోషంతో బొంగురు గొంతుతో కిటికీలో నుంచి కేకపెట్టాడు.

"నిరంకుశత్వం నశించుగాక !"

"జైలు జైలు శుభాకాంక్షలు తెలుపుతోంది" అని విశదీకరించాడు. దిగి వచ్చి వీపు గోకుకుంటూ. "యిక్కడి ఆచారం యిది. తరవాత హాజరు పట్టీ—మన హాజరు పట్టీ. అధికారులు హాజరు వేసుకో

పడం ఆ తరవాత. కాని హాజరు పట్టీకి యిపుడే ఒక నిమిషంలో కేక వేస్తారు, విను.''

హాజరు పట్టీ పిలిచిన ఆ గొంతే దూరాన్నుంచి అధికార స్వరంలో కేక పెట్టింది.

''కొత్తవాళ్ళు! కిటికీ దగ్గిరికి రండి!''

బామన్ లేచి కిటికీ చువ్వలు గట్టిగా పట్టుకున్నాడు. అతనికి ముందు జైలు ఆవరణ, దూరాన ఇంకో భవంతి, ఇంకా ముందు చువ్వలకిటికీలు, ఆ కిటికీలు కొన్నిటిలో ఖయిదీలు కనిపించారు. స్త్రీలు. నాడ్యా! ఆమెను గుర్తుపట్టాననే తలచాడు. ఆమె చేయి ఊపింది. ఆమె నాడ్యాయే. అతనిని చూసింది.

చేయి బయటికి చాపి, ఊపాడు.

గుమ్మంలోనుంచి కోపంతో అరుపువినిపించేసరికి వెనకకు తిరిగాడు. తలుపు బార్లా తెరిచిఉంది. వార్డరుకు ఇంకా నిద్రమత్తు వదల లేదు. తల దువ్వుకోలేదు. మొహం పాలిపోయిఉంది. కోపంతో గడ్డం తాళంచేతులు ఆడించి,

''నీకు దెబ్బలు తినాలని ముచ్చటగావుందా? చదువుకున్నవాడివి, అయితేనేం నిబంధనలు పాటించలేవు'' అన్నాడు.

''నోరుముయ్, తెలివితక్కువ మొద్దా!'' అని బిగ్గరగా అరిచాడు బ్లాంకీ, ''పిలవందే రావద్దని యెన్నిసార్లు చెప్పాను నేను!''

లేచాడు. మనిషి మహాభయంకరంగా కనిపించాడు. గబగబా తలుపు మూసివేసి వార్డరు వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ,

''అంత అహంకారం పనికిరాదు, షూయిస్కీ! చిక్కుల్లో పడకుండా వుండాలంటే...'' అని నడవలోనుంచి బుస్సుమన్నాడు.

షూయిస్కీ!

బామన్ కిటికీ చువ్వలు వదిలివేసి కిందకి దూకాడు, వెంటనే జ్ఞాపకం వచ్చింది.

1898–సెయింట్‌పీటర్స్‌బర్గ్, పీటర్–పాల్ కోట, లెఫ్టినెంట్ షూయిస్కీ. దురదృష్టవంతుడు, తిరుగుబాటుదారు, కవి!

# 17

# మరో ప్రపంచం నుంచి

1898లో బామన్ పీటర్, పాల్ కోటలో-నిర్బంధింప బడినపుడు అతనితోటి ఖైదీ లెఫ్టినెంటు ష్యూయిస్కీ. సేనాధికారి. సైన్యంలో తిరుగుబాటు లేవదీసినందుకు అతనిని అరెస్టు చేసారు. పక్క పక్క కొట్లలోనే ఉన్నారు. గోడమీద కొట్టుతూ పరస్పరం సందేశాలు అందజేసుకున్నారు. జైలు ఆవరణలో వ్యాయామ సమయంలో ఒకరితో ఒకరు మాట్లాడు కున్నారుకూడా. ఇద్దరినీ ఒకసారే వ్యాయామానికి తీసుకు వెళ్ళేవారు.

ఆ కోటలో నిర్బంధంలో బామన్ రెండో సంవత్సరం గడుపు తున్నాడు విచారణ చేయకుండానే అతనిని ప్రవాసం పంపుతారని అక్కడివాళ్ళందరికీ తెలుసు. అందుకని బామన్ ఏమిచేసినా ఊరుకునేవారు. వ్యాయామసమయంలో అందరితోనూ మాట్లాడనిచ్చేవారు. ఆ లెఫ్టినెంటుకు రాజకీయానుభవం లేదు. వట్టి తిరుగుబాటుదారు. పైగా భావనా ప్రపంచ విహారి. సాహస కృత్యాలను అన్వేషించే ఇటువంటివారు దివాళాతీసిన జమీందారీ వర్గంలో కనిపిస్తారు. ఈ వర్గంవారు తమ వంశవృక్షాలు, గౌరవబిరుదులు, కత్తులుకటార్లు చూసుకుని మురిసిపోతూంటారు. అతని భావనా ప్రపంచవిహారం కవితా రూపం దాల్చింది. ఆ కవిత్వమైనా వట్టిచెత్త కవిత్వం. వ్యాయామ సమయాలలో అతను తన కవిత్వం చదివి వినిపించేవాడు. వార్డర్లు అభ్యంతరపెట్టేవారు గాదు.

అతడే ఇతడా? ఇది సంభవమేనా?

కళ్ళు అపరిచితుని కళ్ళులాగా ఉన్నాయి. బామన్ ఎన్నడూ వాటిని చూడలేదు. అతను ఎరిగిన లెఫ్టెనెంటుకళ్ళ పోలిక ఎక్కడా కనిపించలేదు. మతిచెడినా గుర్తుపట్టలేనంతగా ఇతనిమాదిరిగా ఎవరూ మారిపోరే, అని బామన్ తనలో తాను వితర్కించుకున్నాడు. తనసంగతే చూసుకుంటే, ఇన్ని సంవత్సరాలలోనూ మార్పేమీ లేదే! ఈ బ్లాంక్కీకి పూర్తిగా మతిచెడలేదు. అతనిని గుర్తుపట్టవలసిందే. బామన్ తయారుచేసి ఇచ్చిన టీని కులాసాగా తాగుతున్నాడు. సవ్యంగానే ప్రవర్తిస్తున్నాడు. అతని కళ్ళల్లో ఉన్మాదకాంతిగాని మాంద్య ఉదాసీనతలుగానీ లేవు. జైలు జీవితాన్ని గురించి మహా తెలివిగా విస్పష్టంగా వర్ణించి చెప్పాడు. వేడినీళ్ళు ఎపుడు తెచ్చి ఇచ్చేది, వ్యాయామానికి ఖైదీలను బయటకు ఎపుడు తీసుకువెళ్ళేది, ఇతరజైళ్ళల్లోకంటే ఈజైలులో భోజనం – రోజూ పందిమాంసంతో అంబలి – ఎక్కువ రుచికరంగా ఉండేది తూచ తప్పకుండా చెప్పాడు.

"పుస్తకాలు వుంచుకోనిస్తారా?"

"బైబిలు, కథల పుస్తకాలు వుంచుకోనిస్తారు. సరిగా చెప్పాలంటే బైబిలు, తదితర కథల పుస్తకాలు, ఉదాహరణకు, హాఫ్ కథలు – మృతహస్తం, ఓడస్తంభానికి శిలువవేసిన కాప్టెన్, మేకు సూటిగా అతని తలలోగుండా కొట్టడం – ఈ కథ చదివావా? వట్టిచెత్త!"

అతని కళ్ళు కాంతి విహీనం కాసాగాయి. చేతులు రుద్దుకున్నాడు.

"నాకు పద్యాలంటే యిష్టం." అన్నాడు బామన్ ఆ ముదుసలిని కనిపెట్టి చూస్తూ. అతని నుదుటి రేఖలు, ముక్కు, గడ్డం చిరపరిచితమైనవే. "నాకు పద్యాలంటే మహాయిష్టం."

ఆవృద్ధుని కళ్ళు ఒక నిమిషంపాటు ధగేలుమని మెరిశాయి. ఆవెలుగు ఒక నిమిషం మెరిసి మాయమైంది. బామన్ గట్టిగా ఆలోచించాడు. పీటర్– పాల్ కోటలో అతను ఎరిగిన లెఫ్టినెంటు కవిత్వం ఏమాత్రం బాగుండదు. చెత్త కవిత్వం. జ్ఞాపకం ఉండదు. కవిత్వానికి

అదే గీటురాయి. మంచి కవిత్వం వెంటనే మనసులో నాటుకుపోతుంది. బాగా అవస్థపడగా కొన్ని పాదాలు జ్ఞాపకం వచ్చాయి.

దక్షిణాదసీమనుంచి - ఉత్తరాది సంద్రాలకు
పలుజాతులు దండుపోయె - కన్నకలలు నిజములాయె
వెనుదిరుగు ఎరుగని పరంగు - విజయ పతాకాలు నాటె
పొంగే కెరటాల మీద - పోటెత్తే కడలి మీద !

అంతటితో ఆగి ప్రతీక్షించాడు. ఆ పిచ్చివాడు రెప్పలార్చ కుండా బామన్‌కేసి తేరిపారజూసాడు. బామన్ ఏమీ మాట్లాడకుండా మృదువుగా నవ్వి ఊరుకున్నాడు. పిచ్చివాడుకూడా మందహాసం చేసాడు. వంకరపోయిన నోటిలోనుంచి మృదువుగా ఈకింది పాట వెలువడింది:

ఏనాటి స్వప్నాలో - చివురించె నీనాడు
ఎన్నేళ్ళుగా వేచి - ఉన్నాడో పనివాడు
వాని యాశలు స్వేచ్ఛ - ప్రేమ కామన పండి
చేతి కొచ్చేపండు - ఏ తెంచు నెల్లుండి !

అతను చేయిజాపి బహుమెత్తగా, "బామన్" అన్నాడు.

బామన్ వెనుదిరిగి గుమ్మంకేసి చూసాడు. కంత మూసిఉంది. ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు. అతను షూయిస్కీయే. నిజం. పీటర్, పాల్‌కోటలో నిర్బంధింపబడిన లెఫ్టినెంటు. అతని వేళ్ళు, పెదవులు వణికాయి. కనుబొమలు అదేపనిగా కదిలాయి. కాని ఉద్రేకంతో నత్తుత్తూ ఈకింది మాటలు చెప్పినపుడు ఉన్మాదఛాయలు కనిపించలేదు.

"నిజం చెప్పాలంటే మనం పోట్లాడుకుంటూండగానే నిన్ను గుర్తుపట్టేసాను. కాని యిక్కడ బహుజాగరూకతతో వుండాలి. గుట్టు మట్టులు లాగడానికి యే నిమిషాన యెవరిని పంపుతారో తెలియదు. నిజం, యిక్కడికి పంపినవాళ్ళలో ఆఖరివాడిని చితకతన్ని పంపించాను."

బామన్ మొహం చిట్లించాడు.

"వేళాకోళానికి చెపుతున్నావనుకుంటా."

"ఊహూం—" అని షూయిస్కీ నవ్వాడు. "వాడి చెయ్యి, ముక్కు విరగగొట్టిపారేసాను. నాకు పూర్తిగా సంతోషమైంది. నేను యిక్కడికి వచ్చినప్పటినుంచీ వాళ్ళు బంటుల్ని పంపుతున్నారు. నేను నిజంగా పిచ్చివాడినో లేకపోతే పిచ్చివాడిలాగా నటిస్తున్నానో నిర్ధారణ చేసుకోవాలని యత్నిస్తున్నారు. మొట్టమొదట నేను వాళ్ళని వేళాకోళం చేస్తూండేవాడిని. తరవాత తరవాత చితకతన్నడం ప్రారంభించాను. యేదోవిధంగా ఆట కట్టించాలిగా. ఆఖరివాడికి బాగా గుణపాఠం నేర్పి యీ తడవ యెవరినన్నా పంపితే వాడి అంతు కనుక్కుంటాను, చంపిపారేస్తాను అని హెచ్చరించాను."

కచేరీలో ముసిముసి నవ్వులు బామన్‌కు జ్ఞాపకం వచ్చాయి. "తాళం పట్టిస్తాడు!"

"నువ్వు లోపలికి రాగానే గుర్తుపట్టలేకపోయాను. నిద్రపోతున్నాను. వెనక నిన్ను చూసినపుడు నీకు గడ్డం వుండేది. యిపుడు లేదు. మార్పు పెద్దగా కనిపిస్తోంది. గొంతు పట్టుకుందామని చేతులు చాచినపుడు నిన్ను గుర్తుపట్టాను. నేను పిచ్చివాడిని, తెలుసా?" పక్కన అనాహ్లాదంగా, బొంగురుగా నవ్వాడు "పిచ్చి యెత్తించడానికి అనేకం వున్నాయి. నాకేగనక పిచ్చి యెత్తకపోతే యెన్నడో నన్ను వురివేసేసేవాళ్ళు తాడుచివర వూగుతూ చావడం నాకిష్టంలేదు. యింకా బతికేవుంటాను. నీ గొంతు పట్టుకోవాలని యత్నిస్తూంటే నీ కళ్ళు చూసాను. బామన్ యేమో? అని నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. నీ కళ్ళు నిన్ను యిట్టే పట్టిస్తాయి. పొరపాటుపడడం అంటూ జరగదు."

బామన్ బాగా కళ్ళు విప్పి ఊహిమిచూసాడు

"గత కొద్ది సంవత్సరాలలో నేను పోలీసు యేజంటుగా మారిపోయాననుకో. నువ్వు పిచ్చివాడిలా నటిస్తున్నావని చెబితే?"

షూయిస్కీ తలపంకించాడు.

"మొదటివిషయం: నన్ను నేను బయట పెట్టుకున్నట్లే నీకళ్ళు నీ గుట్టు బయట పెట్టేసేవి. మానవుల కళ్ళు విచిత్రమైనవి! ఒక్క చూపు, అంతా విస్పష్టమైపోతుంది."

"రెండో విషయం మరిచేపోయావు" అంటూ బామన్ మోటుగా అడ్డువచ్చాడు.

"రెండో విషయం ?" అన్నాడు షూయిస్కీ. ఒక నిమిషం పాటు అతని మొహంలో విచారం పక్కుమంది. "యేమిటి చెప్ప బోతున్నాను, ఆఁ-అవును. మనం కొట్లాడుకుంటూంటే వార్డరు కంతలోనుంచి తొంగిచూసాడు నువ్వు కనిపెట్టే వుంటావు. నువేగనక వాళ్ళల్లో ఒకడి వయితే నిన్ను రక్షించడానికి వచ్చేవాడే. లోపలికి రాకుండా వెళ్ళిపోయాడు. సంగతి తెలిసిపోయింది. కొట్లాడడం ఆపేసాను."

అవును, సరిగ్గా అలాగే జరిగింది.

"యింకో విషయం?" అన్నాడు షూయిస్కీ మొహం తుడుచు కుంటూ. "నువు యేమన్నా నామీద చెప్పితే పరీక్షా కాలం యిం కొంచెం పొడిగిస్తారు. అంతే. వైద్య అధ్యాపకులు, ప్రవీణులు నా పిచ్చి కుదరదని చెప్పేసారు. అధ్యాపకులు పట్టి మొండివాళ్ళు. శాస్త్రం కోసం నిలబడతారు. నిజంకూడా అంతే. వారి నిర్ణయాలని రహస్య పోలీసుశాఖలోని ప్రతిదద్దమ్మా సవాలు చేసేటట్టయితే వాళ్ళకిబోలెడు డబ్బు యివ్వడం యెందుకు? ప్రవీణుల సంఘం ఒకసారిగనక వ్రాసిపారేసిందంటే యిక నేనేం చేసినా పిచ్చివాడిననే రుజువు పరు స్తూంటుంది."

షూయిస్కీ ఆ పరీక్షలో నెగ్గాడు. ఇపుడు బామన్ అతనిని సంబోధించ సాగాడు.

"నేను పీటర్, పాల్ కోటలో నుంచి వెళ్ళిపోయిం తరవాత యేంజరిగింది? నిన్ను విచారించారా?"

ఆ ముదుసలి తల పంకించాడు.

"కఠిన నరకం విధించారా?"

షూయిస్కీ తిరిగీ తల పంకించాడు.

"శిక్ష యెక్కడ అనుభవించావు?"

"ఓరెల్ సెంట్రల్‌లో."

"అది నేరస్తులను వుంచే తావుకదా ?"

షూయిస్కీ తల ఆడించాడు.

"అది కఠిన వరకం విధించిన నేరస్తులను వుంచే తావే. నిజం కాని రాజకీయ ఖైదీలనుకూడా, యేకాంత నిర్బంధంలో వుంచదలచిన వాళ్ళని, పంపుతూంటారు. దుంపనాశనం చేయాలని అధికారులు నిర్ణయించిన వాళ్ళనే ననుకో. ఓరెల్ సెంట్రల్ మృత్యుశిబిరం. అక్కడ నెలలకొద్దీ తీసుకు తీసుకు చస్తారు. చిన్నచిన్న స్టేషనులలోకూడా ఆగే సామాను రైలుబండిలాగా మృత్యువు నెమ్మదిగా దొర్లుకు పోతుంటుంది." యీ ఉపమానం అతని కెంతో ఇష్టమైనదై ఉంటుంది. గుటకవేసి, "అదంతా వినాలనివుందా?" అని అడిగాడు.

బామన్ అతనిని పరీక్షగాచూసి,

"వినకుండావుంటేనే మంచిది. వృథాగా శ్రమపడడమెందుకు?" అన్నాడు.

"వృథాగానా?" అని షూయిస్కీ నవ్వాడు. "బహుశా నిన్నూ అక్కడికే పంపుతారు. నీ కళ్ళులాంటి కళ్ళుగల వాళ్ళని మృత్యువాత తోయడమే వాళ్ళకి కావలసింది."

# 18

# ఓరెల్ సెంట్రల్

గబగబా చురుకుగా అడుగులు వేసుకుంటూ కొట్లో పచార్లు చేస్తూ షూయిస్కీ తన కథ ఇలా చెప్పసాగాడు:

"సరే. ఓరెల్ సెంట్రల్ - అక్కడికి చేరుకున్న దగ్గరనుంచి ప్రారంభిస్తాను. మజిలీలు చేసుకుంటూ వెళ్ళాలిగదా. కూడా బేడీలు తగిలించిన నేరస్తులు. నున్నగా గొరిగిన బుర్రలు. దొంగల పరిభాషలో మాటలు. బహుశా నువ్వూ నేరస్తులతోబాటు ఆ మజిలీలు దాటే వుంటావు గాబట్టి వివరాలలోకి వెళ్ళను. జైలులోకి అడుగు పెట్టీపెట్ట గానే, కచేరీలోకి తొంగిచూడకుండానే సరాసరి స్నానాలగదిలోకి తీసుకు

పోతారు. ముందు గదిలో ఒక మేజాబల్ల, దాని ముందు పేర్ల జాబితా పట్టుకుని గవర్నరు. ఆ మేజాబల్లకు, స్నానాలగది గుమ్మానికీ మధ్య రెండు వరుసలలో ఎదురు బదురుగా అరవయి మంది దాకా వార్డర్లు నడవ ఆకారంగా నిలబడతారు. అక్షరక్రమం ప్రకారం వచ్చిన వాళ్ళని పేరుపెట్టి పిలుస్తారు. సరే. అపుడు దుస్తులు బేడీ పటకాలతో సహా తీసివేయాలి. బేడీపటకాలంటే తెలుసా? బేడీలు కాళ్ళను కోసేయకుండా వాటి కిందపెట్టే తోలుపటకాలు! అవి పెడితే బాగా బిగుతుగా వుంటాయిగాని గాయాలుకావు.

"సరే బేడీపటకాలు తీసేస్తాం. బేడీలతో నగ్నంగా బల్లదగ్గిరికి వెళతాం. యెవరూ యేమీ అనరు. జాబితాలో గవర్నరు గుర్తుపెట్టి యిలా ఆదేశిస్తాడు: 'తీసుకుపొండి!' యిలా ఆదేశించగానే తీసుకువచ్చి అప్పగించే వార్డరు ఒక్క పోటుపొడుస్తాడు. దానితో వెళ్ళి వార్డర్ల మధ్య పడతాం. 'స్నానాల గదిలోకి పద!' యిక వార్డర్ల వరసల మధ్యనుంచి వెళ్ళాలి. ఒక్కొక్క వార్డరుదగ్గరా ఒక్కొక్క రకమైన 'ఆయుధం' వుంటుంది: కొరడాలు, కర్రలు, తాళాలు, యెది చేతిలో వుంటే దాన్నే ప్రయోగిస్తారు. కాని వారిలో చాలామంది పిడికిళ్ళు వుపయోగిస్తారు. వాళ్ళ పిడికిళ్ళు విశిష్టమైనవని తరవాత, తరవాత గుర్తించాను సగందూరం వెళ్ళి పడిపోయాను. మళ్ళీ స్మృతి వచ్చేసరికి స్నానాలగదిలో నేలమీద పడి వున్నాను. నామీద యెవరో నీళ్ళు పోస్తున్నారు. 'అమ్మయ్య బతికిపోయాను' అని మొదటగా అనుకున్నాను. యీ ముక్క నామనసులో తళుక్కుమందో లేదో ఒక వ్యక్తి నామీదకు వంగి 'స్పృహ వచ్చిందా?' అన్నాడు. మరుక్షణంలో కొయ్యముంత తుత్తునాగపు అంచు నాపళ్ళకు టపీమని తగిలింది. నాకు మళ్ళీ స్పృహ తప్పింది. తిరిగీ స్పృహ వచ్చేసరికి మళ్ళీ చన్నీళ్ళు నామీద పోస్తున్నారు. మళ్ళీ కొడతారని కళ్ళు తెరవలేదు. కాని నాకనురెప్ప వెంట్రుకలు, వాటిదుంప తెగ, అల్లలలాడి నన్ను పట్టిచ్చాయి. యెవరో నా కడుపుమీద బూటుకాలుతో తన్నారు, "దొంగవేషం వేస్తున్నావా?"

షూయిస్కీ కళ్ళు మూసుకుని రొప్పుతూ మెత్తమీద కూర్చు న్నాడు. అన్నమాటప్రకారం వార్డరు మెత్తను తీసివేయలేదు. బామన్ మృదువుగా అతని బుజంతాకి,

"యిక చెప్పద్దు. అదంతా యిపుడు తవ్వుకొని లాభమేమిటి ? అయిపోయిందేమిటో అయిపోయింది. యింకేవిషయమైనా మాట్లాడు కుందాం" అన్నాడు.

"ఉహుఁ–" అని మొండిగా అన్నాడు షూయిస్కీ. "అదే మాట్లాడుకుందాం. మాట్లాడుకోవాలి కూడా. యింటిపై కెక్కి కేకలు వేసి మరీ చెప్పాలి. నేనొకడినే కాదు, అక్కడ పదిహేనువందలమంది నేరస్థు లున్నారు. యీ సెంట్రల్ ద్వారానే వేలకువేలు మృత్యుముఖం చేరుకుంటున్నారు. భయంకరమైన దారివెంట పోతారు. దీనితో పోల్చదగిన భయంకర గాధలేదు. హాఫ్‌కథ చెప్పాగా–మృతహస్తం, తలలోగుండా మేకు ! అది దీనిముందు బలాదూరు! జారు ప్రభుత్వం నెలకొల్పిన నేరస్థుల నివాసంలో జరిగేవాటితో పోలిస్తే ఇది యెందుకూ పనికిరాదు. యిపుడు కలకాలం అందరికీ తెలియడం కోసం దానిని గురించి బిగ్గరగా అరిచి చెప్పాలి. జారు ప్రభుత్వం నేరస్థులకు నెల కొల్పిన నివాసం యెటువంటిదో తెలియజేయాలి. స్నానాలగదిలోకి వెళ్ళేటపుడు మంచి బలంగా, ఆరోగ్యంగా వుండే యువకుడు మొదటి సారి స్నానం కాగానే వళ్ళువిరిగి, బలం వుడిగి, నెత్తురు కక్కుకుంటూ బయటికి వస్తాడు. సంవత్సరం అయేసరికి. ఆస్థిపంజరంలాగా, కీనీడలాగా, భూతంలాగా తయారవుతాడు. గోడకు ఆనుకొనిగాని నడవలేడు. అరెస్టు కాకముందు నేను గుర్రపు లాడాలను వంచేయగలిగేవాడిని. యినప వూచను ముడివేసేవాడిని–యిక యిపుడు, నావంక చూడు !"

చొక్కా తెరిచి చూపాడు. బామన్‌కి తిరిగీ తెల్లని వెంట్రుకలతో, వాతలతో దించుకుపోయిన ఎదుర్రొమ్ము కనిపించింది. ఆ దృశ్యం భయానకంగా ఉంది.

"స్నానాల గదిలో పక్క యెముకలు రెండు విరగగొట్టారు" అన్నాడు ప్రశాంతంగా మాట్లాడుతూ. "కాని అది మొదటిమెట్టు.

ఓరెల్ సెంట్రల్‌లో తమాషా యేమంటే, నువు యేం చేసినా చేయక పోయినా ప్రతిరోజూ దెబ్బలు తప్పవు. తప్పించుకునే మార్గంలేదు.''

అతని చేయి కడుపుమీదికి జారింది. ఒక వేలు అతని మట్లాగు గుండీకి తగిలింది. షూయిస్కీ తలవంచి శ్రద్ధగా దాని కేసి చూసాడు.

"వుదాహరణకు, యిదిగో గుండీ. సెంట్రల్‌లో ఖైదీలను ప్రతి రోజూ పరీక్షిస్తారు. పూర్తిగా పరీక్షచేస్తారు. దుస్తులన్నీ తీసివేసి నగ్నంగా నిలబెడతారు. చూడు, యేమిటి చెపుతున్నాను? ఆ (– అవును. గుండీ. గవర్నరు చూస్తాడు. ఆ తరవాత..."

అతను లేచి పాదాలు ఎడంగా పెట్టి, ఎద్దులాగా తల ముందుకు వంచి, విచిత్రమైన, బొంగురు గొంతుకతో దడాలున ఇలా గుర్రు మన్నాడు:

'నీ పంట్లాంకు రెండు గుండీ బెజ్జాలుంటే ఒకదానికే గుండీ వుందేం! అదేంపనికిరాదు."

"మొదటిదెబ్బ అతనే కొడతాడు. అది వూరికే సంజ్ఞ చేయడమే. యిక వార్డర్లు పూర్తి చేస్తారు.

"ఆ మర్నాడు రెండో గుండీ కుట్టుకు వెళతాం. పట్లాంకి రెండు గుండీ బెజ్జాలున్నమాట వాస్తవమే. మళ్ళీ పరీక్ష!''

'రెండు గుండీలెందుకు? షోకు తక్కువయిందీ? ఒక గుండీ నీ మొహానికి చాలదూ? ప్రభుత్వ సొమ్ము దుబారా చేస్తున్నావు.'

"మళ్ళీ వార్డర్లు వచ్చి వళ్ళుహూనం హూనం చేసేస్తారు".

"అక్కడ యీ దెబ్బల బాజామీదే అందరిదృష్టీ. కొట్లో వుండగా కొడతారు. నడవలలో తంతారు. మెట్లమీద పొడుస్తారు. మెట్లమీద పడదోయడంలో వాళ్ళు బహుదిట్టలు. మొదటి దెబ్బతో దభేలున కిందపడిపోతారు. కాని మెట్లమీద అలా పడనిస్తారా? ఉహుం – దభేలున పడి తల దేనికైనా కొట్టుకునే లోపలే యింకో వార్డరు పిడికిలితో యింకో పోటు పొడుస్తాడు. దాంతో యింకో పిడికిలి దగ్గిరికి వెళ్ళి పడతాం. యీ విధంగా మెట్ల అడుగుకు జేరు కుంటాం. చివరికి అక్కడా పడిపోయేది."

షూయిస్కీ మరి మాట్లాడలేదు. ఆలోచిస్తూ తల పంకించాడు.

"ఘోరం!" అంటూ మళ్ళీ ప్రారంభించాడు. "పిల్లికి తొమ్మిది జన్మలున్నాయంటారు. మనిషి కున్న వాటిముందు యిదెంత? పిల్లినే గనక ఓరెల్ సెంట్రల్‌లో రెండు గంటలసేపు మూసివుంచితే చచ్చి ఊరుకుంటుంది. కాని మనుషులు సంవత్సరాల తరబడి జీవిస్తారు. అందులోనూ వైద్య సహాయం లేకుండా!"

"అదేమిటి? పదిహేను వందలమందికి ఒక్క డాక్టరైనా లేడా?"

"ఆఁ – ఒక్కడున్నాడు." అని షూయిస్కీ నవ్వాడు.

"రిక్లిన్‌స్కీ, అతని పేరు జ్ఞాపకం పెట్టుకోతగింది. కాని అక్కడి రోగుల వార్డు, వార్డుకాదు. కసాయిశాల. ఒకమాటు అందులోకి వెళ్ళాను. అక్కడ నేనున్న సంవత్సరాలలోకి నేను వెళ్ళింది ఆ ఒక్క సారే! తలుపు తీయగానే డాక్టరు బిగ్గరగా, 'దిమ్మరి వెధవ' అని కేక పెట్టాడు. సెంట్రల్‌లో 'నేరస్తుడు, ఖైదీ'లలాంటి పదాలే వినిపించవు. 'దిమ్మరి వెధవ! అక్కడేవుండు! దగ్గిరకురాకు, సంగతేమిటో అక్కడ వుండే చెప్పు.'

"తెలివితక్కువగా అడిగాను"

"క్షమించండి, బాబు! అక్కడనుంచే నన్నెట్లా పరీక్షచేస్తారు?"

'యేమిటి? దిమ్మరి వెధవల్ని యెలా పరీక్షిస్తారో చూపెట్టు.'

"ఆ వార్డు అసిస్టెంటు నన్ను పరీక్షించాడు:— పళ్ళమీద"

మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

"మొదటినెల మహా కష్టంగా వుంటుంది. అదే పరీక్షాకాలం. అప్పుడే నేరస్తుడు 'సంస్కరించ' డానికి తగినవాడు అవునా కాదా అని నిర్ధారణ చేస్తారు. అధికారులు వాడేమాట అదే. ఆ నెలరోజుల్లో చీటికీ మాటికీ తన్నుతూ వుంటారు.

"పరీక్షలో అడుగుతారు. యెందుకలా కుంగిపోయిన వాడిలా కన్పిస్తావు? సంతోషంగా వున్నట్టు కనిపించాలి."

"మళ్ళీ తన్నులు."

"లేకపోతే' కప్పుకేసి చూస్తున్నా వెందుకు?"

"మర్యాదగా జవాబుయిస్తే సరేసరి, లేకపోతే చర్మం వొలిచేస్తారు.

"'సాలెగూడులు వున్నాయేమోనని చూస్తున్నా."

'ఆం-సాలెపురుగులు వున్నాయేమోనని చూస్తున్నావంటే కొట్లను సరిగా శుభ్రం చేయడం లేదన్నమాట !'

"మళ్ళీ తన్నులు !"

"తన్నులు తినడానికి యింకా తేలికమార్గం వుంది.

'వాడి గొంతు అసహ్యంగా వుందేం? నేను పొరబడడం లేదుగదా?' అంటాడు గవర్నరు వార్డరుతో.'

'అవునండీ, అసహ్యంగానే' వుంది.

'అయితే కానీ. గొంతు మారుతుందేమో!'

షూయిస్కీ ఒక్కనిమిషం ఆగి మళ్ళీ ప్రారంభించాడు .

"పరీక్షాకాలం పొడిగించవచ్చును. నుకెంతకాలం వుండాల్సి వస్తుందోకాని, నేను యెనిమిదినెలల పరీక్షాకాలం గడిపాను. నేరస్తులు, హంతకులు వగైరాల విషయంలో కొంచెం కొంచెం కనికారం చూపిస్తారు. శిలువ ధరించేవరకూ నేను బతికివున్నానో చచ్చిపోయానో నాకు తెలియదు."

"శిలువ!" అని బామన్ అడిగాడు "యేమిటి?" మామూలు శిలువ. మెళ్ళో కట్టుకున్నాను. అక్కడ శిలువలేకుండా వుండకూడదు. ప్రతిరోజూ సాయంకాలం వూచలను సుత్తితో పరీక్షించి, వాటిని కోసివేస్తారేమోనని యెపుడూ చూస్తూంటారు — వార్డరు శిలువ ధరించనివారిని ప్రశ్నిస్తాడు :

'శిలువవుందా?' అని.

"లేదు."

"ఆ ముక్క చెప్పీచెప్పడంతోనే సుత్తితో గుండెలమీద ఒక్కటివేసి,

'అక్కడ వేలాడుతూండాలి గ్యాపకం వుంచుకో' అంటాడు.

"యెనిమిది నెలలు కట్టుకున్నాను. గుండెలమీదయినా దెబ్బలు ఎతం చుకోవడానికి శిలువ మెడలో కట్టుకున్నాను."

# 19

# దూది

చాలాసేపు ఎవరూ మాటాడలేదు. షూయిస్కీకథ చెప్పడం మానివేసాడని బామన్ తలచాడు. కాని షూయిస్కీ మళ్ళీ ప్రారంభించాడు.

"పరీక్షాకాలం పూర్తికాగానే దూది పింజలు తీసేపని అప్పగించారు. యేం, ఆశ్చర్యంగా వుందా! సెంట్రల్‌లో ప్రత్యేకంగా పత్తి శాఖ వుంది. అందులో పింజలు తీస్తారు. కంట్రాక్టరు పేరు గ్రయెవస్కీ. అతని గురించి వినలా? అయితే తెల్సుకోవాల్సిందే!" మళ్ళీ రోగిష్టివాడిలా, విచారసూచకంగా చిరునవ్వు నవ్వాడు. "ఓరెల్‌కు నీవు వెళితే-గ్రయెవస్కీ యంత్రాలమీద పనిచేయాల్సి వస్తుంది. సెంట్రలుతో దీర్ఘకాల ఒడంబడిక చేసుకున్నాడు. స్వాంతఖర్చుతో, కిటికీలంటూ లేకుండా చెక్కలతో ఒక పాక వేశాడు. పింజలుతీసే యంత్రాలు, నొక్కుడుయంత్రం, కోతయంత్రం ఆ పాకలో నెలకొల్పాడు. యెప్పుడైనా వాటిని చూసావా? చూడలేదూ. సరే, తొందర్లోనే చూస్తావులే. ప్రతివాడూ ఆ పని చేసితీరాలి. లేకపోతే కఠిన వరకం యేమిటి? యంత్రాలు భారీవి. పాతవి, యీ విషయం తేలికగానే బోధపడుతుంది. నేరస్తులకోసమని కంట్రాక్టరు గొప్ప

యంత్రాలు కొంటాడా? విద్యుచ్ఛక్తితో యంత్రాలు నడవడ మంటూ లేదు. అదీ గుర్తుంచుకో. నేరస్తుల శ్రమ వుండగా ఆవిరిశక్తి వుపయోగించడం యెందుకు? వాళ్ళు యంత్రాలు చేత్తో తిప్పుతారు. ఖర్చులేని పని.

"ఆ యంత్రాల పిడులు పుచ్చుకుని యెడతెగపి లేకుండా వుదయం ఆరుగంటల దగ్గిరనుంచీ, రాత్రి యెనిమిదింటి వరకూ ఒకటే తిప్పేవాళ్ళం. రోజుకు 200 కిలోగ్రాములు తయారుచేయాలి. అంతకు తగ్గిందా వీపుమీద కొరడా ఆడుతుంది. అక్కడ ప్రత్యేక పద్ధతిలో కొరడా వుపయోగిస్తారు. చెప్పమంటావా? వద్దా? విసుగెత్తుతుంది. వివరాలుకూడా నాకు జ్ఞాపకం లేవు. కొరడాతో కొడుతూంటే పాతిక, ముప్ఫయి దెబ్బలదాకా తెలుస్తుంది. ఆ తరవాత దిమ్మెత్తుంది. యేమీ తెలియదు. మామూలు మోతాదు తొంభయి తొమ్మిది దెబ్బలు. తొంభయి తొమ్మిదేం, నిండా నూరు ఎందుకు కొట్టరు అని నువ్వు అడగవచ్చు. యెందుకనంటే, జైలుగవర్నరు చట్టప్రకారం తన విచక్షణను వుపయోగించి నూరువరకు వడ్డించవచ్చు. నూరు, ఆపైన దెబ్బలు కొట్టాలంటే మంత్రిత్వ శాఖనుంచి అనుమతి పొందాలి. నూరోదెబ్బకోసమని, వుత్తర ప్రత్యుత్తరాలు జరపడం యుక్తంకాదు.

"ప్రభుత్వానికి మామూలంగా ఖర్చేమీ వుండదని చెప్పాననుకుంటూ కాని పూర్తిగా అది నిజంకాదు. పనిచేసినందుకు కూలి యిస్తారు. నెలకు కాస్తాకూస్తా అనుకున్నావా! పదికోపెక్కులు ముడతాయి. యిరవై సంవత్సరాలు కఠినవరకం అనుభవిస్తే యిరవై అయిదు రూబుళ్ళకుపైగా సంపాదించుకోవచ్చు. పట్టుదలగా, వేళగాని వేళగూడా పనిచేస్తే నెలకు యింకో రెండు కోపెక్కులు అధికంగా ముడతాయి. కాని వాస్తవానికి ఆ రెండు కోపెక్కులు అధికంగా సంపాదించడం మాటలతో పనిగాదు. కొరడా దెబ్బల మూలంగా, మామూలు దెబ్బల మూలంగా పని వడి తగ్గిపోతుంది. యెంత అనుభవశాలయినా కాస్త యెక్కడో పొరబడకుండా వుండడు. కొరడా దెబ్బలు తినక తప్పదు. లెక్కల పుస్తకంలో కంటే నేరస్తుల నివాసంలో

నిబంధనలు యెక్కువ. రక్షణ దళంలో కంటే క్రమశిక్షణను గట్టిగా చూస్తారు. వుదాహరణకి, హాజరు వేసుకునే ముందు, యేకాంత నిర్బంధంలో వున్నవాళ్ళు పదిహేను నిమిషాలసేపు తలుపు కంతముందు కదలకుండా టంచనుగా నిలబడాలి. కాస్త కదిలితే యిక వాడిపాట్లు దేవుడికే తెలుసు. గవర్నరు యెపుడు వచ్చి తొంగిచూస్తాడో తెలియదు. అందుకని నేలకు అంటిపెట్టుకుని అలాగే నిలబడాలి. గవర్నరు మెత్తటి వున్ని బూట్లు తొడుగుకుంటాడు. చప్పుడికావు. కదులుతుండగా చూసాడో!... వార్డరు ఖచ్చితంగా పదిహేను అడుగుల దూరంలో వుండగా టోపీతీసి సలాం చేయాలి. పొరబడ్డాడా, యింకేముంది? అగ్గిభరాటయిపోతాడు. యెంతెంత అంగలు వేస్తూ దూరం కొలుస్తాడో కూడా కనిపెట్టాలి.

"కాని అసలువిషయం వదిలి సోదిలో పడ్డట్టున్నాను - అలా పడకుండా వుండడంకూడా కష్టమే. నేను పత్తిపింజలు యెలా తీసామో చెప్పాల్సింది. సరే యింకోమాటు చెబుతాలే. యిక ముగింపుకువద్దాం. అలసిపోయాను. ఆ పాకలో అరవైమందిమి పనిచేస్తూండేవాళ్ళం. ఓవరుసీరు పేరు పెట్రోవ్. సెంట్రల్‌లో వాళ్ళంతా వట్టి మృగాలనుకో! వాళ్ళందరిలోకీ అధమాధముడు పెట్రోవ్. యెపుడూ ప్రత్యేకంగా ముడివేసిన కొరడా పట్టుకొని తయారయేవాడు. తేలిగ్గా యిలా అంటేచాలు రక్తం కారేది. కాని పెట్రోవ్ ఆ కొరడా ప్రయోగించే విధానం! మమ్మల్ని యెలా చిత్రహింస పెట్టిందీ వర్ణించడం మొదలు పెట్టను గూడా మొదలు పెట్టలేను. పెట్రోవ్ బదిలీ అయాడు. యింకొక రోజే యిక్కడ వుంటాడు అని తెలిసేవరకు ఓర్చుకున్నాం. ఆ సంగతి మాకు తెలియగానే అరవైమందికి ఒకేఒక ఆలోచన వచ్చింది. 'వెళ్ళిపోతున్నాడా? వాడు? ఉహుఁ - వెళ్ళనీయగూడదు' తెలిసిందా?"

"ఆఁ-తెలిసింది" అన్నాడు మోటుగా. "మీరు అతన్ని చంపేసారు. అంతేనా?"

"అవును. చంపేసాం." ఆనిష్కూయిస్కీ తల పంకించాడు. ఆక్షణంలో తిరిగి పిచ్చివాడిలాగానే కనిపించాడు. ఆ పిచ్చి వాలకం తలుపుకంతలోనుంచి చూసి వార్డరు వెంటనే కంతతలుపు మూసే

సాడు. "ఆఖరిసారి వేడుకగా కాలంగడపడానికి పాకలోకి వచ్చాడు. 'వేడుకకోసం'! సరిగ్గా యిామాటేఅన్నాడు. మొదటిమనిషిని కొడతానికి కొరడా యెత్తాడో లేదో..."

"నువేనా?"

"...చేతికి అందింది పుచ్చుకుని నెత్తిమీద ఒక్కటేసాడు. మేము తయారుగా లేం. ఆరవైమందిమీ తయారుకాలేం. అరవైమందికీ వాడిని చంపాలని వున్నపుడు యెవరో వకడిని యెలా పురమాయిస్తాం? నాచేతులతోనే నేను వాడిని చంపివుంటే - న్యాయంకాదు హత్య అయేది.

"నాకు, నేరస్తులకు అందరం తలోచెయా వేయాలని వుంది. కాబట్టి మేమెవరం ముందు తయారు కాలేదు. అదృష్టానికి వదిలేసాం. అదృష్టంకొద్దీ మొదటివాడికి గొడ్డలి చేతికి దొరికింది. గొడ్డలి - అంటే ఒక్క దెబ్బతో పెట్రోవ్ అప్పటికపుడు చచ్చిపూరుకుంటాడు. తక్కిన యాభై తొమ్మిదిమందికి పని తగిలేదికాదు. పెట్రోవ్‌తో కూడా యిద్దరు వార్డర్లు వచ్చారు కాబట్టి సరిపోయింది. యిదంతా హఠాత్తుగా జరిగిందేమో గొడ్డలితో కొట్టిందెవరో వాళ్ళకి గుర్తులేక పోయింది. వెళ్ళిపోవాలని కాళ్ళు విరగదొక్కుకున్నారు. యింతలో మాలో ఒకడు పెట్రోవ్ తోలు సంచిలోనుంచి రివాల్వరు తీసి గురి పెట్టి ఒక వార్డర్ని మెడమీద కాల్చాడు. వాడు దెబ్బకి నేలమీద పడిపోయాడు. మూడో వార్డరు దగ్గర తుపాకీవుంది గాని వెళ్ళేలోపల చేతులు రెండూ గొడ్డలితో నరికేసారు. కాని వాడిని చుట్టుముట్టలేక పోయాం. మెల్లిగా జారుకుని సహాయం రమ్మని కేకలు వేస్తూ పారి పోయాడు. యిదీ అక్కడ జరిగింది...యివాళటికి కూడా ఆవార్డరు కేకలికి ఆరవైమందీ యెందుకు పారిపోయి దూదిబస్తాల చాటున దాక్కున్నారో నాకు అర్థంకావడంలేదు...ముగ్గురుమాత్రం దాగుకోకుండా దిగబడ్డారు. రివాల్వర్లు, తుపాకీ పైకి తీసారు. పాకలోకి చొరబడ్డ సైనికుల కాల్పులకు ముందుగా ఆహుతి అయిపోయారు. దాక్కున్న వాళ్ళల్లో యిద్దరు సరిగా దాక్కోలేదు. వాళ్ళనీ కాల్చి చంపేసారు..."

"దాక్కున్నవాళ్ళగతి యేమయింది?"

"సైనికులు మాకోసం వెతకలేదు. వాళ్ళంటే మాకెంత భయమో వాళ్ళకీ మేమంటే అంతభయం వుండచ్చు. అందుకే వెతకలేదు. చుట్టుచుట్టుకుని ఒకచోట నిల్చబడి తుపాకులు బారుచేసి ఒక్కొక్కళ్ళూ బయటికి రండని కేకలు వేసారు.

" 'నే నెందుకు ముందు బైటపడాలి? ముందు యెవడు బైటపడితే వాడిపని తక్కినవాళ్ళ కంటేనే కాదు, చచ్చినవాళ్ళకంటే కూడా అధ్వాన్నమవుతుంది.' అని మాలో ప్రతి ఒకరం అనుకున్నాం. అందుచేత వాళ్ళు చాలాసేపు నిలబడాల్సివచ్చింది. ముందుగా బైటపడ్డవాడు 'ఆ' అని పెట్టిన కేక వినిపించగానే (దీర్ఘంగా పెట్టిన కేక యివాళటికీ నా చెవుల్లో గింగురుమంటోంది. యెన్నటికీ మరిచిపోలేను) పాక్కుంటూ బయటికి వచ్చాం. అవును. పాక్కుంటూ వచ్చాం."

"ఇక చాల్లే!" అని బామన్ లేచి నిలబడ్డాడు. "పూర్తిగా అలిసిపోయావు. యిక చెప్పడం మంచిదికాదు."

"అబ్బే!" అన్నాడు షూయిస్కీ బామన్‌కు అడ్డుతగిలి.

"యేమయినా యింకా చెప్పాల్సింది పెద్దగా యేంలేదు. సహజంగా ఆసుపత్రికి నన్ను చేర్చారు తరవాత నన్ను 'నెమ్మదిగా' ప్రశ్నించారు. 'నెమ్మదిగా' అనేమాట పూర్వం వుపయోగించేవాళ్ళుం అప్పుడే నా పళ్ళు మిగిలినవి కాసినీ వూడి చక్కాబోయాయి. చివరికి నాకు మతి స్థిమితం తప్పింది. చీఫ్ పబ్లిక్ ప్రాసిక్యూటరును చూడాలని కోరాను. ప్రభుత్వానికి సంబంధించిన అతి రహస్య సమాచారం అందచేయాలనివుందని చెప్పాను. ఆయనగారు వచ్చాడు. నేను బ్లాంక్విననిచెప్పాను. నేను వేళాకోళం చేస్తున్నానని భావించి స్వహస్తాలతో నా ముక్కు చితకకొట్టేసాడు. కొరడాతో నన్ను కొట్టారు. నాకొక ఆలోచన కలిగిందంటే, యిక వాళ్లేంచేసినా నా మనసు మారదు నేను బ్లాంక్విని మొండిగా వాదించాను. చివరికి డాక్టర్లను పిలుచుకు వచ్చారు. వాళ్ళ కళ్ళుకప్పడం అదెంతపనీ. నన్నువాళ్ళుచేసిన పరీక్ష సెంట్రల్‌లో పరీక్షముందు యెన్నోవంతు? వాళ్ళు నావిషయం తీవ్రమైనదిగా జమకట్టారు. యితర్లు యేంచేస్తున్నదీ చూడడమే నాపని.

వాళ్ళతో కలిసి వార్డర్లను తరిమాను. వళ్ళు కడగనీయలేదు, తల గొరగనీయలేదు. సూదులతో గ్రుచ్చుతూంటే బాధ పెట్టినట్లు నటించాను. తెలివితక్కువ మొద్దులు! పెట్రోవ్ జిత్తులముందు వీళ్ళవి ముద్దుముద్దుగా వుంటాయి! క్లుప్తంలో చెప్పాలంటే, నాకు పిచ్చెత్తిందనే నిర్ణయానికి వచ్చారు. వాళ్ళ నిర్ణయం జిల్లా అధికారులకు పంపించారు. నన్ను యిక్కడికి పంపారు. విచారణకోసం యెదురుచూస్తూ పడుండమన్నారు. సరే, గూఢచారులను నాదగ్గరికి పంపుతూనేవున్నా, నాపని యిక్కడ బాగానే వుంది..."

తలుపు వేపుకు తిరిగాడు. తాళంలో చెవిపెట్టి తిప్పిన చప్పుడయింది. అతని మొహంలో అహంకారం, పిచ్చివాలకం గోచరించింది. వార్డరు గుమ్మంలో నిలబడ్డాడు.

షూయిస్కీ కోపంతో, "పిలవకుండానే మళ్ళీ తయారయావా? యీ తడవ అడగనక యిలా వచ్చావో నీవెధవ హోటలులోనుంచి తక్షణం వెళ్ళిపోతాను" అని మండిపడుతూ అరిచాడు.

వార్డరు అతని వంక చూడకుండా బామన్‌తో, "నావెంట్రరా. నీ వస్తువులుకూడా తెచ్చుకో" అన్నాడు.

"వస్తువులుకూడా తీసుకు వెళ్ళాలా? అంటే దర్యాప్తుకు తీసుకు వెళ్ళడం లేదన్నమాట!" అవును అతననుకున్నదే నిజం, ఇద్దరూ కలిసి కిందకు వెళ్ళారు.

బామన్‌ను ఇంకో కొట్టులో ప్రవేశపెట్టారు. అదే నిజంగా ఏకాంత నిర్బంధమే!

# 20

# పోరాటం సాగుతోంది

వి. ఐ. లెనిన్, యన్. కె. క్రుపస్కాయాలకు

4 సెప్టెంబరు 1904

జైలునుంచి కోల్ వ్రాయునది ఏమనగా—అష్టకష్టాలూపడి చివరికి ఎలాగైతేనేం మా దళమంతా టాగాంకా చేరుకున్నాం. పరిస్థితి ఆకళింపు చేసుకుని మెన్షివిక్కులమీద, చెత్తాకానీ రకంమీద పోరాటం కొనసాగించాలని నిశ్చయించుకున్నాం. ఇక్కడ ఉన్న బలగంఅల్లా, కోల్, రూబెన్, పొలెటయేవ్, సాలమన్, చెర్నోమార్డిక్ (అసలు పేరు) 'కేవలం'. అపఖ్యాతి పాలయిన కేంద్రకమిటీ 'మానిఫెస్టో' గురించి, మెన్షివిక్కులతో సమావేశం జరిపి వారిని అదనంగా చేర్చుకోవాలని చేసిన నిర్ణయం గురించి విన్నాం. అందుమూలంగా మాకు స్వేచ్ఛ లభించింది. కేంద్రకమిటీ రాజకీయపు కుళ్ళు అందరికీ తెలిసిపోయింది. బూటకపు కేంద్రసంస్థలమీద రష్యాలో యదార్థమయిన తిరుగుబాటు వస్తుందని మేము విశ్వసిస్తున్నాం. తిరుగుబాటు జెండా యెత్తితేచాలు. జెండా ఎత్తాలనే మేము కోరుతున్నాం. ఇక సహించడం సాధ్యంకాదు. వారి మొహంమీద నిజం చెప్పేయవలసిన సమయం ఆసన్నమయింది. బీకుసీసానో, కప్పాటీనో ముందు పెట్టుకొని 'కుటుంబ వర్గాల'లో ప్రశాంతంగా పార్టీ సంఘర్షణను పరిష్కరిద్దామనే తుచ్ఛ వాంఛతోను, ఒంటెత్తు ధోరణులతోను చుట్టూవున్న వాతావరణాన్ని విషపూరితం చేయక ముందే ఈ విదేశీకశ్మలాన్ని బైట పెట్టడానికి ఉత్సాహంతో వర్గచైతన్యంగల వారందరూ, పార్టీ గౌరవానికి విలువ యిచ్చేవారందరూ మాతో కలుస్తారని గాఢంగా విశ్వసిస్తున్నాం. మా జెండాకింద చేరవలసిందని ముందుగా కమిటీలకు విజ్ఞప్తి చేస్తాం.

పార్టీ పరిస్థితిని వారికి విశదీకరించడానికి యత్నిస్తాం. కొద్దిరోజులలో ఈ విజ్ఞప్తి తయారవుతుంది. మెన్షివిక్కుల చర్యలను, ప్లెఖనోవ్ ఘోర విద్రోహాన్ని, ఏ పని చెయ్యకుండా అశక్తతవల్ల తన గొయ్యి తనే తవ్వుకొని ఇటీవల చర్యవల్ల తన మరణశిక్ష తానే చెప్పుకున్న కేంద్రకమిటీ పనికిమాలినతనాన్ని బయటపెడుతూ ఒక కరపత్రం ప్రకటించాలని యోచిస్తున్నాం. ఏదోవిధంగా ఇదంతా అచ్చువేసి రష్యా నలుమూలలా పంచిపెట్టాలని చూస్తున్నాం."

కలం ఒక సెకనుపాటు ఆగింది. ఇదంతా నిజంగా చేయగలుగుతారా? ఏకాంత నిర్బంధంలోఉన్న ఖైదీలకు బయటి ప్రపంచానికి విశాలమైన, నిలకడగల సంబంధాలేర్పడ్డాయి. నిజమే. కాని ఆచరణలో... కొజుబా కోరికపైన కిందటి వారంలో బామన్ వ్రాసిన ఒక కరపత్రం ప్రకటించే విషయంలో చిక్కువచ్చిపడింది. పోలీసుల వశం కాకుండా సామాను కాపాడినా అచ్చు ఆఫీసును ఇంతవరకు నెలకొల్పలేకపోయారు. డబ్బులేని కారణాన ఇల్లు అద్దెకు తీసుకోవడం పడలేదు. ఈపని చేయడానికి మనుష్యులు లేరు.

"ఇంకామనుష్యులను సంపాదించడంలోనే ఘూకు సమయం కావాలి. సంబంధాలు నెలకొల్పే కార్యకలాపం సాగించడానికి అగస్టస్‌ను యిక్కడికి పంపండి. సాధ్యమైతే ఇంకా కొంతమందిని పంపండి. ఎంతమందిని నష్టపోయామో మీకు తెలుసుగా. కొన వూపిరితో ఉన్న ఇస్క్రామీద సానుభూతితో దాడి చేయడానికి తొలుత సాహితీ సమితిని ఏర్పాటు చేయాలి. లేకపోతే మా చేతలకు స్వేచ్ఛ వుండదు. లెనిన్ సిద్ధాంతాలను గాలికి ఎగరగొట్టేస్తున్న ఈ సమయంలో మనకు స్వంత వార్తా పత్రిక లేకపోవడం అసంగతంగావుంది. సంకల్పం, నిర్దాక్షిణ్యమైన దాడి పరిస్థితులను చక్కబెట్టే సమయం వచ్చింది. లేకపోతే ఇంతలో మనం తేరుకోలేం. రష్యాలో ప్రబలిన కలతలను మనం అవకాశంగా తీసుకోవాలి. సంవత్సరంలో, అంతా అణగారిపోతుంది. అప్పుడు మన మాతృభూమి రష్యాను మరల ఒకమార్గంలో పెట్టడం సాధ్యంకాదు."

ఇంతవరకు వచ్చేసరికి మళ్ళీ కలం ఆగింది. అతని మొహంలో మందహాసం నృత్యం చేసింది. అగ్నిలో ఆజ్యం పోయడానికని అంతా అణగారి పోతుందని బుద్ధిపూర్వకంగానే వ్రాస్తున్నట్లు తాత అర్థంచేసుకుంటాడు. సహజంగా రష్యా తిరిగి అణగారి పోవడమనే సమస్యే లేదు. పుటల్లోవ్ కర్మాగారంలో ఒకటి, సార్మోన్ కర్మాగారంలో ఒకటి సమ్మెలు జరిగాయి. ఇక చిన్నచిన్న సమ్మెలకు లెక్కలేదు. మితవాదులలో కదలిక ప్రారంభ మయింది. నవంబరులో 'పట్టణ, గ్రామీణ, నాయకుల సభ' జరపబోతున్నారు. పత్రికలలోకి సభ విషయం ఎక్కువగా ఎక్కడంవల్ల దానిని నిషేధించరనే వారు విశ్వసిస్తున్నారు. మితవాద బూర్జువాలకు బలగంలేదు. కార్మిక కర్షక ఉద్యమాలు ఉచ్ఛస్థాయిలో ఉన్నపుడు ఈ మితవాద బూర్జువాలు ధైర్యంగా ముందుకు వస్తారు. వాళ్ళు ఆత్మవిశ్వాసంతో గంభీరంగా మందస్థాయిలో మాట్లాడు తున్నారంటే దానిఅర్థం...అవును, జైలులో కూడా సులువుగాఉంది. అది ఆనాటి పరిస్థితులను సూచిస్తుంది.

తాళం కిర్రుమంది. ఆ కాగితంమీద పుస్తకం పెట్టి మూసే వ్యవధి లేకపోయింది.

"దర్యాప్తుకు పిలుస్తున్నారు" అని వార్డరు చెప్పాడు.

"నేను రాను."

వార్డరు తన బరువును ఒక పాదం మీదనుంచి ఇంకోదానిమీదకి మార్చుకున్నాడు.

"వేళాకోళంగావుందా ?

"నేనేం వేళాకోళం ఆడడంలేదు. అందులో ముఖ్యంగా వాళ్ళకి చెప్పవలసిందేమీ లేనపుడు వేళాకోళం దేనికి ? యిక వాతావరణం-కిటికీలోనించి చూడు - వర్షం, బురద. నేను రాను."

" యేదో తప్పదు. బగ్గీలో వెడదాం."

"ఒకమాటు చెప్పాను. మళ్ళీ చెపుతున్నాను. నేను రాను."

ఇలా అని బల్లమీద చేతితో చరిచాడు. వార్డరు తటపటాయిస్తూ తలుపు ముందుకూ వెనుకకూ ఆడించాడు.

"ఈముక్క చెప్పమంటావా?"

"ఊఁ - నాకు తీరిక లేదు."

తాళం క్లిక్కుమంది. వార్డరు వెళ్ళిపోయాడు. అతను ఉత్తరం వ్రాయడం పూర్తి అయింది:

"సాధ్యమైనంత త్వరలో జవాబు వ్రాయండి. పాత చిరునామాకే. మిత్రులందరికీ అభివందనాలు".

గుమ్మం అవతల నిశ్శబ్దం.

# 21

## గోరీలదొడ్డిలో

వాగన్కోవస్కోయె గోరీలదొడ్డి గేటులోనుంచి ఆల్లల్లాడే కుచ్చులతో ఆరుగుర్రాలు పీనుగులబండిని లోపలకు లాగుకునిపోతున్నాయి. కోజుబా పక్కకు తప్పుకుని బండిని పోనిచ్చాడు. కళ్ళు కుంచించుకుని గలగలలాడే పింగాణీదండలకు వేలాడే నల్ల, తెల్ల రిబ్బనులమీాద ఈ క్రింది వాక్యాలు చదివాడు:

సుంక నిర్ణయాధికారి
వికెంటీ పావ్లోవిచ్ ట్రిరోగీ
స్మృతి చిహ్నంగా

సుంఖశాఖలోని అతని సహోద్యోగులచే సమర్పితం.

ఆ 'సహోద్యోగులు' శవపేటిక వెనకాలే చెల్లాచెదురుగా నడుస్తున్నారు. వారిలో ఎక్కువమంది బొద్దుగా ఉన్నారు. ముక్కులు రక్తవర్ణంగా ఉన్నాయి. సుంకశాఖలో సారా స్వేచ్ఛగా కాలువలు గడుతూంటుంది!

వారి ఆత్మకు శాంతిగలుగుగాక!
నెం. 1 సారాబట్టీ ఉద్యోగులు

కొజుబా మందహాసం చేసి వెనకవస్తున్న ఒక కార్మికునికి కను గీటి ఆ ఉద్యోగులలో కలిసిపోయాడు. ఆ అధికారులు వెనుకకు తిరిగి కోపంతో ఆశ్చర్యంతో కార్మికుల కేసి చూసారు.

గేటులోని పోలీసులు టోపీలు తీసివేసుకుని శిలువ గుర్తు వేసారు. పోలీసులు దైవభీతికలిగి ఉండడం విప్లవానికేం చెరుపుకాదు. ఇది ఒక తమాషా ఆలోచనే కాని ప్రస్తుతానికి దానిని కొజుబా పక్కకు నెట్ట వలసి వచ్చింది. గేటుదాటిన తరవాత పీనుగులబండి వేగం హెచ్చింది. గాయకమేళం "స్వర్గలోకవాసి మన జనకునకు..." అని పాడసాగింది. సుంకశాఖోద్యోగులు తమను అనుసరించి వస్తున్నవారికేసి తేరిపార జూసారు. కొజుబా అతని స్నేహితులు కొంచెం వెనక దిగబడిపోయి, పక్కబాటలోకి మళ్ళారు.

ఆబాట గోరీలదొడ్డి మధ్యకి దారితీసింది. చెట్లమధ్యన ఉన్న చర్చి దాటారు. ఆచర్చి కలశం సీసపుది. కొజుబా కుడివైపుకి తల ఆడించాడు.

"యిక్కడనుంచి మనం మళ్ళాలి, పియోటర్!"

"కాని యిది ఆస్థలం కాదే" అన్నాడు పియోటర్ ఆశ్చర్యపోతూ. "మనం మాంసం కూరలు చేసేవాళ్ళొనొఫియేర్ గోరీపక్కగా మళ్ళాలి. నువు చెప్పిన దోవ చుట్టు."

"నేను చెప్పినట్లుచేయి" అన్నాడు కొజుబా కఠినంగా. "పెద్ద వాళ్ళు చెప్పినట్టు నడుచుకో. నువు చెప్పినదోవంటే వెళితే వాడు యెదురవుతాడు. ఆ పక్షి వెధవ మిఖల్‌చక్! అడుగో ఆగోరీ దగ్గర వున్నాడు."

"యె-వ-రు?" అని పియోటర్ దీర్ఘాలుతీసాడు, కొజుబా చూస్తున్నదిక్కే చూస్తూ.

బాటపక్కన తెల్లటి కొయ్య శిలువ సమీపంలో ఒక ఫాదరీ నిలబడ్డాడు. అతని చుట్టూ కొంతమంది జనం. ఫాదరీ ధూపకలశం ఆడిస్తున్నాడు – అంటే ఖననక్రియ జరుగుతోందన్నమాట.

"నువన్నావే, ఆ మిఖల్‌చక్ యెవడు?"

"వాడా, వాడు ప్రోషిన్ మిల్లులోని ఒక తుచ్ఛుడు. 1902 సమ్మెలో వాడిని కార్మికులు బయటికి తరిమేసారు. మిల్లు యజమానికి యిష్టుడు, నీచుడు. అన్నిటికిమించీ రహస్య పోలీసులతో షరీకు అయి నాడు. అప్పటినుంచీ కనిపించడం లేదు. మళ్ళీ రంగంలోకి దిగాడన్న మాట. యిదంతా రహస్య పోలీసుల పనే. నన్నేగనక గుర్తుపడితే నేను చిక్కుల్లోపడతాను. ప్రస్తుతం చిక్కుల్లోపడడం మంచిది కాదు."

పక్కకుమళ్ళి చుట్టుదోవను ఒక ఏకాంత ప్రదేశానికి వెళ్ళి చోటను చేరుకున్నారు. కొండరావిచెట్లకింద అశ్రద్ధవల్ల నేలకు ఒరిగిన శిలువమీద కొంతమంది కార్మికులు కూర్చున్నారు.

"నమస్తే, కామ్రేడ్స్! యిరీనా యెదీ?" అని అడిగాడు కొజుబా వారిదగ్గరకు వెళ్ళుతూనే. "ఆమె యిటీవల యెవరికయినా కనిపించిందా?"

ఎవరూ జవాబియ్యలేదు. కొజుబా ఆదుర్దాతో తలవంకించి,

"ఆమెనూ లాక్కుపోలేదుగదా. యెదోపనిమీద వెళ్ళింది. మళ్ళీ తిరిగి రాలేదు. యింకా కొంచెంసేపు ఆగుదామా?" అన్నాడు.

"ఊహుఁ— వీల్లేదు." అంటూ ఒక కార్మికుడు అభ్యంతరం తెలిపాడు. "రాత్రిపూట పనికి వెళ్ళాలి. యిప్పటికే ఆలస్యమయి పోయింది. యెపుడో బయలుదేరాల్సింది. పనిచాలావుందా?"

"అవును. వుంది" అన్నాడు కొజుబా ఆలోచనా పూర్వకంగా. "సలహాచెప్పడానికి యెవరూలేరు. మనమే నిర్ణయాలు తీసుకోవాలి. విదేశాలనుంచి జాబు వచ్చింది. చదివి వినిపించడానికికూడా తీసుకు రాలేదు. సరే, కామ్రేడ్స్, నా స్వంత మాటలలో చెపుతాను. పార్టీలో పరిస్థితులు సరిగాలేవని తరుచు చెపుతూనే వున్నాను. మీ ఫాక్టరీలలో జరుగుతున్న దానిని బట్టి ఆమాట నిజమేనని మీకు తెలిసేవుంటుంది. మెన్షివిక్కులు చిక్కులు తెచ్చిపెట్టడం యిదే మొదటిసారిగాదు. విదేశాలలో సహించలేని స్థితికి మెన్షివిక్కులు తీసుకు వచ్చారని ఆ జాబులోవుంది. పనిలో గందరగోళం తీసుకు వచ్చారు. నెలనెలకీ యుద్ధరంగం అర్ధాన్నమవుతోందని వార్తలు వస్తున్నాయి. దేశంలో యింత కరువు యెన్నడూ రాలేదు. ఫ్యాక్ట

రీలలో మీ అనుభవాన్నిబట్టి వారంవారం కార్మికులను పనిలోనుంచి తొలగిస్తున్నారని మీకు బోధపడే వుంటుంది. ఫాక్టరీలలో..."

"ఫాక్టరీ కార్మికులు ముందంజ వేస్తున్నారు, నిజం."

"విప్లవం రాజుతోంది. పార్టీ దోవ తప్పితే దానినియెవరు నడుపుతారు? యెవరు దోవ చూపెడుతారు? పార్టీ కర్తవ్యం అదే. కాని విప్లవం లేవదీస్తే మనం వాదనకు దిగకుండా ఒకరి సరసన ఒకరం నిలబడి, కలసికట్టుగా ముందుకు పురకాలి. నాయకత్వంకూడా వాస్తవికమయినదయి వుండాలి."

పియోటర్ కన్నుమంటూ,

"మంచూరియాలోలాగా కాదుసుమా!" అన్నాడు.

"అవును. సరిగ్గా అంతే" అన్నాడు కొజుబా. "యే యుద్ధంలోనయినా సరయిన నాయకత్వం చాలా ముఖ్యం. సైనికుడు మహాధైర్యశాలి కావచ్చు. కాని సేనాని తెలివితక్కువ వాడయితే ఒక అడుగుకూడా ముందుకు వేయలేం. మన సైనికులు, నావికులు అంత తీసిపోయినవాళ్ళా? కాని అపజయం పొందుతున్నారు. దీనికంతటికీ కారణం ప్రధానకార్యాలయంలోని సేనాధిపతులు తెలివితక్కువవాళ్లు. దుర్మార్గులు అవడమే. మనం జారుమీద, పెట్టుబడిదారులమీదకూడా యుద్ధం చేయాలి. నడపడం యెలా? రెండో కాంగ్రెస్ స్పష్టంగా సరిగా మనకు చెప్పింది. నాయకులు సరయిన పథకం తయారుచేసారుకూడాను. కాని మెన్షివిక్కులు వెన్నుపోటు పొడిచారు. అప్పటి పరిస్థితులను గురించి, మెన్షివిక్కులు ఇస్క్రాను, పార్టీ కౌన్సిలును స్వాధీనం చేసుకోవడం గురించి రూక్ మీకు వివరంగా చెప్పాడు, జ్ఞాపకంవుందా? యిప్పుడు కేంద్రకమిటీ కూడా వాళ్ళవైపు తిరిగిపోయింది."

కొండరావి చెట్టుకింది గోరీలమీద కూర్చున్నవారిలో కదలిక వచ్చింది.

"అంతా లెనిన్‌కి వ్యతిరేకం అయారనేనా నీ భావం?"

"అంతా?" కొజుబా నిరసనగా ముక్కు ముడుచుకున్నాడు.

"అంతా అంటే యెవరు? నాకు తెలిసినంతవరకు కాంగ్రెసులో ఎన్నికయినవాళ్ళెవరూ యిపుడు కేంద్రకమిటీలో లేరు. కొంతమంది అరె

స్టయినారు. కొంతమంది మెన్షివిక్కు దుర్వాసన కొట్టగానే రాజీనామా లిచ్చారు. బాగా ఆలోచించండి, కేంద్రకమిటీ జారీచేసిన ప్రకటన చదివితే విసుగెత్తి వుమ్మేయాలనిపిస్తుంది, బూతులు తిట్టాలనిపిస్తుంది. మెన్షివిక్కు నాయకత్వంకింద మనస్థితిమంచూరియాలో జపాన్‌వాళ్ళతో పోరాడే సైనికుల స్థితికంటే అధ్వాన్నంగా వుంది."

"వాళ్ళని తరిమేయాలి, అంతే" అన్నాడు వ్లాడిమిర్ అనే రైల్వే కార్మికుడు దృఢనిశ్చయంతో. "యిక్కడ, మాస్కోలో మేం వాళ్ళతో మాట్లాడడమే మానివేసాం. కేంద్ర కమిటీ వాళ్ళ పక్షం వహించే మాటయితే దానితో తెగతెంపులు చేసుకుందాం."

"యదార్థాలను పరిశీలించండి. కేంద్ర కమిటీ మనకి వొరగ బెట్టిందేమిటి? యెనిమిది నెలలనుంచి మనకి డబ్బులేదు, సాహిత్యం లేదు. ఇస్క్రా మనకి వస్తోందన్నమాట నిజమేగాని, అంతా అబద్ధాల పుట్ట. కార్మికులకు అందజేస్తే వాళ్ళకి చెరుపే చేస్తుంది. అందుకని వాళ్ళకి అందజేయడం లేదు."

కొజుబా చేయి పైకెత్తి,

"అదీ అసలుసంగతి! సరిగ్గా అదే నేను మీకు చెపుదామను కున్నాను. కేంద్రకమిటీ మెన్షివిక్కులవైపు తిరిగిపోయినందున, బోల్షివిక్కు ప్రతినిధులు, రష్యాలోని రహస్యకమిటీల ప్రతినిధులు మొత్తం యిరవయి యిద్దరు జెనీవాలో లెనిన్‌ను కలుసుకున్నారు." అన్నాడు.

"యిరవయియిద్దరా? అంటే రష్యా అంతటనుంచీ వెళ్ళా రన్నమాటే"

"యిరవయిరెండు కమిటీలు లెనిన్‌పక్షాన నిలబడ్డాయి. ద్రోహం చేసింది కాబట్టి కేంద్రకమిటీతో సంబంధం పెట్టుకోకూడదని నిర్ణయానికి వచ్చారు. స్వంత కేంద్రం, బోల్షెవిక్ కమిటీల సమాఖ్యను స్థాపించాలని నిశ్చయించారు."

"బలే!"

"...యీ సమాఖ్య కార్యకలాపానికి వారికి బాధ్యత వహి స్తుంది. అంతేకాదు, మూడో కాంగ్రెసును పిలవాలని కూడా కోరారు. కాంగ్రెసు పరిస్థితులను ఒక దోవకు తెస్తుంది, సందేహం లేదు. రహ

స్యంగా పార్టీ కార్యకలాపాలు సాగించే కార్యకర్తలలో అత్యధిక సంఖ్యాకులు లెనిన్‌ను బలపరుస్తారు. సరే యిపుడు సమాఖ్యదగ్గిరనించి యీ వుత్తరం వచ్చింది. ఆ వుత్తరంలో మనం నిర్ణయం..."

"నిర్ణయం తీసుకోడానికేముంది? అంతా స్పష్టంగా కనిపిస్తుంటే. సమాఖ్యలో చేరుతున్నామని తీర్మానం. 'చేదాం, యెవరిజిల్లా తరఫున వాళ్ళు సంతకం చేస్తే సరిపోతుంది.'

"అబ్బే! అది అసంగతంగా వుంటుంది. యీ విషయం జిల్లా సమావేశాల ముందు వుంచి తీర్మానాలు చేయిద్దాం. అలాచేస్తే దానికి కట్టుబడి వుంటాం. మాస్కో కార్మికులు లెనిన్ పక్షాన వున్నారని స్పష్టమవుతుంది. కొజుబా! ఆ తీర్మానం సంగతేమిటో నువే చూడాలి"

"ఆవిషయం నాకు తెలియదు. నేను అటువంటివాటికి తగిన వాడినికాదు" అంటూ కొజుబా గుర్రుమన్నాడు.

"టాగాంకాలోని కామ్రేడ్స్ చేత వ్రాయించే మార్గంలేదా?"

"నేను సమాఖ్య వార్తలు జైలులోకి ప్రస్తుతం పంపించకూడదని నిశ్చయించుకున్నాను" అన్నాడు కొజుబా మందహాసంచేస్తూ.

"యెందు కనేం?"

అందరూ నిజంగా ఆశ్చర్యపోయారు. కొజుబా నిట్టూర్చి:

"యీ విషయం అధికారులకు తెలిసిపోతే యిక మనవాళ్ళని యమయాతనలు పెడతారు. బయట యేమీ జరగడంలేదని వాళ్ళు అనుకోవడమే మంచిది. యీలోగా వాళ్ళని తప్పించడానికి యెత్తు వేదాం..." అన్నాడు.

"టాగాంకానించే? యేమోనబ్బా! సందేహమే. టాగాంకా నించి తప్పించడం కలలోవార్త!"

"అదేమిటి? కోటలే స్వాధీనమవుతాయి" అని కొజుబా కనుగీటాడు. "సరే. నిర్ణయం చేసుకున్నట్లేగా. యిరీనా నేనూ కలిసి ఆ తీర్మానం సంగతి చూస్తాం, ఆమె తిరిగివస్తే".

పియోటర్ గోరీల దొడ్డిలోని రాళ్ళను దాటి దూరంచూసాడు.

"రాకేంచేస్తుంది? ఆఁ – అదిగో, రానేవచ్చింది. ఆ పూర్వ సువాసినీ వేషంలో ఆమెను యెవరూ గుర్తుపట్టి చావలేరు."

ఇరీనా వారి దగ్గరకు వచ్చి మందమయిన పొడుగుపాటి ముసుగు తీసివేసింది.

"అంతా సవ్యంగానేవుంది" అంది గబగబా నడిచి వచ్చిం దేమో కొద్దిగా రొప్పుతూ. "మనకి కావలసింది తెలుసుకున్నాను, కొజుబా!"

# 22

## జవాబు

విదేశాలనుంచి జవాబు తొందరగానేవచ్చింది. నెల రోజుల లోగానే బామన్ కొట్టును ఊడ్చే నేరస్తుడు స్విడ్జర్లండు పోస్టు ముద్ర వేసిన ఒక ఉత్తరం తెచ్చి ఇచ్చాడు. అది సాంకేతిక భాషలో ఉంది. ఆ ఊడ్చేవాడు రాజకీయ ఖైదీలకు ఉత్తర ప్రత్యుత్తరాలు జేరవేస్తూం టాడు. ఆ ఉత్తరం వచ్చిందని బామన్‌కు ఇదివరకే తెలిసింది. కొట్టు నుంచి కొట్టుకు, అంతస్తునుంచి అంతస్తుకు గోడలమీద సంజ్ఞల కొట్టి ఈ సమాచారం అందజేసారు. ఆ ఉత్తరం వచ్చిందనే సంగతే కాకుండా 'కేవలం' తయారుచేసిన సాంకేతిక భాషలో వ్రాయబడిందని కూడా బామన్‌కు తెలుసును. ఆ సాంకేతిక భాషకూడా తెలుసు కాబట్టి ఉత్తరం పెద్దదయినా తొందర తొందరగానే చదివి అర్థం చేసుకో గలిగాడు.

23 సెప్టెంబరు 1904, జెనీవా

"ప్రియమయిన మిత్రులారా!

" మీ జాబు చదివి ఆనందభరితులమైనాం. కొత్తగాలి పీల్చి నట్లయింది. బలం చేకూరింది. మీ పన్నుగడతో ముందుకు సాగి

పొందింది. అది మహాబాగుంది. అమిత ప్రాముఖ్యం చేకూర్చుకుంటుంది. మీవద్దనుంచి ఉత్తరాలకోసం ఆదుర్దాగా ఎదురు చూస్తూంటాం. అచ్చుసౌకర్యాలను గురించిన సలహా కొంతవరకు ఆచరణలో పెట్టడమయింది. వ్రాసేవాళ్ళు యిక్కడ చాలామంది ఉన్నారు. కావలసినంత వ్రాసి సిద్ధంగాఉంది. మొత్తంమీద మేమందరం మాంచి ఉత్సాహంగా ఉన్నాం. పథకాలు చాలా ఉన్నాయి. తాతాజీ కూడా పని ప్రారంభించారు. రష్యాతో ఉత్తర ప్రత్యుత్తరాలు చురుకుగా సాగుతున్నాయి. ఇక ప్రజలు త్వరలోనే సమీకృత మవుతారని ఆశిస్తున్నాను. మన ఉభయులకు స్నేహితులయిన వారికి వివరంగా వ్రాస్తున్నాం. వారినుంచి మీకు బోల్షివిక్ ప్రచురణ వ్యవహారాల విషయం సవివరంగా తెలుస్తుంది. రవాణా ఏజెన్సీ కేంద్ర కమిటీ చేతుల్లో ఉండడంవల్ల దానిని మేం ఉపయోగించుకోడానికి వీల్లేదు. ఇంతే సంగతులు. అభినందనాలు, ప్రియమైన కామ్రేడ్స్, మీకు ఆరోగ్యం, శక్తి చేకూరు గాక!

తాతాజీ అండ్ కో"

ఆ రోజునే టాగాంకానుంచి జవాబు వెళ్ళింది. అందులో ఈ కింది విషయాలు తెలియజేయడమయింది. కోల్ వ్రాసిన మొదటి ఉత్తరంలో ప్రస్తావించిన కరపత్రంమీద జైలులోఉన్న పందొమ్మిది మంది కామ్రేడ్స్ సంతకంచేసి బయటి ప్రపంచానికి పంపించారు. మాస్కో కమిటీలో ఇంకా కొంతమందిని చేర్చడమయింది. అచ్చు ఆఫీసు స్థాపనకు, కరపత్రాలు సరిగా అచ్చువేయడానికి ఏర్పాట్లు జరిగాయి. పార్టీ మూడో కాంగ్రెసును పిలవాలని ఆందోళన పెంపొందుతోంది. ఇరవయిరెండుమంది సమావేశమయినవార్త, బోల్షివిక్ కమిటీల సమాఖ్యను గురించినవార్త ఆలస్యంగా చేరినా, టాగాంకాలోని కామ్రేడ్స్ ప్రేరణ అక్కరలేకుండానే మాస్కో కమిటీ సమాఖ్యలో చేరడానికి అంగీకరించింది. నిజానికి బామన్ ఇంకా మాస్కో కార్మికులకు నాయకత్వం వహిస్తూనే ఉన్నాడు. ఉత్తర ప్రత్యుత్తరాలకు కట్టుదిట్టంగా ఏర్పాట్లు జరగడంవల్ల అన్ని విషయాలలోను అతని సలహా

లను తీసుకుంటున్నారు. ప్రతి విషయంలోనూ అతని అభిప్రాయాన్ని నిర్ణయాన్ని తెలియజేస్తూనే ఉన్నాడు.

మాస్కో కమిటీ టాగాంకాలోని కామ్రేడ్స్‌ని తప్పించడానికి చర్యలు తీసుకుంటూనే ఉంది. జైలు సమీపంలో ఇరీనా అనుకూలంగా ఉండే ఇల్లు తీసుకుంది. రెండు మూడు రోజులలో సొరంగం తవ్వకం ప్రారంభమవుతుంది. దీనికి ఒక పథకం జైలునుంచి పంపించడమయింది. కాని అటువంటి సమాచారం సాంకేతిక భాషలో నయినా పంపడానికి వీల్లేదు.

ఈఉత్తరం సాంకేతికభాషలో వ్రాసి 'మామూలు మార్గం'లో పంపించారు.

# 23

## సమాచారశకలాలు

సరిగా అర్ధరాత్రివేళ, మామూలు ప్రకారం ఎపస్క్రేటీ మెడ్నికోవ్ రహస్యపోలీసుశాఖకు చెందిన హాలులోకి అడుగుపెట్టాడు. ఆ హాలు ఎత్తు తక్కువ. అక్కడ ఆతనికోసం ఏజెంట్లు కనిపెట్టుకుని ఉన్నారు. మొదటిరకం ఏజెంట్లను తయారుచేయడంలో మెడ్నికోవ్ పాఠశాల సామ్రాజ్య మంతటా పేరు పొందింది. అందుచేత మాస్కోలోనే గాకుండా సెయింట్ పీటర్స్‌బర్గులో కూడా ఈ ఏజెంట్లను రహస్యపోలీసుశాఖవారు "ఎవస్ట్రాటీ పాఠశాల" మనుషులని పిలుస్తారు. చట్టవిరుద్ధంగా కార్యకలాపాలు సాగించేవారు అందుకనే మాస్కోను ప్రమాదకరమయిన నగరంగా భావించేవారు. ఏకమిటీ అయినా మూడు నెలలకంటె ఎక్కువ మన జాలేది కాదు. అది 'భగ్నమయి' తీరేది. అంటే అందులోని సభ్యులను అరెస్టు చేసేవారన్నమాట.

మామూలుప్రకారం ఏజెంట్లు 'నిబంధనలలో విధించిన భంగిమం'లో, ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే, పాదాలు ఎడంగా పెట్టి,

చేతులు వెనుకకు కట్టుకుని నిలబడ్డారు. 'బాహ్యాపరిశీలనా చాతుర్యం' అనే విషయంమీద పాఠం ప్రారంభమయింది. ఎవస్ట్రాటీ వరుసగా ఒక్కొక్క ఏజెంటు ముందు ఆగి ఆరోజున అతనుచేసిన పని విన్నాడు. మెద్నికోవ్ ఒక్కొక్కనికి ఒక్కొక్క మార్కు ఇచ్చి, అతనికి పనిని తాంత్రిక దృష్టిలో విశ్లేషించి చెప్పాడు.

నల్లగా బక్కపలచగాఉన్న ఒక ఏజెంటు దగ్గరకు మెద్నికోవ్ వెళ్ళగానే అతను అతివినయంగా, అమితకోరికతో ఏదయినా పని చెప్పమని అడిగాడు.

"యింకెవరి వెంటయినాపడి ఆచూకీ తీయాలనివుంది. అవెట్ వ్యవహారంలో వుత్సాహం కలగడంలేదు. అతనిని వెంటాడడం వృథా ప్రయాస. కుందేలులాగా తిరుగుతాడు. యేమీ గమనించడు. అతను కుట్రదారుడేమిటి, వట్టి తెలివితక్కువ దద్దమ్మ!"

"ఫ్లీయర్ విషయం వీడికి అప్పగించు, ఎవస్ట్రాటీ పెట్రో విచ్" అన్నాడు అతని పక్కనే నిలబడ్డ ఏజెంటు అసూయతో. "వెంటాడితే అతన్నే వెంటాడాలి! చివరిదాకా వెంటాడే అవకాశం కలిగించేవాడు కాదు. టోకరా ఇస్తాడు. వీధిలోకి వస్తే బహుజాగర్త పడతాడు. ప్రతిమూలా జాగర్తగా పరిశీలిస్తాడు. టోకరాగాడు. అతని నెలాగయినా పట్టుకురావాలి. నెల రోజులనుంచి అతని వెంట తిరుగుతున్నామా, యింతవరకు ఆచూకీ తీయడానికి కాస్తయినా ఆస్కారం యిచ్చాడా? అతని వెంటాడడం డబ్బుదండగ, పనిచెరుపు."

ఎవస్ట్రాటీ గుర్రుమన్నాడు తప్పితే మాట్లాడలేదు. ఆ నిమిషంలో అతను వేరే విషయం ఆలోచిస్తున్నాడు. పోలీసు ఏజెంట్లు 'ఫ్లీయర్' అని మారుపేరుతో పిలిచే ఆ కుట్రదారుని గురించిగాని, 'అవెట్' అని పిలవబడే ఆ తెలివితక్కువ మొద్దును గురించిగాని ఆదుర్దాపడడం లేదు.

ఎడమ వైపుకు ఒక అడుగువేసి తరవాత ఏజెంటు వైపు తిరిగాడు. ఆ ఏజెంటు మంచి ఉత్సాహంతో తను చేసింది చెప్పాడు. కాని మెద్నికోవ్ మనసు ఎక్కడోఉంది. ఆలోచిస్తున్నాడు.

ఆలోచించడానికి కావలసినంత ఉంది. మూడు వారాలనుంచీ ఫ్యాక్టరీలలో కరపత్రాలు, ప్రకటనలు రోజూపంచిపెడుతున్నారు. వాటి లోని విషయము మహా దారుణంగా ఉంది. ప్రతి కరపత్రం అడుగునా అవమానకరమయిన మాటలు :

ఆర్. యస్. డి. యల్. పి. మాస్కో కమిటీ అచ్చు ఆఫీసు అని ముద్రితమయిఉంది.

మూడు వారాలు! 'ఎవ్రస్కాటీ పాఠశాల' యావత్తూ పనిలో నిమగ్నమయినా, మనుషులు నగరంలో కాళ్ళు అరిగేటట్టు తిరిగి వెదికినా ఆ దుండగుల ఆచూకీ తీయలేకపోయారు.

అంతా వ్యర్థం! ఏమీ దొరకలేదు. మెడ్నికోవ్ అనుభవంలో కిటుకు గ్రహించే సూచనకూడా దొరకక పోవడం ఇదే మొదలు.

అచ్చు ఆఫీసును గురించి ఏమాత్రం తెలిసినా వెంటనే తెలియజేయవలసిందిగా ఆదేశం ఇవ్వడమయింది. కాని ఒకరూ ముందుకు రాలేదు. ఆ కారణంవలననే మెడ్నికోవ్ ఈ గూఢచారుల శ్రేణివెంట బరువుగా అడుగులు వేసుకుంటూ నడిచాడు. వారు చెప్పేది సరిగా వినడం కూడాలేదు. అతనికి ఆసక్తి కలిగించే విషయం గురించి ఒకరూ చెప్పినపుడు, ఇక వినడం దేనికి ?

ఆ శ్రేణివెంట సగందూరం వెళ్ళాడో లేదో పై అధికారి దగ్గర నుంచి రమ్మని కబురు వచ్చింది. పై అధికారి కార్యాలయం తలుపు తెరవగానే ఆకలనల్ ముఖకవళికను బట్టి వ్యవహారం సాఫీగా నడవదని ఎవ్రస్కాటీ గ్రహించాడు.

పోలీసు కలనల్‌తోపాటు జైలుశాఖ దుస్తులువేసుకుని బక్కపలచటి వ్యక్తి ఒకతను కూడా అక్కడ ఉన్నాడు. అతను కుంగిపోయినట్లుకనిపించాడు. తెల్లటి శరీరచ్ఛాయ. ముఖంమాత్రం కందగడ్డలాగా ఉంది. సంభాషణ వివరాలలోకి దిగింది.

"మిస్టర్ మెడ్నికోవ్!'' అన్నాడు కలనల్ సంతోషం నటిస్తూ, చేతులు రుద్దుకుంటూ. "నువు రావడం నాకు చాలా సంతోషమైంది! మీ యిద్దరికీ పరిచయముందా? యీయన టాగాంకా జైలుగవర్నరు.

యితను నా అసిస్టెంటు మెడ్నికోవ్. పరస్పర సానుభూతితో కరచాలనం చేసుకోండి.''

సన్నగా జిడ్డుగా ఉన్న ఆ గవర్నరు చేతిని మెడ్నికోవ్ పట్టుకుని ఊపాడు. ఏదో పొరపాటు జరిగిందని స్పష్టంగా తెలుస్తూనేఉంది.

''యీ గవర్నరు'' అన్నాడు కలనల్ జైలు అధికారి వైపు తల వంచి. ''మాస్కోలోని రాజకీయ పరిశోధనాశాఖ అధిపతివయిన నీమీద నేరమాపాదిస్తున్నారు. స్థానిక బోల్షివిక్కు కుట్రదారులు మూడునెలలుగా, మూడునెలలు! వినిపించిందా?'' కలనల్ వేలు గాలిలో కదలాడింది. ''టాగాంకా జైలులోని ఖైదీలతో, ముఖ్యంగా మనకందరకూ తెలిసిన నికొలాయ్ బౌమన్‌తో సతతమూ సంబంధాలు పెట్టుకున్నారనే విషయంలో నువు వుపేక్షించావట. అంతేగాదు, యీ కాలంలోనే మాస్కోలో అచ్చయిన బోల్షివిక్ ప్రకటనలు టాగాంకా జైలునుంచే వ్రాసి బయటికి పంపారని చెపుతున్నారు...''

మెడ్నికోవ్ మండిపడి,

''నేరమాపాదిస్తున్నాడా? జైలు అధికారులు తమ కళ్ళముందు యేంజరుగుతోందో తెలుసుకోలేకపోవడం నాతప్పా?''అన్నాడు.

''నాకూ కళ్ళున్నాయి'' అని గవర్నరు అడ్డు వచ్చాడు తీవ్రంగా. ''యిక్కడినుంచే, జైలు బయటనుంచే ప్రతిదీ వుత్పత్తి అవుతోంది. జైలు కటకటాల వెనక బయట సహాయం లేనిదే యేమీ చేయలేదు. వుదాహరణకి, యీ కాగితం యెక్కడనుంచి వచ్చింది? బయటనుంచి కాదా?''

సన్నగా మడతపెట్టిన టావుకాగితం బయటికి తీసియిచ్చాడు. కలనన్ త్వరత్వరగా మడత ఊడదీసి, ''సాంకేతిక భాష'' అన్నాడు.

మెడ్నికోవ్ దానిమీదికి వంగిచూసి,

''అవును సాంకేతిక భాష'' అని రూఢిపరిచాడు.

ఆ చీటీ పైభాగంలో సాంకేతికభాషలో గాక మామూలు భాషలో ''14 అక్టోబరు జెనీవా'' అని ఉంది.

కలనల్ మెడ్నికోవ్ కేసి కోపంతో చూసాడు. జైలు అధికారి చెప్పింది సరిగానే ఉంది. బయటివారి సహాయం లేనిదే జెనీవానుంచి వచ్చిన చీటీ జైలులోపలికి ఎలారాగలుగుతుంది? మెడ్నికోవ్ టోకా గా తిన్నాడని విస్పష్టమవుతూనే ఉంది.

కాని దానిని నిరాకరించడానికి మెడ్నికోవ్ యత్నించలేదు.

"వారి సంఘంలో మన రహస్య యేజెంటు లేనంతకాలం యిలాంటి విషయాలు తెలుసుకోలేం" అన్నాడు. "బోల్షివిక్కులలో మనకి సమాచారం అందించడానికి నమ్మదగిన వ్యక్తి, కలసి మెలసి తిరిగే వ్యక్తి, దొరికేవరకు మనకు ఏదో కాస్త కాస్త సమాచారం అందించేవారిచేతనే పని చేయించుకోవాలనేసంగతి నేనేం మరుగు పర్చదలచలేదు. కాని మనం అనుకున్నంత నమ్మకంగా వుండదు. 'బాహ్యాపరిశీలన' సంపూర్ణ ఫలితాలను యివ్వలేదని మీకు తెలిసిందేగా. కాని యీ వుత్తరం (కలనల్ వేళ్ళతో నలుపుతున్న ఉత్తరం వంక తల వూపాడు) జైలులో దొరికింది కాబట్టి మనకి మార్గంమీ...

"దాన్ని తగలేసిరి!" అంటూ అడ్డు వచ్చాడు కలనల్ ముక్కు తుడుచుకుంటూ. "మెచ్చుకోవలసినవాళ్ళని మెచ్చుకోవాలి. వాళ్ళు మన యేజంట్లంత తెలివితక్కువ మొద్దులుగారు. మార్గం దొరకాలేదు, పెట్టాలేదు! నేరస్తులు యీవుత్తరప్రత్యుత్తరాలు జారవేస్తున్నారని యిట్టే యెవరికయినా బోధపడుతుంది. యింతవరకు ఖైదీలను చూడడానికి యెవరినీ రానీయలేదు, బంగీలపీ అందజేయలేదు. అందువల్ల యీ పనంతా నేరస్తులు చేసిందే అయివుంటుంది."

"కొట్లు వూడ్చేవాళ్ళయి వుంటారు" అన్నాడు మెడ్నికోవ్ దృఢవిశ్వాసంతో.

గవర్నరు నిట్టూర్చి

"ఉహుం – మన యేజంట్లుగా పనిచేయడానికి అంగీకరించిన వారినే కొట్లు వూడ్చడానికి పెట్టాం. వాళ్ళు జైలు ఆవరణలో కసరత్తు చేసేటపుడు యిదంతా జరుగుతోందని నానమ్మకం." అన్నాడు.

"అలా అయితే యీపత్రం సంగతేమిటి?"

"యిది ఆవరణలో దొరికింది. అనుకోకుండా పొరపాటున జారి పడి వుంటుంది. ఆ రోజున ఖైదీలంతా కసరత్తు చేస్తున్నందువల్ల యేం చేయడానికి తోచలేదు."

"జారిపడిందా ?" అని మెడ్నికోవ్ అనుమానంతో ప్రశ్నించాడు. "అటువంటి 'పత్రాల'ను రాజకీయ ఖయిదీలు జారవిడవడం యింతవరకు యెన్నడూ వినలేదు. వాళ్ళు హాస్యానికి బుద్ధిపూర్వకంగా కింద పడవేసారని అనుకోవాలి!"

ఇది హేతుయుక్తంగా ఉన్నదని కలనల్‌కి తోచింది. గవర్నరు వంక ప్రశ్నార్థకంగా చూసాడు. నిరాశతో గవర్నరు తల వంకించాడు.

"ఉహూం:– అలా జరిగి వుండదు...వాళ్ళు యేపని చేయడానికీ వెనకాడరని అనుకున్నప్పటికీ. వాళ్ళో ఎటువంటివాళ్ళని మీరూహించలేరు. మనం ముగ్గురం ఒకేస్థితిలో, ఒకే విషయం చర్చిస్తున్నాం కనక యీ విషయంలో నాకేం తోచడంలేదని అంగీకరిస్తున్నాను. వుదాహరణకి ఒకరోజున నేను బామన్‌ని చూడాలని వెళ్ళాను. శుభ్రంగా క్షవరం చేసుకుని నా ముందు నిలబడ్డాడు. యెక్కడనుంచో మంగలికత్తి సంపాదించి వుంటాడు. ఆరోజున మరి మంగలిరాలేదు. ఖయిదీలు పదునయిన వస్తువులేవీ దగ్గిర వుంచుకోకూడదు. యిక మంగలికత్తి సంగతి చెప్పేదేముంది ? కాని అప్పటికే శుభ్రంగా క్షవరం చేసుకున్నాడు. 'క్షవరం చేసుకున్నట్టున్నావే ?' అని అడిగాను. బామన్ నవ్వి 'అవును' అని సమాధానం ఇచ్చాడు. 'దేంతో ?' 'మంగలికత్తితో' 'మంగలికత్తి యెక్కడిది ?' మళ్ళీ నవ్వి 'కొట్టులో వుంది' అని జవాబిచ్చాడు. 'ఉహూం:– 'అసంభవం' 'ఒట్టు.'

"సహజంగా నేను తక్షణమే కొట్టు సోదా చేయమని వార్డరుని ఆదేశించాను. నమ్మండి, నమ్మకపోండి. మేం కొట్టంతా ముప్పావుగంటసేపు చచ్చిచెడి వెతికాం. బామన్‌ని సోదా చేసాం. కాని మంగలకత్తి కనిపించలేదు."

"నేను అనుకున్నట్లే అయింది" అన్నాడు మెడ్నికోవ్. "మిమ్మల్ని వెర్రి వుల్లాయలని చేయడానికే అలా నటించాడు. యిక

మంగలికత్తిసంగతి, యెవరో తెచ్చియిచ్చారు. పని అవగానే మళ్ళీ తీసుకుని చక్కా బోయారు."

"అదే నిజమయితేనా !" అన్నాడు గవర్నరు. "నేనూ సహజంగా అలానే అనుకుని నాలుగూ అనేసాను. నన్ను మోసగించినందుకు, రాజకీయ ఖైదీల ప్రవర్తనకు విరుద్ధంగా ప్రవర్తించినందుకు చివాట్లు పెట్టాను."

"రమారమి గంటసేపు మమ్మల్ని తెలివితక్కువ దద్దమ్మల్ని చేసి ఆడించడం నీకు వేడుకగానే వుండచ్చు, కాని నిజం మాట్లాడితే నువుచేసింది యుక్తంగాలేదు'అన్నాను

"ఆతరవాత యేంజరిగిందనుకున్నారు, బామన్ మొహం ముడుచుకుని అన్నాడు" నేను నిజం చెప్పాను. మీరు వట్టి బుద్ధిహీనులు. మంగలికత్తి కొట్లోనే వుంది!

'నాకు నమ్మకం లేదు. వుంటే చూపించు!'

'చూపిస్తానుగాని, తిరిగి యిచ్చేస్తారా?'

"కుతూహలం నాకు యెక్కువయింది."

"ఓ. అలాగే తిరిగి యిచ్చేస్తాను, అన్నాను."

"మాట తప్పకూడదుసుమా!" అని అతను సూటిగా నా కళ్ళల్లోకి చూసాడు.

"మాట తప్పను" అన్నాను. యీ వార్డర్లంతా సాక్ష్యులు"

"అలా అయితే సరే" అన్నాడు బామన్. 'ఓ నిమిషంసేపు బయటికి వెళ్ళండి, నేను కొట్టేవరకు తలుపుదగ్గిరికి రాకండి. కంత తలుపు తెరిచారా యేం జరిగినా బాధ్యత నాదికాదు, మీదే.

"మేము బయటికి నడిచాం..."

"అయితే కంత తెరిచి చూడలా? అని కలనల్ అడిగాడు, ఎగతాళిగా.

''ఉహుం- తెరవలా?'' అని గవర్నరు విచారపూర్వకంగా తల వంచుకున్నాడు.

''యీ బామన్ సంగతి మీకు తెలీదు. యెంతకయినా తెగించే బాపతు. యెప్పుడూ యేదో ఒక పితలాటకానికి తయారయి వుంటాడు. పట్టుమని ఒక నిమిషం గడించేదో లేదో తలుపు కొట్టాడు. తలుపు తీసుకుని లోపలికి వెళ్ళిచూద్దుం గదా అతని అరచేతిలో మంగలి కత్తి! పదును వుందో లేదో అని తీసుకుని చూసాను, బలే! క్షవరం ఆపళంగానే చేసుకోవచ్చు.''

కలనల్ మెల్లగా ఈలవేసి అన్నాడు,

'బలే! యింతకీ తిరిగి యిచ్చేసావా?'

''అదేం ప్రశ్న?'' అన్నాడు గవర్నరు, అసహ్యం ప్రకటిస్తూ ''యివ్వలేదు''

''అత నేమన్నాడు ?''

గవర్నరు దృష్టి మళ్ళించుకుని,

''మామూలు ధోరణే, పెద్దగా యేమీ అనలేదు. యిటువంటి పరిస్థితిలో యేంచేస్తాడు, పాపం! మనం యెంత కట్టుదిట్టంచేసినా, యేదోసందు కనిపెడుతునే వుంటారు. నిజానికి, వాళ్ళకి స్వేచ్ఛ యివ్వడమే వుత్తమమయిన పని. అపుడు యేమరుపాటుగా వుండి యెప్పుడో ఒకపుడు బోల్తా పడతారు. అనేక విషయాలు తెలుసుకోవడానికి మనకు అవకాశం చిక్కుతుంది. బామన్ వుత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాడని మూడు మాసాలక్రితమే వార్డర్లు నాకు విన్నవించారు. అందుకని వాళ్ళకి యిపుడు స్వేచ్ఛ యిస్తున్నాను. యిది స్త్రీలతో సహా తక్కినవాళ్ళకీ వర్తిస్తుంది.

''చాలా విషయాలు గ్రహించారు'' అన్నాడు మెడ్నికోవ్ వేళాకోళంగా. ''యింకేం వుత్తరప్రత్యుత్తరాలు సాగుతునే వుంటాయి?

''ఉహుం - జరుగుతాయనుకోను'' అన్నాడు గవర్నరు తల ఆడిస్తూ. ''బామన్‌ని చాలా రోజులక్రితమే యేకాంత నిర్బంధంలో

వుంచాం. గోరీలో వున్నట్టే అనుకో! వుత్తగ ప్రత్యుత్తరాలు జరగడానికి వీల్లేదు. కసరతుకూడా చేయనీయడం లేదు. మూడు రోజులకొకపర్యాయం వార్డరు యెదుట కొట్టు వూడ్పిస్తున్నాం. రాజకీయ ఖైదీల పక్షాన వ్యవహరించిన వారందరినీ అరెస్టు చేశాం."

"యేంలాభం!" అని మెడ్నికోవ్ గొణిగాడు, కళ్ళు కుంచించుకుంటూ. "మా దగ్గిరికి పంపలేదేం? నేనే స్వయంగా ప్రశ్నించేవాడిని"

"యిదివరకే ప్రశ్నలు వేయడం జరిగింది." అని కలనల్ అడ్డు వచ్చాడు విసుక్కుంటూ. "ఆవిషయం నేనే స్వయంగా చూసాను. మొండి ఘటాలు! యేమేం మాట్లాడుతున్నారో తెలియనట్లు ప్రవర్తించారు. వాళ్ళ దగ్గిరనించి యేమీ రాబట్టలేం"

మెడ్నికోవ్ కుడి చేతితో ఎడమ అరచేతిమీద కొట్టుకుని.

"నేను రాబడతాను" అన్నాడు.

"సున్నితంగా వ్యవహరించేనా?" అంటూ కలనల్ గుర్రుమన్నాడు. "అయితే నేను మెత్త మెత్తగా వాళ్ళతో మాట్లాడాననుకున్నావా? వాళ్ళ దగ్గిరనించి నువేమీ రాబట్టలేవు. చర్మం వొలిచినా సరే, ఒకసారి చెప్పకూడదని నిశ్చయించుకున్నారో యిక చెప్పరు."

# 24

## రొట్టెలవాళ్ళు

భీతావహం వ్యాపించింది. ట్వెర్‌స్కాయా వీధి దిగువకు జనం పరుగెత్తుకు పోతున్నారు. దూరాన, స్ట్రాస్ట్నాయ వీధిలోనుంచి కాల్పులు వినిపించాయి.

కొజుబా పక్కనుంచి పరుగెత్తుకు పోతున్న ఒక కార్మికుని జబ్బపట్టుకుని

"యేమిటి సంగతి?" అని అడిగాడు.

ఆ కార్మికుడు భయంతో వణికిపోతున్నాడు. వెంటనే జవాబు చెప్పలేదు.

"ఫిలిపోవ్ రొట్టెలదుకాణంలో కొట్లాడుకుంటున్నారు..."

"సమ్మె, నాకు తెలుసు" అంటూ కొజుబా అడ్డుచెప్పాడు.

కాని ఆకార్మికుడు చేయి ఊపి,

"కొట్లాడుకుంటున్నారు. రొట్టెలవాళ్ళు కాల్పులు సాగిస్తున్నారు. రొట్టెల దుకాణంలో తలుపులు బిగించుకు కూర్చుని వూరికే కాల్చేస్తున్నారు. ఆప్రదేశమంతా సైన్యంతో నిండిపోయింది! రక్తం వీధుల్లో ధారలు కడుతోంది." అన్నాడు.

కొజుబా అతనిజబ్బ వదిలిపెట్టాడు. ఆ కార్మికుడు చక్కా బోయాడు. కొంత కుదుటపడ్డాడే గాని ఇంకా అడుగులు తడబడుతున్నాయి.

కొజుబా పక్క పక్కనే నడుస్తున్న ఇంకో పొట్టిపాటి, నల్లజుట్టు కార్మికుడు భయపడుతూ,

"ఫిలిపోవ్ రొట్టెలవాళ్ళనేనా చెప్పాడు? అస్థలం యిరీనా జిల్లాలోది గాదూ?" అని అడిగాడు.

కొజుబా విచారంతో తలపంకించి అన్నాడు:

"ఆవిషయం యిదివరకే ఆలోచించాను. చాలాకాలంనుంచి పని ప్రారంభించాలని తొందరపడుతోంది. కాస్త ఆగమని చెప్పాను. తొందరగా పద"

వారు తొందర తొందరగా నడువసాగారు. ఎదురుగా పాదచారులు పరుగెత్తుకుంటూ వస్తున్నారు. వారివెనక కేకలు, ఈలలు, షిల్లి అరుపులు...

"యెక్కడికి వెళుతున్నారు? అక్కడ కాల్పులు సాగుతున్నాయి. వినిపించిందా?"

భారీ అగ్నిమాపక యంత్రం పెద్దగా కూతవేస్తూ కొజుబాను, అతని సహచరుని దాటిపోయింది. పక్కసలువులోనుంచి అశ్విక పోలీసుదళం దాడుతీసింది. జీనుమీద ఊగిసలాడుతూ ఒక అధికారి

చెంపమీది గాయాన్ని చేతితో తడుముకుంటున్నాడు. చేతి తొడుగు చినిగిపోయింది. వారిముందు తుపాకిగుళ్ళ వర్షం కురిసింది.

"సైనికుల పని!" అని పరుగెత్తుతూ కొజుబా పక్క కార్మికుని చెవిలో చెప్పాడు. "కాల్చిపారేస్తారు. ఆ విధంగా కాల్పులు సాగించడం మనవాళ్ళకి యింకా తెలీదు. వాళ్ళు యిష్టంవచ్చినట్లు దిక్కులు చూడకుండా కాల్చేస్తారు."

అదే సమయంలో అతని మాటలు ఖాయపరచడానికా అన్నట్లు కొజుబాకు, అతని సహచరుడికి చెల్లాచెదరుగా కాల్పులు వినిపించాయి.

సున్నీలను పైకి ఎత్తిపట్టి సైనిక పంక్తి వీధి దిగువకు వచ్చి పారిపోతున్న జనాన్ని చుట్టుముట్టారు. ఒక జిల్లాపోలీసు ఇనస్పెక్టరు, ఆడంబరాలరాయుడు, ధగధగమెరిసే తోలుబూట్లు తొడుగుకుని సైనికుల ముందు పరుగెత్తుతూ,

"వెనక్కి మళ్ళండి! కాల్పులుచేస్తారు" అన్నాడు.

కొజుబా, అతని సహచరుడు సమీపంలోని ముంగిటి సింహద్వారం దగ్గరకు చేరుకున్నారు. జనం నిండిపోయారు. అక్కడ నుంచి చూస్తే ఫిలిపోవ్ రొట్టెల దుకాణం బాగా కనిపిస్తుంది.

గోడల వెంట అగ్నిమాపకదళంవారు నిచ్చెనలు వేస్తున్నారు. ధగధగలాడేవారి కంచు శిరోవేష్టాలమీద రాళ్ళు కర్రలు ఇనపరేకులు కురుస్తున్నాయి. పైఅంతస్తు కిటికీలలోనుంచి చెల్లాచెదరుగా కాల్పులు సాగిస్తున్నారు. వీధి మధ్యన ఒక ఉద్యోగి వరతీసినకత్తి చేతితో పట్టుకుని నిలబడ్డాడు. ముష్టియుద్ధం చేసినవాడిలా అతని దుస్తులు చెదిరిపోయాయి. చెల్లాచెదరయిన సైనికులను ఉద్దేశించి బొంగురు గొంతుతో,

"చురుకుగా కాల్చండి! వలంటీర్లూ! నిచ్చెనలు యెక్కండి, ముందుకు పదండి!" అన్నాడు.

బాకావాడు దాడిచేయమని సంజ్ఞగా బాకా ఊదాడు. తుపాకులూ పీదిన కాల్పులకు ఆ భవంతి గోడలగచ్చు ఊడిపడింది. వలంటీర్లు

భారీబూట్లమూలంగా తొందరగా కదలలేకపోతున్నా అలాగే జాగ్రత్తగా నిచ్చెనలు ఎక్కారు. సైనికుల గుంపు ఒకటి ఆ భవంతి ఇనపగేట్లమీద తుపాకీ మడమలతో బాదారు. కాని లాభం లేకపోయింది.

రాళ్ళు గబగబా అమితంగా పడసాగాయి. కాల్పులూ అధికమయాయి. ఆభవనం పైఅంతస్తునుంచి కంగున ఒక గొంతు వినిపించింది. మాటలు స్పష్టంగా లేవు. కాని సింహద్వారందగ్గరకు తోసుకు వచ్చిన జనం గుసగుసలు మాని నిశ్శబ్దంగా ఆగొంతు వినిపించినవైపుకు తలలు ఎత్తి చూసారు. పైనుంచి ఒకమనిషి కాయం దభీమని పడింది. అది నిచ్చెనమీదనుంచే పడిందో కప్పుమీదనుంచే పడిందో కొజుబా తెలుసుకునే లోపలనే జనం దానిచుట్టూ మూగారు. ఆవీధి మూలలోని మందులషాపులోనుంచి ఎర్రటి శిలువగుర్తు పట్టీలు చొక్కాచేతులకు తగిలించుకుని కొందరు వచ్చారు. కొజుబా వెనకాలే దగ్గరగా నిలబడ్డ ఒక కార్మికుని వేడినిట్టూర్పు మెడవెనక వచ్చి తగిలింది. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు క్రమబద్ధంగా లేకపోవడాన్ని బట్టి అతనికీ తన ఆలోచనలవంటివే వచ్చాయనీ, తనలాగానే భయపడుతున్నాడనీ కొజుబా గ్రహించాడు.

"హుర్రా!" అని పెద్ద కేక కొజుబా చెవులలో గింగురుమంది.

చుట్టూ నిలబడ్డ సైనికులు తుపాకు గురిపెట్టారు. తక్కినవాళ్ళు కూడా 'హుర్రా' అని గొంతెత్తి అరిచారు. ఆ అరుపు ట్వెర్స్కాయా వీధిలోనుంచి సాగిపోయి ఫిలిపోవ్ రొట్టెల దుకాణం పైకప్పు మీదనుంచి ప్రతిధ్వనించింది. సైనికులు గేటు దగ్గరనుంచి వెనుకడుగు వేసారు. వారిలో కొందరు ఆ బొంగురుగొంతు అధికారిని కాలిబాట వెంట లాగుకుని వెళ్ళారు. దాడిమూక సాధ్యమైనంత తొందరగా దిగివచ్చి చెల్లా చెదరగా వెనకకు మళ్ళుతున్న తమ వారిని కలుసుకున్నారు.

"హుర్రా!"

తిరిగీ బాకా గింగురుమంది. స్ట్రాస్టనాయా చౌకులోనుంచి ఇంకో సైనికశ్రేణి బయలుదేరింది. ఆదేశానుసారం వారు విసనకర్రలా విస్తరించుకుంటూ పరుగెత్తారు.

"హుర్రా!"

ఈ తడవ ఈ ఉత్సాహపూరిత నినాదం సైనికులనుంచి వచ్చింది. మరల ఇంకోసారి గేటువేపు, నిచ్చెనలవేపు వారు పరుగెత్తారు. చురుకయిన ఒక సైనికోద్యోగి గేటుమీదుగా ఎక్కి లోపలకు దిగాడు. ఆ దిగడంలో అతని కోటుచివర గేటు ఊచల మొనలకు తగిలి చినిగిపోయింది. తాళం పగిలి కిందపడింది. తుప్పుపట్టిన బందులు కిర్రుమన్నాయి. సైనికులు ఉప్పెనలాగా ఒకరి పక్కన ఒకరు తుపాకులు గురిపెట్టి లోపలకు పరుగెత్తారు.

"పోట్లవాడే యుద్ధం!" అన్నాడు కొజుబాపక్కనే నిలబడ్డ ఒక నగరవాసి. ఈ మాటలు అతని నోటివెంట వెలువడ్డాయో లేదో చుట్టూచూసి మళ్ళీ నోరుమెదపలేదు.

ఒక సెకనుసేపు సద్దుఅణిగింది. భవంతిలో ఆదరాబాదరాగా కాల్పులు సాగాయి. ఆ తరవాత పేలుడు వినిపించింది.

"బాంబే నంటావా?" అని ఆ కార్మికుడు కొజుబాను చెవులో ప్రశ్నించాడు. కొజుబా కనిపించీ కనిపించకుండా తల పంకించాడు. రొట్టెలవాళ్ళ దగ్గర బాంబులు ఉన్నాయని అతనికి తెలుసు.

గందరగోళం, కాల్పులు సమసిపోయాయి. రొట్టెలదుకాణానికి ఎదురుగా ఉన్న భవనంలోనుంచి బొద్దుపాటి కలనల్ ఒకతను బయటకు వచ్చాడు. ఎద్దుమెడవంటిమెడ వంచి బెదురుతూ పైకప్పుకేసి చూసి ఆత్మవిశ్వాసంతో ముందుకు నడిచాడు. టోపీతీసి శీతాకాలమయినా చెమటపట్టిన బట్టతల తుడుచుకున్నాడు.

# 25

## చావు తప్పింది…

రొట్టెలదుకాణంలోనుంచి శవాలను బయటికి తీసుకువచ్చి' వేచిఉన్న సైనికశకటాలలో పడవేసారు. సైనికపంక్తిని తోసుకుంటూ జనం ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

"అరిదేవుడా! యెంతమంది! యెంతమంది!" అంటూ ఒక స్త్రీ వెక్కి వెక్కి-ఏడ్చింది. "నా జీవితంలో యెన్నడూ యింతమంది ఒక్కసారి చావగా చూడలేదు" అంది.

"కాస్త ఆగావంటె, యింకా చాలా చూస్తావు" అన్నాడు కొజుబా. "కార్మికులు పగతీర్చుకుంటారు. పూర్తిగా తీర్చుకుంటారు."

"అదిగో, చూడండి, యెవరో ఆడకూతురు!"

పోలీసులు ఒక బక్కపలాచటి మనిషిని మోసుకు వస్తున్నారు. మొఖం ఇరీనా జేబురుమాలాతో కప్పిఉంది. సందేహంలేదు. కొజుబా ఉండబట్టలేక, "ఆమెయే! అన్నాడు.

ఈ మాటలు పైకి వినిపించలేదు. కాని ఒక బరువాటి చేయి అతని బుజంమీాద పడింది,

"నీ స్నేహితులా?"

కొజుబా చుట్టూచూసాడు. పొడుగ్గా లావుగాఉన్న ఒక వ్యక్తి నిలబడిఉన్నాడు. మూతి మీసాలు, పక్కమీసాలు పోలీసులవాటిలా ఉన్నాయి. చాలీచాలని కోటు వేసుకున్నాడేమో గోనెసంచిలా వేలాడుతోంది. అతను రహస్య పోలీసుశాఖకు చెందిన వ్యక్తి అని స్పష్టమవుతూనేఉంది.

కొజుబా జవాబు చెప్పకముందే అతను ఈలవేసాడు. జనం కోపంతో భయంతో వెనకకు తగ్గారు. ఆ కార్మికుడు టోపీ వెనకకు

తోసుకుని ముభావంగా నడిచి వెళ్ళిపోయాడు. కొజుబా చుట్టూ జనం మూగారు. ఆ జనాన్ని ఎపుడూ అతను చూసి ఎరగడు. ఒకడు పిస్తోలు అతని మొగంమీదకు గురిపెట్టాడు.

"యిక్కడ, మమ్మల్ని వెళ్ళనీయండి."

చక్రబంధంలోని ఒక సైనికుడు పక్కకు తప్పుకున్నాడు. గుంపు చక్రబంధంలోనుంచి రొట్టెల దుకాణం వీధివాకిలి దగ్గరకు వెళ్ళింది.

"ఆగండి, ఆ శవాన్ని యెక్కించకండి..."

పోలీసులు ఆ శవాన్ని కాలిబాటమీదకు దింపారు. లావుపాటి కలనల్ పోలీసు ఉద్యోగి తొందర తొందరగా చెప్పిందంతా విని కొజుబాను బుజంమీద పొడిచాడు.

"గుర్తుపట్టావా ? యెవరామె ?"

"యేమిటి మీరు అంటున్నది?" అని కొజుబా చిరచిరలాడుతూ అడిగాడు.

ఆ మీసాలవ్యక్తి చేయి ఎత్తి టోపీ తాకి " 'ఆమెయే' అని యితడనడం నేను విన్నాను. అందువల్ల ఆమె యెవరో యితనికి తెలసే వుంటుంది. కావలసినంత సాక్ష్యం వుంది. యిదుగో..."

చాలామంది పోలీసు ఏజెంట్ల నక్కమొహాలు నలువైపులా కనిపించాయి.

" 'యితనికి తెలిసే, వుంటుంది' " అని కొజుబా ఆ పోలీసు ఉద్యోగి ఉచ్చారణను అనుకరిస్తూ అన్నాడు. "పురుషులను బయటికి మోసుకు వస్తున్నారు. హఠాత్తుగా ఒక స్త్రీ కనిపించింది. సహజంగా నాకు ఆశ్చర్యం వేసింది. పైఅధికారుల మెప్పు పొందడానికి మీరు యెంతో శ్రద్ధగా పని చేస్తున్నదీ తెలిపే అవకాశం చిక్కింది. యీ వ్యవహారంలో తెలివితేటలు వుపయోగించాలి. యెవరిని పట్టుకోవాలో కూడా తెలుసుకోవాలి"

"యింతకీ నువెవరివి ?" అని కలనల్ హేళనగా అడిగి చేయి చాచాడు. "రహదారి చీటీవుందా ?"

"ఆఁ–" అని కొజుబా ప్రశాంతంగా కోటు గుండీలు ఊడదీసాడు. "నికొలాయ్ నికిఫోరోవిచ్ కాష్కిన్, సెర్డొబన్స్క్ పౌరుడు."

కలనల్‌కు రహదారి చీటి ఇచ్చాడు. అతనూ వేలిమీద ఉమ్మి వేసుకుని రహదారి చీటిలోని పేజీలు తిప్పాడు. ముద్రా అదీసవ్యంగానే ఉన్నాయి.

"సరే, యీ రహదారిచీటీ నాదగ్గిర వుంచుకుంటాను" అన్నాడు కలనల్ తలఆడిస్తూ. "దర్యాప్తుచేస్తాం. ప్రస్తుతానికి నువు వెళ్ళొచ్చు." పోలీసులవైపు తిరిగి "కానీండి" అన్నాడు.

శవాన్ని నేలమీదనుంచి ఎత్తారు. సరిగ్గా అదేసమయంలో గుండెలు దూసుకుపోయే అరుపు వినిపించింది. వీధిలోని జనమంతా కంపించిపోయారు. మొహంమీద జేబురుమాలుతో ఉన్న శవం కనిపించింది, సన్నగా తెల్లగా ఉన్న చేతిని ఎత్తి తలమీద వేసుకుంది.

సైనికశకటానికి దగ్గిరలో ఉన్న జనం పరుగెత్తుకు పోయారు. కలనల్ ఆ భవనం సింహద్వారం దగ్గరకు వెళ్ళాడు.

కొజుబా ముందుకు ఉరికి,

"బ్రతికే వుంది" అన్నాడు.

జేబురుమాలు తొలగించుకునేసరికి మొహం కనిపించింది. నెత్తురు గడ్డకట్టడం మూలంగా జుట్టు పుర్రెకు అంటుకుపోయింది. మొహం గుండ్రడగా, బుంగగా, కమిలిపోయి ఉంది.

ఇరీనా కాదు. బహుశా రొట్టెలదుకాణంలో పనిచేసే మనిషయి ఉండవచ్చు.

ఆస్త్రీ లేచింది. నలువైపులనుంచీ ఆమెదగ్గరకు జనం పరుగెత్తుకు వెళ్ళారు. కొజుబా నాలుగడుగులు వెనుకకు వేసి, తిరిగి గట్టిగా అడుగులు వేసుకుంటూ చక్రబంధంలోనుంచి బయటకు వెళ్ళిపోయాడు.

"అయిపోయింది," అన్నాడు. "సజీవసమాధి తప్పింది–అంతే."

మొదటి మలుపుకు చేరుకుని కొజుబా ఎడమచేతి వేపుకు తిరిగాడు. గబగబా నడుస్తున్నవాడల్లా పరుగుచ్చుకున్నాడు. దూరాన ఒక మూలలో ఆ కార్మికుడు అతనికోసం కాచుకునిఉన్నాడు.

"అంత సాహసం యెందుకుచేసావు?" అని అడిగాడు మందలింపుగా తల ఆడిస్తూ.

"నేనేం కొయ్యబొమ్మననుకున్నావా?" అన్నాడు, కొజుబా కోపంతో. "వుచ్చారణ నేర్పింది. ఆమె మూలానే నాకు కళ్ళు తెరుపుడు పడ్డాయి. వూరుకోవడం అంత తేలికేంకాదు. ఆమెను చంపేసారనే అనుకున్నాను. చివరికి ఆమెకాదని తేలింది."

"ఆమెకాదా?" అని సంతోషంతో ఆ కార్మికుడు అరిచాడు, కొజుబా కోటు పట్టుకుంటూ. "ఆమెకాదా?"

"కాదు. కాని అరెస్టు చేసివుంటే చాలా ప్రమాదమే. కాల్పులు సాగించారంటే వురికంబం యెక్కిస్తారన్నమాటే తప్పదు."

ఆ కార్మికుడు వికటంగా నవ్వి. "అంత ధైర్యంచేస్తారా? తొందరలోనే పగతీర్చుకుంటాం. రొట్టెలవాళ్ళు రొట్టెలబదులు బాంబులు తయారుచేస్తుంటే...సరే, పద, యిక్కడ మనం కంచు విగ్రహాలలాగా నుంచోటం దేనికి!"

♦ ♦ ♦

మాట్లాడకుండా ఇద్దరూ కొంతసేపు నడిచారు.

"యెలా బయటపడగలిగావు?" అని ఆ కార్మికుడు అడిగాడు.

"పెద్ద చెప్పుకోదగినంత యేంలేదు" అన్నాడు కొజుబా కనుబొమలు ముడుచుకుంటూ. "రహదారి చీటి లాక్కున్నారు. ఊఁ—యింతకీ అది దొంగ చీటి. కొత్తది సంపాదించడం యెక్కువకాలం పట్టదు. కాని నాభార్య వూరుకోదు. మొన్ననే యిపుడున్న గదిలో ప్రవేశించామా, రేపు ఖాళీచేసి వెళ్ళిపోవాలి, అంతే."

# 26

## పబ్లిక్ ప్రాసిక్యూటరు

వినయవిధేయతలు ఉట్టిపడేటట్టుతొందర తొందరగా తాళంలో చెవి రెండు మారులు తిరిగింది. తలుపు కేసి చూడనక్కరలేకుండానే బామన్ ఎవరో ముఖ్యమయిన మనిషి చూడడానికి వస్తున్నాడని గ్రహించాడు. నిజం! బామన్ పొరబడలేదు. ఇంకా యవ్వనంలో ఉన్న ఆ వ్యక్తి యూనిఫారంమీద జనరల్ చిహ్నము, కుడిపక్షంమీద బంగారు మలాంచేసిన లిసిమ్‌చిహ్నము పెట్టుకున్నాడు. పొడుగ్గా అందంగా ఉన్నాడు.

వంగి నమస్కరించి సొగసుగా తలఊపాడు. జుట్టు నున్నగా దువ్వుకుని ఉన్నాడు,

"నేను న్యాయస్థానపు పబ్లిక్ ప్రాసిక్యూటరిని. దాదాపు పద్ధెనిమిది నెలలనుంచి నీ కేసు విచారిస్తున్నాం. యీ కాలమంతా నువ్వు యేకాంత నిర్బంధంలో వున్నావు...నిన్ను వచ్చి చూడడం నా విద్యుక్త ధర్మంగా భావించాను..."

పద్ధెనిమిది నెలలు! చాలాకాలమా? కొట్టులో ఒంటరిగా పడి ఉండడంవల్ల కాల పరిజ్ఞానమే బామన్‌కి పోయింది. గడియారం తీసి వేసుకున్నారు. గంటలకి గంటలు అనంతకాలంలో లీనమవుతున్నాయి. కొట్టులో సగం సగం చీకటి. ఎక్కడో ఎత్తునఉన్న కిటికీ గట్టిగా మూసేసారు. ఆకాశంకూడా కనిపించడంలేదు. ఇది రాత్రో మబ్బు పట్టిందో, వసంతకాలమో, శీతాకాలపు ఎండో ఎవరూ చెప్పలేరు. దీపం మాత్రం రాత్రింబవళ్ళూ వెలుగుతూండేది. వేళకి భోజనం పెట్టే

వారు. దానిని బట్టి ఇన్ని గంటలయిందని తెలుసుకోవడానికి ఆస్కారం చిక్కేది. కాని భోజనం ఒకేతీరున వుండడం మూలంగా కుంగదీసి విసుగెత్తింది. రోజులు లెక్కించడం కూడా బామన్ మానుకున్నాడు. వారాలకు వారాలు మనిషిమాట వినవచ్చేది కాదు. తన గొంతునే తను మరిచిపోయాడు బామన్. వార్డరుతో మాట్లాడేటపుడు అతని గొంతు నూతిలోనుంచి మాట్లాడుతున్నట్టు, బొంగురుగా, అసహ్యంగా ఉండేది. గోడమీద తట్టి సందేశం అందజేయడానికి ఆటంకాలు లేక పోయినా జవాబుమాత్రం వచ్చేదికాదు. వార్డరు కంతలోనుంచి చూసి పెద్దగా మందహాసం చేసేవాడు. ఈ జైలుకు వచ్చిన దగ్గరనుంచీ ఒక్క బంగీకూడా రాలేదు. అదృష్టవశాత్తు పుస్తకాలు తెచ్చుకోనిచ్చారు. ఈ కాస్త సదుపాయంకూడా హరించేయాలని అధికారులకు బుద్ధి పుట్టలేధు...

పద్ధెనిమిది నెలలనేనా అతను చెప్పింది!

బామన్ కదలకుండా మెదలకుండా కూర్చున్నాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు మేజాబల్ల దగ్గరకు వెళ్ళాడు. వార్డరు చప్పుడు చేయకుండా ఆయనగారికి కుర్చీ తెచ్చి వేసాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు కుర్చీలో కూర్చుని,

"నీ కేసు విషయంలో యేదో ఒక చర్య తీసుకోవలసిన సమయం ఆసన్నమయిందనుకుంటాను. ఈ యేకాంత నిర్బంధవాసం నీకు దుర్భరంగా వుండి వుంటుంది. నీ కేసు తేల్చకుండా అట్టే పెట్టేయడంలో మా తప్పు కొంతవుంది. నా ముందు పనిచేసిన పబ్లిక్ ప్రాసిక్యూటరుకు మీ భాషరాదు. వ్యవహారమంతా నేను సరిదిద్ద దలచాను. మానవులంగా మనం మాట్లాడుకుందాం." అన్నాడు. బామన్ బుజాలు ఎగరవేసి,

"మాట్లాడడానికి యేమీ లేదే!" అన్నాడు.

"ఆ ధోరణి యెందుకు?" అని పబ్లిక్ ప్రాసిక్యూటరు అడిగాడు సూచనాప్రాయంగా. "యిప్పటికే క్లిష్టంగా తయారయిన కేసును మరింత క్లిష్టంచేయడ మెందుకు?"

ఇలా చెప్పి పబ్లిక్ ప్రాసిక్యూటరు చేతి సంచీ తెరిచి చక్కగా మడతపెట్టిన ఊదాఫైలు తీసాడు. స్పష్టంగా కనిపించేటట్టు ఆలోచిస్తూ పుటలు తిరగవేయసాగాడు. బామన్ కనిపెట్టిచూసాడు.

అతని అరెస్టుకు పుట్టిన వారంటు! ఆ వారంటుతోనే అతనిని జైలుకు తీసుకువచ్చారు. పోలీసుశాఖ నివేదిక, 1904 జులై 2 న వేసిన ప్రశ్నలు, సమాధానాలు. ఇవీ అందులోని కాగితాలు.

"ఒక్కసారే ప్రశ్నించారు, అంతే. అదే ఆఖరుసారికూడా" అన్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటరు విచారంగా తల ఊపుతూ. పదిహేను నెలలలో! అలా యెందుకుచేసావు?"

"నేనా?"

ఆ పబ్లిక్ ప్రాసిక్యూటరు ఒక పత్రం చదవసాగాడు.

"...మాస్కోలో యెక్కడ నివసించిందీ, యెప్పుడు వచ్చిందీ చెప్పడానికి నిరాకరించాడు నేరం చేసిందీ లేనిదీ చెప్పడానికి నిరాకరించాడు. సాక్ష్యం యివ్వడానికే నిరాకరిచాడు? అంతే."

"అంతకంటె చెప్పవలసిందేమీ లేదనుకుంటా."

"యీ పరిస్థితులలో మేము దర్యాప్తు యెలా సాగించగలమని తలచావు? పత్రంమీద సంతకంకూడా పెట్టకపోతివి!"

"మీ దర్యాప్తులో నేను పాల్గొనదలచలేదు. సంతకం పెట్టితే అందులో పాల్గొన్నట్లే అవుతుంది."

"కాని యిందుమూలంగా నువు దుస్సహమయిన చిక్కులు తెచ్చిపెడుతున్నావని తెలుసుకోలేదా? నీ మొండిపట్టుదలతో కేసు ఒక కొలిక్కి రాకుండా చేస్తున్నావు"

బామన్ దీనికి జవాబీయలేదు. పబ్లిక్ ప్రాసిక్యూటరు పెదవి కొరుక్కొని ఊరుకోకుండా ఇంకా అన్నాడు:

"నీ ఎత్తుగడలు నీకే హానికలుగజేస్తాయి. నువు చెప్పినా చెప్పకపోయినా నీ విషయం-రెండో పార్టీ కాంగ్రెసులో, లీగు కాంగ్రెసులో, ఉత్తరబ్యూరోలో, మాస్కో కమిటీలో నువు నిర్వహించిన పాత్ర - సమస్తమూ మాకు తెలుసు. ఖచ్చితమయిన సమాచారం మాకు చేరింది. అందువల్ల, నీ సాక్ష్యం ఒక విధంగా నీకు సహాయపడుతుంది." పబ్లిక్ ప్రాసిక్యూటరు గొంతు మందగించింది. "జామీను మీద నిన్ను విడుదలచేయమని పెట్టుకున్న అర్జీ అంగీకరిస్తాను."

బామన్ కనుబొమలు కనిపించీ కనిపించకుండా ముడుచుకున్నాయి.

"నా విడుదలకు అర్జీ! యెవరు పెట్టారు?" పబ్లిక్ ప్రాసిక్యూటరు అతని కేసి చూడకుండా, "నీభార్య-నాడేజ్డా కాన్‌స్టాంటినోవ్నా." అని సమాధానమిచ్చాడు.

ఈ తడవ బామన్ కదలబారకుండా ఉండలేకపోయాడు.

"నాడేజ్డా కాన్‌స్టాంటినోవ్నా! యెలా? ఆమె, యిక్కడ, టాగాంకా జైల్లో వుందే, మరి..."

అంతటితో ఆగి ముఖం ముడుచుకున్నాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు అహంకారిపూరితంగా, నిర్దాక్షిణ్యంగా మందహాసంచేస్తూ అతని కేసి చూసాడు.

"నీకు తప్పుడు సమాచారం అందిం దనుకుంటాను. అవును. నిన్ను ఖచ్చితంగా యేకాంత నిర్బంధంలో వుంచారాయెను. నీ భార్యను వదలిపెట్టారు. జామీనుమీద వదలిపెట్టడం సాధ్యమయింది."

బామన్ కనుబొమలు ఇంకా గట్టిగా ముడుచుకొని,

"యెందుకని?" అని అడిగాడు.

పబ్లిక్ ప్రాసిక్యూటరు చేతులు కొద్దిగా కదిపి. "కారణాలున్నాయి" అన్నాడు.

"అంటే" అన్నాడు బామన్ మండిపడుతూ, "కుజ్మినా సాక్ష్యమిచ్చిందన్న మాటేనా?"

"నువు మొండి పట్టుదల వదల నంతవరకు చెప్పడం సాధ్యంకాదు. నేను నీకు అసలువిషయం తెలియజేసాను. అంతే." ముందుకు బాగా వంగి మెల్లగా చనువుగా అన్నాడు: "చట్టాన్ని అతిక్రమించి యెంత ఘోరతప్పిదం చేసినా వారిని మానవులగా చూస్తామని తెలియజేయడానికే నీకీ విషయం చెప్పాం. ప్రభుత్వానికి వ్యతిరేకంగా నేరం చేస్తే వుపేక్షించం. శిక్షించి తీరుతాం. కాని ఆ శిక్షను అమలు జరిపేటప్పుడు వారు నేరస్తులు మాత్రమే కాదు, మానవులుకూడా అనే విషయం జ్ఞాపకం పెట్టుకుంటాం. ఆ విధంగా మా విద్యుక్తధర్మం నెరవేరుస్తాం. అందుకనే నీ భార్యమీద ఘోరనేరం ఆపాదింపబడ్డా నీ కుటుంబం చిక్కుల్లో పడిందని తెలియగానే ఆమెను విడుదలచేసాం. యీ సమాచారం చెప్పి నీకు బాధ కలిగించదలచుకోలేదు. జైలులో కాస్తబాధ పెద్దగా తోస్తుంది - కాని నీ భార్య నాకు అధికారంయిచ్చింది...

కుటుంబంలో చిక్కులు! ఈయనగారికి నాడ్యా అధికారం ఇచ్చిందా? ఏమి టీపిచ్చిమాటలు! విసుగుతో బామన్ బుజాలు ఎగరవేసి,

"నాడెజ్డా కాన్‌స్టాంటినోవ్నాని వదలిపెట్టారనే నమ్మమంటారా? యింకా నాభార్యఅనే సిగ్గులేక యెలా చెప్పుకుంటోందో?"

పబ్లిక్ ప్రాసిక్యూటరు నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పు నిష్కపటమయిందిగానే తోచింది.

"ఊఁ - నీతో వ్యవహరించడం చెడ్డకష్టం. కాని నేను చెప్పింది రుజువు చేసుకోగలను. నీకు నీ ఆఁ-నాడెజ్డాకాన్స్టాంటినోవ్నా దస్తూరి గుర్తే అనుకుంటాను."

జేబులోనుంచి నీటుగా మడిచిన కాగితంతీసి, మడతవిప్పి, దూరాననుంచే బామన్‌కు చూపించాడు. బామన్ ఉద్రేకంతో చేయి చూచాడు. వంకరటింకరగా ఉండే నాడ్యా దస్తూరిని ఇట్టే గుర్తుపట్టాడు.

"ప్రియతమమైన కోల్యా,

"నేను విడుదలయినాను. కుటుంబ వ్యవహారాల విషయం మాత్రనే వ్రాయనిస్తున్నారు కాబట్టి వాటి విషయమే వ్రాస్తున్నాను.

నాన్నకి ప్రాణంమీదికి వచ్చింది. శస్త్రచికిత్స చేయించుకోబోతున్నారు. యేమవుతుందో చెప్పలేం. యిక్కడికి నువు వచ్చివుండడం చాలా అవసరం. మేము అలిసిపోయాం. మాకు తలకుమించిన పని అయిపోయింది. అమ్మ బాగా కులాసాగానేవుంది. చెంప కొద్దిగా వాచింది గాని పంటి చిగుళ్ళు గట్టిగానేవున్నాయి. అందుచేత నువు బెంగపెట్టుకో వలసిన పనిలేదు. నీ రాకకోసం యెంతగా యెదురుచూస్తున్నానో వర్ణించలేను. తిరిగిరావడానికి నువు చేయగలిగిందంతా చేయి.

ప్రేమతో, నాడ్యా."

బామన్ ఈ ఉత్తరం చదువుతున్నంతసేపూ పబ్లిక్ ప్రాసిక్యూటరు అతని ముఖ కవళికను పరీక్షగా చూసాడు.

"చూసావా, నేను కాసంతైనా అబద్ధమాడానేమో! నేను చెప్పిన హితవు నీభార్యకూడా బలపరుస్తోందనడంలో అతిశయోక్తి యేమీ లేదని నీకు తెలిసిపోయే వుంటుంది. 'నువు చేయగలిగిందంతా చేయి' అని వ్రాయడాన్నిబట్టి నువు తిరిగి వెళ్ళడం నీ కుటుంబానికి యెంతని అవసరమో ఆలోచించు." ఇలా చెప్పి జాగ్రతగా ఆ కాగితాన్ని బామన్ చేతిలోనుంచి తీసుకున్నాడు. "క్షమించు యీ కాగితం నీకు యిచ్చేయడానికి వీల్లేదు. యిందులో యేమీ లేకపోయినా గూఢార్థం యెంతవుందో యేం చెప్పగలం! నాడెజ్డా కాన్స్టాంటినోవ్నా నీ భార్య మాత్రమే కాదు. నీతోపాటు రాజకీయాలలో పనిచేస్తోందికూడా. రసాయనాలతో వ్రాసే రహస్య సాంకేతిక పద్ధతి పరిపక్వస్థితికి వచ్చింది. నీకు నేను వేరే చెప్పాలా?"

బామన్ ముభావంగా బుజాలు ఎగరవేసాడు.

"సరే, నీయిష్టం" అన్నాడు: "నాకు కావలసిందేమిటో తెలిసిపోయింది."

పబ్లిక్ ప్రాసిక్యూటరు ఒక క్షణం ఆగి చేతిసంచిని దగ్గరకు తీసుకుని,

"సరే, నికొలాయ్ యెర్నెస్టోవిచ్, యిక ప్రారంభిద్దామా? యిదేం నిర్బంధంకాదు. యెవో నాలుగుముక్కలు. నీవు లాంఛనాలను గుర్తించవు గాబట్టి సంతకంతో నిమిత్తం లేదు. ఆతరవాత స్వేచ్ఛ అనుభవించవచ్చు. నీ కుటుంబాన్ని తిరిగి కలుసుకోవచ్చు, సరేనా?"

చేతిసంచి తెరచి తెల్లకాగితం, బంగారపు రేకు వేసిన సిరాబుడ్డి పైకితీసాడు. బామన్ తిరిగీ పుస్తకం పట్టాడు గాని వేళ్ళు వణికాయి.

"రేపు-రేపు అధికారులద్వారా తెలియజేస్తాను" అని జవాబిచ్చాడు, కాసేపు ఆగి.

పబ్లిక్ ప్రాసిక్యూటరు పెదవులు విరుచుకున్నాడు. ఏదో చెప్పినట్లున్నాడు గాని బామన్‌కు వినిపించలేదు. తెల్లకాగితం, సిరాబుడ్డి సంచిలో తిరిగి పెట్టి గుమ్మంలోకి వెళ్ళిపోయాడు. తలుపు నిశ్శబ్దంగా తెరచుకుంది. వార్డరు గోడచాటునుంచి వింటున్నాడని స్పష్టంగా తెలుస్తూనే ఉంది. పబ్లిక్ ప్రాసిక్యూటరు గుమ్మంలో తచ్చాడి అన్నాడు:

"అందుకు నువ్వు తగవు. కాని నీ భార్యకి మాట యిచ్చాను." చేతి సంచిలోనుంచి చట్రంకట్టిన సీస్కీని మడోనా పటం తీసి బామన్‌కు అందిచ్చాడు. "యెలావుంది?" అని అడిగాడు బామన్ ఆశ్చర్యపోవడం గమనించి, మందహాసం చేస్తూ. "దేవతల పటాలు మాత్రమే లోపలి తీసుకు రావడానికి చట్టం అంగీకరిస్తుంది."

బామన్ మెడోనా పటం తీసుకున్నాడు. ఆ పటం చెంప మీద పబ్లిక్ ప్రాసిక్యూటరు కార్యాలయం ముద్ర ఊదారంగులో వేసి ఉంది.

# 27

## నాంది

పబ్లిక్ ప్రాసిక్యూటరు వెళ్ళిపోయాడు. సరిగా అదే సమయంలో వార్డరు కంతలోనుంచి చూసాడు. తేరపారజూసి, కళ్ళార్పి చకా బోయాడు.

♦ ♦ ♦

స్వేచ్ఛకావాలా? ఎంతకైనానా?

♦ ♦ ♦

మెడ్లోనావటం పంపించడంలో ఆంతర్యం ఏమిటి?

చట్రంలోని అట్టను చేతులతో తిప్పిచూసాడు. లావుగా గట్టిగా ఉంది. పరీక్షగాచూసి టపీమని నడవ మూలకువెళ్ళాడు. అది అతని 'మరుగుప్రదేశం.' కిటికీలోనుంచి చూసినా, కంతలోనుంచి చూచినా కనిపించదు. బాధాకరంగాఉన్నా గోళ్ళు చట్రంలోనికి పోనిచ్చి తొందరగా అట్ట ఊడదీసాడు. జాగ్రతగా వ్యవహరించాలనే విషయం విస్మరించి వాటిని పైకిలాగాడు. అది మూడు కాలాలలో అచ్చువేసిన కరపత్రం!

శ్రామికులారా!

♦ ♦ ♦ ♦

లెనిన్! ఆయనవద్దనుంచే, సందేహంలేదు' కాకపోతే ఎందుకు పంపుతారు?

బామన్ చేతులు వణికాయి. జీవితంలో ఎన్నడూ అంతగా అతను ఆందోళన చెందలేదు.

లెనిన్‌దగ్గరనుంచి! అంటే అంతా సవ్యంగానే ఉన్నదన్నమాట!

"సంపాదకీయం: రష్యన్ సోషల్ డెమాక్రాటిక్ కార్మికపక్షు మూడోకాంగ్రెసు ప్రకటన" కేంద్రకమిటీవారు సంతకాలు చేసారు. వెంటనే బామన్ లెనిన్‌మాటలు గుర్తించాడు. లెనిన్ వాడేమాటలు నిరాడంబరంగా, హృదయకుహరంలోకి చొచ్చుకుపోయే టట్లుంటాయి.

దీనిఅర్థం – విజయం. పార్టీలో లెనిన్ విజయం! తద్వారా విప్లవ విజయం!

బామన్ కళ్ళముందు చిన్న చిన్న అచ్చు అక్షరాలు నృత్యం చేసాయి. ఊపిరి పీల్చుకోవడం కష్ట మయింది. మళ్ళీ చదివాడు. అతని కళ్ళనే అతను నమ్మలేకపోయాడు.

"విప్లవం ప్రారంభమయి విస్తరించుకుంటూంది. కొత్త ప్రదేశాలకు, ప్రజానీకంలోని కొత్త తరగతులకు వ్యాపిస్తోంది. సాయుధ విప్లవశక్తులను నడిపించడానికి కార్మికవర్గం ముందు నిలబడింది."

బామన్ ఆ పంక్తులు చదివాడు. ఆతురతతో మళ్ళీ చదివాడు. ఆ మాటలలో మునిగిపోయాడు. ప్రతిమాటా అతనికి ధైర్యాన్నీ బలాన్నీ చేకూర్చింది.

తలుపుకంత తెరుచుకుంది. వార్డరు కొట్టు చూసాడు. కొట్టులో బామన్ కనిపించలేదు. ఖైదీ "మరుగు ప్రదేశం"లో ఉన్నాడు. ఆజ్ఞలకు వ్యతిరేకం. కాని ఇవాళ వార్డరు నిబంధనలను పాటించడం లేదు. కంత మూసివేసి చడీ చప్పుడూ చేయకుండా చక్కాబోయాడు.

బామన్ చదువుతూనే ఉన్నాడు:

"రష్యాలో పనిచేస్తున్న అధికసంఖ్యాక కమిటీలచేత, పార్టీ కేంద్ర కమిటీచేత మూడో కాంగ్రెసు సమావేశ పర్చడమైంది."

కేంద్ర కమిటీకూడా పాల్గొనక తప్పలేదన్నమాట!

"అన్ని కమిటీలకు, చెల్లాచెదరుగావున్న ముఠాలకు, రాష్ట్రాలలో అసంతృప్తితోవున్న ముఠాలకు, ఆహ్వానాలు పంపడమయింది. అన్ని కమిటీలు, అల్పసంఖ్యాకుల సంఘాలతోసహా అధికసంఖ్యాకులు తమతమ ప్రతినిధులను ఎన్నుకొని మూడో కాంగ్రెసుకు విదేశాలకు పంపినారు. నేటి పోలీసు పరిస్థితులలో అఖిలపక్ష కాంగ్రెసు జరపడానికి చేయతగినదంతా చేయడమయింది. ఇపుడు విదేశాలలో నివసిస్తున్న పూజీ పార్టీకౌన్సిల్ సభ్యులు పాల్గొన నిరాకరించడం మూలాగా పార్టీలోని అల్పసంఖ్యాకులు కాంగ్రెసును బహిష్కరిం

చారు. పార్టీలో చీలిక రావడానికి బాధ్యత ఈ ముగ్గురిదేనని మూడో కాంగ్రెసు ఆపాదిస్తూ ఈక్రింది తీర్మానం చేసింది.

ఆ ముగ్గురు సభ్యులు ప్లెఖనోవ్, మార్టోవ్, అక్సెల్రాడ్ లేనా? కావచ్చు! వారే అటువంటిపని చేసేది!

"మనపార్టీ వాడుకలోలేని పురాతనపు ఆర్థిక దృక్పథానికి దిగజారి అనుసరించడంలోని పొరపాటును మూడో కాంగ్రెసు గుర్తించింది. కాని అల్పసంఖ్యాకులందరి ఖచ్చితమయిన, నిర్దిష్టమయిన హక్కులకు హామీలను పార్టీ సృష్టించింది. ఈ హామీలను పార్టీ నిబంధనావళియే నిర్ణయిస్తుంది. అందలి సభ్యులు ఈ నిబంధనావళికి కట్టుబడిఉండాలి."

బామన్ ఇంకా ఇలా చదివాడు:

"ఈ సర్వసాధారణ, ప్రాథమిక కర్తవ్యాలనే గాక, నేటి విప్లవ కాలందృష్ట్యా స్వాతంత్ర్య యోధుడుగా, రాజరికానికివ్యతిరేకంగా సాయుధ తిరుగుబాటుకు అగ్రగామిగా సోషల్ డెమాక్రాటిక్ పార్టీ తనపాత్రను నిర్వహించవలసి ఉంది. ప్రజల స్వాతంత్ర్య సముపార్జనా యత్నాన్ని జారుప్రభుత్వం ప్రతిఘటించినకొద్దీ విప్లవతరంగం శక్తి ఇంకా బలీయమవుతుంది. కార్మికవర్గం నాయకత్వాన ప్రజాస్వామ్య శక్తుల సంపూర్ణ విజయం చేకూరే అవకాశం హెచ్చుతుంది. విప్లవాన్ని విజయవంతంగా కొనసాగించి, ఆ విజయాలను సంరక్షించుకునే కార్యభారం శ్రామిక వర్గ భుజస్కంధాలమీద పడుతుంది. ఆ విజయం విపత్తును తెచ్చిపెడుతుందని జోస్యం చెప్పేవారందరినీ అసహ్యంతో కూలదోస్తుంది. రష్యన్ శ్రామికవర్గం చివరిదాకా తన కర్తవ్యం ఎలా నిర్వహించాలో తెలుసుకుంటుంది. ప్రజల సాయుధ తిరుగుబాటును ఎలా నడిపించాలో కూడా తెలుసుకుంటుంది. తాత్కాలిక విప్లవ ప్రభుత్వంలో పాల్గొనే కార్యభారానికి వెనుకంజ వేయదు. విప్లవ ప్రతిఘాతక శక్తులను తిప్పికొట్టడం ఎలాగో, స్వాతంత్ర్య విరోధులను నిర్దాక్షిణ్యంగా అణచివేయడం ఎలాగో, రక్తం ధారపోసి అయినా ప్రజాస్వామ్య

రిపబ్లిక్‌ను రక్షించడం ఎలాగో, విప్లవంద్వారా మన కనీస కార్యక్రమాన్నంతనూ సాధించడం ఎలాగో తెలుసుకుంటుంది...రాబోయే విప్లవంలో విజయం సాధించితే మన సాంఘికలక్ష్యంవైపు గొప్పగా పురోగమించినవార మవుతాం. ప్రతీప సైనికశక్తుల పీడననుంచి యూరపును రక్షించినవార మవుతాం. బూర్జువా ప్రతీపశక్తులతో విసిగిపోయి, రష్యన్ విప్లవవిజయంవల్ల ఉత్సాహపూరితులై చైతన్యవంతులైన ప్రపంచ కార్మికులు ఎక్కువ వేగంతో, ఎక్కువ దృఢనిశ్చయంతో, ఎక్కువ ధైర్యంతో సోషలిజంవైపు పురోగమించడానికి సహాయపడినవార మవుతాం. యూరపులోని సోషలిస్టు శ్రామికవర్గ సహాయంతో ప్రజాస్వామ్య రిపబ్లిక్‌ను రక్షించుకో గలగడమే గాక జాంబవంతుని అంగలతో సోషలిజంవైపుకు పురోగమించగలుగుతాం.

"శ్రామేడ్ కార్మికులారా! ఐక్యంగా, దృఢంగా స్వాతంత్ర్య పోరాటం నడపడానికి సన్నిద్ధులయి ముందుకు పదండి!

"విప్లవం వర్ధిల్లుగాక!

"అంతర్జాతీయ విప్లవ సోషల్ డెమాక్రసీ వర్ధిల్లుగాక!

"ఆర్. యస్. డి. యల్. పి. కేంద్రకమిటీ"

థామస్ నడుంయెత్తి కూర్చున్నాడు.

ఇది వ్రాసిందెపుడు?

పత్రికమీద "జెనీవా, మే 27 (14), 1905" అని ఉంది.

మే! ఇది! సెప్టెంబరా? అక్టోబరా?

మొదటినుంచి చివరవరకు నాడ్యా జాబు విస్పష్టంగానే ఉంది. రసాయనాలుఉపయోగించవలసినఅవసరంకదు. ఏమవుతుందో చెప్పలేని 'శస్త్రచికిత్స' అని వ్రాసింది నాడ్యా. ఆ 'శస్త్రచికిత్స' అర్థం సాయుధ తిరుగుబాటే! స్పష్టమవుతూనే ఉంది. 'నాన్న' అంటే ఎవరో ఏ తెలివి తక్కువ దద్దమ్మ తప్ప అంతా ఊహించుకో గలుగుతారు. 'చిన్న నాన్న', 'నాన్న' అనేది జారిస్టు రష్యాలో యుగ యుగాలనుంచీ అర్జీదారులు వాడే గౌరవ వాచకాలు. ఇక వంగి వంగి సలాములు చేయబోవడం లేదు. చేత తుపాకి పట్టి పోరాడబోతున్నారు! 'శస్త్రచికిత్స' అనే మాటకు అర్థం ఇదీ.

కాని బాయన్ పోరాటంలో పాల్గొనడా? ఏమాత్రం అవకాశంవున్నా పాల్గొని తీరతాడు. 'తిరిగి రావడానికి చేయగలిగిందంతా చేయి' అని వ్రాసింది నాడ్యా...

"తలకుమించిన పనివుంది." తిరుగుబాటే గనక సర్వసాధారణమయిపోతే ఏం జరుగుతుందీ అతను ఊహించగలడు. ప్రతి ఒక్కరి అవసరమూ కలుగుతుంది. అప్పటికీ వారు చాలకపోవచ్చు. నిజం, 'అమ్మ' కులాసాగానే ఉంది. మాస్కో కమిటీ రహస్యపు పేరు 'అమ్మ' అమ్మ కులాసాగా ఉన్నదంటే పోలీసుల దెబ్బనుంచి కాచుకొన్నదన్నమాట. 'పంటి చిగుళ్ళు' అంటే కొజుబా. 'కనీసం' అంటే లెల్యా. 'కనీసం' విడుదలయింది. బలే! 'కనీసం' బాగా పనిచేసే మనిషి. ఈరోజులలో కొజుబా అమూల్యమయినవాడు. మాస్కోవాసి కార్మిక వర్గంలో పుట్టిన నిజమైన శ్రామికుడు. అన్ని పార్టీలతో అతనికి సంబంధాలు ఉన్నాయి. కార్మికులలో చాలా పలుకుబడిగలవాడు. కాని ప్రత్యక్ష చర్యకు దిగేటపుడు చివరి మనిషివరకూ అందిరినీ సమీకరించవలసిందే. లెనిన్ చెప్పినట్టు, "వుపయోగించగలిగిన ప్రతి మనిషినీ వుపయోగించాలి." ఏమయినాసరే జైలులోనుంచి బయటపడవలసిందే!

  

వార్డరు తిరిగీ కంతలోనుంచిచూసి నిశ్చింతగా వెళ్ళిపోయాడు. ఖైదీ పుస్తకం తెరిచి చేతితో పట్టుకుని కూర్చున్నాడు.

పత్రికను చుట్టచుట్టి చొక్కాలో దాచేసాడు. 'మనుగుస్థలంలో' మెడోనా బొమ్మ ముక్కలు ముక్కలై పడిఉంది.

ఏమయినాసరే! కాని సహజంగా వాఙ్మూలం ఇమ్మని దాని అర్థం కాదు. నాడ్యా జాబు వ్రాసేటపుడు 'ఇంటిదగ్గరివారు' అలా ఉద్దేశించి ఉండరు. అది తప్ప ఇంకేవిధంగా నయినాసరే.

తప్పించుకోవడం అసంభవం! ఎవరికంటా పడకుండా కొట్టులోనుంచి బయటికి వెళ్ళడం సాధ్యంకాదు. చేతిలో ఏమీ లేకుండా ఇద్దరు

మిలిటరీ పహారావారినీ, డజను తాళాలను ఎదుర్కోవడం ఎలా? అటువంటి ఆలోచనే పిచ్చి ఆలోచన! కోర్టు మూడో అంతస్తులో ఉంది. మెట్లమీదుగా గాని, కప్పుమీదుగా గాని తప్పించుకు వెళ్ళడానికి వీలు లేదు.

అందుచేత ఆలోచించవలసిందేమీ లేదు. చేయగలిగిందల్లా ఒకటే :

నిరహారదీక్ష!

నిరహారదీక్ష పూనితే జామీనుమీద విడుదల చేయడం తప్పనిసరి అవుతుంది.



బహుశా నాడ్యా ఉద్దేశం ఇదే అయి ఉంటుంది. నిరహారదీక్ష అంటేనే చావుకయినాసరే తెగించి యత్నించడం. ఈ మృత్యుభయం ఒకదానిమూలంగానే నిరహారదీక్ష బలీయమైన ఆయుధంగా ఉపయోగపడుతుంది. చివరివరకూ నిరహారదీక్ష విడవకుండా సాగిస్తానని విస్పష్టం చేయకపోతే ఎన్నటికీ జైలునుంచి విడుదల చేయరు. అవును, ప్రాణం పోయేవరకు పోరాడవలసిందే! నిరహారదీక్ష బలీయమయిన ఆయుధం!

బామన్ కోర్టులో పచారు చేయసాగాడు. మేజాబల్ల దగ్గర నుంచి గుమ్మంవరకు మూడు అంగలు వేయడం. వెనుకకు తిరగడం. మళ్ళీ మూడు అంగలు.

మృత్యువు! ఛత్! అతనికి వైద్యశాస్త్రం తెలుసు!

నిరాహార దీక్షాకాలంలో ప్రాణాపాయం కలిగిందంటే అది వారి ఇచ్ఛాపూర్వకమైందే. సరిగ్గా చెప్పాలంటే మనోబలం లేకపోవడంవల్లనే. జీవించాలనే ఇచ్ఛ లేకనే. అటువంటపుడు కొద్దిరోజులలోనే చనిపోతాడు. చనిపోవడానికి కారణం మాంసకృత్తుల కొరత కాదు, మనోబలం కొరత. నిజంగా ప్రాణంతో ఉన్న శరీరం అంత

తేలికగా క్షీణించిపోదు. అంతగా క్షీణించిపోవాలంటే బరువులో నూటికి యాభై అరవైపాళ్ళు తగ్గిపోవాలి. జాగ్రతగా గనక బలాన్ని కూడగట్టుకుంటే క్షీణించిపోవడానికి రెండుమూడు నెలలు పట్టుతుంది. విద్యార్థిదశలో జీర్ణక్రియా సూత్రాలను చదివాడేమో ఇదంతా జ్ఞాపకం వచ్చింది. సూత్రాలు జ్ఞాపకం రాలేదు. కాని రోజుకు ఒక కిలోగ్రాం బరువు తగ్గాలంటే ఇరవైయేడు ముప్ఫయి కలోరీల వేడిమి నష్టం కావాలనేదిమాత్రం అతనికి బాగా జ్ఞాపకం. మధ్యరకం బరువు గల మనిషికి ప్రాణాపాయం కలిగించే బరువు నష్టంకావడం రెండు నెలల తరవాతగాని ప్రారంభం కాదు. అవసరమైనంత మనోబలం ఉంటే-ఉంది.

బామన్ కొట్టులో పచార్లు చేస్తునే ఉన్నాడు. మూడుఅంగలు వేయడం, వెనుకకు తిరగడం, మళ్ళీ మూడుఅంగలు వేయడం, ఇదీ వరస! తిరిగీ తలుపుకంత తెరుచుకుంది.

రెండునెలలు, ఉపవాసాలమూలంగా చనిపోతాననే భయం అతనికి లేదు. బయటి ప్రపంచంలోని మిత్రులు పరిస్థితిని అంతకాలం దాకా సాగనివ్వరు.

అధికారులు లొంగిరావడానికి అవసరమయిన కొద్దిరోజుల వ్యవధి (ఎన్నిరోజులో ముందుగా చెప్పలేం) ఇస్తారనికూడా నమ్మకంలేదు. నిరహారదీక్ష పూనేది అతడొకడేకాదు, నిజం. ఈవార్త జైలు నాలుగుమూలలా వ్యాపించగానే కామ్రేడ్స్ బలపరుస్తారు. అధికారులకు తొందర గలుగుతుంది. కిందటి అకురాలు కాలంలో స్థానిక 'టాగాంకా' బోల్షివిక్కులు నిరహారదీక్షపూనారు. ఈ సంఘటన అతనిని ఏకాంత నిర్బంధంలో పెట్టేముందు జరిగింది. పదకొండో రోజున అధికారులు లొంగివచ్చి సదుపాయాలు కలగజేసారు. సంఘటనలు చకచకా జరుగుతున్నాయంటే పబ్లిక్ ప్రాసిక్యూటరు ఇంకా ముందే లొంగిరావాలి. వారు మొదటి తడవ నిరాహారదీక్ష పూనినపుడు పరిస్థితి ప్రశాంతంగాఉంది.

బామన్ నిరాహారదీక్ష సాగించవలసిందనే నిర్ణయానికి వచ్చాడు.

# 28

# సర్వవ్యాపితసమ్మె

క్రాస్నాయా్రెస్న్యా జిల్లాలోని ్రెడ్నే - టిమిన్‌స్కీ వీధిలో ఒక ఇంటి మూడవ అంతస్తులోని రెండు చిన్నగదులలో సంభాషణ హోరెత్తిపోతోంది. దేశవాళీ పొగాకు పొగమబ్బులు దట్టంగా వ్యాపించాయి. 'తళతళామెరిసే' బ్రౌనింగు రివాల్వర్లు వరసగా పేర్చిన ఒక పెట్టెముందు నిలబడి కొజుబా తీవ్రంగా వాదిస్తున్న ఒక కార్మికుని ఒప్పించాలని చూస్తున్నాడు ఆ కార్మికుడు బక్కపలచగా ఉన్నాడు. దుబ్బుతల.

"మాస్కోలోవున్నది మీ ఫాక్టరీ వకటేకాదు అనే విషయం అర్థంచేసుకో."

"ఒకటే కాదంటావా?" అన్నాడు ఆ కార్మికుడు బిగ్గరగా, కోపం తెచ్చుకుని. "నేను ప్రొఖొరోవ్ మిల్లు సంగతి మాట్లాడుతున్నానని బహుశా నీవు గ్రహించివుండవు. నీదేంపోయింది? మాలో అయిదువందలమంది అపుడే సంతకాలు పెట్టారు. తుపాకులు యిచ్చి చూడు, యింకా వెయ్యిమంది చేరతారు."

"మాస్కో అంతటికీ కలిపి మొత్తం నాకు ముట్టిందల్లా నూటయాభై రివాల్వర్లేనని చెపితే గ్రహింపులేదేం? మీ ఫాక్టరీ ఒక్కదానికే రెండు వందలు యిమ్మని కూర్చుంటే యెక్కడనించితేను? ముప్ఫయి యిస్తాను పుచ్చుకో, యిక వాదన కట్టిపెట్టేదాం."

ఇంకా రెండుగొంతులు కొజుబాను బలపర్చాయి.

"మమ్మల్ని ఆపకు సెమ్యాన్! యీపాటికి కొజుబాను అర్థంచేసుకునే వుంటావు చెప్పినంతా చేస్తాడు. అదిగాకపోయినా తుపాకుల విషయంలో తక్కిన జిల్లాలకంటె మీజిల్లా చాలా మెరుగు. ష్మిడ్ట్

యంత్రాగార దళానికున్న ఆయుధాలు చూడు. యిక మా జమో స్క్వోరెచీ జిల్లా...

"ప్రిమెడ్ యంత్రాగారదళం వాళ్ళసంగతి వేరు, మాసంగతి వేరు" అని జవాబిచ్చాడు ప్రొఖోరోవ్ మిల్లు కార్మికుడు. "రాత్రంతా వాళ్ళు పోరాడితే, మేము వట్టి తూటాలు యేరుకోవాలనా మీ వుద్దేశం? కనీసం అరవైఅన్నా ఇయి కోజుబా! నువ్వూ ప్రొఖోరోవ్ మిల్లుకు చెందినవాడివేగదా! మాకు మద్దతు యివ్వకపోతే యెలా చెప్పూ? యే మొహం పెట్టుకుని ముప్ఫయిరివాల్వర్లతో ఫాక్టరీకి వెళ్ళను? నవ్వుతారు!"

"అందాకా రాదులే" అంటూ కోజుబా నవ్వి రివాల్వర్లు లెక్క పెట్టసాగాడు. "...యిరవైయెనిమిది, యిరవైతొమ్మిది, ముప్ఫయి. యిక యేమాత్రం కాలయాపన చెయ్యకు. ప్రతినిమిషం విలువయిందే."

ఇంతలో తలుపు తెరుచుకుని ఒక యువతి గబగబా లోపలికి వచ్చింది. తలమీద, బుజాలమీద మందక ఉన్ని శాలువ ధరించింది

"గట్టిపట్టుపట్టండి" ఆఖరి రైలుమార్గం, ఫిన్లండు రైలుమార్గం బందయిపోయింది. అంటే యిక రైల్వేలో సర్వవ్యాపితసమ్మె అన్న మాటే! యిదంతా దేనికి దారితీస్తుందో తెలుసా? "శాలువా కింద నుంచి ప్రకటన కాగితాల బొత్తితీసి బల్లమీద పడవేసింది." మాస్కో కమిటీనుంచి యిప్పుడే బయటికి వచ్చాయి. ఇంకా సిరా అన్నా ఆర లేదు."

కోజుబా తక్కినవారికి కనుగీటి చిరునవ్వునవ్వాడు.

"ఆ మీసం యెక్కడినుంచి వచ్చిందో ఆశ్చర్యంగావుందే, కామ్రేడ్ యిరీనా!"

ఇరీనా మొహం ముడుచుకుంది. అంతా నవ్వారు.

"మొహమంతా అలుముకుంది. రొట్టెలవాళ్ళుగాదు, పొగ గొట్టం శుభ్రంచేసే పనివాళ్ళు నిన్ను తమ సమ్మె ప్రతినిధిగా యెన్నుకుంటారు. ఆ అద్దంలో చూచుకో. అదిగో, ఆ గోడనివుంది బలే బాగున్నావులే!"

ఇంతలో కరపత్రాలు చేతులు మారుతున్నాయి.

'రష్యన్ సోషల్ డెమ్కాక్రాటిక్ లేబరు పార్టీ

ప్రపంచ కార్మికు లారా, ఏకంకండి!

సర్వవ్యాపితమ్మె,

"కామ్రేడ్స్! కార్మికవర్గం పోరాటం లేవదీసింది. సగం మాస్కో సమ్మెచేస్తోంది. త్వరలోనే బహుశా రష్యాఅంతటా సమ్మె సాగుతుంది. యుగయుగాల నిర్బంధ నిరంకుశ బంధనాలను తెంచుకోవడానికి ఉవ్వెత్తున కార్మికవర్గం లేచింది. దోపిడీదొంగలయిన జారిస్టు రాజరికంమీద కార్మికవర్గం ఆమరణాంత యుద్ధం ప్రకటించింది. వారి దారిద్ర్యానికి కారణభూతులైన పెట్టుబడిదారులమీద కూడా యుద్ధం ప్రకటించింది. శ్రామికహృదయంగల ప్రతివ్యక్తీ ఈ సుముహూర్తంలో పోరాటంలో చేరిపోవాలి. మనతో కలవనివారు మనకు వ్యతిరేకులే. ఈరోజున పోరాటంలో చేరకుండా కాలం వ్యర్థపుచ్చేవారు కార్మిక ప్రయోజనాలకు ద్రోహంచేసినవా రవుతారు.

"ఆఖరిమనిషివరకూ సమ్మెలో చేరండి. వీధులలోకి వచ్చి మా సమావేశాలకు హాజరుకండి. ఈ క్రిందికోరికలను ముందుకు తీసుకురండి: ఆర్థిక సదుపాయాలు, రాజకీయ స్వేచ్ఛ; వాక్స్వాతంత్ర్యం, వ్యక్తి స్వాతంత్ర్యం, సమావేశ స్వాతంత్ర్యం, సంఘనిర్మాణ స్వాతంత్ర్యం; రహస్య ఎన్నికలద్వారా సార్వజనీన ప్రత్యక్షసమాన ఓటు ప్రాతిపదిక మీద ప్రజా రాజ్యాంగనిర్మాణ సభను సమావేశపర్చే హక్కు."

కొజుబా అంగీకారసూచకంగా గుర్రుమన్నాడు. "బలేబాగుంది!"

"అవును, బలేబాగుంది" అంది ఇరీనా జడలు ఎగరవేసుకుంటూ. "యిదంతా రోటరీ ప్రెస్సు పని! మనకు కావలసినన్ని యంత్రాలు వుండడం యెంత అద్భుతంగా వుంటుందో వూహించుకో. నాలుగేళ్ళక్రితం నేను అచ్చువేయడానికి యెంత శ్రమపడవలసి వచ్చిందో జ్ఞాపకంచేసుకో... అపుడు మనకున్నదల్లా అట్టచట్రం, మేకుతోగుచ్చిన స్టెన్సిలు! యిపుడు మనకి వుక్కురోలర్లు లభించాయి. అచ్చుయంత్రం యెలా జుమ్మని మోగుతుందో వినితీరాలి. బలే! యిక దానిశక్తి! యీకరపత్రాలు సిటిన్ అచ్చు ఆఫీసులో అచ్చయినాయి...

"యేమిటీ, సిటిన్ అచ్చు ఆఫీసు తీసుకున్నావా? భారీయెత్తున పనిచేయాలే!"

"అవును," అంటూ నవ్వింది ఇరీనా. కార్మిక దళాలకు చెందిన సాయుధులైన యువకులు సింహద్వారానికి, యంత్రాలకు టెలిఫోనులకు కాపలా కాస్తున్నారు. అచ్చు ఆఫీసు యజమానిని, మేనేజరును అరెస్టు చేశారు. యెలాగో ఒక గూఢచారి కార్మికుడుగా తయారై పనిలో చేరాడు. కాని వెంటనే వాడిని గుర్తుపట్టేసారు. వాడి గుట్టు తెలుసుకున్నామనే వుద్రేకంలోవాడిని అచ్చు యంత్రంలోకి తోసేసేయడానికి సిద్ధమయారు."

"మంచిపని చేసాడు" అన్నారెవరో భావయుక్తంగా. కాని తక్కినవారు అతనితో ఏకీభవించలేదు.

"అంతగొడవ యెందుకు నెత్తిమీద ఒక్కటి కొడితే తీరిపోతుంది!"

ఇరీనా తల పంకించింది.

"వాళ్ళు అదీ సూచించారు. కాని యెక్కువమంది వాడిని చంపి చేతులు కల్మషం చేసుకోకూడదని నిర్ణయించారు."

గదిలో గుసగుసలు సాగాయి.

"వాడిని స్వేచ్ఛగా వదిలివేసారా యేం?"

"ఉహుం—" అంది ఇరీనా వారిని శాంతపరుస్తూ. "అచ్చు ఆఫీసులో చేతికి దొరికిన రంగులు వాడి వంటినిండా పట్టించాం. విషయం విస్పష్టం చేయడానికి వాడి యెదుర్రొమ్ముమీద, వీపుమీద, నొష్టమీద, 'గూఢచారి' అని పెద్ద పెద్ద అక్షరాలలో రాసాం."

"మంచిపని చేసారు" అంటూ కొజుబా తన సమ్మతి తెలిపాడు. "వంటిమీద అటువంటి ముద్రవుంటే యింటిదాకా వెళ్ళగలిగాడా అని అనుమానం. అచ్చుఆఫీసు రంగులు తుడిచివేసుకోవడం తేలికకాదు. నీమీసం...న్యూరాదగ్గిరికి వెళ్ళు. కిరసనాయిలు యిస్తుంది. అది రాసుకున్నావంటే మళ్ళీ నీమొహానికి పూర్వపు అందం వస్తుంది యిక మురికీ గిరికీ పనికిరాదు. విప్లవం వచ్చేసింది గదూ!"

# 29

# ఓడినవారిదే గెలుపు

“విప్లవం?”

కోపంతో పరుషంగాసాగుతున్న గుసగుసలలో నిరాశ అంకురించింది. మాస్కో-గవర్నర్ జనరల్ అడ్మిరల్ డుబసోవ్ వైభోగంగా తివాసీలు పరిచిన చదువులగదిమధ్య జేబులలో చేతులు పెట్టుకుని నిలబడ్డాడు. బిరుతుగా బిఱుసుగా తెల్లగా ఉన్న మెడపట్టీలోకి కండ పట్టిన మెడ దించుకుపోయింది. రెండు రాబందుల బంగారు భుజకీర్తులు తళతళా మెరుస్తున్నాయి. కోపంతో వాటిని ఎత్తి,

“విప్లవం? యేంమాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా? సూపరింటెండెంట్!” అని అడిగాడు.

ఆ చిలకముక్కు సూపరింటెండెంటు కొద్దిగా వణికిపోయి వెండి పూత అంచుల బూడిదరంగు హాటు ఇంకా గట్టిగా ఒడిసిపట్టాడు.

“సరిగ్గా అంతే యువర్ ఎక్సలెన్సీ! ఒక్క మాస్కోలోనే అయితే తిరుగుబాటు అని పేరు పెట్టేవాళ్ళం. కాని రష్యాఅంతటా జరుగుతోందాయె! రైలుమార్గాలు బందయిపోయాయి. టెలిగ్రాఫు ఆఫీసులు పనిచేయడంలేదు. ఫాక్టరీలు ఆడడంలేదు. దీపాలు వెలగడం లేదు. మనకు తెలియకుండానే యెపుడో కొళాయిలుకూడా బందవుతాయి. మందులదుకాణాలు మూసేసారు. పీటర్స్‌బర్గ్ ఇంపీరియల్ బాలే (నాట్యశాల) వాళ్ళుకూడా సమ్మెలో చేరారు...”

“అంతేకాదు రాజధానీ సంగీత సమాజంకూడా” అని మెల్లిగా నత్తుతూ ఒక గొంతు వినిపించింది.

ఒకవృద్ధు పడక కుర్చీలో కూర్చుని గడ్డం ఆడించాడు. అతను పొట్టివాడు. తల అక్కడక్కడా నెరిసింది. కారు కెంపురంగు అంగీ

తొడిగాడు. కుర్చీలో కూచున్నదల్లా ఇతనొకడే. తక్కిన ఆరు ఏడుగురు డుబసోవ్ పెద్ద దేవదారు వ్రాతబల్లముందు నుంచి లేవగానే లేచి నిలబడ్డారు. ఆ బల్లమీద వెండి వ్రాత పరికరా లున్నాయి.

"అందువల్ల" అన్నాడు అడ్మిరల్ దృష్టి పోలీసు సూపరింటెండెంటు నుంచి ఆర్చిబిషప్పుమీదకు మళ్ళిస్తూ, "నగర భద్రతకు నువ్వు పూచీ వహించలేవని తెలుస్తుంది. అంతేనా? పోలీసులు పరిస్థితిని యెదుర్కొనే స్థితిలోవున్నారా లేదా? నిర్మొహమాటంగా చెప్పు."

బూడిదరంగు హాటును అదేపనిగా నలిపేసరికి బంతిలా తయారయింది. పోలీసు సూపరింటెండెంటు గట్టిగా జవాబిచ్చాడు.

"కాదు, యువర్ యెక్సలెన్సీ! యినస్పెక్టరు ఆజ్ఞలను పాటించడానికిగాను పోలీసులందరూ వీధుల్లోనించి వచ్చేసి స్టేషన్లలో గుమిగూడాలని నేను ఆదేశా లివ్వక తప్పిందికాదు. వీధులలో పోలీసులకు భద్రతలేదు. అందులోనూ ఒంటరిగా తిరుగుతూంటే అసలు భద్రత వుండదు. మన పోలీసులను జనం నిరాయుధుల్ని చేసిన ఘటనలు..."

"నీపోలీసుల్ని నిరాయుధుల్ని చేసారా?" అంటూ ఆడ్మిరల్ కళ్ళు కుంచించుకున్నాడు." నిరాయుధుల్ని చేయనిచ్చారన్నమాట! అంతేనా?"

సూపరింటెండెంటు దృష్టి క్రిందికివాల్చి.

"అంతకంటె మరీయెక్కువవాళ్ళదగ్గరనించి ఆశించలేం. జీతం కొద్ది. మంత్రిగారికి యెన్నిసార్లు విన్నవించుకున్నారో లెక్కలేదు. మనం వాళ్ళకి చాలా స్వల్పజీతం యిస్తున్నామని అంగీకరించక తప్పదు. అంత స్వల్పజీతాలకోసమని ప్రాణాలు పోగొట్టుకోడానికి వాళ్ళు సిద్ధంకారు."

"అయితే మాతృభూమి సంగతేమిటి?" అని డుబసోవ్ గర్జించాడు. బూడిదరంగుజుట్టుకింది చర్మం ఊదారంగు దాల్చింది. కణతలు ఎరుపెక్కాయి. "స్వామిభక్తిప్రమాణం సంగతేమిటి? అవసరమైతే చచ్చిపోవడం స్వామిభక్తి పరాయణుల విద్యుక్తధర్మం, సూపరింటెండెంట్! నీవాదనవుందే రష్యన్లకి కొత్తగా వుంటుంది. అందులోను నీబోటి అధికారే అలా వాదిస్తే? ప్రస్తుతానికి దీనికి పేరు పెట్టడం నా కిష్టం

లేదు గాని నిన్ను హెచ్చరించడం నా కర్తవ్యమని భావిస్తున్నాను...”
తక్కినవారివైపు తిరిగి అన్నాడు :

“మీరుకూడా విన్నందువల్ల హానేమీలేదు. దేశీయశాఖా మంత్రిగారి దగ్గిరనుంచి నాకొక రహస్యతంతి వచ్చింది. అదృష్టవశాత్తూ సైనిక తంతివార్తలు నడుస్తున్నాయి. సమ్మెదారులు దీని విషయం మరిచేపోయారో లేకపోతే అసలు దీని విషయమే వాళ్ళకి తెలియదో!”

జనరల్స్ అందరూ ఒకరిమొహాలు ఒకరు చూచుకున్నారు. దుబసోవ్ మెల్లగా అడుగులు వేసుకుంటూ వ్రాతబల్ల దగ్గరకు వెళ్ళి, కాగితాల బొత్తిమీదనుంచి ఒక తంతి తీసాడు!

“తిరుగుబాటును పూర్తిగా అణచివేయడానికిగాను గట్టిగా, దృఢనిశ్చయంతో, తటపటాయించకుండా కనికారంలేకుండా చర్యలు తీసుకోండి.”

దుబసోవ్ ఆగి, మాటమాటా ఒత్తిఒత్తిపలుకుతూ మళ్ళీ చదవసాగాడు.

“తిరుగుబాటుకు యేవిధంగా సహాయంచేసినా, తిరుగుబాటుదార్లకు ఆశ్రయం యిచ్చినా, సానుభూతి చూపినా, బలహీనత వెల్లడించినా, అటువంటి ప్రభుత్వోద్యోగులను తక్షణమే వారి పనులనుంచి తొలగించండి...” అడ్మిరల్ వెంటనే సూపరింటెండెంటుకేసి తలఎత్తి చూసి ఇంకా ఒత్తి ఒత్తి చదవసాగాడు.

“...తిరుగుబాటుదారులయెడ కనికరంగాని సహనంగాని వహించినా, వినిపించిందా?”

ఆ తంతికాగితం మడిచిపెట్టాడు.

“యిక మాస్కో వ్యవహారాలకు మళ్ళుదాం. పోలీసులు యేవిధంగానూ పనిచేయడంలేదు. యీముక్కే పైకిరాసి పంపనా?”

పోలీసు సూపరింటెండెంటు సమాధాన మివ్వలేదు. దుబసోవ్ మడమమీద గిర్రున తిరిగి వ్రాతబల్ల ప్రక్కన నిలబడ్డ ఒక పొడుగాటి జనరల్‌ను సంబోధిస్తూ,

“యిక సైన్యంసంగ తేమిటి?” అని హఠాత్తుగా ప్రశ్నించాడు.

ఆ జనరల్ మెల్లమెల్లగా తలఎత్తాడు.

"కోసక్కులమీద, అశ్వికదళంమీద అందులోనూ ముఖ్యంగా సమిస్కీదళంమీద మనం ఆధారపడచ్చు. కాల్బలం విషయం నేను చెప్పలేను. రోస్లోవ్ పటాలంలో అశాంతి వుందని మాత్రం స్పష్టంగా చెప్పగలను."

"అలానా?" అంటూ దీర్ఘాలు తీసాడు డుబసోవ్. "కాల్బలం కూడా తల పైకెత్తుతోందన్నమాట! చర్యలు తీసుకున్నావా?"

"అంతా, చేయతగిందంతా చేసాను" అంటూ ఆ జనరల్ తొందర తొందరగా చెప్పాడు తలవంకిస్తూ. "వాళ్ళని బారకాసులలోనే వుంచేసాం. శెలవులు రద్దుచేసాం. యెవరినీ గేటుదాటి బయటికి వెళ్ళనీయడంలేదు. యిద్దరు యిద్దరు చొప్పున కాపలామనుష్యుల్ని పెట్టాం. శిక్షణ పొందుతున్న దళాలవారికి యుద్ధసామాగ్రి సచులు అంద చేసాం. వారిమీద ఆధారపడచ్చు, ఆ పోలీసు ఆఫీసర్లు అందరూ వారి వారి దళాలను ఒక్క నిమిషంకూడా విడిచి వుండడంలేదు. వాళ్ళ అభిమానం చూరగొనడానికి చనువుగా మాట్లాడమనీ, సొగటాల ఆట కూడా ఆడమనీ ఆజ్ఞలు జారీచేసాను."

ఆడ్మిరల్ వేళాకోళంగా భారీగా మందహాసం చేసాడు. పళ్లు బైటపడ్డాయి.

"సరే మంచిది...ఆడుకున్నారా? మామూలు ఆట కాకుండా 'ఓడినవాడిదే గెలుపు' ఆడాలని వారికి వివరించి చెప్పావా?"

ఆ జనరల్‌కి ఇదంతా ఏమీ అర్ధంకాలేదు. బూడిదరంగు కనురెప్పవెంట్రుకలు కదలాడాయి. కాని తక్కినవారందరికీ గాబరా ఎత్తింది. వారందరిలోకీ చిన్నవాడూ, పబ్లిక్ ప్రాసిక్యూటరూ యూనిఫారం ఎదుర్రొమ్ముమీద లిసియం చిహ్నం ధరించినవాడు దీర్ఘాలు తీస్తూ,

"కాస్త విశదంగా చెప్పండి. దేశీయశాఖా మంత్రిగారి తంతిలో గట్టిచర్యలు తీసుకోవలసిందనివుంది జనరల్ మైషోవ్ దైనందిన ఆజ్ఞలలో 'గాలిలో పేల్చకండి, గుళ్ళు మిగల్చకండి' యిదే చెప్పారు. ఆ మాట వజ్రాలమూట! కలకాలం వుండేమాట! చరిత్రను నిర్మించే

మాట! యిదంతా తమ రిపుడే సెలవిచ్చిన 'మామూలు ఆట'కు దారితీసుంది. అంతేకాదు, మీ మాటల్లో యింకేదో తంత్రం వుందని ధ్వనిస్తోంది. అందువల్ల శ్రీ శ్రీ శ్రీ సార్వభౌములు..."

డుబసోవ్ వెంటనే జవాబీయలేదు. వ్రాతబల్లకు ఎదురుగా గోడకు వేలాడుతున్న నిలువెత్తు జారు చిత్రం తలెత్తి చూసాడు.

ఆ చిత్రంలో చక్రవర్తి ఆశ్వికదళ శతఘ్ని ఆఫీసరు యూనిఫారంలో ఉన్నట్లు చిత్రింపబడ్డాడు. చేతిలో గొర్రెపిల్ల చర్మపుహాటు ఉంది. వెనక పీటీలో రాజభవనం. ఆ చిత్రం చదువుల గదిలో చాలా కాలంగా వేలాడుతోందిగాని జారు మోకాళ్ళు అసంగతంగా, దీనంగా వంగిఉన్నాయనీ, చిరునవ్వులో కంగారు, దుఃఖము పొడగడుతున్నాయనీ ఇపుడే గమనించాడు. జారు ఒక వీధిలోని కల్లుదుకాణం ముందు నిలబడి ఉన్నట్లుగా ఏ కారణానో ఆ చిత్రకారుడు చిత్రించాడు. అన్నిటికీ మించి తలమీద ఏమీలేదు! ఛీ! ఎవడీ చిత్రం గీచిన చిత్రకారుడు? తెలివితక్కువ మొద్దా, తిరుగుబాటుదారా? అసహ్యం గొలిపే ఆ చిత్రాన్ని అక్కడనుంచి తొలగించివేయవలసిందే!

తిరిగీ ఆ చిత్రం వంక తదేకదృష్టితో చూసాడు. పోలికమాత్రం బ్రహ్మాండంగా ఉందని అంగీకరించక తప్పదు. వెధవ చిత్రకారుడు! అందుకే మూడు రోజులకితం అతని దర్శనంకోసం వచ్చిన ప్రజాసంస్థల ప్రతినిధులు గోడవంక మొహం తిప్పగానే ఇకిలించారు.

ఎవరో దగ్గారు. ఆడ్మిరల్ తిరిగి అసలువిషయం ఎత్తుతున్నాడు.

"చక్రవర్తిగారు యేమనుకుంటారని అంటున్నావు?"

అక్కడ వారంతా నగరంలోని పెద్ద పెద్ద పదవులలో ఉన్నవారు, పబ్లిక్ ప్రాసిక్యూటరు. నమ్మకస్తులే. మర్మంవిడిచి మాట్లాడాలి.

"పరిస్థితి క్లిష్టంగానే వుంది." అన్నాడు ఆడ్మిరల్ నెమ్మదిగా. "అంగీకరించితీరాలి. రెండేరెండు మార్గాలు మనముందున్నాయి. సైనిక నియంతృత్వం ఒకటే అత్యావసరమైందీ, ఆధారపడతగిందీ"

"డిమిట్రీ ఫియొడొరోవిచ్ ట్రెపోవ్!" అన్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటరు అడ్మిరల్ చెవిలో తనలో తను మాట్లాడుకుంటున్నట్లు.

ఆడ్మిరల్ తల పంకించాడు.

"యిప్పటివరకు, తంతివార్తనుబట్టి మీరీపాటికి గ్రహించే వుంటారు. నియంతృత్వానికి దారితీసే విధానం అవలంబించాలి. చాలా కాలం కితమే చట్టాలను దూరంగా వుంచవలసింది. అరెస్టులవల్ల ప్రయోజనమేమీ కలగదు. వందలు వేలకొలది వ్యక్తులను విచారణకు పెట్టలేం. యేమాత్రం ఆలస్యం చేయకుండా ఆయుధబలంతో తిరుగుబాటుదారులను తుడిచిపెట్టివేయ్యాలి. వాళ్ళని రక్తపుటేరులో ముంచేస్తే మనమలు మునిమనమలుదాకా జ్ఞాపకం వుండాలి. భౌతిక వినాశనం నియంతృత్వం కిందే సాధ్యపడుతుంది."

కండపట్టిన పెదవులు నొక్కుకుని ఒక నిమిషంపాటు మౌనం వహించాడు.

"కాని నియంతకు తగినంత సాయుధబలం వుండాలి. సమ్మదగిందయివుండాలి. వున్నసమస్యఅల్లా కావలసినంతమందీ దొరుకుతారా అనేదే..."

మళ్ళీ కొంచెంసేపు ఆగాడు. గదిలో అంతా నిశ్శబ్దం. చేతులు కొద్దిగా పైకెత్తి,

"మాస్కోలో చూచిందాన్నిబట్టి సాయుధబలం మనకి వుందా అని అనుమానం వేస్తోంది."

జనరల్ మొహం ముడుచుకుని దృష్టి పక్కకు మళ్ళించాడు.

"అటువంటపుడు ముందుగా తొందరపడకూడదు. స్వాతంత్ర్యాలంటూ గావుకేకలు పెడుతూ తలెత్తుతున్న యీ వెధవ అల్లరిమూకకు లొంగిపోవడం మనకి యేకోశానా యిష్టంలేదు కాబట్టి 'ఓడినవాడిదే గెలుపు' అనే తత్వం అవలంబించాలి."

గదిలో తిరిగీ మౌనం రాజ్యంచేసింది. అక్కడివారందరిలోకీ నిశ్చింతగాఉన్న పబ్లిక్ ప్రాసిక్యూటరు మళ్ళీ మాట్లాడసాగాడు.

"రాజ్యాంగచట్టం ప్రకటించాలనేనా మీ మాటలకు అర్థం?"

ఈ ప్రశ్నకు జవాబు చెప్పకుండా దుబసోవ్ తలవంచాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు తన ధోరణి సాగిస్తూ,

"యీ వెధవ అల్లరిమూక రాజ్యాంగ చట్టంలోని నిబంధనలను వుపయోగించుకుంటే యెట్లా? ఆ నిబంధనలన్నీ పైపై వేషాలని నాకు తెలుసు. కాని చరిత్రనుబట్టిచూస్తే పై వేషాలు వాస్తవాలుగా మారిపోవ డంకద్దు."

అడ్మిరల్ మెల్లగా బొంగురుగా నవ్వాడు.

"ప్రతి ఆటలోనూ ప్రమాదం వుంటూనేవుంటుంది. కాని యిందేమంత పెద్ద ప్రమాదంగా నాకు కనిపించడంలేదు. రైతులేమిటి, కార్మికులేమిటి, వట్టిగొర్రెలమంద! అంతా నాయకులమీదనే ఆధారపడి వుంది వారిని తుడిచిపెట్టివేస్తే... సమూలంగా అంటే భౌతికంగా తుడిచిపెట్టివేస్తే..."

"పవిత్ర గ్రంథంలో యేంచెప్పారంటే: 'గొల్లవాడిని ఖతంచేస్తే గొర్రెలన్నీ చెల్లాచెదరవుతాయి' అని" అన్నాడు, ఆర్చిబిషప్పు అంగీ కార సూచకంగా దొడ్డగడ్డం ఆడించుకుంటూ.

పబ్లిక్ ప్రాసిక్యూటరు సందేహంతో తల ఆడించాడు. అడ్మిరల్ కనుబొమలు ముడిచి.

"యెవయినా చిక్కులు నీకు గోచరిస్తున్నాయా, పబ్లిక్ ప్రాసి క్యూటర్!" అని అడిగాడు.

పబ్లిక్ ప్రాసిక్యూటరు నిట్టూర్చాడు

"ప్రస్తుత చట్టాల ప్రకారం..."

"చట్టాలతో దీనికేమీ సంబంధంలేదు" అంటూ కోపంతో అడ్మిరల్ అడ్డువచ్చాడు. "మనం ప్రభుత్వ విధానం గురించి మాట్లాడు కుంటున్నాం. చట్టరీత్యా కొద్ది యిబ్బంది వుండవచ్చు. అది నేను అర్థం చేసుకోగలను. కాని ఒకటి యెందుకు సంభవం కాకూడదూ? వుదా హరణకి: మీజైళ్ళల్లో ప్రముఖ నాయకులెవరూ యిప్పుడు లేరా?"

"వున్నారు" అంటూ పబ్లిక్ ప్రాసిక్యూటరు వెంటనే అంగీక రించాడు. "ఆర్. యస్. డి. యల్. పి. కేంద్ర కమిటీ సభ్యులు, వుదా హరణకి బౌమన్ వున్నాడు. అతనిని గురించి తమకు తెలిసేవుంటుంది.

మాస్కో తిరుగుబాటుదార్లకు అతను మూలవిరాట్టు. విప్లవంలో ప్రముఖపాత్ర వహిస్తున్న వ్యక్తి అనడంలో యెట్టి సందేహమూ లేదు."

"అదిగదీ! యీ బామన్ అర్ధాంతరంగా ఒకనాటి రాత్రి యెందుకు ఆత్మహత్య చేసుకోగూడదూ ?"

పబ్లిక్ ప్రాసిక్యూటరు తక్కినవారి వంక ఆదుర్దాతో చూసి ముభావంగా,

"అసంభవం! యెవరూ నమ్మరు. ప్రపంచంలోకల్లా-బామన్ అమిత ఆశావాది. జైలులోకల్లా కులాసా పురుషుడు." అన్నాడు.

"యిది పరియాచకాలకి వేళగాదు. నా మనసులో యేముందో యీపాటికి నీకు అర్ధమయేవుంటుంది."

డుబసోవ్ వ్రాతబల్లమీద చేతితో తట్టాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు ఈఅవకాశం తీసుకుని అతని దృష్టి నాకర్షించి అక్కడ ఇంకా కొందరున్నారనే అభిప్రాయం సూచించాడు.

"నన్నేం హెచ్చరించనక్కర్లేదు. నేను సైనికుడిని. సైనికుడిలాగా మర్మంలేకుండా, వ్యంగ్యంగా కాకుండా సూటిగా మాట్లాడతాను. యిక్కడున్నవారంతా చక్రవర్తిగారికి, మాతృదేశానికి నిజమైన సేవకులనే నమ్ముతున్నాను. దాగుడుమూత లెందుకు? నాయకులందరినీ హతమార్చవలసిందే. యిది పట్టపగలులా నాకు స్పష్టంగా గోచరిస్తోంది. వాళ్ళంతా మన చేతుల్లోనేవున్నారు గాబట్టి యీ అవకాశం తీసుకోవలసిందే. యే నేరస్తుడిచేతయినా యీపని చేయించడం కష్టమయిందా? మీజైళ్ళల్లో ఒక సైన్యాన్ని సైన్యాన్ని హత్య చేయగల హంతకులున్నారు. శిక్ష తగ్గిస్తామనో, వదిలిపెట్టేస్తామనో మాటయిస్తూ, యేదో ఒకరాత్రి వాడిని కొట్టులో వదిలిపెట్టి-యెవరికీ తెలీదు."

"అసంభవం?" అని పబ్లిక్ ప్రాసిక్యూటరు స్పష్టంగా చెప్పాడు. "ఆ నేరస్తుడిని వెంటనే మనం పురితీసేసినా యేదోవిధంగా యీహత్య విషయం బైటికి పొక్కుతుంది. యెలాగో తెలీదుగాని మన జైళ్ళల్లో జరిగేదంతా ఖైదీలకే గాక, నగరమంతా తెలిసిపోతుంది. యిటువంటి

సమయంలో ఆందోళనాకారకుల చేతిలో యీ 'తురుపుముక్క' పెట్టలేం. మీ రింతకుముందు ప్రస్తావించిన బామన్ టాగాంకా జైలులో నిరాహారదీక్ష పూనాడు. సంవత్సరంనుంచీ యేకాంత నిర్బంధంలో వుంచాం. అయినా జైలంతటకీ యీవిషయం తెలుస్తుంది. అంతా అతనిని బలపరుస్తారు. రాజకీయ ఖైదీలు నిరాహారదీక్ష పూనడం సామాన్యమయిపోతే కార్మికులకు తెలిసిపోతుంది. యిప్పటి వుద్రిక్త పరిస్థితిలో చివరికి యేమవుతుందో తమరు గుర్తించాలి..."

కళ్ళు కుంచించుకుని అడ్మిరల్ అంతా విన్నాడు.

"అయినా, అయితే నేనేం చేయలేను. సూపరింటెండెంట్ నా ఆజ్ఞలు పాటించావా ?"

"ఆఁ" అంటూ సూపరింటెండెంటు దిగ్గున పడకకుర్చీలోనుంచి లేచాడు. "మీరు ఆజ్ఞాపించినట్టు పదిగంటలకి ?

నెగడుబల్లమీది పూర్వకాలపు కంచుగడియారంకేసి చూసాడు. గడియారం ముళ్ళు పదకొండు చూపుతున్నాయి.

డుబసోవ్ గంటకొట్టాడు. తలుపు తెరుచుకుని ఒక అంగరక్షకుడు గదిలో అడుగుపెట్టాడు.

"అంతా సిద్ధమైందా, కొనొవ్నిట్సిన్ ?"

"ఆఁ_ సిద్ధమైంది."

"యెక్కడ ?"

"అడుగున కొనొవ్నిట్సిన్ తటపటాయించి, నేలమాళిగలో అదే తగినచోటని అనుకున్నాను. లేదా యిక్కడికి తీసుకురమ్మంటే యిక్కడికే తీసుకువస్తాను."

నేలమీద పరచిన తివాసీలకేసీ, దురదృష్టవంతుడైన రెండవ నికొలస్ చిత్రంకేసీ చూస్తూ బాగా ఆలోచించి, "పైకి తీసుకు రావలసినంత పనేంలేదు. మనమే కిందికి వెళదాం" అన్నాడు.

పడకకుర్చీ ముందుకుతోసి లేచాడు.

"సరే." సైన్యందగ్గిరనుంచీ దర్బారుదాకా ప్రభుత్వ యంత్రాగం కదలటానికి నిరాకరిస్తోందని నేటి సంభాషణనుబట్టిమనందరికీ స్పష్టమయిందనుకుంటాను. (పబ్లిక్ ప్రాసిక్యూటరువంక నిరసనభావంతో చూసాడు). యిక ప్రజలకు విజ్ఞప్తి చేయడం ఒకటే మిగిలింది."

శ్రోతలు కంపించిపోయారు. తనమాటలు బాగా పనిచేసినందుకు డుబసోవ్ ముసిముసి నవ్వు నవ్వాడు.

"గ్రాఖస్ అన్నాడు; 'నేను ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను' అని పబ్లిక్ ప్రాసిక్యూటరుగారూ, మహా కావ్యాలు ఇంపీరియల్ అలెగ్జాండరు పాఠశాలలో ఒక్కదాంట్లోనే కాదు పఠించేది నేనూ పఠించాను. సరే, యిక నావెంటరాండి!"

# 30

## ప్రజాప్రతినిధులు

నేలమాళిగంలో తేమవాసన, ముగికిశరీరాల కంపు, తడి నార బట్టల దుర్వాసన గుప్పునకొట్టింది. జనంతో నేలమాళిగ నిండిపోయి ఉంది. ముందు ఓవరుకోట్లు, బెట్టు అంగరఖాలు ధరించిన రైతులు, వారివెనక-చినిగిపోయిన చొక్కాలు, ఉన్నికోట్లూ ధరించిన దౌర్భాగ్య జనం, బూడిదరంగు పెద్ద పెద్ద కోట్లు తొడిగిన పోలీసులు ఉన్నారు.

అడ్మిరల్ ముఖం ముడుచుకున్నాడు. నేలమాళిగం అసహ్యం వేస్తోంది. తనఇంట్లో ఇటువంటి నేలమాళిగం ఉందని అత నెన్నడూ ఊహించనైనా లేదు. కచేరిసావిడిలో వీళ్ళని కలుసుకుంటే బాగుండి పోయేది. వెధవ కోనోవ్నిట్సిన్! వాడి కల్లబొల్లిమాటలు! నేలమాళిగంలో వాళ్ళకి దర్శనమిస్తారా? 'ఫీస్కోకుట్ర!' తెలివితక్కువ వాజమ్మ! హాటు తీసుకురండని కూడా చెప్పిచావలేదు. హాటులేకుండా

తేమలో నిలబడడం!...వారంరోజులపాటు కొనోప్నిట్సిన్‌ని కాపలా కాయమంటే తెలిసివస్తుంది, వెధవకి! సరే, ఈ వ్యవహారం పూర్తి కాగానే వాడిసంగతి చూడాలి!

అతని వెనకగా అనుచరుల గొణుగుడూ, ఆర్చిబిషప్పు దగ్గూ వినిపించాయి. వాళ్ళంతా విస్తుపోయి ఇంకా కోలుకోలేదు.

ఇదంతా ఏమిటో వాళ్ళకి అర్థంకాలేదు.

సాగిపోతున్న నావ వంతెనమీదలాగా వంగచాపి అడ్మిరల్ నిలబడ్డాడు.

"శుభం, రష్యను ప్రజలారా!" అన్నాడు అతిగంభీరంగా.

అందరూ బొంగురుగా, "నమస్కారం దొరా!" అని జవాబిచ్చారు.

డుబసోవ్ మాట్లాడడం ప్రారంభించాడు. కింది పెదవి ముందుకు పొడుచుకు వచ్చింది.

"నేను సైనికుడిని, క్లుప్తంగా చెపుతాను. అతివాగుడు నాకు పట్టువడలేదు. మాస్కోలో యేంజరుగుతున్నదీ చూస్తూనేవున్నారుగా? మన రాజధాని, నూటానలభై చర్చీలు, జెరూసలెం తరవాత ప్రపంచంలోకల్లా పవిత్రక్షేత్రం... యిపుడు వీధులు నాస్తికులయిన సోషలిస్టులతో, వారి యెర్రజెండాలతో నిండిపోయాయి. మనం మంచి క్రిస్టియన్లం. చూస్తు వూరుకోగలమా? స్వర్గంలో మేరీకన్య కంటివెంట రక్తం కారుతోంది..."

తలవంచి, మేరీకన్య ఎలా దుఃఖిస్తోందో చూపడానికా అన్నట్లు కళ్ళు చికిలించాడు. జనం ఎగఊపిరి పీల్చసాగారు. చెమటకంపు, సారాకంపు ఇంకా గుప్పుమంది.

"వారి మూలంగా, సోషలిస్టుల మూలంగా మనం యుద్ధంలో వోడిపోయాం. యెవరిచేతుల్లో వోడిపోయాం? పేరు చెప్పడంకూడా సిగ్గుచేటు! యీ నిరీశ్వరవాదుల్ని వుపేక్షించినందుకు భగవంతుడు మనకు తగినశిక్ష విధించాడు. భగవంతుడు మనపక్షాన లేకపోతే మనకు విజయం లభించదు. మనల్ని, రష్యను ప్రజల్ని భగవంతుడు అనాది నుంచీ నడిపిస్తున్నాడు. ఆతనే మన సర్వసేనాని!"

అడ్మిరల్ గర్వంతో తలపైకెత్తి రొమ్ము విరుచుకున్నాడు. తక్షణమే అంతా భగవంతుడు రష్యన్ రాజసేనను, నావికాదళాలను ఎలా నడిపించిందీ అర్థం చేసుకున్నారు.

"ఆయనకి తగిన సంతానం అని మనం అనిపించుకోవాలి! మాతృభూమిని రక్షించుకోవాలి! యిందుకు మన చక్రవర్తిగారు మీామీద ఆధారపడివున్నారు."

మొదట వరసలో నిలబడ్డ ఒక కసాయి అంటకత్తెర వేయించుకున్న జిడ్డుతల వంకించి అందరి తరఫునా మాట్లాడసాగాడు. అతని వక్షస్థలం విశాలంగాఉంది. అంగరఖా మీాద తెల్లటిగుడ్డ తోలుపటకాతో బిగించాడు.

"ఓ - సంతోషంతో సేవచేస్తాం!"

దుబసోవ్ మరలా ప్రారంభించాడు.

"అందుకోసరమే, మిమ్మల్ని, ప్రజా ప్రతినిధులైన మిమ్మల్ని యిక్కడకు రమ్మని ఆదేశించాను. సిబ్బందినంతాకూడా తీసుకు వచ్చాను. ఆర్చిబిషప్పుగారుకూడా దయచేసారు...జారుగారు, ఆయన సిబ్బంది మీాపక్షానవున్నారనీ, జారుగారి రక్షణ మీాకు వుందనీ తెలియజేయడానికే అందరమూ వచ్చాం. తిరుగుబాటుదార్లు ఐక్యసంస్థలు యేర్పరచుకున్నారు. రష్యన్ భూమిని కాపాడడానికి మీారూ ఐక్యసంస్థలు యేర్పరచుకోవలసిన తరుణం వచ్చింది. జారుగారి పక్షాన చెబుతున్నాను: 'అల్లర్లు చెలరేగాయి, తిరుగుబాటుదార్లను అణచడం ప్రభుత్వానికి సాధ్యం కావడంలేదు. యికమీాద మీారు జోక్యం కలిగించుకోవాలి!"

హాఠాత్తుగా చేయిపైకెత్తి టపీమని కిందికి దించాడు.

"తిరుగుబాటుదార్లను పూర్తిగా తుడిచిపెట్టేయాలి!", "నాయకులను హతమార్చేయాలి" అని ఒక గొంతు వెనకనుంచి వినిపించింది. "యీా జాడ్యం వాళ్ళ దగ్గరనుంచే పుట్టుకొస్తోంది. వాళ్ళు రెచ్చగొట్టకపోతే ప్రజలు తిరగబడతా రంటారా?"

అడ్మిరల్ సంతృప్తితో మందహాసంచేసి, "యెవరది? ముందుకు రా!" అని ఆజ్ఞాపించాడు.

జనం దోవ ఇచ్చారు. ఒక పొట్టిపాటి మనిషి జనాన్ని తోసుకుంటూ ముందుకు వచ్చాడు. అతను క్షవరం చేయించుకుని చాలా రోజులైంది. జుట్టు కళ్ళను కప్పివేస్తోంది. చెమటచేతులతో టోపీ నలపసాగాడు.

"యెవరు నువ్వు? నీ పేరేమిటి?

"మిఖాలిన్... మిఖల్‌చక్" అని అతను జవాబిచ్చాడు దృష్టిని మళ్ళించుకుంటూ. "మపోవ్ ఫాక్టరీలో పోలీసు బంట్రోతును."

దుబసోవ్ జేబులోనుంచి నోటుపుస్తకం తీసాడు.

"నీది సూటయిన ఆలోచన! నిజాయితీ అయిన ఆలోచన! కృతజ్ఞుడిని."

నోటుపుస్తకం తెరిచాడు. అడ్మిరల్ వేళ్ళనంక అంతా చూస్తూ కళ్ళు చికిలించారు. ఆ వేళ్ళు కురచగా లావుగాఉన్నాయి. ఇరవై రూబుళ్ళ నోటు పైకితీసి,

"యిదిగో తీసుకో. దేవుణ్ణి ప్రార్థించినా, జారుగారికి సేవచేసినా వృధాపోదని జ్ఞాపకం వుంచుకో." అన్నాడు.

మిఖల్‌చక్ ఉద్వేగంతో గుర్రుమని,

"యీ విధేయుడు...భగవంతుడి సాక్షిగా యిందుకు తగినవాడననిపించుకుంటా." అన్నాడు.

జనంలో రణగొణధ్వని బయలుదేరింది. కసాయి రొమ్ము విరుచుకుని ముందుకు వచ్చాడు.

"మేమంతా తగినవాళ్ళ మనిపించుకుంటాం!"

అడ్మిరల్ తలపంకించి,

"మీ మాట నమ్ముతాను, సోదరులారా! ప్రతివానికి అతనికి తగినట్టు బహుమతీ ముట్టచెప్పమని గవర్నరు జనరల్ కార్యాలయాన్ని ఆదేశించాను. మీలో మీరు ఒక అంగీకారానికి వస్తారనే నమ్ముతున్నాను. మీ మీ జిల్లాలలోని పోలీసు యినస్పెక్టర్లు మీకు ఆదేశాలు యిస్తూవుంటారు. వారికీవిషయం తెలియజేసాం. మీరు ప్రజాసేవ

చేస్తున్నారని జ్ఞాపకం వుంచుకోండి. జారుగారిని జ్ఞాపకం వుంచుకోండి. ఆయనగారు మిమ్మల్ని యెన్నటికీ మరిచేపోరు. జారుగారు భగవంతుని లాగానే దయాళువు. మీరేమీ నష్టపడరు స్వామీ, యీ రాజ భక్తుల్ని ఆశీర్వదించండి. ఘనకార్యాలుచేసే శక్తిని వీరికి ప్రసాదించండి!"

కోట్ల అంచులను పట్టుకుని అందరూ మోకరిల్లారు. శిలువగుర్తు వేసారు. ఆర్చిబిషప్పు మెల్లిగా చేతివేళ్ళు పైకెత్తి ముద్రపట్టాడు. అది అభయముద్రో, భయముద్రో తెలియలేదు.

"జనకుడు, కుమారుడు, పవిత్రాత్మల పేరుతో...నా బిడ్డ లారా, ధైర్యం వహించండి. పవిత్రమైన చర్చికోసం, సింహాసనంకోసం, స్వర్గంలో మన పితకోసం, భూమిమీాద మన పితకోసం ధైర్యం వహిం చండి! భగవంతుని ఆజ్ఞ విన్నారుగా: 'హత్య చేయరాదు'. యుద్ధ భూమిలో సైనికులను చంపడం యెలా పాపంకాదో, అలాగే దేవుని శత్రువులను, జారుగారి శత్రువులను చంపడంకూడా పాపంకాదు. ప్రార్థనాగీతాలలో భగవంతుని వుద్దేశించి, విజయం...అతి పవిత్రమైన, ఏకచ్ఛత్రాధిపతులైన మన మహారాజు...!"

♦ ♦ ♦ ♦

"సూపరింటెండెంటు స్ప్రాక్!" అని దుబసోవ్ తనగదికి వెళ్ళే మెట్లమీాదనుంచి పిలిచాడు.

ఆ సూపరింటెండెంటు రెండేసిమెట్లు ఒకతడవే ఎక్కుతూ అడ్మి రల్‌ను కలుసుకున్నాడు.

"అచ్చుఆఫీసులవాళ్ళు సమ్మెచేసారు. కాని పోలీసు అచ్చు ఆఫీసుమాత్రం పనిచేస్తున్నదనే తలుస్తున్నాను. నేనిపుడుచేసిన ప్రసంగం ధోరణిలో, ఆర్చిబిషప్పుగారి ఆశీర్వాదంతో ఒక విజ్ఞప్తి తొందర తొందరగా అచ్చువేయిస్తే బాగుండును. పోలీసులు ఆ ప్రతినిధులు... పంచిపెడతారు," ఎగఊపిరి పీల్చి మీసాలు సవరించుకుని, చట్ట విరుద్ధ కుట్రదారులలాగానే రహస్యంగా పంచిపెడతారు. విజ్ఞప్తి రాయ డానికి మంచి దస్తూరిగలవాడిని యెవడినైనా చూడు" అన్నాడు.

# 31

## అయిదో రోజు

అయిదురోజులయింది. బామన్ ఆహారం ఏమీ తీసుకోలేదు.

నవంబరులో నిరశనవ్రతం పట్టినపుడు పదకొండు రోజులు తేలికగా గడిచాయి. విజయం చేజిక్కింది. ఈ అయిదురోజులూ బహు జాగ్రత తీసుకున్నాడు. మంచినీళ్ళు మాత్రం తాగేవాడు. కదలలేదు. అయినా ఈ అయిదురోజులు, ఆ పదకొండు రోజులకంటె కష్టమనిపించాయి.

జైలులో ఉన్న సంవత్సరంలో శరీరం బలహీనమైపోయిందా? లేకపోతే ధైర్యం లోపించిందా? లేవకుండానే బామన్ కండరాలు బిగపట్టి తడిమిచూసుకుని మందహాసంచేసాడు. ఉహుఁ – అంతా సరిగానే ఉంది. పోతే ధైర్యం తగ్గివుండాలి! అంతే!

నిరశనదీక్షపుడు ప్రశాంతంగా కాలం గడపాలి. అది చాలా అవసరం. మనసులోనుంచి ఆలోచనలను, వ్యధలను తరిమివేయాలి. చెత్తనవలలు చదువుతూ మేధకు విశ్రాంతి ఇవాలి. నవంబరులో వ్యధ చెందలేదు. కాని ఇపుడు?

అయిదురోజులైంది గది శుభ్రపరిచి. మూత్రపు ముంత తీసుకు వెళ్ళడానికి వార్డరు స్వయంగా వచ్చాడు. అంటే మామూలుగా గదిని శుభ్రపరిచే నేరస్తులని నమ్మడంలేదన్నమాట! ఇలా ఏకాంత నిర్బంధంలో ఉంచితే నిరశనదీక్ష వార్తలు జైలులో వ్యాపించవు. అటువంటపుడు బయటివారికి తెలిసే అవకాశమే ఉండదుగాని అంచనాల్లో ఎక్కడో తప్పు దొర్లినట్టుంది.

బయట ఏమి జరుగుతున్నదో అతనికి తెలియదు...బహుశా కొజుబా, 'కేవలం' నాడ్యా, ఈపాటికి ఈజైలులోనే ఉండి ఉంటారు. అతనితో సంబంధం పెట్టుకునే అవకాశం లేకపోయిందేమో...

♦ ♦ ♦

అతనికి పుస్తకాలు ఇవ్వడం మానివేసారు. పబ్లిక్ ప్రాసిక్యూటరు బామన్‌ను వేళాకోళం పట్టించాలని స్వయంగా ఒక పుస్తకం ఎన్నికచేసి పంపాడు.

నట్ హాంసన్ సంపూర్ణగ్రంథావళి. సంపుటం రెండు! పిచ్చివాడు, జీవితకేళి, స్వర్గద్వారంవద్ద...అకలి...

ఈ గ్రంథాల పేర్లు చూస్తే వీటిని ప్రత్యేకంగా కావాలని ఎన్నిక చేసినట్టు తోస్తుంది. ముఖ్యంగా ఆఖరి గ్రంథం బామన్‌కి ఆకలిని రగిలించాలనే ఉద్దేశంతో పంపి నట్లుంది.

సహజంగా ముందుగా 'ఆకలి' చదవడం ప్రారంభించాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరుకు కాస్త సంతోషం ఎందుకుచేకూర్చకూడదూ? ఆపుస్తకం మొదలులో కొంత వినోదకరంగానే ఉందిగాని పోను పోను అసహ్యం వేసింది, కోపం రగిలింది. ఈ ప్రపంచంలో వాస్తవమైన ఆకలి మానవుని జీవశక్తిని తినివేస్తూ, గొంతుకపట్టుకు నులుముతూ రాక్షసునిగా మారుస్తూ, శవాలను కుప్పలు కుప్పలుగా పడివేస్తూ, తాండవిస్తూంటే; చంటిపిల్లల మెడలను నులుముతూ, యువకుల మొహాలను పీల్చి పిప్పిచేస్తూ, కార్మికుల జిల్లాలలో నిశ్శబ్దంగా, అగోచరంగా తాండవిస్తూంటే నట్ హాంసన్ తాను ఆకలి అని నమ్మేదానిని అంత తేలికగా ఎలా వర్ణించగలిగాడు? వీరినిగురించి ఒక ముక్కయినా వ్రాయలేదే! బూర్జువాలు పొట్టనింపుకోవడానికి ఆకాంక్షించిన విషయం మూడువందలపుటల నవలగా వ్రాసినపుడు మంచి ఇతివృత్తాన్ని చేపట్టాననే రచయిత ఊహించాడా? దానిని అకలి అనడానికి ఎలా సాహసించాడో?

కాస్త కోపం రేగితేచాలు' జీర్ణకోశానికి పని ఎక్కువవుతుంది. దానిఫలితంగా శరీరంలో ఉష్ణం తగ్గుతుంది. మలమూత్రాదులు ఎక్కు-

వగా విసర్జించవలసివస్తుంది. నట్‌హాంసన్ గురించి ఆలోచించి ప్రయాస పడడమెందుకు? అప్పటికే ప్రయాస ఎక్కువైపోయింది.

♦ ♦ ♦

కుడిపక్క గోడమీద జాగ్రతగా రహస్యంగా వినిపించీ వినిపించకుండా ఎవరో తట్టారు, మొదటలో బామన్ నమ్మలేదు. ఆకలి మూలంగా చెవులు గింగుర్లెత్తుతూండాయి. కాని తిరిగీ తట్టిన చప్పుడు వినిపించింది. ముందుగా ఏర్పరచుకున్న జైలు సాంకేతిక అక్షరసమమ్నాయంలో ఆచప్పుడు ఉంది. ఈతడవ బామన్‌కి "యెవరు" అనే మాట స్పష్టంగా వినిపించింది.

చాలాకాలం కితమే బామన్ పేరు చిట్టాలోకి ఎక్కింది. ఇపుడు వెనకకు దీయడంలో అర్థంలేదు. అవతలవైపు వ్యక్తిలాగానే బామన్ కూడా మెల్లగా, జాగ్రతగా "బామన్" అనే అక్షరాలు గోడమీద కొట్టాడు.

జవాబు తొందరగానే వణుకుతూ వచ్చింది. గోడగుండా వచ్చిన అక్షరాలు "జీగ్లర్" తెలుసుకోవడం బామన్‌కు కష్టమైపోయింది.

అసంభవం! జీగ్లర్! బదిలీచేసారా? ఇక్కడకు, అతని పక్కకు బదిలీచేసారా? నిజంగా జీగ్లర్ అవునో కాదో తెలుసుకునేందుకు ఏదో ఒక ప్రశ్న వేయాలి. సరియైన ప్రశ్న వెనువెంటనే బామన్‌కి తోచలేదు. కాని జవాబు ఇవ్వాలి.

"అవ్‌గస్ట్!"

"అవును, జైలు నిండిపోవడంవల్ల యిక్కడికి మార్చారు. చాలామంది కొత్తవాళ్ళని పట్టుకువచ్చారు. కమిటీ నంతటినీ అరెస్టు చేసారు. అచ్చు ఆఫీసును పట్టుకుపోయారు. ఒకొక్క యేకాంత నిర్బంధపు కొట్టులో పదేసిమందివున్నారు."

ఆ తరవాత చాలాసేపు విరామం. బామన్ గోడమీద "నేను నిరశనదీక్ష పూనాను" అని కొట్టాడు.

తక్షణమే జవాబు వచ్చింది!

"మాకు తెలుసు. మానివేసేయి. నిరశనదీక్ష పూనతగినది కాదు. సమ్మె విఫలమైంది ప్రయోజనంలేదు."

బామన్ మోచేతిమీందలేచి నడవ అంతా మారుమోగేటట్టు గోడమీద దభీమనికొట్టాడు.

"దొంగవెధవ !"

వాడు జీగ్లర్ కాదు ! పోలీసుబంటు ! జవాబులే వాడిని పట్టిచ్చాయి. వాడు చెప్పింది స్నేహితుడైన వాడెవడూ చెప్పడు. అవగస్ట్ అని పిలవగానే జవాబిచ్చాడు. లెన్‌గ్నిక్ అటువంటి మారుపేరు ఎన్నడూ పెట్టుకోడు.

బామన్ తిరిగి మెత్తమీద కాళ్ళు చాచుకుని పండుకున్నాడు. మళ్ళీ ఇంకోమారు గోడమీద వడివడిగా గట్టిగా తట్టిన చప్పుడయింది. కాని బామన్ లక్ష్యపెట్టలేదు.

♦ ♦ ♦

కాస్తకోపం రేగితే జీర్ణకోశానికి పని ఎక్కువవుతుంది. కళ్ళు మూసుకుని ఆలోచించడం మానివేయాలి. చదవడానికి లేదు. తినడానికి లేదు. అటువంటపుడు ఆలోచించకుండా ఉండడం ఎలా ? ఆహారం ఆలోచనలను మళ్ళించుకోవడానికి సహాయపడుతుంది. కొట్టులో ఒంటరిగా ఉన్నాడేమో తిండిలేకపోయేసరికి ప్రతిరోజూ అంతూ పొంతూ లేనట్టు అనిపించేది. భరించశక్యం కాకుండా ఉంది. అయినా నిజానికి కళపెళలాడే నీళ్ళు, మాంసంలేని గోరువెచ్చని పులుసు, పళ్ళకు అంటుకునే సగంఉడికిన అంబలి...మళ్ళీ సాయంకాలం అంబలి. చీకటిలో మసక మసకలాడే చూరుదీపంకూడా కాంతివంతంగా గోచరిస్తుంది. కొద్దయినా ఆహారం విషాదభావాలను పారదోలుతుంది. రోజులు తేలికగా గడుస్తాయి. ఇక ఇప్పుడో రోజులకు అంతంటూ కనిపించడంలేదు. ఏనిరోధం లేకుండా ఒకటే ఆలోచన ! ఇంతకంటే ఘోరం, మాటవినేవారు లేక తనమాట తానే వినడం ! ఈ వెధన కొట్లోలాగా పూర్తిగా నిశ్శబ్దంగా ఉన్నప్పుడు వినడానికి ప్రారంభిస్తే అక్కడ ఎవరూ లేకపోయినా ధ్వనులు, గరగరశబ్దాలు వినిపించేటట్టుగా మానవశరీరం నిర్మాణమయింది. శరీరాన్ని పరీక్షగా చూసుకుంటే ఎక్కడో అక్కడ బాధ కనిపిస్తుంది.

బామన్ మెత్తమీద కూర్చుని కాళ్ళు ఊగించాడు. అటువంటి ఆలోచనలను పారదోలాలి. రోజంతా ఇంకేదో విధంగా గడిపే ఏర్పాటు చూసుకోవాలి. చదవడానికి ఏమీ లేదు. పరస్పర సందేశాలు అందించు కోవడానికి ఎవరూ లేరు. అస్తమానమూ పండుకుంటే శారీరకంగా బలహీనమైపోతాడు. కదలిక కావాలి, పదహారువిధాల వ్యాయామాభ్యాసాలూ చేయాలి, అలా చేస్తే వెంటనే తేరుకోగలుగుతాడు.

♦ ♦ ♦

సరిగా ఆసమయానికే నడవలో అడుగులచప్పుడయింది. మధ్యాహ్న భోజనాలవేళయిందని అనుకున్నాడు. తలుపురెక్కలోని చిన్నకిటికీ తెరుచుకుంటుంది. పదిహేడవ అభ్యాసం చేయాలి. ఓపిక లేదు. పులుసుతప్పాలా తీసుకుని అందులోని పులుసు ముంతలో పారబోసి తప్పాలా తిరిగి ఇచ్చివేయడం, అంబలిమూకుడు తీసుకుని అంబలి మూత్రపు ముంతలో పారబోసి మూకుడు తిరిగి ఇచ్చివేయడం-ఇదీ పదిహేడోరకపు అభ్యాసం.

కాని కిటికీ తెరుచుకోలేదు. ద్వారం తెరుచుకుంది, వార్డరు రెండుపళ్ళాలు జాగ్రత్తగా తీసుకువచ్చి బల్లమీద పెట్టాడు.

"కాస్త యెంగిలిపడుదూ, బామన్" అన్నాడు వినయ విధేయతలతో.

బామన్ చేయిజాపి, "యిలా యియి" అన్నాడు.

పదిహేడవ అభ్యాసం!

వార్డరు విచారంగా తల పంకించి, "అదేం ప్రయోజనంలేదు, బామన్! అనవసరంగా శరీరాన్ని హింసపెడుతున్నావు" అన్నాడు.

తలుపుదగ్గరకువెళ్ళి, తటపటాయించి, నిట్టూర్చాడు. అతని స్వరం, వాలకం అసాధారణంగా ఉండేసరికి బామన్ జాగ్రతగా అడిగాడు:

"యేమిటి సంగతి? యివాళ వేరువిధంగా వున్నావేం?"

వార్డరు మళ్ళీ నిట్టూర్చాడు.

"నా మనసు ఎంతో వేధిస్తోంది, బామన్ !"

ఒక నిమిషం ఊరుకుని మళ్ళీ,

"నాకు పిల్లా మేకా వున్నారు. అదీ వచ్చినచిక్కు."

బామన్ మనసులో ఒక ఆలోచన వచ్చింది. నిలువల్లా వణికి పోయాడు. వార్డరు బుజంపట్టుకుని,

"నగరంలో యేంజరుగుతోంది? తొందరగా చెప్పు!" అని అడిగాడు.

భయంతో వార్డరు బుజం విడిపించుకున్నాడు. "ఆందోళన చెలరేగింది" అంటూ బామన్ చెవిలో చెప్పనారంభించాడు. "జైలులో సిపాయి దాడును పెట్టారు. కార్మికులు తిరుగుబాటు జరిపారని పుకారుగా వుంది. జైలుమీద దాడిచేస్తారు. అదే జరిగితే నా విషయమై మంచిగా చెప్పు. బామన్ నువు వాళ్ళల్లో ముఖ్యమైన నాయకుడివని అంతా అంటున్నారు. నాకు సహాయంచేయి...మేము ప్రభుత్వసేవ చేస్తున్నామంటే అది మా దోషంకాదు, మాకు తినడానికి, తాగడానికి కావాలి... నేను నీ కెపుడూ అపకారం చేయలేదు. చేయగలిగిన సహాయం చేసాను...నాకు పిల్లామేకా వున్నారు. అదీ వచ్చినచిక్కు."

బామన్ తలుపు మూసివేసి తగ్గుస్థాయిలో అతి మెల్లగా,

"బయటికి పారిపోవడంలో సాయంచేయి...విప్లవం జయించి తీరుతుంది, జ్ఞాపకంపెట్టుకో. జయించకుండా వుండదు. నన్ను బయటికి తీసుకువెళ్ళు నీ మేలు మరిచిపోను. నీ రుణం తీర్చుకుంటాను" అన్నాడు.

వార్డరు నోరు పెద్దగా తెరిచాడు. రొప్పుతూ, "భగవంతుడు నిన్ను రక్షించుగాక ! యేమాత్రం సాధ్యంకాదు. నీ విషయమై ప్రత్యేకమైన ఆదేశాలున్నాయి. నిన్నుగనక...నా గతి యేమవుతుందో తెలుసా ? నన్ను వురేసి చంపేస్తారు."

"నాతోకూడా రా. దుస్తులు తీసుకురా. యెదైనా అంగరఖా గాని యూనిఫారంగాని లేదూ ? యిద్దరం కలిసి తప్పించుకుని బయటికి వెళదాం. నువు పస్తాయించవు, నామాటనమ్ము."

"కాని నేను..." వార్డరు ఇందాకటిలాగానే ఊపిరికోసం కొట్టుకుంటూ ప్రారంభించి, హఠాత్తుగా ఆగి, విని, తలుపు దగ్గరకు పరుగెత్తాడు.

"యెవరో వస్తున్నారు."

గొంతు అతను మెల్లగా నడవలోకి జారుకున్నాడు. కొట్టు దగ్గరగా ఇంతలు బిగ్గరగా వినిపించాయి. అదంతా నిబంధనలకు విరుద్ధం.

బిగ్గరగా మాట్లాడడం బామన్ విని చాలాకాలమైంది. వార్డన్ మంద్రస్వరం గుర్తుపట్టగలిగాడు. మళ్ళీ తలుపు తెరచుకుంది. అంతకు ముందు వెళ్ళిన వార్డరు మందహాసం చేసినట్టే వార్డెనూ మందహాసం చేసాడు. ఆ మందహాసంలో భయం, వినయవిధేయతలూ పొడగట్టాయి.

"నిన్ను విడుదలచేస్తున్నాను, బామన్! దయచేసి ఆఫీసులోకి వచ్చి, జామీనుపయి విడుదలయినట్టు చిన్న ప్రకటనమీద సంతకం చేయి. నీ సామాను నీకు తిరిగి యిచ్చివేస్తాం. నీ భార్య నీకోసం నిరీక్షిస్తోంది!"

♦ ♦ ♦

బామన్ తొందర తొందరగా తన స్వంత వస్తువులు పోగుచేసి చేతులతో పట్టుకున్నాడు. వార్డెను గౌరవం చూపుతూ నిరీక్షించాడు.

"యిక వెళదాం" అన్నాడు వార్డను. "ఆఫీసులో సాక్షులుంటారా?"

"సాక్షులు! యెందుకు? నే నిదివరకే చెప్పాగా..."

బామన్ మామూలు ప్రకారం మృదువుగా మందహాసంచేసి,

"నేను ప్రకటనలమీద సంతకం చేయను. అది నా నియమం. సాక్షులు లేకపోతే యిక పత్రం విలువవుండదు." అన్నాడు

వార్డరుకూడా మందహాసంచేసి తలపంకించాడు.

"నువు చాలా గట్టివాడివి, బామన్! అసాధ్యుడివి. యెవెవో లాంఛనాలకోసరమని నిన్ను నిలిపేయంలే. అవి లేకుండానే చేయడానికి యత్నిస్తాం."

♦ ♦ ♦

వార్డరు ముందు పరుగెత్తి ఆఫీసు తలుపు తెరిచాడు. "రాండి!"

నాడ్యా, పువ్వులు, వార్డర్లు, పేదదుస్తులలో ఇంకొక పొడుగాటి వ్యక్తి చేయిజాపాడు. పబ్లిక్ ప్రాసిక్యూటరు? జాపిన చేతిని అందుకోకుండా బామన్ భార్యని కౌగలించుకున్నాడు.

బాగున్నావా? నాన్న బాగున్నాడా?"

ఆమె నవ్వు అణచుకోలేకపోయింది. అయినా, "యింకో వూపిరి ఆడుతూనే వుంది. తొందరగా బయటికి పోదాం. పద వాళ్ళు వశపర్చుకున్న వస్తువులు వదిలేద్దాం, యేం? జాబితా తయారుచేస్తూ కాలం వృథాపుచ్చట మెందుకు?" అంది.

"మనం లేకపోయినా జాబితా తయారుచేస్తారే."

నవ్వుతూ బామన్ బల్లమీదఉన్న తన స్వంతవస్తువులు—చాకు, గడియారం, కాసికోక జేబులో కుక్కుకున్నాడు.

పబ్లిక్ ప్రాసిక్యూటరు ఒకఅడుగు ముందుకువేసి, "అనవసరంగా రగడ యెందుకని నేనే స్వయంగా వచ్చాను..."

నాడ్యా భర్తచూపుకు అడ్డువచ్చి చేయిపట్టుకు నొక్కి— తొందర తొందరగా, "రా, నికొలాయ్!" అంది.

వార్డరు మళ్ళా ముందు పరుగెత్తుతూ, "యే అవాంతరం రాకుండా గేటుదాకా మిమ్మల్ని దిగబెడతాను" అన్నాడు.

బామన్ పెదవులు వంపు తిరిగాయి. శునకవిశ్వాసంతో తన వంకచూసే ఆ కళ్ళు, ఆ మనుషులు అసహ్యంగా, నీచంగా నడవడం అతనికి విసుగెత్తించింది.

♦ ♦ ♦ ♦ ♦

జైలు ఆవరణలోకి అడుగిడేసరికి సూర్యరశ్మికి కళ్ళు జిగేలుమన్నాయి. చల్లగాలి మత్తెక్కించింది. బామన్ ఆగిపోయాడు.

"యేమిటి? మొహం అలా పాలిపోయిందేం?" అని ఆదుర్దాగా నాడ్యా అడిగింది.

"మరేం పర్వాలేదు. అదే సద్దుకుంటుంది. నిరశనవ్రతం పూనాను."

"అంటే తిండి తినడం లేదన్నమాట?"

ఈ ప్రశ్న ఆమె నోటినుంచి ఏడుపుతోపాటు వెలువడింది. వార్డరు తప్పుచేసినవాడిలాగా జంకాడు.

రాజకీయఖయిదీల భాగం రెండో అంతస్తు కిటికీలోనుంచి ఖంగు మని గొంతు వినిపించింది.

"బామన్ నిన్ను విడుదల చేసారా?"

బామన్ కిటికీలకేసి చూడడానికి వెనుదిరిగాడు. కటకటాల వెనక మొహాలు, చువ్వలను పట్టుకున్న చేతులు గోచరించాయి.

"శుభం! రూక్!"

బామన్ చేయిఊపి గొంతెత్తి "తొందరగానే మీకోసం తిరిగి వస్తా. విప్లవం వర్ధిల్లుగాక!" అన్నాడు

వార్డరు ఆగాడు. ఇంకోవార్డరు పరుగెత్తుకుంటూ వారివెనకే వచ్చాడు.

"బామన్ యిలాంటివి వీల్లేదు—"

ఇంకోసారి చేయిఊపి బామన్ గేటువైపు బయలుదేరాడు. కిటికీలలోనుంచి ఖయిదీలు పాడే గీతిక అతనిని వెంటాడింది.

# 32

# స్వేచ్ఛ

పొడుగాటి సన్నహాలు. హాలులో రెండు మూడు వందలమంది జనం. బామన్, నాడ్యా గుమ్మంలో అడుగుపెట్టి మళ్ళీ తటపటాయించారు. తక్షణమే ఒక వ్యక్తి సంతోషంతో స్వాగతమిస్తూ వారిని పిలిచాడు. జరుగుతున్న ఉపన్యాసం ఆగిపోయింది.

"రూక్! బామన్ వచ్చాడు కామ్రేడ్స్!"

కొజుబా ఉరుకుటూ వెళ్ళి వారిని కావలించుకుని ముద్దిడుకున్నాడు. గరుకుగడ్డమేమో వారి చర్మానికి గట్టిగా గుచ్చుకుంది.

"నేను స్వయంగా వచ్చి విడుదలచేద్దామని ఆలోచిస్తున్నాను. కాని పబ్లిక్ ప్రాసిక్యూటరు కంగు తినడం మూలంగా నాకా అవకాశం తప్పిపోయింది."

యింకతక్కినవారూ బామన్ చుట్టూ మూగారు. సమావేశం ఆగిపోయింది. లారియోనోవ్ బామన్‌తో కరచాలనంచేసాడు. కిందటి సంవత్సరది. వీరిద్దరూ కలిసే నిరశనదీక్షపూనారు. ఇంకా స్నేహితులు రాసాగారు...

"జైలునుంచే సరాసరి వచ్చావా ? యింటికి ముందుగా వెళ్ళనే లేదా ? నువు అన్నీ సవ్యంగానే చేస్తూంటావు."

బామన్ హృదయం కదలబారింది. చుట్టూచూసి, "యిక్కడేం జరుగుతోంది ? సమావేశమా ?" అని అడిగాడు.

"యీరోజుల్లో సమావేశాలకి పదివేలమందైనా హాజరవుతున్నారు. అంతకు తక్కువమంది హాజరైతే మేము నోరు మెదపడం లేదు...సరే ! నిన్ను యెక్కడికి తీసుకువెళుతున్నదీ, నీభార్యా చెప్ప లేదూ ? యిక్కడ మాస్కోకమిటీ సభ్యులు, జిల్లాల ప్రతినిధులు సమావేశమయ్యారు !"

బామన్ నిస్సహాయంతో తల పంకించాడు. ఇదిచూసి కొజుబా ఇంకా బిగ్గరగా నవ్వాడు.

"మేము చాలాముందుకు వెళ్ళాం. జీవశాస్త్రజ్ఞుడి యింట్లో, సీమపందికొక్కులమధ్య మన సమావేశాలు జ్ఞాపకం వున్నాయా ? వుత్తరమండలశాఖలో లెక్కకి అయిదుగురమే వుండేవాళ్ళం. రష్యాలో నాలుగోవంతుకు మే మొకళ్ళమే సన్నాహకర్తలం...సరే, ఆరోజులు గతించాయి."

బామన్ మళ్ళీ చుట్టూచూసి, "యిలా బహిరంగంగానే సమావేశాలు జరుపుతున్నారా ?" అని అడిగాడు.

"రహస్యంగా సమావేశం కావలసిన అవస్థేం వచ్చింది. కామ్రేడ్ ! యీరోజుల్లో గూఢచారులూ లేరు, పోలీసులూ లేరు. ఏమే బెడదా లేదు. యిష్టంవచ్చినట్లు తిరగవచ్చు."

అధ్యక్షుడు గంటవాయించాడు.

"వినిపించలా ?" అని అడిగాడు కొజుబా సగర్వంగా.

"ప్రతీదీ నిబంధనలప్రకారం జరగాల్సిందే. మేజాబల్లదగ్గిరికి వెళ్ళు. అధ్యక్షవర్గానికి నిన్ను బలపరుస్తాం."

"కామ్రేడ్స్! సమావేశ కార్యక్రమం కొనసాగిద్దాం. యిపుడే జైలునుంచి విడుదలయివచ్చిన ఆరితేరిన బోల్షివిక్కు కామ్రేడ్ బామన్‌ను అధ్యక్షవర్గంలో చేర్చుకుంటామని ప్రతిపాదిస్తున్నాం. యిదిగో ఆయన యిక్కడే వున్నారు."

ఉద్రేకంతో, బిగ్గరగా కరతాళధ్వనులు చెలరేగాయి. బామన్‌కు చోటు ఇవ్వడంకోసం మేజాబల్ల దగ్గిరివారు దగ్గరగా జరిగారు.

"కార్యక్రమంలో తరవాత అంశం కమిటీ సభ్యులకు కార్యకలాపం విభాగించడం." అధ్యక్షుడు బామన్ కేసి తిరిగి, "నువు యేపని చేయడానికి పూనుకోదలచావు, కామ్రేడ్ బామన్!" అని అడిగాడు.

అయిదురోజులు ఉపవాసం చేసాడేమో బామన్ బలహీనమయిపోయాడు. నిస్రాణగా ఉంది. నరాలు బిగుసుకుపోయాయి. ముందు వరుసవరుసలుగా జనం కూర్చున్నారు. ఎక్కడచూసినా శ్రద్ధగా వినదలచిన అపరిచిత ముఖాలే!

"ముందుగా ఒకమాటు చుట్టూ చూడనీ. యిపుడు కొజుబా సరిగానే చెప్పాడు. వ్యవహారమంతా కొత్త పుంతలలో నడుస్తోంది. సంవత్సరన్నరనుంచి యిక్కడలేనా, అలవాటుపడాలి."

అధ్యక్షుడు మందహాసంచేస్తూ తల ఆడించాడు.

"నువు అతివినయానికి పోతున్నావు, కామ్రేడ్ బామన్! మొదటి చూపులోనే నీలాంటి వ్యక్తి అంతా అవగాహనచేసుకోగలుగుతాడు. చిటికెలో నువు మాతో కలుసుకునేటట్లు చేస్తాం."

బామన్‌కు బదులు కొజుబా జవాబిచ్చాడు.

"ఉహుం - అతను చెప్పేది విను. యిప్పుడే అతనిమీద అమితం భారం వేయవద్దు. మనల్ని కలుసుకుని దాటిపోవడానికి కావలసినంత వ్యవధి తీసుకోనీ. యీ లోపున పరిస్థితిని అవగాహన చేసుకుంటాడు. రేపు వుదయం నేను మాస్కో సమీపంలోని జవుళిజిల్లాకు బయలు దేరుతున్నాను. ప్రోషిన్‌మిల్లు సమ్మెలో చేరలేదు. జిల్లా సన్నాహక ర్త కాలమంతా మొరజోవ్ మిల్లులో వినియోగించుతూ ప్రోషిన్‌మిల్లు వెనకబడివున్నా దాని వంకే చూడకపోయినందుకు చివాట్లు పెట్టాలని నేను సూచిస్తున్నాను. కామ్రేడ్ రూక్! నాతోరా. ఆ జిల్లా అంతా నీకు సుపరిచితమైందేగా. యీరోజుల్లో ప్రజలు యెలావున్నదీ చూడ వచ్చు. దారిలో అన్నివిషయాలూ మాట్లాడుకుందాం."

"యెలా వెళతాం. రైళ్ళు నడవడం లేదుగా!"

"రైల్వేవాళ్ళు మనవాళ్ళు అవునాకాదా? మనకి యింజను యిస్తారు. దాంట్లో బయలుదేరి, మరీ తొందరగా వెళ్ళచ్చు."

# 33

## రెండు మిల్లులు

ఇనపరేకుల శిఖరంకింద గాగరాలో ఎలుగుబంటు! తెరచుకుని ఉన్న విశాలమైన గేటుమీద

జవుళిమిల్లు
సెర్జీ పోర్ఫిర్యెవిచ్ ప్రోషిన్
అనువంశిక గౌరవనీయ పౌరుడు

అని బల్లమీద వ్రాసిఉంది.

ఆవరణంతా క్రిక్కిరిసిపోయింది. అధ్యక్షవర్గంవారు మిల్లు డాబా మీద కూర్చున్నారు. ఒక వృద్ధుడు, ఇద్దరు బాలురు మిల్లు ప్రతినిధులు హాజరయారు. మాస్కో కమిటీ తరఫున కొజుబా, బామన్.

సమావేశం ప్రారంభమై రెండు గంటలయింది.

వేదికగా అమర్చిన పీపామీద స్థానిక కార్మికుడు ఒకతను నిలబడ్డాడు. పొడుగ్గా ఉన్నాడు. ఇంకా గడ్డం మొలవలేదు. కనుబొమలు తీర్చినట్టున్నాయి. పీచుజుట్టు గాలిలో ఎగురుతోంది.

"ముగించేస్తాను, కామ్రేడ్స్! యీ రోజున మనం రాజరికాన్ని ప్రతిఘటించడానికి ముందుకు వస్తున్నాం. యిప్పటివరకు మనం నాలుగురాళ్ళు సంపాదించుకోవడానికి, ఏదోవిధంగా జీవయాత్ర గడపడానికి, బరకాసు అని పెద్దపేరుపెట్టి వారు పిలిచే గొడ్లచావిడిని మానవ నివాసయోగ్యం చేయడానికి పోరాడుతూ వచ్చాం. కామ్రేడ్స్ యిక యిపుడు కార్మికవర్గానికి కావలసిన అధికారంకోసం పోరాడుదాం. సర్వాధికారాలు జారుచేతులలో వున్నంతవరకు మిల్లు యజమానులనుంచి మనకు విముక్తిలేదని గ్రహించాం కాబట్టి మనం జార్‌ను యెదిరించి పోరాడుదాం. జారు మిల్లు యజమానులకు మూలవిరాట్! వీరంతా కలసి ప్రజల రక్తం పీల్చేస్తున్నారు. ఒకసారి గనక జారును హతమార్చామా పెట్టుబడిదారుల ఆట కట్టించవచ్చు. సహజంగా యిదేం తేలికైన పనిగాదు. యిందులో మనకు కొన్ని అపజయాలుకూడా కలగవచ్చు. అలా జరిగినట్టయితే మన కార్యక్రమం ఆగిపోదు. కార్మికులు తమశక్తిని గుర్తిస్తారు. కాని మనం తక్షణం సాయుధులం కావాలి. వట్టిచేతులతో జారును యెదిరించలేం గదా!"

"నువు తప్పుడుదోవ తొక్కిస్తున్నావు" అన్నారొకరు జనంలోనుంచి.

"అలాఅయితే యేంచెయ్యాలో నువ్వేచెప్పరాదూ!" అని ఆ పొడుగాటివ్యక్తి తిరిగి అరిచాడు.

జనంలోనుంచి అరిచినవ్యక్తి ఆత్మవిశ్వాసం కోల్పోయి బెకరుతో,

"దానివల్ల ప్రజలకు మంచేమీ జరగదు" అన్నాడు.

జనం కదిలారు.

తలనెరిసిన ఒకవ్యక్తిని వెనకవరసలోనుంచి ముందుకు తోసారు. ఆవ్యక్తి నీలైన కోటు, ఎత్తుబూట్లు తొడిగి ఉన్నాడు. పొడుగాటి వ్యక్తి ఇతనివంక ఎగాదిగా చూసాడు. అతనిచూపులో అనుమానం, అవహేళనా కానవచ్చాయి.

ఆ వ్యక్తి టోపీ తీసివేసి,

"పీపామీదికి యెందుకు? నేను..."

"అట్టే గొడవచెయ్యక పీపామీదికి యెక్కు."

డాబాముందు స్థలంనిండా పీపాలే. ఆ పొడుగాటి బాలుడు నిలుచున్నపీపా పక్కపీపామీదికి ఆ ముదుసలి ఎక్కాడు. జనం కరతాళధ్వనులుచేశారు.

"యితను మనలోవాడుకాదు. యిక్కడ పనిచేయడంలేదు. మకెయేవ్ యంత్రాలయంలో పనివాడు. యితను మనకు చెప్పేదేముంది?"

కాని కొజుబాలేచి నిలబడి చేయిపైకెత్తాడు. తక్షణమే జనం నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"అదేమంత మంచిదికాదు, కామ్రేడ్స్! మన మిల్లులో పనిచేయకపోయినంత మాత్రాన పరాయివాడవుతాడా? యితను చెప్పేది మనం వినకూడదని యెక్కడుందీ? యిది సవ్యమైన పద్ధతికాదు. చెప్పేదేమిటో విందాం, ఆ తరవాత యితను మనవాడు అవునో కాదో నిర్ణయించుకుందాం."

ఆ ముదుసలి నోటికి అరచేయి అడ్డంపెట్టుకుని దగ్గాడు. అధ్యక్షుడు మద్దతు ఇవ్వడంతో అతనికి ధైర్యం వచ్చింది.

"నేను చెప్పదలచుకుందేమంటే: పదిమంది క్షేమం ఆలోచించి యీ పోరాటంలో జోక్యం పెట్టుకోకుండా వుండాలి. తుపాకి పేల్చడం కార్మికులపనా? మనపని పనిముట్లను వుపయోగించడం. అంతేకాదు, రష్యాఅంతటా తిరుగుబాటు జరుగుతోందనీ, రైతు

ఫ్యాక్టరీలు ఆగిపోయాయనీ ప్రసంగం విన్నారు. యిక మనం చేతులు కాల్చుకోవడం యెందుకు ? మన అవసరం లేకుండానే వాళ్ళు అంతా చేసుకుపోతారు. మనం సమ్మెలో చేరినా చేరకపోయినా ఒకటే. సమ్మెచేస్తే చివరికి నష్టపడేది కార్మికులమే..."

"యిక నేను చెప్పేది వినండి" అంటూ అడ్డువచ్చాడు ఆ పొడుగాటి బాలుడు ఉండబట్టలేక. "జీవించే హక్కుకోసం కార్మికులు తిరుగుబాటు చేస్తే మనలో ప్రతిమొగాడూ చేరితీరాల్సిందే. తప్పదు. యిందుకు విరుద్ధంగా యెవరయినా వాగితే వాడు శ్రామికవర్గానికి చెందినవాడు కాదన్నమాట ! మృదువుగా చెప్పాలంటే వట్టి లంజా కొడుకు !"

"బలే ! వినండి ! వినండి !" అని వందలాది గొంతులు గర్జించాయి.

తలనెరిసిన ఆవ్యక్తి నిరాశతో చేతులుఊపుతూ "నేను-నేను ప్రతికూలిడిని కాను... జాగ్రత్తగా సాగిపోవాలనే నా వుద్దేశం. మనం నిరీక్షించాలి..."

ఆ కోలాహలంలో అతనిమాటలు మాటుమణిగిపోయాయి.

"చాల్లే ! మహాచెప్పొచ్చావ్ ! పీపాలోకి తోసెయ్యండి" అని జనం కోపంతో బొబ్బలుపెట్టారు.

ఆ మకెయేవ్ కార్మికుడు భయంతో అధ్యక్షవర్గం వంక చూసాడు. కాని కొజుబా పక్కన కూర్చున్న ముదుసలి జనాభిప్రాయంతో తానూ ఏకీభవిస్తున్నట్టు తల పంకించాడు.

"వినిపించిందా ? పీపామీదనుంచి ప్రసంగించాలి. ప్రసంగం సరిగా లేకపోతే పీపాలోకి తోసేయడమే. యిదీ యిక్కడి సమావేశ నియమావళి. అదిగో దోవ" అని మందహాసంచేసి కొజుబా, బామన్ లకు వివరించి చెప్పడానికి వంగాడు. "సవ్యంగా మాట్లాడేటట్టు చేయడానికే యిదంతా. మొదట్లో వేదికమీదికి యెక్కి వూకదంపుడు వుప

న్యాసాలు యివ్వడం మొదలుపెట్టారు. యేం మాట్లాడుతున్నదీ వాళ్ళకే తెలీదు. యీ పీసావుపద్రవంతో చెత్తమాట్లాడడం బందయింది."

♦ ♦ ♦

గేటుగుండా బయటికి కొజుబా, బామన్‌లు వెళ్ళిపోయారు. అయినా సమావేశం ఇంకా సాగుతూనేఉంది. కమిటీ సాయం సమావేశానికి మాస్కో తిరిగి వస్తామని వారు మాటయిచ్చి ఉన్నారు. సెయింట్ సెర్జి విగ్రహం ముందు కొంతమంది యువకులు, చొక్కా చేతికి ఎర్రటి నూలు పట్టీ కట్టుకున్న ఒక ముదుసలి నేత పనివాడు, విగ్రహం కాలికి కట్టిఉన్న విరాళపాత్రను ఊడదీస్తున్నారు. ఆ పాత్ర లోని నాణేలు గల్లుమన్నాయి.

బామన్ ఆగాడు.

"యేమిటి చేస్తున్నారు ?"

"యీ డబ్బును స్వాధీనపర్చుకుని దీంతో ఆయుధాలు కొనాలని సమ్మె కమిటీ నిర్ణయించింది" అని నేత పనివాడు ప్రశాంతంగా సమాధాన మిచ్చాడు. "మరేం పరవాలేదు కామ్రేడ్! మే మీపని చట్టబద్ధంగానే చేస్తున్నాం జాబితా తయారుచేసి రసీదు యిస్తాం. విప్లవం తరవాత ప్రభుత్వంగనక డబ్బు తిరిగి యిచ్చేయాలని నిర్ణయిస్తే ఫాదరీ బ్యాంకులో తీసుకోవచ్చు."

"నేను చూస్తున్నాగా !" అన్నాడు ఆ యువకులలో ఒకడు నవ్వుతూ నవ్వేసరికి అతని గట్టిపళ్ళు బయటపడ్డాయి. "యీ డబ్బు మాది. మా తెలివితక్కువదద్దమ్మలు యిందులో వేసారు. వారి తెలివితక్కువతనానికి జుల్మానా వేస్తున్నాం."

కొజుబా ప్రశ్నార్థకంగా బామన్ కేసి చూసాడు.

"యిది సవ్యమైందని నాకు అనిపించడంలేదు. యిందులో డబ్బు పెద్దగా లేదుగాని కార్మికులు దొంగిలించారంటూ హంగామా మొదలుపెడతారు."

"తుమ్మినప్పుడల్లా ఆశీర్వదిస్తే మనకి వూపిరాడదు" అంటూ అభ్యంతరం లేవదీసాడు నేతపనివాడు తీవ్రంగా. "భూస్వామి కిచ్చే

పన్నునుకూడా దోపిడి అనవచ్చు. అందులోనూ వాళ్ళు పుచ్చుకుంటున్నది చిల్లరమల్లర కాదాయె''

''యే పన్ను విషయం నువ్వు మాట్లాడుతున్నావు ?''

''భూకామందులమీద పన్ను. మిల్లుచుట్టూ జమీలున్నాయి. సమ్మె నిధికి, ఆయుధాలు కొనడానికి జమీలోంచి తిరిగి డబ్బు సేకరించమని కమిటీమమ్మల్ని పంపింది. ముందుగా మేం సాల్లోగుబ్ జమీందారును కలుసుకున్నాం. అతను ముసిలివాడు. లక్షాధికారి. వెళ్ళగానే గుమ్మరిస్తాడనే నమ్మాం. ఆయుధాలు పుచ్చుకుని మేం, కార్మికులం వెళ్ళేసరికి నిజంగానే వేయిరూబుళ్ళు కక్కాడు. ఆ తరవాత మాపని తేలికైపోయింది. సాల్లుగుబ్ వేయియిచ్చాడని చెబితే చాలు. 'వేయా ?' సరే అని ప్రతిఒకడూ అంతసొమ్మూ యిచ్చారు. కాని అఫాక్సినో జమీందారిణి రెండు వేలు యిచ్చింది. 'సాల్లోగుబ్ వేయి యిచ్చాడు, అయితే నేను రెండువేలుయిస్తా' అంది. ఆ ముసిలి వెధవని మించిపోవాలని ఆమె తాపత్రియం ! అంతే !''

''డబ్బిచ్చి తప్పించుకున్నా మనుకున్నారు'' అన్నాడు ఆ గట్టి పళ్ళ యువకుడు కనుసైగ చేస్తూ. ''కాస్త ఆగితే, మాకు కాస్త వ్యవధి యిస్తే...''

ముసలి నేతపనివాడు తిరిగీ ప్రారంభించాడు :

''యీడబ్బులు తీసుకుంటున్నామంటే లేకకాదు. ప్రతిదీ క్రమబద్ధంగా జరగాలి. మనకి కావలసినంతడబ్బుంది. నెలరోజులు సమ్మె చేయవలసివస్తే, ఎలాచేస్తాం. అవసరమయితే రెండునెలలు మీకు, మాస్కోకి ఒకదళం పంపించామంటే ఆయుధాలకు సరిపోయే డబ్బుంది. కాని యిక్కడ పోరాటం జరుగుతుందనుకోను. యిక్కడ మాతో తలపడే దెవరు ? ఒకపోలీసు వుండేవాడు. వాడూ యెప్పుడో పిక్కబలం చూపాడు. కాని మాస్కోవిషయం వేరు. అక్కడ చేయవలసింది చాలావుంది.''

నిప్పురవ్వలు విరజిమ్ముతూ రైలుఇంజను గుప్పు గుప్పుమని సాగిపోతోంది. బామన్, కొజుబా పట్టాలదగ్గరే మెట్లమీద నిలబడ్డారు. చలిగాలి కోట్లగుండా వెళ్ళి గుచ్చుకుంది. వారి శరీరాలు బిగుసుకుపోయాయి. కాళ్ళకింద రెండు దీపాలు చీకటిని తొలిచివేస్తున్నాయి.

"నీకు జలుబుచేయదుకదా, రూక్ ?"

బామన్ వెంటనే జవాబీయలేదు. ఆరోజు అంతా ఆకళింపు చేసుకున్నదగ్గరనుంచీ ఆలోచనలతో మనసు నిండిపోయింది. చలిగాలికి కొజుబా వణికిపోతూ :

"ఆబాలుడు గుర్తుపట్టలేనంతగా మారిపోయాడుకదూ? 1902లో నీవు యిక్కడ సమ్మెనడిపావు గ్యాపకంవుందా ? అప్పుడు జనం యెంతగా అణగగొట్టబడ్డారో గ్యాపకంవుందా ? ప్రోషిన్ వేలుకదిపితే చాలు...వారిని యిపుడుచూడు. సరయినమార్గాన పడ్డారు. అంతే కాకుండా అంతా స్వయంగా సేకరించుకున్నారు. నిర్మొగమాటంగా చెప్పాలంటే, మిల్లువిషయం వుపేక్ష జరిగింది. జవుళిపరిశ్రమ వెనకంజ వేస్తోంది, నీకుతెలుసుగా ?" ఇలాఅని ఏదో జ్ఞాపకంవచ్చి చిరునవ్వు నవ్వాడు. "ఆ పీపావ్యవహారం వుందే అదేమంత చెడ్డవ్యవహారం కాదు. యెక్కడపడితే అక్కడ వుపయోగిస్తుంది. గొడవవుండదు. ఆరోజుల్లో ఒకరినొకరు సమావేశాలలో యెలా తిట్టిపోసుకుంటారో చూసావుగా! కార్మికులు ముందడుగు వేయకుండా మెన్షివిక్కులు వెనక్కు లాగుతున్నారు. తిరుగుబాటు పేరు యెత్తేసరికి మెన్షివిక్కులు వణికిపోతారు. నువు జైలునుంచి విడుదలవడం మంచిదే అయింది. మెన్షివిక్కులతో యెలా వ్యవహరించాలో నువు చిన్నప్పుడే నేర్చుకున్నావుగా."

బామన్ గంభీరంగా సమాధానమిచ్చాడు.

"నేను మెన్షివిక్కులతో వ్యవహరించగలను. కాని నాకు ఓవిచిత్రమైన అనుభూతి కలుగుతోంది, కొజుబా! పీటర్, పాల్ కోటలో యిరవయి రెండు నెలలు యేకాంత నిర్బంధం అనుభవించాను. బయటికి వచ్చేసరికి జ్ఞానం పెరిగిందనే భావం కలిగింది. ప్రవాసం అనుభ

వించాకా, లుక్యానోవ్కా జైలులో శిక్ష అనుభవించిన తరవాతా అలాగే అనిపించింది. నేను బయటికి వచ్చినపుడల్లా యింకా యెక్కువ తెలుసుకున్నాననే పరిజ్ఞానం కలిగేది. కాని యిపుడు మీరంతా పురోభివృద్ధిగాంచారనీ, జ్ఞానవంతులయారనీ భావిస్తున్నాను. యిక నేనో పెరగడానికి బదులు విరిగిపోయాను."

కొజుబాకూడా గంభీరంగా అన్నాడు:

"1905 వ సంవత్సరం చాలా ప్రాముఖ్యమయింది. ఒక్క సంవత్సరంలో ప్రజలు గుర్తుపట్టలేనంతగా మారిపోయారు. అన్నిటికంటె ముఖ్యమయిందేమంటే, ప్రజలు తమ శక్తిని గుర్తించారు. నువింకా పెరగలేదంటూ మాట్లాడావేం? అదంతా నిరశనవ్రత మహాత్యం. నువు పదియేళ్ళనించీ విప్లవంకోసం పాటుపడుతున్నావు. నీ దగ్గరనించి మేము నేర్చుకోవలసిందెంతోవుంది. రష్యాలో పెనుతుపాను చెలరేగబోతోంది. యింకోరోజో, వారమో గడిస్తే మనల్ని తుపాకులతో కాల్చేస్తారు లేదా యెదోవక మాయపన్నుతారు."

## 34

## వీధులలో

"ప్రణాళిక."

"శాసనసభా, వ్యక్తిస్వాతంత్ర్యాలు..."

♦ ♦ ♦

వార్తాపత్రికల కుర్రవాడి చేతిలోంచి తడి ఆరని పత్రికను బామన్ గుంజేసుకున్నాడు!

---

17 అక్టోబరు 1907 వ పౌరసత్వ హక్కులు ప్రసాదిస్తున్నానంటూ జారు జారీచేసిన మోసపు ప్రణాళిక, తన సేనలను సమీకరించుకుని విప్లవాన్ని దెబ్బదీయడానికి జారు పన్నిన పన్నుగడ ఇది.

"భగవంతుని దయవల్ల సర్వంసహా చక్రవర్తులమైన మేము, రెండవ నికొలాయ్...

"...మా విశ్వాసపాత్రులైన పౌరులకు ప్రసాదించు..."

"ప్రసాదించు! వాడి దుంప తెగ!"

బామన్ అప్రయత్నంగా మందహాసం చేసాడు. కాని వెను వెంటనే ఆ మందహాసం మాయమయింది. అతని చెవులలో హర్ష ధ్వనులు వచ్చిపడ్డాయి.

"నిజంగానే నమ్ముతున్నారా? సరే అనుకున్నట్టే పన్నాగం పన్నాడు!"

వీధి దిగువనుంచి జనం గుంపుగా అతనివేపుకే వస్తున్నారు. గుంపుకు ముందు సుష్టుగా తిని పెరిగిన కొంతమంది వ్యక్తులు మంచి మంచి దుస్తులు ధరించి హాట్లు ఊగించుకుంటూ నడిచి వస్తున్నారు. వారు మహోత్సాహంతో కేకలు వేస్తున్నారుగాని హర్ష ధ్వనులలో వారి కేకలు మునిగిపోయాయి. వారివెనుక వస్తున్న గుంపులో కార్మికులు కూడా ఉన్నారు. వారినిచూసి బామన్ మొహం ముడుచుకున్నాడు.

♦ ♦ ♦

కమిటీ సమావేశం మధ్యాహ్నం జరుగుతుంది. అప్పుడు తొమ్మిదే అయింది. కాని ప్రణాళిక దృష్టితో... బహుశా ఈపాటికి సమావేశ మయ్యేఉంటారు. ప్రణాళిక ఇవాళ ప్రకటింపబడిందంటే ఈ సంగతి కమిటీకి కిందటి రాత్రే తెలిసిఉండాలి. బామన్ మళ్ళీ జిల్లాలోకి వెళ్ళి రాత్రి పొద్దుపోయి తిరిగివచ్చాడు. నాడ్యాకూడా ఏదోపనిమీద సాయం కాలమంతా బయట తిరుగుతూనేఉంది.

నెమెట్స్కాయా వీధిలోని సాంకేతిక విద్యాలయంలో కమిటీ సమావేశాలు జరుపుతోంది. చాలాదూరం. బామన్ తొందర తొందరగా నడవసాగాడు.

వీథులలోకి జనం ఇంకా వచ్చిపడుతున్నారు. తొందరగా కట్టిన త్రివర్ణ జాతీయపతాకాలు కొన్ని ఇండ్లమీద రెపరెపలాడుతున్నాయి.

వీధిమూలలలో ఉపన్యాసకులు అరుగులమీద, దీపస్తంభాలకు ఆనుకుని బిగ్గరగా ప్రసంగిస్తున్నారు. ఎక్కడ విన్నా "స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం!" అనే ముక్కలే బామన్‌కు వినిపించాయి.

కేకలు వేస్తున్న జనంలో కార్మికులు క్రమక్రమంగా ఎక్కువ మంది వచ్చి చేరుకున్నారు. బామన్ మళ్ళీ తీవ్రంగా మొహం ముడుచుకున్నాడు.

కార్మికులు శ్రద్ధగా వింటూ హర్షధ్వనులు చేస్తున్నారు. సమ్మెను వమ్ముచేయడంలో జారు నిజంగా విజయం చేపడతాడా?

జైలునుంచి విడుదలయిన తరువాత గడచిన ఏడు రోజులలో తాను హాజరయిన సమావేశాలను స్మృతికి తెచ్చుకున్నాడు. మహోత్సాహంతో చేసిన ప్రసంగాలు, వోటు తీసుకునేటపుడు వేలకొలదిజనం చేతులు ఎత్తడం జ్ఞాపకం వచ్చాయి.

విజయం లభించేవరకు

విప్లవం వర్ధిల్లుగాక!

వెనుకంజ వేస్తారని అతను నమ్మలేకపోయాడు!

♦ ♦ ♦

వడిగా, ఇంకా వడిగా నడవసాగాడు.

మితవాదులను అనుకరిస్తూ మెన్షివిక్కులుకూడా విజయం లభించిందని నీచంగా ప్రచారంచేస్తూ తిరోగమనానికి ప్రోత్సాహ మివ్వడం లేదుగదా!

'సభా స్వాతంత్ర్యం!' ఇంకా పార్టీ అంటూ ఎందుకు? 'పత్రికా స్వాతంత్ర్యం!' ఇంకా రహస్యంగా అచ్చు ఆఫీసు నడవడ మెందుకు? ప్రభుత్వ డూమాయే ఇక వారి ఆశాదేవత!

♦ ♦ ♦

కార్మికజనాన్ని తప్పుదోవ పట్టించరనీ, విజయం లభించిందంటూ పైకి గప్పాలుకొట్టి జోకొట్టరనీ నమ్మకమేమిటి? విజయం!– తెల్లకాగితం

మీద నల్లటి అక్షరాలలో ముద్రింపబడింది! మూలమూలలా విజయం లభించిందని పెడబొబ్బలు!

కాని కార్మికులేగనక ఇదంతానమ్మితే రాచరికం దెబ్బ తప్పించు కుంటుంది.

అలా జరగడానికి వీలులేదు!

చెప్పదలచుకున్న మాటలు నోటిలోనే కుక్కుకుని బామన్ ఒక వీధిమలుపు తిరిగాడు. ఆ మాటలు కమిటీముందు చెప్పాలి. ఆ తర వాతనే వాటిని చౌకులలోకి, ప్రజలలోకి, మిల్లులలోకి, ఫ్యాక్టరీలలోకి, దుకాణాలలోకి, బానిసగా ఫ్యాక్టరీయంత్రాలు ఆడడం ప్రారంభం కాకముందే, తీసుకుపోవాలి. వీధిమలుపు తిరిగి ఆగాడు. కంటికి గోచ రించినంతవరకు సాంకేతిక విద్యాలయంనుంచి వీధివెంబడే జనం శ్రేణు లుగా ఏర్పడ్డారు. కార్మికుల నల్లటోపీలమధ్య, శీతాకాలపు మడత హాటులమధ్య విద్యార్థుల ఊదాటోపీపట్టీలు కానవచ్చాయి.

వెనువెంటనే దూదిపింజలా అతనిలో నిరాశ మాయమయి పోయింది.

## 35
## మిత్రులు

ద్వారం మెట్లదగ్గర జనం కిక్కిరిసిపోయారు. మెట్లుఎక్కడం అసాధ్య మయిపోతోంది. కాని బామన్‌ను వెనువెంటనే గుర్తించారు.

"కామ్రేడ్స్! మాస్కోకమిటీ సభ్యునికి దారి విడవండి."

దారి విడవడానికి జనం దగ్గరగాజరిగారు. పైకి హాలులోకి వెళ్ళు తూంటే బామన్‌ను స్నేహపూర్వక దృష్టితో చూశారు. ఏమాత్రం ఆలస్యంచకుండా మాట్లాడితీరాలి. మనసులో ఉన్నదంతా, ద్రోవల్లో

కలిగిన భావాలన్నిటినీ వెళ్ళగక్కాలి. ఇనుమడించిన కొంగ్రొత్త శక్తితో 'సమ్మె వర్ధిల్లుగాక!' అని కేకలు వేయాలి.

♦ ♦ ♦

కాని అడుగు పెట్టేసరికి హర్షధ్వానులతో హాలు ఊగిపోయింది. మెట్లమీద, వీధులలో ఉన్న వేలాదిజనులు ఆ హర్షధ్వానులను అందుకుని, 'సమ్మె వర్ధిల్లుగాక!' అని అరిచారు.

మేజాబల్లమీద కొజుబా నిలబడి ఉన్నాడు. దగ్గర దగ్గరగా కూర్చున్న ప్రతినిధులకు ఎంతో ఎత్తున అతని భుజాలు గోపురాలులా ఉన్నాయి.

"రాచరికం తిరోగమించింది, కామ్రేడ్స్! శ్రామికవర్గపు సార్వజనీనసమ్మె గుప్పిటలోనుంచి తప్పించుకోవడానికి యీ కాగితపుముక్కను వుపయోగించుకోవాలని చూస్తున్నారు" జారు ప్రణాళికను ఆడించి నలిపివేసి విసిరిపారవేశాడు. "ఈ వలలో పడే చేపలు వుంటే వుండవచ్చు. ఆర్చిబిషప్పు దివాణం దగ్గిరనించి, మెన్నివిక్కుల వెనకదొడ్డులదాకా ఫాదరీలు యీ వార్తను మహాసంతోషంతో ప్రకటిస్తున్నారు!"

"అవునవును!"

"కాని విప్లవకార్మికులు, సోషల్ డెమాక్రాట్లు, మోసపోరు స్వాతంత్ర్యమార్గంలో పోరాడాం. బంగారు పూతపూసిన బోనులోకైనా మళ్ళీ అడుగిడం!"

♦ ♦ ♦

బయట బుజం బుజం ఆనించి బారులు బారుగా నిలబడ్డ జనం సముద్రపుటొడ్డున విరిగిపడే అలలలాగా హోరుమని ప్రతిధ్వనించేటట్టు హర్షధ్వానాలు చేశారు. కొజుబా నిలబడ్డ బల్లమీద బంగారపు అక్షరాలలో.

<u>ప్రపంచకార్మికులారా ఏకంకండి!</u>

అనే పోరాటనినాదం వ్రాసి ఉంది.

అక్కడిజనం కళ్ళల్లో గంభీరభావం ప్రవేశించడం, వారి కనుబొమలు సంకోచించుకోవడం బామన్ చూశాడు. ఇనుమడించిన శక్తితో ఖంగుమని,

"సాయుధులుకండి!"

"సమ్మె వర్ధిల్లుగాక! తిరుగుబాటు వర్ధిల్లుగాక!"

"వీథులలోకి పదండి!"

అనే నినాదాలు మార్మోగాయి.

జనశ్రేణులు కదిలాయి. బామన్ చేయిఎత్తి "జైళ్ళకి పదండి! రాజకీయ ఖైదీలను విడుదలచేయండి!" అని కేకపెట్టాడు.

కొజుబా అతని గొంతు గుర్తించాడు.

"కామ్రేడ్స్! రాజరికం బతికివున్నంతవరకు మనకు స్వాతంత్ర్యం వుండదు. మన గుప్పిటలో యిపుడు చిక్కింది. పట్టు సడలించామా తప్పించుకుని చిరకాలం వర్ధిల్లుతుంది. గుప్పిట యింకా బిగించాలి. కామ్రేడ్ బామన్ చెప్పినట్టు ముందుచేదాం. జారు ప్రభుత్వ జైళ్ళ తాళాలు పగలగొట్టేదాం. బామన్! శ్రేణికి దారితీయి! ఆ గౌరవం పొందడానికి నీవే అర్హుడవు."

మేజామీదనుంచి కొజుబా కిందికిదూకాడు. బామన్‌ను కలుసుకోవడానికి వెళుతుంటే అతనివెనక జెండా పుచ్చుకుని ఒకతను బయలుదేరాడు.

వారు వెళుతూంటే వీధిలో విప్లవాత్మకమైన, ప్రబోధాత్మకమైన వీరగీతం మారుమోగింది. బామన్‌కి కొద్దిగా వెనకగా ఒక బక్కపల్చని యువకుడు జెండాతాడు, కుచ్చు పట్టుకుని నడుస్తూ కంపిత స్వరంతో పాటపాడుతున్నాడు. ఆ పాటలోని మాటలు అపరిచితమైనవి.

"ఏమిటి పాడుతున్నావు?" అని అతని వంక తిరిగి బామన్ అడిగాడు.

ఒక సెకండుపాటు పాలిపోయిన పెదవులమాటున తెల్లటిపళ్ళు తళుక్కుమన్నాయి.

"ఏదో నా స్వంతం!"

# 36

## పతాకచ్ఛాయలో

జనశ్రేణి వొజ్నెసెన్స్కాయా వీధిలోకి చేరుకునేసరికి కొజుబా బామన్‌ను కలుసుకున్నాడు. అంతూ పొంతూ లేని శ్రేణివంక, రెపరెప లాడే పతాకాలవంక చూసే, సేనానిలాగా కొజుబా వెనుదిరిగి చూసాడు. ఆప్యాయంగా బామన్ బుజంమీద చేయివేసాడు.

"నువు జీవితంపొడుగునా హుషారుగా వుండడం సవ్యంగానే వుంది, రూక్! వసంతదూతా! వసంతకాలం వేసవిగా మారుతోంది, విత్తనాలు నాటాం. అవిగో మొక్కలు! అవిగో జెండాలు! యెగురుతున్నాయి, చూడు! ఇదంతా నీ చలవే! శత్రుకోటి ఇక ఆపలేదు!"

♦ ♦ ♦

కుడిచేతివైపున చిన్న మలుపుఉంది. ఒక ఫ్యాక్టరీగేటులో కొంత మంది కార్మికులు నిలబడి ఉన్నారు.

బామన్ భవనాన్ని పరీక్షగా చూస్తూ నడకవేగం తగ్గించాడు:

"అదేంఫ్యాక్టరీ?"

"యిక్కడ రెండుఫ్యాక్టరీ లున్నాయి" అని జవాబు చెప్పాడు కొజుబా. "ఒకటి డుఫర్‌మెంటల్‌ది. రెండోది షహోవ్‌ది"

దూరాన నిలబడివున్న కార్మికులకు బామన్ చేతితో సైగచేస్తూ "రాండి, వచ్చి మాతో కలవండి" అని అరిచాడు.

కాని ఒకరూ కదలలేదు. బామన్ మొహం ఘుడుచుకుని పక్క బాటమీదికి ఎక్కాడు.

"నేను వెళ్ళి వాళ్ళని తీసుకువస్తాను"

"ఊహుం - వద్దు" అంటూ కొజుబా ఆపడానికి ముందుకు వచ్చాడు "అయినా యెక్కువమంది లేరు. మరేం పరవాలేదు. సాగి పోదాం పద."

కాని బామన్ మొండిపట్టుదలతో తలపంకించాడు.

"యెలాగో పిలచాను. అంతటితో వదిలిపెట్టను."

"నువు నడుస్తూవుండు. నిమిషంలో వచ్చి కలుసుకుంటాను... ఆ జట్కామీద వచ్చేస్తాను." మూలఉన్న జట్కావేపు తల ఆడిం చాడు. "కలుసుకోలేమా, తాతా!"

ఆ జట్కామనిషి ముసలివాడు, కళ్ళాలు పట్టుకుని గుర్రాలను అదిలించాడు. బామన్ మెట్టు చెక్కమీద నిలబడ్డాడు.

"జెండా, కామ్రేడ్ బామన్, జెండాతీసుకో!"

నున్నగా ముఖక్షవరం చేయించుకున్న ఒక పొడుగాటి వ్యక్తి- జుట్టు పసందుగా పెరిగింది. మెత్తటి హాటుపెట్టుకున్నాడు, ఒకజెండా అందించాడు. బామన్ జెండాకర్ర పట్టుకున్నాడు. జట్కామనిషి కళ్ళాలు గుంజాడు. గుర్రం వేగం హెచ్చించుకుంటూ ముందుకు సాగిపోయింది.

భయంతో ఒక స్త్రీ కొజుబాను పిలిచి,

"కొజుబా! ఆయన యెక్కడికి వెళుతున్నాడు?" అని అడిగింది.

నాద్యా, ఇరీనా పక్కనే నడుస్తూ మలుపుకు తిన్నగా వచ్చింది. కాని బామన్ అప్పటికే బాగా వీధి దిగువకు వెళ్ళిపోయాడు. చలి గాలిలో కెంపువర్ణపు జెండా రెపరెపలాడుతోంది.

కొజుబా మందహాసంచేస్తూ.

"మాస్కో అంతటినీ మన జెండా కిందకు తీసుకురావాలని నిశ్చయించుకున్నాడు. వీధి చివరవున్న ఆ కార్మికులకోసం వెళ్ళాడు" అని జవాబిచ్చాడు.

ఫ్యాక్టరీ దగ్గర గుంపుగాకూడిన జనంకేసి తల ఆడించాడు. మందహాసం మటుమాయమైంది.

ఒక పొట్టిమనిషి నేలమీద గరగరలాడిస్తూ ఏదో బరువైన పొడుగుపాటి వస్తువును లాగుకుని వెళుతున్నాడు. గేటు దగ్గర జనంలో నుంచి బయటికి వచ్చి జట్కా వైపుకుసాగాడు. అతని చేతిలోది కర్ర ముక్కా లేకపోతే గొట్టమా? బామన్ రోడ్ల కూడలిలో నిలబడి ఒకే శ్రేణిలో వరుసమీద వరుసగా నడుస్తున్న కార్మికుల వంక చూస్తున్నాడు.

ఆ పొట్టిమనిషి గబగబా నడకసాగించాడు. నేలమీద ఇనుము చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. కొజుబా కంపించిపోయాడు. గొంతెత్తి బిగ్గరగా,

"రూక్! జాగ్రత! అడిగో మిఖల్‌చక్!" అన్నాడు.

బామన్‌కు కొజుబా మాటలు వినిపించాయి. రెపరెపలాడే జెండాను మొహానికి దూరంగా పట్టుకుని వెనుతిరిగిచూసాడు. కాని ఆ మనిషి జట్కాకు సూటిగా వచ్చేసాడు. రెండు చేతులతోను గొట్టం గట్టిగా పట్టుకొని బామన్ తలమీద ఈడ్చికొట్టాడు. జట్కామనిషి కెవ్వుమని కేకవేసి కిందికిదూకి పక్కబాటమీద చేతులతో మొహం కప్పుకుని కూర్చున్నాడు. బామన్ చేతిలోని జండా అటూ ఇటూ ఊగి కిందపడిపోయింది.

కొజుబా తుపాకీ కాల్చుకుంటూ ముందుకు పరుగెత్తాడు, వెనుకపాట హఠాత్తుగా ఆగిపోయింది. ఒక స్త్రీ నిరాశతో ఏడుస్తూ, "యిటూ, సాయపడండి, కామ్రేడ్!" అని అరిచింది.

గేటుచుట్టూ కూడినజనం చెల్లాచెదరయినారు. తుపాకి గుళ్ళ బారినుండి తప్పించుకోవడానికి వంకర టింకరగా ఆ పొట్టిమనిషి పరుగె

త్తాడు. ఆ మనిషి ఎవరో కాదు, మిఖల్ చక్ ! క్షవరం చేయించుకో లేదు జుట్టు దువ్వుకో లేదు అలవాటుగా !

♦ ♦ ♦

కొజుబా బామన్ కాయంమీదికి వంగాడు. కళ్ళు మూసుకుని పోయి ఉన్నాయి. ఎడమ కనుబొమమీదపడ్డ గాయంనుంచి నెత్తురు కొద్దిగా కారింది. వక్షస్థలం నిలకడగా వుంది. ఊపిరి ఆడడంలేదు.

వీధంతా జనంతో నిండిపోయింది. కొజుబా జెండా తీసు కున్నాడు. బంగారుతో పెద్దగా వ్రాసిన నినాదపు అక్షరాలు వందల కొలది కార్మికుల కళ్ళముందు తళుక్కుమన్నాయి. ఆ నినాదంముందు మృత్యువు యొక్క శక్తి విశేషమైందని తోచింది.

ఈ దారుణ హత్యాకాండకు ప్రతీకారంగా మాస్కో కార్మికులు సర్వవ్యాపిత సమ్మెకు పిలుపు ఇచ్చారు. బ్రహ్మాండంగా సభలు, ప్రద ర్శనాలు జరిపారు. సైనికదళాలను సాయుధులను చేయడానికి ధనం సేకరించాడు.

"రాచరికం నశించుగాక !" అనే బోల్షివిక్కుల రణనినాదం మాస్కో నగరమంతటా ప్రతిధ్వనించింది.

"పగతీర్చుకోవాలి, కామ్రేడ్స్ ! రష్యన్ భూభాగంనుంచి చెత్తా చెదారాన్ని, చీడపురుగుల్ని యేరిపారేసి అవమానంనుంచి విముక్తివర్చాల్సిన సమయం వచ్చింది. ఆయుధాలు తీసుకుని గట్టి దెబ్బ తీయాల్సిన సమయం ఆసన్నమయింది!"

"సాయుధతిరుగుబాటుకు సన్నద్ధంగండి !

మాస్కోనలుమూలలనుంచీ రెండురోజులపాటు ఉద్రేకంతో విద్యార్థులు, ఉపాధ్యాయిలు, డాక్టర్లు తండోపతండాలుగా సాంకేతిక విద్యాలయానికి వెళ్ళారు. బామన్ శవపేటికను ఉంచిన హాలులోకి వేలకువేలు వెళ్ళి చూసారు. ఆ విప్లవకారునికి నమస్కరించారు. చేరు వలో వేసిన మేజామీద ఫిర్యాళ్ళ దొంతరులు పెద్ద కుప్పగా తయా రయ్యాయి.

మూడో రోజున అనగా అక్టోబరు 20వ రష్యన్ సోషల్ డెమాక్రాటిక్ లేబరుపార్టీ మాస్కో కమిటీ ఆధ్వర్యాన ఖననసంస్కారం జరిగింది.

మాస్కో నగర ప్రతిష్టాపన తరవాత ఇంతబ్రహ్మాండమైన ఊరేగింపు ఎన్నడూ జరగలేదు. మాస్కో కార్మికవర్గాన్నంతటినీ బోల్షివిక్ జెండా కిందికి తెచ్చింది నిజానికి బామనే! ఆ రోజున నగరవాసులంతా వీధుల్లోనేవున్నారు, ఎర్రటి శవశకటం వెనకనడచిన శ్రేణులలో అన్ని ఫ్యాక్టరీల ప్రతినిధులు, కర్మాగార ప్రతినిధులు వున్నారు.

వగన్కోవస్కాయే గోరీల దొడ్డికి చేరుకోవాలంటే లెఫోర్టోవ్ నుంచి పొక్రొవస్కాయా, యెలొకొవస్కాయా, నోవో - బసమన్నాయా వీధులగుండా వెళ్ళి, క్రస్నియెవొరోటా దాటి, మియస్నిట్స్కాయా వీధి దిగువనుంచి, నగరం మధ్యగా, మాస్కో విశ్వవిద్యాలయం మీదుగా బోల్షాయా నికిట్స్కాయా వీధివెంట వెళ్ళాలి.

శ్రేణికిముందు సాయుధులైన కార్మికదళం, ఆర్. యస్. డి. యల్. పి. మాస్కో కమిటీ ఉన్నారు. వారివెనుక అంతూ పొంతూ లేకుండా జనం, జెండాలు, పూలమాలలు! ఊరేగింపు మాస్కో విశ్వవిద్యాలయాన్ని చేరుకుంటూండగా క్రాస్నియే వొరోటా దగ్గర ప్రదర్శకులు వచ్చిచేరారు.

జారుప్రభుత్వంవారు ఊరేగింపువెళ్ళే దోవలోనుంచి సైనికులను, పోలీసులను తీసివేసారు. మొహం చూపడానికే 'బ్లాక్ హండ్రెడ్సుకు'* ధైర్యం లేకపోయింది. పక్కబాటలమీద కూడిన జనం వారిలోవారు. 'యెంతమందో చూడు! వూరేగింపు ఆరుగంటలసేపటినించీ నడుస్తోందిగాని అంతూ పొంతూ కనిపించడంలేదు. యింతమంది కార్మికు లున్నారని నేను కలలోకూడా అనుకోలేదు!'' అని గుసగుసలు పోయారు.

---

* విప్లవాన్ని నాశనంచేసేందుకుగాను పోలీసుల అధీనంలోఉండే రౌడీసంఘాలను జారుప్రభుత్వం నెలకొల్పింది. వీరినే ప్రజలు 'బ్లాక్ హండ్రెడ్సు' అని పిలిచేవారు.

"అదే మనకివున్న బలం!"

ట్రీట్రాల్నాయా చౌకులో వివిధసంస్థల తరఫున పూలమాలలు తీసుకుని ప్రతినిధివర్గాలు వచ్చి కలిసాయి. వారిలో ఇతరపట్టణాల కార్మిక ప్రతినిధివర్గాలుకూడా ఉన్నాయి.

హఠాత్తుగా హర్షధ్వానాలమధ్య 'సాపర్' దళంవచ్చి అగ్ర శ్రేణిలో చేరింది.

జనంవచ్చి చేరుతున్నకొద్దీ విషాదగీతాలకు బదులు విప్లవ గీతాలు చెలరేగాయి. సన్నద్ధమయిన శ్రామికవర్గశక్తి అజేయమనే భావం బలీయం కాజొచ్చినది.

ఆ విషాదదినాన ఎర్రజెండాలకింద పరిక్రమిస్తూ మాస్కో శ్రామికవర్గం తన అజేయశక్తిని ప్రదర్శించింది.

♦ ♦ ♦

గోరీల దొడ్డిలో కొండరావిచెట్లకింద పొగలుగక్కే కాగడాల కాంతిలో ఆఖరిసారి బామన్ మొహంలోని ప్రశాంతమయిన దృఢ మయిన రేఖలు కనిపించాయి.

"అతనుచేసినసేవ మహోత్తమమయింది. కాని దాని విషయం మాట్లాడవలసిన అవసరం లేదు. యీ మహావీరుని స్మృతిని మన హృదయాలలో పదిలపర్చుకుందాం ... బామన్‌లాగానే మనమూ ప్రజాక్షేమంకోసం ధైర్యంతో, నిర్భీతితో, భక్తితో పోరాడుదాం!"

పూలమాలలమీద, రిబ్బన్లమీద, దించిన జెండాలమీద, ప్రజల మొహాలమీద కాగడాలు రక్తవర్ణపుకాంతిని ప్రసరించాయి. రావిచెట్లకింద నిశ్శబ్దం! మాస్కో అంతటా నిశ్శబ్దం!

యుద్ధానికి ముందులాగా నగరమంతటా నిశ్శబ్దం!

రష్యాలో విప్లవతరంగం ఉవ్వెత్తున లేచింది!

[ సమాప్తం ]

F10053